రాధాస్వామీ దయాల్ కీ దయా
రాధాస్వామీ సహాయ్.

# స్మృతిచిహ్నము

("సోవేనీర్" ఆంగ్ల గ్రంథమునకు తెనుగు అనువాదము)

## రాధాస్వామీ సత్సంగ
## ప్రథమ శతాబ్ది
## స్మారకము
## (1861-1961)

**1961** జనవరి, **21**వ తేదీ వసంతపంచమినాఁడు
పూర్తియైన నూఱేండ్లలో
రాధాస్వామీ సత్సంగము
యొక్క
అభివృద్ధిని గుఱించిన సంక్షిప్త వివరణము



రాధాస్వామీ సత్సంగసభ,
దయాల్బాగ్, ఆగ్రా వారిచే ప్రకటింపబడినది.

రాధాస్వామీ శకము 147
క్రీస్తు శకము 1964

R. S.

# విషయసూచిక

R. S.

# FOREWORD

Last year, the Radhasoami Satsang Sabha arranged to have Telugu translation of the Radhasoami Mat Prakash, the English book of Huzur Maharaj, published. Subsequently, Ratnāvali was also published with its text both in Hindi and Telugu and with meanings of the verses in Telugu. Some notes explained difficult expressions. These two books were purchased in no time by Satsangi brothers and sisters and the stocks were exhausted within weeks It became apparent that Satsangi brothers and sisters of the Andhra Pradesh had been feeling very keenly the need for such translations into Telugu

Since the publication of the Souvenir in 1961, the brothers and sisters in Andhra Pradesh had been expressing a keen desire for Telugu translation of the Souvenir as well When therefore the two books referred to above appeared in Telugu, the Andhra brothers became anxious to have the Souvenir also in Telugu It is needless to say that every Satsangi earnestly desires to know about the life of the Most Exalted and Revered Founder of the Radhasoami Faith and likes to know of the progress of the Satsang movement in the first hundred years of its existence The austere simplicity of the lives of our Exalted Satgurus, and the incidents of their lives, and the way the Satsang movemen has progressed, and the unique manner in which the various Satsang institutions came into being very naturally and spontaneously, without much apparent human effort or strain. in natural and inevitable fulfilment of the significant utterances of the earlier Satgurus, and inspite of extremely adverse circumstances in many cases, furnish not only an interesting story but also provide inspiration and enlightenment to Satsangi brothers and sisters

The Radhasoami Satsang Sabha, recognising the keen desire of the Andhra brothers and sisters, has therefore arranged for the translation of the Souvenir into Telugu for the benefit

of Telugu-knowing brothers. P. B. V. Satyanarayanaji B. A., B. L , Retd. Chairman, Andhra Pradesh Sales Tax Appellate Tribunal and P. B. D Subbaraoji, Managing Director, South India Satsang Stores (P) Ltd , Kakinada were entrusted with the work of translation They have taken every care to keep the translation faithful to the original and the style simple and easy to follow for an average reader of the Andhra Pradesh. But, inspite of this, if there are any mistakes in translation, it is hoped the Readers would not mind the same.

It is also hoped that the publication of this translation of the Souvenir would be received with enthusiasm and eagerness by Andhra brothers and sisters

GURSARAN DAS MEHTA,
PRESIDENT
RADHASOAMI SATSANG SABHA,

Dayalbagh (Agra),
24-11-1964.

R. S.

# తొలి పలుకు

గతసంవత్సరములో, రాధాస్వామీ సత్సంగసభవారు హుజూర్ మహారాజువారిచే విరచితమైన రాధాస్వామీ మతప్రకాశ్ అను నాంగ్లగ్రంథముకు ఆంధ్రానువాదమును బ్రచురించిరి. అటుపిమ్మట, రత్నావళినిగూడ, దాని మూలమును హిందీ తెనుఁగు లిపులు రెండిఁటిలోను వ్రాయించి యందలి శబ్దములకు తెనుఁగున భావములు వ్రాయించి, ప్రచురించిరి. అందలి కఠినపదములకు గొన్నిఁటికి అర్థములుగూడ నందు వ్రాయబడినవి. సత్సంగి సోదరీ సోదరులీ రెండుపొత్తముల నతిశీఘ్రకాలములోనే కొనివేసినందున నా రెండుగ్రంథముల ప్రతులన్నియు కొద్దివారములలోపుననే నిశ్శేషముగ నమ్మకమైపోయెను. అందుచే ఆంధ్రప్రదేశ సత్సంగి సోదరీ సోదరుల కిట్టి యాంధ్రానువాదములకై తీవ్రాసక్తియున్నట్లు తేటతెల్లమాయెను

1961వ సం॥రములో 'సోవేనీర్' ప్రచురింపబడినది మొదలు, ఆంధ్రప్రదేశ సోదరీ సోదరులీగ్రంథమునకుగూడ తెనుఁగనువాదముకొఱకై తీవ్రాసక్తిని వెల్లడిజేయుచుండిరి పైనుదహరించిన రెండుపొత్తములును తెనుఁగుభాషలో ప్రచురించినపిమ్మట, నాంధ్రసోదరులలో 'సోవెనీర్'కుగూడ నాంధ్రీకరణము గావలయునని తీవ్రసంవేగము గలిగెను ప్రతి సత్సంగియు, రాధాస్వామీ మతముయొక్క మహామహనీయపరమపూజ్యస్థాపక మహాపురుషునియొక్కయు, పరమపూజనీయసద్గురువులయొక్కయు జీవితచరిత్రలనుగుఱించి దెలిసికొనుటకెక్కువయాసక్తితోనుండుననియు, సత్సంగోద్యమముయొక్క మొదటినాఁటినుండి జీవితములో దానికిగలిగిన వృద్ధివికాసలనుగుఱించిగూడ దెలిసికొన నభిలషించుచుండుననియు, నేఁడుగఁ జెప్పనవసరము లేదు. మనమహనీయ పూజ్యసద్గురువుల కఠినతపస్యతోగూడిన నిరాడంబరజీవితములును, వారి జీవితములలోని సంఘటనలును, సత్సంగోద్యమముయొక్క వృద్ధివికాసలవిచిత్రచరిత్రయు, సత్సంగసంస్థలు పూర్వసద్గురువుల భవిష్యవాణుల యనివార్యసహజసంసిద్ధిరూపమున, బాహ్యముగ మానవప్రయత్నము శ్రమయు నెక్కువలేకుండగనే, అనేక విషయములలో బహుక్లిష్టసమస్యలడ్డుపడినను గూడ, సహజస్వాభావికముగ వానంతటనవి యెట్లుత్పన్నములయ్యెనో యాయద్భుతచరిత్రయు, నొక బహురమణీయగాథగ

నుండుటయేగాక, సత్సంగి సోదరీసోదరుల కావిషయములన్నియు నుత్తమజ్ఞానోదయము గావించి మహోత్తేజకములుగ నుండును.

కావున రాధాస్వామీసత్సంగసభవారు ఆంధ్ర సోదరీ సోదరుల తీవ్రాభిలాషను గుర్తించి, 'సోవేనీర్'ను తెనుఁగుభాషాజ్ఞానముగలవారి లాభార్థమై తెనిఁగించుట కేర్పాటుచేసిరి ఆంధ్రప్రదేశ సేల్స్ టేక్సు అపెలేటు ట్రిబ్యునలులో భూతపూర్వాధ్యక్షులైన ప్రే. భా. (శ్రీ) వు సత్యనారాయణగారును, కాకినాడ సౌత్ ఇండియా సత్సంగ స్టోర్సు. ప్రైవేటు, లిమిటెడ్ కు మేనేజింగు డైరెక్టరుఅయిన ప్రే. భా (శ్రీ) దే. సుబ్బారావుగారును ఈభాషాంతరీకరణము చేయుటకు నియోగింపబడిరి. ఈయనువాదమును దీనిమాతృకతో కచ్చితముగ నుండునట్లును, దీనిభాషాశైలిని ఆంధ్రప్రదేశమునగల సామాన్యపాఠకులందరకు నవగాహనయగునట్లు సరళముగను, సులభముగను ఉండులాగునను చేయుటకు వీరిరువురును తగుశ్రద్ధ దీసికొనిరి. అయిననుగూడ నీభాషాంతరీకరణమున దోషములుండినయెడల పాఠకమహాశయులు మన్నించెదరుగాక.

ఆంధ్ర సోదరీ సోదరులు సోవేనీర్ యొక్క యీఅనువాదప్రచురణమును ప్రేమోత్సాహములతో నాదరించెదరని యాశించుచున్నాము.

దయాల్బాగ్ (ఆగ్రా)
24-11-1964

గురుసరన్ దాస్ మెహతా.
రాధాస్వామీ సత్సంగ సభాధ్యక్షులు.

R S.

# ఉపోద్ఘాతము

రాధాస్వామీ సత్సంగము క్రీ॥ శ॥ 1861 సం॥రము ఫిబ్రవరి నెలలో వసంతపంచమీ శుభదినమున స్థాపించబడినది. గతించిన జనవరి నెలలో నద్దానికి నూఱుసంవత్సరములు పూర్తియయినవి. అప్పుడు సత్సంగశతాబ్దిమహోత్సవము జరిపించబడినది. రాధాస్వామీసత్సంగముయొక్క సిద్ధాంతములు కబీర్ సాహెబ్, నానక్ సాహెబ్, జగజీవన్ సాహెబ్, పలటూసాహెబ్ మొదలైన సంతుమహాత్ములు బోధించిన సంతుమతసిద్ధాంతములతో నించుమించు పూర్తిగ ననుకూలించియుండును అందుచే రాధాస్వామీమతము సంతుమతమని కూడ పేరువడసెను.

ప్రపంచములో పూర్వకాలమునను ప్రస్తుతమునను ప్రచలితమైయున్న వివిధమతములను పరిశీలించిచూచినచో రెండేమార్గములు ప్రచారములోనున్నట్లు తేటపడును. అందొకటి, కర్మకాండ, బాహ్యానుష్ఠానములు, ఉపవాసవ్రతములు, తీర్థయాత్రలు, బాహ్యపూజాపురస్కారములు మొదలగునవి జరుపుటయు; రెండవది, తనలోతానంతరంగమున నేకాగ్రతాసాధనను, అనగా నాధ్యాత్మికసాధనను జేసికొనుటయు. బహుసామాన్యముగ నీరెండుమార్గములు నొకేమతములోనే యనుష్ఠింపబడుచుండును. అనగా ఒకేమతముయొక్క అనుయాయులు, కొందఱొకమార్గమును మఱికొందఱింకొకమార్గమును అవలంబించుచుందురు. కొందఱు బాహ్యపూజాపురస్కారముల కెక్కువ ప్రాధాన్యమిచ్చి యైహికవిషయసౌకర్యములను జేకూర్చుకొనుటకే చాల తఱచుగ నాశించుచుందురు. మఱికొందఱట్లుగాక, పరమార్థసంబంధమైన గూఢరహస్యములకే ప్రాధాన్యమిచ్చి మోక్షమును సాధింపవలయుననియు, పరమపురుషుని సన్నిధానము నొందవలయుననియు పాటుపడుచుందురు.

ప్రపంచమందలి ప్రఖ్యాతమతములు చాలమట్టు ఆయామతస్థాపకుల ప్రత్యక్షజ్ఞానముపైననే ఆధారపడి ప్రచలితమయినవి. ఆయామతస్థాపకులకు నిజరహస్యముల ప్రత్యక్షజ్ఞానముండియున్నను, వారు, తఱచుగ వివాదలులేకుండ జేసికొనుటకై, ప్రజలుతమతమసంఘములందు లేక దేశములందు వాడుకలోనున్న

కర్మకాండను బాహ్యాచారవ్యవహారములను యథాప్రకారము సాగించుట కంగీకరించుచుండెడివారు. అందుకు పర్యవసానముగ నాయామతస్థాపకుల మతములలో నిగూఢతత్త్వబోధలతోబాటు బాహ్యాచారములు కర్మకాండయుగూడ నాచరణలోనుండుచున్నవి. మానవునకు శరీరమనస్సులకు సంబంధించిన కృత్యములను సాగించుట, చిరకాలమునుండి యలవడియున్నందున, చాలసులభమైన పనియును, చిత్తవృత్తి నంతర్ముఖముగావించుట మిగులకష్టమైనపనియు నగుటచే, నామతస్థాపకుల నిజబోధలచే లాభమునొందినవారు చాలకొద్దిమందిమాత్రమేయుండి, యధికసంఖ్యాకు లదివఱలోవలెనే బాహ్యావిషయములకే అంటిపెట్టుకొనియుండిపోయిరి. ఆయామతస్థాపకులు గతించినపిదప సామాన్యముగ నందఱును ఆ నిగూఢతత్త్వబోధలను పూర్తిగమఱచిపోయి కేవలము బాహ్యానుష్ఠానములు కర్మకాండలోనే చిక్కుకొనిపోవుచుండిరి. కావుననే. చాలమతములలో బాహ్యావిషయములుమాత్రమే మిగిలిపోవుటయు నందలి సారభూతమయిన నిగూఢబోధలును ఆధ్యాత్మికసాధనలును అంతర్హితమయిపోవుటయును తటస్థించుచుండెను.

ఎట్లనగా గిబ్బనుగారి "రోమనులరాజ్యక్షయపతనములు" అనెడిగ్రంథములో "హేసికాస్టు"లను గుఱించి వ్రాసిన యీక్రింద నుదహరించినపంక్తుల వలన పురాతనకాలములో క్రైస్తవులు యేసుప్రభువుబోధించిన యాధ్యాత్మిక సాధనలను, నిగూఢతత్త్వబోధలను ఆచరణలో బెట్టుచుండెడివారని విశదపడగలదు:

"నీవు నీగదిలో నేకాంతముగనున్నపుడు తలుపులువేసికొని యొక మూలకూర్చుండి, యనిత్యమిథ్యావిషయములనుండి నీమనస్సును ద్రిప్పివేయుము; నీగడ్డమును గుండెమీదనానించుము; నీదృష్టిని ఆలోచనను నీయుదరమధ్యమందున్న నాభిస్థానమువైపునకు మఱల్చు. నీ యాత్మయుండుచోటయిన హృదయస్థానమును పరికింపుము. మొట్టమొదట నీకంతయు నంధకారమయముగను సుఖశాంతివిహీనముగ నేయుండును; కాని నీవట్లు రాత్రింబవళ్ళు విడువకుండ నభ్యాసముజేసినచో నీకొయకనిర్వచనీయమయిన యానందములభించగలదు నీయాత్మకు ఆహృదయస్థానము లభించినతక్షణమే అది యొకగుప్త దివ్యతేజస్సులో లీనమైపోవును"

కాని యేసుక్రీస్తు గతించినతరువాత క్రైస్తవులలో నధికాధికసంఖ్యాకులు త్వరలోనే యీవిషయములను పూర్తిగమఱచిపోయి పరిత్యజించిరి. ఇతిమితు

గాక క్రైస్తవమతనాయకులీసాధనల నభ్యాసముచేయుచుండిన హేసికాస్టు క్రైస్తవులనే, యేసుక్రీస్తును అపరాధులుగనెంచి హింసించుచుండిరి. అటులనే 'హీరా' యను కొండగుహాలో మహమ్మదుప్రవక్త యభ్యసించిన సురత్ శబ్దయోగసాధనను (సుల్తానుల్ అజ్కార్) వారి యనుయాయులు గూడ త్వరలోనే మఱచిపోయిరి. ఉపనిషత్తులలో బోధించిన యాంతర్య యోగసాధనలను హిందువులుగూడ నల్లెవిడిచివేసి, విగ్రహారాధన మొదలగు బాహ్యక్రియలలో కాలక్షేపము సేయుచున్నారు, లేదా, అధికాధికము, శ్వాసనియంత్రణముకొఱకును శరీరవ్యాయామముకొఱకు నుద్దేశింపబడిన హఠయోగసాధనల నభ్యసించుచు తృప్తినొందుచున్నారు.

సంతుమహాత్ము లీమానవదౌర్బల్యమును గ్రహించియే, మతసంబంధమయిన బాహ్యాడంబరముల కెంతమాత్రమును తావివ్వక తాముగూడ బాహ్యసంస్కారములను కర్మకాండను ఎంతమాత్రము విధించలేదు. అయినను, వారి యనంతరము వారియనుయాయులు తమచుట్టుప్రక్కలనుండిన పరిస్థితుల కధీనులై క్రమక్రమముగ బాహ్యకర్మానుష్ఠానములలోనైనను, లేదా, కేవలము బుద్ధిచతురతామనోవినోదములతోగూడిన క్రియాకలాపములలోనైనను నిమగ్నులయిపోవుచుండిరి.

రాధాస్వామీమతసిద్ధాంతములు, సాముదాయకముగను వెవ్వేఱుగను సంతుమతమని పేర్కొనబడు వివిధమతముల సిద్ధాంతములతో సామ్యము గల్గియుండును,గాని యొకప్రత్యేకవ్యత్యాసము గమనింపదగియున్నది అదియేమనగా, రాధాస్వామీ మతసందేశ మీమహాసృష్టిలో నాపరమసర్వేశ్వరునిధామమగు నున్నతోన్నతధామమునుండి యాగతమైన మహాసందేశము. ఇంతకుముందవతరించిన సంతుమహాత్ములెవరు నాయున్నతోన్నతధామమునుగుఱించి చెప్పనేలేదు, చెప్పిననుగూడ, గుప్తరీతిగనో లేక ప్రాసంగికముగనో సూచనామాత్రముగనే చెప్పిరి. ఆ పరమపురుషుని పవిత్రనామమును విస్పష్టముగ ప్రకటనచేయుట కిదియె మొదటిసారి. రెండవ వ్యత్యాసమేమనగా, పరమపురుషునినుండి యుద్భవించి, స్వామీజీమహారాజువారి రూపమున నవతరించి రాధాస్వామీ మతమునుస్థాపించినట్టి ఆపరమచైతన్యధార సకలసృష్ట్యుద్ధారమును కొనసాగించకుండ నెన్నటికి నిచ్చటనుండిమఱలిపోనేరదనియును, అంతవఱకు నాధార వరుసగ నొకరితరువాత మఱొకసద్గురువులో నధివసించుచు నిచ్చటనే యుండిపోవునని యును ఈమతము ప్రతిజ్ఞసేయుచున్నది. అట్లు సద్గురుపరంపర యెడతెగకుండ

నుండుటచే, తిరిగి కర్మకాండ బాహ్యానుష్ఠానములలోనికి దిగిపోవుట కీమతములో నవకాశముండదు. అయిననిందులో నొకగొప్ప క్లిష్టసమస్యగూడ గలదు. ఒక సద్గురువు గుప్తమయినపుడు, వారియుత్తరాధికారులమని చెప్పుకొనుచు ననేకులు తయారుకావచ్చును. అందుమూలమున నమాయకులైన యథార్థభక్తులు సంశయములపాలై తబ్బిబ్బుపడిపోవచ్చును. ఇదియొక వాస్తవమైన ప్రమాదము. కావుననే రాధాస్వామీ మతములోని సంత్ సద్గురువు లీవిషయమునుగురించి పదేపదే విపులముగ విశదీకరించుచుందురు. ఐహికోద్దేశ్యములను గోరకుండ సద్గురువును దెలిసికొనుటకై జాగరూకతతో నన్వేషణసేయువారలు సామాన్యముగ వాస్తవసద్గురుని చరణకమలముల నెల్లపుడు నొందుచునేయున్నారు.

ఇంతియగాక సద్గురువు తమయుత్తరాధికారిని తెలిసికొనుటకు తగిన సూచనలను కొన్ని యెల్లపుడు నిచ్చుచునే యుందురు. ఉదాహరణార్థము, స్వామీజీమహారాజువారితరువాత హుజూర్ మహారాజువారు సద్గురువు కాగలరని, స్వామీజీమహారాజువారికాలములోనే యందఱకును తెలియును. అట్లే, హుజూర్ మహారాజువారి యనంతరము మహారాజసాహబ్ వారే సద్గురువు కాగలరని ఇంచుమించందఱకును నిశ్చయాత్మకముగ విదితమైయుండెను. మహారాజసాహబ్ వారు 1885 సం॥రములో నుపదేశమునొందిరి. తదనంతర మొకటిన్నరసంవత్సరములకే, హుజూరుమహారాజువారికివచ్చిన యుత్తరములన్నిటికిని, మహారాజసాహబ్ వారు కేంద్రస్థానమున నున్నపుడెల్ల, హుజూరుమహారాజువారిస్థానే వారే సమాధానములను వ్రాసిపంపుచుండెడివారు. అట్టి బహిరంగమయిన సూచనలు మహారాజసాహబ్ వారికాలములో తక్కువగ నుండుటచే కొందఱు త్రోవతప్పిపోవుటయును, మఱికొంద ఱితరులను పథభ్రష్టులనుజేయుటయును తటస్థించెను.

అదేవిధముగ, సర్కార్ సాహబ్, సాహబ్జీమహారాజువార్లు తమతమ యుత్తరాధికారులను తెలిసికొనగల సూచనలను తగినంతగ నిచ్చియున్నను, కొందఱుజను లాసూచనలను గమనింపనోపక బుద్ధిపూర్వకముగ వానిని నిరాదరణ జేసిరి. ఎట్లన, సర్కార్ సాహబ్ వారు, ప్రధానవిషయములను గుఱించిన కాగితములను, ఆదివారమునాడు సాహబ్జీమహారాజువారువచ్చి వానినిచూచువఱకు, నందుమీఁద తగినచర్య తీసికొనకుండ నుంచెడువారు. సాహబ్జీమహారాజువారొకసారి సత్సంగ కేంద్రమునకు వెళ్లి అచ్చటనుండుటకొఱకు సెలవు పెట్టదలఁచిరి. ఆరోజులలో వారి కనారోగ్యముగనుండి, యార్థికముగగూడ

కష్టముగ నుండెను. అనారోగ్యకారణముతో సెలవునుగోరుచు, వారు అస్వాస్థ్యప్రమాణపత్రమును (Medical Certificate) పొందుటకై సివిల్ సర్జను (Civil Surgeon) గారివద్దకు వెళ్లిరి. సివిలు సర్జనుగారి కీయవలసిన రుసుము నెట్లో చెల్లించి,నమీదట నాయన వీరినిపరీక్షించిరి. సివిల్ సర్జన్ గారు వారికి కొద్దిరోజులుమాత్రమే జీవించగలరనియు, నందుచే సెలవుకొఱకు తాపత్రయపడక, బంధువులు వగైరాలను బిలిపించుకొనుమనియు జెప్పిరి. కాని సాహబ్జీమహారాజువారు ప్రమాణపత్రమును పట్టుపట్టి పుచ్చుకొనివెళ్లగా, సర్కార్ సాహబ్ వారు వారిని తమగదిలోనికి పిలిచి కౌగలించుకొని, తా మెంతయు సంతసించితిమని వారితో సెలవిచ్చిరి.

అటులనే, మెహతాజీసాహబ్ వారు పదమూడేండ్లప్రాయమున తమతండ్రి గారయిన శ్రీఆత్మారామ్‌సాహబ్ మెహతాగారితో హుజూరుమహారాజువారి సత్సంగమున కాగ్రాలో పీపల్మండీ వెళ్ళగా, హుజూరుమహారాజువారు వారి పేరడిగి, హరచరణదాస్ అనిచెప్పగా, దానిని గురుచరణదాస్ అనిమార్చిరి. నాల్గవ యధ్యాయములో 63వ పేరాగ్రాఫులో 138వ పుటలో చెప్పినట్లుగ, మహారాజ్ సాహబ్ సర్కార్ సాహబ్ వార్లు గూడ వీరియెడల నసాధారణ మయిన ప్రేమాభిమానములనుజూపెడివారు. 1914 సం॥రము వేసవికాలములో సాహబ్జీమహారాజువారు సోలన్ లో మకాముచేసియున్నపుడు మెహతాజీ సాహబ్ వారినిగుఱించి "మంజూరేనజర్" (అనగా భగవంతునిదయను పొందిన వారు) అనుశబ్దమును ప్రయోగించిరి. (250వపుటలో 4వపేరాను చూడుడు). తిరిగి సాహబ్జీమహారాజువారు హరిపర్వతమువద్ద నొకబంగాళాలో నుండినపుడు వారొక గాళుపురోజున అచ్చటనున్న సత్సంగులందఱికిని దయతో నొక్కొక్క గ్రుక్కెడు పానీయము నిచ్చుచుండగా మెహతాజీసాహబ్ వారివంతు వచ్చి నపుడు, సాహబ్జీమహారాజువా రిచ్చుచుండగా మెహతాజీసాహబ్ వారు చాల సేపదేపనిగ త్రాగుచునేయుండిపోయిరి. తదనంతర మింకొకసత్సంగియు నట్లే చేయఁబోగా, సాహబ్జీమహారాజువా రందఱకు నట్టి ప్రత్యేకాదరమునుపొందు నర్హతలేదని సెలవిచ్చిరి అదేప్రకారము, సాహబ్జీమహారాజువా రొక సాయం కాలము వేళ, జలందర్ లో పి.డబల్యూ.డి. విశ్రాంతిగృహములో నొకగదిలో విశ్రాంతిఁ దీసికొనుచుండగా, మెహతాజీసాహబ్ వా రాగదిలోనికి వెళ్లిరి. సాహబ్జీమహారాజువా రపుడు తమ పవిత్రహస్తమును వారినిదీవించుటకై చాఁచగా వెంటనే మెహతాజీసాహబ్ వారు సాహబ్జీమహారాజువారి హస్తము

క్రింద తమశిరస్సు నుంచిరి అదియునుగాక, 1920 సం॥రములో సాహబ్జీమహారాజువారు మధ్యప్రదేశములో హోర్దావద్ద బహుప్రమాదకరమయిన జబ్బులో నుండగా, తమతరువాత సత్సంగకార్యమునంతను మెహతాజీసాహబ్‌వారే సాగించెదరని యచ్చటనున్నవారందఱితో విస్పష్టముగ సెలవిచ్చిరి

తమ నిర్యాణమునకు 4 రోజులు ముందుగ సాహబ్జీమహారాజువారు సెలవిచ్చిన యీక్రింది వచనమునుగూడ నీసందర్భమున జ్ఞాపక ముంచుకొనఁదగును. వా రిట్లనిరి :

"వారు (భగవంతుఁడు) నన్ను రాజునుచేసినయెడల, నిదివరలో నేరాజు నెన్నడు నధిష్ఠించనంత వైభవములో నేను సింహాసనముపై నధిష్ఠించెదను. లేదా వారు నన్ను బూడిదలోదొర్లునట్లుచేసినయెడల, నిదివరలో నేబిచ్చగాడు నెన్నడు దొర్లనట్టిరీతిని, నే నదేపనిగ బూడిదలోపడి దొర్లుచునుందును."

బిచ్చగానివలె బూడిదలో డొర్లెదమని సెలవిచ్చినమాట సాహబ్జీమహారాజువారికి స్వీయముగ వర్తించదని విశదమే. ఏలనన వారింక 3,4 దినములు మాత్రమే జీవించగలరని వారికే తెలుసును అదియునుగాక. సాహబ్జీమహారాజువారు మహారాజఠీవితో జీవితమునుగడపిరి. వారికి జీవితములో నామహారాజశోభగూడ, లౌకికసంపదధికారములమూలమునగాక, మహారాజులకు గూడ స్పర్ధనీయములు, ననుకరణీయములు నగునంతటి నిరుపమానప్రతిభ మహనీయ ప్రవర్తనలచేతనే సంపన్న మయినది. ఈ సందర్భములనుబట్టి జూచినచో. పై వచనములో వారుచేసిన సూచన స్పష్టముగ తమ యుత్తరాధికారినిగుఱించియే యని తేటపడగలదు. 1937 సం॥రము మొదలుకొని మెహతాజీసాహబ్‌వా రెట్టి పూర్ణనిరాడంబరజీవితమును గడుపుచుండిరో యందఱకును విదితమే. మెహతాజీసాహబ్‌వారు పొలముల బురదలోను బూడిదలోను చేయుచున్న పనినిజూచిన "నిదివఱలో నేబిచ్చగాడు నెన్నడుదొర్లనట్టిరీతిని" బూడిదలోపడి అదేపనిగ దొర్లుచుందునని సాహబ్జీమహారాజువారు సెలవిచ్చిన భవిష్యవాణిని తామే తమనూతనరూపములో పూర్తిచేయుచుంటిరని యెవరికైనను బోధపడును.

తెలిసికొనగల శక్తిగలవారికి. పై విషయములన్నియు సంపూర్ణమైన సూచనలేగదా!

కావున నెవరైన నపభ్రమలపాలైనచో నది వారి స్వయంకృతాపరాధమేగాని మఱొకటిగానేరదు. ఏలనన, ప్రతిసద్గురువును తమయుత్తరాధికారిని గుఱించి విస్పష్టసూచనల నెప్పుడునిచ్చుచునేయుండిరి. కొందఱుజనులు ప్రాపంచిక విషయములతోను వ్యక్తులతోను బంధన మేర్పఱచుకొనియుండుటచే, నందుకు ప్రతికూలమయిన విస్పష్టసూచనలున్నను వారాబంధనములను విడువలేకపోవుటచే తమకెట్టి మహాపాయమును ఆధ్యాత్మికనష్టమును గల్గినను గూడ సరకుసేయక నావిషయములకును వ్యక్తులకును మఱింతదృఢముగ నంటిపెట్టుకొనుచుందురు. అట్టి పథభ్రష్టులయినవారిమీద రాధాస్వామీదయాళుడు ప్రత్యేకదయాకటాక్షములను జూపుదురుగాకయని ప్రార్థించుటదప్ప వేఱుపాయమేమియు లేదు !

ఈ గ్రంథము చరిత్రాత్మకముగ వ్రాయబడలేదు. రాధాస్వామీ మత సద్గురువులజీవితములనుగుఱించి సంక్షిప్తవర్ణన లిందుగలవు. కాని, యెల్లరకుం దేటతెల్లమయిన కారణములచే, నా జీవితవివరము లంతయెక్కువ విపులముగ లేవు. కేంద్రస్థానమునను, ఇతరస్థలములలోను ఉన్నట్టి సత్సంగ సంస్థలను గుఱించి కొన్నివివరములనుగూడ నిందు వ్రాసితిమి.

మహారాజ్ సాహబ్ వారి చిన్నవయస్సునాఁటి విషయములను గొన్ని మాకు దెలియజేసినందుకు, వారి చిన్నకుమారులయిన శ్రీ గురుచరణదాస్ మిశ్రగారికిని, హుజూరుమహారాజువారి జీవితవిషయముల దెలియజేసినందుకు వారి ప్రపౌత్రునిపుత్రులయిన పీపల్మండీవాస్తవ్యులు శ్రీ అగమప్రసాదమాథుర్ గారికిని. మేము కృతజ్ఞులము. సర్కార్ సాహబ్ వారి జీవిత విషయములను గుఱించి తెలియజేసినందుకు వారికుమారులైన శ్రీ గురుదేవప్రసాదసిన్హాగారికిని, వారిసోదరికిని. సాహబ్జీమహారాజువారి జీవితవిశేషములనుగుఱించి చెప్పినందుకు వారి పెద్దల్లుడు శ్రీ సోమప్రకాశ్ గారికిని. వారి సతీమణియయిన సాహబ్జీమహారాజువారి కొమార్తెగారికిని మా కృతజ్ఞతను దెల్పుచున్నాము.

1961 సం॥రము జూలై నెలలో నీపుస్తకము తొలుదొల్త ప్రచురితమయినది. ఈ పుస్తకమున కభ్యర్థులు మెండుగనుండుటచే నీ రెండవకూర్పు జారీచేయబడినది.

దయాల్బాగు, ఆగ్రా,
1962 ఆగస్టు 10వ తేదీ.

గురుసరన్ దాస్ మెహతా,
రాధాస్వామీ సత్సంగ సభాధ్యక్షులు.

# రాధాస్వామీ మతమునయొక్క పరమపూజ్యస్థాపకుల యొక్కయు, రాధాస్వామీసత్సంగసభవారిచేనామోదింపబడిన సంత్‌సద్గురువులయొక్కయు పవిత్ర నామధేయములు.

I పరమగురు స్వామిజీమహారాజువారు (శ్రీ శివదయాల్ సింగ్ సాహబ్ వారు) ఈ మతమునకు స్థాపకులు. వీరు 1878 సం॥రములో నిర్యాణము నొందిరి

II. పరమగురు హుజూర్ మహారాజువారు (రాయ్ బహాదుర్ సాలిగ్రామ్ సాహబ్ వారు) వీరు 1878 సం॥రము మొదలుకొని 1898 సం॥రము వఱకును సంతసద్గురువుగ విరాజిల్లిరి.

III పరమగురు మహారాజసాహబ్ వారు (పండితబ్రహ్మశంకరమిశ్రసాహబ్ వారు) వీరు 1898 సం॥రము మొదలుకొని 1907 సం॥రము వఱకును సంతసద్గురువుగ విరాజిల్లిరి

IV. పరమగురు సర్కార్ సాహబ్ వారు (శ్రీ కాంతప్రసాదసిన్హాసాహబ్ వారు) వీరు 1907 సం॥రము మొదలుకొని 1913 సం॥రము వఱకు సంతసద్గురువుగ విరాజిల్లిరి.

V. పరమగురు సాహబ్జీమహారాజువారు (సర్. ఆనందసరూప్ సాహబ్ వారు) వీరు 1913 సం॥రము మొదలుకొని 1937 సం॥రము వఱకు సంతసద్గురువుగ విరాజిల్లిరి.

VI. మెహతాజీసాహబ్ వారు (రాయ్ సాహబ్ గురుచరణదాస్ మెహతాజీ సాహబ్ వారు) 1937 సం॥రమునుండి సద్గురువుగ విరాజిల్లుచున్నారు.





I—స్వామీజీమహారాజువారు

(1818—1878)

*1861 లో రాధాస్వామీమతమును స్థాపించిరి.*

రాధాస్వామీ దయాల్ కీ దయా

రాధాస్వామీ సహాయ్.

I

# పరమపురుష పూరన్‌ధనీ
# హుజూర్ స్వామీజీ మహారాజ్ వారు

పరమపురుషులయిన రాధాస్వామీదయాళులు విక్రమశకము 1875 సంవత్సరము భాద్రపదమాస కృష్ణపక్షములో[1] అష్టమినాడు అనగా క్రీ. శ. 1818వ. సం॥రము ఆగష్టు 24వ తేదీ సోమవారమునాడు రాత్రి 12 గంటలన్నరకు ఆగ్రాలో పన్నీగల్లీయను మొహల్లాలో నవతరించిరి. వారు మొదటలో శ్రీ శివదయాల్ సింగ్ అను నామముచే పేర్కొనబడి పిమ్మట స్వామీజీ మహారాజ్ వారు అను నామముతో ప్రఖ్యాతిగాంచిరి.

2. వారి తండ్రిగారు సేఠ్ దిల్వాలీసింగ్ సాహబ్ గారొక గౌరవనీయమైన ఖత్రి (సేఠ్) కుటుంబమునకు జెందినవారు. స్వామీజీ మహారాజ్ వారు వారి జ్యేష్ఠపుత్రులు. సేఠ్ బృందాబన్, సేఠ్ ప్రతాపసింగునను మఱియిద్దరు కుమారులు గూడ నాయనకు గలరు. సేఠ్ దిల్వాలీసింగ్ గారు మొదటలో గురునానక్ సాహెబ్ వారి భక్తులై సుఖమణి[2] జపజీ[3] రారస[4] గ్రంథభాగములను ప్రతిదినమును పారాయణసేయుచుండెడివారు. వారుపయోగించుచుండెడి సుఖమణిగ్రంథము స్వామీజీమహారాజువారి పితామహునిచే పర్షియన్ లిపిలో వ్రాయబడిన హస్తలిఖితప్రతి.

3. పిమ్మట హాథరస్ పట్టణవాసులగు సంత్ తులసీ సాహెబ్ వారు ఆగ్రా తఱచు వచ్చుచుండుటచే వారి సత్సంగములో, సేఠ్ దిల్వాలీసింగ్ గారొకసారి హాజరగుట తటస్థించెను. అప్పుడు సేఠ్ సాహబ్ గారు వారికి భక్తులయిరి. స్వామీజీ మహారాజవారి తల్లి పినతల్లి మాతామహియు గూడ తులసీ సాహబ్ వారి సత్సంగములో జేరిరి.

---

(1) తెలుగు పంచాంగము ప్రకారము ఇది శ్రావణమాస బహుళపక్షమగును. (2) సుఖమణి యను గ్రంథము శిఖ్ఖుల 5వ గురువుగారైన అర్జున్‌సాహెబ్‌వారు రచించిరి. దానిలో 24 అష్టపదులున్నవి. శిఖ్ఖులు ఈగ్రంథమును ప్రతిదినము ఉదయమున పఠింతురు (3) జప్జీ గ్రంథము గురునానక్ వారిచే రచింపబడినది. ప్రతిదినము నుదయమున ప్రతిశిఖ్ఖు నీగ్రంథ పఠించును. (4) 'రారస్' అను గ్రంథమును శిఖ్ఖులు రాత్రులందు పఠించుచుందురు.

4. స్వామీజీమహారాజువారు 5సం॥ ప్రాయములోనే విద్యాభ్యాసము మొదలుపెట్టిరి. వారికి చదు వెక్కువ త్వరితముగ వచ్చుచుండుటచే వారెన్నడు నొక ప్రారంభకునివలెనే కన్పట్టలేదు. హిందీ, గురుముఖీ భాషలనే గాక, పర్షియన్ భాషను గూడ స్వామీజీ మహారాజ్ వారు నేర్చుకొనఁ దొడఁగి, అంతచిన్నవయస్సుననే యాభాషలో నొక గ్రంథమునుగూడ రచించిరి. ఆగ్రంథ మతిమధుర శైలిలో వారి యుత్తమోదార భావములఁ దెల్పుచు నత్యద్భుతరీతిని వ్రాయబడినది. వారు సంస్కృతము, అరబిక్ భాషలను గూడ నేర్చుకొనిరి. ఈ విధముగ వారు హిందీ, గురుముఖి, సంస్కృతము, అరబిక్, పర్షియన్, ఉర్దూ యను నాఱుభాషలలో ప్రవీణత నొందిరి. ఇరుగు పొరుగు ఖత్రి బ్రాహ్మణ. వైశ్య జాతులవారి పిల్లలు స్వామీజీమహారాజు వారి వద్దకు చదువుకొనుటకు రాగా, వారందఱికిని ఉచితముగ చదువు చెప్పుచుండెడివారు.

5. చాల చిన్నతనమునుండియు స్వామీజీమహారాజువారు ఆధ్యాత్మిక సాధనల సల్పుటలో తీవ్రశ్రద్ధ గల్గియుండిరి. వారి కాఱు సంవత్సరముల ప్రాయముననే వారి తల్లిగారు ప్రతిదినము తెల్లవాఱుజాముననే వారికి స్నానమున కేర్పాటుచేయగా వారు స్నానముజేసి ఆధ్యాత్మికాభ్యాసము జేయుటకు కూరుచుండెడివారు.

6. ఒకసారి సంత్ తులసీసాహెబ్ వారు స్వామీజీ మహారాజువారి తల్లిగారితో నామె కుటుంబములో నొక పరమసంతు[1] స్వామీజీ మహారాజువారి రూపమున నవతరించిరనియు, వారిని సామాన్యపుత్రునిగ చూచుకొనవలదనియు, సెలవిచ్చిరి. అప్పటినుండియు, వారి తల్లిదండ్రులు వారిని భక్తిసహితముగ నాదరించెడివారు. వారు చాలపసితనమునుండియు, పాఠశాలకు పోవుదినములలో గూడ, తమ తల్లిదండ్రులకు నితరవయోవృద్ధులకును పరమార్థబోధలను జేయుచుండెడివారు. ప్రపంచముయొక్కయు నందలి పదార్థములయొక్కయు నాశమానతను గుఱించి వారు నొక్కివక్కాణించుచు వేదాంత సత్యపరమార్థములయొక్క యుత్తమోత్తమ సిద్ధాంతములను విశదీకరించుచుండగ నందఱును నిశ్చేష్టులయి వినుచుండెడివారు. వారు తమ దర్శనార్థమై వచ్చిన పండితులు సాధువులు ఫకీరులు మొదలగువారంద

---

1 పరమసంతు అనగా సున్నతోన్నతమయిన పరమపురుషుని ధామమునొందిన సంతు మహాత్మ.

ఐను నీ జగ త్తశాశ్వతమని దట్టించి చెప్పుటయేగాక, పరమో త్తమ విషయ ములమీద చర్చలుకూడ సల్పుచుండెడివారు. పరిపూర్ణోద్ధారమును సాధించు టకు దోడ్పడు పంథ నందఱు నవలంబింపవలసియున్నదని వారు నొక్కి బోధిం చెడివారు.

7. వారి చిన్నవయస్సుననే ఢిల్లీదగ్గఱ ఫరీదాబాదునకు చెందిన లాలాఇజ్జత్ రాయ్‌గారి కుమా ర్తె శ్రీమతి నారాయణదేవిగారితో వారికి వివాహము జరిగెను. వారికి చదువు పూ ర్తి యయిపోవనై యున్నపుడు వారికి బాందాలో నొక యుద్యోగము లభించినందున వా రచ్చట పనిలో జేరిరి. కాని ఆపని వారి యాధ్యాత్మికాభ్యాసమునకు చాల భంగకరముగ నుండుటచే వా రాయుద్యోగమును త్వరలోనే వదలివేయవలసివచ్చెను.

8. స్వామీజీమహరాజ్ వారు జీవికోపార్జన చేసికొనవలయునని వారితండ్రి గారి కెక్కువ యాతురతగనుండుటచే, వారు లాలా ఇజ్జత్ రాయ్‌గారికి, వీరిని ఫరీదాబాదు పిలిపించి, తమపలుకుబడి నుపయోగించి, వీరికి తగిన యుద్యోగము నేదేని సంపాదించిపెట్ట వలయునని వ్రాసిరి. అందుమీదట స్వామీజీ మహ రాజువారిని వారిమామగారు ఫరీదాబాదు పిలిపించిరి. స్వామీజీమహరాజు వారు రోజునకు 2 గంటలు మాత్రమే పనిచేయు షరతుమీద నుద్యోగము జేయుట కంగీకరించిరి. వల్లభగఢ్ రాజుగారికి చదువుచెప్పుట కొక యుపా ధ్యాయు డప్పట్లో నవసరము రాగా, వెంటనే స్వామీజీమహరాజువారి నా రాజుగారికి చదువుచెప్పుట కేర్పఱచిరి. స్వామీజీమహరాజువా రుద్యోగ ములో జేరినందున వారి తండ్రిగారికి తృప్తిగను సంతోషముగ నుండెను. ఆ యుద్యోగము స్వామీజీమహరాజువారికి గూడ సుకరముగనే యుండెను.

9. ఆకాలమున నీదేశములోని రాజులదివాణములలో నుద్యోగస్థులకు వాళ్లు జీతములుమాత్రమే గాకుండ విరివిగ నాహారసామగ్రి నిచ్చి వారలకు సవారి, నౌకర్లను గూడ నేర్పాటుచేయుచుండిరి. అందుచే నుద్యోగస్థులు తమ యావశ్యకతకుమించిన సామగ్రిని సామాన్యముగ నమ్మివేసి యందుమూల ముగ ధనమును సంపాదించుకొనుచుండెడివారు. కాని స్వామీజీమహరాజు వారుమాత్ర మట్లుగాక, తమ కిచ్చినయాహారసామగ్రినుండి తమకు కనీస మెంతయవసరమో అంతమాత్రమే యుంచుకొని, శేషించినదానిని బీదసాదల కిచ్చివేయుచుండెడివారు.

10 ఇట్లుద్యోగములో కొంతకొంతకాల మున్నపిదప, స్వామీజీమహారాజువారికి అంతర్యమున తమతండ్రిగారి మరణసమయ మాసన్నమైనట్లు గోచరమైనందున వారు తమయుద్యోగమునకు రాజీనామా నిచ్చివేసి తమ తండ్రిగారి మరణమున కొక్కదినము ముందుగ నాగ్రా జేరుకొనిరి. వీరు ఆగ్రా వెళ్లుసరికి వీరి తండ్రిగా రొకపెండ్లివారితో గలిసి దగ్గఱనున్న షికోహాబాదుగ్రామమునకు వెళ్ళియుండిరి. తిరిగివచ్చినతోడనే వారికి హఠాత్తుగ జబ్బుచేసెను. స్వామీజీమహారాజువారు ఆ రాత్రియంతయు వారికి పరిచర్య సల్పుచు వారి మంచముప్రక్కనే కనిపెట్టుకొని యుండిరి. సంతుల పవిత్ర గ్రంథములనుండి శబ్దములను పారము చేసి, గతించిపోవు నాత్మకు వారు సహాయసంరక్షణల నిచ్చిరి

11. స్వామీజీమహారాజవారి తండ్రిగారును తాతగారును పర్షియన్ భాషలో పండితులు. వారు తమ జీవికోపార్జనకొఱకై యుద్యోగములను జేసిరి. ఉద్యోగమునుండి విరమించుకొన్న పిదప వారి తండ్రిగారు జీవికోపార్జనకై వడ్డీ వ్యాపారము మొదలుపెట్టిరి. వారు గతించినపిదప కొలదికాలము మాత్రమే యీవ్యాపారము కుటుంబములో సాగుచుండెను. ఈ వ్యాపారము స్వామీజీ మహారాజువారి కిష్టము లేనందున వారు తమ యనుజులయిన సేర్ ప్రతాప సింగుగారితో. నొక్కవారములో దీనిని కట్టిపెట్టవలసినదని యాజ్ఞాపించిరి. అందుమీద సేర్ ప్రతాపసింగ్‌గారు బాకీదార్లందఱకు నొక్కవారము లోపుగ తమ బాకీలను తీర్చివేయవలసినదని హెచ్చరికను పంపించిరి. ఆయవధి గతించినపిదప తీర్చకుండ నుండిపోయిన బాకీలను రద్దుచేసి ఋణపత్రములను చించివేసిరి. వృద్ధిరూపమగు నాదాయము పోయినందున కుటుంబపోషణభారమంతయు స్వామీజీమహారాజువారి తమ్ములు సేర్ బృందావన్‌గారిమీాద పడెను. వా రంతకుముందే పోష్టల్ డిపార్టుమెంటులో రు 40 లు మాసిక వేతనముపై నుద్యోగములోజేరి పిమ్మట పోస్టాఫీసుల సూపరింటెండెంటు పదవి వఱకు నభివృద్ధినొంది రిటైరు (Retire) అయిరి. ఆ విధముగ నాయనకు కుటుంబావసరములను పూర్తిగ భరింపగల సమర్థతయుండెను.

12. అందుచే స్వామీజీమహారాజువారు కుటుంబబాధ్యతల నుండియు, ప్రాపంచిక బాధ్యతల నుండియు విముక్తులయి, తమ కాలమంతయు నాధ్యాత్మిక సాధన చేయుటలోను, పరమార్థబోధ చేయుటలోను గడుపుచుండిరి. వారికి గురు వనువా రెవరును లేరు. అట్టియవసరముగూడ వారికెన్నడును గలుగ

లేదు. వారు స్వేచ్ఛచే పరమోన్నతచైతన్యధామమునుండి దిగివచ్చి మానవ రూపమును ధరించిన పరమపురుషుని యవతారస్వరూపులు. వారు అహో రాత్రములు, అప్పుడప్పుడు మధ్యన కొంచెముసేపుపు జేయుచు, మిగిలిన సమయమంతయు నాధ్యాత్మికసాధనల జేసికొనుటలోనే గడుపుచుండెడివారు. ఒక్కొక్కప్పుడు వారు వరుసగ రెండుమూడు రోజులు, మధ్య నేమాత్రము విచ్ఛిత్తి లేకుండగనే, భజనాభ్యాసములో నిమగ్నులయి యుండి, గదిలోనుండి యీవలకు గూడ వచ్చెడివారుకారు. పైకిచూచుటకు వారి శరీరము సన్నము గను సున్నితముగను ఉండెడిది. వారు తినెడి యాహారమంతయు రోజునకు 2 అవున్సులు ధాన్యపుదినుసులు మాత్రమే అయినను వారిశక్తి యత్యద్భుతముగ నుండెడిది. వారు తెంపులేకుండ గంటలకొలది అతిగంభీరకంఠధ్వనితో నుపన్యాసముల నిచ్చుచుండెడివారు. ఇంటికి వచ్చినవారి కుపన్యాసము లిచ్చుచుండుటయు గంటలకొలది యాధ్యాత్మిక సాధనలం జేసికొనుటయు ననెడి కార్యక్రమమునే వారు నిరంతరము సాగించుచుండెడివారు. వారి సంయోగము గలిగిన వారందఱును వారి యద్భుతాధ్యాత్మికసంపత్తును పవిత్రతను జూచి చకితులై పోవుచుండెడివారు. తమ యుపన్యాసములను విననచ్చిన వారిలో కొందఱు విశిష్టవ్యక్తులకు స్వామీజీమహరాజువారు ఆధ్యాత్మిక సాధనల నుపదేశమిచ్చెడివారు

13. క్రీ॥శ॥ 1861సం॥రం జనవరినెలలో అనగా, విక్రమశకము 1917 సం॥రం మాఘమాసములో వసంతపంచమీనుదినమున, తమ ప్రధానశిష్యులయిన రాయ్‌సాలిగ్రామ్‌సాహెబ్ (హుజూర్‌మహరాజ్) వారి యొక్కయు నితర భక్తులయొక్కయు ప్రార్థనపైన స్వామీజీమహరాజువారు ప్రజలందఱకును సత్సంగమును తెఱచివేసినట్లు మహానుగ్రహముతో ఘోషణ చేసిరి. హుజూర్‌మహరాజ్‌వారు ఈవిషయములో జేసిన ప్రార్థనను వ్యక్తపఱచుచు స్వామీజీమహరాజువారు ఒకశబ్దమును (సారబచన్ 33 వచనము 19 శబ్దము) రచించిరి. ఆ శబ్ద మీక్రిందిచరణముతో ప్రారంభమగును

సతగురుసే కరూం పుకారీ, సంతన మత కేజే జారీ

అర్థము: "సద్గురువు సంతమతమును నల్దెసల వ్యాపింపజేయు ననుగ్రహము చూపుదురుగాత యని వారి చరణములందు ప్రార్థించుచున్నాను" కాము జీవులందఱి యుద్ధారము నిర్విఘ్నముగ జరుగుచుండుటయు సమస్తజను

లును సద్గురువు నారాధించుటకు వచ్చుచుండుటయు చూచు మహానందము ననుభవింప గోరుచున్నామని వారీశబ్ద మండలి తరువాతి చరణములలో వ్రాసిరి. ఈ శబ్దములోనింకను, తామీమహాప్రార్థన నొక పసిపిల్లవానివలె గురుచరణములవద్ద నమ్రులమై జేయుచుంటిమని చెప్పి, అయినను ప్రభువున కట్లు జరిగించుట యిష్టములేనిచో తమ యాత్మనైన నధమము అంతర్ముఖముగ ద్రిప్పి యూర్ధ్వముగ నారోహింపజేసి తను కంతశ్శాంతి నొసంగుడని ప్రార్థన జేసిరి. ఈ యుభయప్రార్థనల నంగీకరించినచో స్వామీజీమహారాజువారు అట్టి మహానుగ్రహము చేసినందుకు సంతోషించెద మనియు, లేనియెడల, నీ రెండు ప్రార్థనలలో నొకదానినైన వారు అంగీకరింప ననుగ్రహింప వలయుననిగూడ ప్రార్థించిరి. ఎటులైననేగాక, భక్తు డెల్లపుడును భగవంతుని దివ్యేచ్ఛకు ప్రసన్నతతో నంగీకరించుననిగూడ చివర వ్రాసిరి.

14. ఇవ్విధముగ క్రీ॥శ॥ 1861 సం॥రం. జనవరి నెలలో వసంతపంచమీ సుదినమున రాధాస్వామీసత్సంగము స్థాపించబడెను. స్వామీజీమహారాజు వారిచే ఘోషణచేయబడిన మహాశుభసందేశము సార్‌బచన్ పద్యభాగములో ప్రారంభములో ప్రచురింపబడినది దానిని ఈక్రింద తర్జుమాజేసి పొందుపఱచుట సమంజసము.

---

## ఘోషణము.

## పరమపురుష సర్వసమర్థ రాధాస్వామి ప్రభువు జీవోద్ధారము చేయుకొఱకు సంత్‌సద్గురురూపమున నవతరించిరి.

(i) "అర్హతగల జీవులకు మాత్రమే యీ శుభసందేశమును జెప్పవలయును. జీవులు మహాదుఃఖసముద్రమునఁబడి అపభ్రమలపాలై యుండుట జూచి వారి యుద్ధారార్థమై పరమ పురుష సర్వసమర్థ రాధాస్వామీ ప్రభువు స్వయముగ సంత్ సద్గురురూపముఁ దాల్చి పృథ్వియం దవతరించి తమ పరమ ధామముయొక్క గూఢరహస్యమును మహానుగ్రహముతో వెల్లడిఁజేసి

సురత్ శబ్దమార్గము[1] ద్వారా ఆ మూలధామమును చేరుకొను విధమును బోధించుచున్నారు కావున జీవులు వారి పవిత్రచరణకమలములందు భక్తిశ్రద్ధల నుత్పన్నము చేసికొనవలయును.

(ii) "ఈ పంథలో చెప్పిన సాధనలను సరిగ నభ్యసించినచో మానవుడు తన మనస్సును నిర్జించగలడు. నిశ్చయముగ, కలియుగమున నీ మార్గముదప్ప మనస్సును నిర్మలము నిశ్చలము చేసి యూర్ధ్వమండలముల కారోహింపజేయుట కుపాయము మతెద్దియు గానరాదు. ప్రస్తుతము ప్రపంచములోని ప్రచలితమతము లన్నిఁటికిని గమ్యస్థానములు సంతమతములోని ప్రథమ స్థానము గాని లేక యధికాధికము ద్వితీయస్థానము గాని యైయున్నవి సురత్ శబ్దయోగమును యథావిధిగ నభ్యసించగలిగిన వాని యాత్మమనస్సులు సకల కల్మషముల నుండియు నిర్మలమై, చైతన్యశబ్దముతో సంయోగమునొంది, ప్రతిఘటమందు నుండునట్టి చిదాకాశముపైకి వెళ్ళి, భౌతికశరీరముయొక్క నవద్వారములను దాఁటి, అనగా పిండదేశమును విసర్జించి, బ్రహ్మాండదేశమును అనగా త్రికుటిస్థానమును జేరుకొనగలవు. ఆత్మ అచట మనస్సునుండి వేఱై యొంటరిగ పైకారోహించుచున్న మహాసున్న లోకముల యానందము ననుభవించి, సత్య అలఖ అగమలోకములలో క్రమముగ సత్యపురుషుని అలఖ పురుషుని అగమపురుషుని దర్శనము చేసికొనుచువెళ్ళి తిన్నగ రాధాస్వామీ వారి యొక్క నిజధామందు ప్రవేశించును. మొట్టమొదట నీస్థానమునుండియే ఆత్మ పతితమై త్రిలోకీలో (అనగా పిండబ్రహ్మాండదేశములలో) కాలుని జాలములో చిక్కువడిపోయెను. అది తిరిగి తనస్వస్థానము నీవిధముగనే జేరుకొనగలదు.

(iii) "సురత్ శబ్దమార్గసాధనల నభ్యాసముచేయు సాధకునికి, మార్గములోనే. బ్రహ్మ విష్ణు శివ లోకములు. శక్తిలోకము, కృష్ణలోకము, రామలోకము, బ్రహ్మపదము, పరబ్రహ్మపదము, జైనుల నిర్వాణపదము. క్రైస్తవుల ప్రభువు స్థానము, రూహుల్ ఖుద్స్,[2] మల్ కూత్,[3] జబరూత్,[4] లాహూత్[5] అని పేర్కొనబడు స్థానములును గనిపించును. సంతుల ప్రభావ

(1) సురత్ శబ్దమార్గమనగా ఆత్మకు చైతన్యశబ్దముతో సంయోగము గల్గించెడి యభ్యాసవిధానము.

(2) రూహుల్ ఖుద్స్ అనగా యేసుక్రీస్తుయొక్క మూలస్థానము (3) మల్ కూత్ అనగా పిండదేశము యొక్క పైమూడులోకములను (3) జబరూత్ అనగా విరాట్ స్థానము. అనగా జ్యోతినిరంజన స్థానము (4) లాహూత్ అనగా త్రికుటి అనగా బ్రహ్మస్థానము

ముచే నాత్మ యీస్థానముల యానందము ననుభవించుచు నిర్విఘ్నముగ తన నిజధామమును తిరిగి 'జేరుకొనగలదు'.

15. సారబచన్ గ్రంథములో నాభాగములోనే. అనగా, ప్రథమవచనము లోనే రెండు శబ్దములు గూడ గలవు. ఆ శబ్దములలోగూడ వారి మహాసందేశ మును చెప్పిరి. రాధాస్వామీ సత్సంగస్థాపనముయొక్క యద్భుతమహిమను ఈ శబ్దములలో వర్ణించినంత మహాప్రతిభాయమానముగ చెప్పుట యసా ధ్యముగావున నీ శబ్దములలోని గొన్ని చరణముల నీక్రింద తర్జుమాచేయుట యైనది :-

(i) 'రాధాస్వామీ ప్రభువు పృథ్వియందు మానవరూపమున నవత రించి సద్గురువుగ విరాజిల్లి జీవులను అనాదినిద్రనుండి మేల్కొల్పుచున్నారు.' (I-ii i).

(ii) 'ఓ మిత్రమా, ఆ పురాణపురుషుడు మానవరూపమున నవతరిం చిరి. మన మందఱము గలిసివెళ్ళి వారి నారాధించుదము, రండు. వారు అలఖ అగమ లోకముల నిగూఢరహస్యములను ప్రకటించి చెప్పుచున్నారు. వారు తమ నిజనామము రాధాస్వామీ యని ఘోషణచేసి చెప్పుచున్నారు.' (I-i-1&2)-

పిమ్మట నీ క్రిందివిధముగ చెప్పబడినది

(iii) 'వా రందఱకును భక్తిప్రేమలభండారమును తెఱచివైచిరి. కోటానకోటి జీవుల యుద్ధారము జరిగిపోవుచున్నది. నల్దెసల మహాకోలాహ లము వ్యాపించి, కాలుని దేశమును (అనగా మాయిక దేశమును) రాధా స్వామీ దయాళురు నిర్జీవముగ జేయదల్చిరో యనునట్లు కనిపించుచున్నది. ఏలనన, నా దయామయుడు, దీనత్వముతో తమ శరణుఁజొచ్చిన జీవు లెల్లరకు మహాదయతో నుద్ధారము ననుగ్రహించు దివ్యేచ్ఛను ధరించిరి.'(I i-22-24).

(iv) 'వారికి జీవులయెడల మహాదయ యుప్పొంగి యీక్రిందివిధమున బాహాటముగ ఘోషణ చేయుచున్నారు. 'ఓ యభాగ్యజీవులారా, నామాట వినుడు, వినుడు. నేను మీకు మీనష్టభాగ్యమును తిరిగి చేకూర్చెదను. కావున మీరు త్వరపడుడు. నాసంయోగము నెవ్విధముననైన చేకూర్చుకొని తొంద రగ నన్ను శరణుఁజొచ్చుడు. ఇట్టి యపూర్వసావకాశము మీకు తిరిగి లభింప నేరదు. కావున నిప్పుడే మీరు మీజన్మసాఫల్యమును సెఱవేరుచుకొనుడు.' (I-i-39-42).

16. ఇవ్విధమగు శుభప్రకటనము మనకు, పురాతనకాలమునుండియు ప్రచలితమగుచువచ్చిన మతముల చరిత్రలో నెచ్చటను గానరాదు. ఇంతియగాదు. జీవులందఱకు నిశ్శేషముగ నుద్ధారముజేకూర్చి మాయికదేశమంతయు నిర్జనముగ జేయబడుననిగూడ నేమతమునందును చెప్పబడలేదు.

17. సత్సంగమును 1861వ సంవత్సరములో ప్రజాసామాన్యమునకు తెఱచినపిమ్మట, ప్రతిదినము నుదయాస్తమయసమయములందేగాక నితరసమయములందుగూడ సత్సంగమును చేయుచుండెడివారు. సాయంకాలసత్సంగములో సామాన్యముగ నర్ధరాత్రివఱకును, ఒక్కొక్కప్పుడు తెల్లవాఱువేళవఱకునుగూడ, స్వామీజీమహారాజువా రమృతవచనములను సెలవిచ్చుచు, పవిత్రగ్రంథపాఠమును చేయించుచు నుండెడివారు. ఇవ్విధముగ స్వామీజీమహారాజువారు తమవచనామృతధారలతో సత్సంగమును పదునేడున్నర సంవత్సరములకాలము జరిపించిరి.

18. స్వామీజీమహారాజువారిని కలిసికొని వారితో మతవిషయములను చర్చించుటకుగాను, ప్రచలితమతసంఘములవారు తఱచుగ వచ్చుచుండెడివారు. కాని వారందఱును వీరి వచనామృతధారలను గ్రోలినపిదప సంతృప్తులై వినమ్రులగుచు వెడలిపోయెడివారు. వారిలో చాలమంది యుపదేశము నడిగి పుచ్చుకొని, నియమముగ సత్సంగమును ఆధ్యాత్మికసాధనలను జేసికొనుచు బహులాభాన్వితులైరి.

19. కాశీవాస్తవ్యుడగు నొకమహావిద్వాంసుడు రాధాస్వామీమతమును ఖండించవలయు నను తలంపుతో స్వామీజీమహారాజువారి సత్సంగమునకు వచ్చి వారితో చర్చ సేయఁదొడగెను. అట్లు మతసంబంధమైన వివిధవిషయములను గుఱించి, మధ్యమధ్య స్వల్పవిరామములతో, నేడహోరాత్రములు చర్చ జరిగెను. చిట్టచివరకు శిఖ్ఖుల గ్రంథసాహబ్[1] నుండి శబ్దపాఠమును చేయవలసినదని స్వామీజీమహారాజువారు సెలవిచ్చిరి. పాఠమయినపిదప పఠించిన మూలమున కర్థము చెప్పుడని స్వామీజీమహారాజువారు ఆవిద్వాం

---

(1) గ్రంథసాహబ్ శిఖ్ఖులమతములో నొకగొప్పప్రామాణికగ్రంథము అందులో పదిమంది శిఖ్ఖుగురువులయొక్కయు నితరసంతమహాత్ములయొక్కయు గద్యపద్యరూపమగు రచనలు గురుముఖి భాషలో నున్నవి. సారబచన్ గ్రంథ మప్పటి కింకను రచించబడనందునను, ప్రచురింపబడనందునను, సత్సంగములో స్వామీజీమహారాజువారు శబ్దపాఠమును గ్రంథసాహబ్‌నుండియే చేయించెడివారు.

సుని గోరిరి. ఆపండితుడు తనకు చేతగాదని చెప్పి స్వామీజీమహారాజువారినే దానియర్థము చెప్పవలసినదని ప్రార్థించెను. స్వామీజీమహారాజువారు అంతట నామూలమున కతిహృదయంగమమగునట్లు అర్థముజెప్పి వ్యాఖ్యచేయగా ఆపండితుడు చకితుడై తా నెన్నడును అట్టి గంభీరవిమర్శపూరితవ్యాఖ్యను వినియుండలేదని యనెను. అందువలన నతనిమీద గొప్పప్రభావము గలిగి అతడీ మతములో నుపదేశమునుగోరెను.

20. వాస్తవముగ నెట్టివారును స్వామీజీమహారాజువారి దైవభక్తిపారవశ్యముచే ప్రభావితులుగాకుండ తప్పిపోనేరరనియు, వారివీధిని పోవువారందఱును వారిమహిమను గానముచేయఁదొడఁగుదురనియు నొకవదంతి వ్యాపించెను. అందుచే నంధవిశ్వాసులు పన్నీగల్లీగుండ పోవుటయే తప్పించుకొనుట మొదలిడిరి.

21. భక్తులసంఖ్య పెరిగినకొలఁది, పన్నీగల్లీలో ముష్టివాండ్రెక్కువగ దిరుగుట మొదలిడినందున, స్వామీజీమహారాజువారు పట్టణములోని కోలాహలమునుండి దూరముగ నేదేని ప్రశాంతస్థలమునకు వెళ్ళుటకు నిశ్చయించిరి. అందుకు తగిన స్థలము నన్వేషించుటకై వా రొకపల్లకీ నెక్కి పట్టణమున కావల నెవ్వేఱుదిశలకు వెళ్ళిచూచిరి. చివరకు వారు పట్టణమున కావల మూడుమైళ్ళదూరములోనున్న స్థలము నొకదానిని నిశ్చయించి, యచ్చట "రాధాస్వామీబాగ్"ను స్థాపించిరి. దానినే ప్రస్తుతము "స్వామీబాగ్" అని పేర్కొనుచున్నారు. ప్రారంభమున స్వామీజీమహారాజువారు స్వామీబాగునకు ప్రత్యుదయమును వచ్చి, తిరిగి సాయంకాలమునకు పన్నీగల్లీ వెళ్ళుచుండెడివారు. తరువాత నచ్చట సాధువులకొఱకు కొన్ని గదులను, ఆధ్యాత్మికసాధనలను జేసికొనుటకు "భజన్ ఘర్" అను నొకగదిని గట్టించి ఫలపుష్పములతోట నొకదానినిగూడ నేర్పాటుచేసిన పిదప, స్వామీజీమహారాజువారు పట్టణమునుండి తమ నివాస మీస్థలమునకు మార్చివేసిరి. వా రిచ్చట నివసించుకాలమున ప్రత్యుదయమును బహిర్దేశమునకు వెళ్ళి తిరిగి వచ్చునపుడు కాలకృత్యములను దీర్చుకొనుటకై స్వామీబాగులో తమనివాసమునకు కొలఁదిదూరములో నున్నట్టి యొక మొగలాయీలకాలము నాటి నూతిగోడమీద తఱుచు కూర్చుండెడివారు. అట్టిసమయములలో హుజూర్ మహారాజువా రా నూతినుండి యుదకమును స్వయముగ తోడి

స్వామీజీమహారాజవారి కందిచ్చెడివారు. ఆ బావి ప్రస్తుతము దయా ల్బాగులో (కాలేజీకి దగ్గఱగ) నున్నది. స్వామీజీమహారాజవారు సత్సంగుల మహాపట్టణ మొకటి యీ నూతిచుట్టునున్న ప్రదేశములో నిర్మాణము కాగలదని యొకసారి సెలవిచ్చిరని చెప్పుదురు.

22 స్వామీబాగులో స్వామీజీమహారాజవారు నివసించుగదులకు సమీపమున నొక యున్నతప్రదేశ ముండెను. వారి నిర్యాణానంతర మచ్చటనే హుజూర్ మహారాజవారు 1879 సం॥రములో తెల్ల యిసుక ఱాతితో నొక చిన్నభవనమును గట్టించి స్వామీజీమహారాజవారి పవిత్రరజము నందుంచి సమాధిచేసిరి. కొద్దికాలముననే దాని సమీపమున వారి భక్తులు నివాస ముండుట కొక చిన్నవలస యేర్పడెను. తరువాత 1904 సం॥రములో, మహారాజసాహబ్ వారికి, సమాధియుండెడి హాలు (Hall) యొక్క వైశాల్యము 68′×68′ ఉండవలెనని తోచినందున, వారు సమాధిమాత్రి మట్టేయుంచి శేషించిన భవనమునంతను విప్పించివేసిరి. అప్పుడు వారు, ఈసమాధిభవనము జగమున గల మహాద్భుతములలో నొకటిగ నెప్పటికైన పరిగణింపబడు విధమున, దాని కొక క్రొత్తనమూనాను తయారుచేయించిరి. దాని నిర్మాణ మింకను అసంపూర్తిగనున్నను, దాని శిల్పవైచిత్ర్యమునకును నిర్మాణశోభకు నది జగత్ప్రఖ్యాతి గాంచెను. అందుచేతనే మనదేశీయులును అన్యదేశీయులునుగూడ తండోపతండములుగ దానిని జూచి యానందించుటకై ప్రతిదినమును వచ్చుచున్నారు.

23. స్వామీజీమహారాజవా రప్పుడప్పుడు శబ్దముల నాశుధారగ రచించి చెప్పుచుండెడివారు. సామాన్యముగ జీవన్‌లాల్ అను భక్తుడొకరును, ఒక్కొకప్పుడు హుజూర్ మహారాజవారును వానిని వ్రాయుచుండెడివారు. ఈశబ్దముల నన్నిటిని గలిపి "సారబచన్" అనుపేరుతో నొక గ్రంథముగ జేసి, దాని హస్తలిఖితప్రతులను ప్రతి యొకటికి పదిరూప్యములు తీసికొని విక్రయించుచుండిరి. ఇందుగల నాల్గు వందల అరువది మూడు శబ్దములును, నలువదిరెండు వచనములుగ, వేర్వేఱు శీర్షికలక్రింద విభజించబడినవి. ఈ పుస్తకము హుజూర్ మహారాజవారి కాలములో 1884 సం॥రం॥లో మొట్ట మొదట నచ్చొత్తింపబడినది.

అటులనే స్వామీజీమహారాజువారి యమృతవచనములలో కొన్ని భాగములను వ్రాసి, వాని నొక గ్రంథముగజేసి, హుజూర్ మహారాజువారు వ్రాసిన యుపోద్ఘాతమును గూడ దానికి జేర్చి, దానిని గూడ 'సారబచన్' అను నామధేయముతో 1884 సం।రం।లోనే యచ్చొత్తించిరి.

24. ఈ గ్రంథములో హిందీ, గురుముఖీ, పంజాబీ, ఉర్దూ, పర్షియన్, అరబిక్ భాషల మాటలు ప్రయోగించబడినవి. ఉత్తరహిందూదేశములోని ప్రజలకు, విద్యావంతులయినను గాకపోయిననుగూడ, నీ భాష సులభముగ నర్థమగును. కాని అందలి శైలియు పదగుంభనమును, ఉపమానోత్ప్రేక్షా ద్యలంకారములతో నొప్పారుచు మహాశోభాయమానముగ నుండును.

25. సారబచన్‌లోని శబ్దములు మహామనోహరముగనుండి, భక్తుని చిత్తము నేకాగ్రముచేసి యాత్మ నూర్ధ్వమండలముల కారోహింపజేయుటకు సహకరించును. భగవంతునియొక్కయు సద్గురువుయొక్కయు దర్శనార్థమై విరహవేదనను ప్రకటనచేయు శబ్దములును, ఆరతిశబ్దములును, రసపూరితములై, భక్తులహృదయముల నోలలాడించును. ఈశబ్దములలో నాయా రసములకు సంబంధించిన సకలవిషయములును పెంపొందునట్లు, సమగ్రముగ నతిరమ్యమనోహరరీతిని వర్ణించబడినవి. గద్యరూపమైన గ్రంథములో పరమార్థితనభక్తిని పెంపొందించుకొనుచు భగవత్కృపను సంపాదించుకొనుట కెట్లు ప్రవర్తింపవలయునో బోధపఱచిరి

26. స్వామీజీమహారాజువారిచే స్థాపించబడిన మతముయొక్క మూల సిద్ధాంతములను ఈక్రిందివిధముగ క్రోడీకరించవచ్చును:—

మానవజీవితముయొక్క యాదర్శము భగవంతుని నిజధామమును జేరుకొనుటయే. జీవుని, శబ్దరూపముగ నాంతిర్యమున గోచరించునట్టి చైతన్యధారసహాయముతో, మానవశరీరములో తా నిపుడున్న స్థానమునుండి నిర్మల చైతన్యధామమున కారోహింపజేయుటచే నీ యాదర్శమును సాధించవచ్చును. ఆ నిర్మలచైతన్యధామమే పరిపూర్ణోద్ధారస్థానము. పరమపురుషునితో నిరంతర సంబంధము గల సద్గురువువలన స్వయముగగాని, వారి యాజ్ఞానుసార మితరుల వలనగాని, యాధ్యాత్మికసాధనల రహస్యము నుపదేశము నొందవచ్చును.

ఆధ్యాత్మికసాధనలు మూడు. అవి యెవ్వి యనగా,

(i) మానవశరీరములో ఆత్మస్థానమువద్ద పవిత్రనామమును స్మరణ చేయుట.

(ii) ఆ యాత్మస్థానమువద్దనే సంత్ సద్గురువుయొక్క పవిత్రస్వరూప మును ధ్యానముచేయుట.

(iii) శబ్దాభ్యాసము, అనగా ఆత్మస్థానమువద్ద లక్ష్యము నేకాగ్రము జేసి సచ్చిదానంద తేజోరూపమగు చైతన్యశక్తితో అనగా శబ్దధారతో నాంతర్యమున సంయోగ మేర్పఱచుకొనుట.

27. తప్పనిసరి యగు మఱికొన్ని ప్రధానకృత్యములు·—

(i) సంత్ సద్గురు సేవ. సంత్ సద్గురువు నాజ్ఞమీాద జేయునట్టి మానవ సేవగూడ నిందులో జేరును. పరమార్థి ఈ సేవ జేసి సదురుని దయాకటాక్ష ములను, ఆంతర్యసహాయమును సంపాదించుకొనవలయును

(ii)సత్సంగము, అనగా, సంత్ సద్గురువుని యధ్యక్షతక్రింద జరిపింపబడు సామాజిక దైవప్రార్థన. సత్సంగములో, పవిత్రగ్రంథపారమును జేయుచుం దురు, సద్గురువు అమృతవచనములను సెలవిచ్చుచుందురు, సంత్ సద్గురు సాంగత్యమహాలాభముగూడ జేకూరును.

28 రాధాస్వామీామతములో కర్మకాండ, బాహ్యాచారములు, మొద లగు నవెవ్వియు విధింపబడలేదు. జాతివర్ణములమూలమున పరస్పర భేదభావ ములుగూడ నీమతములో పాటింపబడవు. ఈ మతములోని నీతిశాస్త్రమం తయు నీ క్రింది సూత్రములలో నిమిడియున్నది:-

(i) "నీ వితరులు నీయెడల నెట్లు ప్రవర్తింపవలెనని గోరుదువో నీ వితరులయెడల నట్లే ప్రవర్తించవలెను."

(ii) భగవంతుని సన్నిధానమునకు గొనిపోవునట్టి యూహాలు పనులును శుభకర్మలు.

(iii) భగవంతుని వద్దనుండి దూరముజేయునట్టి కృత్యములు పాపకర్మలు.

29. పాటించవలసిన నియమములు ఈక్రింద పొందపఱచినవి మాత్రమే.

(i) ఈ మతమున నుపదేశము గోరువారు మత్స్యమాంసములను, గ్రుడ్లు మొదలగు జంతుసంబంధమైన యాహారమును విసర్జించవలయును.

(ii) మద్యము మొదలగు మత్తుపదారముల నన్నింటిని విసర్జించ వలయును.

(iii) రాధాస్వామీనామము పరమపితయొక్క నిజనామమని దృఢ విశ్వాసము గలిగియుండవలెను.

30. ఇచ్చట నింకొక విషయముఁ జెప్పవలసియున్నది. స్వామీజీమహా రాజువారి జీవనచరిత్రలో సేఠ్ ప్రతాపసింగుగారు వ్రాసినదానినిబట్టి, బ్యాస్ సత్సంగమునకు చెందిన కొందఱు రాధాస్వామీమతానుయాయులు, రాధా స్వామీనామము కేవలము హుజూర్ మహారాజువారు తెచ్చిపెట్టిన యొక క్రొత్తమార్పనియు, స్వామీజీమహారాజువారు, 'నిరంజన్'[1] 'ఓం'[1] 'రారంగ్',[1] 'సోహాంగ్',[1] 'సత్',[1] అనెడి పంచశబ్దములను ముఖ్యమని చెప్పుచు "సత్ నామ్"ను మాత్రమే స్మరణచేయవలసినదిగ నుపదేశించు చుండిరనియు, నొక యపభ్రమలో పడియున్నారు. వాస్తవముగ, ప్రారంభ ములో స్వామీజీమహారాజువారు "సత్ నామ్" నే స్మరణచేయవలసినదిగ నుపదేశ మిచ్చెడివారు. అందుకు విస్పష్టకారణమేమనగా, వారి కుటుంబము వారును వారినద్ద ప్రారంభములో చేరిన శిష్యులును గురునానక్ వారి మత స్థులు గాని, శిఖ్ఖుమతగ్రంథములలో "సతనామ్"ను గుఱించి పదేపదే చెప్పబడియుండుటచే నా నామమందెక్కువ విశ్వాసముగలవారుగాని అయి యుండిరి. మొదటినుండియు నొక ప్రత్యేకనామమందు విశ్వాస మేర్పడి యున్నవారికి ఆ నామము నుచ్చరించుమని బోధచేయుట యెక్కువ సుల భముగదా. ఇంతేగాక, ప్రారంభదశలో నుత్తమలోకములకు చెందిన యే పవిత్రనామమయినను, చిత్తైకాగ్రతను గలుగజేసి యాత్మ నూర్ధ్వముగ నారో హింపజేయుటలో సమానప్రభావమునే గల్గియుండు ననువిషయముగూడ నీ సందర్భములో జ్ఞాపకముంచుకొనవలసియున్నది. అందుచే 'మొదటలో'

(1) ఈ నామములు, వరుసగ, సహస్రదళకమలము, త్రికుటి, సున్న, భఁవర్‌గుప సత్యలోకము లలో నిరంతరము ప్రతిధ్వనించుచుండును.

"సత్తనామ్" నుచ్చరించినందువలన పరమార్థికి రాధాస్వామీనామోచ్చారణవలన గలిగెడిలాభమే గలుగునుగాని, యెవ్విధముగను నష్టము వాటిల్లదు. ఈ కారణముచే, స్వామీజీమహారాజువారు 1861 సం॥రములో రాధాస్వామీ సత్సంగమును స్థాపించినపిదప కొంతకాలమ్ము గడచినపిమ్మటనే, జనులకు రాధాస్వామీనామస్మరణము నుపదేశింపప్రారంభించిరి. కాని దీనినిబట్టి స్వామీజీమహారాజువారు మొదటలో రాధాస్వామీనామము పరమపురుషుని నిజనామమని సెలవివ్వలేదని చెప్పుటకు వీలులేదు.

31. అదియునుగాక నెవరయినను సారబచన్ పద్యభాగమును చదివిన యెడల, అందు ప్రతిశబ్దములో రాధాస్వామీనామ ముండుటయు, కొన్నిశబ్దములలో ఆనామము ప్రతిపంక్తిలో నొకటిరెండుసారులుగూడ వ్రాయబడియుండుటయు, 'సతనామ్', అట్లుగాక, చాలయరుదుగ నుపయోగింపబడుటయు గమనించగలరు. అందుచే సారబచన్ పద్యభాగమును ఆమూలాగ్రముగ జదివిననుగూడ, నెట్టిచదువరికిని ఆగ్రంథములో 'రాధాస్వామీ' నామమునేగాని మఱొక నామమును బోధించినట్లు స్ఫురింపనేరదు.

32. పాఠకులకీ సందర్భములో మఱొక యాహ్లాదకరవిషయము నిచట జెప్పవలసియున్నది. రాధాస్వామీమతముయొక్క పరమపూజ్య పంచమ సద్గురువులగు హుజూర్‌సాహబ్జీమహారాజువారు 1932 సం॥రం॥ డిశంబరు నెలలో బ్యాస్ సత్సంగనాయకుడగు కీ॥ శే॥ సర్దార్‌సావన్‌సింగుగారిచే తమ శిష్యులకు "సతనామ్"కు బదులుగ 'రాధాస్వామీ'నామమునే యుపదేశించు నట్లంగీకరింపజేసి, సత్సంగవార్తాపత్రికలలో వారి యుభయుల సంతకములతో నొక యుభయసమ్మతమైన బహిరంగప్రకటనమును ప్రచురింపజేసిరి ఆప్రకటనలో బ్యాస్‌సత్సంగులుగూడ, దయాల్బాగ్‌సత్సంగులు మొదటినుండియు చేయుచున్నట్లే, రాధాస్వామీపవిత్రనామమును పరమపితయొక్క నిజనామముగ నంగీకరించెదరనియు, వారలకుగూడ దయాల్బాగుసంత్సంగులకు వలెనే రాధాస్వామీనామమే యుపదేశసమయమున, జెప్పబడుననియు నుదహరించిరి.

33. స్వామీజీమహారాజువారి విశిష్టభక్తులలో నొకరైన లాలాజీవన్‌లాల్‌గారు సత్సంగము జరుపుట కేర్పాట్లుచేసెడివారు. జీవన్‌లాల్‌యొక్క తండ్రిగారు, హుజూర్‌మహారాజువారి సహాయముతో నతని కేదైన యుద్యోగమును సంపాదింపదలంచి అతనిని స్వామీజీమహారాజువారివద్దకు తీసికొనివచ్చిరి.

కాని జీవన్‌లాల్ స్వామీజీమహారాజువారి యమృతవచనములను వినినపిదప నా వచనవములచే, నీ ప్రపంచమునుండి యతడుపరామచిత్తుడై పోవునంతగ పరిభావితుడై తిరిగి యింటికి పోకుండ సత్సంగములోనే యుండిపోయెను. స్వామీబాగ్, రాధాబాగుల పాలనపోషణలకై యతడు నిస్స్వార్థముగ పాటు పడుచు, నిరంతరము సాయంకాలసత్సంగమునకు పన్నీగల్లీలో హాజరగుచు, సద్గురుచరణకమలమువద్ద సుమారు పదునైదు సంవత్సరములు సేవచేసి కొనెను. స్వామీజీమహారాజువారు ఆశుధారగ శబ్దములను జెప్పు దివ్యేచ్ఛ ధరించినపుడు ఆ శబ్దముల నీయన వ్రాయుచుండెడివారు. స్వామీజీమహా రాజువారి యుత్తరప్రత్యుత్తరముల విషయముగూడ నీయన చూచుచుం డెడివారు. సత్సంగములో సాధువులు చాలమంది యుండియున్నందున వారల కేర్పాట్లవిషయముగూడ నీయన చూడవలసివచ్చెను.

34. అటులనే స్వామీజీమహారాజువారి పూజ్యధర్మపత్ని శ్రీమతి నారాయణదేవిగారు సత్సంగములో స్త్రీల కేర్పాట్లు కనిపెట్టుచు, ప్రతిదిన మును నలువది యేబదిమంది సాధువులకు భోజనమును గూడ తయారు చేసెడివారు ఆమెకు స్వామీజీమహారాజువారు 'రాధాజీ' యని నామకర ణము చేసిరి.

రాధాజీగారు హిందీభాషను తమ అత్తగారి యొద్దనుండి నేర్చుకొని ఆధ్యాత్మికాభివృద్ధికి సంబంధించిన గూఢతమవిషయములను స్వామీజీమహా రాజువారివలన నుపదేశము నొందిరి. స్వామీజీమహారాజువారి వచనామృత ధార లామెపై గంభీరప్రభావము గలుగజేయుటచే నామె మహాశ్రద్ధాళువగు భక్తురా లయ్యెను. ఆమె యావజ్జీవము నిరుపేదలకును, ముఖ్యముగ స్త్రీల కును సేవచేయుచు దానధర్మములక్రింద పెద్దపెద్దమొత్తములను వెచ్చించు చుండిరి.

35. హుజూర్ మహారాజువారు సత్సంగములో నున్నపుడు సత్సంగము యొక్క యేర్పాట్లను వారుగూడ గమనించుచుండెడివారు. తమ యుద్యోగ సందర్భములో వా రాగ్రాపట్టణమునకు దూరముగ నుండవలసివచ్చి నపుడు గూడ సత్సంగముకొఱకై వీలగునంత తఱచుగ నాగ్రాకు వచ్చుచు సాధ్య మయినంతకాల మిచ్చటనే ఆగి వెడలుచుండెడివారు. వారు రాలేనపుడు స్వామీజీమహారాజువారికి ఉత్తరములు వ్రాయుచుండెడివారు. స్వామీజీ

మహారాజువారును అందులకు సమాధానముల నంపుచుండెడివారు. ఒకసారి హుజూర్ మహారాజువారు వరుసగ నెన్నియో యుత్తరములను వ్రాసినను స్వామీజీమహారాజువా రందుకు సమాధాన మేమియు వ్రాయలేదు. ఆ ప్రకారము కొన్ని యుత్తరములు వచ్చిన పిదప జీవన్‌లాల్ గారు స్వామీజీ మహారాజువారి నేదైన సమాధానము నంపవలసినదని ప్రార్థించిరి. అప్పుడు స్వామీజీమహారాజువా రీక్రిందిశబ్దమును సమాధానముగ చెప్పివ్రాయించిరి:-

'ధీరజ్ ధరో బచన్ గురు గహో'

అర్థము : 'ఓరిమి పట్టి యుండుము, గురువచనమును నమ్మియుండుము'

36. స్వామీజీమహారాజువారు పన్నిగల్లీలో నివసించుచున్న రోజులలోనే స్వామీదయానందసరస్వతులవారు[1] వారి సత్సంగమునకు వచ్చుట జరిగెను. వారు స్వామీజీమహారాజువారిని కొన్నిప్రశ్నలు వేసి వారితో కొంత చర్చ జరిపిరి. స్వామీజీమహారాజువా రిచ్చిన సమాధానములకు వారు పూర్తిగ తృప్తిపొంది యుపదేశ మిమ్మని కోరిన పిదప వారి కుపదేశ మీయబడెను. కాని వారంతకుముందే హిందూసంఘములోని విగ్రహారాధన మొదలగు దురాచారములను నిర్మూలించుకార్యమునకును, ఈదేశములో ప్రచారము సల్పుచున్న క్రైస్తవులయొక్కయు తదితరులయొక్కయు మతప్రచారకసంఘములను ప్రతిఘటించుకార్యమునకును పూనుకొనియున్నందున, తా నా కార్యములను యథాప్రకారము సాగించుచుండుటకు స్వామీజీమహారాజువారినుండి యనుజ్ఞనొంది తా నా కార్యము సఫలము గావించుకొనిన పిదప తిరిగి వచ్చెదనని చెప్పి వెడలిపోయిరి. శ్రీదయానందసరస్వతి సత్సంగాభివృద్ధికి అనుకూలముగ నుండునట్లు క్షేత్రమును శుద్ధముజేసి సిద్ధము జేయుదురని, ఆయన వెడలినపిమ్మట, సత్సంగములో స్వామీజీమహారాజువారు సెలవిచ్చిరి సత్యార్థప్రకాశ[2]లో స్వామీదయానందసరస్వతులవారు ఇతరమతము లన్నిటిని ఖండించిరి గాని రాధాస్వామీమతము నెట్టి ఛిద్రాన్వేషణ జేయకుండుట కిదియు కారణమని చెప్పవచ్చును

---

(1) ఆర్యసమాజ మనబడు సంఘపునరుద్ధరణప్రచారమునకు స్వామీదయానందులవారు స్థాపకులు. వారు క్రీ॥శ॥ 1824 సంవత్సరమున గుజరాత్ దేశములో పుట్టి 1883 సం॥రములో అజ్మీరులో కాలధర్మమునొందిరి. (2) 'సత్యార్థప్రకాశ' అను గ్రంథమును స్వామీదయానందసరస్వతులవారు వ్రాసిరి. వారి గ్రంథములో హిందూదేశములో నా కాలముననున్న మతముల నించుమించు అన్నిటిని ఖండించి. ఆర్యసమాజసిద్ధాంతములను విశదీకరించిరి.

37. సత్సంగ మివ్విధముగ ప్రతిదినము జరుగుచు, నన్ని జాతులవారును వర్ణములవారును సత్సంగమునకు వచ్చి స్వామీజీమహారాజువారి వచనామృతమును గ్రోలుచుండెడివారు. అందుకు ఫలితముగ స్వామీజీమహారాజువారి కాలములో 4000మందికిపైగా రాధాస్వామీమతములో నుపదేశమును తీసికొనిరి. సన్న్యాసము స్వీకరించిన సాధువులు 200మంది స్వామీబాగ్‌లో భక్తితో సేవచేసికొనుచు నివసించుచుండిరి.

## కొన్ని విచిత్రానుభవములు, సంఘటనలును

38. రాధాస్వామీమతములో భక్తులు జిజ్ఞాసువులును, విచిత్రములను చూడగోరుటయు, ఒక సంతమహాత్ముని యాధ్యాత్మికొన్నత్యమునుగాని ఒక మతముయొక్క మహిమాధిక్యమునుగాని విచిత్రములపై నాధారపడి నిర్ణయించుటయు పరమనిషిద్ధము. ఏలనన, విచిత్రములమూలమున నేర్పడువిశ్వాసము దృఢముగను చిరస్థాయిగను ఉండజాలదు యథార్థమైన మతమునకు నిజప్రమాణము ఆత్మ నాంతర్యమున నూర్ధ్వమండలముల కారోహింపజేయుటయే. వాస్తవమగు పరమార్థికి తన జీవితములో నన్నివిషయములలో సద్భుతములే గన్పట్టుచుండును. నిజమగు పరమార్థి కెల్లపుడును తన కొకయమానుషశక్తి మార్గప్రదర్శనము జేయుచు కార్యసాఫల్యము చేకూర్చుచున్నట్లు గోచరించుచుండును. అవే యనుభవములు పామరజనులకు ఆకస్మికసంఘటనలుగనో, ప్రకృతికార్యములుగనో కనిపించును.

39. స్వామీజీమహారాజువారి భక్తుల విచిత్రానుభవములను గొన్నిటిని పరమార్థుల లాభముకొఱకై క్రింద పొందుపఱచుట యైనది –

(1) స్వామీజీమహారాజువారి భక్తురాలగు నొక సింధుదేశపుస్త్రీ యొక్క బంధువు లామెను జూచుటకై ఆగ్రా వచ్చి, ఆమెను తనకాలమంతయు సత్సంగములో వ్యర్థముగ పాడుచేసికొనుచున్నదని చీవాట్లుపెట్టి తీర్థయాత్రలు చేసికొనుమని యామెకు బోధించిరి. ఆమె యీ విషయమును స్వామీజీమహారాజువారితో విన్నవించుకొని, తన కాంతర్యదర్శనము నిప్పించుడని వారిని ప్రార్థించెను. అంతట వా రామెను తమ సముఖమందు భజనాభ్యాసమునకై కూర్చుండుమని చెప్పిరి. అపు డామెకు చైతన్యము విపరీతముగ నాంతర్యమున కాకర్షింపబడి పోయినందున, నామె సహింపలేక తనను క్రిందికి దింపివేయుడని ప్రార్థించుచు బిగ్గరగ నేడ్వసాగెను. పిమ్మట నామె

కొంతకాలమువఱకు స్పృహ లేకుండ నుండిపోయెను. ఈ విషయ మంతయు నామె బంధుగులు చూచినందున, వారు మిక్కిలి ప్రభావితులై వెంటనే రాధాస్వామీమతములో నుపదేశము నొందిరి.

(ii) ఆగ్రాలో ఆనందగిరి యను పేరుగల సాధు వొక రుండెను. ఆయనకు స్వామీజీమహారాజువారియం దసూయ గలిగి వారి సత్సంగమునకు భంగము గ్కలుగజేయుటకై ఆగ్రా సిటీకొత్వాలుతో[1] కలిసి యొకకుట్రచేసెను. ఆ కొత్వాలు స్వామీజీమహారాజువారితో నెవ్వరను వారి సత్సంగమునకు రానీయవద్దని చెప్పెను. స్వయముగ నట్లు నిషేధించుట స్వామీజీమహారాజు వారి కిష్టములేనందున, వా రా కొత్వాలునే తన కట్లుచేయుట యుక్తమని తోచినచో తగుచర్య తీసికొనుమని సెలవిచ్చిరి అంతట నాకొత్వాలు పన్నీగల్లీలో వారి గుమ్మమువద్ద నొక పోలీసును కాపలా వేసెను. అందుచే నా గుమ్మముద్వారా లోనికి పోవుటకు వీలులేనందున భక్తులు రెండుమూడుదినములు పరిసరగృహముల పైకప్పులమీదనుండి వెళ్ళి దర్శనమును జేసికొనుచుండిరి. ఇంతలో నా కొత్వా లేదో ఆపదలో చిక్కుకొనినందున నతడా పోలీసుకాపలాను తీసివేయువలసివచ్చెను. తిరిగి భక్తులు యథాప్రకారము సత్సంగమునకు వెళ్ళుటప్రారంభించిరి. ఆనందగిరిగూడ నిచ్చోట చెప్పదగనట్టి గర్హణీయ కృత్యములో చిక్కుకొనినందున నపకీర్తిపాలై ఆగ్రాపట్టణమునువిడిచి వెళ్ళిపోయెను.

(iii) స్వామీజీమహారాజువారి కులీనులు కొందఱు తమ కులములోని స్త్రీపురుషులు అధికముగ రాధాస్వామీమతములో చేరుచుండుట చూచి సహించలేక, స్వామీజీమహారాజువారిని వారి ఖత్రీకులభక్తులను సంఘబహిష్కారము చేయుటకు నిశ్చయించిరి. వా రందుకొఱకు కొందఱు బ్రాహ్మణులతో నేకమయి తమ నాయకులలో నొకరి యింటివద్ద నందఱును సమావేశ మగుటకు నిశ్చయించి స్వామీజీమహారాజువారి నచ్చటకు రావలసినదని కబు రంపించిరి. స్వామీజీమహారాజువారు తమస్థానే తమ తమ్ములు సేఠ్ ప్రతాపసింగుగారిని వెళ్ళవలసినదని నియమించిరి. సేరుగారికి కొంత యధైర్యముగ నుండుటచే స్వామీజీమహారాజువారు ఆయన కాంతర్యముననుత్తేజనసంరక్షణలను ఇచ్చెదమని ధైర్యము జెప్పి ఆయనను ఆసమావేశమునకు పంపిరి. ఆ సమావేశములో రెండు గంటలసేపు వాగ్వాదము జరిగి,

(1) 'సిటీకొత్వాలు' అనగా పట్టణములోని పోలీసు ఇన్‌స్పెక్టరు

సంఘీయులు చేసిన దోషారోపణలకు సేఠుగారు పూర్తిగ తృప్తికరమగునట్టియు నిరాక్షేప మగునట్టియు సమాధానములు చెప్పినందున నందఱును నిరుత్తరులై స్వామీజీమహారాజువారొకయుత్తమ శ్రేణి మహాత్మయని అంగీకరించిరి

(iv) స్వామీబాగ్‌లో సత్సంగముకొఱకు కొకగదిని నిర్మించుటకు ప్రారంభించగా, గోడకు పునాదులు త్రవ్వించుటలో, నొకవేపచెట్టు అడ్డము వచ్చెను. పనివాండ్రు వేపచెట్టును గొట్టివేయుట కిష్టపడనందున నావిషయమును స్వామీజీమహారాజ్ వారికి తెలుపగా వారు స్వయముగ నాస్థలమునొద్దకు వెళ్ళి యా చెట్టున కొక హారమును వేసి తిరిగివచ్చిరి. ఆ వృక్షము అత్యాశ్చర్యకరముగ వెంటనే యెండిపోవుట ప్రారంభించి అతిశీఘ్రముగ చనిపోయెను. ఆ యాటంక మా రీతిగ సులభముగ తొలగింపబడెను.

(v) 24వ. నంబరు పటాలములోని సత్సంగి సిపాయిలు కొందఱు తమ పైయధికారుల యనుమతి నొందకుండగనే సత్సంగమునకు తఱుచు వచ్చుచుండెడివారు. కాని హాజరీని గుర్తించవలసిన పైయధికారి వీరలపేర్లనేలనో పిలుచుట తప్పిపోవుచుండుటచే, వారచ్చట లేనట్లెవరికిని తెలియకుండ నుండిపోయెను.

(vi) కమలదాసు, భజనదాసు అను నిరువురు సాధువులు యమునానదీతీరమునగల యొక బావినుండి మంచితీర్థమును తోడి తెచ్చుచుండెడివారు. కొందఱు పడవవాండ్రు ఈ సాధువులను, వీరు తమ సద్గురువుగారి యుచ్ఛిష్టమును ప్రసాదముగ భుజించుచుందు రను నెపముతో, ఆ నూతినుండి నీరు తోడకుండ నడ్డుపెట్టిరి. అందుచే కొంతదెబ్బలాట జరిగి, కమలదాసు బలవంతుడగుటచే నొక పడవవానిని లెంపకాయవేసి బలాత్కారముగ నూతినుండి నీరును తోడి తీసికొనివెళ్ళెను. ఆవిషయము తెలియగనే స్వామీజీమహారాజువారు కమలదాసును కఠినముగ మందలించిరి. కాని కమలదాసునకు తనతప్పు బోధపడలేదు. అంతట స్వామీజీమహారాజువారు, తులసీసాహెబ్‌వారొకప్పుడు విగ్రహారాధన నాక్షేపణచేసినందుకు హాథరస్ పట్టణవాసులు వారిపై దౌర్జన్యముజూపగా, వారెట్లు తమ ముఖ్యశిష్యులైన గిరిధరదాసును వారల కెదురుచెప్పుటకు గూడ నంగీకరించలేదో యను దృష్టాంతము నుదహరించి, సాధువుల నిర్ణతిని చెరొక రెండుహూష్నము

లను తీసికొని వెళ్ళి, తిమువలన బాధనొందిన పడవవాండ్రకు పరిహారముగ నిచ్చి వారలపాదములపై బడి క్షమార్పణ వేడుకొనుమని చెప్పిపంపిరి. ఆ సాధువు లట్లు చేసినమీదట నా పడవవాం డ్రిరువురును సాయంకాలము సత్సంగమునకు వచ్చి తాము చేసిన యన్యాయాటంకమునకు జింతించుచు దీనత్వముతో క్షమార్పణ వేడుకొనిరి. స్వామీజీమహారాజువారు గొప్ప యహింసాధర్మపరాయణులును అఖండప్రేమస్వరూపులును

(vii) స్వామీజీమహారాజువారు స్వామీబాగ్‌లో నివసించుచున్న రోజులలో నొకనా డుదయమున నచ్చట పచారుచేయుచుండగా, వారితో నున్న చేతన్‌దాసు అనెడి సాధువు సమీపమున నున్న నొక మట్టిదిబ్బను చూపించి, స్వామీజీమహారాజువారి కొఱకు అచ్చట నొక గృహమును నిర్మించిన బాగుండునని మనవిచేసెను. అంతట స్వామీజీమహారాజువారు కొన్నాళ్ళతరువాత నచ్చట నొక గురుద్వారా[1] నిర్మింపబడగలదని సెలవిచ్చిరి. వారిమాటలలోని గూఢాభిప్రాయ మప్పు డెవరికిని దెలియలేదు. స్వామీజీ మహారాజువారి సమాధి నచ్చట నిర్మించిన పిదపనే, వారి యభిప్రాయ మం దఱకును గోచరమాయెను.

(viii) పైనుదహరించిన 24వ. నంబరు బటాలనులో చాలమంది సిపాయిలు రాధాస్వామీమతములో నుపదేశము నొందిరి. వారిలో నొక శిఖ్కుసత్సంగి, ఉపదేశము పొందిన కొంతకాలమునకు మద్యమాంసములను పుచ్చుకొనుట ప్రారంభించెను. అతనికి జబ్బుచేసి ప్రాణముమీదికి రాగా, నతడు తనతప్పును తెలిసికొని పరమదయకొఱకై ప్రార్థించెను. అతని కపుడు స్వప్నములో స్వామీజీమహారాజువారు దర్శన మిచ్చి, నాలుగు రోజుల పిమ్మట నొక నిర్దిష్టసమయమున నతనికి మరణము సంభవించగలదని తెలియ జేసిరి. ఆతడు వెంటనే హృదయపూర్వకముగ పశ్చాత్తాపపడి, తిరిగి శ్రద్ధగ స్మరణధ్యానముల నభ్యాసము చేయుట ప్రారంభించెను. నాల్గుదినము లయిన పిదప, నతనికి స్వప్నములో తెలియచేసిన సమయమునకు సరిగ, నతడు శాంతి యుతముగ మరణించెను. మరణానంతర మతని ముఖవర్చస్సు అతడు పరిపూర్ణ శాంతిసంతోషములతో చనిపోయినట్లు సూచించుచుండెను.

---

(1) 'గురుద్వారా' యనగా సద్గురువు నివసించునట్టిగాని, వారు స్వయముగ సత్సంగము జరిగించు చుండినట్టిగాని స్థలము

(ix) క్రీ॥శ॥ 1877 సం॥రం॥లో గొప్ప యనావృష్టి గల్గుటచే జనులు వర్షములులేక బాధపడుచుండిరి. పరిసరగ్రామముల స్త్రీపురుషులు స్వామీజీ మహారాజువారివద్దకు వచ్చి, వందలాదిజనులు వర్షములేక మరణించుచున్నారని మొఱపెట్టుకొని, వర్షమును గురిపింపుడని వారిని ప్రార్థించిరి. స్వామీజీ మహారాజువారు మాటాడక నూరకుండిరి. కాని, వారి భక్తురాలగు నొక స్త్రీ "మీరు మీ యిండ్లకు వెళ్ళిపొండు. మీకు రేపు వర్షము కురియును" అని వారలతో నుత్సాహపూరితమై వాక్రుచ్చెను. వారు వెడలిపోయిన పిమ్మట స్వామీజీమహారాజువారు, అప్పుడు వర్షము గురిపించుటకు దివ్యేచ్ఛ లేదనియు ననుమతి లేకుండ నామె వారలకు వర్షము కురియునని భవిష్యవాణి చెప్పి యాస పుట్టించుట పొరపాటనియు సెలవిచ్చిరి. అంత నా భక్తురాలు తాను వాగ్దానము చేసియుండినందున వర్షము కురిపించి తన కవమానము గలుగకుండ గాపాడు డని ప్రార్థించెను. స్వామీజీమహారాజువా రపుడు, సత్సంగసమయములో నందఱును గలిసి యేకస్వరముగ రాధాస్వామీపవిత్రనామమును స్మరణ చేయవలసినదని యాజ్ఞాపించిరి. సాధువులు సత్సంగులు అందఱును గలసి అట్లు రాధాస్వామీనామస్మరణము చేయగా, త్వరలోనే వర్షము గురిసెను. ఇది యంతయు జరిగినపిమ్మట, స్వామీజీమహారాజువారు ఇఁకముందవ్విధముగ నెవ్వరును ప్రవర్తింపవలదని యుత్తరు విచ్చిరి.

(x) హంసదా సను నొక సాధువునకు తన యిచ్ఛవచ్చిన ట్లూరక తిరుగుచుండు నలవాటు గలదు. అత డొక పాడుపడి నీరులేకుండ నెండిపోయిన బావివద్దనున్న గుడిసెలో నివాస మేర్పఱచుకొన నిశ్చయించెను. స్వామీజీ మహారాజువా రొకనాడు ఆవైపునకు విహారముగ నడిచివెళ్ళగా హంసదాసు వారితో తా నచ్చట స్థిరముగ నివాస మేర్పఱచుకొనదలఁచితిననియు, వారుత్తరు విచ్చినచో తిరిగి ఆ నూతిలో జెలపడునట్లు చేయవచ్చు ననియు. మనవిచేసికొనెను. స్వామీజీమహారాజువా రపు డూరకుండిరి గాని, కొన్ని మాసములయిన పిదప సాధువులకు మిఠాయి పంచిపెట్టుచు హంసదాసును పిలిచి "రాధాబాగ్" నభివృద్ధిచేయుటకై యేమిప్రయత్నము జేయుచుంటివని ప్రశ్నించిరి. అంతట నా సాధువు "రాధాబాగ్" యెక్కడ నున్నదో తనకు తెలియ దని చెప్పగా, స్వామీజీమహారాజువా రానుయ్యి యున్న స్థలమును జ్ఞాపకము చేసి, "రాధాబాగ్" అచ్చటనే తయారు కాగలదని సెలవిచ్చిరి. ఆ యాజ్ఞానుసారము హంసదాసు అచ్చట నివాస మేర్పఱచుకొని,

కొద్దిరోజులలో నా బావిని బాగు చేయగా. దానిలో నాలుడుగుల లోతుగల నీరు పడెను పిమ్మట కొద్ది కాలములోనే ఆప్రాంతమున క్షామము రాగా, ఆ నూతిలో జెల యత్యధికముగ నూరుటచే హంసదాసు ప్రతిదినమును పరిసరగ్రామములలోని వందలాది పశువుల కా నూతినుండి నీరును తోడిపోసెను. పిమ్మట నచ్చట నొక తోటను నాటుటకు నిశ్చయించిరి.

ఆ చుట్టుప్రక్క లంతయు నిసుకపఱ్ఱ యగుటచే నొక పెద్ద జమీందారు, అంతకు ముందే అచట నొక తోటను నాటుటకై చాలప్రయత్నములు సాగించి అందులకై యధికధనవ్యయము గూడ జేసి విఫలుడై, ఆప్రయత్నములను నిరాశతో విడిచిపెట్టెను. ఈవిషయమును స్వామీజీమహారాజువారికి గూడ తెలియజేసిరి. కాని, వారు "రాధాబాగ్" నచ్చటనే వేయించవలెనని దృఢముగ వక్కాణించిరి. అందుచే నచ్చట నాతోటను వేయించి, స్వామీజీ మహారాజువారు దానిని చూచుటకై, యప్పుడప్పు డచ్చటి కేగుచుండెడివారు. వారితో కలిసి యచ్చటికి వెళ్ళుచుండినసత్సంగులు, దయాల్బాగుసత్సంగులు ప్రస్తుతకాలమున ప్రతిదినమును పొలములకు వెళ్ళి పనిచేయునట్లే, ఆసలములో పాటరులవలె శ్రమపడి పనిచేసెడివాడు. హంసదాసునకు తోడుగనుండి పనిచేయుటకు మఱికొందఱు సాధువులనుగూడ నచటకు బంపిరి. వారి పరిశ్రమఫలితముగ నా యూషరక్షేత్రమున నప్పటినుండియు నొక తోట వర్ధిల్లుచుండెను, అదియును గాక 1943వ సంవత్సరము మొదలుకొని "రాధాబాగ్" చుట్టునున్న నాలుగుచతురపుమైళ్ళ యావరణలో సాగుచేలును, పొలములును వ్యాపించి, ప్రతిసంవత్సరము నందులో మంచిమంచి పంటలును కూరగాయలును తయారగుచున్నవి.

40. ఇంతకు ముందు చెప్పినట్లుగా, రాధాస్వామీమతములో సత్సంగులద్భుతములను విచిత్రములను జూడగోరుట కడునిషిద్ధము. రాధాజీగారి సోదరునికి ఏకైకపుత్రు డొక డుండెను. ఆ పిల్లవాని కొకసారి జబ్బుచేసి ప్రాణముమీదికి వచ్చెను. ఆపిల్లవాని తలిదండ్రు లపుడు రాధాజీగారి ద్వారా ఆపిల్లవాని ప్రాణమును గాపాడవలయునని స్వామీజీమహారాజువారిని ప్రార్థించిరి. స్వామీజీమహారాజువారు ఆపిల్లవానికి మరణ మాసన్నమైనదనియు, నందుచే తాము భగవదిచ్ఛకు వ్యతిరేకముగఁ బ్రవర్తించమనియు సెలవిచ్చిరి. అయినను దప్పదన్నచో రాధాజీగా రా పిల్లవాని కెన్నియేండ్లాయుర్దాయము వృద్ధిచేయ గోరెదరో తమ యాయువునుండి యన్నియేండ్లు

దీసి యిచ్చుట యొక్క-టే యుపాయాంతర మున్నదనిగూడ వారు సెలవిచ్చిరి, రాధాజీగా రందు కంగీకరించనందున నాపిల్లవాడు మరణించెను.

41. స్వామీజీమహారాజువారు సామాన్యముగ నాగ్రాలోనే యుండెడి వారు గాని ఆగ్రానుండి యితరగ్రామములకు గూడ కొన్ని ప్రయాణములను జేసిరి. వా రొకసారి హాథరస్‌లో తులసీసాహబ్‌వా రుండు స్థలమునకును, మఱొకసారి తమ యనుజులగు సేఠ్‌బృందావన్‌గా రుద్యోగము చేయునట్టి అజమీరు పట్టణమునకును వెళ్ళిరి. తులసీసాహబ్‌వారి ప్రధానశిష్యులగు గిరిధర్‌దాసుగారికి "లక్నో"లో చాల జబ్బుచేసి మరణ మాసన్నమైనపుడు వా రాయనను జూచుటకై "లక్నో"గూడ వెళ్ళిరి. స్వామీజీమహారాజు వారు 'గయా' 'అయోధ్య'లకు గూడ వెళ్ళిరిగాని, యెందులకోమాత్రము తెలియదు.

## స్వామీజీమహారాజువారి నిర్యాణము

42. స్వామీజీమహారాజువారు హుజూర్‌మహారాజువారికి తమ నిర్యాణమునుగుఱించి రెండు సంవత్సరములు ముందుగనే తెలియజేసిరి. నిర్యాణదిన మాసన్నమైనపుడు, స్వామీజీమహారాజువారు తా మింక నైదు రోజులలో నిర్యాణము నొందబోవుచున్నామని హుజూర్‌మహారాజువారికి చెప్పిరి. హుజూర్‌మహారాజువా రది విని చాల దిగులుజెంది మహాఖిన్నులై నిర్యాణము నింకను కొంతకాలము నిలుపు చేయవలసినదని స్వామీజీమహారాజు వారిని దీనత్వముతోఁబ్రార్థించిరి. తమ భౌతికశరీరము చాల బలహీనమై పోవుటచే నా స్థితిలో దాని నుంచుకొనుట తమ కిష్టములేదని స్వామీజీమహారాజువారు సెలవిచ్చిరి. అయిననుగూడ హుజూర్‌మహారాజువారు స్వామీజీమహారాజువారిని మఱికొన్ని రోజులు నిర్యాణము నాలస్యము చేయవలసిదని వినయపూర్వకముగ మఱల ప్రార్థించిరి. స్వామీజీమహారాజువారు హుజూర్‌మహారాజువారి వేడుకోలును నిరాకరించుట కిష్టము లేక నంగీకరించి తమ నిర్యాణమును పదునైదురోజులవఱకు నాపుచేసిరి. అయినను హుజూర్‌మహారాజువారిని తిరిగి యట్టి ప్రార్థన జేయరాదని వారు హెచ్చరించిరి.

43. జానకీప్రసాద్ అను నొక శ్రద్ధాళువగు సత్సంగిభక్తునకు అతని యదృష్టముచే కండ్లు తెఱచియుండగనే స్వామీజీమహారాజువారి

దర్శన మగుచుండెడిది కాని స్వామీజీమహారాజువారి నిర్యాణమున కొక సంవత్సరము ముందునుండియు, నాయన కట్లు దర్శన మగుట మానివేసి కండ్లు మూసిన పిమ్మటనే దర్శనమగుచుండెను. ఆయన అందుకు కారణ మేమియని హుజూర్ మహారాజువారి నడుగగ, వారు స్వామీజీమహారాజువారినే ఆ కారణ మడిగి తెలిసికొనుమని యాయనతో చెప్పిరి. జానకీప్రసాద్ గారు సాయంతనసత్సంగములో నీ విషయము స్వామీజీమహారాజువారి నడిగిరి. అపుడు స్వామీజీమహారాజువారు ఆ యనుభవము వలన, తాము తమ భౌతిక శరీరమును త్వరలో విడిచిపోవనైయున్నట్లు సూచింపబడుచున్నదని సెల విచ్చిరి.

44 కుర్సాండా గ్రామకాపురస్థుడైన చంద్రసేన్ గారనునొక సత్సంగి ప్రతిపూర్ణిమ రాత్రియు స్వామీజీమహారాజువారి దర్శనము జేసికొనుటకు వచ్చుచుండుట వాడుక. స్వామీజీమహారాజువారి నిర్యాణదిన మగు క్రీ॥శ॥ 1878సం॥రము జూన్ నెల 15వ తేదికి సరియగుయిన విక్రమశకము 1935సం॥రము ఆషాఢబహుళపాడ్యమి[1] శనివారమునకు ముందుదినము పూర్ణిమ యగుటచే, చంద్రసేన్ గారు స్వామీజీమహారాజువారి దర్శనము చేసికొనుటకై ఆ ముందునాటి రాత్రికే ఆగ్రా వచ్చియుండిరి. స్వామీజీమహారాజువారు వారి నిర్యాణదినమున తెల్లవాఱక మునుపే చంద్రసేన్ గారిని పిలిచి తమకు సమ్ముఖముగ కూర్చుండబెట్టుకొని, పూర్ణచిత్తైకాగ్రతతో తమ దర్శనము చేసికొని తమ స్వరూపము నాంతర్యమున ముద్రితము చేసికొనుమని చెప్పి యిఁకముందేపూర్ణిమకును తమ భౌతికరూపదర్శనము ఆయనకు లభింపనేరదని సెల విచ్చిరి.

45. ఉదయ మెనిమిదిగంటలకు, తాము నిర్యాణమై పోవుటకు సిద్ధముగ నుంటిమని స్వామీజీమహారాజువారు సెలవిచ్చి తమ యాత్మను లోని కాకర్షించుకొనిరి. అంతట వారి శ్వాసగూడ కట్టువడి, నేత్రములలో తెల్లగుడ్లు మాత్రమే కనుపడుచు, శరీరము కంపింపసాగెను. వారి కాలుచేతుల వ్రేళ్ళ గోళ్లు పాలిపోయెను. 15 నిమిషము లట్లుండిన పిమ్మట వారి శరీరములోనికి తిరిగి ప్రాణము ప్రవేశించెను. అప్పుడు వారు తమ నిర్యాణమున కింకను

(1) తెలుఁగు పంచాంగము ప్రకార మా రోజున జ్యేష్ఠబహుళ పాడ్యమి యగును.

కొద్ది యాలస్య మున్నదని సెలవిచ్చిరి. సేఠ్ ప్రతాపసింగుగారు నిర్యాణ కాలము నడుగగా, వారు మధ్యాహ్నమయిన పిదప నిర్యాణ మయ్యెదమని సెలవిచ్చిరి.

46. వారు తిరిగి శరీరములోనికి వచ్చినపుడు కొందఱు సాధువులును సత్సంగులును భేంటు నివ్వఁదొడఁగిరి. అంతట లాలాజగన్నాథఖత్రి యను నాయన "మహారాజువారి నాంతర్యమున సమాహితచిత్తులను గానిండు. ఇది భేంటు నిచ్చుటకు సమయము గా"దని యనెను. అంతట స్వామీజీమహా రాజువా రాయన వైపునకు తిరిగి, "వాస్తవ మయిన చిత్తైకాగ్రత యనగా తన యిచ్ఛవచ్చినపుడు తన యాత్మను లోని కాకర్షించి యిచ్ఛవచ్చినపుడు తిరిగి వెలుపలకు గొనివచ్చుటయే. వీరందఱకును గొన్ని యాదేశముల నిచ్చుటకై నేను తిరిగి వచ్చితి" నని సెలవిచ్చిరి.

## నిర్యాణకాలమున జెప్పిన యాదేశములు.

47. "నే నాధ్యాత్మికసాధనల నా ఱేండ్ల ప్రాయముననే ప్రారంభించి చేయుచుంటినని మీకందఱకును తెలియునుగదా కావుననే నా కా యభ్యాసములో సంపూర్ణసాఫల్యము సేకూరినది," అని స్వామీజీమహారాజువారు చెప్పిరి. ఆ విషయమునే దృష్టాంతముచే సమర్థించుటకై స్వామీజీమహారాజువారు తిరిగి యిట్లు సెలవిచ్చిరి, "ఈఁత చేతకానివాడు నీటిలో మునిఁగిపోవుచుండగ నతనిని యీఁదుమని జెప్పినను, అత డప్పు డీఁత నేర్చుకొనజాలక, మునిఁగిపోవును. కాని చిన్నతనమునుండి యీఁత నేర్చినవాడు నట్టేటిలో పడిపోయిన నెన్నటికి మునిఁగిపోడు. మన భౌతికశరీరము చర్మముతో కప్పిన మాంసాస్థికల శకలము యావజ్జీవము నాధ్యాత్మికసాధనల జేసినవానికి ఈ ప్రపంచమును వీడిపోవునపుడు పరమపురుషుని పవిత్రనామము తప్పక స్మృతికి వచ్చును. కావున మానవులు పవిత్రనామమును ప్రాపంచిక కృత్యములను చేసికొనునపుడును, ఇటునటు తిరుగుచున్నపుడును గూడ మఱువకుండ, నెల్లపుడును స్మరణచేయుచునే యుండవలెను."

48. స్వామీజీమహారాజువారు హుజూర్‌మహారాజువారిని నితరసత్సంగి స్త్రీపురుషుల నందఱనుగూడ సంబోధించుచు నిట్లు సెలవిచ్చిరి, "మీరందఱును నాయం దెట్టిగౌరవమును జూపుచుండిరో, నా యనంతరము రాధాజీ

విషయములోగూడ నట్టిగౌరవమునే చూపుడు. ఆమెను చిన్న మాతాజీ గారిని (కీ॥ శే॥ రాయ్‌బృందావన్ సాహబ్ గారి ధర్మపత్నిగారు) సమానముగ చూడుడు."

49 సాధువు సన్ముఖదాసు విషయములో వారిట్లు సెలవిచ్చిరి, "అతనిని సాధువు లందఱపై నధికారిగ నిర్మించుట యయినది. కాని యతనిని ప్రపంచ ములో సంచారము చేయు మహాంతులవంటి వానినిగ భావింపరాదు. సన్ముఖ దాసు, బిమలదాసు నిరువురును సాధువుల పైయధికారులుగ పనిచేయవల యును. వారిరువురును స్వామీబాగులోనే నివాసము చేయవలయును. ప్రతాపు (అనగా సేఠ్ ప్రతాపసింగుగారు) స్వామీబాగునకు యజమానిగ నుండును."

50. ఒక స్త్రీభక్తురాలు, "మమ్ముల నెవరు కనిపెట్టుచుందు"రని యడుగగా, స్వామీజీమహారాజువారు స్త్రీలను రాధాజీ కనిపెట్టుచుండుననియు, సాధువు లను సన్ముఖదాసు కనిపెట్టుచుండుననియు సెలవిచ్చిరి.

స్త్రీలు స్వామీబాగునకు పోయి యచ్చటనుండు సాధువులకు సేవ జేయకూడదనియు, నందుకు బదులుగ రాధాజీదర్శనమునకు వెళ్ళుచు నామెకు సేవ జేయవలసినదనియు స్వామీజీమహారాజువా రానతినిచ్చిరి ఏరికి నెట్టి యపాయము గలుగకుండ నందఱను గలిసిమెలిసియుంచుట తమ కొక్కరికే సాధ్యమని వారు సెలవిచ్చిరి

51. బుక్కీబీబీగారు తననుగూడ వారితో తీసికొనిపొమ్మని వేడుకొనగా. వా రామెను ధైర్యముగ నుండుమని చెప్పి, త్వరలో నామెను పిలుచుకొని పోదుమనియు, నంతవఱకు నామె యాంతర్యమున పవిత్రరూపధ్యానమును జేసికొనుచుండవలసినదనియు నామెకు సెలవిచ్చిరి. సేఠ్ ప్రతాపసింగుగారు కూడ నట్లే ప్రార్థించగా స్వామీజీమహారాజువారు, "నీ వింకను చేయవలసిన కృత్యములు చాల యున్నవి. నీవు స్వామీబాగ్‌లో నుండి సత్సంగము చేసి కొనుచు, నితరులచే గూడ సత్సంగము చేయించుచుండు"మని సెలవిచ్చిరి

52. సేఠ్ సుదర్శనసింగుగారు స్వామీజీమహారాజువారిని తమ యనంత రము పథప్రదర్శనమునకై యెవరి నాశ్రయించవలయునని ప్రశ్నించిరి

స్వామీజీమహారాజువారు, "ఆధ్యాత్మిక విషయములలో పథప్రదర్శనము కావలసినవారు సాలిగ్రాము (హుజూర్‌మహారాజువారు)ని అడిగి తెలిసికొన వలె"నని సెలవిచ్చిరి.

53. అనంతరము స్వామీజీమహారాజువా రందఱకును దుఃఖోపశమనార్థ మిట్లు చెప్పిరి, "సత్సంగు లెవరును, సాధువులుగాని గృహస్థులుగాని, వ్యాకుల పడ నక్కఱలేదు. నే నింతకుముందు దందఱకును తోడుగ నుండి యిదివఱలో కన్న నెక్కువ దయాకటాక్షములను జూపుచు నందఱను కాపాడుచుందును." మఱియు నిట్లు సెలవిచ్చిరి, "కలియుగమున మఱొక యాధ్యాత్మికసాధన యెద్దియు జయప్రదముగ జేయుటకు సాధ్యముకాదు. జీవు లిక్కాలమున పరమపురుషుని నామోచ్చారణను, సద్గురుస్వరూపధ్యానమును, శబ్దశ్రవణ మును మాత్రమే సాఫల్యముతో చేసి శ్రేయస్సు నొందగలరు."

54. సేఠ్ ప్రతాపసింగుగారు తమలో శబ్దమును పరిపూర్ణముగ ప్రకటము జేయుడని ప్రార్థించగా, స్వామీజీమహారాజువారు "ఎవరైన నాంతర్యశబ్ద మును తమలో స్పష్టముగ వినగల్గి, దాని యానందము ననుభవించగల్గిన యెడల, నదియే చైతన్యశబ్దముయొక్క ప్రకటనము" అని సెలవిచ్చిరి.

55. పిమ్మట రాధాజీగారివైపునకు తిరిగి, స్వామీజీమహారాజువారు, "నా జీవితములో నే నైహికాముష్మికకర్తవ్యములను సమానముగ నిర్వర్తిం చితిని. నీవుగూడ నీ ప్రాపంచికకృత్యముల నెఱవేర్చుకొనుచు, సాధువులను తమ ధర్మములను నెఱవేర్చుకొన నీయవలయు"నని సెలవిచ్చిరి.

56. అప్పుడు స్వామీజీమహారాజువారు గృహాంగణమునుండి తమ గది లోనికి వెళ్ళిరి. వారు 1878 సం॥రము, జూన్ నెల, 15వ తేదీన మధ్యా హ్నము 1గం‌ట 45 నిమిషములకు, 60 ఏండ్ల వయసులో భౌతికశరీరమును విసర్జించిరి.

57. స్వామీజీమహారాజువారికి సంతతిలేదు. రాధాజీగారు స్వామీజీ మహారాజువారి యనంతరము రమారమి 16 యేండ్లు జీవించిరి. ఆమె పన్నీ గల్లీలో నుండెడివారు. హుజూర్‌మహారాజువా రప్పుడప్పు డామెదర్శనము నకై పోవుచుండెడివారు. ఆమె యంత్యదశలో ఝూంసీ వెళ్ళి తా మచ్చటనే

శరీరమును విడిచెదమని సెలవిచ్చిరి. క్రీ॥శ॥ 1894 సం॥రము నవంబరునెల 1వ తేదీన నామె గతించిరి.

తదనంతరమునుండియు జరుగుచుండిన సంఘటనలు వృద్ధివికాసలనుబట్టి పరమపురుష పూరన్ ధనీ స్వామిజీమహారాజువారు స్థాపించిన రాధాస్వామీ సత్సంగమునకు మునుముందు మహాదేదీప్యమానాభ్యుదయము రానున్నదని స్పష్టముగ సూచితమగుచున్నది.

---

II

# పరమ పురుష పూరన్ ధనీ
# హుజూర్ మహారాజ్ వారు

పరమపురుషుని యవతారస్వరూపులును, రాధాస్వామిమతస్థాపకులు నగు స్వామీజీమహారాజువారికి ప్రధానశిష్యులైన పరమగురు హుజూర్ మహారాజ్, రాయ్ బహాదుర్ సాలిగ్రామ్ సాహెబ్ వారు, క్రీ॥శ॥ 1829సం॥రము మార్చినెల 14వ. తేది శుక్రవారము తెల్లవారుజామున 4గం-30 నిమిషము లకు, ఆగ్రాపీపల్ మండీలో నొక గౌరవనీయ కాయస్థకుటుంబమున జన్మించిరి.

2. వారి తండ్రిగారు శ్రీబహాదుర్ సింగుగారు గొప్ప పారమార్థికస్వభావము గలవారు. వారు న్యాయవాదివృత్తి చేయుచుండెడివారు. తమ యాదాయమునుండి కుటుంబముయొక్క ముఖ్యావసరములకు గావలసినంతమాత్రమే వారు ఖర్చువఱచుకొని, శేషించిన యాదాయమును బీదసాదలకు ధర్మము క్రింద వెచ్చించెడివారు. హుజూర్ మహారాజువారి తల్లిగారు పరమార్థచింత గల్గినట్టి భక్తిశ్రద్ధలుగల నిరాడంబరభక్తురాలు. హుజూర్ మహారాజువారి తండ్రిగారు ఆమెకు, ఐహిక సంపదలయందు బంధనము లేకుండ నెల్లప్పుడు పరమును జింతించుచు వైరాగ్యముతో జీవితమును గడుపవలసినదని బోధ చేయుచుండెడివారు.

3. హుజూర్ మహారాజువారికి 18 నెలల ప్రాయములో, నొకరాత్రి వారి మంచమున కెక్కువగ నల్లులు పట్టినందున, వారి తల్లిగా రాపిల్లవానితోగూడ నేలమీదనే ప్రక్క వేసికొని పరుండిరట. ఒక త్రాచుపాము (ఆకుటుంబము వారు దానిని ఇష్టదైవముగ భావించెడివారు) ఆరాత్రియంతయు వారి ప్రక్కనే పడగయెత్తుకొనియుండి, యేపురుగును వారిని బాధించకుండ కాపలా కాచుచుండెనట. హుజూర్ మహారాజువా రుదయమున లేచి, తల్లిగారి నదేమిటి యని యడుగు చున్నట్లుగ, నాసర్పమును చేతులతో పట్టుకొని యామెకు చూపెట్టిరి. ఆసర్పము మూడు రాత్రులు వరుసగ నట్లే వచ్చు చుండెను ఆసర్పమువలన పిల్లవాని కేదేని యపాయము గల్గునేమో యని



II—హుజూర్ మహారాజువారు

(1829—1898)

*1878 లో సంత్ సద్గురువుగ ప్రకటమైరి.*

భయపడి, వారితల్లిగారా తాఁచును తిరిగిరావద్దని ప్రార్థించగా నది మఱల నెన్నడు కనుపడలేదు

**4.** 1832వ. సంవత్సరములో హుజూర్ మహారాజువారికి నాలుగేండ్ల ప్రాయమున్నపుడు వారితండ్రిగారు చనిపోయిరి. వారు మరణశయ్యాయందున్నపుడు, ఇంటిలోని రాగి యి త్తడిపాత్రల నన్నిఁటిని తమ వద్దకు పట్టుకొనిరమ్మని యడిగిరి. కాని యింట్లో నెవరు నాప్రకారము చేయలేదు. అప్పుడు వారిట్లు చెప్పిరి, "పాత్రల నన్నిఁటిని తీసికొనిరమ్మని నేను మూడుసార్లు రెట్టించి యడిగితిని కాని మీరట్లు చేయలేదు. శివభగవానుడు వానినన్నిఁటిని బంగారము చేసెదనని మొదట చెప్పిరి. ఇప్పుడు శివభగవానుడు 'ఈపిల్లవాడు (అనగా, హుజూర్ మహారాజువారు) ఒక మహాత్మ. అందుచే నితడు ఇత్తడిని బంగారముగమార్చుటచే గలిగిన యైశ్వర్యము నంగీకరింప'డని చెప్పుచున్నాడు." ఇట్లు చెప్పి యాయన మరణించిరి.

రాయ్ నందకిశోరుగారు హుజూరుమహారాజువారికి జ్యేష్ఠ సోదరులు. వారు ప్రభుత్వము క్రింద నుద్యోగము స్వీకరించి ఎక్స్ట్రా అసిస్టెంటు కమీషనరు (Extra Assistant Commissioner) హోదావఱకు నభివృద్ధినొందిరి. వారు 1870 సం॥రములో 48 ఏండ్లవయస్సున చనిపోయిరి. అప్పటికి వారికి మాసిక వేతనము రు 700/లు ఉండెను.

5. హుజూరుమహారాజువారి జాతకమును చూచి జ్యోతిష్కులు వీరికి కామక్రోధాదివికారము లెంతమాత్ర ముండవనియు, వీరు దయాస్వరూపులును మహాపరమార్థియు కాబోయెదరనియు జెప్పుచుండెడివారు. ఒక సాధు వీపిల్లవాఁడు మహా కీర్తిశాలియై మానవ జాతికంతకు నైహికాధ్యాత్మిక సంపత్తుల రెండింటిని జేకూర్పగల డనిగూడ భవిష్యవాణిఁ జెప్పెను.

6. చాల చిన్నప్రాయమునసే హుజూర్ మహారాజువారు పర్షియన్ భాషలో చదువుపూర్తిచేసి, యటుపైన నాలుగు సంవత్సరములలో నాగ్రా కళాశాలలో సీనియరు కేంబ్రిడ్జి (Senior Cambridge) పరీక్షలో నుత్తీర్ణులైరి. వారు న్యాయ వేదాంతములను (Logic and philosophy) గూడ చదివిరి. వేదాంతశాస్త్రములో వారెల్లప్పుడును కళాశాలలో నగ్రగణ్యులుగనే యుండెడి వారు.

7. కుటుంబములోని యాచారప్రకారము వారి నొక గోసాయీ[1]ని తమగురువుగ స్వీకరించుమని వారియింటిలోనివారు చెప్పిరి. వారు ఆగోసాయీని కొన్ని జటిలప్రశ్న లడగి, ఆయన యాప్రశ్నలకు సమాధానములు చెప్పలే నందున నాయనను తమ గురువుగ స్వీకరించమని తిరస్కరించిరి. కాని వారి తల్లిగారు చాల పట్టుపట్టినందున తమకు పరిపూర్ణగురువు లభించిన వెంటనే యాగోసాయీని విడిచిపెట్టుట కభ్యంతర పెట్టకూడదను నిబంధనమీద వారా గోసాయీని గురువుగ నంగీకరించిరి.

8. హుజూర్ మహారాజవారికి ప్రథమవివాహము ఫరూఖాబాదులో జరిగెను. ప్రథమభార్య కొక కుమార్తె పుట్టిన పిమ్మట, నామె చనిపోయిరి పెండ్లి అయినతర్వాత నాపిల్లగూడ చనిపోయెను వారికి ద్వితీయవివాహము క్రీ॥శ॥ 1852సం॥రములో ఆగ్రాలో జరిగెను. రెండవభార్యకు ముగ్గురు కొమరులు నిద్దఱుకొమార్తెలును గలిగిరి. ప్రథమపుత్రు డొక సంవత్సరప్రాయమువనే చనిపోయెను. వారి రెండవకుమారుడు లాలాఅయోధ్యాప్రసాదుగారు వారిని లాలాజీసాహెబ్ అని వాడుకగ పిలిచెడివారు. కొమార్తె లిద్దఱికిని వివాహము లయినవి, సంతానముగూడ గలదు. తృతీయపుత్రుడు ద్వారకాప్రసాదు 8సంవత్సరముల ప్రాయములో, 1877సం॥రములో. చనిపోయెను.

9. హుజూర్ మహారాజవారు ఉత్తరాపరప్రాంతముల (North Western provinces) (అనగ నిప్పటి ఉత్తరప్రదేశము) యొక్క పోస్టుమాస్టర్ జనరల్ గారి (Post Master General) ఆఫీసులో 14-3-1847 తేదిన రు100/-లు మాసిక వేతనముమీద నుద్యోగములో ప్రవేశించిరి. పంజాబు, ఉత్తరాపర ప్రాంతములును (అనగనిప్పటి యుత్తరప్రదేశము) సెంట్రలు ఇండియాయు. రాజపుతానాప్రాంతమును, ఆపోస్టుమాస్టరు జనరల్ గారి యధికారములో నుండెను హుజూర్ మహారాజవారు ఆ పోస్టుమాస్టరుజనరల్ గారితో గలిసి యా ప్రాంతములకు ప్రయాణములు చేయుచుండెడివారు

10. ఉద్యోగము చేయుచున్నప్పుడు హుజూరుమహారాజవారు జ్యోతిషమును చాల యభిరుచితో చదివి, యా శాస్త్రములో ప్రవీణత నొందిరి. కొంతకాల మయినతరువాత ప్రజల యుపయోగార్థమై వారొక జ్యోతిష గ్రంథమును పర్షియన్ భాషలోనికి తర్జుమా చేసిరి. చాలమంది జ్యోతిష

(1) గోసాయీ అనగా వైష్ణవమతసన్యాసి

శాస్త్రప్రవీణులు వారివద్దకు వచ్చి యాశాస్త్రసిద్ధాంతముల నడిగి తెలిసికొని, వానిని తమస్వానుభవముతో పోల్చి చూచుకొని, నిరంతరము సరిపోవుచుండె నని సంతసించెడి వారు.

11. హుజూరుమహారాజవారు పోస్టాఫీసుల యినస్పెక్టరు (Inspector of Post Offices) హోదానుండి క్రమక్రమముగ పోస్టాఫీసుల సూపరింటెం డెంటుగను, (Superintendent of Post Offices) పిమ్మట పోస్టుమాస్టర్ జనరల్‌గారికి హెడ్ అసిస్టాంటు (Head Assistant) గను తరువాత పెర్సనల్ అసిస్టాంటుగను, (Personal Assistant) ఆపిమ్మట పోస్టాఫీసులకు ఛీఫ్ ఇనస్పెక్టరు (Chief Inspector of Post Offices) హోదాలోనికిని వృద్ధి నొందుచు చివరకు 1881సం॥రములో ఉత్తరాపరప్రాంతములకు పోస్టుమాస్టర్ జనరల్ (Postmaster General) పదవి నలంకరించిరి.

## వారా విభాగమునకు చేసిన ప్రశంసనీయ లాభములు.

12. 1850సం॥రములో హుజూరుమహారాజవారిని సహారన్‌పూరులో పోస్టుమాస్టరుగ నియోగించిరి. అప్పు డాపోస్టాఫీసులో పనిచేయువారందఱును జబ్బుపడియుండినందున, ఆయాఫీసుపని యంతయు చాల గందరగోళములో పడిపోయియుండెను. అంతకిత్రి మొకనెల పూర్తిగ నాయాఫీసులో సేవనియు జరుగకుండినందున, వేలకొలఁది తపాలాసంచులును, వందలకొలఁది పార్సిళ్లు ను (Parcels) వానివాని గమ్యస్థానములకు పంపబడకుండ నట్లే నిలిచిపోయి యుండెను హుజూరుమహారాజవారు దిగఁబడిపోయియున్న పనినంత నిరువురు గుమాస్తాలను మాత్రమే తోడు తీసికొని, రెండుమాసములలో పూర్తిగ నెఱవేర్చి, ఆయాఫీసు పనిని మామూలు స్థితిలోనికి తీసికొనివచ్చిరి. పోస్టు మాస్టరుజనరలుగా రందుచే నమితసంతుష్టులై హుజూరుమహారాజవారిని పైయుద్యోగములోనికి ప్రమోషన్ (Promotion) చేసిరి.

13. వేగన్-ట్రెయిన్-ఏజన్సీ (Wagon-train Agency) యొక్క లెక్కలను, అలహాబాదు పోస్టాఫీసు (Allahabad Post Office) లెక్కలను, హుజూరుమహారాజవారు బహుప్రశంసనీయముగ పరిశీలన (Audit) జరిపించి నందున పోస్టుమాస్టరుజనరల్‌గారును, లెఫ్టెనెంటుగవర్నర్‌గారును (Lieutenant Governor) అమితానందభరితులై, వారిని 1852, ఏప్రియల్ 1వ

తేది నుండి ఆగ్రా హెడ్ క్వార్టర్సులో నెలకు రూ150/-లు వేతనముమీాద ఇన్స్పెక్టింగ్ పోస్టుమాస్టర్ (Inspecting Postmaster) గ నియమించిరి.

14. హుజూర్ మహారాజు వారు, యినస్పెక్టింగుపోస్టుమాస్టరుగ (Inspecting Postmaster) నున్నపుడు, వారు, అంతవఱకు ప్రభుత్వపు టు_త్తరముల విషయమై వేఱుగనున్న జిల్లాతపాలాప్రబంధమును, (District Postal Arrangements) సామాన్యతపాలావిభాగముతో (General Postal Department) గలిపి, అందునిమి_త్తమై కొన్ని నిబంధనలను. లెక్క లపట్టీ నమూనాలను (Statistical forms) తయారుచేసి, ఆప్రకారము పనిని జరిగించుట మొట్టమొదట నాగ్రాజిల్లాలో ప్రారంభించిరి.

15. పిమ్మట త్వరితముగనే 1852 సం।రము, జూలై 1వ తేదిని హుజూర్ మహారాజు వారు పోస్టుమాష్టర్ జనరల్ (Postmaster General) గారికి ప్రధానసహాయకులుగ (Head Assistant) నియమింపబడి క్రమక్రమముగ నుత్కర్ష (Promotion) నొందుచు 1860సం।రములో రు350/-లు మాసిక వేతనమువఱకు నభివృద్ధినొందిరి. ఈకాలములో వారు ఇటావా గ్రామము పోస్టాఫీసులో దుర్వ్యాపహరణమును (Embezzlement) బయటకులాగిరి వారు తపాలాసంచులను, తోలుసంచులను తయారుచేయించు ఖర్చులలో పొదుపునుగూడ జేసిరి.

16. డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోస్టాఫీసెస్ (Director General of Post Offices) గారి కోరికపైన 1861సం।రములో హుజూర్ మహారాజు వారు పోస్టాఫీసుల నియమనిబంధనలను (Rules and Regulations of Post Offices) దేశభాషలోనికి భాషాంతరీకరించిరి. ఆ తర్జుమా పంజాబు, ఉ_త్తర పరప్రాంతముల (North Western Provinces) లోని పోస్టల్ ఉద్యోగస్థులకు చాలయుపయోగకరముగ నుండెను.

17. 1852–1886 సం॥రముల మధ్యకాలములో భారతదేశముయొక్క తపాలాశాఖను (Indian Postal Department) వ్యవస్థాపనచేసి, దానికి వృద్ధివికాసలను కలిగించుటకు హుజూర్ మహారాజువారే ప్రధానకారకులు. మనియార్డరు పంపువిధానమును, సేవింగ్సు బ్యాంకు అక్కవుంట్లనుంచు విధానమును, పార్సిళ్లను భీమాచేయించుట, వి. పి గా పార్సిళ్లను పంపుట.

పోస్టుకార్డులు మొదలగువానిని, మొట్టమొదట ప్రవేశపెట్టినది హుజూర్ మహారాజువారే. తక్కువ స్టాంపుతో పంపిన యుత్తరములను సరకులను గుఱించిన నిబంధనలనుగూడ హుజూర్ మహారాజువారే మొట్టమొదట నేర్పాటుచేసిరి. ఇటులనే వారింక ననేకమయిన యుపయోగకరములగు క్రొత్తమార్పుల నొనరించిరి. ఈ శాఖాధికారులు సామాన్యముగ నీశాఖకు సంబంధించిన ముఖ్యవిషయము లన్నిటిలోను హుజూర్ మహారాజువారి సలహాను తీసికొనుచుండెడివారు

18. వారు చేసిన యుత్కృష్ట కార్యములకై ప్రభుత్వమువారు 1871 సం॥రములో వారికి 'రాయ్‌బహాదుర్' అను బిరుదము నొసంగిరి. క్రీ॥శ॥ 1875 సం॥రములో వారిని రు 600/-ల మాసిక వేతనముతో అవధ (Oudh) ప్రాంతమునకు ఛీఫ్ ఇనస్పెక్టరుగ (Chief Inspector) నియమించి, లక్నో పట్టణమును వారికి కేంద్రస్థానముగ నేర్పాటుచేసిరి. కాని స్వామీజీమహారాజువారిని విడిచి దూరముగ వెళ్ళుట వారి కిష్టము లేనందున, వారు తమను ఆగ్రాలో తమ వెనుకటియుద్యోగములోనే యుంచివేయవలయునని కోరిరి. అందుచే వారు తక్కువ మాసిక వేతనమగు రు 500/ల పైననే 1876 సం॥రము జూలై నెలలో తిరిగి ఆగ్రాకు వచ్చిరి.

19. అటులనే వారికి నెలకు రూ 600/- మొదలు రు 1000/-లు వఱకు జీతముమీద నాసంవత్సరములోనే కంట్రోలర్ ఆఫ్ పోస్టాఫీసెస్ ఆఫ్ ఇండియా (Controller of Post offices of India) అను యుద్యోగమును వేయగా వా రాయుద్యోగమునుగూడ నదే కారణముచే నిరాకరించిరి.

20. వారొనరించిన మహత్తరోపకారములకై వారి కొక ప్రత్యేకబహుమానము నీయవలయునని పోస్టుమాస్టర్ జనరల్ గారు తమ పైయధికారులకు సిఫారను చేయదల్చగా, హుజూర్ మహారాజువారు, తాము తమ ధర్మమును మాత్రమే నిర్వర్తించితి మనియు పోస్టుమాస్టరుజనరల్ గారి ప్రసన్నతమాత్రముండిన చాలుననియు జెప్పి, యాప్రత్యేకబహుమానమునకై సిఫారసును చేయవలదని నిరాకరించిరి. అంతట పోస్టుమాస్టరుజనరల్ గారు ఒక బంగారు వాచీపైన తమ యిరువురిపేర్లను చెక్కించి ఆవాచీని హుజూరుమహారాజువారికి బహుమానముగ నిచ్చిరి.

21. వారు స్వామీజీమహారాజువారి నిర్యాణానంతరము ఆగ్రాలోనే నిల్చి యుండుటకు కారణము లేనందున, తమ యున్నతాధికారుల బలవంతముమీద నుత్తరాపరప్రాంతములకు (North western Provinces) పోస్టుమాస్టర్ జనరల్‌గా, అలహాబాదునకు వెళ్ళుటకు అంగీకరించిరి. వారు 1881వ. సంవత్సరము ఏప్రిల్ 28వ. తేదీన ఆయున్నతపదవి నలంకరించి, 1887 ఫిబ్రవరి 11వ. తేదీన ఉద్యోగమునుండి విరమించుకొనువఱకును అలహాబాదులోనే యుండిరి.

## ఉద్యోగకాలములోని కొన్ని విచిత్ర సంఘటనలు.

22 వారుద్యోగసందర్భములో ప్రయాణము సేయుచు నొకసారి గుఱ్ఱముమీద నడవిమార్గమున వెళ్ళుచుండగా, వారి కొక యడవి యేనుగుల మంద యెదురాయెను. కాని యామందలోనొక్క యేనుగైనను మెదలకుండ నన్నియు వారినిజూచుచు నట్లే నిలబడిపోయినవట.

23 ఒకసారి వీరును పోస్టుమాస్టరుజనరల్‌గారును గలిసి పర్యటనము జేయుచుండిరి. ఆపర్యటనములో హుజూర్‌మహారాజువారి, నొకముకాములో శేషించిన పనిని పూర్తిచేసికొని, తరువాతరమ్మని జెప్పి, పోస్టుమాస్టర్‌జనరల్‌గారు వీరికన్న ముందుగనే ఆతరువాతిముకామునకు బయలుదేఱి వెళ్ళిరి. హుజూర్‌మహారాజువారు మిగిలిన పనిని పూర్తిచేసికొని తమ సొంతనౌకరును వెంటనుంచుకొని యర్ధరాత్రి 12 గంటలకు వెన్నెలలో నాపైస్థలమునకు పయినమయిరి. త్రోవలో నొకయేఱును దాటవలసివచ్చెను. అచ్చటి కాపలామనిషి, ఆయేటివద్దకు ప్రతిరాత్రియు సరిగ నదే వేళకు నీరుత్రాగుట కొక పెద్దపులి వచ్చుచుండుననియు, నది నీరుద్రావి హుజూరుమహారాజువారును వారినౌకరు నున్న వైపునకే తిరిగి పోవుచుండుననియు వారికిఁ జెప్పి వారి నచ్చటినుండి వెంటనే తప్పుకొనుడని హెచ్చరించెను. అంతలో నొక మహాభీకరగర్జనము వినిపించగా, హుజూరువారి గుఱ్ఱము బెదిరి యొకవైపునకు త్రుళ్ళిపడెను. కాపలామనిషి చెట్టెక్కెను. వారిసొంతనౌకరు పరుగిడిపోయెను కాని హుజూర్‌మహారాజువారు తమగుఱ్ఱముపై నట్లే కూర్చుండి యుండిరి. పులివచ్చి నీరుద్రావి మఱొక త్రోవను పరుగిడిపోయెను.

24. ఆంగ్లేయుల పరిపాలనలోనికి పంజాబుప్రాంతము వచ్చినపిదప పంజాబులో హారియానామండలములో పోస్టాఫీసులను స్థాపించునిమిత్తము, హుజూర్ మహారాజువారును పోస్టుమాస్టరుజనరలుగారును అచ్చటిప్రజలకు, తపాలా ఆఫీసుల నేర్పాటుచేసినందువలన గల్గు లాభములను బోధపఱచుటకై, పర్యటనము చేసిరి కాని యచ్చటిప్రజలందఱును వీరియం దవిశ్వాసముగలిగి ద్వేషభావముతో నుండిరి. పోస్టుమాస్టర్ జనరలుగారు హుజూర్ మహారాజువారు, నందుచే తమగుఱ్ఱములపై తిరిగివచ్చుచుండగ నా మూర్ఖప్రజలు వీరిరువురిమీదికిని ఱాళ్ళు రువ్విరి. అయినను వీరి కే యపాయమును గలుగలేదు.

25. హుజూర్ మహారాజువారు సెంట్రలుఇండియా (మధ్యభారత్)లో పర్యటనముచేయుచున్నపు డొకనాడు రాత్రి, 'ఇండోర్' పట్టణమువద్ద 'దేవాస్' గ్రామములో డాక్ బంగాళాలో మకాముచేసిరి. అర్ధరాత్రివేళ నచ్చట మంచినీటి కేయేర్పాటును లేకపోవుటచేతను, చుట్టుప్రక్కల నే బావియు లేనందునను, కొలంది దూరములోనున్న ఒక దిగుడుబావివద్దకు వెళ్ళి నీటిని తెచ్చుకొనవలసివచ్చెను. అచ్చటి నౌకరులెవరు నా యర్ధరాత్రి సమయమున నా బావికి పోవుటకు ఇష్టపడనందున, హుజూరువారి సొంత నౌకరు భవానీ యనునత డొంటరిగ నా బావికి పోయి, అందులో క్రిందికి 75మెట్లు దిగి, తన బాల్చిలో నీటిని నింపుకొనినపిమ్మట తిరిగి పైకెక్కెను అప్పుడు ఆనౌకరునకు, ఎవరో కొందఱు మనుష్యులొకగుంపుగ నానూతిలోనికురికి పడిపోవుచున్నట్లు చప్పుళ్ళును, కొన్ని భీకరధ్వనులును వినబడెను. కాని యెటుచూచినను మనుష్యులజాడ గానరాకుండెను. ఆనౌకరు పైకిరాగానే హుజూరుమహారాజువారు స్వయముగ నచ్చటనిలువబడియుండిరి. వారత డొంటరిగ వచ్చినందున తాము స్వయముగ నచటికి రావలసివచ్చెననియు మఱెన్నడు నట్లు చేయవలదనియు గట్టిగ నతనిని చీవాట్లు పెట్టిరి. రాత్రిళ్ళు ఆదిగుడుబావికి దయ్యములు వచ్చుచుండుననియు సాయంకాల మయినతరువాత నా బావికి వెళ్ళినవా రెవరును ప్రాణములతో తిరిగి రాలేదనియు చెప్పుదురు.

26. 1857 సం॥రము జూలై నెలలో ప్రథమ దేశస్వాతంత్ర్యయుద్ధసమయములో కొందఱు భారతయోధులు ఆగ్రావద్దకు రాగా, ఆయోధులు పట్టణములోనికి వచ్చినయెడల ఆగ్రాకోటలోనున్న ఆంగ్లేయులు ఆగ్రాపట్టణము

మీద గుండ్లుపేల్చెదరని పుకారుపుట్టెను. పీపల్ మండిలోనున్న హుజూర్ మహారాజువారి భవనము, కోటనుండి గుండుదెబ్బ తగులునంతటి దూరము నకు లోపుననే యుండుటచే, మఱొక ప్రమాదరహితమయిన స్థలమునకు మాఱవలసినదని కొందఱు పెద్దలు వారికి సలహా చెప్పిరి. కాని హుజూర్ మహారాజువారు, సర్వము భగవంతుని దివ్యేచ్ఛకు విడిచిపెట్టి యచ్చటినుండి మాఱనేలేదు. 'హాఫిజ్' అనునొక మహమ్మదీయ సూఫీసిద్ధుని పద్యగ్రంథ మగు "దివాన్ హాఫిజ్" నుండి వారు ప్రశ్నతీయగా, నీక్రిందియర్థముగల పంక్తులు వచ్చినవి.

"నీ వీ ప్రపంచములోని యాపత్తులనిన చాల యాదుర్దా పడుచుంటివి. మరణమను నాపత్తునకై నీవేమి జాగ్రత్తపడితివి? అప్పుడు నిన్ను గాచువారెవరు?"

హుజూర్ మహారాజువారు తా మచ్చటనే భగవదిచ్ఛకు పూర్తిగ వశవర్తులమయి యుండిపోయెదమనియు, శాంతి స్థిర పడిన తరువాత నందఱకును పూర్ణశ్రద్ధాభక్తులతో భగవంతుని పూజించుడని బోధించెద మనియు సెల విచ్చిరి. పీపల్ మండీలోనివారి కెట్టి యపాయమును గలుగలేదు.

27. 1857 వ. సంవత్సరములో జరిగిన ప్రథమస్వాతంత్ర్యయుద్ధములో హుజూర్ మహారాజువారు పోస్టుమాస్టరుజనరలుగారి ఆఫీసులో బహుప్రశంస నీయమైన సేవను జేసిరి. ఒక్క కాగితముగూడ నష్టపోకుండునట్లు బహుచాక చక్యముతో తపాలు నడిపించుచుండెడివారు. ఆగ్రానుండి లక్నో పట్టణమున కొక మార్గము కట్టుపడినపుడు మఱొక త్రోవను తపాలునుపంపు నేర్పాటు చేయుచుండిరి. పురజనుల యుత్తరములను యుద్ధసంబంధమైన యుత్తరములను ఆగ్రానుండి యాలస్యముగాకుండ ఢిల్లీ, లక్నో పట్టణముల కందజేయునిమిత్తము వారు చాల చురుకుగ తపాలావాహకుల నేర్పాటుచేయుచుండిరి. కేంద్రీయప్రభుత్వమును, ప్రాంతీయప్రభుత్వమునుగూడ నందుచే వారొనరించిన పనిని శ్లాఘించుచు వారికి ప్రశంసాపత్రముల నంపిరి. వీరి కొక జాగీరు నిమ్మని పోస్టుమాస్టర్ జనరలుగారు సిఫారసు చేయదలంచిరి. కాని, తాము చేసినదంతయు తమ ధర్మమును నిర్వర్తించుకొనుటకుమాత్రమే చేసితిమని చెప్పి హుజూర్ మహారాజువా రా సిఫారసును నిరాకరించిరి.

28. హుజూర్ మహారాజావారికి, ఆయుద్ధసందర్భములో వివిధజనులకు సంభవించిన యదృష్ట దురదృష్టముల వైపరీత్యములను జూచినమీదట గంభీరముగు చిత్తవైకల్యము గలిగెను. వారికి చూచుచుండగనే ఐశ్వర్యవంతులు నిరుపేదలుగను, నిరుపేదలు మహదైశ్వర్యవంతులుగను, మాఱిపోవుచుండుటను బట్టి యీజగత్తుయొక్క క్షణభంగురత్వము కండ్లకుగట్టినట్లాయెను. వారంతకుముందే పారమార్థికాభిలాష మెండుగగలవారగుటచే, నపుడు పూర్ణశ్రద్ధతో భగవదన్వేషణ సేయఁదొడఁగిరి. అప్పుడు సమయముగూడ నందుకు పరిపక్వమై యుండెను. కావుననే వారికి సద్గురువును గలిసికొనుటకు తరుణముగూడ త్వరలోనే యాసన్న మగుచుండెను.

29 హుజూర్ మహారాజావా రొక బ్రాహ్మణుని భాగవతమును పారాయణచేయుటకై నియమించిరి. కాని భగవంతుని గుఱించిన రహస్యముగాని, భగవంతునిపొందు మార్గముయొక్క వివరణముగాని భాగవతమున లేకుండెను అందుచే వారుపనిషత్తులను జదువుట మొదలుపెట్టి చిత్తైకాగ్రతకు ప్రాణాయామమును చేయనారంభించిరి. అందులో వారికి కొన్నియనుభవములుగూడ గలిగెనుగాని, వారికోరిక సఫలము గాకుండెను. వా రపుడు మౌలానా[1] రూమీగారి "మస్నవీ"[2] యను పద్యగ్రంథమును జదువుట తటస్థించెను. హుజూర్ మహారాజావారికి. శబ్దాభ్యాసమునుగుఱించియు గురువునావశ్యకతనుగుఱించియు నాగ్రంథములో చెప్పినవిషయములు బాగుగ నచ్చినందున, వా రట్టి మార్గమును జూపించగలిగిన గురువుకొఱకై యన్వేషణ సేయఁదొడఁగిరి, తమకు తెలియవచ్చిన ప్రతిపండితునివద్దకును మౌల్వీ[3] వద్దకునుగూడ వారు వెళ్ళి కలిసికొనుచుండెడివారు. వివిధమతములకు జెందిన యనేకమతగ్రంథములనుగూడ వారు చదువుచుండిరి గాని, వారి కందువలన నేమియు త్రోవదొరకలేదు

30. హుజూర్ మహారాజావారుపోస్టుమాస్టరుజనరలుగారికి ప్రధాన సహాయకులుగ (Head Assistant) పనిచేయుచుండగా 1858వ. సం॥రములో

---

(1) మౌలానా రూమీగారు పర్షియాలో క్రీ॥శ॥1807 మొదలు 1873సం॥వఱకును జీవించి యుండిరి వారొక గొప్ప యోగియును, కవియును, వీరు 'శమ్సేతబ్రీజ్'అనునొక ప్రఖ్యాత 'సూఫీ' సిద్ధపురుషుని శిష్యులు. (2) 'మస్నవీ' అనగా నుర్దూలోగాని పర్షియన్ భాషలోగాని వ్రాయబడునట్టి ఒకవిధమైన కవిత్వము, మౌలానా రూమీగారి 'మస్నవీ' పర్షియన్ సాహిత్యమంతలో నొక యుత్తమోత్తమ పారమార్థికపద్యము. (3) 'మౌల్వీ' అనగా మహమ్మదీయ మతగురువు.

వీరిని పోస్టుమాస్టర్ జనరల్ (Postmaster General) గారు 'మీరట్' పట్టణమునకు పిలిపించిరి. స్వామీజీమహారాజువారి కనిష్ఠసోదరులయిన సేఠ్ ప్రతాపుసింగుగారు ఆరోజులలో పోస్టుమాస్టర్ జనరల్ గారికి క్యాంపుక్లార్కుగ పనిచేయుచున్నందున నాయనగూడ మీరట్ పట్టణమునకు వచ్చుటచే, నచ్చట వారిని హుజూర్ మహారాజువారు గలసికొనుట తటస్థించెను. వీ రిరువురును పత్రికాగదులలో బనచేయుటచే సేఠ్ ప్రతాపసింగుగారు 'పంచగ్రంథి'[1] యను శిఖ్ఖుమతగ్రంథము నొకనా డుదయముననే పఠించుచుండగా హుజూర్ మహారాజువారు చూచి, అందు చెప్పబడిన గూఢరహస్యములనుగుఱించియు, శబ్దాభ్యాసమునుగుఱించియు తమ కేమైనను తెలుసునా యనియు, లేనిచో, ఆరహస్యములు తెలిసిన ప్రవీణుల నెవరినైనను తాము చూపించగలరా యనియు, సేఠ్ ప్రతాపసింగుగారిని ప్రశ్నించిరి. అంతట నాయన, తమ జ్యేష్ఠసోదరులు ఆ రహస్యములను బాగుగ నెఱింగిన ప్రవీణులేగాక, నాయాధ్యాత్మికసాధనలనుగూడ నభ్యాసము జేయుచుండిరని హుజూర్ మహారాజువారితో జెప్పిరి. హుజూర్ మహారాజువా రపుడు సేఠ్ సాహబ్ గారిని వారి జ్యేష్ఠసోదరునితో తమకు పరిచయము గలుగజేయవలసినదిగ కోరిరి సేఠ్ సాహబ్ గారు వీరిప్రార్థనను, తా మాగ్రాపట్టణము వెళ్ళినతరువాత స్వామీజీమహారాజువారితో మనవిచేసెద నని చెప్పిరి.

31. హుజూర్ మహారాజువా రాగ్రా వెళ్ళినతరువాత నీ విషయమును సేఠ్ సాహబ్ గారికి జ్ఞాపకముచేసి స్వామీజీమహారాజువారి యనుమతిని బడసిరి. 1858 సంవత్సరము నవంబరు మాసములో నొక యాదివారము రోజున హుజూర్ మహారాజువారు స్వామీజీమహారాజువారి దర్శనము జేసికొనిరి హుజూర్ మహారాజువారు ప్రాణాయామము ముద్రాసాధనలు సృష్టి గురువు, శబ్దము, అంతర్యసాధనలు మొదలగు ననేకపారమార్థికవిషయములను గుఱించియు, సంతుమతమును గుఱించియు వారి ననేకప్రశ్నలువేసి వారివలన నందుకు తృప్తికరమయిన సమాధానములను పొంది తమసందేహము లన్నిటిని సంపూర్ణముగ నివృత్తిచేసికొని సంతుష్టహృదయులై యింటికి వెళ్ళిరి. వారు తమస్నేహితులతో తామిన్నాళ్ళనుండియు నన్వేషించుచుండిన మహాపురుషులు తమకు లభించి రని జెప్పి, తమ స్నేహితులనుగూడ వెళ్ళి స్వామీజీ

(1) శిఖ్ఖుగురువులలో నైదవవారగు అర్జునసాహబ్ గారు మొదటి 5గురువులచే రచింపబడిన శబ్దములను గొన్నిటిని చేర్చి పంచగ్రంథి యనుపేరుతో నొక గ్రంథముగ తయారుచేసిరి

మహారాజువారి దర్శనము జేసికొనుడని ప్రోత్సహించుచుండిరి. ప్రారంభ ములో హుజూర్ మహారాజువారు ప్రత్యాదివారమును సత్సంగమునకు వెళ్ళు చుండిరి. కొంతకాలమైన పిమ్మట వారు రోజు విడిచి రోజును, పిమ్మట ప్రతి దినమును వెళ్ళుట ప్రారంభించి చివరకు ఆఫీసులో పనిచేయుసమయమును, ఇంటివద్ద కొద్దివిశ్రాంతిసమయమునుమాత్రము విడిచి, రాత్రింబవళ్ళలో మిగి లిన సమయమంతయు స్వామీజీమహారాజువారి సేవలోనే గడుపుచుండిరి.

32. హుజూరుమహారాజువారు తమవంశపు గురువైన బృందావన వాస్త వ్యులగు గోసాయీగారిని కలిసికొని వారికి స్వామీజీమహారాజువారి విష యము చెప్పి స్వామీజీమహారాజువారిని గురువుగ జేసికొనుటకు అనుజ్ఞనొంది, ఆగోసాయీగారినిగూడ స్వామీజీమహారాజువారి సత్సంగమునకు రమ్మని బిల చిరి. అపుడు గోసాయీగారుగూడ స్వామీజీమహారాజువారి సత్సంగమునకు వెళ్ళిరి.

33 హుజూరుమహారాజువారు ఆదర్శ శిష్యులుగనుండి, తమశరీరమనో ధనములను, ఆత్మను, స్వామీజీమహారాజువారి సేవలో నర్పించిరి.

*(a)* శరీరముతో వారు చేసిన సేవ లెవ్వి యన; పాదముల బట్టుట, పంకా లాగుట, నేలను తుడుచుటయు, నీటితో అలుకుటయు, సామానును తుడిచి శుభ్రపఱచుటయు, ప్రతిదినము దంతధావనమునకు పుడకలను, హస్త ప్రక్షాళనమునకు మన్నును తెచ్చి అందిచ్చుటయు, స్నానపుగదిని, తూము కాలువను శుభ్రముచేయుటయు, పాత్రలను తోముటయు, ఆహారసామగ్రిని బజారునుండి తెచ్చుటయు. పిండి విసరుటయు, వంట చేయుటయు, మంచినీళ్ళను బావినుండి తీసికొనివచ్చుటయు. ఉమ్మిపాత్ర వగైరాల నందించుటయు, పాలకీ మోయుటయు, పాలకీతో పరుగిడుటయు, స్వామీజీమహారాజువారిని వీపుపై నెక్కించుకొని వెళ్ళుటయు.

*(b)* వారు మనస్సుతో జేసిన సేవయేమన, తమయిష్టానిష్టములను త్రోసిపుచ్చి స్వామీజీమహారాజువారి యిచ్ఛకే పూర్తిగ వశవర్తులై యుండెడివారు. హుజూరుమహారాజువారి మనస్సున నహంభావము, అలసత్వ ము, ఆడంబరమును లేశమాత్రముగూడ లేవు వారు తమ స్వీయాలోచనలను భావములను, ఉద్దేశ్యములను దూరముగనుంచి సద్గురువు నాజ్ఞల నతివినయ విధేయతలతో తక్షణము పాలించెడివారు మానవశక్తికిమించిన సేవా కృత్యములనగూడ వా రతిసంతోషముతో జేయుచుండెడివారు.

(c) వారు చేసిన ధనసేవ యేమన: తమ నెలజీతమునంతను స్వామిజీ మహారాజువారి చరణములందు సమర్పించుచుండెడివారు. స్వామిజీమహారాజువా రా పైకములోనుంచి హుజూరుమహారాజువారి కుటుంబఖర్చుల కవసరమయిన మొత్తమునుమాత్రమే వారింటికి పంపి, శేషించిన మొత్తమును సత్సంగవ్యయమునకును సాధువుల పోషణార్థమును ఉంచెడివారు. ఇంటికి పంపిన మొత్తమునుండిగూడ హుజూరుమహారాజవారు చాలభాగమును స్వామిజీమహారాజువారి దుస్తులకిందను, ప్రసాదముల ఖర్చులకిందను వెచ్చించుచుండెడివారు. అప్పుడప్పుడు హుజూరుమహారాజువారు ఆరతి ఖర్చులకును ఇతరమైన యవసరములకును బదులుకూడ చేయవలసివచ్చుచుండెడిది. అయినను వా రట్టి యవసరములకు ఖర్చుపెట్టుట కెప్పుడును వెనుదీయలేదు.

(d) ఆత్మసేవ యన్ననో, హుజూరుమహారాజువారు ప్రతినిమిషమును రాధాస్వామినామమును స్మరణజేయుచు, స్వామిజీమహారాజువారి పవిత్ర రూపమును ధ్యానముచేయుచునే యుండెడివారు. "దిల్ బాయార్, దస్తబా కార్" అనగా, "మనస్సులో ప్రియుని ధ్యానమును, చేతులతో పై పనులను, చేయుచుండుము" అనెడి మహావాక్యమును హుజూరుమహారాజువారు పూర్తిగ నాచరణలో బెట్టిరి. హుజూరుమహారాజువారు తినునప్పుడు, త్రాగునపుడు, నిటునటు సంచరించుచున్నపుడును, నిదురపోవునపుడు, మేలుకొనియున్నపుడును, సర్వకాలసర్వావస్థలయందును, స్వామిజీమహారాజువారి దయామయ స్వరూపమును ధ్యానించుటలో లీనమైయుండెడివారు. వా రెల్లపుడు నీ క్రింది పద్యములోని భావములో లీనమైయుండెడివారు.

క్యా వారూం గురుపర్ ఆయీ, తన మన ధన తుచ్ఛ దిఖాయీ :
సురత అంగ తుమ్హారీ ప్యారీ, అబ్ సరబస్ హుఈ తుమ్హారీ. ।

అర్థము:- "తమకు (సద్గురువునకు) నేనేమి సమర్పించగలను? నా శరీర మనో ధనములు చాల తుచ్ఛములు. తమ యంశయగు నా యాత్మయే తమకు బహుప్రియమని నాకు తెలియును. అందుచే నిపుడది సంపూర్ణముగ తమదే యైపోయినది."

34. హుజూరుమహారాజువారు మంచినీళ్ళను తీసికొనివచ్చు సేవను చాల విచిత్రపద్ధతిని జేయుచుండెడివారు. వారు పాదరక్షలనైనను ధరింపకయే

ఆగ్రాపట్టణమునుండి దూరముగనున్న యొక బావినుండి కుండెడు మంచినీళ్ళను మండుటెండల కాలములోను శీతకాలములోను గూడ, స్వామీజీమహారాజు వారి యుపయోగముకొఱకై తీసికొని వచ్చుచుండెడివారు. త్రోవలో నెవ రైనను దప్పిగొని వారిని నీరడిగినచో నట్టివారలకు వారు సంతోషముగ దాహమిచ్చి శేషించిన యుదకమును, స్వామీజీమహారాజువా రుపయోగిం చుటకది యర్హముగాదని, పాఱపోసి, తిరిగి నూతికివెళ్ళి కుండను నింపి తెచ్చెడి వారు. ఒకసారి ఆకుండ త్రోవలో విచ్చిపోయెను. వెంటనే వారొక కుమ్మరి యొద్దకు వెళ్ళి, దగ్గఱ పైకము లేనందున తమ శాలువను తాకట్టుపెట్టి ఒక క్రొత్తకుండను కొనిరి. మఱునాడు పైకమిచ్చి తమ శాలువను తాకట్టునుండి విడిపించుకొనిరి.

# వారి శిష్యావస్థలోని కొన్ని చోద్యమైన సంఘటనలు

35. ఒకసారి స్వామీజీమహారాజువారు బహిర్దేశమునకు పోఁదలఁచుకొని, యచ్చట హుజూర్ మహారాజువారును ఇద్దఱుముగ్గురు సాధువులును, కొందఱు సత్సంగులు నుండగా "హుక్కా నెవరు ముందు తీసికొని వత్తురు?" అని యడిగిరి. హుజూరుమహారాజువారు 'చిలము[1]'ను తీసికొని డాబామీదికి పరు గెత్తుకొనిపోయి 12 అడుగుల ఎత్తునుండి నేలమీదికిఁదరికి దగ్గఱగనున్న యొక కంసాలివద్ద నిప్పుబొగ్గులు తీసికొని, కొద్ది నిముషములలోనే 'చిలము'ను స్వామీజీమహారాజువారి కందచేసిరి. ఇంకొక సాధువుకూడ స్వామీజీ మహారాజువారు చెప్పిన పని చేయుటకై లేచి వెళ్ళెను కాని యాయన మేడ మెట్లింకను దిగకమున్నే హుజూరుమహారాజువారు 'చిలము' నందజేయుట యయిపోయెను.

36 హుజూరుమహారాజువారు స్వామీజీమహారాజువారి చరణామృత మును, ముఖామృతమును, ప్రసాదమును తీసికొనుచుండిరని వారిమీద దోషారోపణ చేసి వారిని సంఘబహిష్కరణ సేయుటకై వారి వర్ణస్థులందఱు నొక సమావేశమును జేయనిశ్చయించిరి. ఆసమావేశమును జరుపుటకుముందు ఆ సంఘనాయకుని మనుమ డొక సంఘదూష్యమయిన యసహ్యాకృత్యమును

---

(1) 'చిలము' అనగా నొక్కగొట్టమువంటి మట్టిపాత్ర. అందులో పొగాకును నిప్పును ఉంచి దానిని హుక్కాగొట్టము మీద పెట్టి పొగత్రాగుదురు

చేయుటచే స్వయముగ నా సంఘనాయకుడే లజ్జాపూరితు డయిపోయి, హుజూరుమహారాజువారిమీద చర్యనేమియు తీసికొన సాహసించలేకపోయెను

37. హుజూరుమహారాజువా రొకసారి తమ యుద్యోగరీత్యా యేదో విచారణనిమిత్తమై యలహాబాదునుండి ఓరయీ (orai) అను యూరునకు వెళ్ళిరి. ఆపని పూర్తిచేసికొని తిర్గి అలహాబాదుతిన్నగ వెళ్ళుటకు బదులు, స్వామీజీమహారాజువారి దర్శనమునకై ఆగ్రామీదుగ పోవలెనని తలంచిరి. అప్పటికే సాయంకాల మూడు గంటలాయెను. అచ్చటికి అరువదిమైళ్ళ దూరములో 'ఫఫూందు' రైల్వేస్టేషన్ గలదు. దానికన్న దగ్గఱ మఱొక రైలుస్టేష నెద్దియు లేదు ఫఫూందులో మఱునాడుదయము ఎనిమిదిగంటలకే రైలు బయలుదేఱును ఈదూరమంతయు నా రాత్రిలోనే పూర్తిచేసి రైలునందుకొనుట యసంభవముగ గన్పించుచుండెను అయినను హుజూరుమహారాజువారు తమ నౌకరు భవానీ ద్వారా పల్లకీ బోయీల నేర్పాటు చేయించుకొని రాత్రి ఏడు గంటలకు పల్లకి నెక్కిరి. అచటికి పండ్రెండుమైళ్ళ దూరములో నున్న జాలౌన్ గ్రామమున కొకగంటలో తీసికొనివెళ్ళగల్గినచో వాండ్రకు బహుమాన మిచ్చెదమని చెప్పి యాబోయీల నుత్సాహపఱచిరి అంతట నాబోయీలు దైవకృప యున్నచో నట్లేచేయగలమని చెప్పి సరిగ నెనిమిదిగంటలరాత్రికి వారినచట జేర్చిరి. తిరిగి గం. 8–30 నిమిషములకు 'జాలౌన్'లో బయలుదేఱగా గాలివానసూచనలతో చాలవర్షము గురియుచున్నందున బోయీలు వాన నాపుజేయుమని ప్రార్థించిరి అంతట భగవత్కటాక్షముచే 15 నిముషములలో వాన ఆగిపోయెను. త్రోవలో యమునానది దాటవలసివచ్చెను అచట నా నదిని దాటుటకు సాధన మొక బల్లలను జేర్చికట్టిన చిన్న తెప్పమాత్రమే యుండెను హుజూరుమహారాజువారు తమ హుక్కాను, డబ్బుసంచిని, మిగిలిన సామానునంతను పల్లకిలోనుంచి, ఆపల్లకిని బోయీలను తెప్పమీద నెక్కించి ముందుగ నదిని దాటించుమని యుత్తరు విచ్చిరి. పల్లకీతోగూడ బోయీలు తెప్పమీద నెక్కి దాటుచుండగా మధ్యలో పల్లకీ తలక్రిందై సామానంతయు నీటిలో పడిపోయెను. అప్పుడు బోయీలుగూడ మునిఁగిపోవు నంతటి పరిస్థితి గల్గెను. హుజూరుమహారాజువారు ఒడ్డునుండి "భయపడకుడు ఎవరును మునిఁగిపోరు' అని బిగ్గఱగ కేకవేసిరి. అంతట బోయీలు పల్లకిని సరిచేసికొనగలిగి సురక్షితముగ నొడ్డున జేసుకొనిరి కాని హుక్కాయును డబ్బుతోసహా డబ్బుసంచియును బట్టలును

నీటిలో కొట్టుకొనిపోయెను. హుజూరుమహారాజువారును భవానీయును, తరువాత తెప్పమీద దాటి యావలియొడ్డు చేరినపిదప, బోయీలు భవానీయును బట్టలు, డబ్బుసంచి హుక్కాయును నీటిలో కొట్టుకొనిపోయినవని చెప్పగా, హుజూరుమహారాజువారు వానికొఱకై తటమువద్ద నీటిలో వెదకినచో దొరకగలవని సెలవిచ్చిరి. మోకాలి లోతు నీటిలో వారట్లు వెతకగా డబ్బు సంచియు మిగత సామానులన్నియు దొరికెను. ఈవిధముగ మూడుగంటలు వ్యర్థమయ్యెను. భవానీ యిది యొక దురదృష్టమని విచారించెను. హుజూరు మహారాజువారు, "అట్లుగాదు. భగవదిచ్ఛ యట్లేయున్న"దని చెప్పి తిరిగి ప్రయాణమును మొదలుపెట్టి సరిగ నుదయము ఏడుగంటలకు 'ఔరయ్యా' గ్రామమును జేరుకొనిరి. బోయీలు అలసిపోయినందున శ్రమతీర్చుకొనుటకై వారు కొంతసే పచ్చట నాగిరి. ఫఫూందు స్టేషను అచ్చటి కింకను పండ్రెండు మైళ్ళున్నది భవానీకి ట్రైయిను అందదేమోయను భయముగలైను. కాని హుజూరుమహారాజువారు భగవంతుని దయయున్న తప్పక ట్రైయినందగలదని యతనికి ధైర్యము చెప్పి, తిరిగి బయలుదేఱగా రైల్వేస్టేషనుకు ఏనిమిదిగంటలపైన కొద్దిసేపటికి చేరుకొనగలిగిరి. ట్రైయినుకూడ అప్పుడే స్టేషనుకు వచ్చినందున హుజూరుమహారాజువా రందులో నెక్కి ప్రయాణము చేసిరి,

38 ఒకసారి హుజూరుమహారాజువారు ఉద్యోగరీత్యా పర్యటనము చేయుచు పల్లకీలో ఝూన్సీనుండి గ్వాలియరు పోవుచుండిరి. త్రోవలో నొకానొకచోట పైన యెండమండిపోవుచు, చుట్టుప్రక్కల 5 మయిళ్ళదూరములో నెచ్చట నొకనీటిబొట్టుకూడ దొరకని స్థితిలో నుండగా, బోయీలకు అమిత దాహము వేసెను. పల్లకీగూడ నిప్పువలె వేడిగ నుండుటచే, బోయీలు ఆ పల్లకిని దించివేసిరి. అప్పుడు హుజూర్ మహారాజువారు వారల నెచ్చటనైన నీడను విశ్రమించుడని జెప్పిరి. కాని చూచుట కెక్కడ నొక వృక్షముగూడ కనుపింపదాయె. అంతలో నాకసమున నొక మేఘము క్రమ్మి చల్లని గాలి వేయనారంభించెను. అందుచే బోయీలకు ప్రాణముదెప్పిరిల్లి వారు తిరిగి ప్రయాణమును సాగించిరి.

39. వర్షకాలములో హుజూరుమహారాజువారు తెల్లవాఱుజామున సత్సంగమునుండి యింటికి తిరిగివచ్చు సమయములో మేఘగర్జనములు మెఱుపులు

నెక్కువగ వచ్చి వెంటనే వాన ధారాపాతముగ గురియునంతటిభీతి గలుగుచుండెడిది గాని, యెల్లప్పుడును హుజూరుమహారాజువా రింటిలో ప్రవేశించిన పిదపనే మహావర్షము గురియుట మొదలుపెట్టెడిది అప్పుడప్పుడు సత్సంగము జరుగుచుండగా వాన కుంభవృష్టిగ గురియుచుండెడిది గాని, సత్సంగ మయినతోడనే అది ఆగిపోవుచుండుటయేగాక హుజూరుమహారాజువా రింటికి పోవుటకై యీవలకు వచ్చుసరికి ఆ యిరుకుసందులో జేరుకొన్న నీటి ప్రవాహము గూడ పూర్తిగ తగ్గిపోయెడిది.

40. హుజూరుమహారాజువారు ప్రస్తుతము స్వామీజీమహారాజువారి సమాధిని కట్టించుచున్న స్థలమును, 1876సం॥రములో స్వామీజీమహారాజు వారి సూచనపైననే కొని వారికి భేంటుగ నర్పించిరి.

41. 1877సం॥రములో హుజూరుమహారాజువారి కనిష్ఠపుత్రుడు మరణించెను హుజూరుమహారాజువా రాపిల్లవానికి దహనసంస్కారము జరిపిన పిమ్మట సాయంకాల సత్సంగమునకు వెళ్ళిరి. వారు సత్సంగములో నిశ్చలముగను నిర్విచారముగను కూర్చుండిరి గాని, స్వామీజీమహారాజువారు ఖేదగ్రస్తులుగ గనిపించిరి. హుజూరుమహారాజువారు వారి నట్లుండుటకు కారణమేమని యడుగగా వారు మీపిల్లవాని మరణమునకే విచారించుచుంటిమని సెలవిచ్చిరి. హుజూరుమహారాజువా రంతట తమకందువిషయమై యేమియు చింత లేదని చెప్పిరి. స్వామీజీమహారాజువారు తాము వీరి నిమిత్తమే విచారించుచుంటిమనియు, వీరికి విచారము లేనిచో తమకుగూడ విచారము పోయినదనియు సెలవిచ్చిరి. కాని ఆపిల్లవాని తల్లి, సోదరి, పితామహియు మాత్రము మిక్కిలి దుఃఖించుచుండిరి. ఈమహాదుఃఖబాధచే నాపిల్లవాని సోదరి స్పృహతప్పి పడిపోగా తన తమ్ముడు ప్రకాశమానమైన ముఖముతో సూక్ష్మశరీరములో నొక యేనుగుమీద నెక్కి ఆమెదగ్గఱకువచ్చి, "నీవు దుఃఖించుచున్నందున నేను క్రిందికి దిగి రావలసి వచ్చినది. [1]శబ్దగురువు నాడిలో నే నాడుకొను చుంటి" నని చెప్పి యామెను సంతోష పఱచెను హుజూరుమహారాజువారు, శబ్దగురు వనగా రాధాస్వామీదయాళురే యని యందఱకును దెలియఁజెప్పిరి. పిల్లవాని సోదరియొక్క యీ పైస్వప్నముచే నందఱకును దుఃఖోపశాంతి గలిగెను.

---

(1) 'శబ్దగురువు' అనగా సద్గురువుయొక్క శబ్దస్వరూపము ఆస్వరూపములో సద్గురువు పరమపురుషరాధాస్వామీదయాళువితో నేకమై యుందురు

# సంతసద్గురువుగ నున్న కాలము

42. స్వామీజీమహారాజువారి నిర్యాణానంతరము సత్సంగులు తమ్ము సద్గురువుగ భావించి గౌరవించుటకు హుజూరుమహారాజువా రంగీకరించెడి వారు గారు. వారు సత్సంగమునకై ప్రతిదినమును పన్నీగల్లీకిని, ప్రత్యాది వారమ్మును స్వామీబాగ్‌నకును వెళ్ళుచుండెడివారు. రాధాబాగ్ స్వామీ బాగ్‌లయావత్తు ఖర్చులకును సాధువుల భోజనాదిసదుపాయములకును గావల సిన ద్రవ్యమును ప్రతిమాసమును వారు తమజీతము లోనుండి యిచ్చుచుం డెడివారు. సాధువుల కానువాయిగ నిచ్చుచుండిన ద్రవ్యమును గూడ వారు తగ్గించలేదు. వారు, సత్సంగులు తమ్ము సద్గురువుగ నెంచుట కంగీకరించ కుండినను, సత్సంగములో నమృతవచనములను సెలవిచ్చుచు, సత్సంగులకు దుఃఖోపశమనము గలిగించుచుండెడివారు. వారు స్వయముగ రాధాజీ చిన్న మాతాజీ గార్ల దర్శనముకొఱకై వెళ్ళి వారి సేవజేయుచు, నితరులను గూడ నట్లు చేయుడని హెచ్చరించు చుండెడివారు. పవిత్ర కుటుంబములోని వారందఱి యెడలను వారు గౌరవమర్యాదల నదివఱలోవలెనే జూపు చుండెడివారు.

43. క్రీ॥శ॥1879సం॥రములో హుజూర్‌మహారాజ్‌వారి తల్లిగారు చనిపో యిరి హుజూరుమహారాజువారు తమ కులీనులతో కలిసిమెలిసి తిరుగక, వారిల యిండ్లలో కార్యకలాపములకుగూడ పోకుండుటచే, కులీనులందఱును కట్టుకట్టి వారి తల్లిగారి దహనసంస్కారక్రియలో తోడ్పడకుండుటకు నిశ్చ యించుకొనిరి. కాని హుజూరుమహారాజువారు వారందఱకు నాచారప్రకా రము కబురుచేసి స్వామీబాగ్‌నకు కూడ వార్తనంపిరి. పిమ్మట చాలమంది సత్సంగులు సాధువులు నచ్చటకు వచ్చియుండుట జూచి, వారి వర్ణస్థులు గూడ సిగ్గుజెంది దహనసంస్కారము గావించుటలో పాల్గొనిరి.

44. హుజూర్‌మహారాజువారి పూజ్యధర్మపత్ని దయాదాక్షిణ్యములుగల సుగుణవంతురాలు ఆమె సత్సంగుల యెడలను బంధుగుల యెడలను గూడ నెల్లపుడు దయాప్రేమలను జూపుచు నందఱకును భక్తిమార్గమును బోధించు చుండెడివారు. హుజూర్‌మహారాజువారి సేవ చేయుట కందఱకు నామె సావ కాశ మిచ్చుచుండెడివారు. 1885 సం॥రము ఫిబ్రవరినెల 26న ఆమె బహు

శాంతియుతముగ గతించిరి. అంతకు 8 మాసముల క్రితమే హుజూరుమహారాజువారామె ఫిబ్రవరినెలలో చనిపోయెదరని సెలవిచ్చియుండిరి. సత్సంగులు ప్రార్థించుటచే నామె చనిపోవుట కొక గంటముందు, అందఱకు నామె దర్శనమును చేసికొను సావకాశము నొసంగిరి.

45. హుజూరుమహారాజువారు పోస్టుమాస్టరు జనరలుగ నున్నపుడు, ఒక రోజున నొక పంజాబీ సత్సంగి భజనాభ్యాసములో నిమగ్నుడై కాలపరిమాణము మఱచిపోయినందున తన ఆఫీసునకు చాల యాలస్యముగ వెళ్ళెను అతడాఫీసునకు వెళ్ళిన పిమ్మట తన తప్పిదమును మన్నింపుడని ప్రార్థించగా తన తోడి గుమాస్తాలందఱును అతడు సరియైన సమయమునకే వచ్చి హాజరు పుస్తకములో (attendance register) సంతకము కూడ చేసినట్లు చూపిరి. అతడు ఆశ్చర్యపూరితుడై సాయంకాల సత్సంగములో హుజూరుమహారాజువారి కావృత్తాంతమును జెప్పగా వా రతడు గురుకటాక్షమువలన నట్లు రక్షింపబడెనని జెప్పి ముందు సావధానముగ నుండవలసినదని సలహా నిచ్చిరి.

46. హుజూరుమహారాజువారు అలహాబాదులో నున్నపుడు పెద్ద పెద్ద ఆంగ్లేయాధికారులు వీరితో మతవిషయిక చర్చలను జేయుటకు వచ్చెడివారు. వీరు యుక్తియుక్తముగను వేదాంతప్రోద్బలముతోను వైజ్ఞానికరీతిని కారణములను జూపి వారలకు నచ్చచెప్పెడివారు. ఒకసారి యొక పెద్దయుద్యోగస్థుడు హుజూరుమహారాజువా రొక గంటసేపు చర్చించగ విని, వెంటనే ఆపరమపురుషుడే ఈగదిలోనుండి మాట్లాడుచున్నట్లు తనకగపించుచున్నదని యనెను. అంతట హుజూరుమహారాజువారు, "అవును ఆపరమపురుషుడు సర్వాంతర్యామియు. సర్వజ్ఞులును నేను వారి దీనసేవకుడను మాత్రమే" యని బదులు చెప్పిరి. అప్పటి నుండియు నాయుద్యోగస్థుడు వీరిని బహుగౌరవముగ జూచుచుండెను. ఐరోపాదేశపు (యూరోపియన్) ఉద్యోగస్థులలోను దేశీయోద్యోగస్థులలోనుగూడ హుజూరుమహారాజువారు తమ పరిపూర్ణ నిర్వ్యాజభక్తికి ప్రఖ్యాతి నొందిరి. ఒక క్రొత్త యుత్తమోత్తమ మతనాయకులుగ పేరు గాంచుటచే, వారందఱును వీరి నమిత గౌరవమర్యాదలతో జూచుచుండెడివారు.

47. పారమార్థికకృత్యముల కెక్కువ కాలమును వినియోగించగోరి, హుజూరుమహారాజువారు 1886లో తమ యుద్యోగమునుండి విరమించుకొన

గోరగా పోస్టాఫీసుల డైరక్టరుజనరలుగారు (Director-general of Post Offices) వారి నింకను కొంతకాలము పనిచేయవలసినదని గోరుచు, వారి కేమైనను శ్రమ యిబ్బందు లున్నయెడల తనకు తెలియజేసినచో వానిని నివారించెదనని చెప్పిరి. హుజూరుమహారాజువా రందుచే నింకొక యాఱు మాసములవఱకు పనిచేయుట కంగీకరించిరి. ఆ గడువయిపోయిన పిమ్మట వారు మఱొక విడుదల విన్నపమును పంపిరి ఆ విన్నపమును డైరెక్టర్ జనరలుగారు మఱొక సత్సంగియుద్యోగస్థునిద్వారా త్రిప్పి వేయుచు, తనవైపు నుండియు నాసత్సంగివైపునుండియుగూడ హుజూరుమహారాజవారి నుద్యోగమునుండి అప్పుడే విరామమునొందవలదనియు, మఱొక రెండుసంవత్సరములవఱకు నుద్యోగకాలవృద్ధికి (Extension) అంగీకరించవలసినదనియు, ప్రార్థించుమని ఆసత్సంగితో చెప్పి కబురు పంపించిరి. కాని హుజూరుమహారాజువారు సత్సంగ సేవకును మానవజాత్యుద్ధారకార్యమునకును ప్రాముఖ్యము నిచ్చుటచే వారి కోర్కెను సగౌరవముగ త్రోసిపుచ్చిరి. డైరెక్టరుజనరల్ గారు హుజూరుమహారాజువారికి, వారుచేసిన ప్రశంసనీయసేవలకు అదనముగ మఱొక రు 1000/-లు ప్రత్యేక పెన్షనుతోకలిపి మొత్తము రు 5000/-లు సాలియానాపెన్షనును సిఫారస్ చేసిరి. ప్రభుత్వముచే నాప్రకారము ఆమోదింపబడినది. హుజూరు మహారాజువారు నలువది సంవత్సరములు ఆవిభాగములో పనిచేసి 11వ ఫిబ్రవరి 1887వ తేదీన నుద్యోగమునుండి విరమించుకొనిరి. వారుద్యోగమునుండి విరమించుకొనిన పిదప పీపల్మండీలో తమ స్వగృహముననే సత్సంగము చేయ నారంభించి, సత్సంగులవలన సేవను స్వీకరించుటకు గూడ నంగీకరించిరి.

48. హుజూరుమహారాజువారు పోస్టుమాస్టరుజనరలుగా నున్నపుడు, తమ వద్దకు వచ్చిన యుత్తరముల పైకవర్లను విప్పకుండ నాకవరు పై భాగముననే, అందుకు సమాధానముగ నివ్వవలసిన యుత్తరువులను వ్రాయుచుండెడివారట. ఆ యుత్తరువు లెన్నడును తప్పకుండ నాయుత్తరములలోని విషయములకు పూర్తిగ ననుగుణముగనే యుండుచుండెడివి.

49. ఉద్యోగమునుండి విరమించుకొని ఆగ్రాలో సత్సంగకేంద్రమును స్థాపించిన తర్వాత వారాంతర్యముగను బాహ్యముగను గూడ నందఱపై దయజూపుచు, నెక్కడెక్కడి దూరస్థ సంస్కారీ జీవులను తమ శరణ్యము లోనికి తీసికొనుచుండిరి

50 దీనత్వముతో భగవంతుని శరణుఁ జొచ్చినవారందఱియందును వారి పారదయాకటాక్షములను, ప్రేమదానమును వర్షించెడివారు. వారి దివ్యామృతవచనముల మహాకర్షకప్రభావము వలన, వినువారందఱకును తీవ్రమైన సత్యాన్వేషణాసక్తి గలుగు చుండెడిది. దీనత్వముతో శరణుఁజొచ్చిన వారికి వా రాంతర్యదర్శన మిచ్చి యానందపఱచుచుండెడివారు. తమ యాంతర్యానుభవముల నెవరును మఱొకరితో చెప్పకూడదను నిబంధన యుండెడిది. ఎవరైనను వారివద్దకు సందేహములను, సంశయముల నడుగుటకై వచ్చినప్పుడు వారు వచ్చినపృచ్ఛకు లింకను పెదవి మెదపకమునుపే వారి సంశయము లన్నిఁటికి సమాధాన మిచ్చుచుండెడివారు.

51. ఆరతిసమయమున హుజూరుమహారాజువారి యెదుట కూర్చుండిన సాధువులును సత్సంగులును అంతర్యమున నూర్ధ్వచైతన్యమండలములకు ఆకర్షింపబడిపోవుటచే నానందమగ్నులై తమశరీరము, గృహము, ఉద్యోగ వ్యాపారముల విషయములను పూర్తిగ మఱచిపోవుచుండెడివారు. అయినను వారు తమ దయాకటాక్షములచే నట్టివారల కేవిధమైన ప్రాపంచికనష్టము వాటిల్లకుండ కాపాడు చుండెడివారు ఆ భక్తులు తమ శరీరమును మనస్సును ధనసంపత్తులను సర్వస్వమును వారి చరణములవద్ద నర్పించెడివారు. వారు స్వేచ్ఛచే సత్సంగమును విడిచిపెట్టి తిరిగి తమ గ్రామములకు వెడలిపోవుట కియ్యకొనెడివారు కారు. సత్సంగమునుండి దూరముగ వెడలిపోయిన పిదపనా సత్సంగప్రభావము వారలపై చాలకాల ముండిపోయెడిది. హుజూరు మహారాజువారు తమ శరణ్యము నొందినవా రందఱిపైనను తమ రక్షక హస్తము నెల్లప్పుడు నుంచి, వారల స్వార్థపరమార్థముల రెండిఁటిని పూర్తిగ కనిపెట్టు చుండెడివారు. వారి భక్తులందఱును పరస్పరము సోదరసౌహార్ద ప్రేమభావములతో బ్రవర్తించెడువారు.

52. హుజూర్ మహారాజువారు తమ్ముగుఱించి ప్రశంసోక్తులను గాని శ్లాఘావాక్యములను గాని యెంతమాత్రము సహించెడివారు కారు. వా రట్టి ప్రశంసోక్తుల నణఁచివేసెడివారు గూడ. అయినను వారి కీర్తి కస్తూరిసువాసనలవలెనే నలుదిశల వ్యాపించెను. వారి ప్రతిపక్షులు వారి వీధినుండి వెళ్ళినచో వారి యింటివాకిలిదీపపుకాంతి ప్రభావముచే తమ కైహికవిషయములపై వైరాగ్యము గలుగునేమో యను భయముచే నావీధినిగూడ పోయెడి

వారు కారట. వారి దివ్యోపదేశములను విని, వారి సత్సంగమును చేసికొని వారి సాన్నిధ్యమున నుండుటచే నేరికైన మనస్సు జగత్తునుండి విరక్తిజెంది యంతర్ముఖమైపోయెడి దనుట నిస్సంశయమే. వారి స్వరూపములో నొక యద్భుతాకర్షణమహిమ యుండుటచే, నా మహాపురుషుని దర్శనమాత్రము ననే ప్రజలు వారివైపున కాకర్షింపబడి, ఆనందపేరిములతో తన్మయమయిపోవు చుండెడివారు.

53. పూర్వదేశీయమత విషయములలో ప్రవీణులైన శ్రీమేక్సుముల్లరు (Max Muller) దొరగారు 1898 సం॥రములో "శ్రీరామకృష్ణుని జీవితము, వారిబోధలును" (Sri Ramakrishna, His Life & Teachings) అనుగ్రంథములో, హుజూర్ మహారాజువారిని గురించి వ్రాసిన యీ క్రిందిపంక్తులను, ఈసందర్భములో, పాఠకులు చదివి యానందించెదరు గాక.

"ప్రస్తుతము దాదాపు 70ఏండ్ల వయస్సుగల రాయ్సాలిగ్రామ్ సాహబ్ బహదుర్ వారు పోస్టాఫీసులో నొక యధికారిగ నుండి బహుచాక చక్యముతోను, దేశప్రజలకు బహులాభదాయకముగను జీవితమును గడిపిరి. వారు చివరకు ఉత్తరాపరప్రాంతములకు (North Western Provinces) పోస్టుమాస్టరుజనరలు పదవి నలంకరించిరి. 1857 సం॥రమునాటి విద్రోహములో జరిగిన భయంకరసంఘటనలచే వారి మనస్సున చాల గాఢప్రభావము గలిగెను. స్త్రీలును, పురుషులును, పసిపిల్లలును వేనవేలుగ వారి కండ్ల యెదుట తెగనరకబడి పోవుటయు, ధనికు లొక్కపెట్టున కడుబీద లయిపోవు టయును, కడు బీదలు అకస్మాత్తుగ నమితానర్ఘసంపత్తుల బడయుటయును జూడగ, వారికీ ప్రపంచముయొక్క క్షణభంగురత్వము నశాశ్వతస్థితియును మనస్సున నాటుకొనిపోయెను. అదివఱలో తమ మనస్సు నాకర్షించి తమశక్తి నంతను వాని సంపాదన నిమిత్తమై వినియోగింప జేసినట్టి యావద్వస్తుజాలము నుండియు నొక్కసారిగ వారి మనస్సప్పుడు విరక్తిజెందెను. అయినను వారు, చిన్ననాటి నుండియు పారమార్థిక వేదాంతవిషయములందే యభిరుచి గలిగి యుండుటచే, నుద్యోగముజేయు కాలములోగూడ చాలసమయమును మత గ్రంథములను శ్రద్ధగ చదువుటలో వెచ్చించెడివారు. కావుననే వారు విద్రోహముయొక్కయు, తత్ప్రతిఘటనము యొక్కయు భీకరసంఘటనలను జూచిన మీదట, నీ యసహ్యదుఃఖమయకూపమునుండి పరువిడి నిర్మల శాశ్వతా

నందస్థానము నన్వేషింపగోరుట గొప్పయాశ్చర్య మేమియు గాదు. వా రనేక యోగులను సన్యాసులనుగూడ కలిసికొని సంప్రతించుచుండిరి. కాని వారి కందువలన నేమియు నుపయోగము లేకపోయెను. చిట్టచివరకు పోస్టాఫీసులో తమ తోడియుద్యోగి యొకరు, తమ జ్యేష్ఠసోదరు లొక విశ్వసనీయులైన యాధ్యాత్మికశిక్షకులని, వీరికి తెలియ జేసిరి. రెండు సంవత్సరములు వారి సదుపదేశములను వినుచును, వానిని ఉపనిషత్తులు మొదలయిన పవిత్ర గ్రంథములతో సరిపోల్చుకొనుచును గడపిన పిమ్మట, వీ రనన్యభక్తితో వారి శిష్యులుగ జేరిరి. వా రాగ్రాలో నున్నపుడు, తాము స్వయముగ తమగురువుగారికి సేవచేసెడివారు, గాని మఱెవ్వరి నా సేవ జేయనిచ్చెడివారు గారు. తామే స్వయముగ తమ గురువుగారికి పిండి విసరి, వంట జేసి స్వ హస్తములతో నాహారము తినిపించుచుండెడివారు. ప్రతిదినమున నుదయము పూట తమగురువుగారికి స్నానార్థమై, రెండు మైళ్ళ దూరమునుండి యొక కుండెడు స్వచ్ఛోదకమును శిరమున నుంచుకొని తెచ్చెడివారు. వారు తమ మాసిక వేతనమునుగూడ నా పరమసంతును కిచ్చివేయుగా, నా పరమసంతులు వీరి స్త్రీపుత్రాదుల పోషణకు గావలసిన ద్రవ్యమును మాత్రము వీరి కిచ్చి, శేషించిన మొత్తమును ధర్మార్థమై వెచ్చించెడివారు. వీరి యింటి విషయముల నన్నిటిని వీరిగురువుగారే కనిపెట్టుచుండిరి. వీరు కాయస్థులును, ఆ పరమసంతులు ఖత్రి కులజులు నగుటచే, వీరి గృహవిషయము లన్నియు వారు కనిపెటుచుండుటయు, వీరు తమ గురువుగారికి వంటజేసి వారియుచ్ఛిష్ట మును ప్రసాదభావముతో తీసికొనుటయు, వీరి సజాతీయులయిన కాయస్థు లెవరికి నిష్టము లేకుండెను కాని సజాతీయు లెంతవిరోధించినను వీరు కొంచెముగూడ లెక్క జేయలేదు. కొంతకాలమయిన తర్వాత నీశిష్యుడు తమ యుద్యోగమునుండి విరమించుకొనుటకు గురువుగారి యనుమతిని వేడుకొనిరి. కాని యా పరమసంతులొప్పుకొనలేదు. వీరిని ఉత్తరాపర ప్రాంతములకు (North Western Provinces) పోస్టుమాస్టరుజనరలుగా నియమించినపుడు వీరు తిరిగి యుద్యోగము నుండి విరమించుకొని తమ యావత్సమయమును శక్తిని ఆధ్యాత్మిక జీవితములో వెచ్చించుటకు, గురువుగారి పాదములపై బడి వారి యనుమతిని ప్రార్థించిరి. కాని యా పరమసంతు ఉద్యోగధర్మము నెఱ వేర్చుచున్నంత మాత్రమున నాధ్యాత్మికాభివృద్ధి కేమియు నాటంకము కలుగ నేరదని జెప్పి, వారి ప్రార్థనను తిరిగి నిరాకరించిరి అందుచే వారు ఆగ్రా నుండి అలహాబాదు వెళ్ళి అచ్చట నాక్రొత్త యున్నత పదవిని చాల యేండ్లు

జయప్రదముగ నలంకరించి, తపాలావిభాగములో నెన్నో మహోపకారకము లయిన సంస్కరణములను మార్పులను జేసిరని ప్రఖ్యాతి గాంచిరి.

"1878 సం॥రములో తమ గురువుగారు నిర్యాణము నొందువఱకు, వారికి తమ యుద్యోగమును వదలిపెట్టుటకు స్వాతంత్ర్యము లేకపోయెను. వారికి గూడ నట్లుచేయుట యుక్త మనిపించలేదు. పిమ్మట వారే గురువై వారిని గోరిన వారందఱకు పారమార్థికవిషయముల నుపదేశించెడివారు. వారి యుపదేశములను వినుటకు వచ్చినవారు సామాన్యముగ సంసారమును వదలి సన్న్యాసిజీవనము నవలంబించునంతగ ప్రభావితు లగుచుండినందున రాయ్ సాలిగ్రామ్‌వారివద్దకు వెళ్ళినవారందఱును కుటుంబమును విడచి సన్న్యాసులై పోవుదురని యొక గొప్పప్రతీతి వ్యాపించెను. ఇంతియగాక వారి మేడమీఁది దీపపుకాంతి నెవరయినను చూచినంత మాత్రముననే, వారు తమ బంధుగులను జగత్తునుగూడ విడచిపెట్టి, సంఘమునకు నిరుపయోగ మగునంతగ విరక్తు లయితీరుదురనిగూడ చెప్పుకొనుచుండిరి. మేము చివరసారి వారిని గుఱించి వినినప్పు డావృద్ధపురుషులు సజీవులై యుండిరి. అప్పుడు ప్రతిదినమును దేశములోని వివిధప్రాంతములనుండియు, స్త్రీపురుషు లనేకులు వారి భవనమునకు తండోపతండములుగ వచ్చుచుండెడివారు. పరమార్థవిషయముల నుపదేశించుటకై వారు రాత్రింబవళ్ళు అయిదు సమావేశములను జేసెడివారు. వారి కందుచే నిద్దురపోవుటకు రెండుగంటలకన్న నెక్కువ సమయము లేకుండెడిది. వారు బ్రాహ్మణులు శూద్రులనిగాని, ధనికులు నిరుపేదలనిగాని, శిష్టులు దుష్టులనిగాని వివక్ష లేకుండ, వచ్చినవా రందఱను సమానాదరముతో చూచెడివారు. వా రద్భుతములను జేయగలరని ప్రజలకు సంపూర్ణ విశ్వాసము గలదు. కాని యట్టిపనులను జేయుట తమ కనర్హము నయుక్తము నని వారు భావించెడివారు. రాజప్రతినిధిగారికి (Viceroy) అసిస్టెంటుసర్జను (Assistant Surgeon) గ నుండిన కీ॥శే॥డాక్టరు ముకుందలాల్‌గారు ప్రాణాయామము నెక్కువగ నభ్యాసముచేయుటచే స్పృహ తప్పిపోయిన రోగులను వీరివద్దకు పంపించుట వాడుక యనియు, వీరు అట్టి రోగులపై తమ దృష్టిని ప్రసరింప జేసినంత మాత్రముననే వారికి తిరిగి స్పృహ చేకూరుచుండెననియు, వీరు అట్టివా రందఱకు ప్రాణాయామాభ్యాసము నిరుపయోగము నపాయకరము నని బోధచేయుచుండెడివారనియు, చెప్పుచుండిరి."

54. హుజూర్ మహారాజువారి కాలము చారిత్రికముగ చాలప్రాముఖ్యముగలది. ఏలనన నక్కాలమున రాజారామమోహనరాయ్, మహర్షి దేవేంద్రనాధఠాకూర్, స్వామిదయానంద్, శ్రీరామకృష్ణపరమహంస, కేశవచంద్రసేన్, వివేకానంద, రామతీర్థ, అరవిందఘోష్, మొదలగు నెందఱో ప్రతిభాశాలురగు యువకులు, సత్యాన్వేషణాసక్తిచే ప్రజ్వలితహృదయులై ప్రజలకు వివిధ విభాగములలో జ్ఞానప్రబోధము గలుగజేయునట్టి మహానాయకులుగ నైరి ఈకాలములోనే, బ్రహ్మసమాజము, ఆర్యసమాజము, దేవసమాజము, ప్రార్థనాసమాజము, అంజుమానె ఇస్లాము మొదలగు నెన్నియో పారమార్థికసంఘములుగూడ స్థాపింపబడినవి. అఖిల భారత జాతీయ మహాసభ (Indian National Congress)గూడ నీసమయముననే 1885 సం॥రములో స్థాపించబడెను. అస్పృశ్యత, పంక్తిభోజననిర్బంధములు మొదలగు సంకుచితప్రాచీనభావములు ప్రజలమనస్సుల నాకర్షించుట తగ్గిపోయెను. అప్పటినుండియే పారమార్థికసంఘములన్నియు తమ తమ విశ్వాసములను భావములను పట్టుదలగ ప్రచారముచేయుట ప్రారంభించినవి.

55. సాధువుల సహాయక మహంతుగ నున్న విమలదాసునకు చాల జబ్బుచేసి జీవించుట నిరాశాప్రాయ మయ్యెను. ఆయనకు చైతన్యము లోనికి ఆకర్షించుకొనుట మొదలుపెట్టగా హుజూరుమహారాజువారు అంతర్యామున దర్శనమిచ్చి ఇంకను రెండుమాసము లుండుమని చెప్పిన ట్లతఁడు అర్థము జేసికొనెను. ఆయన స్వస్థతగల్గినపిదప, సత్సంగమునకు వెళ్ళి హుజూర్ మహారాజువారి దర్శనము చేసికొని తన యనుభవమును చెప్పగా హుజూర్ మహారాజువారు, "నే జెప్పినదానిని తప్పర్థము చేసికొన్నావు. నీకు రెండు మాసములుకాదు, రెండు సంవత్సరముల కాల మియ్యబడినది" అని సెలవిచ్చిరి. రెండు సంవత్సరములయిన తర్వాత విమలదాసుగారికి తిరిగి సుస్తీ చేయగా హుజూరుమహారాజువారి దర్శనమునకై ఆయన పరితపించుచుండెనని వారికి కబురు వెళ్ళెను. అప్పుడు హుజూరుమహారాజువారు ఆయన కార్యము నెఱవేరినదని చెప్పి మూడు రోజులయిన తర్వాత వచ్చి చూచెదనని కబురు పంపిరి. మూడవ రోజున మధ్యాహ్నము హుజూరుమహారాజువారు విమలదాసుగారిని చూచుటకై, తమతోగూడ నాయనను చూడ గోరిక గల వారి నందఱను వెంటబెట్టుకొని స్వామిబాగునకు వెళ్ళిరి. విమలదాసుగారు, హుజూరుమహారాజువా రెప్పుడు వచ్చెదరని యత్యాతురతతో ప్రతిసాధువును అడుగు

చుండిరి. ఇంతలో హుజూరుమహారాజువారు స్వామీబాగు చేరుకొని ముందు స్వామీజీమహారాజువారి సమాధివద్ద మొక్కుటకు వెళ్ళి, తర్వాత విమల దాసువద్దకు వచ్చి వారి యారోగ్యమునుగూర్చి యడిగిరి. అంతట విమల దాసుగారు హుజూరుమహారాజువారు తనకు రెండు దినములక్రితము దర్శన మిచ్చినది లగాయితు సుఖముగనే యుంటున్నదని చెప్పి, మఱియు "హుజూరు వారు నాకార్యమును సంపూర్ణముగ నెఱవేర్చిరి. నేనిప్పుడు తమకు ధన్యవా దముల నర్పించుటకే కనిపెట్టుకొని యున్నాను. నన్నాంతర్యమున తమ చరణ ములందు జేర్చుకొన గోరుచున్నాను" అని ప్రార్థించెను. హుజూరుమహారాజు వారు ఆయనను ఒక్కక్షణ ముండుమని చెప్పి భజనఘర్‌కు వెళ్ళిరి ఇంతలో విమలదాసుగారు ప్రాణములను విడిచిరి. హుజూర్ మహారాజువారు దహన సంస్కారమునకై ఆయనశరీరమును గొనిపోవుట కేర్పాట్లు చేయుటకు త్తరు విచ్చిరి

56. సెలవు దినములలో చాలమంది సత్సంగులు దర్శనార్థమై పీపల్మండి పోవుచుండెడి వారు. సెలవులయిన తర్వాత తమ యుద్యోగములు మొదలగు పనులను జేసికొను నిమిత్తము వెనుకకు వెళ్ళుటకు వారికిష్ట ముండెడిది కాదు. హుజూర్ మహారాజువారు వారలను వెళ్ళుమని తిరిగితిరిగి రెటించి చెప్పుచుండి నను వారలు వెళ్ళక రైలుకు తఱుచు కాలాతీతముగ పోవుచుండెడి వారు. అయిన నారైలు గూడ కాలాతీతముగనే వచ్చుచుండుట తటసించుచు నెప్పు డు నేభక్తునికిని బాధ లేకుండ జరిగిపోవుచుండెడిది.

57. అప్పుడప్పుడు భక్తులు హుజూర్ మహారాజువారికి చాల విలువగల దుస్తులను దెచ్చియిచ్చి. వారి యారతిచేయు సావకాశము కొఱకై యాతుర తతో ప్రార్థించెడివారు. హుజూరుమహారాజువారు వారల కోర్కెను తీర్చుట కంగీకరించి, ఆదుస్తులను ధరించి కూర్చుండి తమయెదుట నాసత్సంగులు కూర్చుండుట కానతినిచ్చుచుండిరి. అప్పుడు పవిత్రవాణినుండి శబ్దములను పఠించెడివారు. ఒక్కొక్కప్పుడు వారు క్రొత్త శబ్దములను అప్పటికప్పుడు కల్పించెడివారు. అచ్చటనున్న మిగత సత్సంగులుగూడ నాయారతివలన నాధ్యాత్మిక లాభము నొందుచుండెడివారు. ఆ దుస్తులతో హుజూర్ మహా రాజువారి స్వరూపము భక్తుల హృదయముల నాకర్షించి వారి మనస్సున గాఢముద్రిత మాయిపోవుటచే, పిమ్మట చాలకాలమువఱకు వారి దివ్యమనో హరస్వరూపమునా సత్సంగులు ధ్యానము చేయగల్గుచుండిరి. ఈవిధముగ

హుజూర్ మహారాజువారు నిరంతరము నేదో యొక హృదయాకర్షకము, నతి మనోహరమునైన క్రొత్తక్రొత్త తీరువు నవలంబించుచు, సత్సంగుల హృదయములందు సద్గురుప్రేమను సద్గురు దర్శనాసక్తిని యభివృద్ధి జేసెడివారు. హుజూరుమహారాజువారికి భేంటుగ నర్పించిన దుస్తులు, నగలు నీవిధముగ పవిత్రము జేయబడిన పిమ్మట వానిని భేంటుగ నిచ్చిన సత్సంగులకే తిరిగి యిచ్చివేసెడివారు, లేదా, సాధువులకు పంచిపెట్టుచుండెడివారు.

57. ఒకానొకప్పుడు లూధియానా జిల్లాలో నొక పల్లెటూరునుండి యొక వయోవృద్ధ సత్సంగిని, తన స్వహస్తములతో వడికిన నూలుతో ఖద్దరుదుస్తులను తయారుచేయించి, హుజూరుమహారాజువారి కర్పించుటకై మూటకట్టి తీసికొనివచ్చెను ఆమె హుజూరుమహారాజువారు విలువగల దుస్తులను ధరించుట జూచి, తాను తెచ్చిన హీనవస్త్రముల నర్పించుటకు సంకోచించెను. ఆమె వంగి మ్రొక్కునపు డా మూట క్రిందపడగా హుజూరుమహారాజువారా మూట యేమిటని యడిగిరి ఆమె చాల లజ్జాభయకంపితురాలగుచు తన యుద్దేశ్యమును చెప్పుకొనెను. హుజూరుమహారాజువా రా మూటను వెంటనే తీసికొని, లోనికి పోయి ఆ బట్టలను ధరించి యీవలకు వచ్చి, నీవు తీసికొని వచ్చిన దుస్తులు అన్నిటికంటె చాల బాగున్నవే' యని చెప్పి యామెను సంతోషపెట్టిరి. తరువాత నాబట్టలను సత్సంగులకు ప్రసాదముగ పంచిపెట్టి, ఆవృద్ధ స్త్రీకి బహుమానము క్రింద వేఱె దుస్తుల నిచ్చిరి.

59. తమ వద్దకు జిజ్ఞాసతో వచ్చిన ప్రేక్షకులకును, సత్యాన్వేషకులకును హుజూరుమహారాజువారు రాధాస్వామీమతముయొక్క మహిమాధిక్యములను క్రొత్తక్రొత్త హేతువులతో క్రొత్తవిధమున జెప్పి వారి మనస్సున నా విషయములు నాటుకొనిపోవునట్లు చేసెడివారు. వారి యమృతవచనము లెల్లపుడును నూతనగూఢవిషయములతో నవీనభావములతో నొప్పారుచు నొక యపూర్వవిధమున నుండెడివి. హుజూరుమహారాజువారు రాధాస్వామీ మత విషయములను వివిధ సమయములందు వెవ్వేఱు విధములుగ విశదీకరించుచుండెడివారు. వారు సెలవిచ్చెడి ప్రతిమహావచనముగూడ నెప్పటికప్పుడు నవీనకాంతులతో నవీనమనోహరరీతిని నవీనశోభతో ప్రకాశించుచుండెడిది.

60. స్వామీజీమహారాజువారి కాలములో ఆరతి జేయువిధము పూర్వాచార ప్రకార ముండెడిది, అనగా భక్తు లొకపళ్ళెములో దీపము వెలిగించి

పెట్టి, ఆపళ్ళెమును చేతితో పట్టుకొని స్వామీజీమహారాజువారి సమ్ముఖమున పైకికిందికి త్రిప్పుచుండెడివారు. ఆసమయమున నితరసత్సంగులు ఆరతిశబ్దములను పఠించుచుండెడివారు. కాని హుజూరుమహారాజువారు ఆరతిజేయు సమయమున, వారు స్వామీజీమహారాజువారియెదుట నట్టి జ్యోతిని వెలిగించిన పళ్ళెమును 2, 3 సార్లు మాత్రమే త్రిప్పి, పిమ్మట స్వామీజీమహారాజువారి యెదుట కూర్చుండి కనురెప్పవేయకుండ వారి నేత్రకమలముల వైపు తదేక దీక్షగ జూచుచుండెడివారు. కావుననే హుజూరుమహారాజువారు తమ యాధిపత్యకాలములో, భక్తులకు మొట్టమొదట ఆరతియొక్క యుద్దేశ్యాదర్శములను తెలియజెప్పి పిమ్మట శబ్దముల పఠింపనక్కఱలేకుండగనే సత్సంగులను సద్గురుని నేత్రకమలములందును, ఫాలభాగమునందును దృష్టి నేకాగ్రచిత్తముతో నిలుపుడని సెలవిచ్చెడివారు. భక్తులు అట్లుచేయునపుడు వారిలో, సద్గురువు ధ్యానావసను కలుగజేయుదురు. ఇట్టి ఆరతిని నిశ్శబ్దారతియందురు.

61. ప్రారంభములో తమ్మనతాము పుత్రులుగను హుజూరుమహారాజువారిని తండ్రిగను భావించులాగున సత్సంగులందఱకు నలవఱచి, హుజూరుమహారాజువారు మహాదయాకటాక్షములతో భక్తిమార్గమును సులభసాధ్యము జేసిరి. హుజూర్‌మహారాజువారు సత్సంగులపై దయా ప్రేమవర్షమును గురిపించి వారల నుత్సాహపఱచుచు, లోకములో తండ్రి తన పిల్లలయెడల నెట్లు ప్రవర్తించునో యట్లే, సత్సంగులయెడల గొప్ప సహనశక్తితోను క్షమాభావముతోను ప్రవర్తించుచు, సత్సంగుల లోపములను తప్పిదములను క్షమించుచుండెడివారు. అందుచే తండ్రియొడిలో నాడుకొనుపిల్లలవలెనే, సత్సంగులు వారి చరణములవద్ద నతిసంతోషముగ నంటిపెట్టుకొని యుండెడివారు. సత్సంగులు వారి యపారదయాకటాక్షముల ననుభవించుచు, దీనత్వ కృతజ్ఞతాభావములతో నిండి, నిత్యము నానందమగ్నులయి యుండెడివారు.

62. హుజూర్‌మహారాజువారు సత్సంగులకు అభ్యాససమయమున మనస్సు నేకాగ్రము జేయుట కనేకపద్ధతులను బోధించెడివారు. అవ్విధముగ సత్సంగులు మనస్సు నేకాగ్రము చేసికొనుచు పరమానందము నొందుచుండెడివారు. సత్సంగులు తమయాత్మ నాంతర్యమున నూర్ధ్వముగ నాకర్షించి పైకారోహింపజేయుటకై, సత్సంగములోపఠించు శబ్దములలో వర్ణించబడు నున్న తాంతర్యస్థానములందు, పారసమయములో తమ లక్ష్యము నాంతర్యమున నిల్పుకొనుచుండుట యత్యావశ్యకమని వారు నొక్కిచెప్పుచుండెడివారు.

63. హుజూరుమహారాజువారు, ఆగ్రా పట్టణమునకు రాలేకుండినట్టి యుపదేశార్థులగు జిజ్ఞాసువులు మొట్టమొదట రాధాస్వామీమతములోని కొన్ని ప్రారంభికగ్రంథములను చదువవలయునని విధించి, అందు చెప్పబడిన సిద్ధాంతములను, సామాన్యనియమనిబంధనలను వారు హృదయపూర్వకముగ నంగీకరించిన పిమ్మటనే, వారి కుపదేశమున కనుజ్ఞనిచ్చెడివారు. అట్టివారికి, వారి యూరిలోని మఱొక సత్సంగిద్వారా గాని, లేక, ఆధ్యాత్మికసాధన నభ్యసించు విధానమును తెలుపు నొక లిఖితపత్రముద్వారా గాని, యుపదేశము నిచ్చెడివారు. సర్వసాధారణముగ సత్సంగులకు తమ భార్యల కుపదేశమిచ్చుట కనుజ్ఞనిచ్చి, యుపదేశానంతరము కేంద్రస్థానమునకు తెలుపుమనెడివారు వివిధపట్టణములలోను, పల్లెటూళ్ళలోను సత్సంగ బ్రాంచిలుగూడ స్థాపించబడుచుండెడివి.

64. హుజూర్ మహారాజువారి కాలములో ననేక ప్రచలితమతములవారు అనగా హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, జైనులు, పార్సీలు మొదలగువారు రాధాస్వామీమతములో నుపదేశమునొంది యాధ్యాత్మిక లాభము నొందిరి.

65 అదేవిధముగ నున్నతచైతన్యమండలముల గూఢరహస్యముల నవగాహన జేసికొనుసమర్థత గల్గినట్టి భారతదేశముయొక్క వివిధప్రాంతముల లోని ప్రజలు, అందులో ముఖ్యముగ కళాశాలోపాధ్యాయులు, భిషగ్వరులు, న్యాయవాదులు, కళాశాలాపట్టభద్రులు (graduates) మొదలగు విద్యావంతులును, జ్ఞానసంపన్నులును చాలమంది యీమతమున చేరిరి.

66. దినములోని 24 గంటలలోను హుజూరుమహారాజువారు 3, 4 గంటలు మాత్రమె విశ్రాంతి దీసికొనెడివారు. సత్సంగము ప్రజాసామాన్యమందఱకును తెలుపబడియుండి, రోజునకు 5సార్లు చేయబడు చుండెడిది. పైయూళ్ళనుండి జిజ్ఞాసువులు దర్శనార్థమై వచ్చినపుడు హుజూర్ మహారాజువారు కొంచెముగూడ విశ్రాంతి తీసికొనకుండ 24 గంటలు పనిచేసెడివారు. హుజూర్ మహారాజువారు దినమునకు 5సార్లు సత్సంగము చేయుటయేగాక, శేషించిన సమయమును జిజ్ఞాసువుల సంశయనివారణార్థమై చర్చలు సల్పుటకును, ఉత్తర ప్రత్యుత్తరములను వ్రాయుటకును, పవిత్రగ్రంథముల కవసరమయిన వ్యాసములను వచనములనుచెప్పి వ్రాయించుటకును, వినియోగిం

చుచు, తమ భౌతికశరీరముయొక్క విశ్రాంతి విషయమై యీషణ్మాత్రము గూడ సరకుచేసెడివారుకారు.

67. చాలకాలము వఱకు పైయూళ్ళనుండి వచ్చిన సత్సంగులకు హుజూర్ మహారాజువారి గృహముననే బసలిచ్చి యుచితముగ భోజనముగూడ పెట్టుచుండెడివారు రానురాను దర్శనార్థమై వచ్చెడివారి సంఖ్య హెచ్చిపోయి, వారందఱకును తమ యింటనే బసలిచ్చుట యసాధ్య మగుటచే, భేంటుద్రవ్యమునుండి ఖర్చుపఱచి కొన్ని పరిసరగృహములను కొనిరి. అట్లే భేంటుద్రవ్యమును ఖర్చుపఱచి సత్సంగులకు వేఱేవంటశాల నేర్పాటుచేసిరి. అయినను కొద్ది విశిష్టసత్సంగులును, సాధువులునుమాత్రి మదివఱలోవలెనే హుజూర్ మహారాజువారి గృహములోనే భోజనము చేయుచుండెడివారు.

68. హుజూర్ మహారాజువారు సాధువులకొఱకు వసతిగృహములను కట్టించుటకును. స్వామీబాగు రాధాబాగులలో కొన్ని భవనములను నిర్మించుటకును, సమాధినిర్మాణమునకును, తమ స్వంతద్రవ్యమునే వ్యయపఱచుచు, భేంటుద్రవ్యము నంతను మిగిలిన గృహనిర్మాణపు ఖర్చులకును, సత్సంగుల భోజన వసతులు, ప్రసాదమువగైరా ఖర్చులకును వినియోగించెడివారు. తమ స్వంత ద్రవ్యమునుంకి బీదలకు అదివఱలోవలెనే కొంత ధర్మము చేయుచు, వితంతు స్త్రీలకును బీదసాదలకును వస్త్రములను గూడ పంచిపెట్టుచుండెడివారు.

## హుజూర్ మహారాజువారి గ్రంథములు

69. హుజూర్ మహారాజువారి గ్రంథములలో వేదాంతులకు, తార్కికులకు, జ్ఞానులకు, యోగీశ్వరులకునుగూడ నగోచరమైన యున్నతచైతన్యధామములయొక్క వర్ణనలును, విశేషములును గలవు. అందలి భాష విద్యావంతులకును విద్యావిహీనులకునుగూడ, సులభముగ నవగాహన కాగల మృదు మధురశైలిలో నున్నది. హుజూర్ మహారాజువారు గద్యరూపమునను, పద్య రూపమునను గూడ నెన్నియో గ్రంథములను రచించిరి. వారు స్వయముగ వ్రాసిన వ్యాసములతో ప్రేమపత్రియను నొక పక్షపత్రికనుగూడ వారు అయిదుసంవత్సరముల పైకాలము ప్రచురించిరి. తరువాత నా పత్రికలో ప్రచురించిన వ్యాసములనే జేర్చి ప్రేమపత్రి యను నాఱు సంపుటములుగల గ్రంథముగ నచ్చొత్తించి ప్రకటించిరి.

70 ప్రేమపత్రికాక, నీ మతసిద్ధాంతములను నూతన ప్రకాశము గల్గునట్లు వివరించిన గద్యరూపమయిన యనేకగ్రంథములు వారిచే రచింపబడినవి. వారు రచించిన "ప్రేమవాణి" యొక్క నాల్గు సంపుటములలో ప్రకటింపబడిన శబ్దములు భక్తుల హృదయములను ప్రేమవిరహభావములతో నోలలాడించును.

71. హుజూర్ మహారాజువారు తమ బోధలలో భగవంతుని యెడలా భక్తి ప్రేమలకును, సద్గురుచరణములం దనురాగమునకును అమితప్రాధాన్యమిచ్చిరి. ఈ రెండింటిని జయప్రదముగ సాధించినయెడల భక్తునికి ప్రపంచములోని జడపదార్థముల యెడలను, ఐహికసుఖములు వాంఛలయెడలను, సహజవైరాగ్యము సిద్ధించును. భగవంతునియెడలను సద్గురువునెడలను ప్రేమానురాగములు అమితావశ్యకములు. హుజూర్ మహారాజువారు తమ గద్యపద్యగ్రంథము లన్నిటిలోను తమ వచనములలో గూడ భగవంతు డపారప్రేమసింధువని బోధించి, వారిభక్తు లీ సత్యము ననుభవరూపముగ తెలిసికొనగల్గునట్లు చేయునిమిత్తము వారి కాంతర్యానుభవముల నిచ్చుచుండెడివారు.

## భక్తుల విచిత్రానుభవములు

72 హుజూర్ మహారాజువారు జిజ్ఞాసువులను, సూక్ష్మరూపములో దర్శనమిచ్చియు నితరవిధములుగను, తమ పాదపద్మములవద్ద కెట్లు ఆకర్షించుచుండిరో తెలియజేయునట్టి కొన్ని సంఘటన లీక్రింద నుదహరింపబడినవి.

(1) గంగారామ్ సింధీయను నొక వేదాంతి సింధుదేశపు హైదరాబాదులో సత్సంగులను తఱచు కలసికొనుచు, వారు రాధాస్వామీమతమును గుఱించి ప్రశంసించి నప్పుడెల్లనందుకు విరుద్ధముగ మాటలాడుచుండెను. ఒకసారి ఆయన "శిబి" నుండి హైదరాబాదునకు రైలులో ప్రయాణము చేయుచుండగా, హుజూరుమహారాజువా రాయనకు సూక్ష్మశరీరములో దర్శనమిచ్చి యుక్తియుక్తమైన విమర్శచే నాయనకు రాధాస్వామీమతముయొక్క మహిమాతిశయములను నచ్చజెప్పి యంతర్ధానమయిరి. పిమ్మట నాయన హుజూర్ మహారాజువారికొఱకు ఆరైలులో నంతటను వెదకినను మఱల హుజూర్ మహారాజువారు కనుపడలేదు. ఇంటికి జేరిన తర్వాత నాయూరిలో సత్సంగమునకు పోగా నచ్చట హుజూర్ మహారాజువారి ఫొటోనుజూచి నేనురైలులో

జూచిన వారీ ఫోటోలో నున్న వారే యనిజెప్పి జరిగిన యనుభవమును సమగ్రముగ నందఱకుం జెప్పిరి. తర్వాత హుజూర్ మహారాజువారి చిరునామాను తెలిసికొని యుపదేశమునకై వ్రాసికొని, యనుమతి నొందిరి. ఉపదేశమును తీసికొనిన పిమ్మట దీక్షగ ప్రేమోత్సాహములతో నాధ్యాత్మిక సాధనల నభ్యాసము జేయనారంభించిరి.

•(ii) ఇటావాలో నొక వయోవృద్ధుడు అచ్చటి సత్సంగమునకు వెళ్ళి యీమతము యొక్క మహిమను తెలిసికొని హుజూరుమహారాజువారి కుపదేశమునకై దరఖాస్తు పెట్టుచు నందులో తనకు ఆగ్రా వచ్చుటకు శక్తి చాలదని తెలియపఱచుకొనెను. అంతట వా రాయనకు లాలాలక్ష్మీనారాయణగారు అనే పోలీసుసబిన్స్పెక్టరుగారివద్ద నుపదేశము నొందవలయునని యానతిచ్చిరి కాని తనకు హుజూరుమహారాజువారివద్ద స్వయముగ నుపదేశమునొందవలయునని యున్నదనియు, తనకు ప్రయాణముచేయు శక్తిరాగనే ఆగ్రావచ్చెదననియు నాయన హుజూరువారికి తిరిగి వ్రాసికొనెను పిమ్మట నతి డుపదేశము నొందవలెనని యాతురతతో తన అసమర్థతను దల్చుకొనుచు నిరాశతో నిదురవోయెను. ఆనిద్రలో హుజూరుమహారాజువారు స్వప్నములో కనిపించి స్మరణ, ధ్యాన, భజన అభ్యాసముల మూడింటి నుపదేశమిచ్చిరి. ఆయన యమితానందపరవశుడై హుజూరుమహారాజువారి దయకు కృతజ్ఞతాపూర్వకధన్యవాదములను జెప్పుకొనుచు నుత్తరము వ్రాసికొనెను.

(iii) ఒక అమెరికాదేశపుస్త్రీ యోగసాధన చేయుచుండెను. ఆమె కాయభ్యాసములో కొన్ని విఘ్నములురాగా, అందుకు తగిన ప్రతిక్రియ తనకు హిందూదేశములో తెలియగలదని యామె కాంతరంగికసూచన పొడమెను. ఆమె తనకుమారు నందుకొఱకై హిందూదేశము పంపెను. అత డీదేశము వచ్చి యనేక స్థలములకు వెళ్ళెనుగాని, యెచ్చటను అతనికి తృప్తికరమగు సమాధానము లభించలేదు. అట్లుసంచారము చేయుచు, నాయనకు హుజూర్ మహారాజువారిని గుఱించి తెలియగ, నాయన ఆగ్రా వచ్చి హుజూర్వారిని కలిసికొని తన తల్లి యొక్క సమస్యను వారియెదుట పెట్టెను. అంతట హుజూరుమహారాజువారు ఆయన తల్లి చేయు యోగసాధనల చరిత్ర నంతను వివరించి, ఆమెకుగల్గిన విఘ్నములకు కారణమునుగూడ తెలియజెప్పి, ఆ విఘ్నములకు చికిత్సావిధానము నా యువకునకు, అతడు తిరిగి తనతల్లి కదంతయు సరిగ

చెప్పగలుగున ట్లతని కవగాహన యగులాగున బోధపఱచిరి, ఆమెకు పూర్తిగ నవగాహన కాగలందులకై వారొక యుత్తరమును గూడ వ్రాసి యిచ్చిరి.

(iv) ఒక జర్మనీదేశపు థియాసఫిస్టు (Theosophist) హుజూర్ మహారాజావారి దర్శనమునకు వచ్చెను రాధాస్వామీమత మూలసిద్ధాంతములను బోధలను గుఱించి వా రాయనకు రెండుగంటలసేపు విశదీకరించి చెప్పిరి. అందుచే నాయన యమితసంతృప్తుడై వెడలిపోయెను. ఆరాత్రి ఆయనకు రాధాస్వామీదయాళుకు అత్యుజ్జ్వలప్రకాశమానరూపములో దర్శనమిచ్చిరి. మఱునాడు మధ్యాహ్న మాయన తిరిగి హుజూర్ మహారాజావారి దర్శనమునకు వచ్చి తన స్వప్నమును గుఱించి చెప్పెను. అప్పుడు హుజూర్ మహారాజువారు స్వామీజీమహారాజావారి ఫొటోను చూపించగా నాదివ్యసుందరరూపమే తనకు స్వప్నములో దర్శనమైనదని ఆయన ధ్రువపఱచెను. అప్పుడు హుజూర్ మహారాజావా రాయనతో సవిస్తరముగ చర్చించి యాయన సందేహముల నన్నింటిని పూర్తిగ నివృత్తిచేసిరి ఆయన కోరికపై నాయన కుపదేశము గూడ నిచ్చిరి పిమ్మట నాయన హిందూదేశమంతటను పర్యటనము సేయుచు, తనమీద చూపిన మహాదయకు కృతజ్ఞతను దెలుపుచును, తన యాధ్యాత్మికాభివృద్ధిని గుఱించియు యుత్తరములను వ్రాయుచుండెడివారు.

(v) ఒక బెంగాలీసాధువు (పిమ్మట నతనికి దయాళుశరణని పేరు పెట్టిరి) కలకత్తాకు 25మైళ్ళ దూరములో నున్న యొక యడవిలో కాళికాదేవిని పూజించుచుండెను. అత డొకనాడు రాత్రి తన గుడిసెలో నిద్రిమత్తుగ నుండగా స్వప్నములో నొక సుందరయువతి గనిపించి యతనిని తనతో సాంగత్యమునకై పిలిచెను. అంతట నాయనకు హుజూర్ మహారాజువారు సూక్ష్మరూపమున దర్శనమిచ్చి యతని చేయిపట్టుకొని రక్షించి, జాగ్రిత్తగ నుండుమని హెచ్చరించిరి. అవ్విధముగ నాసాధువును వారు కాపాడి యుండనిచో నతడు పతితుడైపోయి యుండును. హుజూర్ మహారాజవారిని జూడగనే యాసుందరయువతి గూడ నదృశ్యమైపోయెను. పిమ్మట హుజూర్ మహారాజావారి దివ్యరూపముగూడ నంతర్థానమయ్యెను. అట్లు తనకు దర్శనమిచ్చిన మహాపురుషు లెవరో తెలిసికొనగోరి, ఆసాధువు మఱునాడు కలకత్తా బయలుదేఱి వెళ్ళెను ఆసాధువున కాకస్మికముగ నొకసత్సంగి కనిపించి, కలకత్తాలో ప్రతిదినము సత్సంగము జరుగునట్టి బాబూనిర్మలచంద్రబేనర్జీగారి

యింటి కాసాధువును తీసికొని వెళ్ళెను. అతడచ్చట హుజూరుమహారాజువారి ఫోటోను చూచి యది యెవరిఫోటోయని అడిగి తెలిసికొనెను. తన కాక్రితమురాత్రి వచ్చిన స్వప్నమును గురించి యచ్చట సత్సంగులకుచెప్పి, వారే తనను గాపాడిరని ధృవపఱచెను అచటి సత్సంగు లందఱును ఆఫోటో తమ గురువుగారిదే యని ఆయనకు చెప్పి, తమ గురువుగారు సత్సంగికాని వ్యక్తినిగూడ కాపాడిరని తెలిసి మహానందభరితులైరి. ఆసాధు వుపదేశము నొందనిశ్చయించుకొని, కొంతధనసహాయమునుగూడ పొంది, ఆగ్రావెళ్ళి హుజూర్ మహారాజువారి దర్శనము చేసికొని యానందపరవశుడై సత్సంగములో జేరెను. ఉపదేశము నొందినపిమ్మట నతడు బహుశ్రద్ధగ నభ్యాసము చేయనారంభించెను. కొద్దిరోజుల పిమ్మట నా సాధువునకు కాళికాదేవి కనిపించి మహాకోపముతో చీవాట్లు పెట్టుచు నీయభ్యాసమును విడిచివేయుమని బెదరించెను. అంతటనతడు, తా నా దేవికి భక్తిజేయుచున్న రోజులలో నామె తనకెన్నడు దర్శన మీయక పోవుటయేగాక తన భక్తిసాధనకు విఘ్నము గూడ చేయబూనెనని బదులుచెప్పి, తా నికముందామెను మన్నించువాడనుగానని చెప్పి వెంటనే రాధాస్వామీ పవిత్రనామము నుచ్చరింపఁదొడఁగెను. వెంటనే కాళికాదేవి మాయమైపోయెను. పిమ్మట నా సాధువునకు భక్తివిశ్వాసము లంతకంతకు దృఢమై యతడు సత్సంగములోనే సేవచేయుచు నుండిపోయెను

(VI) మధురలో నొక శ్రీకృష్ణ భక్తుడగు నరసింహదాసను సాధువు రాధాస్వామీమత ప్రాశస్త్యమును తెలిసికొని, ఆగ్రావచ్చి, హుజూర్ మహారాజువారి వలన రాధాస్వామీమత సిద్ధాంతములనుగూర్చియు సందలి యాధ్యాత్మికసాధనలనుగూర్చియు వివరము లన్నియు దెలిసికొని, యుపదేశమునొంది యభ్యాసము జేయదొడఁగెను. కొద్దిరోజుల పిమ్మటనే, "ప్రేమనివాస్"లో నత డభ్యాసము చేయుచుండగ శ్రీకృష్ణుడు వచ్చి యతని నాయభ్యాసము వదలివేయుమని గట్టిగ బెదిరించి భయ పెట్టెను. కాని యా సాధువు శ్రీకృష్ణునిమాట వినక, తనకింతకు ముందెందుకు దర్శన మీయలేదని వెటకారముగ శ్రీకృష్ణునకు ప్రత్యుత్తరమిచ్చెను. అంతట శ్రీకృష్ణుడు మహాకోపోద్రిక్తుడై తన బాకుతో నాసాధువుపైబడి పొడువ నారంభించెను. అంతట నా సాధువు రాధాస్వామీ నామస్మరణ ప్రారంభింపగా, అతనికి హుజూర్ మహారాజువారు దర్శనమిచ్చిరి. శ్రీకృష్ణుడు వెంటనే భయగ్రస్తుడై పాఱిపోయెను.

ఈ యనుభవమును ఆసాధువు ప్రేమనివాస్‌లో నొకనాడుదయము 8గంటలకు సత్సంగములో జెప్పెను. హుజూరుమహారాజువా రతని గాయములపై "మస్సాజీ" (Massage) చేసిరనియు నందుచే నతనికి బాధపూర్తిగ పోయిన దనిగూడ నతడుజెప్పి, అందుకు తార్కాణముగ తనశరీరము మీద మూడు చోట్ల కత్తిపోట్ల మచ్చలను గూడ సత్సంగులకు జూపించెను. అట్టి దయాకటా క్షానుభవము నొందుటచే నతని భక్తివిశ్వాసములు దృఢతరమై యతడు నిశ్చలభక్తితో యావజ్జీవము సత్సంగములో నుండెను.

(vii) ఒక సత్సంగియొక్క పుత్రుడు కూనీ కేసులో ముద్దాయిగ నుండెను. అతని ప్లీడరుగారు కోర్టువా రతనికి తప్పక నురిశిక్ష విధించెదరని నిరాశగ జెప్పెను. ఆముద్దాయితండ్రి హుజూరుమహారాజువారితో నిజగాథ యంతయు జెప్పి వారి దయాకటాక్షములకై ప్రార్థించెను. ఆకేసులో రాబోవు హాయిదా రోజువరకు ప్రతిదినము నుదయాస్తమయములందును, జడ్జీగారియెదుటకు వెళ్ళుటకుముందు అయిదునిమిషములసేపును, ఆపిల్లవానిచే నాంతర్యమున రాధాస్వామీనామము నుచ్చరింపజేయుమని హుజూరుమహారాజువా రాతనికి సలహానిచ్చిరి. ఆపిల్లవా డట్లే చేసెను. జడ్జీగారు ఆపిల్లవానిని నిర్దోషియని తీర్మానించి వదలివేయగ నందరకు నత్యాశ్చర్యమాయెను. పిమ్మట నాపిల్లవాడును అతని తండ్రియు నాగ్రావచ్చి హుజూరుమహారాజువారి చరణములవద్ద తమ కృతజ్ఞతను దెలుపుకొనిరి.

(viii) ఒకసారి సత్సంగులలో చాలమంది దగ్గుచే బాధపడుచు సత్సంగములో నెక్కువగ దగ్గ నారంభించిరి. రేగుపండ్లు తినుటచే దగ్గువచ్చునని యందరు ననుకొందురు. అందుచే హుజూరుమహారాజువారు చమత్కారముగ, "మీరందరును రేగుపండ్లెక్కువగ తినియుందు రనుకొనుచున్నా"నని చెప్పి తోటలోనుండి యప్పుడే తీసికొని వచ్చినట్టియొక గంపెడు రేగుపండ్లను తెప్పించి సత్సంగులందరకును పంచిపెట్టిరి. ఆరేగుపండ్లు తిన్నమీదట నందరకును దగ్గు పూర్తిగ తగ్గిపోయెను.

(ix) కాల్కాపట్టణ వాస్తవ్యులయిన (శ్రీ) అమరనాథుగారు ఒకమాసము సెలవుపెట్టి ఆగ్రా బయలుదేరి వచ్చి ఆగ్రాస్టేషనులో రాత్రివేళ దిగిరి కాని అంతకుముందతడు ఆగ్రా యెన్నడు రానందున నెచ్చటికి వెళ్ళవలయునో

తెలియక వెలవెల బోసాగెను. అతడీ యాదుర్దాలో నుండగా, "కాల్కా పండిత్ అమరనాథ్"అని కేక వేయుచు బాబాదయాళ్‌దాస్ అనునాయన వచ్చి యతనిని కలిసికొనెను. బాబాదయాళ్‌దాసు, తనను హుజూర్ మహారాజువారు "కాల్కా పండిత్ అమరనాథ్"ను స్టేషనులో కలిసికొని "ప్రేమ బిలాస్"సత్సంగభవనమునకు తీసికొనిరమ్మని పంపినారని ఆయనతో చెప్పగా నాయన నిశ్చింతపోయి హుజూరురాధాస్వామీ దయాళుని యపార దయకు కృతజ్ఞతాపూర్వక ధన్యవాదముల నర్పించెను.

(x) ఒకసారి యొక బీద బ్రాహ్మణుడు హుజూర్‌మహారాజువారి వద్దకు వచ్చి తన బీదస్థితిని గుఱించి చెప్పుకొని, తన కుమార్తెకు పెండ్లియీడు వచ్చినందున ప్రధానము అయిపోయినది, కాని పెండ్లిచేయుటకు తనవద్ద డబ్బు లేకుండెనని మొఱపెట్టుకొనెను. హుజూరుమహారాజువారు అతనికి పెండ్లికి కావలసిన ధనమును, బట్టలను ఇచ్చిరి. ఆ బ్రాహ్మణుడు బ్రహ్మానందభరితుడై కృతజ్ఞతతో వెడలిపోయెను.

(xi) ఒకసత్సంగి కుష్ఠరోగముచే బాధపడుచుండెను. ఆయన భార్య హుజూర్‌మహారాజువారితో నావిషయము జెప్పుకొనగా, వారు తాము రాబోవు ఆదివారము స్నానముచేసిన నీటిని పట్టి ఆమెకిమ్మని యింటిలోజెప్పి, ఆమెతో తనభర్త నానీటితో స్నానము చేయించుమని సెలవిచ్చిరి. ఆమె యట్లే చేసెను. దానితో నాసత్సంగికి కుష్ఠరోగము నివారణ మయ్యెను.

73 సత్సంగి, యీసృష్టికంతకు పరమపితయు పరమకారణమును రాధాస్వామీదయాళురే యని నమ్మికొనియుండి, మిగిలిన దేవతలను, దేవుళ్ళను పూజచేయుట మానివేయవలయునని రాధాస్వామీమతము విధించును. క్రింది మండలములకు జెందిన యీ అన్యదేవతలును, దేవుళ్ళును, తమ్ము వదలిపెట్టి నందుకు సత్సంగికి హాని కలుగజేయుదుమని యతనిని బెదరించి భయపెట్ట వచ్చును. కాని యతడు నిర్భయముగ నుండి అంతకుముందు తనకా దేవతలు దర్శనము నొందు కీయలేదని యెదురు ప్రశ్న వేయవచ్చును. సత్సంగి రాధాస్వామీపవిత్రనామము నుచ్చరించుచు సద్గురువుయొక్క పరమపావనస్వరూపమును ధ్యానము చేసినంతనే ఆదేవతలును దేవుళ్ళును మాయమైపోవుదురు.

74. బాబు అంబదాప్రసాదుగుప్తా యను నొక సత్సంగి హుజూర్‌మహారాజువారికొఱకొక సింహాసనము నొక సంవత్సరము కాలము చేయుచుం

డెను. అపుడు హుజూర్ మహారాజువారు ఆయనకు స్వప్నములో దర్శనమిచ్చి సింహాసనమును త్వరలో చేసివేయుమని యానతి నివ్వగా నాయన దానిని తొందరగ పూర్తిజేసి ఆగ్రా పంపించెను. ఆయన కూడ నాగ్రా పోదలంచి యుండగ, నాయన కుమారునకు ప్రాణభీతి కలుగునంత జబ్బుచేసినదని తెలియ జేయుచు నాయనను వెంటనే యింటికి రావలయునని కోరుచు నొక తంతి వార్త వచ్చెను. అంతట నాయన ఆగ్రా పోవుట నాపుజేసి యింటికి బయలు దేరెను. త్రోవలో తిరిగి హుజూర్ మహారాజువారు స్వప్నములో దర్శన మిచ్చి "నీకొఱకై యాఱుమాసములనుండి వేచియుంటిని. నీవిప్పుడిం టికి పోవుచున్నావు." అని ఆయనతో ననిరి. అంతటితో నాయన యిం టికి ప్రయాణము మానివేసి ఆగ్రా వెళ్ళుటకు నిశ్చయించుకొని, తన పిల్లవాని స్థితి యెట్లున్నదో తనకు ఆగ్రా తంతిపంపవలయునని యింటికొక తంతివార్త నం పెను. ఆయన ఆగ్రా జేరుసరికి, తనపిల్లవానికి ఖులాసాగా నుండుచున్నదనియు నాయన సత్సంగమునకై ఆగ్రాలో తనకిష్టమున్నన్ని రోజులుండవచ్చుననియు తెలియజేయుచు, నొకతంతివార్త యచ్చుటకు వచ్చియుండెను. ఆయన మహా సంతోషముతో సింహాసనము నలంకరించి హుజూర్ మహారాజువారి కర్పించి కృతజ్ఞతతో దండప్రణామము లొనర్చెను. హుజూర్ మహారాజువారు ఆసింహా సనము నతిదయతో నధిష్ఠించి ఆసత్సంగికి చాలసార్లు ఆరతిచేయుటకు సావ కాశమిచ్చిరి. ఈవిధముగ హుజూర్ మహారాజువారు తమ భౌతికశరీరమును విసర్జించకముందు మహాదయతో నాసత్సంగియొక్క హార్దిక వాంఛితమును పూర్తిజేసిరి

75. ఇట్లు అసంఖ్యాకులగు జీవులను హుజూర్ మహారాజువారు. జన్మమ రణచక్రమునుండి గాపాడి భక్తిమార్గమున ప్రవర్తింపజేసిరి. వేనవేల జీవు లకు శ్రద్ధాభక్తులుగల సత్సంగులయ్యెడి మహాఘనతను వారు ప్రసాదించిరి.

76. మానవజాతియొక్క యుద్ధారకార్యక్రమము నిరాటంకముగ సాగించు నిమిత్తము హుజూర్ మహారాజువారు పండితబ్రహ్మశంకరమిశ్రాసాహబ్ గారిని (వీరు తరువాత మహారాజ్ సాహెబ్ వారను పేరుతో సుప్రసిద్ధులయిరి) తమ యుత్తరాధికారిగ పేర్కొనిరి. హుజూరుమహారాజువారు వర్షించిన యపార దయాకటాక్షములకు కృతజ్ఞతను ప్రకటించుట మానవశక్తికతీతమయిన విషయము.

# నిర్యాణము

77. 1898వ. సం॥రములో హుజూర్ మహారాజువారి యారోగ్యము బాగులేకుండిన రోజులలో డాక్టర్లు వారినాడిని పరీక్షించగా, నది చాల బలహీనముగనుండి క్షీణించుపోవుచున్నట్లు కనిపించుచుండెను. కాని వారు నిర్వర్తించెడి కార్యకలాపమునుబట్టి చూడగ నట్లు నమ్ముటకు వీలుండెడిదికాదు. ఆస్థితిలోనే వారు వచనములను సెలవిచ్చుచు, మేడమెట్లెక్కుచు, నిటునటు మామూలుప్రకారము తిరుగుచు నుండెడువారు. కాని వారిముఖములో నప్పుడప్పు డలసిపోయినట్లు సూచనలు కనుపించుచుండెడివి. అట్టిసమయములో సత్సంగు లెక్కువగ బెంగపెట్టుకొని వారిని దయజూపుడని ప్రార్థించగా, వారు డాక్టర్లను వచ్చి తమ నాడిని పరీక్షించమని చెప్పెడివారు. డాక్టర్లు పరీక్షించి వారి నాడి సహజస్థితిలోనున్నట్లే చెప్పెడివారు. హుజూర్ మహారాజువారప్పుడు తమహస్తము నొక్కసారి తమ ముఖముమీదినుండి ప్రసరింపజేసి "మీరందఱు నెందుల కనవసరముగ బాధపడెదరు? నావంట్లో చాల బాగుగ నేయున్నది," అని సెలవిచ్చుచుండెడివారు. ఆవెంటనే వారిముఖము తిరిగి యుత్సాహపూరితముగను మహాదేదీప్యమానముగను కన్పించుచుండెడిది.

78 వారికి విశ్రాంతి యత్యంతావశ్యకమని డాక్టర్లు పట్టుపట్టుటచే 15 ఆగష్టు 1898 సం॥రము తేదీ ప్రేమపత్రి సంచికలో, ముందనుజ్ఞ లేనిదే, పైగ్రామములనుండి సత్సంగులెవరును సత్సంగముకొఱకై రావలదని ప్రచురణ చేయబడినది కాని వ్రాసికొన్నవారందఱకును తక్షణమే యనుజ్ఞ యీయబడుచుండెను. ఈవిధముగ నచ్చుటకువచ్చిన సత్సంగులసంఖ్య చాల యెక్కువైనందున వారందఱకు నింటిలోపలిగదిలో కూర్చుండుటకు చోటు చాలక సత్సంగము, దర్శనము చేసికొనుట కష్టమయ్యెను అందుచే హుజూర్ మహారాజువారు ప్రేమవిలాస్ అనుభవనములోనికి మారిరి. అచ్చట నందఱకును దర్శనమును, సత్సంగమును నిర్ణీతసమయములందు చక్కగ చేసికొనుటకు వీలుగ నుండెను.

79. వారు వచనములను మామూలు ప్రకారము సెలవిచ్చుచుండెడివారు. భోజనానంతరము హుజూర్ మహారాజువారు హాలులో నిటునటు పచారు చేయుచు, నిరువైపుల పంక్తులుకట్టి నిలుచున్న సత్సంగులవైపు, దయాకటాక్ష

ములతో నిండిన దృష్టిని ప్రసరించుచుండెడివారు. చిట్టచివరి రోజువఱకు నీ విధముగనే జరిగెను

80. హుజూర్ మహారాజువారు చివరి కొద్దిమాసములలో ననారోగ్యముగ నుండుటచే నందుగుఱించి సత్సంగులందఱు నాదుర్దాతోనే యుండిరికాని, 1898 సం।రము, డిసెంబరు. 5వ తేది ఉదయము వారికి అతిసారము ప్రమాదస్థితి లోనికి దిగి, వారు రక్తమును వమనముచేసికొన్నపుడు, సత్సంగుల వ్యాకులము నకును, ఆతురతకును మితిలేకుండెను. 5,6 తేదీలు రెండురోజులు నీవిధముగనే గడచెను

81. 1898వ సం।రము డిశంబరు, 6వ. తేదీ సాయంకాలము 6గం.40 నిముషములకు సాధువులుసత్సంగు లందఱునుండగా హుజూర్ మహారాజువారు సమయ మెంతయైనదని అడిగి తెలిసికొని, విశ్రాంతికై తలగడలను సవరించుకొనిరి. అయిదు నిమిషముల పిదప, ననగా6గం.45నిముషములకు వారు ప్రశాంతముగ పరుండి తమయాత్మను భౌతికశరీరమునుండి యాంతర్యమున కాకర్షించుకొని నిర్యాణమైరి. అప్పుడు వారి పరమపావన ముఖారవిందము దేదీప్యమానప్రకాశముతో నానందపూరితముగ భాసించుచుండెను. వారినేత్రములు శోభాయమానముగ నుండెను. వారు శరీరమును విసర్జించిన గదిలోని వాతావరణము మహాప్రశాంతముగ నుండెను.

82 వివిధ స్థలములలోని సత్సంగుల కీ మహావిపత్సమాచారమును తెలుపుచు తంతివార్త లీయబడెను. రెండురోజులవఱకు, అనగా 8వ తేదీవఱకు వారి శరీరమునట్లేయుంచిరి చాలమంది సత్సంగులు ఆపవిత్రశరీరముయొక్క ఆఖరు దర్శనము చేసికొనుటకు దూరదూరప్రదేశములనుండి వచ్చిరి చివరి క్షణమువఱకు నా పవిత్రశరీర ముకేతిరున శోభాయమానముగ నుండెను. మహారాజ్ సాహబ్ వారుకూడ వచ్చిరి. డిశంబరు 8వ తేదీన మహారాజ్ సాహబ్ వారు వచ్చినపిమ్మట మధ్యాహ్న మించుమించు3గంటల కాపవిత్ర శరీరమును సుమారు వేయిమంది సత్సంగులతో నూరేగించుచు గొనిపోయి తగుమర్యాదలతో దహనసంస్కారమును గావించిరి. హుజూర్ మహారాజు వారు నిర్యాణమయిన చోటనే వారిసమాధిని గట్టించిరి.

83. విగతశరీరులయిన జీవులు తమకిష్టము వచ్చినపుడు తిరిగి తమ పూర్వ శరీరమును పోలినరూపమును దాల్పగలరని గొందఱు విశ్వసింతురు. ఈసిద్ధాం

తము నంగీకరించిన యెడల నిర్మలమై తన్యధామమునకు జెందిన యాత్మలు, అనగా సంతులుగూడ, భక్తులకు మనశ్శాంతి చేకూర్చుటకై తమయద్భుతశక్తుల నుపయోగించి, తమయిష్టము వచ్చినపుడు, గతించిన సద్గురువుయొక్క మానవ రూపమును ధరించవచ్చునను విషయమును నమ్ముట కభ్యంతరముండకూడదు. ఈక్రింది సంఘటన లీవిషయమును ధ్రువపఱచగలవు.

84. 1897సం॥రము డిశంబరు 27వతారీఖున హుజూర్ మహారాజువారి నిర్యాణానంతరము జరిగిన ప్రథమ భండారారోజున డెహ్రిడూన్ వాస్తవ్యు లయిన సత్సంగి యొకరు ఈక్రింద నుదహరించిన తన యనుభవమును చెప్పెను.

"రాధాస్వామీమతము యొక్క ప్రాశస్త్యముం దెలిసికొని, యందలి విధినిషేధముల నంగీకరించి ఆగ్రా వెళ్ళి హుజూర్ మహారాజువారివద్ద నుపదేశము నొందనిశ్చయించుకొని, నే నుపదేశమునకై దరఖాస్తు పెట్టుకొంటిని. ఆమఱునాడే హుజూరుమహారాజువారు నిర్యాణ మైనట్లు తెలియుటచే నేను మహాదుఃఖతుడనై బాధసహించలేక నొక యడవిలోనికి వెళ్ళి అచ్చట బిగ్గఱగ నేడ్వసాగితిని. అంతట నాకసమునుండి హుజూరుమహారాజువారు సింహాసనారూఢులై నాయెదుట నే క్రిందికి దిగిరి. నేను వారి పాదపద్మములమీదఃబడి మ్రొక్కితిని. అప్పుడు హుజూర్ మహారాజువారు, "నీవేల నింత బాధపడుచున్నావు? నేనెచ్చటికిని పోలేదు. సత్సంగమును కనిపెట్టుచు కాపాడుచునే యుంటిని సత్సంగము ఆగ్రాలో సక్రమముగ జరుగుచున్నది. నీవచ్చటికిఁ బోయి యుపదేశము నొందుము. నీకోరిక సఫలమగును," అని సెలవిచ్చిరి. అందుచే నాకు దుఃఖోపశాంతి గలిగి, నేనిపు డుపదేశము కొఱకు వచ్చితిని." అపు డాయన యుపదేశము తీసికొని కొంతకాలము సత్సంగము చేసికొనుచు నిచట నుండిరి

85. లూధియానాలో బ్రాంచి సత్సంగము పండితతులసీరాముగారి యింటివద్ద జరుగుచుండెడిది కాని హుజూరుమహారాజువారు పరమపదించిన తర్వాత నచ్చటి సత్సంగులు సత్సంగమునకు వచ్చుట మానివేసిరి. నాల్గు రోజుల పిమ్మట నొకనాడుదయము 8గంటలకు పండితతులసీరాముగారు తమ యింట్లో కూర్చుండియుండగ నొకబండి వారియింటి యెదుట నాగెను హుజూరుమహారాజువా రందుండి దిగి, ఇంటిలోనికి వచ్చి "మీరేల సత్సంగమును మానివేసిరి? నేనెచ్చటికిని పోలేదు. సత్సంగక్రియాకలాపమును కని

పెట్టుచునే యున్నాను. వెంటనే సత్సంగము చేయుట ప్రారంభించుడు,'' అని చెప్పిరి. అప్పుడు పండితతులసీరామురాగారు వారిపాదపద్మములపైఁబడి మ్రొక్కిరి. హుజూర్ మహారాజువారు వెనుకకువెళ్ళి బండినెక్కినపిదప నాబండి కొద్దిదూరము వెళ్ళి యదృశ్యమాయెను. అప్పు డాయన సత్సంగు లందఱి యిండ్లకును వెళ్ళి యీ సంఘటనను జెప్పి వారందఱను సత్సంగమునకు పిలచిరి. ఆవిధముగ నచ్చట తిరిగి సత్సంగమును ప్రారంభించిరి.

86. హుజూర్ మహారాజువారి అనంతర ముపదేశమునొందిన యొక మద్రాసు సత్సంగికి, హుజూర్ మహారాజువారును రాధాస్వామీదయాళురు నొకరగునా కాదా యనుసంశయము కలిగెను. ఆయన యీ విషయమై యొక యుత్తరమును వ్రాయుచు పూర్తి చేయకుండగనే నిదురవోయెను. ఆ రాత్రి హుజూరుమహారాజువా రాయనకు స్వప్నములో 'నాతోరమ్ము, రాధాస్వామీవారి దర్శనమునకై నిన్ను గొనిపోయెదను,'' అని సెలవిచ్చిరి. అస్వప్నానంతరమున ఆయన ఆవిచిత్రవిషయము నందఱకుం జెప్పి సద్గురువు నెడల కృతజ్ఞతాపూర్ణుడాయెను.

## సమాప్తి

87. ఈసంక్షిప్త జీవితచరిత్రను చదివినపిమ్మట నెవరైనను హుజూర్ మహారాజువారు పరమోన్నతచైతన్యధామమునుండి యవతరించి రనువిషయమును సులువుగ గ్రహించగలరు. సురత్ శబ్దమార్గము యొక్క గూఢరహస్యమును తమకు తెలుపగల పరిపూర్ణసద్గురువుకొఱకై వా రన్వేషణజేయుచు తమకు స్వామీజీమహారాజువారితో గలిగిన ప్రథమసమావేశములోనే వా రట్టి పరిపూర్ణసద్గురువని గ్రహించిరి మానవజాతి పరమపురుషుని జేరుమార్గమును తెలిసికొనలేక పూర్ణనిరాశాప్రాయమైన దురవస్థలో మునిఁగియున్న క్లిష్ట సమయములో, పరమగురు స్వామీజీమహారాజువారు పృథ్వియం దవతరించిరి. హుజూర్ మహారాజువారు సంపూర్ణగురుముఖ భావముతోప్రవర్తించి సద్గురు సేవాభక్తులకు పరమోత్కృష్టాదర్శముంజూపి, కడపట తామే సద్గురువయిరి.

"ఆదయామయులు మొదట తామే శిష్యులై తనశరీరమును, మనమును, సర్వస్వమును సేవలో సమర్పించిరి. తిరిగి తామే గురువై సకలమానవులకు చైతన్యనామ మహాపరప్రసాదము ననుగ్రహించిరి.''

88 హుజూర్ మహారాజువారి నిర్యాణ మొక్క సత్సంగులనేగాక, వారి యెడల ప్రతిపత్తిగల బహుసంఖ్యాకులగు నితరులనుగూడ విచారసముద్రమున ముంచివైచెను. 1898 సం॥రము డిశెంబరు 28వ తేదీ ఇండియన్ మిఱ్ఱర్ (Indian Mirror) అను పత్రికనుండి యీక్రింద నుదహరించిన భాగమును బట్టి యీవిషయము తేటపడును.

## *25-12-1899 ఇండియన్ మిఱ్ఱర్*

## ( Indian Mirror. )

"ఆగ్రా వాస్తవ్యులైన రాయ్‌సాలిగ్రామ్‌సాహబ్ బహాదుర్ వారు గతించుట, యుత్తరాపర ప్రాంతముల (Northwestern Provinces) ప్రజలందఱకును మహాదుఃఖదాయకవిషయము. కీర్తిశేషులైన యీసత్పురుషులు తపాలా విభాగములో నొక మహోన్నతపదవి నలంకరించి, ప్రజలయొక్కయు, ప్రభుత్వమువారి యొక్కయు గౌరవవిశ్వాసములకు పాత్రులయిరి. అయినను, మేము రాయ్‌సాలిగ్రామ్‌వారి మరణప్రస్తావము నిచ్చుట, వారి యెడల తమ దేశప్రజలలో గల ప్రేమాతిశయము మూలముననే చేయుచుంటిమి గాని, వారి యుద్యోగపు హోదానుబట్టిగాదు. ప్రభుత్వోద్యోగములో నున్నతపదవి నొందిన భారతదేశీయు లొక్కొక్కప్పుడు బాహ్యవేషమునకు సంబంధించినంతవఱకు తమ జాతీయతను కోల్పోవు స్వభావమును గలిగి యుండుచున్నారు. రాయ్‌సాలిగ్రామ్ వారట్లుగాక, హిందువులందఱిలో నుత్తమ హిందువులై, యొక ప్రసిద్ధ హిందూపారమార్థిక సంఘమునకు నాయకులుగ నుండిరి. వారు మహాధార్మిక పురుషులు. వారి మరణమువలన హిందూసంఘ మంతకును మహానష్టము వాటిలెను.

# III

# పరమ పురుష పూరన్ధనీ

# మ హా రా జ సా హ బ్ వా రు

రాధాస్వామీమతములో పరమపూజ్య తృతీయసద్గురువగు మహారాజ సాహబ్‌వారు అను నామధేయముతో ప్రఖ్యాతిగాంచిన పండిత బ్రహ్మశంకర మిశ్రాసాహబ్ వారు క్రీ॥ శ॥ 1861 మార్చి నెల 28వ. తేది సాయంకాలము గం॥ 3–20 ని॥లకు వారాణసీ బ్రాహ్మణులలో నొక సుప్రసిద్ధ గౌరవకుటుంబమున జన్మించిరి. వారి పూర్వులు మొదట అజమ్‌గఢ్ గ్రామమునకు చెందిన వారై, ఘాజిపురమునకు వలసవెళ్ళిరి. మహారాజసాహబువారి జ్యేష్ఠ సోదరులగు పండితలక్ష్మీశంకర్‌మిశ్రాగా రచ్చటనే పుట్టిరి. పిమ్మట నీకుటుంబమువారు వారాణసికి వలసవెళ్ళి, అచట కబీర్‌చౌరాకు సమీపమున నున్న 'పియరీకలాం' అను మొహల్లాలో నివసించిరి. వారి మాతామహులు ప్రతాపగఢ్ జిల్లాలో భీతి యను పల్లెటూరిలో నుండెడివారు.

2 మహారాజసాహబువారి తండ్రిగారగు పండితరామజశన్‌మిశ్రాగారు సంస్కృతములో మహావిద్వాంసులై, వారాణసిలో నున్న క్వీన్సుకాలేజీలో (Queen's College) సంస్కృత ప్రొఫెసరుగా (Professor) పనిచేసిరి మహారాజసాహబ్‌వారికి ముగ్గురన్నగార్లును, మహేశ్వరీదేవియను నొక సోదరియును గలరు. సహోదరులందఱును యమ్. ఎ. పరీక్షలో ను త్తీర్ణులైరి.

3. మహారాజసాహబ్ వారికి 13ఏండ్ల చిఱుతప్రాయములోనే వారాణసిలో రాజాదర్వాజా మొహల్లాలోనున్న ఒకగౌరవనీయ కుటుంబములో వివాహము జరిగెను. వారి పూజ్యధర్మపత్నిని ఆతరువాత నెయ్యంజీ అను పేరుతో పిలుచుచుండెడువారు. ఆమెకు హుజూరుమహారాజువారు శబ్దప్యారీ యను నామధేయమును బెట్టిరి.

4. 1884 సం॥రములో మహారాజసాహబువారికి 23ఏండ్ల వయస్సులో వారితండ్రిగారు మరణించిరి. 4సంవత్సరముల తరువాత, అనగా 1888లో వారితల్లిగారు మరణించిరి. మహారాజసాహబువారి కుటుంబ మొకగొప్ప శిష్టాచారపరాయణుల సంఘమునకు చెందినదై, బ్రాహ్మణులలో మహా



III—మహారాజసాహబ్ వారు

(1861—1907)

*1898 లో సంత్ సద్గురువుగ ప్రకటమైరి.*

గౌరవనీయముగ నెంచబడు చుండినను ఈకుటుంబమువారు చాల స్వాతంత్ర్య ప్రియ స్వభావముగలవారు. వీరి తండ్రిగారు ప్రసిద్ధసంస్కృత విద్వాంసులును శిష్టసంప్రదాయములోని బ్రాహ్మణులు నైయుండియుగూడ సవర్ణులు తమ్మాక్షేపించెదరను జంకులేకుండ పాట్నాలోనుండు సయ్యద్‌సాహబ్ అను పేరుగల ఒక సుప్రసిద్ధ మహమ్మదీయ ఫకీరును గురువుగ స్వీకరించిరి. మహారాజసాహబ్‌వారి సోదరు లందఱకునుగూడ నీ స్వాతంత్ర్యప్రియ స్వభావమే ప్రధానలక్షణముగ నుండెను.

5. సయ్యద్‌సాహబ్‌గారు, తమశిష్యులయిన పండితరామజశన్‌మిశ్రాగారికి నలుగురు కుమారులు గలుగుదు రనియు నందులో కనిష్ఠపుత్రుడు మహోత్తమ శ్రేణికి చెందిన సిద్ధపురుషుడై వేనవేలు శిష్యులను గలిగియుండుననియు, నా కుమారుని గురువుగా రీశిష్యునియం దపారప్రేమ గలిగియుండురనియు భవిష్యవాణి చెప్పిరి. మఱియు, నాకుమారు కుటుంబమంతకును మహాయశస్సును సంపాదించుననియు, వారి యుత్తరాధికారిగూడ నుత్తమసంఘశ్రేణికి జెందిన ఒక పూజిపురవాస్తవ్యుడే కాగలరనియు, నాయుత్తరాధికారి తమ గురువుగారి (అనగా యీచతుర్థపుత్రుని) పేరుప్రఖ్యాతులను ప్రపంచమున మఱింత ప్రతిభాయమాన మగునట్లు చేయుననియుగూడ నా సయ్యద్‌సాహబ్ గారు చెప్పిరి.

6. మహారాజసాహబ్‌వారు స్వచ్ఛమగు దేహచ్ఛాయ గలవారును, ఆజానుబాహువులును, మహాబలశాలియు, నమితధైర్యశాలియును. అనిర్జేయ మనస్థైర్యముగలవారును. వారికి కుస్తీ పట్టుటలోను, సాము చేయుటలోను అభిరుచి మెండుగ నుండెడిది.

7. మహారాజసాహబ్‌వా రద్భుతబుద్ధిశాలి. చదువుకొను రోజులలో వారు ప్రతి తరగతిలోను ఉత్తమ శ్రేణికి జెందిన విద్యార్థులలోనే యెల్లప్పుడును పరిగణింపబడుచుండెడివారు. తమ తండ్రిగారు ప్రొఫెసరుగ పనిచేయుచున్న వారాణసిలోని క్వీన్స్ కాలేజీలోనే (Queen's college) వారి విద్యాభ్యాసము పూర్తిచేసికొని, వారి తండ్రిగారు చనిపోయిన సంవత్సరమగు క్రీ॥ శ॥ 1884లో ఆంగ్లభాషలో ఎం. ఎ. పరీక్షలో నుత్తీర్ణులైరి.

8. మహారాజసాహెబ్ వారి కుటుంబమువారు మద్య మాంసములను దీసికొనుచుండుటచే వీరుగూడ నట్లే చేయుచుండిరి. ఈసందర్భములో రెండు సంఘటన లిచ్చట నుదహరింపఁ దగియున్నవి. వారి యన్నగారగు పండిత రామశంకరమిశ్రాగారు బస్తీ యను గ్రామములో సెటిల్ మెంటు ఆఫీసరుగ పని చేయుచుండిన రోజులలో నొకనాఁ డీనలుగురు సోదరులు నా గ్రామములో పిట్టల వేటకై బయలుదేఱిరి. మహారాజసాహెబ్ వారు గొప్ప గుఱిగాండ్రగుటచే వారు 8, 9 సార్లుమాత్రము గుండ్లు దెబ్బలు కొట్టినంతనే యెన్నియో పక్షులు నేలఁగూలెను. క్షణకాలములో నన్నిపక్షులు చనిపోవుట గాంచినంతనే వారి కసహ్యావ్యథ గలిగి, యాక్షణముననే తమజీవితములో నిఁక నెన్నఁడును మాంసాహారమును ముట్టగూడని స్థిరనిశ్చయముఁ జేసికొనిరి. ఇటులనే, మఱొకసారి సోదరులు నలుగురును గలిసి వారిలోవారు త్రాగుడుపోటీ పెట్టుకొనిరి. మహారాజసాహెబ్ వారు మామూలుగ ద్రాక్షసారాయిని (wine) బహుకొద్దిగ తీసికొనుచుండెడు వారయ్యును, ఆరోజున పోటీమూలమున చాల యధికముగ ద్రావి స్పృహతప్పి పడిపోయిరి. మఱునాఁ డుదయమున వారులేచి గతరాత్రి తమకు గలిగిన యవస్థను దెలిసికొని, ద్రాక్షసారాయిని మఱెన్నఁడును ముట్టుకొనగూడదని యాక్షణముననే నిశ్చయించుకొనిరి.

9. మహారాజసాహెబ్ వారు ఎం. ఏ. పరీక్షలో నుత్తీర్ణులయిన పిదప నుద్యోగమునకై చూచుచున్నపుడు, 'బరేలీ' కళాశాలలో నొక యుపాధ్యాయ స్థానము ఖాళీయున్నట్లు పత్రికలలో ప్రచురింపబడెను. వీరదిచూచి దరఖాస్తు పెట్టగా, వీరి నాస్థానములో నియమించిరి. బరేలీ కళాశాలలో పనిచేయుచున్న రోజులలోనే వీరు తమ స్నేహితులైన మాధవప్రసాదసిన్హాగారివద్దనుండి సారబచన్ గ్రంథమును (గద్యము) తీసికొని చదివిరి.

10. ఆగ్రంథమును క్షుణ్ణముగఁ జదివినపిమ్మట దానిమహాప్రభావముచే వారి దృక్పథము పూర్తిగ మార్పుజెందెను. హిందూమతములో బోధింపబడుచు నాచరణలో నున్నట్టి సిద్ధాంతములకంటె నీగ్రంథములో జెప్పిన విషయములు మహాశ్రేష్ఠముగనున్నవని వారు గ్రహించి తద్గ్రంథకర్తలగు మహాపురుషుని గలిసికొనవలయునని వారికి తీవ్రమయిన కోరిక గలిగెను కాని వారి స్నేహితుడు వారికి, స్వామీజీమహారాజువారు పరమపదించిరనియు నా

సమయమున వారిస్థానే హుజూరుమహారాజువారు రాధాస్వామిమతమునకు పరమపూజ్య ద్వితీయాచార్యులుగ నుండిరనియు చెప్పినందున, వీలయినంత త్వరితముగ హుజూరుమహారాజువారిని కలిసికొనవలయునని వారికి తీవ్ర సంవేగము గలిగెను. అందుచే వారు, వారాణసికి హుజూరుమహారాజువారు వచ్చినపుడు తమకు తెలియజేయుమనియు, నట్లయినచో తాము వెంటనే వారాణసి కేఁగి వారి దర్శనము చేసికొందుమనియు, తమ స్నేహితునకు వ్రాసిరి.

11. ఆసమయమున హుజూరుమహారాజువా రుత్తరాపరప్రాంతములకు (North western Provinces) పోస్టుమాస్టరుజనరలుగా నుండి, అందుకు కేంద్రస్థానమగు అలహాబాదులో నివసించు చుండిరి. 1885 సం॥రములో హుజూరుమహారాజువారు తమక్రింది యాఫీసుల పరిశీలనార్థమై పర్యటనమునకు బయలుదేఱి, వారాణసికిగూడ వెళ్ళిరి. ఈవిషయమై మహారాజసాహబ్ వారికి కబురందిన వెంటనే వారు వారాణసికి పయనమై వెళ్ళిరి.

12. మహారాజసాహబువారు హుజూరుమహారాజు వారిని గలిసికొనుటకై తమ యన్నగారి గుఱ్ఱపుబండిని తీసికొని స్టేషనుకు వెళ్ళిరి. వారి స్నేహితులగు శ్రీమాధవప్రసాదసిన్హాగారుగూడ మఱొకబండి నేర్పాటుచేసిరి రైలుబండి వచ్చినపిదప హుజూరుమహారాజువారందుండి దిగినపుడు మహారాజసాహబువారు వారిని గాంచినంతనే, దర్శనానందములో తన్మయులై ప్లాటుఫారము మీాద నట్లె నిలుచుండిపోయిరి. హుజూరుమహారాజువారు ప్లాటుఫారమునుండి యీావల కేగినట్లుగూడ మహారాజసాహబ్ వారి కా తన్మయావస్థలో తెలియనే లేదు. శ్రీమాధవప్రసాదసిన్హాగారు తాముదెచ్చిన గుఱ్ఱపుబండి వద్దకు హుజూరుమహారాజువారిని తీసికొని వెళ్ళిరిగాని హుజూరుమహారాజువారు ఆప్రక్కనే యున్న రెండవ గుఱ్ఱపుబండినిచూచి, దాని నెవరు తెచ్చిరి రని యడిగి, యది మహారాజసాహబ్ వారిచే తీసికొనిరాబడినదని తెలియగనే నద్దానిలో నెక్కిరి. అందులో గూర్చుండినపిమ్మట, వారు మహారాజసాహబువా రెచటనుండిరని ప్రశ్నించినందున వారికొఱకై వెదకగా వారు ప్లాటుఫారము మీాదనే తన్మయత్వములో నిమీాలితనేత్రులై యుండినట్లు తెలిసెను. వారికొఱకు హుజూరుమహారాజువారు కనిపెట్టుకొని యుండిరని వారికి తెలుపగా వారు వెంటనే బయటనున్న గుఱ్ఱపుబండివద్ద కేఁగి అందు కూర్చుండిరి.

అప్పుడు వారిరువురు నా బండిలో హుజూరుమహారాజువారికొఱకేర్పాటు చేయబడిన బసకు వెళ్ళిరి.

13. మహారాజసాహెబ్‌వారి పద్ధతులును స్వభావమును ఈసంఘటన వలననే తేటపడగలవు. వారు తమ యౌవనములో, బుద్ధికుశలతగల దృఢకాయులగు యువకులు పాల్గొనుచుండునట్టి సకలయోగ్యక్రియాకలాపములలోను, అభిరుచి తీసికొనుచుండెడివారు. కాని తమ కుపదేశమైన మఱుక్షణమునుండియు నాక్రియాకలాపమునంతను గట్టిపెట్టి తమ తోడివారితో సహవాస సంబంధములనుగూడ త్రెంచివేసికొని, నిత్యము సద్గురుసేవాసత్సంగముల యందే తత్పరులై యుండెడువారు.

14. హుజూర్‌మహారాజువారు వారాణసిలో మొదటలో కొద్దిరోజులు మాత్రమే మకాము చేయదలంచియుండిరిగాని, పిమ్మట తమ కండ్లకేదో బాధ కలిగినదను కారణముచే వారచ్చట పదిదినములవఱకు నాగిపోయిరి. మహారాజసాహెబ్‌వారి కివ్విధముగ పదునగు కొన్నిరోజులవఱకు హుజూర్ మహారాజువారి సత్సంగము చేసికొను నద్భుతసావకాశము చేకూరెను. హుజూర్‌మహారాజువా రప్పుడు వీరికుపదేశమిచ్చి "ప్రేమానంద్" అను పారమార్థిక నామము నుంచిరి.

15. హుజూర్‌మహారాజువారు వారాణసినుండి వెళ్ళిన తోడనే మహారాజసాహెబ్‌వారు తిరిగి బరేలీ గ్రామము వెళ్ళి తమ కళాశాలలో చేరిరి. కాని హుజూర్‌మహారాజువారి సన్నిధి నుండవలయునని వారికి చాల యాతురత గ నుండుటచే వారు బరేలీలో నుద్యోగముఁ జాలించుకొని, అలహాబాదులో నేదేని యొక యుద్యోగము సంపాదించవలయునను కోరికతో నుండిరి. ఉత్తరప్రదేశపు అక్కౌంటెంటు జనరల్ గారు (Accountant General) వారాణసిలోని క్వీన్స్‌కాలేజీ ప్రిన్సిపాలుగారికా కాలేజీలోని పురాణ విద్యార్థులలో నాంగ్లభాషావిశారదుడగు యువకు నొకనిని పేర్కొన వలయునని గోరుచు వ్రాసినట్లును, అందుకా ప్రిన్సిపాలుగారు మహారాజ్‌సాహెబ్‌వారి పేరును శ్రీమాధవప్రసాదసిన్హాగారి పేరును పంపించి యున్నట్లును, మహారాజ్‌సాహెబ్‌వారికి తెలిసెను. అక్కౌంటెంటు జనరలుగారు మహారాజసాహెబ్‌వారి నెంచుకొని రు 90/-లు మాసిక వేతనముతో నాయన కుద్యోగము నిచ్చిరి. శ్రీమాధవప్రసాదసిన్హాగారికి గూడ నా యాఫీసులోనే పనిచేయవలెనని యున్నందున.

మహారాజసాహెబ్‌వారు అక్కుంటుజనరలుగారిని ఆయనకు గూడ నుద్యోగ మిప్పించుడని కోరిరి. అక్కుంటుజనరలుగారు చిట్టచివరకు శ్రీమాధవప్రసాదసిన్హాగారికిగూడ రు. 60/-ల మాసిక వేతనముతో నుద్యోగము నిచ్చుట కంగీకరించిరి.

16. ఈయుద్యోగము మూలమున మహారాజసాహెబ్‌వారికి నిత్యము హుజూర్‌మహారాజువారి సత్సంగము చేసికొను సావకాశము లభించెను. హుజూర్‌మహారాజువారు ఉద్యోగమునుండి 11-2-1887న విరమించుకొను వఱకును మహారాజ్‌సాహెబ్‌వా రాప్రకారము సత్సంగము చేసికొనుచుండిరి. పిమ్మట హుజూర్‌మహారాజువారు ఆగ్రా వెళ్ళి, యచ్చట పీపల్‌మండీలో సత్సంగము చేయుట ప్రారంభించిరి. మహారాజసాహెబ్‌వా రాగ్రాలో నే దైన నుద్యోగము సంపాదించుకొన దలంచిరిగాని వారికచట నేయుద్యోగమును లభించకపోవుటచే హుజూర్‌మహారాజువారు వారి నలహాబాదులోనే యుండి పొమ్మని సెలవిచ్చిరి.

17. మహారాజసాహెబ్‌వారికి తమ సద్గురువునుండి దూరముగ నుండుట కష్టముగ నుండెను. అందుచే వారు ప్రతి శనివారము నలహాబాదునుండి ఆగ్రా వెళ్ళి ఆదివారమంతయు నచ్చట సత్సంగముకొఱకు ఆగిపోయెడివారు. అట్లుచేయుటచే వారికి చాల వ్యయ ప్రయాసలు గలిగినను వారొక్క ఆదివారమైనను సత్సంగమునకై ఆగ్రావచ్చుట మానలేదు. ఆరోజులలో మహారాజసాహెబ్‌వారు తమయారోగ్యమును గుఱించిగాని, తమ బాహ్యవేషము దుస్తులను గుఱించిగాని యెంతమాత్రము శ్రద్ధ తీసికొనక నెల్లపుడు నాంతర్యమున పూర్తిగ తన్మయులై యుండెడువారు.

18. వారికొకసారి కాలిమీద వ్రణము వేసి, అందుకు శస్త్రచికిత్స (Operation) చేయించుకొనినందున వారు చాలకాలము లేచితిరుగలేకుండ నుండిరి. అట్లు వారికి శస్త్రచికిత్స జరిగి చాల యనారోగ్యముగనుండుచున్నను, వారు హుజూరుమహారాజువారి దర్శనార్థమై తీవ్రాసక్తితో నుండుటచే నుద్యోగమునకు సెలవుపెట్టి పూర్తిగ నొక్క సంవత్సర మాగ్రాలో నుండిపోయిరి. ఆగ్రాలో నున్న రోజులలో, మహారాజసాహెబ్‌వారు తమకు హుజూరుమహారాజు వారిచ్చిన ప్రసాదమునుమాత్రమే తినియుండెడివారు. హుజూరుమహా

రాజువారొక్కొకపుడు చాలినంత ప్రసాదము నిచ్చి, మఱేకప్పుడేమియు నిచ్చెడివారుకారు. కొద్ది సమయములలో వీరికి రోజులకొలది హుజూరుమహారాజువారు ప్రసాద మేమియు పెట్టకపోయినను, వీరన్నాళ్ళును మఱొక యాహార మేమియు తినకుండ నట్లేయుండిపోయెడివారు. అందువలన మహారాజ సాహబ్ వారి యారోగ్యము మొదటలో చాలబాగుండినను, క్రమక్రమముగ పూర్తిగ చెడిపోయి, వారు చాల నీరసించి కృశించి పోయిరి.

19. ఒకసారి స్వామీజీమహారాజ్ వారి కనిష్ఠసోదరులైన చాచాజీసాహబు గారనునామాంతరముచే పేర్కొనబడు సేఠ్ ప్రతాపసింగుగారు మహారాజ సాహబ్‌వారిని వారి పూజ్యధర్మపత్ని యగు నెయ్యంజీసాహిబాగారిని, హుజూరుమహారాజువారి యనుమతితో భోజనమునకు పిలిచిరి. నెయ్యంజీ సాహిబాగారు హుజూరుమహారాజువారి యాజ్ఞానుసారము ఆనాడుదయము ననే ఆముదమును తీసికొని యున్నందున భోజనమునకు వెళ్ళలేదు. మహారాజసాహబ్‌వారుగూడ భోజనమునకు వెళ్ళలేదు. చాచాజీసాహబుగారు అంతట తాము చేయించిన భోజ్య పదార్థములను దెచ్చి హుజూర్ మహారాజు వారి యెదుట నుంచిరి. హుజూర్ మహారాజు వారపుడు నెయ్యంజీసాహిబా గారికి వంట్లో బాగుండనిచో నా యాహారము నంతను మహారాజసాహబ్ వారొక్కరే భుజించినచో చాచాజీగారికి తృప్తికరముగ నుండగలదని సెల విచ్చి స్వయముగ నొక్కొక్క కబళము చొప్పున తినిపించ దొడంగిరి. మహారాజసాహబ్‌వారదంతయు నయిపోవు వఱకు నట్లే తినుచుండిరి అందుచే మహారాజ్ సాహబ్‌వారు తాము మామూలుగ తిని జీర్ణము చేసికొన గలిగిన దానికన్న నత్యధికముగ దినుట జరిగెను. అయినను తమ శ్రమను గుఱించి వారు హుజూరుమహారాజువారికి చెప్పనేలేదు.

20. మహారాజసాహబ్ వారి వేతనము అక్కౌంటెంటుజనరలుగారి ఆఫీసులోనున్న మిగత యుద్యోగస్థులకు మామూలుగ నిచ్చెడి వేతనముకన్న నధికముగ నుండుటచే, వారందఱకును వీరియెడల నసూయగ నుండెడిది. అందుచే వారందఱును ఛటప్రపన్ని మహారాజసాహబ్ వారి కెల్లపుడు నప్రధానమైన పనులనే యొప్పజెప్పుచుండిరి. మహారాజ్ సాహబ్ వారి కందుచే, తమ శక్తిసామర్థ్యములను ప్రదర్శించుటకు సావకాశములేక, మొదట కొన్ని సంవత్సరముల వఱకు వారికి ప్రమోషన్ (Promotion) కలుగలేదు. కాని

మతొక కొ్రొత్త అక్కవుంటెంటుజనరలుగారు వచ్చి పని నొప్పజెప్పుకొన్నపుడు మహారాజ్ సాహబ్ వారి కధిక వేతనము ముట్టుచుండుటచే వారికి ప్రత్యేక ప్రధాన కృత్యము లేమైన నొప్పగింప బడినవా యని మహారాజ్ సాహబ్ వారి నడిగిరి. ప్రధానమైన పను లెవ్వియు తమకెన్నడు నొప్పజెప్ప లేదని మహారాజసాహాహబ్ వారు సమాధానము చెప్పిరి. అందువలన, మహారాజ సాహబ్ వారి సామర్థ్యమును పరీక్షించుటకై, ఆ అక్కవుంటెంటుజనరల్ గారు కొంత ముఖ్యమైన పనిని వారి కొప్పజెప్పిరి. వారాపనిని బహు సామర్థ్యముతో నెఱవేర్చినందున నాయన చాల సంతుష్టి జెందిరి. అటుపిమ్మట మహారాజసాహబ్ వారికి ప్రమోషన్ పై ప్రమోషన్ గల్గుచు, చివరకు వారు ఆఫీసు సూపరింటెండెంటుగ నియమించబడిరి

21. మహారాజసాహబ్ వారు సూపరింటెండెంటు పదవికి రాగనే తమ క్రింది యుద్యోగస్థుల నందఱను నిర్ణీత కాలానుసారముగ నన్ని పనులను నెఱవేర్చ వలసినదని నియమించిరి. వారు స్వయముగగూడ నన్ని కార్యములను వానివాని నిర్ణీతసమయములలో జేయుచు తమపని నంతను శీఘ్రముగ పూర్తి చేసికొని, పిమ్మట నిమీలిత నేత్రులై ధ్యానములో నుండెడువారు. వారు పనిని చాలసమర్థతతో చక్కబెట్టు చుండుటచే వారికి తోడియుద్యోగస్థులను చాలమందిని తప్పించి ప్రమోషను (Promotion) నిచ్చి త్వరితముగనే వారిని అవధ, ఆగ్రా సంయుక్త ప్రాంతములకు (United Provinces of Agra & Oudh) అసిస్టెంటు అక్కవుంట్సు ఆఫీసరు (Assistant Accounts Officer) గ నియమించిరి.

22. మహారాజసాహబ్ వారు అలహాబాదులో పనిచేయుచుండినపుడు వారు ప్రతి ఆదివారము నాగ్రావచ్చుచుండెడివారని యిదివరలో చెప్పియున్నాము. ఆరోజులలో హుజూర్ మహారాజావారుగూడ నాగ్రాలో మహారాజ సాహబ్ వారి రాకకై యెదురు చూచుచు, వచనములను సెలవిచ్చుసమయములో, మహారాజసాహబ్ వా రలహాబాద్ నుండి వచ్చిన పిమ్మటనే వచనములు చెప్పెదనని యనుచు, తఱుచుగ వచనముల నాపుచేయు చుండెడివారు.

23 మహారాజ్ సాహబ్ వారు ప్రతివారము సత్సంగము కొఱకు ఆగ్రా వచ్చుచుండుటయే గాక తమకున్న సెలవు నంతను నుపయోగించుకొని ఆగ్రాలో నుండెడువారు. వారి నిస్స్వార్థ భక్తియు తదేకదీక్షయు వారికి

ప్రధానశిష్య పదవిని జేకూర్చినవి. హుజూర్ మహారాజవా రుత్తరప్రదేశము లోని తూర్పుప్రాంతముల సత్సంగులకు, వారాగ్రానుండి తమయూళ్ళకు తిరిగి వెళ్ళునపుడు, త్రోవలో నలహాబాదులో దిగి మహారాజసాహబ్ వారితో సత్సంగము జేసికొని వెళ్ళవలసినదని సలహా నిచ్చుచుండెడివారు.

24. మహారాజసాహబ్‌వారి పూజ్యధర్మపత్ని నెయ్యంజీసాహిబాగారు హుజూర్ మహారాజవారి యెడల మహాభక్తి గలిగి సత్సంగ కార్యకలాపములో నత్యుత్సాహముగ పాల్గొనుచుండెడివారు. ఆమె సత్సంగములో నెక్కువగ ఖర్చుపెట్టుచుండుటచే నామెవద్ద నెప్పుడును ద్రవ్యము కొఱతగనే యుండెడి దట. ఒకసారి యామె ఆరతి సమయమున పూలుదండను గొనుటకై, దండల నమ్ము పిల్లవద్దకు తొందరగ పోయి దండ నడుగగ నాపిల్ల తనవద్ద మిగిలి యున్న యొక్కదండను నెయ్యంజీగారి కిచ్చి అందుకువెల నేమిచ్చెదరని యడిగెను నెయ్యంజీగారు ఆపిల్ల ఏమడిగిన నదే యిచ్చెద నని చెప్పగ నామె వారిచేతి బంగరుగాజు నిమ్మని కోరెను. నెయ్యంజీగారు తక్షణమే తమ చేతి గాజును దీసి యాపిల్లకిచ్చి తొందరగ దండను తీసికొని సత్సంగమునకు పరుగున వెళ్ళిరి. ఈసంగతి హుజూర్ మహారాజవారికి తెలియగా వారాపిల్లను పిలిపించి చీవాట్లు పెట్టిరి ఆపిల్ల పరిహాసమునకై తానట్లడిగితి ననిచెప్పి బంగరు గాజును తిరిగి యిచ్చివేయుట కొప్పుకొనెను. కాని నెయ్యంజీగారు మాత్రము హుజూర్ మహారాజు వారిచే స్వీకరింపబడిన హారమున కాబంగారు గాజు చాల హీనక్రియ మనియే యనిరి.

25. వారాణసిలోని [1]సరయూపారీ బ్రాహ్మణులందఱకును మహారాజను సాహబ్ వారు రాధాస్వామీమతములో జేరి కాయస్థ కులమునకు జెందిన వారిని గురువుగ స్వీకరించిరని చాల కష్టముగ నుండెను. మహారాజ సాహబ్ వారు తమ కొమార్తెలకు వివాహము చేయుటకు సంబంధములను చూడబోగా నా బ్రాహ్మణులు వీరితో వియ్య మొందుటకు నిరాకరించిరి. ఈ విషయము హుజూర్ మహారాజవారికి తెలియగనే, వారు మహారాజసాహబ్ వారిని తమ కొమార్తెలకు కులవివక్షత లేకుండ సత్సంగికుటుంబములలోనే వివాహము చేయుటకు సిద్ధపడవలెనని సెలవిచ్చిరి ఒక ఖత్రికుల సత్సంగి సద

1 'సరయూపారీ' యనగ సరయూనది యొడ్డున నున్నవా రనియర్థము. సరయూపారీ బ్రాహ్మణులు. మిగత శాఖల బ్రాహ్మణులకన్న శ్రేష్ఠులుగ నెంచబడుదురు.

రుడు మహారాజసాహబ్‌వారి కొమార్తెను తన తమ్మునికి వివాహము చేసికొనుట కొప్పుకొనెను. కాని హుజూరుమహారాజువారు కొంతకాలము వేచియుండుటకు నిశ్చయించి తగిన బ్రాహ్మణవరుడెవరును వారు నిర్ణయించిన గడువులోపున లభ్యము గానిచో, నొక క్షత్రియకులజున కాపిల్ల నిచ్చి పెండ్లి చేయవచ్చునని సెలవిచ్చిరి.

26. ఈవార్త ఆగ్రా బ్రాహ్మణులను కలవరపఱచెను. అందుచే నొక యాగ్రా నివాసి యగు బ్రాహ్మణుడు హుజూర్‌మహారాజువారి సత్సంగమునకు వచ్చి, మహారాజసాహబ్‌వారి కొమార్తెను తన కొమారునికి చేసికొందునని జెప్పి, వారి నంతకుక్రిత మొసంగిన యుత్తరువును రద్దు చేయించుడని వేడుకొనెను. పిమ్మట మహారాజసాహబ్‌వారి మిగత నలుగురి కొమార్తెల వివాహములుగూడ నెట్టిశ్రమయు లేకుండగనే బ్రాహ్మణ కుటుంబములలో జరుపబడినవి

27 ఒకకొమార్తె పెండ్లిలో సత్సంగ పవిత్రగ్రంథములనుండి శబ్ద పఠనము చేసిరి. వివాహకార్యము జరుగుచుండగ సత్సంగ పవిత్రగ్రంథములనుండి శబ్దపాఠము చేయుట కూడదని కొందఱాటంకపఱచిరి. అపుడు మహారాజసాహబ్‌వారు, స్త్రీలు పవిత్రగ్రంథములనుండి శబ్దములను పఠించవలసినదని చెప్పుచు. నందు కాక్షేపణగలవారు తమ విహిత ప్రక్రియలను సాగించుకొనవలసినదని సెలవిచ్చిరి.

28. సత్సంగములో మహారాజసాహబ్‌వారు హుజూర్‌మహారాజువారి కెదురుగ దగ్గఱనే కూర్చుండెడివారు ఇది స్వామీజీమహారాజువారి కాలమునాటినుండియునున్న పురాణ సత్సంగుల కసూయను, కడుపుమంటను కల్గించెను. అప్పుడప్పుడు ఆపురాణ సత్సంగులు పైకి వినిపించునట్లు కూడ గొణఁగుకొనెడువారు. ఈవిషయమై హుజూర్‌మహారాజువారికి సూచనగ తెలియగనే వారు మహారాజసాహబ్‌వారి నందఱకన్న వెనుక గూర్చుండుమని యానతిచ్చిరి. మహారాజసాహబ్‌వా రట్లే చివరిపంక్తిలో గూర్చుండ నారంభించిరి. ఆరోజునుండియు హుజూర్‌మహారాజువారు వచనములను సెలవిచ్చుట మానివేసి. సత్సంగములో సంభాషణగూడ పూర్తిగ కట్టిపెట్టిరి చాలరోజు లీవిధముగ గడచినపిమ్మట వృద్ధసత్సంగులు తమ తప్పును తెలిసికొని హుజూర్‌మహారాజువారిని వచనములు సెలవిండని ప్రార్థించిరి హుజూర్‌మహారాజువారు, "నే నెవరికొఱకై వచనములను చెప్పుదును? ఎవ

రిని సంబోధించి చెప్పుదును!" అని మాత్రమే సెలవిచ్చిరి. అప్పుడు వారంద ఱును సిగ్గుపడి వెనుకకు జరిగి మహారాజ సాహెబ్ వారిని ముందు గూర్చుండు డని ప్రార్థించిరి.

29. మహారాజసాహెబ్ వారు ఆగ్రాలో నున్నపుడు, హుజూర్ మహారాజు వారిచ్చిన ప్రసాదమును మాత్రమే తిని, అది తమ ఆకలి తీరునంతగ లేకపోయి ననుగూడ, మఱేమియు తినకుండనుండెడువారు. ఒక రోజున హుజూర్ మహా రాజువారు ఒక్క కబళము మాత్రమే వీరికిచ్చి, మఱొక పనిలో నుండిపో యిరి మహారాజసాహెబ్ వా రారోజున నమితముగ నాకలిగొనియుండుటచే, వారికింకను దినవలెనని యుండెను గాని, మఱి లభించలేదు. సత్సంగమైన తరువాత మహారాజసాహెబ్ వారు తమ గదిలోనికి వెళ్ళిన కొద్దిసేపటికే వారికి బూర్తిగ నాకలితీరిపోయినట్లుండుటచే వారి కాశ్చర్యమాయెను మఱొకప్పుడు హుజూర్ మహారాజువారు వారికి చాల యధికముగ పెట్టగా పొట్ట బ్రిద్దలగు నంత యెక్కువగ తినవలసివచ్చెను. ఇక చాలు నని చెప్పుటకు వారి కెట్టి యభ్యంతరమును లేదుగాని, వారట్లు చెప్పకుండిరి. మహారాజసాహెబ్ వారికి పెరుగెంతమాత్రము సయించెడిదిగాదు. సాధారణముగ పెరుగు నెంతకొద్దిగ తీసికొనినను వారికి వికారము గలుగుచుండెడిది. ఒకనాడు హుజూర్ మహా రాజువారు పూర్తిగ పెరుగుతో గలిపిన యొక కబళమును మహారాజసాహెబు వారికి పెట్టిరి. వారేమాత్రము సంకోచింపక నాకబళమును మహానందముతో తినిరి

30. మహారాజసాహెబ్ వారు సద్గురు సత్సంగమునుండి దూరముగ, నల హాబాదులో నున్నపుడు అతిసామాన్యాహారమును చాలకొద్దిగ తీసికొనుచు, తమసమయమంతను పవిత్రశబ్దపారములోను, ఆధ్యాత్మికాభ్యాసములోను గడుపుచుండెడివారు. ఇతర సత్సంగుల కప్పుడప్పుడు రాధాస్వామీ మత సిద్ధాంతములను బోధపఱచుచు, అభ్యాసవిధానములను గుఱించి సలహాలనిచ్చు చుండెడివారు. వారు తఱుచు హుజూర్ మహారాజువారికి ఉత్తరములు వ్రాయుచుండెడివారు హుజూర్ మహారాజువారు అందుకు వెంటనే యుత్సాహ వర్ధకములు ప్రేమపూరితము లగునట్టి సమాధానములను పంపుచుండెడివారు. హుజూర్ మహారాజువారికి వీరియందుగల యాదరాతిశయమును, వీరి యోగ క్షేమముల విషయమైగల తీవ్రాతురతయును ఆయుత్తరములలోని ప్రతిపద

మునను విస్పష్టమగుచుండును. మహారాజసాహబ్ వా రొకసారి తమకు పరిచితులైన యొక బెంగాలీ సజ్జనునికి హుజూరుమహారాజువారింట్లో బస నిమ్మని కోరుచు వారి కుత్తరమువ్రాసిరి. అందుకు సమాధానముగ, హుజూర్ మహారాజవారు సత్సంగులు కాని వారల కాతిథ్యము నిచ్చుటకు తమ కభ్యంతరము లేదుగాని, తామిచ్చెడి యాధ్యాత్మికాహారమును పొందగోరువారికే ప్రత్యేకముగ తమగృహ మేర్పాటుచేయబడెననియు, నితరుల కట్టి యాహారమిష్టముండదు గావున వారికి తమ యింట నుండుట సౌకర్యముగ నుండదనియు సవిస్తరముగ వివరించుచు నుత్తరము వ్రాసిరి.

31. మహారాజసాహబ్‌వారు 1886 సం॥రము ఏప్రియల్ నెలలో నుపదేశము నొందియుండగ నటుపిమ్మట 1887 నవంబరు మాసమంతత్వరలోనే వీరికి హుజూరుమహారాజువారి యుత్తరములకు సమాధానములను వారితరఫున వ్రాసి పంపుట కధికార మిచ్చుట నిజముగ నొక యద్భుత విషయము. అటువంటి 1887, 1888, 1889 సం॥రములలో వ్రాసిన సమాధానములు లభ్యమైయున్నవి అట్టి యుత్తరములు కొన్ని "పిల్గ్రిమ్స్‌పాత్" (Pilgrim's Path) అను నచ్చుపుస్తకములో ప్రచురింపబడినవి.

## సంత్‌సద్గురువుగ నున్న సమయము

32. హుజూర్ మహారాజువారు నిర్యాణము నొందిన 6-12-98 తేదిని మహారాజసాహబ్ వారు అలహాబాదులో నుండిరి వారప్పటికి 3 మాసముల నుండి చాల జ్వరముతో నుండియు, నీవార్త తెలిసిన వెంటనే ఆగ్రా వెళ్ళిరి. సంతసద్గురు పదవి నలంకరించు నప్పటికి వారివయస్సు 37 సంవత్సరములు మాత్రమే. వారు అలహాబాదులో నివాసముగ నుండుటచే సత్సంగ కేంద్రము అలహాబాదునకు మారెను. అలహాబాదులో వారు సత్సంగము నుదయాస్తమయములుగాక మఱొకసారి రాత్రి గూడ చేసెడివారు. ఉదయమున సరిగ 6 గంటలకు మహారాజసాహబ్ వారు సత్సంగమునకు వచ్చెడివారు. గంటలకొలంది వచనములను సెలవిచ్చుచుండినను మహారాజసాహబ్ వారికి అలసటయుండెడిదిగాదు. అనేక సత్సంగులకేగాక, సత్సంగేతరులకుగూడ నెన్నియో యద్భుతమైన యాంతర్య నిదర్శనములు లభించెను. సత్సంగమునకు నాయకత్వమును స్వీకరించిన పిదప మహారాజసాహబ్ వారు యధార్థమైన సత్యాన్వేషు లందఱిపైనను, మానవబుద్ధికి దురవగాహ్యమగు విచిత్రవిధమున దయావర్షము గురిపించిరి

33. లూధియానాజిల్లా. రాయకోట అను గ్రామమున నొక సత్సంగి పోస్టుమాస్టరుగ (Post Master) పనిచేయుచుండెను. ఆయన తనవద్ద నధిక ముగనున్న సొమ్ము రు. 800/-లను, ఒక తోలుసంచిలో బెట్టి తాళము వేసి పైనసీళ్ళు (Seals) వేసి, తిరిగి యాసంచిని మఱొక క్యాన్వాసుసంచిలో (Canvas bag) పెట్టి, దానికి గూడ తాళము సీళ్ళను వేసి, లూధియానా హెడ్ పోస్టాఫీసునకు (Head post office) పంపించెను. ఆ మొత్తములో రు. 100/-లు తక్కువైనవని మఱునటి రోజుననే ఆయనకు తంతివార్తవచ్చెను. అదియునుగాక, నచ్చట కొకపోస్టల్ ఇనస్పెక్టరు (Postal Inspector) పరిశీలనార్థమై యేతెంచి పోలీసువారి కొకరిపోర్టునుగూడ పంపెను. ఆసత్సంగిపోస్టు మాస్టరు మహాఖేదగ్రస్తుడై తానీవిషయములో నిర్దోషినని చెప్పుకొనుచు మహారాజసాహబ్ వారికి వ్రాసికొనెను. అతడునిర్దోషియైనచో తనకెట్టి హానియు చేకూరదని ధైర్యముచెప్పుచు నతనికి నాలుగురోజుల లోపుననే మహారాజసాహబ్ వారివద్దనుండి సమాధానము వచ్చెను. ఒక వారమైనతర్వాత నతని తప్పేమియు లేదనియు, నాలోపము హెడ్డాఫీసుదే యనియు నొప్పుకొనుచు, హెడ్డాఫీసు నుండి యాపోస్టుమాస్టరున కుత్తరమందెను.

34 కొంత కాలమైనపిమ్మట సీమతమున నైదవ సద్గురువుగ విరాజిల్లిన సాహబ్ జీమహారాజువారికి గలిగిన యనుభవ మన్నిటికన్న నెక్కువ విచిత్రమయినది. సాహబ్ జీమహారాజువారు సద్గురువు కొఱకన్వేషించు చుండిన కాలములో వా రొకసారి నిరాశ నొంది మహాఖిన్నులై విచారించు చుండగ మహారాజసాహబ్ వారు వారికి స్వప్నములో దర్శనమిచ్చి వా రన్వేషణ చేయుచుండిన సద్గురువు తామే యని తెలియపఱచిరి. వారు మఱునాడుదయమున తమ యనుభవమును తమ రెండవ యన్నగారికి చెప్పగ, నాయన మహారాజసాహబ్ వారి ఫొటోను (Photo) వారికి చూపించిరి. వెంటనే ఆ ఫొటోలో నున్న మహాపురుషులే తమకు స్వప్నములో దర్శనమిచ్చి రని వారు సెలవిచ్చిరి. తోడనే వారు రాధాస్వామీమతములోజేరిరి సాహబ్జీమహారాజువారు సద్గురువు నన్వేషించుటలో సహించిన ఘోర పరీక్షలను మహాకష్టములను, శ్రమలను గుఱించిన వివరములు అయిదవయధ్యాయములో విపులముగ వర్ణించబడినవి.

౩౫. ఒకసారి మహారాజసాహబ్‌వారి సత్సంగమున కొక యార్యసామాజికుడు వచ్చెను. ఆయన చాలప్రశ్నల నొకచిన్న నోటుబుక్కు (Note Book) లో వ్రాసికొని తనవెంట తెచ్చుకొనెను. మహారాజసాహబ్‌వారి నతడు కొన్నిప్రశ్నల నడుగుట కనుమతిని గోరెను. అంతట మహారాజసాహబువారు ఆనోటుబుక్కును చూపించుమని యడిగి తీసికొని ఆనోటుబుక్కును చూచి ప్రశ్నలేవియు నందులో వ్రాసిలేవని సెలవిచ్చిరి. ఆయార్యసామాజికుడు వారివద్దకువెళ్ళి తననోటుబుక్కును తిరిగిచూచుకొనెను. కాని, దానిలో నిజముగ నేమియు వ్రాసియుండక పోవుట జూచి యతడాశ్చర్యపోయెను. ఆపుస్తకమును తెచ్చుకొని తనస్థలమున గూర్చుండి యందులో చూచుకొనగ నాప్రశ్నలన్నియు నందు స్పష్టముగ వ్రాసియుండినట్లు తిరిగి కనిపించెను. పిమ్మట మహారాజసాహబ్‌వా రొకవచనమును సెలవిచ్చి, ఆయార్యసామాజికుని ప్రశ్నలన్నిఁటికిని వరుసగ నావచనములో సమాధానములను చెప్పిరి. ఆవచనములను సెలవిచ్చినపిదప మహారాజసాహబ్‌వా రాయార్యసామాజికునితో తనప్రశ్నలన్నిఁటి నామ౯లునాడు పట్టుకొనిరమ్మని చెప్పిరి. కాని అతడు తిరిగి రాలేదు.

36. "ఇండియన్ మిర్రర్" అను పత్రికాసంపాదకులు మహారాజసాహబ్‌వారిని కొన్ని ప్రశ్నల నడుగఁదలఁచి సత్సంగమునకు వచ్చిరి. మహారాజసాహబ్‌వా రాయన కా ప్రశ్నలనడుగుటకు నావకాశమీయకుండగనే వచనమును సెలవిచ్చుట మొదలిడిరి. సత్సంగానంతర మాయనను ప్రశ్నలేమైనను వేయదలఁచితిరా యని మహారాజసాహబ్‌వా రడిగిరి. అందు కాయన మహారాజసాహబ్‌వారు సెలవిచ్చిన వచనములో తనప్రశ్నలన్నిఁటికి సమాధానములు వచ్చినవని యాశ్చర్యపడుచు చెప్పెను. మహారాజసాహబ్‌వారపు డాయనతో రాధాస్వామీ మతమును పూర్తిగ నవగాహనచేసికొనుటకు కొంతకాలము సత్సంగము చేసికొనవలసియుండునని సెలవిచ్చిరి. అంతట నా పత్రికాసంపాదకులు సత్సంగము చేసి కొనుటకై కొన్నిరోజు లుండిపోయిరి. ఆయన యున్న రోజులలో మహారాజసాహబ్‌వారు వచనముల నాంగ్లభాషలో సెలవిచ్చెడువారు.

37. ఒకయుద్ధభటుని దయ్యము, అలహాబాదులో నొక చదువుకొను నీడుగల ఖత్రీ పిల్లవానిని పట్టుకొనెను, అతడు రెండుకంఠధ్వనులతో మాటలాడ దొడఁగెను అత డొకసారి యొకసేనానాయకుని ఆజ్ఞాపనస్వరముతోను

మఱొకసారి యొక హోటు సైనికుని వలెను మాటలాడెడువాడు. వార్తాపత్రికలలో నీవిషయమును గుఱించి వింతగ వ్రాయుచుండుటచే నిజమును తెలిసికొనుటకై పత్రికాధిపతులు స్వయముగ నాపిల్లవానిని జూచుటకు వచ్చుచుండిరి. ఈ విపత్తునుండి తప్పించుకొనుటకై ఆపిల్లవాని తల్లిదండ్రులతని ననేక మహాపురుషుల వద్దకు గొనిపోయి చూపించిరి. మహారాజసాహబ్‌వారికి గూడ నాబాలుని చూపవలసినదని యెవరో సలహా నిచ్చినందున వారివద్దకు కూడ నతనిని తీసికొని వెళ్ళిరి. ఆపిల్లవాని సంభాషణవలన పూర్వ జన్మలో నత డొక సేనానాయకుడుగ నుండి యుద్ధములో చనిపోయినట్లును, ఆసేనానాయకునికిక్రింద నీదయ్యమొక యుద్ధభటుడుగనుండి వీరల పక్షమునకు యుద్ధములో జయము గలిగినపిదప చనిపోయినట్లును విశదమయ్యెను. ఆదయ్యము తన సేనానాయకుని కా గెలుపువిషయము తెలియజేయుటకై యతనికొఱ కింతకాలము వెదకుచుండెను. అత డీకుటుంబమున పిల్లవాడుగ పుట్టినట్లు తెలిసికొని యా గెలుపువిషయ మతనికి చెప్పి యతనిని తనతో తీసికొని పోవలయు ననునుద్దేశ్యముతో నదియతనిని పట్టుకొనెను. మహారాజసాహబ్ వా రాపిల్లవాని తండ్రిచే నొకమనిషికి సమృద్ధిగ సరిపడునంత యాహారము నొక గంపలో పెట్టించి, తాము కొంచెము ప్రసాదమునుగూడ నందుంచి, యా యన్నపుగంపను తమచే నిర్దిష్టమైన యొక నూతిలో దింపిచూడుమని యాతనితో చెప్పిరి. ఆనూతిలో నీటిమట్టము వఱకు నీగంప చేరగనే చివుక్కున నెవరో దానిని లాగుకొనినట్లాయెను. తరువాత నాదయ్యము ఆబాలు నెన్నడును బాధించలేదు

## కేంద్రీయ పాలక సమితి

### ( Central Administrative Council )

38 కొన్నిస్థలములలో సత్సంగవిషయముల నిర్వాహకపద్ధతి తృప్తికరముగ లేనట్లు మహారాజసాహబ్‌వారికి తెలియవచ్చెను. అందుచే 1902 సం॥రములో నొక సర్క్యులరు ఉత్తరమును ఆంగ్ల, హిందీభాషలలో వ్రాసి యందఱకు నంపిరి. అందు వ్రాయబడిన దేమనగా:—

“సత్సంగ పరిస్థితులు కొన్ని స్థలములలో సంతృప్తికరముగ లేనట్లు వివిధ ప్రదేశములనుండి వార్తలు వచ్చుచున్నవి. ఈ పరిస్థితుల నిట్లే యుండనిచ్చినచో సంఘము వెవ్వేఱు జట్టులు, కూటములు, తెగలుక్రింద చీలికలైపోయి, సత్సంగముయొక్క వాస్తవముఖ్యోద్దేశ్యమునకే అనగా, పరమపిత

రాధాస్వామీదయాళుని భక్తిసేవలను సాగించుటకే, భంగము కలుగునను భయము పొడముచున్నది ఇట్టి చిక్కువాటిల్లకుండ జేయుటకై రాధాస్వామీ సత్సంగమున కొక కేంద్రీయపాలకసమితిని (Central Administrative Council) స్థాపించుట కేర్పాటు చేయబడినది. ఆసమితి, అన్ని 'బ్రాంచి'లతో సమేతమైన యావత్తు సత్సంగముయొక్క నడవడిసి క్రమబద్ధము చేయుచు, మరణ శాసన మూలమున దానపట్టాలమూలమున, నితరవిధములుగను సత్సంగ మునకు సంక్రమించు యావదాస్తులకును ధర్మకర్తగనుండి వ్యవహరించగలదు.

"హుజూర్ స్వామీజీమహారాజవారి యనుజులగు ప్రతాప్‌సింగుసేఠ్‌గారి నీసమితి కధ్యక్షులుగ నెన్నుకొన దలంచితిమి. వారును దయతో నంగీకరించిరి. ఈసమితికి సభ్యులు పదిమంది మాత్రమే యుందురు. ఈపదిమందియు సత్సంగముయొక్క వివిధ బ్రాంచీల (Branch Satsangs) సత్సంగులచే నెన్నుకొనబడవలసియున్నది. తదుపరి, అన్ని 'బ్రాంచి'ల సత్సంగులును కేంద్రీయపాలకసమితియొక్క యుత్తరువులకు బద్ధులైయుండి, సమితి యాదేశములప్రకారము నడుచుకొనవలయును. మరణమువలనగాని, రాజీనామావలనగాని, మతేకారణమువలనగాని యీసమితిసభ్యులలో ఖాళీలు గలిగినపుడు ఆఖాళీలను నింపుటకును, సభ్యులసంఖ్యను హెచ్చించుటకును లేక తగ్గించుటకును, ఏసభ్యునినైనను యుక్తకారణము లున్నపుడు తీసివేయుటకును ఈ సమితికి అధికారము గలదు.

"ఈసమితికి సభ్యులుగ నెన్నుకొనదగినట్లు మాకుదోచిన 28 సత్సంగుల పేర్ల నీక్రింద నుదహరించితిమి ఆపట్టీలోని పేర్లనుండి ప్రతిసత్సంగియు పదిమంది నెన్నుకొని మఱొక కాగితముమీద వారికి వోట్లిచ్చినట్లు వ్రాసిపంపవలయును

* * * *

"సత్సంగిస్త్రీలకును 18పండ్ల ప్రాయము లోపు పిల్లలకును వోట్లువేయు హక్కు లేదు.

* * * *

"సంతసద్గురువు తిరిగి యవతరించినపుడు సత్సంగులు వారియెడల ప్రదర్శింప వలసిన విధేయతాసమ్మానముల విషయములోగాని వారికి జేయవలసిన

భక్తిసేవలవిషయములోగాని, యీసమితి యెవ్విధముగను కలుగజేసికొనవల యునని దీనినిర్మాణముయొక్క యుద్దేశముగాదు. అప్పుడు, సద్గురువు పరమ పితయగు రాధాస్వామీ దయాళుని ప్రధానపుత్రుడు లేక ప్రతినిధి యగుటచే, వారే సత్సంగముపైనను సత్సంగాస్తులపైనను సర్వాధికారములు గలవారై సర్వస్వాతంత్ర్యముతో ప్రవర్తించగలరు. అన్నివిషయములలో వారి యాజ్ఞ లకే సర్వోత్తమప్రాధాన్యముండును. అప్పుడీ సమితి, సద్గురువున కీయాస్తులపై పెత్తనముజేయుటలోను సత్సంగమును క్రమబద్ధముగ నుంచుటలోను సహా యము మాత్ర మొనరించగలదు."

ఈసర్క్యులరు ఉత్తరముమీద లాలాజీగారు మహారాజసాహబ్‌వారు లాలా రాజ్‌నారాయణగారు సేఠ్‌సుదర్శన్‌సింగుగారును సంతకములుచేసిరి.

39 పైపట్టీలో నక్షత్రములుగ నెంచబడిన పదిమందిపేర్లకును గుర్తులుంచ బడినవనియు, నా పదిపేర్లకు వోటరులందఱును ప్రాధాన్యమిచ్చెదరని యాశిం పబడుచున్నదనియు దెల్పుచు నొక హస్తలిఖితసందేశముగూడ కొందఱు ప్ర త్యేకవక్తులకు ఆసర్క్యులరుతోఁబాటు పంపబడెను.

40. తరువాత నీవోట్లుప్రకార మెన్నుకొనబడిన పదిమంది సభ్యులపేర్లను మఱొక సర్క్యులర్‌పత్రముద్వారా, సేఠ్‌ప్రతాపసింగుగారొక్కరిసంతక ముతోనే, ప్రకటించిరి. సహజముగ, నందఱు ననుకొన్నట్లే, మహారాజ సాహబ్‌వారి కందఱికన్న నెక్కువవోట్లు వచ్చినవి ఈ సమితియొక్క ప్రథమ సమావేశమును 1902వ సంవత్సరము డిసెంబరునెల నాల్గవవారములో నాగ్రాలో చేయనిశ్చయించిరి.

41. అప్రకారము రాధాస్వామీసత్సంగ కేంద్రీయపాలకసమితియొక్క ప్రథమసమావేశము, 1902వ సంవత్సరము డిసెంబరునెల 24, 25, 26వ తేదీలలో జరుపబడెను. సమితిచే నీసమావేశములో, చట్టప్రకారము దానికి సంక్రమించిన యధికారములు అవలంబింపబడి, దాని కార్యక్రమమును దాని నిర్వాహకవర్గము (Managing Committee) యొక్క కార్యక్రమమును సాగించుట కవసరమయిన నిబంధనలును, ఉపనిబంధనలును ఆమోదింపబడినవి. ఈసమితికి, మహారాజసాహబ్‌వారు సాధ్యక్షులుగను, బాలేశ్వరప్రసాదుగారు కార్యదర్శిగను ఎన్నుకొనబడిరి. ఉపాధ్యక్షులైన మహారాజసాహబ్‌వారును, మఱినలుగురును ఆనిర్వాహకవర్గమునకు సభ్యులుగనుండిరి. సమితికి అలహా

బాదు కేంద్రస్థానముగ నేర్పఱచబడెను. సత్సంగశాఖంచల జాబితాను సత్సంగములోని సాధువుల జాబితాను తయారుచేయుటకును, ప్రత్యేకముగ సాధువుల నడవడిని క్రమబద్ధము చేయుటకును, నిబంధన లేర్పఱచబడినవి.

42. పిమ్మట 1903 సం॥రములో నీసమితి మఱిరెండుసమావేశములను జరిగించి, సమితిసభ్యుల సంఖ్యను, అధ్యక్షునితో గలిపి 21 వఱకు పెంచిరి. అప్పుడే సర్కారుసాహెబ్ వారినిగూడ నీసమితిలో సభ్యులుగ జేసిరి.

## రాధాస్వామీ ధర్మకర్తృ వర్గము
### ( Radhasoami Trust )

43. 1904 సంవత్సరము జూన్ నెలలో జరిగిన కేంద్రీయ పాలకసమితి సమావేశములో, సత్సంగముయొక్క స్థిరచరాస్తులపై పెత్తనము జేయుటకై కేంద్రీయసమితిసభ్యులలో నేడుగురిసి రాధాస్వామీ ధర్మకర్తృవర్గముగ (Radhasami trust) నేర్పాటు చేసిరి. ఆవర్గములో మహారాజసాహెబ్ వారు గాక మిగిలిన ధర్మకర్తల (Trustees) పేర్లిక్రింద నుదహరింపబడినవి.

(1) లాలాజీసాహెబ్ (అనగ లాలా అయోధ్యాప్రసాద్ సాహెబ్)
(2) సేఠ్ సుదర్శన్‌సింగు సాహెబ్
(3) శ్రీమాధవప్రసాదసిన్హా సాహెబ్
(4) శ్రీ బాలేశ్వరప్రసాద్ సాహెబ్
(5) లాలాహారగోవిందదయాల్ సాహెబ్
(6) సర్కార్ సాహెబ్ వారు (బాబు కాంతిప్రసాద్ సిన్హా సాహెబ్ వారు)

44. ట్రస్టుదస్తావేజులో నీట్రస్టుయుద్దేశ్యము లీక్రిందివిధముగ నుదహరింప బడినవి:—

పైనుదహరించిన ధర్మకర్తలును (Trustees), యిఁకముందు వారి స్థానే నియమింపబడబోవు వారును, ఈదస్తావేజులో ధర్మకర్తలు (Trustees) అని పేర్కొనబడుదురు. సమకాలికసంతసద్గురు వెప్పుడేని యుండిన యెడల, వారే, పరమపురుష రాధాస్వామీదయాళునికి ప్రతినిధిగ నంగీకరింపబడు టచే సత్సంగముయొక్క యావచ్చరస్థిరాస్తులకును అద్వితీయ యజమా

నులుగ నుందురు. ఈధర్మకర్తలు, అట్టి సంతసద్గురువుయొక్కగాని యీ కేంద్రీయ పాలక సమితియొక్కగాని యాజ్ఞలకు లోబడియుండుచు, పరమపురుష రాధాస్వామిదయాళుని కింతకుముందు సమర్పితమై యుండినట్టిగాని, యికఁ ముందు సమర్పింపబడబోవునట్టిగాని, మఱియు, రాధాస్వామీసత్సంగమునకును దాని శాఖలకు నర్పితమైనట్టిగాని, లేదా యీసత్సంగముచేతను దాని శాఖలచేతను సంపాదించబడినట్టిగాని చరస్థిరరూపములైన యావదాస్తులను స్వాధీనముచేసికొని, భద్రపఱచి, పాలనజేయుచు, నవసరమయినపుడు విక్రియించుచు నుండవలెను. కాని రాధాస్వామీసత్సంగముయొక్క సామాజిక పూజాస్థలములును, సమాధులు నెన్నటికిని విక్రయించకూడదు.”

1904 సంవత్సరములో నీరాధాస్వామీట్రస్టు రిజిస్టరుకాబడినది.

## ఇతర చర్యలు

45. కేంద్రీయ పాలకసమితిని (Central Administrative Council) రాధాస్వామీ ధర్మకర్తృవర్గమును (Radhasoami Trust) స్థాపించుటతో, మహారాజసాహబ్ వారిచే ప్రారంభింపబడిన సత్సంగవ్యవస్థాపనకార్యక్రమ మప్పటిమట్టుకు పూర్తియయ్యెను. సత్సంగాస్తులను పాలనచేయుటకును, బ్రాంచి సత్సంగములను స్థాపించుటకును, వానిని క్రమబద్ధముగ నడిపించుటకును సవిస్తరమయిన నిబంధన లేర్పఱచబడినవి. అదేప్రకారము, సత్సంగ కేంద్రములోగాని, బ్రాంచిసత్సంగములలోగాని నివసించుచుండు సత్సంగసాధువుల ప్రవర్తనసంచారములను గుఱించి, సవిస్తరమయిన నియమముల నేర్పఱచి ఆచరణలోఁ బెట్టించిరి. ఎట్లన, సాధువులు కాషాయవస్త్రములను ధరించగూడదనియు, సత్సంగులవద్దనుండి ద్రవ్యరూపముగ బహుమానములను తీసికొనగూడదనియు, కేంద్రముయొక్క యనుమతిలేకుండ దేశసంచారము చేయగూడదనియు నిషేధించి, యీనిబంధనలకు వ్యతిరేకముగ ప్రవర్తించు సాధువులను గుఱించి బ్రాంచిసత్సంగములు కేంద్రమునకు తెలియపఱచ వలయునని నియమించిరి అటులనే కేంద్రసత్సంగమునకు వచ్చిపోవు సత్సంగులకు గూడ కొన్ని నిబంధనల నేర్పాటుచేసిరి. సత్సంగములో కూర్చుండుటకు 1, 2, 3 తరగతుల టిక్కెట్లు నిచ్చి, సత్సంగులను వారివారి టిక్కెట్ల ప్రకారము స్థానములలో గూర్చుండవలసినదిగ నియమించిరి.

46. సత్సంగుల యొక్కయు, సాధువుల యొక్కయు పేర్ల నన్నిటి నొక పుస్తకములో లిఖితము చేయించుట కేర్పాటుచేసిరి. ప్రతిసత్సంగియు కేంద్రీయ పాలకసమితియొక్క కార్యాలయమునకు వెళ్ళి, తనపేరచ్చట లిఖితమై యున్నది లేనిది సరిచూచుకొని, లేనిచో వెంటనే లిఖితమొనరించుకొనవలయునని యాదేశించిరి.

47. 1904 సం॥రములో, స్వామీజీమహారాజువారి సమాధిని మహాశ్లోభాయమానవిధమున నిర్మించుటకు పూనిరి. ఆనిర్మాణమునకు చాల ధనము కావలసియుండెను. అందులకై సత్సంగులు నెలనెలకు గొందఱును, పెద్దపెద్ద విరాళములుగ నొకేసారి గొందఱును, భేంట్లను సమర్పించిరి.

48. రాజస్థాన్‌లో మకాౖనా యను చోట నొక యెఱ్ఱయిసుకరాళ్ళ గనిని సంపాదించిరి. ఆగని త్రవ్వుట మొదలుపెట్టగనే యందులో నెఱ్ఱయిసుక రాళ్ళకు బదులు పాలరాయి లభించెను ఇది నిజముగ నొకమహాద్భుత విషయము. మహారాజసాహబ్‌వారి నిర్యాణానంతరము ధర్మకర్తలు, అప్పటివఱకు కట్టబడియున్న నిర్మాణమును పడగొట్టించి సమాధిభవనముయొక్క మొదటి నమూనాను పూర్తిగ మార్చివేసిరి

## వారి మహాత్త్వము

49. వివిధకార్యముల నెఱవేర్చు విషయములో నితరులతో వ్యవహరించునపుడు మహారాజసాహబ్‌వారెల్లపుడు స్థిరనిశ్చయముతో నిర్భయముగను నిష్కపటముగను ప్రవర్తించుచు ధాటిగ మాట్లాడెడివారు. వారాణసిలో నొక దివ్యజ్ఞానసమాజ సమావేశమునకు శ్రీమతి అనిబిసెంటు, ఒకసారి వారి కాహ్వానమును పంపించగా, వారాయాహ్వానమును నిరాకరించుచు తమ కట్టి యభిరుచి లేదని కబురంపిరి.

50 ఒకసారి అలహాబాదు సత్సంగములో శబ్దపాత్రమైన పిదప చాచాజీ సాహబ్‌గారు, అప్పుడలహాబాదు సత్సంగములో గురుముఖుడుండెనని యకస్మాత్తుగ వాక్రుచ్చిరి తమరి సంతవఱకెన్నడును సద్గురువుగ నెంచనీయకుండిన మహారాజసాహబ్‌వారు వెంటనే మందహాసముతో "నేనుమట్టుకు వారాణసికి చెందినవాడ"నని సెలవిచ్చిరి. ఆ ఛలోక్తి యచ్చటి సత్సంగులందఱకు వినోదము గలిగించెను'

51. 1904 సం॥రములో నాగాప్రీపీపల్ మండీలో కేంద్రీయపాలకసమితి సమావేశము జరిగెను ఆసమావేశములో భక్తులచే రాధాస్వామిదయాళునికి భేంటుగ నర్పింపబడినట్టి, విలువగల దుస్తులును, గృహోపకరణములును, వెండి బంగారు సామానులును వాడుకలేక పడియున్నందున చెడిపోవుచుండుటచే, మహారాజసాహబ్ వారి నాసామానుల నుపయోగింపవలసినదిగ గోరునట్లొక తీర్మానము ప్రతిపాదింపబడినది. అరగంటకుపైగా, నాతీర్మానమును గుఱించి చర్చ జరిగెను మహారాజసాహబ్ వా రంతసేపు నచ్చటనే యుండిరిగాని ఒూట్లాడకనే వినుచునుండిరి. తుదకందఱును ఆప్రతిపాదనను గుఱించి మహారాజసాహబ్ వారి యభిప్రాయమును దెలిసికొనవలసియుండునని యోచించి, వారి కావిషయమును మనవిచేసిరి వారంతట తమ సహజ గాంభీర్యములో నిట్లుసెలవిచ్చిరి. "నేనే సంత్ సద్గురువుగ సర్వాధికారము గల్గి యుండునెడల నన్ని విషయములో నాజ్ఞాపించుటగాని తీర్మానములచే బద్ధునిగ జేయుటగాని మఱొకరి పనిగాదు. అట్టి స్థితిలో నేనే నాకు యుక్తమని తోచినట్లు చేయుగలను. అట్లుగాక, నేను మీతీర్మానముచే బద్ధుడనై యుండవలయునన్నచో, మీరందఱును నాయెడల చూపదలచుకొనిన యసాధారణ గౌరవప్రతిపత్తులకు నేనర్హుడనేగాను" ఈ సమాధానములో నందఱు నిరుత్తరులై యాప్రశంసనే విడిచిపెట్టిరి.

52. మహారాజసాహబ్ వా రొకసారి సత్సంగులందఱకును తమకు తోచిన ప్రశ్నల నడిగి తమసందేహముల నన్నిటిని తీర్చుకొనుట కనుజ్ఞ నిచ్చిరి. అప్పు డొక వృద్ధసత్సంగి యివ్విధముగ ప్రశ్నించెను –

"స్వామీజీమహారాజువారి పూజ్యధర్మపత్ని వారిని పూర్ణభక్తిశ్రద్ధలతో గొలిచి వారున్నంతకాలము వారిసేవను నిస్స్వార్థముగ జేయుచుండిరి. నిర్యాణసమయమున స్వామీజీమహారాజువారు సత్సంగు లందఱను తమయం దెట్టి గౌరవప్రపత్తులను జూపుచుండిరో, ఆమెయెడలగూడ నట్టిగౌరవ ప్రపత్తులనే చూపుచుండవలసినదని యానతినిచ్చిరి ఐన నామె వారిస్థానే సంతసద్గురు వేలకాలేదు?" మహారాజసాహబ్‌వారు చిరునగవుతో నిట్లుసెలవిచ్చిరి, "మీవంటి యనుభవశాలురైన పురాణ సత్సంగు లీప్రశ్న వేయుట నా కాశ్చర్యముగనున్నది స్త్రీలెన్నటికిని సంతుగతిని పొందజాలరనునది యొక మూలసిద్ధాంతము. రాధాస్వామిదయాళునికంటె పూర్వమే తెంచియుండిన సంతు లెవరికిని స్త్రీ యెన్నడు నుత్తరాధికారి గాలేదు." పిమ్మట మహారాజ

సాహబ్ వారు, కబీర్ సాహబ్ వారి విషయము నుదాహరణగ జెప్పిరి. కబీర్ సాహబ్ వారి ధర్మపత్నియగు "లోయీ" పూర్ణశ్రద్ధాభక్తులు గలవారైనను కబీర్ సాహబ్ వారు తమకుత్తరాధికారిగ ధర్మదాసును జేసిరిగాని యామెను జేయలేదు. అట్లనే గురునానక్ సాహబ్ వారు మొదలు గురుగోవిందసింగుగారి వఱకును పదిమంది శిఖ్ఖుగురువులుగూడ పురుషులే. పిమ్మట మహారాజసాహబ్ వారు ఈసమాధానము తృప్తికరముగ నున్నదాయని యాప్రశ్నకర్త నడుగగ నాయన సవినయముగ తనయంగీకారమును సూచించిరి.

53. అటులనే 1905 సం॥రము డిశంబరులో హుజూరుమహారాజు వారి భండారాకు మహారాజసాహబ్ వారాగా వచ్చినపుడు చాచాజీగారికిని (స్వామీజీమహారాజువారి కనిష్టసోదరులగు సేత్ ప్రతాపసింగు సాహబ్) హుజూరుమహారాజువారి కుమారుడు లాలాజీగారికిని మహారాజసాహబ్ వారికిని, ప్రేమబిలాస్ బంగళా ప్రాంగణములో నొక వేదిక (Dais) పైన ఆసనముల నేర్పఱచి, ముగ్గురిలోమధ్యన మహారాజసాహబ్ వారి యాసనమును వేసిరి. మహారాజసాహబ్ వారు చాచాజీగారిని సత్సంగుల లాభార్థమై యొక వచనమును సెలవిమ్మని కోరిరి చాచాజీగారు తమకు చేతగాదని చెప్పిమహారాజసాహబ్ వారు సంత్ సద్గురువుగావున, వారే వచనములను సెలవీయవలయునని మనవి చేసికొనిరి. వెంటనే మహారాజసాహబ్ వారు, "చాచాజీసాహబ్, ఇటు చూడుడు నేనే సంత్ సద్గురువునైనచో మీకుగాని యిచ్చట నున్న మతెవరికిగాని నోరెత్తి మాట్లాడుటకే సావకాశము లే"దని సమాధానము చెప్పిరి. అపుడు సత్సంగము ప్రారంభమయ్యెను. కొంతసేపయిన పిదప చాచాజీగారి కొమారుడు సేత్ సుచేత్ సింగు నిలబడి లాలాజీగారికి చాచాజీగారితో సమానముగ నొకేవేదికపైన నాసనము నేర్పాటుచేయుట తప్పని యాక్షేపించెను. మహారాజసాహబ్ వారు ఆయన నట్లాక్షేపించినందుకు తీవ్రముగ గద్దించిరి. అంతటచాచాజీగారు సుచేత్ సింగు అనుభవహీనుడైనకుఱ్ఱడని చెప్పి యతనిని క్షమింపుడని మహారాజసాహబ్ వారిని వేడుకొనెను.

## కుమారుల వివాహములు

54. మహారాజసాహబ్ వారి పెద్దకుమారుడైన శ్రీగురుచరణదివాన్ అను మునీటుభైయాగారి వివాహము అలహాబాదుజిల్లాలో నొక గ్రామములో జరిగెను. పెండ్లికుమార్తెగారింటికి మహారాజసాహబ్ వారు ఏనుగు మీద

నెక్కి యూరేగింపుతో వెళ్ళిరి. సత్సంగు లందఱును శబ్దములు పాడుకొనుచు సంతోషముతో గంటలు వేయుచు నాయూరేగింపులో కలిసి వెళ్ళిరి. పెండ్లి కుమార్తెగారింట బ్రాహ్మణులకు వేఱే భోజనపంక్తి నేర్పాటు చేయవల యునని పెండ్లికుమార్తె తండ్రి యనిరి. ఈవిషయము తెలియగనే, సత్సంగు లెవరును బ్రాహ్మణులకంటె తక్కువవర్ణస్థులు కారని మహారాజసాహెబ్ వా రాయనకు కబురంపిరి.

55. మహారాజసాహెబ్ వారి రెండవకుమారుడు శ్రీగురుసరనదాస్ అను గుల్లూభైయ్యాగారికి పండితనిర్మలచంద్రబేనర్జీ అను నిర్మలబాబుగారి మనుమ రాలినిచ్చి పెండ్లి చేసిరి. ఆపెండ్లి రెండు భిన్నరాష్ట్రములవారిమధ్య జరుగు టచే, నసాధారణమై యుండెను. సవర్ణులగు బ్రాహ్మణు లందు కాక్షేపణఁ చేయగా మహారాజసాహెబ్ వారు వారితో తమలో నొకయుత్తమ విద్వాం సుని పంపించి, యావివాహము శాస్త్రవిరుద్ధమని సిద్ధపఱచ వలసిన దనిచెప్పిరి. ఆవిద్వాంసుడు వచ్చెనుగాని యాపండితుల యాక్షేపణను సమర్థించుట కొక్క వాదమునైనఁ జెప్పలేక నిశ్శబ్దముగ వెళ్ళిపోయెను.

ఈ పెండ్లిరోజులలో మహారాజసాహెబ్ వారు షట్శాస్త్రముల సూత్రాది రిగ సంస్కృతభాషలో ప్రేమసూత్రము లను పేరుతో నొక సూత్రగ్రంథ మును రచించవచ్చు నని సెలవిచ్చి, కొన్ని సంస్కృతసూత్రము లనుగూడ జేసిరి "అథప్రేమసూత్రం వ్యాఖ్యాస్యామః," "సచ్చిదానంద స్వరూపం చైతన్యం" వగైరా వగైరా.

56 అప్పటికాలపు టలవాట్ల ననుసరించి కొందఱు బంధుమిత్రులు పెండ్లి వారి వినోదార్థమై యొక వేశ్యను బిలిపించిరి. ఆమె భగవంతుని గుఱించి ప్రేమవిరహాపూరితమైన యొకపాటను భావపూరితురాలై మనసును కర గించునట్లుగ పాడెను.

హమ్‌నే దర్ పరదా తుఝే । శమ్స జబీం[1] దేఖ లియా।
అబ్ న కర్ పరదా తూ । ఏ పరదానశీం దేఖ లియా ॥1॥

---

(1) మొదటి పంక్తిలోను ఆఖరు పంక్తిలోను మొదట నావెలయాలి "మాహీంజబీ" అను పదము నుప యోగించెను మహారాజసాహెబ్‌వారు అందుకు బదులుగ "శమ్సెజబీం" అను పదమును ప్రయోగించ మనిరి మాహీంజబీం అనగా చంద్రునివంటి ముఖము గలవారని అర్థము, 'శమ్సెజబీం' అనగా సూర్యుని తేజస్సువంటి తేజస్సుతో ప్రకాశించు ముఖముగల వారని యర్థము

తేరే దీదార్ కీ థీ । ముఝుకో తమన్నా సో తుఝే ॥
లోగ్ దేఖేంగే వహాం । హమ్‌నే యహీం దేఖ లియా ॥2॥
హమ్ నజర్ బాజోం సే తూ । ఛిప్ న సకా జానే జహాం॥
తూ జహాం జావే ఛిపా । హమ్‌నే వహీం దేఖ లియా ॥3॥
కాబా న దైరో । మసజిదో బుతఖానే మేం ।
ఇస్‌సే క్యా బహస హై । దేఖా హై కహీం దేఖ లియా ॥4॥
నికలీ మంసూర కీ ఖూం సే । యహ అనలహక్ కీ సదా ।
దార[1] పర్ చఢ కే తుఝే । శమ్సే జబీం దేఖ లియా ॥6॥

అర్థము:- దినకరునివలె దేదీప్యమానమగు ముఖతేజస్సుతో నొప్పారు నో ప్రియతమా! తెరచాటున నున్న నిన్ను నేఁజూచితిని దాగికొనియున్న ఓ ప్రియతమా. నీవిఁక తెరచాటుననుండి యీవలకు రమ్ము. నిన్ను నేఁగనుగొంటిని. 1

నేను నీదర్శనముకొఱకు తీవ్రాసక్తితో నుంటిని ఇతరులు నిన్ను ఉత్తమలోకములకేఁగి దర్శించుదురుగాని, నేనిచ్చటనే నిన్నుదర్శించితిని. 2

సకల సృష్టికిని ప్రాణ మయినవాడా! ప్రియతముని కనుగొనుటలో నేర్పరులమైన మావద్దనుండి నీవు దాఁగికొనుట యసంభవము. నీ వెచ్చట దాఁగి యుంటివో, అచ్చటనే మేము నిన్నుకనుగొంటిమి. 3

నిన్ను నేను కాబాలోనా, లేక దేవాలయమందా, మసీదునందా, విగ్రహారాధన స్థలమందా, లేక యెచ్చట చూచితి నని యడుగనేల? ఎచ్చట జూచిన నేమి. నిన్ను నేను గనులారఁ జూచితిని. 4

"నేనే ప్రభువును", "నేనే ప్రభువును" అను వాణి మంసూరు రక్తకణములనుండి మాఱుమ్రోగెను. దినకరునివలె దేదీప్యమానమయిన ముఖతేజస్సుతో నొప్పారునట్టి యోప్రియతమా, నిన్ను నేను శూలాగ్రభాగమున నెక్కి జూచితిని. 5

(1) 'దార్' అను పదమును 'సూలీ' అను పదమును ఉర్దూభాషలో పర్యాయపదములు. ఈరెండుపదములకు శూలాగ్రమని యర్థము. పూర్వకాలమున నేరము చేసినవారి నొక శూలాగ్రముతో చంపెడువారు సూఫీలయొక్కయు సంతులయొక్కయు పరిభాషలో 'సూలీ' లేక శూలాగ్ర మనగా ఆఱవచక్రము లేక, ఆజ్ఞాచక్రము అనగా మానవ శరీరములో ఆత్మయుండుచోటు. దీని గూఢార్థ మేమనగ నెవరైనను తమ లక్ష్యమును పూర్తిగ ఆజ్ఞాచక్రమువద్ద నేకాగ్రము చేసికొనినపుడే ప్రియతముడైన భగవంతుని దర్శనము లభించగలదని.

మహారాజసాహబ్ వారతిప్రసన్నులై తమ పైనున్న యమూల్యము యిన శాలువ నా వేశ్య కిచ్చివేసిరి. ఆమె ఆశాలువను తీసికొని వారి చరణములకు మొ్రొక్కెను. అ వెలయాలి కనుపఱచిన భక్తిపారవశ్యముయొక్క దృశ్య మచ్చటనున్నవారందఱకు కన్నీరు కారునట్లు మనస్సును గరగించెను సత్సంగు లామెను తమ కాశాలువ నిమ్మనిగోరి, అందుకు 500 రూప్యములు క్రియధనము నిచ్చుటకు సిద్ధమయిరి. కాని యామె యాశాలువ నేమిచ్చినను గూడ వదలిపెట్టుట కిష్టపడలేదు. ఆమె వెంటనే తన కుటుంబమువారితో తాను చనిపోయినపుడు తన శరీరము నాశాలువతో కప్పవలెనని కోరెను. కొద్దిరోజుల తరువాత నామె చనిపోయినపుడు వారామె కోరినప్రకారమే చేసిరి. ఆమెను పరమప్రభువు తన శరణ్యములోనికి దీసికొనిరనుట కే సందియమును లేదు.

57. కొంతకాలమయినపిదప మహారాజసాహబ్వారి రెండవకోడలు తన తాతగారు నిర్మలబాబుగారింటికి వెళ్ళెను అకస్మాత్తుగ మహారాజసాహబ్ వారామె నొక నిర్దిష్టదినమునకు ముందే వారణాసికి పంపుమని యుత్తరమును వ్రాసిరి. కాని నిర్మలబాబుగా రామె నింకను కొన్నిరోజులు తమయింట నుండనీయుడని ప్రార్థించుచు మహారాజసాహబ్వారికి సమాధానమును వ్రాసిరి. ఆయుత్తర మందగనే మహారాజసాహబ్ వారు ఒకనిర్దిష్టసమయమునకు ముందుగనే యామె వారాణసికి చేరుకొనునట్లు చూడవలసినదని నిర్మలబాబుగారికి కచ్చితముగ కబురుచేయుచు, నామెను తోడ్కొని వచ్చుట కొక మనిషినిగూడ ప్రత్యేకముగ పంపించిరి. ఆ పిల్లయందుండు ప్రేమచే నిర్మలబాబుగారామెను వెంటనే పంపక యాలస్యము చేసిరి. మహారాజసాహబ్వా రామెను వారణాసి జేరుకొనవలసినదిగ నిర్దేశించిన రోజుననే, ఆమె తన తోడివారలతో గలిసి స్నానమునకై వెళ్ళి, యచ్చట ప్రమాదవశమున నీటిలోమునిఁగి చనిపోయెను. మహారాజసాహబ్ వా రా కబురు తెలియగనే తా మామె నా విపత్తునుండి కాపాడుటకు సకలవిధముల ప్రయత్నించితిమిగాని విఫలమైనదని సెలవిచ్చిరి

## సామియాబాగు

58. వారణాసిలోని సామియాబాగు, బాంకీపూర్ పాట్నావాస్తవ్యులయిన రాజా ఈశ్వరసహాయ్గారి కోరికపై నాయనపేరున కొనబడెను. (కొంత

కాలము పిమ్మట మహారాజసాహబ్‌వారి సమాధి నచ్చటనే నిర్మించిరి.) రాజాసాహబ్ చెల్లించవలసిన క్రియధనము రూ 17,000/-లను కేంద్రీయ పాలకసమితివారు తామే చెల్లించెదమని 12-3-1905 సం॥రం తేదీ సమావేశములో తీర్మానించిరి. ఈస్టుఇండియాకంపెనీకి మొదటి గవర్నరుగారైన వారన్‌హేస్టింగ్స్ (Warren Hastings) క్రీ॥ శ॥ 1765 సం॥రములో వారాణాసిరాజు చేత్‌సింగ్ తిరుగుపాటు చేసినపు డీకోటలోనే తలదాచుకొనెను.

## సింధుదేశ సంచారము

59. 1906 సం॥రములో ప్రభుత్వమువారు బీహారుప్రాంతములో 'ఆరా' జిల్లాలో 'డుమరాఉఁ' యెస్టేటు అక్కౌంటులను పరిశోధన చేయుటకై మహారాజసాహబ్‌వారిని నియోగించి, యచ్చటకు పంపిరి. వారితో కొందఱు సత్సంగులుగూడ వెళ్ళిరి. ఆ యెస్టేటు మేనేజరయిన బాబూ శివశరణలాలు గారు సత్సంగులు. మహారాజసాహబ్‌వారికిని, సత్సంగులకును వసతి యేర్పాట్లనాయన జేసిరి. 'డుమరాఉఁ'లో నుండిన రోజులలోనే మహారాజసాహబ్‌వారొకసారి సర్కారుసాహబ్ వారి గ్రామమగు మురారునకు వెళ్ళిరి. అచ్చట చేయబడిన యేర్పాట్లకు మహారాజసాహబ్‌వారు చాల ప్రసన్నులయిరి.

'డుమరాఉఁ'లో ప్రతిదినమును రెండుసార్లు సత్సంగము జరుగుచుండెడిది అచ్చట మహారాజసాహబ్‌వారికి చలిజ్వరము (Malaria) తగిలి కొంత కాలమునకు అది విషమజ్వరముగ మారి, వారి యారోగ్యమునకు చాల హానిచేసెను. అందుచే వారు దీర్ఘ కాలము సెలవు తీసికొని డాక్టర్ల సలహా ప్రకారము, శీతోష్ణస్థితి (Climate) మార్పుకొఱకై, సింధుదేశము వెళ్ళుటకు నిశ్చయించిరి. మహారాజసాహబ్‌వారు 12-10-1906 తేదీన శీతోష్ణస్థితి మార్పు కొఱకై కరాచీ పోదలఁచుకొని యున్నారు గావున సత్సంగు లెవరును అలహాబాదు[illegible]ని కరాచీగాని వెళ్ళ కూడదని తెలియపఱచుచు 3-10-1906 సం॥రము తేదీనొక ప్రకటన పత్రము నన్ని బ్రాంచి సత్సంగములకును పంపిరి. పిమ్మట మహారాజసాహబ్‌వారు కరాచీ పయనమై వెళ్ళిరి.

60 లాహోరునకు పోవు మార్గములో "ఫిల్లాపుర్" స్టేషనువద్ద మహారాజసాహబ్‌వారున్న రైలు ఆగెను చుట్టుప్రక్కల సత్సంగులు చాల యెక్కువ

మంది వారి దర్శనార్థమై స్టేషనుకు వచ్చిరి. స్టేషనులో ప్లాటుఫారము టిక్కట్లు కావలసినన్ని లేకపోయెను. అచ్చటి స్టేషన్ మాస్టరొక ఐరోపా దేశస్థుడు. ఆయన సత్సంగుల నందఱను స్టేషను ఆవరణ కావల రైల్వేమార్గమున కొకప్రక్కన రెండుపంక్తులుగ నిలుచుండబెట్టి మహారాజసాహబ్ వారి దర్శన మందఱికి లభ్యమగునట్లుగ వారున్నబండిని రైలుఇంజినుచేత ముందుకును వెనుకకును లాగించెను ఈవిధముగ నచ్చటకు వచ్చిన సత్సంగులందఱకును వారి దర్శనభాగ్యము లభించెను.

61. తిరిగి రైలు అమృతసర్ స్టేషను జేరగనే అచ్చటనున్న సత్సంగులందఱు గలిసి వారి నారాత్రి కచ్చట దిగియుండిపొండని ప్రార్థించిరి. వారాప్రార్థనను దయతో నంగీకరించిరి. సత్సంగు లందఱును మహారాజసాహబ్ వారి బసకొఱకును సత్సంగముకొఱకు నేర్పాటుకాబడిన కోఠిలో సమావేశము కావలయునని యుత్తరువిచ్చిరి. సత్సంగ మైన తర్వాత మహారాజసాహెబ్ వా రొకమహాప్రభావయుతమైన వచనములో రాధాస్వామీ నామము యొక్క మహిమాధిక్యమును తెలియజెప్పుచు నీ నామమును సరిగను, యథావిధిగను ఉచ్చరించిన చో నెవరికైనను మూడుకోజులలో నుద్ధారము చేకూరగలదని హామీనిచ్చిరి. గురునానక్ వారి దేశములోని పంజాబీభక్తులను జూచుటచే తమకు మహానందముగ నున్నదనియు వారందఱి మధ్యనుండుట యొక యసాధారణసావకాశముగ తలంచుచుంటి మనియు వారు సెలవిచ్చిరి.

62. ఆ మఱునాడుదయమునసే రైలు లాహోరుస్టేషను జేరెను. అప్పటికప్పుడే వందలాది సత్సంగు లాస్టేషనులో ప్రోగైయుండిరి. వారందఱకును ప్రణామము చేయుటకును భేంటునిచ్చుటకును మహారాజసాహబ్ వారనుమతి నిచ్చిరి. ఒకబ్రిటిష్ సార్జెంటు ఆ బండివద్దకువచ్చి "ముష్టి నెత్తుట నాపివేయుము" అని యఱచెను రైలుబండి "ఫుట్ బోర్డు" (Foot board) మీాద నిలుచున్న శ్రీప్రేమప్రసాదు అను శ్రీబాలేశ్వరప్రసాదు ఆసార్జెంటుమీాద మండిపడుచు నోరుమూయు మని చెప్పెను. కాని మహారాజసాహబ్ వారు వెంటనే కలుగ జేసికొని, క్రైస్తవమతములోని యే అర్చకునకైనను లేక ఆర్చిబిషపునకైన నేదైన నర్పించినపు డట్టియర్పణమును ముష్టియని యెంచనగునా యని ఆ సార్జంటును మర్యాదగ నడిగిరి. అంతట నాసార్జంటు సిగ్గుజెంది క్షమాపణగోరి వెళ్ళిపోయెను. తరువాత నొకమహమ్మదీయపోలీసుద్యోగస్థుడు వచ్చి

మహారాజసాహెబ్‌వారికి నమస్కరించి యీ మతమునుగుఱించి తెలిసికొన గోరెను. ఈమతసిద్ధాంతములను "షమ్సితబరీజ్" "మౌలానారూమీ" గార్ల బోధలు నొకచేయని మహారాజసాహెబ్‌వారు సెలవిచ్చిరి. అంతట నాపోలీసు అధికారి తనసార్జంటుతో కొంద ఆర్యసామాజికులు రైలులో ముష్టియెత్తుట జరుగుచుండెనని చెప్పి యతనిని పొరబెట్టుటచే నతడట్లు ప్రవర్తించెనని జెప్పి యాసార్జెంటు ధూర్తప్రవర్తనకు వినయపూర్వకముగ క్షమాపణ వేడుకొనెను. ఇంతలో రైలు స్టేషను విడిచిపోవుసమయ మాసన్నమాయెను. సత్సంగులందఱు నింతతొందఱగనే సమయ మైపోయినదని చింతిల్లుచు రాధాస్వామీ ధ్యానములు చేయుచుండగ రైలు స్టేషనునుండి వెడలిపోయెను.

63. ఆ మఱునాడు మహారాజసాహెబ్‌వారు పరివారసమేతముగ కరాచీలో దిగిరి సముద్రమునకు దగ్గఱగనున్న క్లిఫ్టన్ కొండపైన నొక విశాలభవనమును మహారాజసాహెబ్ వారి కేర్పాటుజేసిరి. మిగత పరివారమునకు బసల నాచుట్టుప్రక్కలనున్న యిండ్లలో నేర్పాటుచేసిరి. సత్సంగముకొఱకై వారి భవనమునకు దగ్గఱగ నొక పెద్ద శామియానాను వేసిరి. సత్సంగము రోజునకు రెండుసార్లు జరుగుచుండెను. విద్యావంతులగు సింధీలు అధికసంఖ్యాకులుగ సత్సంగమునకు వచ్చెడువారు చాల యెక్కువమంది సత్సంగమునకు వచ్చుచుండుటచే ప్రతిదినము నా శామియానా యంతయు పూర్తిగ నిండిపోవుచుండెడిది. ఆ తరుణమున చాలమంది విద్యావంతులు ఉపదేశమును కోరి రాధాస్వామీమతములో జేరిరి.

64. మహారాజసాహెబ్‌వా రచ్చటనుండి హైదరాబాదు (సింధ్)నకు వెళ్ళిరి. దివాన్ ఖుశీరామ్‌కృపలానీగారును, దివాన్ టేక్‌చంద్‌గారును తలొక యింటికిని ప్లాను (Plan) గీసి వారి యనుమతికై దాఖలు చేసికొనగా టేక్‌చందుగారు చెప్పిన యింటినే మహారాజసాహెబ్‌వారు సమ్మతించిరి. సత్సంగసమావేశములకై యొక పెద్దశామియానాను వేయించిరి. కరాచీలోవలెనే యిచ్చటగూడ సత్సంగమునకై వచ్చువారిసంఖ్య చాలయెక్కువగ నుండుటచే వారందఱికిని శామియానాలో స్థలము చాలలేదు.

65. ఈ సంచారములో మహారాజసాహెబ్‌వారు సింధీసత్సంగులలో రెండు సంఘసంస్కరణలను ప్రవేశపెట్టిరి. మొదటిది. సింధీస్త్రీలు ముక్కులకు నత్తులను ధరించుట మానివేయవలయునని చెప్పిరి. రెండవది, పెండ్లిండ్లు స్థిర

పఱచుకొనునపుడు వరు లధికకట్నములను కోరకూడదని నిషేధించి అధికాధిక కట్నము రూ 300/-లకు మించి యుండకూడదని నియమించిరి. మహారాజ సాహబ్ వారి సమక్షమందా నియమానుసార మొక వివాహమునుగూడ జరిపించిరి

66. మహారాజసాహబ్ వారి యారోగ్యము నానాఁటికి క్షీణింప దొడఁగి, వారికి నిరంతరము జ్వరప్రకోపముండుచునే యుండెను. అయినను వారు భక్తి భావపూరితమయిన యుపన్యాసముల నిచ్చుచునేయుండుటచే నెరికిని వారి శరీరములో నస్వస్థతగ నున్నట్లే తెలియకుండెను.

67. స్థానికప్రవీణవైద్యులైన డాక్టరువలీరామ్ గారి నొకసారి పిలిపించగా, నాయన మహారాజసాహబ్ వారు సత్సంగమునకు పోవుటకు సిద్ధముగనున్న సమయములో వారిని పరీక్షించి వా రలసట జెందకుండ విశ్రాంతిని తీసికొనవలయునని సలహాజెప్పిరి. మహారాజసాహబ్ వారు చిఱునగవు నవ్వి, డాక్టరుగారి భుజము మీద స్నేహభావమున నఱచేతితో చఱచి మేడమెట్లుదిగి సత్సంగమునకు వెళ్ళిరి. అయినను డాక్టరుగారి కీయవలసిన రుసుమును చెల్లించి వేసిరి

68. సర్కార్ సాహబ్ వారికి గూడ జ్వరముగ నుండుటచే, డాక్టరుగారు వారినిగూడ పరీక్షించి "వీరు మహారాజసాహబ్ వారికి తమ్ములా?" యని ప్రశ్నించిరి. వారిరువురును అన్నదమ్ములు కారని చెప్పగా, "వీరిద్దఱు లంతయొక్కవసాదృశ్యమును గల్గియుండి" రని చెప్పి డాక్టరుగా రాశ్చర్యపడిరి.

69. మహారాజసాహబ్ వారు సింధుదేశమునుండి తిరిగివచ్చి కొంతకాల మాగ్రాలోనుండిరి. ఆసమయములో నాధ్యాత్మికాభివృద్ధిని కొద్దికాలములోనే పొందుట శక్యమా కాదా యను విషయమై మాటవచ్చెను. అప్పుడు మహారాజసాహబ్ వారు సర్కార్ సాహబ్ వారి నుదాహరణగఁ జెప్పుచు, శ్రీ మాధవప్రసాదసిన్హాగారితో నిట్లనిరి, "శ్రీ కాంతప్రసాదసిన్హాగారు హుజూరు మహారాజువారి సత్సంగమునకు మొట్టమొదట వచ్చినపుడు 11దినములలోనే ఉత్తమాధ్యాత్మికధామముల నన్నిఁటిని వారు దాఁటగలిగిరనియు, నటుపిమ్మటనే

"హే సంతని సిరతాజ కృపాలా. హేగురుదీనదయాలా"

యను శబ్దమును రచించి హుజూరుమహారాజువారి సమక్షమున పాడిరనియు మీకు జ్ఞాపకమున్నదనే యనుకొందును." మహారాజసాహబ్ వా రీవిషయమును

బహిరంగముగ సత్సంగసమావేశములో సెలవిచ్చిరి. మహారాజసాహెబ్ వారు తమ యుత్తరాధికారి సర్కార్ సాహెబ్ వారే యని సత్సంగులందఱకును దయ చేసిన విస్పష్టసూచనయు సత్సంగుల నపభ్రమలపాలైపోకుండ గాపాడుటకు వారల కిచ్చిన సమయోచితమైన హెచ్చరికయు నిదియే.

## అంతిమదినములు, నిర్యాణము

70. అటుపైన మహారాజసాహెబ్ వారు అలహాబాదునకు తిరిగి వెళ్ళి అచ్చటనుండి బహుస్వల్పకాలములోనే వారాణసికి వెళ్ళిరి. అందుచే సత్సంగము కూడ వారాణసికి మాఱెను. ఆరోజులలో వారు చాల యనారోగ్యముగ నుండి నిరంతరవ్యాధిగ్రస్తులైయున్నను ఆంగ్లభాషలో "డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీ ఫేత్" (Discourses on Radhasoami Faith)అను గ్రంథమును చెప్పివ్రాయించుచుండెడివారు.

71. సత్సంగము 1907సం॥రము ప్రారంభములో వారాణసికి మాఱినపుడు కొందఱు సత్సంగులు సత్సంగములో ప్రధానస్థానమున నున్న యొక సత్సంగిని గుఱించి ఆయన 'గుప్తసంతులు' (అనగా నెవరికిని తెలియకుండగ నున్నసంతులు) అని తఱచుగ ననుచుండెడివారు. ఈ మాటను చాలతఱచుగ చెప్పుచుండుటచే మహారాజసాహెబ్ వారికిగూడ నీవిషయము తెలిసెను. అందుచే వారొకనాడు సత్సంగములో వచనమును సెలవిచ్చుచు నిట్లుచెప్పిరి, "రాధాస్వామీమతములో గుప్తసంతులని యెవరు నుండనేరరు సంతులు కొన్నిసమయములం దెవరికిని తెలియకుండగ నుండెడివారు అట్టిపరిస్థితులలో వారు ధర్మకార్యములను, జనసామాన్యమునకు లాభదాయకమైన కార్యములను మాత్రమే చేయుచుండెడివారు కాని సంతులు సద్గురువుగనుండి పనిచేయునపుడు వారు ఎవరికిని తెలియకుండగ నుండరు. రాధాస్వామీమతములోని సంతులు సద్గురువుగనుండి పనిజేయుదురు గావున నీమతములో గుప్తసంతు లెన్నటికినుండరు, ఉండజాలరు"

72. దీర్ఘానారోగ్యహేతువుచే మహారాజసాహెబ్ వారికి చాలబలహీనముగనున్నందున, వారు సుమారొక మాసము గుల్జార్ షైమ్యా గారిఖోఠీ నానుకొని సత్సంగమునకు వచ్చుచుండెడివారు. పిమ్మట నిర్యాణమునకు...

సుమారొక మాసము, వారు మంచముదిగి సంచరించ లేకపోవుటచే సత్సంగము నకుగూడ రాలేదు. అందుచే సత్సంగులందఱును చాలవిచారగ్రస్తులై బాధ పడుచుండిరి. సత్సంగులకుగాని పైవారికిగాని వారిదర్శనము జేసికొనుట కను మతి యుండెడిదికాదు. వారు ఒక మనిషిసాయముతోనే కూర్చుండగలిగెడు వారు. చివరకు 12అక్టోబరు 1907 సం॥రము తేదీన నా ఘోరవిపత్సమయ మేతెంచెను. వారు శరీరమును విసర్జించుటకు ముందు చివరిక్షణములలో వారిప్రక్క నొక సత్సంగియును, వారికుటుంబమువారును, సర్కార్‌సాహబ్ వారును మాత్రమే యుండిరి. మహారాజసాహబ్‌వారి కుమార్తెలు వెక్కి వెక్కి యేడ్వసాగిరి. అప్పుడు సివిల్‌సర్జనుగారిని పిలిపించగా వారు నాడిని పరీక్షించి, "నే నేమిచెప్పవలెనో నాకు తోచుటలేదు. ఊపిరి ఆడుచున్నది. నాడి చాలబలహీనముగనున్నది. ఈమహాత్ము నింతకుముందే వచ్చి దర్శనము చేసి కొనకపోవుట నాదురదృష్టము," అని యనిరి. మహారాజసాహబ్‌వారి పిల్లలీమాటలు విని బెదిరిపోయి బిగ్గఱగ నేడ్వసాగిరి. అంతకుముందు కొన్నివారముల కాలము సహాయములేనిదే కూర్చుండలేకుండినను మహారాజసాహబ్‌వారప్పు డకస్మాత్తుగ లేచి కూర్చుండి, "ఈచప్పుడును గందరగోళమును కట్టిపెట్టుడు, మీరెవరును ఏడ్వకుడు" అని వారితో చెప్పిరి. అచ్చటనున్నవా రందఱిపైనను వారు తమ దయాభరితదృష్టి నొక్కసారి ప్రసరింపజేసి, "నేనిప్పుడు వెళ్ళిపోవుచున్నాను. నేవెళ్ళినతరువాత నెవరు నేడవకూడ" దని సెలవిచ్చిరి. అప్పుడు రాధాస్వామీనామ ముచ్చరించుచు మెల్లగపరుండి సాయంకాల మాఱుగంటలకు నిర్యాణమునొందిరి. ఆ గది కావల గుమిగూడి యుండిన సత్సంగులందఱు నిశ్శబ్దముగ నాతురతతో నుండిరి. ఈ వార్త తెలియగనే వారందఱు నిశ్చేష్టులైరి. దీనస్వరములతో మూలుగులును, నిట్టూర్పులును నలువైపులనుండి వినవచ్చుచుండెను. నిర్యాణసమయమునకు మహారాజ సాహబ్‌వారి వయసు 46సం॥రములఆఱుమాసములు మాత్రమే

73 ఇవ్విధముగ సత్సంగులకా గురుధారతో బాహ్యసంయోగము తొలగిపోయెను. ఆ ధార, తా నింతవఱకు ధరించియున్న మానవస్వరూపమును విడిచి, మానవ జాత్యుద్ధార కార్యమును యథాప్రకారము కొనసాగించు నిమిత్తము, తన నిపుడు స్వీకరించుటకు తగియుండునట్లుగ శిక్షనిచ్చి సిద్ధము చేయబడిన మఱొక పవిత్ర మానవరూపమున విరాజిల్లుటకై వెడలి పోయెను

74. మహారాజసాహబ్ వారి పవిత్రశరీరమునకు దహనసంస్కారము జరిగించుటకై ఆరాత్రి యేర్పాట్లుజరిగి ఒకపెద్ద వాహనము సిద్ధము చేయబడెను. ఉదయముననే వారి పవిత్రశరీరమును మణికర్ణికా ఘట్టమునకు గొనిపోయి అచ్చట దహనసంస్కారము జరిగించిరి. వారి పవిత్రరజమును సంచయనము చేసి వారాణసిలోని సామియాబాగు సత్సంగహాలులో సమాధి చేయుటకై దాచియుంచిరి. మహారాజసాహబ్వారి జీవితకాలములోనే ఆసత్సంగహాలు నిర్మాణమును మొదలుపెట్టిరి.

## వారి గ్రంథములు

75. పంజాబు సంయుక్తప్రాంతముల జనాభాలెక్కల యధికారులకొఱకై మహారాజసాహబ్వారు 1901, 1902 సం॥రములలో రాధాస్వామీమతమును గుఱించి క్లుప్తమయిన రెండునివేదికలను స్వయముగ చెప్పి వ్రాయించిరి. ఆ నివేదికలు బహు సంక్షిప్తరూపముగ వ్రాయబడియున్నను అందు ముఖ్య విషయము లన్నియు సమగ్రముగనే యున్నవి.

76. కొంతకాలము తరువాత మహారాజసాహబ్ వారు రాధాస్వామీ మతమును గుఱించి మఱొక సంక్షిప్త నివేదికను వ్రాయించిరి. ఈనివేదికల నన్నిఁటిని, 1909 సం॥రములో "డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీ ఫేత్" (Discourses on Radhasoami Faith) అను గ్రంథము ముద్రింపబడిన పుడు దాని కనుబంధములుగఁ బ్రకటించిరి.

77 మహారాజసాహబ్ వారు హిందీలో నొక మనోహర ప్రార్థనాశబ్దమును, మఱికొన్ని శబ్దములనుగూడ రచించిరి. ఈ శబ్దములను ప్రసిద్ధహిందీ భాషాకవీశ్వరులైన తులసీదాసుగారి రామాయణము పాడునట్టి స్వరముతోనే పాడించుచుండెడివారు. సత్సంగులకు ఈశబ్దములను పాడుటకు సరియైన రాగమును నేర్పించుటకై మహారాజసాహబ్వారు వారలచే రామాయణము నుండి కొన్ని భాగములను పఠింపఁ జేసెడివారు

78. వారి గ్రంథములన్నిఁటిలో నమూల్యమైన 'డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీఫేత్' అను గ్రంథ మాంగ్లభాషా పరిచితులగు సత్యాన్వేషులకు

వాస్తవ మార్గప్రదర్శన మిచ్చి, శాశ్వత మనశ్శాంతిఁ జేకూర్చును. మహారాజసాహబ్‌వారాగ్రంథము నాశువుగఁ జెప్పి వ్రాయించిరి. మహారాజసాహబ్‌వారి యకాలనిర్యాణముచే నాగ్రంథ మసంపూర్ణముగ నుండిపోయెను. దానిలోని కర్మలను గుఱించిన నాల్గవభాగమును ప్రారంభించినతోడనె మహారాజసాహబ్‌వారు గుప్తమైరి. ఆగ్రంథములోని ప్రథమభాగ మొక్కటి దక్క, మఱే భాగమును మహారాజసాహబ్‌వారు తిరిగి చదువుటకే వీలుకాలేదు. అందుచే వారాగ్రంథమును పునర్విమర్శ చేయలేదని వేఱుగ చెప్పనక్కఱలేదు. వైజ్ఞానికావిష్కరణపరిశోధన లెక్కువగ జరుగుచుండెడి యీకాలమున, సత్యాన్వేషులకు పరమార్థవిషయములను వైజ్ఞానికరీతిఁ విశదీకరించినచో నెక్కువ రుచికరముగనుండును. విజ్ఞానశాస్త్రాభిమానులకు మతవిషయముల వివరణము వైజ్ఞానికపరిశోధనాపద్ధతుల ననుసరించి యుండుట ముఖ్యావసరము. 'డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీ ఫేత్' అను గ్రంథ మీయుద్దేశ్యముతోనే వ్రాయఁబడినది. విజ్ఞానశాస్త్రసమ్మతమైన మతము యొక్క పారమార్థికసిద్ధాంతములును వానికి ప్రయోగక్రియలరూపమగు నాధ్యాత్మికసాధనల యభ్యాస పద్ధతులును ఈగ్రంథములో సంపూర్ణముగ విశదీకరింపబడినవి. కావున నట్టివారిని (విజ్ఞానశాస్త్రాభిరుచి గలవారిని) ఈగ్రంథము, ఇందు చెప్పబడిన యథార్థ విషయముల వాస్తవత్వమును ప్రయోగాత్మకముగ పరిశీలించుటకు ప్రోత్సహించును.

## సమాప్తి

79. మహారాజసాహబ్‌వారు సత్సంగాధ్యక్షతను వహించినది కొలఁది కాలమే యైనను, సత్సంగసంస్థకు సత్సంగాస్తులను భద్రపఱచి పాలన చేయుటకును సత్సంగ సంఘీయులను (సాధువులను సత్సంగులను గూడ) సంపూర్ణముగ క్రమశిక్షాబద్ధులుగ నుంచుటకును సమర్థత చేకూరునట్లుగ, దానిని వ్యవస్థాపన చేయదలఁచి, అందుకుతగిన చర్యల నన్నిటిని వారు తీసికొనిరి. కొందఱు స్వార్థపరులు సత్సంగాస్తులను తమ స్వంతాస్తులవలెనే వాడుకొనుచుండిరి. మహారాజసాహబ్‌వారు కేంద్రీయపాలక సమితిని (Central Administra-

tive Council) రాధాస్వామీ ధర్మకర్తృవర్గమును (Radhasoami Trust) స్థాపించి, పై చర్యలను తీసికొనుటలో స్వామీజీమహరాజు హుజూర్ మహారాజు వారల కుటుంబస్థుల పూర్ణసహకారమును సంపాదించగలిగిరి. అంతవఱకును సేఠ్ ప్రతాపసింగుగారి స్వాధీనసంరక్షణలలో నున్నట్టి స్వామీబాగ్ సత్సంగాస్తులును, లాలాఅయోధ్యాప్రసాదుగారి స్వాధీనసంరక్షణలలో నున్న పీపల్మండీలోని సత్సంగాస్థులును, ఇవ్విధముగ కేంద్రీయపాలకసమితి (Central Administrative Council) వారి స్వాధీనసంరక్షణలలోనికి తీసికొని రాబడినవి.

80. మహారాజసాహెబ్‌వారు శిక్షాప్రధానమైన మహాపురుషులు అందుచేతనే, సత్సంగముయొక్క యాజమాన్యమంతయు వారి కరతలమందున్నను, సంతసద్గురువై నందున జీవుల కుపదేశమిచ్చు సర్వాధికారమును వారొక్కరిదే యైయున్నను, వారు కేంద్రీయపాలకసమితినిర్మాణచట్టములో, జనుల కుపదేశము కొఱ కనుమతి నిచ్చు సర్వాధికారము పాలకసమితికే యున్నదనియు, ఆ సమితివలననే తమకును సేఠ్‌ప్రతాపసింగుగారికిని, లాలాజీగారికిని, ఉపదేశములనిచ్చుట కధికారము లభించినదనియు వ్రాయించి, యవ్విధముగ కేంద్రీయపాలక సమితి యొక్క యాధిక్యమును స్థిరపఱచిరి.

81. మహారాజసాహెబ్‌వారు ముందుముందు సత్సంగులు తమయిండ్లవద్ద నుండియే సద్గురుదర్శనమును జేసికొనగలుగుదురనియు కేంద్రసత్సంగములోని శబ్దపాఠమును వినగలుగుదు రనియును సెలవిచ్చిరి. అప్పటిలో నీవిషయములు ఆశ్చర్యములుగనే కన్పట్టియుండెను. కాని ప్రస్తుత ఆకాశవాణీ ప్రసార విధానమును (Radio Broadcasting) విద్యుచ్ఛక్తిచే నాకసములోని దృశ్యములయొక్క దూరప్రసార విధానము (Television) నాచరణలోనికి వచ్చిన తర్వాత నీవిషయము లన్నియు నాచరణయోగ్యములును, సులభసాధ్యములు నని స్పష్టమైనది.

82. ఇటులనే, సత్సంగములో నైహిక వ్యాపారములను సాగించుట కేర్పాట్లు జరుగగలవని మొట్టమొదట మహారాజసాహెబ్‌వారే సూచించిరి. ముందుముందు సత్సంగము పెద్దపెద్ద యైహిక సంస్థలను, కంపెనీలను నడిపించగలదనియు, సత్సంగమున కొక విశ్వవిద్యాలయము (University of the

Satsang) ఉండుననియు వారు సెలవిచ్చిరి. మహారాజసాహబ్ వారి కాలములో నొకకంపెనీ నేర్పాటు చేయగలందులకై షేర్లు వేయించి, అందులో మహారాజసాహబ్ వారు రు 1000/-లు విలువగల షేర్లనుగూడ తీసికొనిరి. వారి కాలములో నీవిషయములో కార్యక్రిమ మెక్కువగ సాగించుటకు సాధ్యముకాలేదన్నమాట నిజమేగాని, సత్సంగముయొక్క భావి కార్యప్రణాళిక యేరీతిగ నుండునో యిందుమూలముగ స్పష్టముగ సూచితమయ్యెను.

---



IV—సర్కార్ సాహబ్ వారు

(1871—1913)

*1907 లో సంత్ సద్గురువుగ ప్రకటమయిరి.*

# IV

# పరమ పురుష పూరన్ధనీ
# సర్కార్ సాహబ్ వారు

పరమగురు సర్కార్‌సాహబ్ వారు అను నామముతో ప్రఖ్యాతి గాంచిన శ్రీకాంతప్రసాదసిన్హాసాహబ్ వారు రాధాస్వామీ మతమున పరమపూజ్య చతుర్థ సద్గురువుగ నుండిరి. వారు బీహారులో షాహాబాదు జిల్లా మురారు గ్రామమునకు చెందిన యొకగౌరవనీయ శ్రీవాస్తవ కాయస్థ కుటుంబమున విక్రమ శకము 1938సంవత్సరము మార్గశిర శుద్ధ పౌర్ణమినాడు, అనగా క్రీ॥శ॥ 1871 డిశంబరు 12తేది మంగళవార మర్ధరాత్రి నంతరము జన్మించిరి.

2. సర్కార్ సాహబ్ వారి పూజ్య జనకులైన రాయ్‌కులవంతప్రసాద్ సిన్హా సాహబ్‌వారు సంయుక్త ప్రాంతములలో, న్యాయవిచారణ శాఖలో మునసబుగా (Munsiff) ప్రవేశించి కొంత కాలమునకు సబ్ జడ్జిగ (Sub-judge) కాన్పూరు బదిలీఅయిరి. వారు నిష్పక్షపాతబుద్ధి గలవారనియు, న్యాయప్రధానులనియు ప్రఖ్యాతిగాంచిరి. వారు చివరకు అజంగఢ్‌లో సబ్ జడ్జిగ పనిచేయుచు రిటైరయిరి. వారికి నలువురు కొమరులు నొక కొమార్తె యుగలరు. వారికిరువురు కుమారులు జనించినపిదప నాకొమార్తెగలిగెను. ఆకుమారుల పేర్లు,

(i) బక్షీ రామ కుమారసిన్హాగారు. వీరికుమారులే శ్రీజ్వాలాప్రసాద సిన్హాగారు.

(ii) బక్షీ రామఅవతార సిన్హాగారు. వీరు అలహాబాదు హైకోర్టులో భాషాంతరానువాదకులు (Translator) గా పనిచేసి, అలహాబాదులో కత్రా మొహల్లాలో నివసించెడివారు

(iii) బక్షీ బిందేశ్వరీప్రసాద సిన్హాగారు. వీరు అలహాబాదులో మ్యూర్ సెంట్రల్ కాలేజీ (Muir Central College)లో విద్యార్థిగ నున్న సమయములో పిన్నవయస్సుననే చనిపోయిరి. వీరికి వివాహమై యొక కొమార్తె మాత్రము కలిగెను. ఆపిల్ల యుక్తవయస్కురాలైనపిదప నామెను డుమరావ్ ఎస్టేటు మానేజర్ శ్రీ శివశరణలాలుగారి సోదరపుత్రుడు, బాబూజోగేంద్రబిహారీగారి కిచ్చి పెండ్లి చేసిరి.

(IV) శ్రీకాంతప్రసాదసిన్హాసాహెబ్ వారు. వీరే తరువాత సర్కార్ సాహెబ్‌వారు అను సుప్రసిద్ధ నామముతో ప్రఖ్యాతి గాంచిరి.

8. సర్కారుసాహెబ్ వారి యద్భుత బుద్ధికుశలతయు నసాధారణజ్ఞాన సంపన్నతయును వారి బాల్యావస్థనుండియు ప్రకటితమగుచుండెను. వారి చిన్న నాటి చర్యలను కొన్నిటి నీక్రింద నుదహరించితిమి:—

(a) వారుమూడేండ్ల ప్రాయములో నుండగ నొకసారి యింటిపై కప్పు నుండి క్రిందపడిపోయిరి. అప్పుడువారికి కొంతసేపు స్పృహతప్పిపోయెను. తిరిగి స్పృహవచ్చినపిమ్మట, వారు తమయన్న బిందేశ్వరీప్రసాదుగారు అట్లు పడి యుండినచో చనిపోయియుండునని యనిరి.

(b) తమయింట వంటపనిచేయుచు తమకు దాదిగనున్న 'రేశాదీదీ' యనునామెతో వారెక్కువ చనువుగ నుండెడివారు. ఆమె వంటచేయుచున్న పుడు వారు వంటయింటిలో నామెవద్దనే తఱుచు కూర్చుండెడివారు. ఆమె యెప్పుడైనను పళ్ళెరములో నన్నమునుంచి యీవలకు వెళ్ళినపుడు, వారి నా యన్నమును ముట్టుకొనవద్దని చెప్పి వెళ్ళుచుండెడిది. కానియామె తిరిగివచ్చు సరికి వారాయన్నమును తినుచుండెడివారు. ఆమె వారి నేమి యట్లుచేసితివని గద్దించియడిగినప్పుడు, "నేనాయన్నమును ప్రసాదముచేసి పవిత్రము చేసితి" నని వారు నవ్వుచు సమాధానము చెప్పుచుండెడివారు.

(c) వారిపితామహి హనుమంతుని భక్తురాలు. ప్రతిమంగళవారము నామె గోమయముతో నేలనలికి పూజకై కూర్చుండెడివారు. ఒకనా డామె హనుమ ద్విగ్రహమునకు ముందఱ నొక లడ్డుండల పళ్ళెమునుంచి, పూజచేయుచుండగ, సర్కార్ సాహెబ్‌వారు అందుండి యొకలడ్డును తీసికొనిరి. ఆమెవారిని చాలకోపముతో మందలించి ప్రసాదము నపవిత్రము జేసితి వని తప్పుపట్టెను. అంతట సర్కార్‌సాహెబ్ వా రుద్రేకముతో నా లడ్డుండల పళ్ళెరమును తన్నివేసి, "ఈహనుమంతు డెవరు ? నాకన్న నీయన గొప్పవాడు కాదు నీవు పూజ చేయవలసినది నన్ను," అనిచెప్పిరి మఱొకప్పు డామె యా విగ్రహమునకు ముందు వంగి నమస్కరించుచుండగ వీరామెను ముందఱ కొక త్రోపు త్రోసి, "నీ వెవరికి మ్రొక్కుచుంటివి ?" అనియనుచు పరుగిడిరి. ఆనాటి పెద్దలందఱును శ్రీకృష్ణుడే తిరిగి యీరూపమున జన్మించెనని, వీరిని గుఱించి చెప్పుకొనుచుండెడువారు.

4 సర్కారుసాహెబ్ వారి జ్ఞాపకశక్తి చాల యద్భుతమైనది. వారు తమ పాఠములను మఱలచదువుట చాలయరుదు. కాని వారొక్కసారి చదివినంత మాత్రముననే పాఠములను వప్పజెప్పగల్గుచుండెడివారు వారికి హిందీ భాషలో ప్రవీణత యున్నట్లు, వారు రచించిన "ప్రార్థన" యను శబ్దమును బట్టియే స్పష్టపడుచున్నది. వారు చిన్నతనముననే ఉర్దూ, పర్షియన్ భాషల నింటివద్ద చదువుకొని ఆభాషలలోగూడ మంచి పరిచయమును సంపాదించిరి వారు చతురంగ మాడుటలో గొప్పనిపుణులు. భారతదేశములో నక్కాల మున నీయాటలోని ప్రసిద్ధప్రవీణులలో వారు ప్రథమ శ్రేణి యేడుగురిలో నొకరుగ నెంచబడిరి. వారు గుఱ్ఱపు స్వారిలో నిపుణులును, "క్రికెట్" (Cricket) అను బంతి యాటలో పేరుపొందిన యాటగాండ్రును. చిన్ననాటి నుండియు వారికి సంగీతములోగూడ చాల యభిరుచిగలదు. వారి యభిరుచులు చాల యుత్తమ శ్రేణికి చెందినవి.

5. సర్కార్ సాహెబ్ వారు, 1885వ సంవత్సరములో తమ తండ్రిగారితో బలియాలో నున్నప్పుడు, తమ 14వ యేటనే, మిడిల్ క్లాసు ఆంగ్లో వర్నాక్యులరు పరీక్ష (Middle Class Anglo Vernacular Examination) యను ప్రభుత్వమువారి పరీక్షకు వెళ్ళి యందు తీర్ణులైరి సర్కార్ సాహెబ్ వారు చదువుకొనుచున్నట్లే తమకెన్నడు నగుపించలేదని వారి నొకసారి వారి తండ్రి గారడుగగా, సర్కారుసాహెబ్ వారు తమ పాఠ్యగ్రంథమునుదెచ్చి వారికిచ్చి యందుండి ప్రశ్నలనేమైనను వేయుడని వారిని సవినయముగ నడిగిరి. వారి తండ్రిగా రపుడు, వారి రెండవ యన్నగారైన శ్రీరామావతారసిన్హాగారిని వారిని పరీక్షింపుమని నియోగించిరి. ఆయన్నగారా పుస్తకమునుండి పది ప్రశ్నల నడుగగా సర్కారుసాహబ్ వా రాప్రశ్నల కన్నిటికిని సరియగు సమాధానములను జెప్పిరి. అప్పుడు సర్కారునాహబ్ వారు, "కేవలము మూర్ఖులును మొద్దబ్బాయిలును మాత్రమే పుస్తకకీటకములవలె రాత్రింబవళ్ళ దేవనిగ పుస్తకములను చదువుచుందురుగాని, పూర్ణశ్రద్ధతో నొక్కసారి చదివినయెడల నేరికైనను విషయ మంతయు సమగ్రముగ నర్థమై, తిరిగి చదువ నవసరమే యుండ" దనిచెప్పిరి.

6. బలియాలో నొక గొప్పయుత్సవసందర్భములో నొక మహాసభ జరిగెను. అనేకమంది గాయకులు తమతమ కళాకౌశలమును ప్రదర్శించుటకై

యచ్చటి కేతెంచిరి. ఒక్కొక్క గాయకుఁడొక్కక్క పాటను పాడెను. సర్కారు సాహబ్‌వారును వారన్నగారి కుమారుడు శ్రీజ్వాలాప్రసాదసిన్హాగారును గలిసి ప్రఖ్యాత సంస్కృత గ్రంథమగు 'మహిమ్నస్తోత్రము'నుండి కొన్ని శ్లోకములనతి మధుర మనోహర స్వరముతో సంగీత వాద్యములతో మేళవించి పాడిరి. ఆ హాలంతయు(Hall) సంతోషధ్వానములతోను శ్లాఘూభాషితములతోను మాఱుమ్రోఁగిపోయెను. వీరిరువురకును ప్రథమ బహుమాన మొసంగబడెను.

7. మిడిల్ క్లాసు ఆంగ్లోవర్నాక్యులర్ పరీక్షలో నుత్తీర్ణులైన పిదప సర్కార్ సాహబ్ వారు చదువుకొనుటకు తమ రెండవయన్నగారయిన శ్రీరామావతార సిన్హాగారితో నలహాబాదులో నుండిరి. కాని కొలఁదికాలములోనే వారి తండ్రిగారికి కాన్పూరు బదిలీ యయిపోయినందున సర్కారుసాహబ్ వారుగూడ కాన్పూరు వెళ్ళి యచ్చట 1887 సంవత్సరములో ఎంట్రెన్సు పరీక్షలో (Entrance Examination) నుత్తీర్ణులైరి. పిమ్మట సర్కార్‌సాహబ్ వారలహాబాదులో మ్యూర్ సెంట్రల్ కళాశాలలో నింటరుమీడియటుక్లాసులో (Intermediate Class) ప్రవేశించిరి. ఇంటర్ మీడియటు పరీక్షలో 1889 సంవత్సరములో నుత్తీర్ణులై, వెంటనే బి. ఏ, (B. A.) క్లాసులో జేరిరి అందుతోఁబాటు ఏకకాలముననే న్యాయశాస్త్ర విద్యా తరగతిలో(Law class) చేరి యల్. యల్. బి. (L. L. B.) పరీక్షకుగూడ చదువుచుండిరి.

8. వారాకాలములో కళాశాలలోని వివిధ సంఘముల సమావేశములలో నుత్సాహముగ పాల్గొనుచు నుపన్యాసముల నిచ్చుచుండెడివారు. సామాన్యముగ మ్యూర్ సెంట్రల్ కళాశాల హాలులో నీసమావేశములు జరుగుచుండెడివి. అచ్చట సర్కార్ సాహబ్‌వారనేకవిషయములపై సమయోచిత భాషణముల నిచ్చెడువారు. వారికి చర్చించుటలోను శాస్త్రవాదములు చేయుటలోను తీవ్రమగు నభిరుచి గలదు

9. 1889వ సంవత్సరాంతమున సర్కారుసాహబ్‌వారి వదినెగారగు శ్రీరామావతార్‌సిన్హాగారి భార్య మరణించిరి. అందుచే, నాయన చింతాగ్రస్తుడై మనశ్శాంతిని గోల్పోయి, ప్రాపంచిక విషయములయెడ నొకవిధముగ విరక్తుడాయెను. మహారాజసాహబ్‌వారా రోజులలో, నలహాబాదులో అక్కవుంటెంటు జనరల్ (Accountant General's Office)గారి ఆఫీసులో పని చేయుచుండిరి. మహారాజసాహబ్‌వారు వారాణసిలో నుండినప్పటినుండియు

శ్రీరామఅవతారసిన్హాగారికి వారితో పరిచయము గలదు అందుచే నాయన మనశ్శాంతిగల్గించు సలహాను పొందుటకై వారివద్దకు వెళ్ళిరి. మహారాజ సాహబ్‌వా రాయనకు ఆగ్రా పోయి హుజూర్ మహారాజువారి సత్సంగమును జేసికొనుమని సలహానిచ్చిరి శ్రీరామఅవతారసిన్హాగారు దీర్ఘ కాలపు సెలవు తీసికొని, అట్లుచేయుటకు బదులు "మసూరీ" యొక్క ఏకాంతప్రశాంత వాతావరణములో దుఃఖోపశమనము కాగలదని యాశించి, యచ్చటకు వెళ్లెను. కాని యచ్చట మనశ్శాంతి గలుగనందున ఆయన ఆగ్రావెళ్ళి హుజూర్‌మహారాజువారి దర్శనము జేసికొనిరి. హుజూర్‌మహారాజువారి యమృతవచనములను విని పిమ్మట నాయనకు పూర్తిగ మనశ్శాంతి చేకూఱి నందున యీమతములో నుపదేశము నొందెను. సెలవు పూర్తియైన పిదప ఆయన తిరిగి అలహాబాదులో తనపనిలో ప్రవేశించి, ప్రతి ఆదివారమును, తప్పక మహారాజసాహబ్ వారి యింటికి సత్సంగమున కరుగుచుండెడివారు ఆరోజులలో మహారాజసాహబ్ వారు, శ్రీమాధవప్రసాద్ సిన్హాగారు, శ్రీ ప్రేమ్ ప్రసాద్‌గారు, శ్రీ ప్రేమశరణుగారును (అనగా శ్రీ పురుషోత్తమదాస్ టాం డన్‌గారి తండ్రిగారు) సత్సంగమునకు తప్పక హాజరగుచుండెడివారు. శ్రీరామ అవతార్ సిన్హాగారితోగలిసి సర్కార్‌సాహబ్ వారుగూడ సత్సంగమునకు వెళ్ళుట మొదలుపెట్టినందున సత్సంగమునకు వచ్చెడివారి సంఖ్య పెరిగెను. సర్కార్‌సాహబ్ వారీ మతవిషయములను గుఱించి మహారాజసాహబ్ వారితో పలుసార్లు చర్చచేసి తృప్తినొందినపిదప, మహారాజసాహబ్ వారి నుపదేశమిమ్మనికోరిరి. తమకర్హులని తోచిన జిజ్ఞాసువులకు, స్వచ్ఛందముగ నుపదేశమిచ్చుటకు, మహారాజసాహబ్ వారి కంతకుమున్నే హుజూర్‌మహా రాజువారి యనుమతి యుండినందున, వారు సర్కారుసాహబ్ వారికి 1891 సంవత్సరములో నుపదేశ మొసంగి యాధ్యాత్మిక సాధనల నభ్యాసము జేయు పద్ధతులను వివరించి చెప్పిరి.

10 పిమ్మట సర్కారుసాహబ్ వారి సహపాఠులును స్నేహితులునుగూడ, నుపదేశము నొందుటచే నలహాబాదులో సత్సంగులసంఖ్య క్రమక్రమముగ పెరిగి, మహారాజసాహబ్ వారి యింటికి సత్సంగమున కదివఱకుకన్న హెచ్చు మంది హాజరగుచుండిరి.

11. సర్కార్‌సాహబ్‌వారి జీవితములో, వారియువదేశానంతర మొకగొప్ప మార్పు గలిగెను. వారు విద్యావ్యాసంగము విషయములో నశ్రద్ధ జూపుచు నాధ్యాత్మిక సాధనల నభ్యసించుటలోనే సంపూర్ణముగ మగ్నులై యుండెడి వారు. మహారాజసాహబ్‌వా లొకసారి హుజూరుమహారాజువారి దర్శనముకొఱకు ఆగ్రావెళ్ళినపుడు, సర్కార్‌సాహబ్‌వారును, వారియన్నగారగు శ్రీరామఅవతార్‌సిన్హాగారును, మున్షీరాంసేవక్‌లాల్‌గారును, మున్షీఉమాప్రసాదుగారును, అలహాబాదులో నింకననేకసత్సంగసోదరులునుగూడ వారితో వెళ్ళిరి.

12. అప్పుడు మహారాజసాహబ్‌వారు, హుజూరుమహారాజువారికి, సర్కార్‌సాహబ్‌వారిని జూపించి, "హుజూర్, నేనీయమూల్యబహుమానమును తమ పాదపద్మములవద్ద నర్పించుటకు దెచ్చితి"నని మనవిచేసిరి. అంతట సర్కార్‌సాహబ్‌వారు హుజూర్‌మహారాజువారి చరణకమలములకు వంగి ప్రణామము చేయుగా, హుజూరుమహారాజువారు తమ దయార్ద్రదృష్టిని వారిపై వర్షించుచు, "అయితేమీరునువచ్చితిర"నిచెప్పి, వారికి "స్వామీ అవతార్"అనుపారమార్థిక నామధేయము నిడిరి. ఆవెంటనే ఈముగ్గురు మహాపురుషులును, అనగా హుజూరుమహారాజువారు, మహారాజసాహబ్‌వారు, సర్కార్‌సాహబ్ వారును, మఱికొందఱు సత్సంగులును గలిసియున్న ఛాయాచిత్రమొకటి తీయబడెను

13. తరువాత సర్కార్‌సాహబ్‌వారు తిరిగి ఆగ్రావెళ్ళినపుడు, తాము రచించిన "ప్రార్థన"యను హిందీశబ్దమును మృదుమధుర కంఠస్వరముతో పాడి హుజూరుమహారాజువారికి వినిపించిరి. ఆ శబ్దముయొక్క ప్రథమచరణ మీ క్రింద నుదహరించబడినది:—

"హేసంతన సిరతాజ్ కృపాలా హేగురు దీనదయాలా"

సర్కారుసాహబ్‌వారు సంత్‌సద్గురువుగ ప్రకటమైన పిదప నీశబ్దమును కొన్ని సమయోచితమైన మార్పులుచేసి, ప్రేమసమాచార్ పత్రికలో ప్రకటించుట కుత్తరు విచ్చిరి.

14. సర్కార్‌సాహబువారి తండ్రిగారు (వీరిని బడేసర్కార్ అనియందఱు పిలుచుచుండెడివారు) గొప్ప శ్రద్ధాళువైన శివభక్తులని యీ సందర్భ

మున జెప్పుట యసంగతము గా నేరదు వా రా మరణాంతమును సనాతన ధర్మానుయాయులగు పూర్వాచారపరాయణులుగ నుండిరి. వారికి తమ పుత్రులు మతాంతరమును నవలంబించుట యిష్టములేకుండెను. ప్రారంభములో నాయన బాహాటముగ విరోధమును జూపుచుండిరిగాని కొంతకాలమైన పిదప సాధ్యముగాక తటస్థభావముతో నూరకుండిరి ఆయన ద్వితీయ పుత్రుడు మహారాజసాహెబ్ వారి సాంగత్యప్రభావముచే మొదట నుపదేశమును దీక్షి కొనిరి. పిమ్మట సర్కార్‌సాహెబ్ వా రుపదేశము నొందిరి. సర్కార్‌సాహెబ్ వారి తల్లిగారు శ్రీకృష్ణభక్తురాలు. రాధాస్వామీ మతమున నుపదేశము నొందుమని సర్కార్‌సాహెబ్ వా రామె కొకప్పుడు సలహానిచ్చిరి కాని ఆమె "నేనొకేసమయమున రెండుపడవలలో ప్రయాణము జేయజాల"నని చెప్పుచు నిరాకరించిరి.

15 కొంతకాలమైనపిదప నొకనాడు మధ్యాహ్నము, ఆమె యల్పనిద్ర నుండి మేల్కొనిన వెంటనే, తాను రాధాస్వామీమతములో నుపదేశము పొందనిశ్చయించుకొనినట్లుగ, తన కొమార్తెను వెళ్ళి సర్కార్‌సాహెబ్ వారితో చెప్పి, వారిని పిలుచుకొని రమ్మని పంపెను. ఆమాట విని, సర్కార్ సాహెబ్ వారి సోదరి యమితానంద భరితయై, ప్రాంగణద్వారము వద్దకు పరుగిడి, సర్కారుసాహెబ్ వారిని బిలిచెను. వారు వెంటనే వచ్చుచుంటిమని సమాధానము చెప్పి, తల్లిగారియొద్దకు వెళ్ళి చిఱునగవుతో నేమివిషయమని, యామెను ప్రశ్నించిరి. ఆమె "నాయనా, జాగుసేయక వెంటనే నాకుపదేశము నిమ్మ"ని యడిగిరి. సర్కార్‌సాహెబ్ వారు, అనుజ్ఞలేనిదే తామె ట్లుపదేశ మీయగలమని యనుచు, నావలకేగి, కొంతయాలోచించిన పిమ్మట తిరిగివచ్చి, "అమ్మా, నీకును, అక్కయ్యకు నుపదేశమిచ్చుటకు నా కనుమతి యున్నదనియే యూహించుచుంటిని," అని చెప్పిరి. వారప్పు డాయిరువురకును స్మరణధ్యానయుక్తుల నుపదేశించి, హుజూర్ మహారాజువారికి సమ్మతికొఱకై తెలియపఱచిరి. హుజూర్ మహారాజువా రీక్రిందివిధముగ నాక్షేపణచేయుచు తమయంగీకారమును తెలియజేసిరి.

తుమ్‌కో అభీసే ఇత్‌నీ ఇజ్‌తరాబీ నహీం కర్నీ చాహీయే థీ

అర్థము:– 'మీరప్పుడే అంతతొందరపడి యుండకూడదు'.

16. సర్కార్‌సాహెబ్ వారికి పిన్నవయస్సుననే 'ఛప్రా' పట్టణములో నొక ప్రసిద్ధన్యాయవాదియగు శ్రీరఘువంశసహాయ్‌గారి కొమార్తెనిచ్చి

వివాహము చేసిరి. సర్కార్ సాహబ్ వారప్పటికింకను అలహాబాదులో తమ రెండవయన్నగారియొద్ద నుండి చదువుకొనుచుండెడివారు సర్కార్ సాహబ్ వారి పూజ్యధర్మపత్నిని 'దులహిన్ జీ' అని పిలిచెడివారు. అక్కాలములో సంయుక్తప్రాంతములలోను బీహారులోను గౌరవనీయకుటుంబములలోని స్త్రీలు తప్పక ఘోషాను పాటించెడివారు. అందుచే దులహిన్ జీగారును ఘోషాను పాటించుచుండిరి ఆమె మురారు గ్రామములో సర్కారుసాహబ్ వారి తండ్రిగారియొద్ద నుండెడివారు. ఆమెకొకసారి జబ్బుచేసినందున శీతోష్ణస్థితి మార్పుకొఱకామెను తన యత్తగారితోను ఆడపడుచుతోను అలహాబాదు పంపుటకు నిశ్చయించిరి. ఆమె అలహాబాదులో నున్నపుడే, వీరందఱును హుజూర్ మహారాజువారి దర్శనార్థమై, సెలవురోజులలో నాగ్రా వెళ్ళుటకు నిశ్చయించుకొనిరి. సర్కార్ సాహబ్ వారి తల్లిగారిని, సోదరిని, శ్రీమతి దులహిన్ జీగారిని జ్వాలాప్రసాద్ సిన్హాగారి భార్యగారిని దోడ్కొని, సర్కార్ సాహబ్ వారును, శ్రీజ్వాలాప్రసాద్ సిన్హాగారును ఆగ్రా వెళ్ళిరి. హుజూర్ మహారాజువారపుడు, దులహిన్ జీగారికిని జ్వాలాప్రసాద్ సిన్హాగారి భార్యగారికిని ఉపదేశమిచ్చి, సర్కార్ సాహబ్ వారి తల్లిగారియొక్కయు సోదరియొక్కయు నుపదేశములను ధ్రువపఱచిరి. ఇవ్విధముగ బడేసర్కారుగారు దక్క, కుటుంబములోని శేషించినవారందఱును, రాధాస్వామీమతమున నుపదేశము నొందిరి.

17. సర్కార్ సాహబ్ వారుపదేశము తీసికొనినదిమొదలు సామాన్యముగ పారమార్థిక సాధనల నభ్యసించుటలోనే నిమగ్నులై యుండుచు, కళాశాలలో తమ చదువు విషయములో నశ్రద్ధచేసి, చివరకు చదువును పూర్తిగ మానివేసిరి అందుచే సహజముగ వారి బంధువుల కాందోళనగలిగెను. ఆఱు సంవత్సరములైనపిదప వారి యన్నగారు శ్రీరామఅవతార్ సిన్హాగారీ విషయమును మహారాజసాహబ్ వారికి దెలియజేసిరి. మహారాజసాహబ్ వారు సర్కార్ సాహబ్ వారితో నీవిషయము ప్రసంగించి వారికి చదువుకొనుట కెంతమాత్రమిష్టము లేనట్లుండుటచే, వారి నా సంవత్సరమే ఎల్. ఎల్. బి. పరీక్షకు తప్పక వెళ్ళుమని సలహానిచ్చిరి. ఏలనన, నట్లుచేయనిచో, విశ్వవిద్యాలయ నిబంధనలలో చేయబడిన మార్పులవలన నాపైసంవత్సరమునుండి, బి.ఏ పరీక్షలో నుత్తీర్ణులుగానివారికి ఎల్. ఎల్. బి. (L. L. B.) పరీక్షకు వెళ్ళుట కనుమతిలేదు. ఆయాజ్ఞప్రకారము, సర్కార్ సాహబ్ వారు 1898 సంవత్సరములో ఎల్. ఎల్. బి పరీక్షకు వెళ్ళి యుత్తీర్ణులైరి.

**18.** అలహాబాదులో నున్నపుడు సర్కార్‌సాహబ్‌వా రొకసారి, తమ యాంతర్యానుభవములను దెల్పుచు తమయాత్మ యాంతర్యమున నూర్ధ్వ మండలములకు పయనము చేసినదని సెలవిచ్చిరి. తమ దగ్గఱబంధువు లందఱును, వీరు మిగిలినపనులన్నియు గట్టిపెట్టి, తమ సమయమునంతను ఆధ్యాత్మికసాధనలను జేయుటలోనే వినియోగించుటజూచి వ్యాకులపడజొచ్చిరి. వారందఱును ఈవిషయమై అప్పుడు సత్సంగనాయకులుగ నున్న మహారాజ సాహబ్‌వారికి మఱలనొకసారి మొఱపెట్టుకొనిరి. మహారాజసాహబ్‌వారు సర్కార్‌సాహబ్‌వారి చేయిపట్టుకొని పారమార్థికకర్తవ్యములతోబాటు ప్రాపంచికకర్తవ్యములను గూడ హృదయపూర్వకముగ నెఱవేర్చుచుండవలయునని విశదపఱచి, వారిని న్యాయవాదివృత్తిని ప్రారంభింపవలసినదిగ సలహా చెప్పిరి. ఈయుత్తరువు ప్రకారము సర్కార్‌సాహబ్‌వారు ఘాజీపురములో న్యాయవాదిగ పనిచేయ ప్రారంభించిరి. కక్షిదారులు వీరివద్దకు వచ్చుట ప్రారంభించి, క్రమక్రమముగ కొంతకాలమగుసరికి వారలసంఖ్య యత్యధికమయిపోయెను. అందుచే సర్కారుసాహబ్‌వారికి చాలకష్టపడి పనిచేయవలసి వచ్చెను. వారి శరీరప్రకృతి చాల సున్నితముగ నుండెడిదిగాని వారియఖండ బుద్ధిచాతుర్యమును, అద్భుతవివేచనాశక్తిని, అసాధారణనిర్ణయసామర్థ్యమును, విస్పష్టముగ సూచించు నొకమహాతేజస్సు వారినేత్రకమలములలో ప్రకాశించుచుండెడిది. వారి జ్ఞాపకశక్తిగూడ చాలప్రశంసనీయము. వారు తమవద్దనెవరైననొకసారి వచించిన విషయమును తిరిగి కావలసినప్పుడు సమగ్రముగ పూసగుచ్చినట్లు చెప్పగలిగెడివారు. తత్పరిణామముగ కొద్దిమాసములలోనే వారు తమవృత్తిలో నగ్రగణ్యతనొంది న్యాయవాదిబృందనాయకులలో నొకరుగ పరిగణింపబడజొచ్చిరి. వారివ్విధముగ విజయపరంపరనొందుచు చివరకు 1911 సంవత్సరములో తమవృత్తిని చాలించుకొనుసరికి నెలకు రు2000/-లకు పైగా సంపాదించుచుండెడివారు.

**19.** న్యాయవాదివృత్తిలో సర్కార్‌సాహబ్‌వారి ప్రఖ్యాతి నలుదెసల వ్యాపించి, వ్యాజ్యములలో వీరినాశ్రయించిన కక్షిదారుల కెన్నడు నపజయముగలుగనేరదను నొక దృఢవిశ్వాసము ప్రజలలో నేర్పడెను. ప్రతి దినమును కక్షిదారులు వారిభవనమువద్ద కధికసంఖ్యాకులుగ వచ్చుచుండెడివారు. కక్షిదారు లంతయెక్కువగ తమవద్దకు వచ్చుచున్నను, సర్కార్ సాహబ్‌వారు తమ రుసుమును మాత్రము హెచ్చింపలేదు. అందుచే వారు

కొన్ని కేసులను పట్టుటయే నిరాకరించవలసివచ్చెడిది. బీద కక్షిదారుల విషయములో వారు తమ రుసుమును తగ్గించికూడ పుచ్చుకొనెడివారు. వృత్తి విషయమైన పను లెంత హెచ్చుగ నున్నను, వారు మహారాజసాహబ్ వారి సత్సంగమునకు తఱచుగనే వెళ్ళుచుండెడువారుగాని, వృత్తికార్యములవలన నందుకెన్నడు నాటంకము కలుగనీయలేదు.

20. 1902వ సంవత్సరములో మహారాజసాహబ్‌వారు రాధాస్వామీ సత్సంగమునకు కేంద్రీయపాలకసమితిని (Central Administrative Council) ఏర్పాటుచేసిరి. 1903వ సంవత్సరములో దానిసభ్యుల సంఖ్యను 21వఱకు పెంచి అప్పుడు సర్కార్‌సాహబ్‌వారి నందులో సభ్యులుగ నెన్నుకొనిరి. పిమ్మట 1904 సంవత్సరములో రాధాస్వామీ ధర్మకర్తృవర్గము (Radhasoami Trust) నేర్పాటుచేసినపుడు అందులోని యేడుగురు ధర్మకర్తలలో సర్కారుసాహబ్‌వారినిగూడ నొకధర్మకర్తగఁ జేసిరి.

21. సర్కార్‌సాహబ్‌వారు ఘాజీపురములో స్థిరపడినందున, ఘాజీపుర బ్రాంచిసత్సంగమునకు గొప్పప్రాముఖ్యమేర్పడెను. ప్రతిదినము నాసత్సంగమునకు 60, 70 మంది సత్సంగులు తప్పక వచ్చుచుండెడివారు. సర్కార్‌సాహబ్‌వారు గురుముఖులుగ నున్నపుడుగూడ వారు ఘాజీపురసత్సంగములో సత్సంగులకు రాధాస్వామీమతసిద్ధాంతములను సవిస్తరముగ బోధపఱచుచుండెడువారు.

22. సర్కార్‌సాహబ్‌వారు అలహాబాదు వెళ్ళినపుడెల్ల నేదేని యొక వింతవస్తువును, మహారాజసాహబ్‌వారికి సమర్పించుటకు తీసికొనివెళ్ళుచుండెడివారు. ఒకసారి వారొక బాలగాయకునిచే ప్రేమవాణిలోనుండి కొన్నిశబ్దములను కంఠస్థము చేయించి, తమతోగూడ నతనిని అలహాబాదు తీసికొనివెళ్ళిరి. అతడు చాలరోజులు సితారువాయిద్యముమీద నాశబ్దములను పాడుచు సత్సంగులనందఱ నానందపఱచెను. వాని మధురమనోహరగీతములకు మహారాజసాహబ్‌వారు మెచ్చుకొని యీబాలునికి క్రొత్త దుస్తులను బహుమానమిచ్చిరి. అటులనే తమబంధువైన శ్రీచంద్రశేఖరునిగూడ సర్కార్‌సాహబ్‌వారు చాలసార్లు అలహాబాదు తీసికొనివెళ్ళిరి. శ్రీచంద్రశేఖరుడు ప్రవీణగాయకుడగుటచే హార్మోనియముతో కలిపి పాటలుపాడి మహారాజసాహబ్‌వారికి వినోదమును గల్గించుచుండెడివాడు.

23. ఒకసారి ఒక హోలీయుత్సవసమయములో, సర్కార్ సాహబ్ వారొక చిన్న వెండిపిచికారిని వెండిగిన్నెను మహారాజసాహబ్ వారి సత్సంగమునకు తీసికొనివెళ్ళిరి. ఆగిన్నెలో వసుపురంగు నీళ్ళనుబోసి, సత్సంగులందఱిమీద నాయుదకమును జల్లవలసినదని కోరుచు, సర్కార్ సాబ్ బువా గానీటిని పిచకారిని, కార్యదర్శియైన శ్రీప్రేమప్రసాద్ గారిద్వారా, మహారాజసాహబ్ వారి కిప్పించిరి. మహారాజసాహబ్ వా రాపిచకారీతో నుదకమును, కొద్ది సత్సంగులమీద మాత్రమే జల్లిన పిదప, "అమ్మయ్యో! నా వ్రేళ్ళు నొవ్వ నారంభించినవి" అని చెప్పి యాపిచకారిని ప్రక్కనుంచివేసిరి. సత్సంగు లీమాట నొకపరిహాసముగ భావించి, నవ్వఁదొడఁగిరి, గాని సర్కార్ సాహబ్ వా రామాటవిని, చాల ఖిన్నులైరి. ఆరాత్రి సర్కార్ సాహబ్ వారు విశ్రాంతితీసికొనుచుండునపు డొకఘాజిపుర సత్సంగి వారివద్దకు వచ్చి నిజముగ నాచిన్నపిచకారి కొట్టుటలో మహారాజసాహబ్ వారికి బాధ గలిగి యుండెనా యని వారినడిగెను. మొదట సర్కార్ సాహబ్ వారు, ఆప్రశ్నను వినిపించుకొననట్లూరకుండిరి. కాని ఆసత్సంగి సమాధానము కొఱకు పట్టు పట్టినందున, సర్కార్ సాహబ్ వారు, "అదియంత యల్పవిషయముగాదు. సంతుల చైతన్యధార సంపూర్ణముగ పైకాకర్షింపబడినపుడు, వారిశరీర మతి కోమలముగను బలహీనముగను ఉండును. వాస్తవముగ, వారు తమలక్ష్యమును బాహ్యముగ నుంచినపుడెంతటి దుఃఖదాయక పరిస్థితినైన, నేమియు బాధానుభవములేకుండగనే సహించగలరు," అని సెలవిచ్చిరి.

24. సర్కారుసాహబ్ వారికి, అయిదుగురు సంతానము. వారి ప్రథమ పుత్రుడు పసితనముననే చనిపోయెను. తరువాతి యిరువురును కొమార్తెలు. జ్యేష్ఠపుత్రిక సజీవురాలై యున్నారు. ఆమెను 'ఆరా'లో నొకగౌరవనీయ కుటుంబమునకుజెందిన రాయ్ బహాదుర్ చతుర్భుజసహాయ్ గారి కుమారుడైన, శ్రీశ్యామనందన సహాయ్ గారికిచ్చి వివాహముచేసిరి. వారి చిన్నకొమార్తెకు పెండ్లియై యొక పిల్లవాడు కలిగినతరువాత, నామె చనిపోయెను. సర్కార్ సాహబ్ వారి మిగత యిరువురు సంతానమును కుమారులు వారు సంపన్నగృహస్థులు. పెద్దవారగు శ్రీగురుదేవప్రసాదసిన్హాగారు, దయాల్బాగు టెక్నికల్ కాలేజీకి ప్రిన్సిపాలు (Principal) గా పనిచేయుచున్నారు. చిన్నవారైన (శ్రీ) గురుదయాల్ ప్రసాద్ సిన్హాగారు జంషెడ్ పురములో బీహారు కో

ఆపరేటివు బ్యాంకు (Bihar Co-operative Bank) లో నుద్యోగము చేయుచున్నారు.

25. మహారాజసాహబ్ వారు 1906వ సంవత్సరములో హైదరాబాదు (సింధు)లో నున్నపుడు, సర్కార్ సాహబ్ వారితో నొకనాఁడిట్లనిరి, "మీరు పొట్టిగను, సన్నముగను, బక్కపలుచగను ఉన్నారు. మీ శారీరకవైఖరి సభను మెప్పింపకపోవచ్చును. మీరు గడ్డము పెంచినచో, మీరూపమునకు వశీకరణశక్తి చేకూరగలదు." అలబేలీశరణు అను సాధువు ఈమాటలనువిని, సర్కార్ సాహబ్ వారు గురుముఖులుగ నెన్నుకొనబడినట్లు ఆమాటలలో సూచనగలదని యభిప్రాయపడెను. సింధుదేశమునుండి తిరిగివచ్చిన తోడనే, ఆయన మహారాజసాహబ్ వారనిన మాటలను జెప్పి, యామాటలకు తాను తీసిన యర్థమునుగూడ దాపరికము లేకుండ సత్సంగులకు వెల్లడిచేసెను.

## మహారాజ సాహబ్ వారి రుగ్మత, నిర్యాణము

26. మహారాజసాహబ్ వారలహాబాదునుండి సత్సంగకేంద్రమును వారాణసికి మార్చి సామియాబాగులో నొకసత్సంగహాలును కట్టించుమని యాజ్ఞనిచ్చినపుడు, వారి యారోగ్యము బాగులేదు. వారి కపుడు త్రియంబకశాస్త్రి యనెడి యాయుర్వేదవైద్యులు వైద్యము చేయుచుండిరి. కాని వారి యారోగ్యము దివ్యేచ్ఛ (మౌజ్)చే బాగుపడుటకు బదులు నానాఁటికి చెడిపోవుచుండెను. జ్వరము 10½ డిగ్రీలలో నట్లె నిలిచిపోయెను. ఆవైద్యము రెండు మాసములు చేయించిన పిదప నొక హోమోపతి (Homoeopathy) వైద్యునిగూడ సలహాచేసిరి. అయినను అంత యమితబలహీనరుగ్మతాపరిస్థితిలోగూడ, మహారాజసాహబ్ వారు, గుప్తమగుట కొకమాసము ముందువఱకును, సత్సంగమునకు వచ్చుట మానలేదు.

27. ఆపరిస్థితులలో, సత్సంగులు వ్యాకులపడుటయు విచారగ్రస్తులగుటయు సహజమే. సాధువు అలబేలీశరణువంటి కొందఱు సత్సంగులు, మహారాజసాహబ్ వారు సామియాబాగులో సత్సంగహాలు నిర్మాణమును తలపెట్టుట విపత్సూచకమని భావించిరి. స్వామీజీమహారాజువారు హుజూరుమహారాజువార్ల యిరువురి కాలములలో జరిగినట్లే, తమపవిత్రరజమును దీనిలో సమాధిచేయించుటకొఱకే, మహారాజసాహబ్ వారుగూడ దీనిర్మాణమును

తలపెట్టి యుండవచ్చునని అలబేలీశరణుగా రనుకొనిరి. ఎట్లయినను సత్సంగు లందఱును మహాఖిన్నులయి, స్వామియా బాగు వాతావరణ మంతయు విచార వ్యాకులత్వములతో నిండిపోయెను.

28. ఆ మహావ్యాకులదివసములలో పండిత మణి రామశాస్త్రిగా రొకనా డుదయసత్సంగానంతరము సర్కార్ సాహబ్ వారింటికి వెళ్ళిరి. అచ్చట సర్కార్ సాహబ్ వారివలన నాదరపూర్వకమైన స్వాగతమునొందిన పిమ్మట వారితో "మహారాజసాహబ్ వారి పరిస్థితి కడు భీతిని గలుగజేయుచున్నది. వారు తమ దివ్యేచ్ఛను మార్చుకొని, నాఁబోటి దీనుల యెడల నెప్పటి వలెనే దయచూపుచుందురని యాశించుచున్నా"నని చెప్పుకొనిరి. సర్కార్ సాహబ్ వారు తటస్థ భావముతో, "దివ్యేచ్ఛ యేమి విధించెనో యెవరికెఱుక? మనమజ్ఞానులము. కావున మనము వేచియుండవలసినదే"యని ప్రాసంగిక ముగ సెలవిచ్చిరి. కాని పండితమణి రామశాస్త్రిగా రంతటితో విడువక, తిరిగి యిట్లనిరి, "మీరట్లన రాదు మహారాజసాహబ్ వారు కేంద్రీయ సమితి బాధ్యతలను తమకును, మఱికొందఱకును వప్పగించిరి. మాయందఱి కష్టము లను తొలఁగించుటకై మీయం దాసపెట్టుకొనియున్నాము". సర్కార్ సాహబ్ వారు కొంతసేపూరకుండి, విచారగ్రస్తమగు స్వరముతో, "పండిత్ జీ, మహారాజసాహబ్ వారు సర్వసమర్థులు. వారికెట్లుకావలెనన్న నట్లు విధింపగల సమర్థత గలదు. తమ శరీరమును తిరిగి యారోగ్యవంతముగఁ జేసికొనుట వారి కెంతమాత్రము కఠినముగాదు. కాని బాహ్యమునుండి చూడగ వారి దివ్యేచ్ఛ దురవగాహ్యము. మనము వారిచరణములందు జేయు మహాదీనప్రార్థన, మన మెప్పటియట్ల పసిపిల్లలవలె వారి దర్శనవచనముల యానందము నొందుచుండులాగున వా రనుగ్రహించవలయుననియే. కాని దివ్యేచ్ఛను మఱల్చుట కేవలము వారి చేతులలో నున్నది. మన మీవిషయ ములో పూర్తిగ నసమర్థులము. ప్రస్తుతపరిస్థితులనుబట్టి చూడగ, మనకు నిరాశయే గల్గుచున్నది ఇంతకన్న నెక్కుడు చెడురోజులు మనకు రాకుండ రాధాస్వామిదయాళుడు గాపాడుదురుగాక!" క్రీ॥శ॥ 1878లో రాధాస్వామి దయాళుడు తమ మానవశరీరమును విసర్జించునపుడు చేసిన యభయవాగ్దాన మును వారు నిర్వహింపరా యని సర్కార్ సాహబ్ వారపుడు చటుక్కున నడిగి స్వామీజీమహారాజువారి యీక్రింది మహావచనమును స్మరించిరి. "సత్సంగు లెవరును, సాధువులుగాని గృహస్థులుగాని, వ్యాకులపడ నక్కఱ

లేదు. నేనిఁకముం దందఱకును తోడుగనుండి. యిదివఱలోకన్న నెక్కువ దయాకటాక్షముల జూపుచు నందఱను గాపాడుచుందును" సర్కార్‌సాహబ్ వారు మ తేమియు ననలేదు. కాని పండితమణిరామశాస్త్రిగారు మహారాజ సాహబ్‌వారు యథాప్రకారము సత్సంగులను గాపాడుచు నందఱిమీద దయావర్షమును గురిపించుచునేయుందు రను దృఢవిశ్వాసముతో నచ్చటనుండి వెడలిపోయిరి

29. చివరకా చిరయోచితభయావహదిన మేతెంచెను. 1907 సంవత్సరము అక్టోబరు నెల 12వ తేది సాయంకాలము మహారాజసాహబ్‌వారు తమ భౌతికశరీరమును వీడి, సత్సంగులను వియోగదుఃఖమున ముంచివైచిరి. ఆ మఱునాడు దహన సంస్కారము జరిగించి సాయంకాలము సత్సంగములో నీ క్రింది క్రొత్తశబ్దమును పఠించిరి.

"దర్శన దీజే నామ సనేహీ తుమ బిన దుఖ పావే మేరీ దేహీ"
అర్థము:- ఓప్రియమైన ప్రభో, ఓపవిత్రనామప్రియా, నాకు తమ దర్శనము దయచేయుడు. మీ దర్శనము లభించక నేను మహాదుఃఖపీడితుడనై యుంటిని."

చాలమంది సత్సంగు లీశబ్దము మహారాజసాహబ్‌వారిచే రచింపబడి నదని భావించిరి. కాని యాశబ్దము చివరి రెండుపంక్తులలో కబీరువారి పేరుం డుటచే నా పంక్తులను చదివినపు డాతప్పటభిప్రాయము తొలఁగిపోయెను. చివరిపంక్తులు రెండునీక్రింద నుదహరింపబడినవి

"దాస కబీర యహ కరత బీనతీ మహాపురుష అబ్ మానియే.
దయా కీజే దరస దీజే అపనా కర మోహిఁజానియే.॥

అర్థము - దాసుడనైన కబీరు అనునేను ప్రార్థన జేయుచుంటిని, "ఓ మహాపురుషా నామొఱను ఇప్పుడే అంగీకరింపుము. నాయం దనుగ్రహము జేసి నన్ను తమ యాత్మీయునిగ భావించి నాకు దర్శనమిప్పించుము" ఆమహాదుఃఖసమయమున కీశబ్దము సమంజసముగ నుండుటచే ప్రతిదినము, నుదయాస్తమయములు సత్సంగములో దీసిని పాడుచుండిరి ఘాజిపుర సత్సంగములోగూడ నీశబ్దమును చాలకాలముఁవఱకు పాడుచుండిరి.

30. మహారాజసాహబ్‌వారు రచించిన ప్రార్థనా శబ్దము, వారు గుప్తమ యిన పిమ్మట మూడవనాడు కనుపించినది. ఆశబ్దము మొదటిపంక్తి యీక్రింద

నుదహరించబడినది.

బార్ బార్ కర్ జోరకర్ సవినయ కరూం పుకార్॥

అర్థము:- నేను తిరిగితిరిగి చేతులమోడ్చి సవినయముగ విన్నపము జేసి కొనుచున్నాను.

కావున నాల్గవ దినమునుండియు నీప్రార్థనగూడ సత్సంగమును ముగించకముందు సత్సంగులందఱును గలిసి యేకస్వరముగ పాడుట ప్రారంభించిరి.

ఈశబ్దము నంతను, దీనికాంగ్ల భాషలో నర్థముతోగూడ 'డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీ ఫేత్' (Discourses on Radhasoami Faith) అను గ్రంథముచివర ననుబంధముగ ప్రకటించిరి.

## సంత్‌సద్గురువుగనున్న కాలము

31. మహారాజసాహబ్‌వారు నిర్యాణమైనవెంటనే సత్సంగుల కాంతర్యానుభవములు గలుగ నారంభించెను. కొందఱకు మహారాజసాహబ్‌వారు స్వప్నములో దర్శనమిచ్చి తాము సర్కారుసాహబ్‌వారిలో ప్రకటమైతి మని చెప్పి వారి యొద్దకు వెళ్ళుమని సెలవిచ్చిరి. మఱికొందఱ కాధ్యాత్మిక సాధనల నభ్యాసముచేయు సమయములో నాంతర్యమున, సర్కార్‌సాహబ్‌వారే దర్శనమిచ్చిరి. తరువాతి సద్గురువు సర్కార్‌సాహబ్‌వారే యని యందఱు సత్సంగులకుఁ జెప్పుమని కొందఱు సత్సంగుల కాంతర్యమునుండి దైవప్రేరణ గలిగి, వారా శుభవార్తను పరుగులిడుచు నందఱకును తొందరగ నందజేయుచుండిరి.

32 ఇవ్విధముగ మహారాజసాహబ్‌వారు గుప్తమైనపిదప ననేకసత్సంగుల కాంతర్యానుభవముల మూలముననను, ఇతరనిదర్శనములమూలముననను, మహారాజసాహబ్‌వారు తమ్మును విడువకుండ నిచ్చటనే సర్కార్‌సాహబ్‌వారి స్వరూపమున నుండి, మార్గప్రదర్శనమును, సహాయసంరక్షణలను అందఱకు నిచ్చుచుండి రను దృఢవిశ్వాసము గలిగెను. అందుచే సామియాబాగున కావల సర్కార్‌సాహబ్‌వారు నివసించు గృహమువద్దకు సత్సంగు లెక్కువగ వెళ్ళుట ప్రారంభించిరి. ఇందుమూలమున సర్కార్‌సాహబ్‌వారికి తత్తరపాటు గలిగి వారు తమ గ్రామమగు ఘాజిపురమున కెవరికిని దెలియకుండగనే వెడలిపోయిరి

33 అటుపైన సత్సంగులు ఘూజిపురము పోవుట మొదలిడిరి. దినములు గడచినకొలఁది, నధికాధికసత్సంగుల కొంతర్యానుభవములు పథప్రదర్శనమును లభించి ఘూజిపురము పోవువారిసంఖ్య పెరిగిపోవుచుండెను. ఈవిధముగ దేశమందంతటను సత్సంగుల కాంతర్యానుభవములు గలిగెను. స్థలాభావముచే నిచ్చట నావిషయముల నన్నిఁటిని పొందుపఱచుటకు సాధ్యము కాదు

34. సత్కోరీబాబు అనుపేరుగల కలకత్తావాస్తవ్యుడగు నొక బెంగాలీ సత్సంగికిగూడ నొకస్వప్నము వచ్చెను. ఆయన కాస్వప్నములో నొక ఖాళీస్థలమును, అందొక చిన్న భవనమును, ఆభవనమునకు ముందున్న వసారాలో కూర్చుండుట కొక పొడుగుబల్లయును కొన్నికుర్చీలును వేసియున్నట్లు కనఁబడెను. ఒకవైపున నొక రాజసభాస్థలి యుండి, అందులో నొక పర్షియన్ తివాసి పఱచియుండి వెనుకవైపున నొకమెత్త (కుషన్) గూడ వేసియుండెను. అచ్చట నాయనకు మహారాజసాహబ్‌వారు విరాజితులై యున్నట్లు కనిపించెను. కాని వారి యెత్తరువు కొంతతగ్గినట్లును వారొక తెల్లని బూర్నీసుటోపీని ధరించియున్నట్లును ఆయన కగుపించెను. వారిగడ్డము రమణీయమైన స్వర్ణచ్ఛాయతో నొప్పారుచుండెను. సత్కోరీబాబుగారు స్వామిజీబాగు వెళ్ళి యచ్చటి సత్సంగులతో తనస్వప్నమునుగుఱించి చెప్పి దాని యథార్థమును తెలిసికొనఁగోరెను అప్పుడు పండితమణి రామశాస్త్రిగా రాయనకు సర్కారుసాహబ్‌వారిని సూచించి వారిని గుఱించి కొన్ని వివరములను దెలియజేసిరి.

35. సర్కార్‌సాహబ్‌వారు తమవద్దకు సలహానుగోరి వచ్చిన సత్సంగులకును తమకు వ్రాసికొనినట్టి సత్సంగులకును, వార లేపురుషునినైన సద్గురువుగ స్వీకరించుటకుముందు, తమసంశయములనుసందేహములను పూర్తిగ నివృత్తి చేసికొనవలయుననియు, బాహ్యమునను, ఆంతర్యమునను తగిన నిదర్శనములు లభించినపిదపనే సద్గురువునందు దృఢవిశ్వాసము నేర్పఱచుకొనవలెననియు, నెల్లపుడు నొక్కిచెప్పుచుండెడివారు.

36. ఒకసారి సత్సంగములో, మహారాజసాహబ్‌వారు, మనుమలు తఱచు వారి తాతగారి పోలికతో పుట్టుచుందు రనిచెప్పి, తమహస్తము నొక్కసారి తమ ముఖముపై ప్రసరింపజేయగ, నత్యాశ్చర్యకరముగ, వెంటనే వారి ముఖ మచ్చటనున్నవారందఱకు నచ్చముగ స్వామిజీమహారాజువారి ముఖమువలెనే గానవచ్చె ననువిషయము, కొందఱు సత్సంగులకు స్వయముగ దెలి

సినదే. అటులనే సర్కారు సాహబ్‌వారుగూడ నొక రోజున సంభాషించుచున్నపుడు జ్ఞానబాబుగారి (శ్రీజ్ఞానచంద్రబాసక్) వైపునకు దిరిగి "తత్కాల సద్గురువునకును, పూర్వపు సద్గురువునకును ఒక్కొకప్పుడు బాహ్యరూపములో నద్భుతసాదృశ్య ముండునండు"రని సెలవిచ్చి, తమ ముఖకమలమును గడ్డము నొకసారి హస్తముతో తుడుచుకొనగా, నచటనున్నవా రందఱకు నాశ్చర్యముగల్గునట్లు వారిరూపము పూర్తిగమారిపోయి వారిస్థానే మహారాజసాహబ్‌వారే స్వయముగ నచ్చట కూర్చుండినట్లు కనిపించెను. సత్సంగమయినతరువాత నందఱును, తమ కగుపించిన విచిత్రము నొండొరులతో జెప్పుకొని, ధ్రువపఱచుకొనిరి. ఘాజిపురములో నప్పుడుండిన సత్సంగులీ నిదర్శనమును తమ బంధుమిత్రుల కుత్తరములద్వారా తెలియపఱచిరి.

37. ఆరోజులలో సాహబ్జీమహారాజువా రొకసారి పండితహరిహరదత్తశాస్త్రిగారిని చూచుటకు వారాణసి వెళ్ళిరి అప్పుడు శాస్త్రిగారు సంభాషణక్రమములో, "మీకు సర్కారు సాహబ్ వారిలో వారు సంతసద్గురువని నమ్మదగినంత విశేషమేమి కనిపించినది"అని సాహబ్జీ మహారాజువారిని ప్రశ్నించిరి. సాహబ్జీమహారాజువారు, స్వానుభవముల నెవరును బయలుపఱచుట యుక్తముకాదని సెలవిచ్చి, ఘాజిపురసత్సంగములో జరిగిన పైన చెప్పబడిన విచిత్రమును మాత్రము జెప్పి, యీ విషయమును వారి కుమారులగు పండితమణిరామశాస్త్రిగారు కూడ కనులార చూచిరి గావున నాయన నడిగి ధ్రువపఱచుకొనవచ్చునని జెప్పిరి.

38. అంబాలాజిల్లా తంచ్వాల్ గ్రామమునకు కరణముగనున్న చూహడ్‌మల్ అనునొక పురాణసత్సంగి, సర్కారుసాహబ్‌వారికీ క్రిందితీరున నొకయుత్తరము వ్రాసెను. "నేను చిరకాలమునుండి ప్రార్థనచేసి మొఱపెట్టుకొనగా నిన్నరాత్రి పరమగురు మహారాజసాహబ్‌వారు నాకు స్వప్నములో దర్శనమిచ్చి, 'నీ వేల సంతఖిన్నుడవై యుంటి'వని నన్నడిగిరి. నేను కంట నీరుపెట్టుకొని, 'ప్రభూ మీరు మమ్ముల విడనాడి వెళ్ళిరి. తమ్ము నే నిపుడెచట గాంచగలనో నాకు తెలియుటలేదు. నారోజులెట్లు గడచును? నేను సత్సంగవార్తలందనట్టి యొక కుగ్రామమున నుంటిని. వగైరా, వగైరా' అని చెప్పుకొంటిని. అప్పుడు మహారాజసాహబ్‌వారు, 'చూహడ్‌మల్, ఇటుచూడుము. నేను నిన్ను విడచిపోలేదు నేను నారూపమును మాత్రమే మార్చుకొంటి'వని

సమాధానముచెప్పి, వెంటనే క్రొత్తరూపమును ధరించి, 'ఈరూపము కాంత ప్రసాద్‌సిన్హా హైకోర్టు అడ్వొకేటు, ఘాజిపురము', అని చెప్పుచు నంతర్ధాన మైరి. నేనుదయమునలేచి, తొలికృత్యముగ నీయుత్తరమును వ్రాయుచుంటిని. ఈయుత్తరము పైచిరునామాగల వారి కందినయెడల దయచేసి యావిషయము నాకు తెలియజేయవలయునని వినయపూర్వకముగ ప్రార్థించుచున్నాను." ఈయుత్తర మందినట్లు వెంటనే సమాధానము పంపబడెను. ఆసమాధానమందగనే చూహడ్‌మల్ గారు శీఘ్రాతిశీఘ్రముగ ఘాజిపురము వచ్చిచేరు కొనిరి.

39. లాలాతీర్థరామ్ అనునొక సత్సంగికి మహారాజసాహబ్ వారు గుప్తమైనపిదప, క్షయరోగము వచ్చి, ఆరోగము క్రీ॥శ॥ 1908 సంవత్సరము ప్రారంభములో నుద్ధతస్థితికి వచ్చెను. లాలాతీర్థరామ్‌గారు, డాక్టర్ల వైద్యమువల్ల నేమియు గుణము కనుపించనందున, మహాఖిన్నులై యుద్యోగమునుండి దీర్ఘకాలము సెలవుపెట్టి పంజాబులో తమగ్రామమగు హాఫీజాబాదునకు వెళ్ళిరి. ఆయన పల్లెటూరిలో నుండుటచే, మహారాజసాహబ్‌వారి స్థానే సర్కార్ సాహబ్ వారు సంతసద్గురువుగ ప్రకటమయినట్లు, ఆయనకు తెలియదు. ఒకనాటి రాత్రి ఆయన మహానిరాశాదుఃఖములో మునిఁగి నిదురవోవుచుండగ మహారాజసాహబ్‌వారాయనకు స్వప్నములో దర్శనమిచ్చిరి. అప్పుడు లాలాతీర్థరామ్‌గారు కంటనీరుపెట్టుకొని మహారాజసాహబ్ వారు గుప్తమైన పిమ్మట, తనను సంరక్షించి సలహానిచ్చు వారెవరో తెలియకుండుటచే తాను ఘోరాంధకారమున పడియుంటినని చెప్పుకొనగా, మహారాజసాహబ్‌వారు ఆయన నోదార్చి, సర్కారుసాహబ్ వారి చిరునామాను దెలియజేసి వారిని గలిసికొను మని యానతినిచ్చిరి. మఱునాడుదయమున లాలాతీర్థరామ్‌గారు, తమ కష్టములో సలహానిచ్చి సమాధానమువ్రాయుమని గోరుచు నాచిరునామా కుత్తరమును వ్రాసికొనిరి. ఒకవారములోపుననే ఆయనకు మహానందము గల్గులాగున సమాధానము వచ్చెను. ఆయన తనతండ్రిగారిని సాయము తీసికొని ఘాజిపురము పయనమై వెళ్ళిరి. ఆయన ఘాజిపురములో సర్కార్ సాహబ్‌వారి దర్శనము చేసికొని, వారి పాదపద్మములపైఁబడి మ్రొక్కి, తన బాధనంతయు వారికి విన్నవించుకొనెను. సర్కార్ సాహబ్ వారు తమ స్వంత వైద్యుని బిలిపించి, లాలాతీర్థరామ్‌గారిని బాగుగ పరీక్షించుమని చెప్పిరి. ఆ వైద్యులు, సర్కార్‌సాహబ్ వారితో నారోగము తృతీయపరిస్థితికి వచ్చియు

న్నదనియు, నందుచేనది కుదుర్చుటకు శక్యముకాదనియు, రహస్యముగఁ జెప్పిరి. అయినను సర్కార్‌సాహబ్‌వారు ఆవైద్యు నేదేని మందు నారోగ గ్రస్తున కిమ్మని బలవంతము చేసిరి. ఇవ్విధముగ నాయనకు చికిత్స మొదలు పెట్టిరి గాని, కొంతకాలము వఱకు నాయనలో మార్పేమియు గనుపడలేదు. కొన్నాళ్ళ తరువాత నాయన కారోగ్యము బాగుపడి వైద్యు డాయనకు ప్రాణాపాయస్థితి దాఁటిపోయినదనిధ్రువపఱచెను. అప్పుడాయన తిరిగి పంజాబునకు వెళ్ళి తనయుద్యోగములో ప్రవేశించెను. ఆవైద్యునకు సర్కార్ సాహబ్‌వారు ధన్యవాదములు చెప్పిరిగాని యీవైద్యుడు తానేమియు చేయ లేదనియు, కేవల ముదకము మాత్రము యిచ్చుచుంటి ననియుజెప్పి, యీ విషయములో తానెంతమాత్రము ప్రశంసా ర్హుడనుగానని యొప్పుకొనెను.

40 ఇవ్విధముగ, ఘాజిపుర సత్సంగమునకు పోవు సత్సంగులసంఖ్య, దిన దినప్రవర్ధమాన మగుచు, 1908 సంవత్సరము అక్టోబరునెలలో భండారాసమ యమునాటికి, మహారాజసాహబ్‌వారి సత్సంగులలో నధికాధికసంఖ్యాకులు, సర్కార్‌సాహబ్‌వారినే మహారాజసాహబ్‌వారి యథార్థమైన స్థానాపన్ను లుగ స్వీకరించిరి. తత్ఫలితముగ ఘాజిపురమునకు సత్సంగులు వ్యూహావ్యూ హములుగ వెళ్ళనారంభించిరి.

41. అంతర్యానిదర్శనములు పొందునదృష్టములేని కొందఱు సత్సంగులు సహజముగ సామియాబాగునకు వెళ్ళి, కేంద్రీయపాలకసమితిలో నందఱికన్న నెక్కువ వయోవృద్ధును, పురాణతమసభ్యుడును అగువారినొకరిని కలిసికొని సంప్రతించిరి కాని, ఆయన తాను రాధాస్వామీ మతములో జేరినది మొ దలింతవఱకు తనయనుభవములో నిట్టి త్రోవ తెన్నుగానని యపూర్వ సితి, నిదే మొదటిసారిగ చూచుచుంటిననియు, నెటుజూచిన నాపరమచైతన్య ధార యీప్రపంచమునుండి సర్వాంగత్వేన మఱలిపోయినట్లు కనబడుచున్న దనియు, కావున నింకొక స్వతస్సంతు[1] క్రొత్తగ ప్రకటమగువఱకును వేచి యుండుట తప్ప, గత్యంతరము లేదనియు, మాత్రమే వారలకు సమాధాన ముగ జెప్పగలిగెను.

---

(1) మఱొకరిని గురువుగ జేసికొనకుండగ, తనంతటతానే సంతుగతిని పొందిన మహాపురుషుని

42. సర్కార్‌సాహెబ్‌వారట్లుగాక, "రాధాస్వామీమత మూలసిద్ధాంత ప్రకారమీ సృష్టికంతకును, సంపూర్ణోద్ధారము చేకూర్చువఱకు నాపరమ చైతన్యధార యీలోకమునుండి వెనుకకు మఱలిపోనేర," దను విషయమును తమ వద్దకు వచ్చిన సత్సంగులతో సంభాషణలోను, తమకుత్తరములు వ్రాసి కొన్నవారికంపిన సమాధానములలోను చాలగట్టిగ నొక్కి జెప్పెడివారు. ఉదాహరణార్థము, వారు ప్రి. భా. కె. యన్ సేన్‌గుప్తగారి కిట్లువ్రాసిరి "మహారాజసాహెబ్‌వారు మనలను విడిచిపోలే దనువిషయము నిస్సంశయము. వారి దయారక్షణము లిదివఱకుకన్న నెక్కువగ నిప్పుడు మనకు బాహ్యాంతర్యముల యందు తోడుగ నున్నవి. అయినను పరిస్థితులను మార్పుచేయుటలో వారి దివ్యేచ్ఛలో నొక మహాగంభీరప్రయోజనముండి యుండవలయును. ప్రస్తుతము ఆమహోద్దేశ్యము మనకు గోచరము గాకపోవచ్చును. కాని యుక్తసమయమున, వారు మనకు ప్రకాశమునిచ్చి దాని యంతరార్థమును మనకు తెలియ జేసి, వారిని మనకు తిరోహితము జేయునట్టి మనలోని తెరను, చించివేయుదురు వగైరా, వగైరా". అందఱకు వారిట్టి యభయవచనములనే చెప్పి ధైర్యము గలిగించుచుండిరి. క్రమక్రమముగ, సత్సంగవాతావరణమునుండి నిరాశావిచారములు తొలఁగిపోయి, సత్సంగులలో ధైర్యవిశ్వాసములు పునరుత్పన్నమై పిన్నలు పెద్దలు స్త్రీలు పురుషులు అందఱకును తామన్వేషించుచున్న మహాపురుషులు సర్కార్‌సాహెబ్‌వారే యను, దృఢనిశ్చయము కలిగెను.

## కేంద్రీయ పాలకసమితి యొక్క ప్రవృత్తి

43. ఇంతలో సత్సంగులను పథభ్రష్టుల జేసి యపమార్గమునఁ బెట్టుటకై కొందఱభాగ్యు లనేకవిధములగు పుకార్లను ప్రచారము చేయ మొదలిడిరి. కొంద ఱింకొక 300 సంవత్సరములవఱకు సంతసద్గురువుండ నేరరని చెప్పదొడఁగిరి. కొందఱు మఱి ముప్పది సంవత్సరములవఱకును సద్గురువుండరని మహారాజసాహెబ్‌వారు తమసమక్షమున సెలవిచ్చిరని పుకారు పుట్టించిరి. కొందఱు బెంగాలీసత్సంగులు నిజధార బ్రహ్మాండమునకు తిరిగిపోయి, యచ్చట నుండియే కార్యక్రమమును నడిపించుచున్నదని పుకారును కల్పించిరి. ఆగ్రా వారుకొందఱు, మహారాజసాహెబ్‌వారికి హుజూరుమహారాజువారియందు గల యసాధారణ భక్తిశ్రద్ధల మూలమున, మహారాజసాహెబ్‌వారికి మాత్రమే

సద్గురుపదవి యనెడి యద్భుతగతి ప్రసాదించబడినదనియు, లాలాజీగారు మహా రాజసాహబ్‌వారిని చివరిరోజులలో జబ్బుగనున్నపుడు చూచుటకు వెళ్ళిన పుడు, వారామహాసంపత్తును తిరిగి తమతో ఆగ్రాకు తోడ్కొని వచ్చిరనియు, చెప్పుచుండిరి. ఒక్కసద్గురువు చాలరనియు, పంజాబునకు మఱొక సద్గురు వుండవలెననియు, మఱికొందఱు స్వార్థపరులు ప్రచారము చేయుచుండిరి.

44. ఏదియెట్లున్నను ఘాజిపురమునకు పోవు సత్సంగుల సంఖ్య నానాఁటికి పెరుగుచునే యుండెను. కేంద్రీయసమితి కసంతృప్తి లేకుండుటకై సత్సం గులు ఘాజిపురమునకు వచ్చుటకుముందు కేంద్రీయసమితి యనుమతి నొంద వలెనని సర్కార్‌సాహబ్‌వారు విధించిరి. కాని యట్టి యనుమతికొఱకు వ్రాసికొన్న వారందఱకును సమితివా రనుమతిని నిరాకరించుచుండిరి. ఇంతి యగాక, ఘాజిపురమునకు వచ్చుచుండిన సత్సంగులకు భోజనవసతుల నేర్పాటు చేసినచో సమితివా రాటంకపెట్టవచ్చునని యూహించి సర్కార్‌సాహబ్‌వా రట్టి యేర్పాట్లేమియు జేయుదలపెట్టలేదు. మఱియు నొక్కొకసారి సర్కార్ సాహబ్‌వారు, తమకు వృత్తిసంబంధమైన పనులేవో యెక్కువగ నుండుటచే తీరికలేకుండె నని నెపముపెట్టి సత్సంగమునకు రెండుమూడుదినములు వరుసగ రాకుండ నుండెడువారు. అట్టిరోజులలో సర్కార్‌సాహబ్‌వా రింటినుండి కోర్టునకు పోవునపుడును తిరిగి యింటికి వెళ్ళు నపుడును సత్సంగులు రోడ్డుప్ర క్కన నిలుచుండి వారిదర్శనము చేసికొన బ్రయత్నించెడివారు. కొందఱు సత్సంగులు తమ సొంత ద్రవ్యముతో నిండ్ల నద్దెకు దీసికొని అం దులో వీలున్నంతవఱ కితరసత్సంగులకుగూడ వసతినిచ్చెడివారు. కొందఱు సాధువులు ఘాజిపురము పోవుటకు సమితి ననుజ్ఞకోరగా వారలకు సమితి యనుమతి నీయలేదు సరిగదా, వారు ఘాజిపురము వెళ్ళినందుకు వారలకిచ్చు మనువృత్తినిగూడ నాఁపుజేసిరి. అందుచేవారు గొప్పయార్థిక కష్టములపాలై రోజులకొలఁది కేవలము బంగాళాదుంపలను మాత్రమే తిని యుండెడువారు.

45. ఈమధ్యసమయములో, ఘాజిపురసత్సంగము కేంద్రీయపాలకసమితికి యథాప్రకారము పెద్దపెద్ద మొత్తములను విరాళములక్రింద పంపుచునే యుం డెను. సమితి కార్యదర్శి 1908 సంవత్సరం ఆగస్టునెలలో రు 20/-లు ఒకసా రియు రు 825/-లు మఱొకసారియు నందినట్లు స్వీకృతిని తెలియబఱచుచు సర్కార్‌సాహబ్‌వారికీ క్రిందివిధముగ వ్రాసెను:-

"మీరు దయతో వ్రాసిన యుత్తరమును, మనియార్డరుద్వారా పంపిన రు20/-లును లాలాపరమానందుగారిద్వారా పంపిన రు825/-లును అందినవి. ఈమొత్తములు వచ్చినందుకు నాకు వాస్తవముగ నమితానందమైనది. ఏలనన, నిట్టి విరాళములు సత్సంగకోశాగారమునకు తెలుచు రాకుండినచో నార్థిక పరిస్థితి మిగుల చెడిపోవునని భయము గల్గుచున్నది." సమితికార్యదర్శిగారు తిరిగి యామాసములోనే మఱొకయుత్తరములో సమితియొక్క ఆదాయము తగ్గిపోవుచున్నందుకు తమకందఱికిని చాలవ్యాకులముగ నున్నట్లు వ్రాయుచు, "ఈలోపమును చాలమట్టుకు ఘూజిపురమునుండి వచ్చు విరాళములు పూర్తిచేయుచున్నవను మాటకు సందియములే"దనికూడ వ్రాసిరి. నిజమునకు ఘూజిపుర సత్సంగబ్రాంచి, కేంద్రియ పాలక సమితికి, 1908, 1909 సంవత్సరములలోను 1910 సంవత్సరము మొదటి కొద్దిమాసములలోను గలిపి, మొత్తము రు 20,583/-లను పంపి, తన ఖర్చులకై రు 6256/-లు మాత్రమే యుంచుకొనెను. ఘూజిపుర సత్సంగ బ్రాంచివారు ఖర్చుచేసిన మొత్తములన్నింటికిని, సరియైన లెక్కలను వ్రాసి, సమితికి పంపి అందుకు అనుజ్ఞామోదములను కోరుచుండెడివారు.

46. ఐనను కేంద్రియపాలకసమితి యొక్క ప్రవృత్తి నానాటికి మఱింత యక్రమ మగుచుండెను. ఘూజిపురమునకు వచ్చుచుండెడి సత్సంగులకు వసతుల యేర్పాట్లేమియు చేయనేలేదని యిదివఱలో చెప్పియుంటిమి. అటులనే, సత్సంగముచేయుటకుగూడ నచ్చట చాలశ్రమగలుగుచుండెను. సత్సంగులు చాలమంది వచ్చుచుండుటచే సత్సంగము నొకొక్కప్పుడు నిరావరణస్థలములోను ఒకొక్కపుడు పూరిపందిళ్ళక్రిందను చేసెడివారు సత్సంగములోగూడ సత్సంగులందఱకును చాల యిఱుకటముగ కూర్చుండుటకు తగినంత స్థలము మాత్రమే యుండెను. కార్యాలయము (Office) వద్దగాలకు స్థలము బొత్తిగలేకుండెను. సర్కార్‌సాహబ్‌వారికి సమితియధికారము పూర్తిగ నిలబెట్టవలెనని యుండుటచే సత్సంగము చేసికొనుట కవసరమైన పందిళ్ళను వేసికొనుటకు సమితియొక్క యనుజ్ఞను కోరిరి. కాని సమితివారు నిరాకరించిరి. ఘూజిపురసత్సంగము సమితికి తనశక్తికొలంది ధనసహాయము చేయుటకు నిశ్చయించుకొని యాప్రకారము నియమముగ జరిగించుచుండి, సమితివారుగూడ నీవిషయమును ఒప్పుకొనుచుండినను, సమితివారికి ఘూజిపురసత్సంగ బ్రాంచియొక్క వాస్తవమగు నావశ్యకతలను గూడ గమనించుట స్పష్టముగ నిష్టము

లేనట్లు తేటపడెను. సమితివారు, ఘాజిపురసత్సంగమున కట్టివ్యయము జేసికొనుట కనుమతి నీయకపోవుట యేగాక, తత్సంబంధమైన కాగితములమీద, సత్సంగ నిధినుండి ఆఖర్చులనుచేయుట యయుక్తమని యాక్షేపణ గూడ చేసెడివారు

47 కొందఱు సత్సంగులు బహు క్లిష్టపరిస్థితులలో నుండి యుండుటచే, సమితివారి నార్థికముగ సహాయముకొఱకు వేడుకొనిరి. కాని, యట్టి సత్సం గులుగాని వారి బంధువులుగాని ఘాజిపుర సత్సంగమునకు చెందినవారగుటచే, సమితివారేదోయొక మిషపైన నట్టి సహాయమును నిరాకరించుచుండెడివారు

48. 1908 సంవత్సరము అక్టోబరు నెలలో సర్కార్‌సాహబ్‌వారు మహారాజసాహబ్ వారి భండారాలో పాల్గొనుటకై వారాణసి విచ్చేసిరి. సత్సంగము జరుగుచుండగ మధ్యలో నొకస్త్రీ, స్పష్టముగ సమితికి సంబంధించిన కొందఱు వ్యక్తుల ప్రోత్సాహముచేతనే, లేచి సమాధి దగ్గఱకుపోయి శబ్దపాఠము జరుగుచుండగ నాట్యముచేయ నారంభించెను. కొంతసేపట్లు నాట్యముచేసిన పిమ్మట నాస్త్రీ "దయచూపుడు, దర్శనమిప్పించుడు, దర్శనమిప్పించుడు," మొదలగు విధమున బిగ్గఱగ నఱచుచు పరుగిడి శ్రీమాధవప్రసాదసిన్హా గారి పాదములపైఁ బడెను. కేంద్రీయ సమితి యొక్క సహాయకార్యదర్శి యామె నెత్తుకొని హాలుబయటకు తీసికొని వెళ్ళెను కేంద్రీయ పాలకసమితి యధికారు లచ్చటివారి నిర్విధమైన యసంప్రదాయ ప్రవర్తనలో నడచుకొనకుండ నాటంకపఱచరైరి సత్సంగమైన తర్వాత సర్కార్‌సాహబ్‌వారు శ్రీమాధవప్రసాద్ సిన్హాగారితో శ్రీప్రేమప్రసాదుగారింటికి వెళ్ళి, యచ్చట నొకమంచముపై గూర్చుండిరి. సర్కార్‌సాహబ్‌వారు దానిమీద కూర్చుండిన కారణముచే, నామంచముమీది దుప్పటిని చాకలివానికిచ్చి యుతికించిరని గూడ తెలిసినది.

49. అటులనే తిరిగి 1909 అక్టోబరునెలలో మహారాజసాహబ్ వారి భండారాలో పాల్గొనుటకై సర్కార్‌సాహబ్‌వారు వారాణసికి వెళ్ళదలఁచి, అప్పటిలో వారాణసిలో నుండుచుండిన సాహబ్జీమహారాజువారికి, ఘాజిపుర సత్సంగుల కొకప్రత్యేకవసతి నేర్పాటు చేయవలసినదని తెలియపఱచిరి. సాహబ్జీ మహారాజువారు నేపాల్‌కోఠీయను నొకమహాభవనమును అద్దెకు తీసికొనిరి. కొందఱు కేంద్రీయసమితిసభ్యులాభవనపు పెత్తనదారునిచే నిచ్చినయనుమతిని రద్దుచేయించుటకై, చివరకు విఫలులేయైనను, ప్రయత్నములు చాల చేసిరి.

50. అయినను సర్కార్ సాహెబ్ వారి యున్నతస్థితి యెవ్వరికిని కాదనుటకు శక్యముగాకుండెను. ఒకబీహారుసత్సంగి సర్కార్ సాహెబ్ వారిని గుఱించి తెలిసికొనుటకై శ్రీమాధవప్రసాదసిన్హాగారికి వ్రాయగ నాయన 4-12-1907 సంవత్సరము తేదీన నిట్లు సమాధానము వ్రాసిరి, "బాబూ కాంతప్రసాద్ సిన్హా గారు తమ విశ్వాసమునకు వ్యతిరేకముగ నెన్నడును ప్రవర్తింపజాల రనువిష యము మాత్రము నిస్సంశయము". ఈ యుత్తరము వ్రాసిన కొద్ది రోజుల పిమ్మట, శ్రీమాధవప్రసాదసిన్హాగారు యథార్థమును స్వయముగచూచి తెలి సికొనుటకై ఘాజిపురము వెళ్ళిరి. సహజముగ సర్కార్ సాహెబ్వారాయ నకత్యాదర గౌరవములతో స్వాగతమిచ్చి, యాయనకు స్నానపుగది యేర్పాట్లనుండియు నన్ని సౌకర్యములను స్వయముగ గనిపెట్టిచూచిరి. సర్కార్ సాహెబ్వారు చూపిన యీయమితాదర గౌరవములకు ఫలితము దురదృష్ట ముచే నుద్దిష్టమునకు ప్రతికూలమయ్యెను. ఏలనన, శ్రీమాధవప్రసాదసిన్హా గారు, సర్కార్ సాహెబ్ వారే సంతసద్గురువైనచో తనకంతయధికగౌరవ మర్యాదలను స్వయముగ చూపియుండకూడదని యభిప్రాయపడిరి. అందు చేతనే శ్రీమాధవప్రసాదసిన్హాగారు ఘాజిపురమునుండి తిరిగి వెళ్ళిన పిమ్మట 1908 సంవత్సరము జనవరినెలలో పైనుదహరించిన బీహారుసత్సంగి మఱల నాయనకు వ్రాసినపుడు, ఆయన యీక్రిందివిధముగ ప్రత్యుత్తర మిచ్చెను, "మఱొక పనిమీద నేనీమధ్య ఘాజిపురము వెళ్ళి శ్రీకాంతప్రసాద సిన్హాగారింటనే బసచేసితిని. బాబూకాంతప్రసాద్ సిన్హాగారి స్వరూపములో పరమపిత ప్రకటమైనట్లు స్వయముగ నాకేమియు బాహ్యాంతర నిదర్శనములు లేవు. కాని కొంద ఱట్టివిశ్వాసముగలవారున్నా రనుట నిస్సంశయము. అయి నను వారట్లు నమ్ముట యెంతవఱకు న్యాయమో నేను చెప్పజాలను."

51. సర్కార్ సాహెబ్ వారి సత్సంగమున కాగంతుకముగ దర్శనార్థమై వచ్చినవారికిగూడ, నట్లుగాక, వీరిమహిమను గుఱించి మహాగాఢప్రభావము గలుగుచుండెడిది. ఎట్లన, మహారాజసాహెబ్ వారి యన్నగారయిన శ్రీరామ శంకరమిశ్రాగారు ఘాజిపురములో కలక్టరుగ పనిచేయుచున్నపు డొకసారి ఘాజిపురసత్సంగమునకు వెళ్ళిరి అచ్చట వారు సర్కార్ సాహెబ్ వారి యమృతవచనములను విని మహానందభరితులై, యటుపిమ్మటనుండియు, మహా రాజసాహెబ్ వారికి స్థానాపన్నులు సర్కార్ సాహెబ్వారే యనియు, నందుచే సత్సంగులు సద్గురువు నన్వేషించుటకై యిటునటుఁ దిరుగులాడఁ బనిలేదనియు

సత్సంగులకు జెప్పెడివారు. తాము మాత్రి మచ్చటనేయుద్యోగములో నుండుటచే సత్సంగమునకు వచ్చుటకు వీలులేకుండె ననిగూడ వారనిరి.

52. కొందఱు కేంద్రియపాలకసమితిసభ్యులు, మహారాజసాహెబ్‌వారు 1906 సం॥రములో చెప్పిన వచనములో తమయనంతరము తమ సోదరి సద్గురువు కాగలదని సెలవిచ్చినట్లు చెప్పిరి. అట్లయిన యెడల మహారాజసాహెబ్ వారి సోదరికి(ఆమెను బుఆజీసాహబా యనిపిలిచెడివారు) తాను స్థానాపన్నుడనని చెప్పకొనుచుండుటచే నప్పటి కామెయొక్క గురుముఖుడై యుండవలసినట్టి శ్రీమాధవప్రసాద్ సిన్హాగారు, 1907 డిశంబరు, 1908జనవరి నెలలలో వ్రాసిన యుత్తరములలోగూడ బుఆజీసాహబా, మహారాజసాహెబ్‌వారికి స్థానాపన్నురాలని చెప్పకపోవుట యాశ్చర్యకరమే. ఇవ్విధముగ ఘాజిపుర సత్సంగము కేంద్రియసమితియొక్కయు ధర్మకర్తృవర్గము యొక్కయు నధికారమును పరిపూర్ణముగ నిలఁబెట్టుచుండినను, కేంద్రియసమితి, న్యాయసమ్మతమైన కారణ మేమియు లేకుండగనే, సర్కార్‌సాహెబ్‌వారికిని, ఘాజిపురసత్సంగమునకును ప్రతికూలముగ ప్రవర్తింప సాగెను.

53 మహారాజసాహెబ్‌వారి కాలములో సర్కార్‌సాహెబ్‌వారికి కేంద్రియపాలక సమితి యనుమతిని ముందుగ పొందనక్కఱలేకుండగనే జిజ్ఞాసువుల కుపదేశ మిచ్చుట కనుజ్ఞ గలదు. అప్పుడు వా రుపదేశమిచ్చినవారి పేర్లజాబితాల నుపదేశము నిచ్చిన పిమ్మటనే వారాణసిలో సమితికార్యాలయమునకు పంపుచుండెడివారు. మహారాజసాహెబ్ వారు గుప్తమైనపిమ్మట సర్కార్‌సాహెబ్‌వారు పూజనీయ నెయ్యంజీసాహబాగారి యనుమతికొఱకుపదేశార్థుల పేర్లు ముందుగనేపంపి, వారాణసినుండి యనుమతియుత్తరువులు వచ్చిన పిమ్మటనే యుపదేశముల నిచ్చుచుండిరి. దీనినిబట్టి సర్కార్‌సాహెబ్ వారు, పవిత్రకుటుంబముయొక్కయు కేంద్రియసమితియొక్కయు నధికారము నెంతపట్టుదలతో నిలబెట్టుచుండిరో స్పష్టమగును. అయినను గూడ, సమితి మాత్రము సర్కార్‌సాహెబ్‌వారికి సకలవిధముల నిబ్బందులు గలుగజేయుట కెంతమాత్రము వెనుదీయలేదు.

## ఎడఁబాటు

54. ఈసందర్భమున మఱొక సంఘటన చెప్పదగియున్నది. ఝీలంజిల్లా ధరియాల గ్రామములో నొక సత్సంగి ధరియాల బ్రాంచి సత్సంగముయొక్క

యుపయోగార్థమై యొక భవనము నివ్వదలచి 1909 సం॥రములో నొక దాన పట్టాను వ్రాసి ఘాజిపురమునకు పంపెను. ఘాజిపుర సత్సంగమువారు వెంటనే అలహాబాదులోని ధర్మకర్తృ వర్గమునకా దానపట్టానుపంపి, అది యందినట్లు వారివద్దనుండి రశీదును పొందిరి. ఆ ధరియాల సత్సంగి తనఖర్చులతో నాభవనమునకు కొన్ని మరమ్మతులు చేయించుట కనుజ్ఞనిమ్మని కోరెను. అతడు తనద్రవ్యమును ఖర్చుపెట్టి బాగులు చేయించి యాఖర్చుల వివరములను పూర్తిగవ్రాసి పంపవలెనని యతనికి ఘాజిపురమువారు సమాధానము నంపిరి. ఘాజిపుర సత్సంగమువారు, ధరియాలనుండి తమవద్దకా ఖర్చులపట్టి 1910 సం॥రములో రాగానే దానిని కేంద్రియ సమితికార్యదర్శికి పంపిరి. ఆ కార్యదర్శి వెంటనే సర్కార్ సాహబ్‌వారిని, ఘాజిపురమువా రాఖర్చుల కేల యనుమతినిచ్చిరో సరియైన సమాధానము జెప్పవలసినదని యడుగుచు నికముందెన్నడు ఘాజిపురసత్సంగ మట్టిపని చేయరాదని నిషేధించుచు, సర్కార్ సాహబ్ వారికి వ్రాసెను. ఘాజిపురసత్సంగ మాదానమున కంగీకారము నివ్వలేదనియు దానపట్టా యొకసంవత్సరమునకు క్రితమే సమితికార్యస్థానమునకు చేరియుండెననియు, ఘాజిపురసత్సంగముయొక్క ప్రోత్సాహముచేగాని, యంగీకారముతోగాని, యాఖర్చులు చేయబడలేదనియు, నాఖర్చులన్నియు ధరియాల సత్సంగి తన సొంతద్రవ్యమునుండి ఖర్చుపెట్టెననియు, ఘాజిపురమునుండి బహు మర్యాదపూర్వకముగ నొక సమాధానమును వ్రాసిపంపించిరి. ఆయుత్తరము పైన సర్కారుసాహబ్‌వారుకూడ తమ యామోదసూచకమైన సంతకమొకటిగూడ చేసిరి. ఈప్రత్యుత్తరమువలన నీదాన మొకసంవత్సరము క్రితమే సమితివారిచే నంగీకరింపబడియుండుటచే, తప్పు సమితివారిదే నని స్పష్టపడినందున, సమితికార్యదర్శి తనతప్పును గప్పిపుచ్చుకొనుటకై, మహానిష్ఠురోక్తులతో నొకసమాధానమును 7-3-1910 సం॥రం తేదీన ఘాజిపురమునకు వ్రాసెను. ఆయుత్తరములోవ్రాసిన విషయములు బొత్తిగ మర్యాదహీనముగ నుండుటయేగాక దూషణధిక్కారములతో గూడియుండెను. ఏలనన, సమితి కార్యదర్శి తనయుత్తరములో, సర్కారుసాహబ్ వారి మర్యాదతోగూడిన సమాధానమును "అచ్చమైన పొగరుఁబోతువ్రాత" యని పేర్కొనెను. ఈ దూషణ, సత్సంగుల కసహనీయమై యున్నందున, ఘాజిపుర సత్సంగము తాలూకు సత్సంగులు, తమ్మును, తమ పూజ్యప్రియతమ నాయకుని, నిట్టి నిర్నిమిత్తదూషణావమానములనుండి తప్పించుకొనుటకై, తాము సమితితో

సంబంధము వదలుకొని, స్వతంత్రిత నవలంబించుట యావసరమని యోచించిరి. ఆసంవత్సరము హోలీపండుగ మార్చి నెల చివరివారములో వచ్చుటచే నాసమయమునకు, సత్సంగముకొఱకై పైయూళ్ళనుండి చాలమందిసత్సంగులు ఘూజిపురము వచ్చిరి. వారికి 7-3-1910 తేదీ మహానిష్ఠుర లేఖనుగుఱించి తెలియగనే వారందఱు నీవిషయమై విమర్శించుట కొకసమావేశము చేయనిశ్చయించిరి. సత్సంగులచే 1910 సం॥రము మార్చినెల 26 తేదిన జరిపించబడిన యాసుప్రసిద్ధసమావేశ మివ్విధముగ నేర్పాటు కాబడెను. ఆసమావేశములో చాలతీర్మానములు చేయబడినవి. రాధాస్వామీసత్సంగసభయొక్క సభ్యులనందఱను మొదటిసారి యెన్నుకొనినది యీసమావేశములోనే. ఆసభవారు తమ కార్యక్రమమును, సమితి కెట్టిపెత్తనము లేకుండ స్వతంత్రముగ జరిపించుకొనవలయుననియు గూడ నీసమావేశములో తీర్మానించిరి.

55. 26-3-1910 తేదీన జరిగిన సార్వజనీన సమావేశములో కార్యక్రమ మారంభించకముందొక నివేదికనందఱకును చదివి వినిపించిరి. ఆనివేదికలో, 12-10-1907 తేది మహావిపద్దినము మొదలుకొని యప్పటివఱకు జరిగిన విషయములను సంఘటనలను గుఱించి సవిస్తరముగ తెలియజెప్పి, భావికాలములో సత్సంగముయొక్క కార్యప్రణాళిక నిరాఘాటముగ జరిగిపోవుచుండునట్లేర్పాటు చేయవలసిన యావశ్యకతను గుఱించియు, ఘూజిపురసత్సంగమునకును సమితికిని పరస్పరసంబంధవ్యవహారములు, వారిరువురిమధ్య నన్యోన్య ప్రేమాదరభావములకు భంగము గలుగకుండునట్లును, సత్సంగసంస్థల కార్యక్రమమునకు విఘ్నములు నాటంకములును గలుగకుండునట్లును, ఏర్పాటు చేయవలసిన యావశ్యకతను గుఱించియు, చాలగట్టిగనొక్కి తెలియజేసిరి. అటుపిమ్మట కొన్నితీర్మానములను జేసిరి.

56. ఆ తీర్మానములలో మొట్టమొదటిదానిలో, నా సమావేశసభ్యులందఱు నేకగ్రీవముగ, 7-3-1910 తేదీ యుత్తరములో సర్కార్ సాహబ్ వారిని గుఱించి వ్రాయబడిన దూషణకు ధిక్కారపూర్వకమైన యసమ్మతిని ప్రకటించుచు, నందువిషయమై కేంద్రీయసమితి కార్యదర్శి, సర్కారుసాహబువారికి క్షమార్పణ చెప్పుకొనవలసినదిగ తీర్మానించిరి. రెండవతీర్మానములో, సమితికిని ధర్మకర్తృవర్గమునకును ఘూజిపురసత్సంగముపైనను దానికి సంబంధించిన భ్రాంచిలపైనను సత్సంగులపైనను ఇకముందెట్టియధికారము నుండరాదనియు, నైనను గూడ నదివఱలోవలెనే ఘూజిపురసత్సంగము సమితికి విరివిగ విరాళ

ములను పంపుచుండవలయుననియును తీర్మానించిరి. 3, 4 తీర్మానములలో, భండారావగైరా సమయములందు సత్సంగులు శుచిశుభ్రముగను, మర్యాదగను ప్రవర్తించవలయుననియు, బ్రాంచి సత్సంగముల విలేఖరులను (కార్యదర్శులను) వారల కెన్నిక లక్కఱలేకుండగనే, సమితిసభ్యులుగ జేయవలయుననియు నిశ్చయించిరి.

57. ఆ సార్వజనీన సమావేశముయొక్క 5, 6, 7 నెంబర్లు తీర్మానములలో, కేంద్రీయసమితివారు 17-4-1910 తేదీన నొక సమావేశముచేసి యందులో పైపేరాలోని నాలుగు తీర్మానముల నామోదించి, అట్లు ఆమోదించిన విషయమును ఘాజిపురమునకు తెలియజేయవలయుననియు, నట్టి కబురు 30-4-1910 తేదీనాటికి అందనియెడల, కేంద్రీయసమితియు దానికి సంబంధించిన సంఘములును రద్దయినట్లెంచబడి, సార్వజనీనసమావేశములో నెన్నుకొనబడిన 40మంది సభ్యులుగల రాధాస్వామీ సత్సంగసభయను క్రొత్తప్రతినిధిసభకు, తనవిధానచట్టమును ఉపనిబంధనలను వేఱుగ నేర్పాటుచేసికొని ఘాజిపురసత్సంగముయొక్కయు దాని బ్రాంచిలయొక్కయు వ్యవహారములను ప్రత్యేకముగ పెత్తనముచేసికొనుటకు సంపూర్ణాధికార మీయబడుచున్నదనియు, తీర్మానము చేసిరి

58. ఆ సామాన్యసమావేశములోజేసిన పైజెప్పిన తీర్మానము లవ్విధముగ నుండినను, వారియుద్దేశ్యము సమితిని సక్రమముగ ప్రవర్తించునట్లు చేయవలెననియేగాని, దానిని నిర్మూలించవలెననిగాదు. అందుచేతనే సర్కార్‌సాహబ్ వారు, ఘాజిపురములో కలక్టరుగ పనిచేయుచున్న మహారాజసాహబ్‌వారి జ్యేష్ఠసోదరులగు శ్రీరామశంకరమిశ్రాగారికి వ్యక్తిగతముగ నొకప్రత్యేక లేఖను 30-3-1910 తేదీన వ్రాసిరి. ఆ యుత్తరములో ప్రయుక్తమైన యాంగ్ల భాషాశైలి యాదర్శప్రాయమైనది. (151-155 పుటలు చూడుడు) శ్రీమిశ్రాగా రీవిషయములో నభిమానముతో జోక్యముకలుగజేసికొనినందున సర్కార్‌సాహబ్‌వారు స్వయముగవెళ్ళి ఘాజిపురసత్సంగముయొక్క పరిస్థితి నాయనకు విశదపఱచిరి. సమితికార్యదర్శిగారుగూడ వెళ్ళి ఆయనను గలిసికొనిరి. అక్కడనే సర్కార్‌సాహబ్‌వారును సమితికార్యదర్శియుగూడ నొండొరులను గలిసికొనిరి. ఇందుకుఫలితముగ 14-4-1910 తేదీన ఘాజిపురసత్సంగమువారు, పరస్పరవైమనస్యములు తొలఁగిపోయినందున 26-3-1910

తేదీసమావేశముయొక్క మొదటితీర్మానము రద్దుచేయబడినదని తెలియపఱచుచు నొకప్రకటనపత్రమును (Circular letter) అందఱకును పంపిరి.

59. ఈలోపున, ఘాజీపురసత్సంగమునకును సమితికిని మధ్య నొడంబడిక సమకూర్చుటకై కొన్ని క్రొత్త ప్రస్తావములను చర్చించిరి. ఆచర్చలలో నిరుపక్షములును సభయొక్క స్థితినొప్పుకొని, యది సమితికధీనముగ ప్రవర్తించగలందులకును, అది తనయాదాయమునుండి 40%, 45% ప్రతిశతముల మధ్యగ కొంతభాగమును సమితికి విరాళముగ నిచ్చుచుండుటకును, సమితివారు సభాసభ్యులలో మూడవవంతు సభ్యులను సమితిసభ్యులుగ దీసికొనుటకును అంగీకరించిరి. సమితికార్యదర్శిగా రీప్రస్తావములన్నిటికి నించుమించు పూర్తిగ వాగ్రూపమున నొప్పుకొనిరి. కాని తరువాత, బహుశా కొందఱు కేంద్రీయ సమితిసభ్యులు క్రొత్త ప్రతిబంధములను గల్పించిన ట్లగుపించును. అయినను 11-5-1910 తేదిరాత్రి సర్కార్‌సాహెబ్‌వారును, సమితికార్యదర్శిగారును, మఱియొకరిద్దఱు సమితిసభ్యులును వారాణసి కంటోన్మెంటురైలుస్టేషనులో మఱలకలసికొని యీవిషయమున నర్ధరాత్రానంతరమువఱకు చర్చించినపుడందఱు నొక యొడంబడికకువచ్చిరి. కేంద్రీయసమితి యొకసమావేశమును చేసి యీయొడంబడికను, చట్టసమ్మతముగనుండునిమిత్త మొక తీర్మానముచే నామోదించుటమాత్రమే, యటుపైన తరువాయియుండెను. పిమ్మట, సమితి యొకసమావేశమును జరిపించెను. ఆసమావేశముయొక్క కార్యక్రమసంగ్రహమును, సమితికార్యదర్శిగారు సర్కార్‌సాహెబ్‌వారికి పంపించిరి. దానిని జూడగ కేంద్రీయసమితియొక్క ప్రతినిధులతో నంతకుపూర్వము జరిగిన యొడంబడికప్రస్తావములందులో నంగీకరించబడకపోవుటయేగాక, రాధాస్వామీసత్సంగ సభకు సభ్యులు పదిమందికంటె నధికముగ నుండరాదనియు నాసభాసభ్యులెవరును సమితిలో సభ్యులు గాజాలరనియు, మొదలగు కొన్ని క్రొత్తషరతులు గూడ ప్రవేశపెట్టబడినట్లు విశదమాయెను. స్పష్టముగ నందుచే సభ కా క్రొత్త ప్రస్తావములను నిరాకరించుటదప్ప వేఱుపాయము లేకపోయెను. 11-6-1910 తేదీన సర్కార్‌సాహెబ్‌వారు సమితికార్యదర్శి కొకయుత్తరమును వ్రాసిరి. ప్రతిసత్సంగికి నాయుత్తరము జదువదగియున్నది. (156-158 పుటలు చూడుడు).

60. ఇందువిషయమై సభవారు చేసిన తీర్మానమును 9-6-1910 తేదిగల నెం. 1రు ప్రకటనపత్రము (Circular letter)లో గూడ ప్రచురించిరి. అంతకుపూర్వ ముభయులును గలిసి యేర్పఱచుకొనిన షరతుల నిపుడు సమితి త్రోసిపుచ్చినందున, ఘాజిపురసత్సంగుల సార్వజనీన సమావేశములో 26-3-1910 తేదీన చేసిన తీర్మానములు రద్దుగాకుండ నుండగలవనియు, కాని సభవారు, తమచే ప్రతిపాదింపబడి సమితివారిచే నంగీకరింపబడిన ప్రకారము విరాళములను, యథాప్రకారము సమితి కిచ్చుచుందురనియు సభచే తీర్మానించబడినట్లును, ఆవిషయమును సమితికి తెలియజేసినట్లును, ఈప్రకటన పత్రములో వ్రాసిరి. పిమ్మట విరాళద్రవ్యము రాధాస్వామీసత్సంగసభవద్ద నిల్వయుండినదనియు సభవారు సమితివారి యుత్తరవుల కెదురుచూచుచుండిరనియు, నొకవారములోపల సమితివద్దనుండి యేమియు వార్త లేనిచో సమితివారికీ విరాళపుమొత్తమును స్వీకరించుట కిష్టములేనట్లు భావింపబడుననియు వ్రాసి, 22-6-1910 తేదీన మఱొక యుత్తరమును సమితికి జ్ఞాపకార్థమై పంపిరి. అందుకు సమాధానమును పంపుటకు బదులు, సమితికార్యదర్శి 26-6-1910 తేదీన నొక జ్ఞాపకపత్రము (Memorandum) నంపెను. అందులో మార్చి 26వ తేదీ సభాసమావేశమును "సంకరసమావేశ"మనియు, అందు చేయబడిన తీర్మానములను, "వివేక హీనములును బాధ్యతా రహితము"లనియు నతడు దూషించెను అందుచే సభవారు, సమితి కటుపైన తమవద్దనుండి విరాళములనొందుట కర్హతలేదని తెలియజేయుచు, 1-7-1910 తేదిన రెండవ ప్రకటన పత్రమును అందఱకును పంపించిరి. ఇంతలో, సమితివారు, రాధాస్వామీదయాళుని సేవార్థమై సభయొక్క విరాళము లుపయోగింప ననర్హములని చెప్పుచు 8-8-1910 తేదిని వారి ప్రకటన పత్రమును గూడ ప్రచురించిరి. సభవారు తమ విధానచట్టమును ఉపనిబంధనలను ఆమోదించి యవలంబించుటకై 10-10-1910 తేదిన నొక సమావేశము నేర్పాటుచేసిరి. మహారాజ సాహబ్ వారి సమయమునాటి 116 బ్రాంచి సత్సంగములనుండి 111 బ్రాంచిలు రాధాస్వామీసత్సంగసభతో నేకీభవించిన వను విషయము గమనించదగియున్నది.

61. సర్కార్‌సాహబ్ వారికిని పూజనీయ నెయ్యంజీగారికిని మధ్యగల యన్యోన్యగౌరవాదర భావములను చెడగొట్టుటకై కొందఱు స్వార్థపరులచే ప్రయత్నములు చేయబడుచుండినవవి యెంతమాత్రము చెడిపోకుండ మూమూ

లుగనే యుండెనని వేఱుగఁ జెప్పనవసరము లేదు. సర్కార్‌సాహబ్‌వారామెకు భేంట్లప్పుడప్పుడు పంపెడివారు ఆమెగూడ వారికి భండారాప్రసాదమును బంపుచుండెడివారు 1912 సం॥రములో గుల్లూభైయాగారి ద్వితీయ వివాహ మయినపుడు ఆమె సర్కార్‌సాహబ్‌వారికి మిఠాయిలనుగూడ పంపిరి. అటులనే, సర్కార్‌సాహబ్‌వారు సేఠ్‌సుదర్శనసింగుగార్ల మధ్యగూడ నుత్తర ప్రత్యుత్తరములు మామూలుగనే జరుగుచుండెను. ఈ యుత్తర ప్రత్యుత్తరములలోని యంశములవలన వారిరువురిమధ్యగల యన్యోన్య గౌరవప్రపత్తులు తేటతెల్లమగును. సర్కార్‌సాహబ్‌వారొక యుత్తరములో సేఠ్‌సాహబ్‌గారి కిట్లువ్రాసిరి, "ఈ పరిస్థితుల నన్నిఁటిని తత్సంబంధులందఱకు నేదో మహాశ్రేయస్కరలాభము గలుగజేయుట కా దివ్యేచ్ఛ (Mouz) యే కల్పించినదనియు, తిరిగి వాస్తవభేదభావమెద్దియు నానవాలునకైన లేకుండునట్లుగ నా దివ్యేచ్ఛయే పరిస్థితులను కాలక్రమేణ సరిజేయగలదనియు నే నెల్లపుడు నమ్ముచున్నాను. ఈ మహాప్రియమనోవాంఛితము సిద్ధించుట ప్రస్తుత మెంతో కష్టసాధ్యమేగాక బహుశా అసాధ్యముగనే కన్పట్టుచున్నను, నా నమ్రవిజ్ఞప్తిని మీరు నమ్ముడు, అది నాకు భగవంతుని యెడల గల విశ్వాసమున కించుమించు చొక మూలసూత్రమే. కావుననే ఆపరమపిత యొక్క పరమదయామయదివ్యేచ్ఛ వారి యార్తబాలురమగు మనలనందఱ నీ దుఃఖనిరాశాపూరితపరిస్థితులనుండి దాఁటించి స్వప్నాతీతమయిన యద్భుత మహాశోభాయమానపరిస్థితిని కనులార గాంచునట్టి శుభతరుణమును మనకనుగ్రహించు నని యెదురు చూచుచుంటిని."

౬2. ఇవ్విధముగ నీ యుభయసంఘములకు నెడఁబాటు సంభవించెను. ఈ సమయమునాఁటి సత్సంగచరిత్రను సవిస్తరముగ గమనించినచో నేరికైనను కేంద్రీయసమితి యీ యున్నతమతముయొక్క ముఖ్యావశ్యకతల విషయములో నిర్లక్ష్యముచూపి యత్యల్పవిషయములకై మొండిపట్టు పట్టినట్లు తేటపడగలదు. సమితియొక్క యీప్రవృత్తిని దలఁచుకొనినప్పు డీ యెడఁబాటు సంభవించుటగూడ బహుశా మహాశ్రేయస్సుకొఱకే యైయుండుననియు, భావికాలములో మన మందఱమును శీఘ్రముగనో యాలస్యముగనో, తిరిగి యేకమైనపుడు (ఎప్పటికైనను తప్పనిసరిగ నట్లుగావలసినదేగదా) సంఘమున నధికాధికైకమత్యమును శీఘ్రాతిశీఘ్రాభివృద్ధియును జేకూఱగలవనియు నని పించును.

63. సత్సంగముయొక్క భావిపరిణామికను, భావ్యభివృద్ధులను గుఱించిన యుత్తమ సూచనలుగల విషయమొకటి యిచట చెప్పఁదగును. 1911 సం॥రములో మెహతాజీసాహబ్ వారు(శ్రీగురుచరణదాస్ మెహతాజీసాహబ్ వారు) ఘాజిపురములో సర్కార్ సాహబ్ వారి సముఖమున హాజరైనపుడు, వారు, “మీరు స్వామీజీమహారాజువారి సమాధినిర్మాణము నధినిరీక్షించుటకు సిద్ధముగనుండిరా”యని మెహతాజీసాహబ్వారిని ప్రశ్నించిరి. వారు వెంటనే యట్లే సిద్ధముగ నుంటిమని సమాధానమిచ్చిరి. వారి నీపనికొఱకు ప్రభుత్వోద్యోగమునుండి యెవ్విధముగ రప్పించుకొనవచ్చు నను ప్రశ్న యపుడు పొడమెను. మెహతాజీసాహబ్ వారు, తాము ప్రభుత్వమువారి నియోగముచే (Deputation) గాని, దీర్ఘకాలపుసెలవు తీసికొనిగాని రాగలమని సెలవిచ్చిరి. ఆ ప్రసంగ మంతటితో ముగిసెను. వారి నప్పుడు రాధాస్వామీసత్సంగ సభలో సభ్యులుగగూడ నెన్నుకొనిరి. మెహతాజీవారిని గుఱించి చెప్పుచు సర్కార్ సాహబువారు, “వీరు మహాబుద్ధిశాలి”యని యొకనారి వక్కాణించిరి. అటులనే 1905 సం॥రములో నలహాబాదులో నొక నాటకప్రదర్శనము జరిగిన పిమ్మట, మెహతాజీసాహబ్ వారి తండ్రిగారితో మాటలాడుచు మహారాజసాహబ్ వారు వీరినిగుఱించి. “ఆయనను జూడగ నాకు చాల యానందమగుచున్న”దని యన్న విషయముగూడ నీ సందర్భములో జ్ఞాపకము చేయదగును.

64. సర్కారుసాహబ్ వారి కొకవైపున బహుశ్రమదాయకవృత్తికార్యములవలనను మఱొకవైపున సత్సంగకార్యకలాపములో నిరంతరపరిశ్రమ చేయుచుండుట వలనను, శారీరికముగ చాలనలుగుడు గలిగెను. అందుచే సర్కారుసాహబ్ వారి యారోగ్యము, 1910 సం॥రములో సభయొక్క నిర్మాణచట్ట మామోదింపబడిన పిమ్మట చెడిపోయెను వారు విశ్రాంతికొఱకై యొకతోటలోనికి నివాసమును మార్చి సత్సంగులను కొంతకాలము వారివద్దకు రాకుండ నిషేధించిరి. వారాణసివారు (అనగా కేంద్రీయపాలక సమితికిని ధర్మకర్తృ వర్గమునకును సంబంధించినవారు) సర్కారుసాహబ్ వారి యారోగ్యము క్షీణించిపోవుచున్నదనియు, వారిక నెంతో కాలము జీవించరనియు వదరుట మొదలిడిరి. రెండుమాసములైనతరువాత 1911 సం॥రము వసంతపంచమీ సుదినమున సర్కార్ సాహబ్వారు సత్సంగులందఱకా తోటలో సమావేశమగుట కనుమతినిచ్చి, సత్సంగము చేసిన పిమ్మట నిల్లు సెలవిచ్చిరి.

"మన మిత్రులు తమకు విచ్చలవిడిగ ప్రవర్తించుటకు సంపూర్ణస్వాతంత్ర్యము లభించగలదను పేరాసచే, నీ దీప మింకనారిపోవునని యనుచుండిరి. కాని వారికి వాస్తవ విషయ మవగాహనకాలేదు. మఱొక క్రొత్తదీపము వెలిగించుటకు సంపూర్ణమైన ప్రబంధము చేయనిదే యీదీప మెన్నటికి నుపశమింప నేరదని వారు తెలిసికొనవలెను". ఆతరువాత సర్కారుసాహబ్‌వారి యారోగ్యము బాగుపడి, వారు తిరిగి యెప్పటియట్ల సత్సంగము జేయ దొడఁగిరి.

## పంజాబు పర్యటనము

65. 1911 సం॥రములో వసంతపంచమి తరువాత సర్కార్ సాహబ్ వారు ఉత్తరహిందూస్థానమున నొక దీర్ఘపర్యటనము చేయుటకై బయలుదేఱిరి. వారు మొదట ఢిల్లీలో నాఁగి, తరువాత కర్నాలులో రెండుదినములుండిరి. ఢిల్లీలో నున్నపుడు సర్కార్ సాహబ్ వారు, తాము అంబాలాలోగూడ నాగెదమని చెప్పి సాహబ్జీమహారాజువారి నచట నేర్పాట్లు చేయగలరా యని యడిగిరి. సాహబ్జీమహారాజువా రేర్పాట్లు చేయగలమని మనవి జేసికొనగా సర్కార్ సాహబ్ వా రంబాలా వెళ్ళుట కంగీకరించిరి.

66. అంబాలాలో, సత్సంగులందఱకు భోజనవసతుల కొఱకును సత్సంగముకొఱకు నేర్పాట్లు చేయవలసియున్నందున, సాహబ్జీమహారాజువారు ముందుగనే అంబాలా వెళ్ళిరి. వారివద్ద ద్రవ్యము లేనందున రు 100/-ల అప్పుజేసిరి. కాని యీ మొత్తము చాలదు. అయినప్పటికిని వారు భగవత్కృప మీదను దివ్యేచ్ఛ (Mauj) మీదను ఆధారపడి అంబాలాకు వెడలిరి. అచ్చట వారు ద్రవ్యములేనందున మనస్సున ఖిన్నులయ్యు, సామగ్రిని చేకూర్చుకొనుటకును సత్సంగమునకు స్థలము సంపాదించుటకును ప్రయత్నములు చేయుచుండిరి. ఆపరిస్థితిలో దివ్యేచ్ఛ వారికి సహాయ మొసంగెను. ఆసమయమున నంబాలాలో పనిచేయుచున్నట్టి తమ పూర్వపు సహోద్యోగి యొకరు, వారిని గలిసికొనిరి. సాహబ్జీమహారాజువా రప్పు డంబాలాలో జేయబూనుకొనిన మహాత్కార్యమును గుఱించి యాయనకు తెలిసి, తా నంతకుక్రితము వారివద్ద నప్పుతీసికొనియున్న రు150/-లను తా నంతకాల మీయకుండ నాలస్యము చేసినందుకు క్షమార్పణము వేఁడుకొని తన యింటికివెళ్ళి యీ పైకమును దెచ్చి వారికిచ్చెను. ఈ యద్భుత సమయోచిత సహాయమునకు సాహబ్జీమహారాజ

వారు రాధాస్వామిదయాళురకు ధన్యవాదము లర్పించుచు, వెంటనే కొయ్య సామానుల వ్యాపారులవద్దకుఁబోయి శామియానాలు వగైరాలు వేయించుట కేర్పాట్లుచేసి, సకాలములో నన్నిపనులను పూర్తిచేసిరి.

67. నిర్దిష్టదినమున సర్కార్‌సాహబ్‌వారు పరివారసమేతముగ నంబాలా వచ్చుసరికి ఏర్పాట్లన్నియు తృప్తికరముగ జరిగెను. కాని, సాహబ్జీమహారాజు వారికి న్యూనత గల్గించునిమిత్తమై యసూయా ద్వేషభావములు చెలరేఁగ సాగెను. పరివారములో నొక గౌరవనీయవ్యక్తి, సాహబ్జీమహారాజువా రచ్చట లేనిసమయముఁ జూచి, వారు వేయించిన శామియానాను తీసివేయిం చెను. సాహబ్జీమహారాజువారు శామియానాను తీసివేసినట్లు చూచి మిక్కిలి వ్యాకులపడిరి. అప్పుడు మధ్యాహ్నము సుమారు 2 గంటలాయెను. అప్పుడే సర్కార్‌సాహబ్‌వారు సత్సంగమునకై వచ్చుచుంటిమనిగూడ కబురుచేసిరి. సర్కార్‌సాహబ్‌వారు సత్సంగమునకువచ్చి తమ సింహాసనమును మండు టెండలోనే వేయుమని మాజ్ఞాపించిరి. ఆసమయమున సాహబ్జీమహారాజువారి హృదయవేదన యెట్లుండెనో యూహించుకొనవలసినదే. సత్సంగము ప్రారం భమై, మంగళాచరణము పాడుచుండగనే సాహబ్జీమహారాజువారికి మహాోప శాంతి గల్గున ట్లాకసమున నాకస్మికముగ మేఘములు గ్రమ్మి శీతలమారుత ములు వీవఁదొడఁగి వెనువెంటనే కొద్దిగ తుంపారములుగూడ పడెను. అం దుచే నెవరికిని శ్రమయని యనిపించనేలేదు. శబ్దపారమైన పిమ్మట సర్కార్ సాహబ్‌వారు కొద్దిసేపు వచనము సెలవిచ్చుచు, పరమపిత తననిజభక్తుల నెన్నటికిని విడనాడరని సెలవిచ్చిరి. ఆ తరుణమున గల్గిన మేఘాచ్ఛాదనమే యిందుకు విస్పష్టతార్కాణము.

68. సాహబ్జీమహారాజువారు సర్కార్‌సాహబ్‌వారి కొక మోటారుకారు నేర్పాటు చేసిరికాని, అదేపెద్దమనిషి సాహబ్జీమహారాజువారి పరోక్షమందు కారుడ్రైవరుతో, నారోజున కా రవసరముండదుగావున, తీసికొనిపొమ్మని చె ప్పిరి సర్కారుసాహబ్‌వారు రైల్వేస్టేషనుకు వెళ్ళుటకు సిద్ధముగ నున్నపుడు సాహబ్జీమహారాజువారికి, తా మేర్పాటు చేసిన కారు వెళ్ళిపోయినదని తెలి సెను. మఱొక యేర్పాటు వెంటనే చేయుటకు వీలుకానందున సాహబ్జీమహా రాజువారు మహావిచారగ్రస్తులైరి. అయినను తిరిగి దివ్యేచ్ఛయే వారికి సాయ ముచేసెను ఎట్లన, సర్కార్‌సాహబ్‌వా రప్పుడే బయటకువచ్చి, రైలువచ్చు

సమయమునడిగి తెలిసికొని, స్టేషను ఎక్కువదూరము లేనందునను, చల్లనిగాలి వీచుచుండుటచేతను, తమకు కాలినడకను వెళ్ళవలెనని యున్నదని సెలవిచ్చిరి. ఇవ్విధముగ సాహబ్జీమహారాజువారి మనోవ్యాకులత్వము నిర్మూలమగుటయే గాక కార్యక్రమమంతయు మహాసంతృప్తికరముగగూడ సాగిపోయెను.

69. ఆతరువాతి మకాము లూధియానాలో చేసిరి. అచ్చట జేరుకొనిన వెంటనే స్టేషన్‌నుండి సత్సంగమున కేర్పాటుచేసిన చోటెంతదూర మున్నదని వారు ప్రశ్నించిరి. ఒక మైలునకు లోపుగనే యుండునని తెలిసినందున వారు కాలినడకను వెళ్ళుటకు నిశ్చయించి, జనసమ్మర్దమునుండియు, ధూళి నుండియు తప్పించుకొనుటకై రైలుబద్దీలమార్గమును బట్టి యడ్డరోడ్డు వచ్చువఱకు (Level crossing) నడచి, బసలకును సత్సంగమునకు నేర్పాటుచేసిన "మాలేర్కోట్ల" భవనమునకు వెళ్ళిరి. అప్పటి కప్పుడే లూధియానా ఫిరోజ్‌పురము జలంధర్ జిల్లాలనుండి యనేకసత్సంగులు వచ్చి యచ్చట సమావేశమైయుండిరి. లూధియానాలో మకాము 4 రోజు లేర్పాటుచేసిరి. సర్కార్‌సాహబ్‌వారికిని వారి పరివారమునకును ఆభవనములోను, పైసత్సంగులకు గుడారములలోను బసల నేర్పాటుచేసిరి. ఉదయము సాయంకాలమును సత్సంగము చేయుటయేగాక, సర్కార్‌సాహబ్‌వారు తమతో మాట్లాడుటకు వచ్చిన ప్రేక్షకులను, దర్శనార్థులను, జిజ్ఞాసువులను గూడ కలిసికొనుచుండెడివారు. ఉపదేశములకు రెండురోజులు నియమించిరి. ఆనాల్గుదినములలో ననేకులు రాధాస్వామీ మతములో జేరిరి.

70. సర్కార్‌సాహబ్‌వారు లూధియానానుండి బయలుదేఱి సాయంకాలమునకు అమృతసరు జేరుకొనిరి. సత్సంగులపరివారముకొఱ కేర్పాటుచేసిన భవనముయొక్క ద్వారగవాక్షముల యద్దములను, ఈ పరివారమందఱు నచ్చటికి జేరుకొనకమునుపే, ఆర్యసామాజికులలో గొందఱు దుర్మార్గులు పగులకొట్టి యవ్విధమైన తమ దౌష్ట్య ప్రదర్శనముచే నమృతసరున కపఖ్యాతి దెచ్చిరి. సర్కార్‌సాహబ్‌వా రమృతసరులో 2 రోజులుమాత్రమే యుండి లాహోరునకు వెళ్ళిరి.

71. లాహోరులో సర్కార్‌సాహబ్‌వారికిని, వారి పరివారమునకును 'జింద' భవనములో నేర్పాట్లు చేసిరి. అది చాలవిశాలమైన మహాభవనము. దాని కుపభవనములుగూడ చాలగలవు.

72. మొదటిరోజు సాయంకాలము శబ్దపారము జరుగుచుండగ గొందఱు పోగరుబోతు తుంటరులును, రౌడీలును, కుక్కలు నక్కలువలె దూరము నుండి మొఱుగుచును కీచుమని అఱపులు బొబ్బలుపెట్టుచును, సత్సంగము నకు భంగము కలుగజేయఁదొడఁగిరి. అందుచే గొందఱు సత్సంగు లాయల్లరి చేయువారల మందలించు నిమిత్తమావలకు పరుగిడిరి. వాకవు చేయగా నాయల్లరి చేసినవారు డి. ఎ. వి. కళాశాల (D. A. V. College) విద్యార్థు లని తెలిసెను. అల్లరిపిల్లలను తరిమివేయుచున్న సత్సంగులను సర్కారు సాహబ్ వారు రావుజేసి, "కుక్కలను మొఱుగనిండు, నక్కల నఱవనిండు. రాధాస్వామీసత్సంగము జంతువులను మానవులుగ మార్చుటకై యుద్దేశిం చుచున్నది కాని లాహోరులో మానవులు జంతువులుగ మాఱిపోవ నభిల షించుచున్నట్లున్న"దని యనిరి. పిమ్మట నట్టి విఘ్నములు తిరిగి కలుగకుండు లాగున జాగ్రత్త పడిరి. అందుచే నాతరువాత మరేమియు నిబ్బంది గలుగలేదు.

73. లాహోరు ఆర్యసమాజనాయకులకుగూడ సత్సంగముపై నేమియు తక్కువ విరోధము లేదు వారు పెద్దపెద్ద కాగితములమీద "రాధాస్వామీ గురువుతో పోటీ"యను శీర్షిక నచ్చొత్తించి, పట్టణములో నంతటను గోడల కంటింపించిరి. యథార్థవిచారణ సల్పుట కొక నిష్పక్షపాతవిమర్శకు నేర్పాటు చేసినయెడల వారితో పోటీ చేయుటకు తాము సిద్ధముగ నున్నామని సర్కారు సాహబ్ వారు ఆర్యసమాజ నాయకులకు కబురు పంపించిరి. కాని వారలవైపు నుండి తిరిగి నిశ్చిత ప్రతిపాదన యెద్దియు రానేలేదు.

74. అయినను లాహోరులోని వివిధ మతములకును జాతులకును చెందిన విద్యావివేకములు గలవారు సత్సంగమునకు వచ్చి, సర్కార్ సాహబ్ వారి వచనామృతమును గ్రోలి, వివిధాధ్యాత్మిక విషయములను గుఱించి వారు సెల విచ్చిన మనోహరవివరణములను విని, చాల సంతసించి రనువిషయము వాస్తవముగ వారలకు శ్లాఘావహామే. అందులో గొందఱపేర్ల నీక్రింద నుద హరించుచున్నాము:

(1) భగత్ ఈశ్వరదాస్.
(2) బావాబుద్ధసింగ్. పంజాబ్ పి. డబ్ల్యూ. డి.
(3) లాలాధర్మదాస్ సూరి,

(4) రివరెన్డు, డాక్టరు జె. సి. ఆర్. ఏవింగ్, వైస్ ఛాన్సలర్, పంజాబ్ యూనివర్సిటీ, అండ్ ప్రిన్సిపాల్, ఫార్మన్ క్రిష్టియన్ కాలేజీ,

(5) రివరెండ్ డాక్టర్. హెచ్. డి. గ్రిస్వోల్డు, ప్రొఫెసర్, ఫార్మన్ క్రిష్టియన్ కాలేజి

(6) ప్రొఫెసర్ కార్టర్

75. పైన జెప్పిన వారిలో 4, 5, 6, అంకె గుర్తులుగల ముగ్గురును అమెరికాదేశీయులు. వారు తామదివఱలో చాలమంది వక్తలను ప్రవక్తలను విని యుంటిమిగాని, యింత విశదముగను విమర్శ యుతముగను ప్రభావయుతముగను భాషించినవారి నెచ్చటను చూడలేదని చెప్పిరి. సర్కార్‌సాహబ్‌వారిని లాహోర్‌లో వేసిన ప్రశ్నలను అందుకు వారు చెప్పిన సమాధానములను కూడ బావాబుద్ధసింగుగారు టైపు (Type) చేయించిరి. సర్కార్‌సాహబ్ వారి నేత్రకమలములలో శ్రోతల యాత్మల నాకర్షించి ప్రభావితము జేయు మహాతేజః ప్రకాశమున్నదని బావాబుద్ధసింగుగారు బాహాటముగ జెప్పిరి సర్కార్ సాహబ్‌వారి సంయోగముచే బావాబుద్ధసింగుగా రమితప్రభావితులైరి.

76. అచ్చటికొక సంఘ సంస్కరణ పరాయణుడు వచ్చి సత్సంగు లెవరును శారీరకముగ నారోగ్య బలములను గలిగిగాని, ఆర్థికముగ ధనాఢ్యులుగగాని సంఘములో విశిష్టులుగగాని యుండుట లేదనియు, నందుచే నెవరికివి రాధాస్వామీ మతములో జేరుట కాకర్షణ యుండనేర దనియు చెప్పెను. సర్కార్ సాహబ్‌వారు చిఱునగవుతో నిట్లనిరి, "రాధాస్వామీ మతములో జేరగోరు వానికి మూడు బహుమానము లీయబడును. అవి యెవ్వనగా, 1. నిరాదరము, 2. నిర్ధనత 3. నిర్బలత".

పిమ్మట సర్కార్‌సాహబ్‌వారు కబీరుసాహబ్‌వారి యీ క్రింది ప్రసిద్ధ ద్విపద నుదహరించిరి :-

దుఖ మే సుమిరన్ సబ్ కరే, సుఖమే కరే న కోయ్।
సుఖ మే సుమిరన్ జో కరే, తో దుఖ కాహే కో హోయ్॥

"ఆర్తి సమయమున నందఱును భగవన్నామమును స్మరణ జేయుదురు గాని, సుఖైశ్వర్యములలో నున్నపుడెవ్వరును స్మరణ జేయరు. ఐశ్వర్య సుఖములలోనుండగ నెవరైన భగవన్నామమును స్మరణజేసినచో, నట్టివారికి దుఃఖ మేల గలుగు?" తిరిగి వారిట్లు సెలవిచ్చిరి, "రాధాస్వామీ మతము భక్తులను మిత సుఖ సౌకర్యములతో కాలక్షేపము చేయుచు, నెల్లవేళల, మెలకు

వగ నున్నపుడు, నిదురవోవుచున్నను, కూర్చుండినను, తిరుగుచుండినను, తిను చుండినను, త్రాగుచుండినను, భగవంతుని పవిత్ర నామమును స్మరణచేయు చునే యుండవలె నని బోధించి యట్టివారల నా పరమపిత యెన్నడు విడనాడ రని వాగ్దానము చేయును.'' ప్రశ్నకర్త యీబోధలోని యథార్థమును, ఉత్తమ జ్ఞానమును దెలిసికొని మెచ్చుకొనెను.

77. లాహోరులో నున్నపుడు సర్కార్‌సాహబ్‌వారు తమరి రొమ్ముమీద నొక పురాణవ్రణముతో బాధ పడుచున్నందున, వారిని వైద్యులచే పరీక్షింప జేయవలసివచ్చెను. మేయో ఆస్పత్రి (Mayo Hospital)లో సర్జన్ జనరల్‌గా నున్న మేజర్ హ్యూగో (Major Hugo) అను దొరగారిని పిలిపించిరి. ఆయన పరీక్షించిన పిదప వెంటనే శస్త్రచికిత్స (Operation) చేయవలసి యున్నదని చెప్పిరి. సర్కార్‌సాహబ్ వారందుల కంగీకరించగా శస్త్ర చికిత్సా పరికరము లన్నియు సిద్ధముచేసినపిదప సర్జన్‌జనరల్‌గారు సర్కార్ సాహబ్ వారికి క్లోరోఫారం (Chloroform) అను మత్తుమందు నిచ్చుట కనుమతిని గోరిరి. అంతట సర్కార్‌సాహబ్‌వారు మత్తుమం దవసరము లేదని చెప్పిరి. కాని శస్త్రచికిత్సకు డట్లుగాదని నిర్బంధము చేయుచు నీమస్మాత్రి కంపనచలనములుగూడ మహాపాయకారణము లగునని భయావహముగ జెప్పెను. సర్కార్‌సాహబ్‌వారీమస్మాత్రికంపనముగూడ నుండకుండ జేసెదమని యావైద్యునకు ధైర్యముజెప్పి, తమ చైతన్యధార నాంతర్యమున కావృత్తము చేసికొని శస్త్రక్రియ పూర్తియైనపిమ్మట తిరిగి మెలకువదెచ్చికొనిరి. సర్కార్‌సాహబ్‌వారి యద్భుతజితేంద్రియత్వమును, మనస్థైర్యమును, సావధానతను జూచి సర్జన్‌జనరల్ గారాశ్చర్యపడిరి.

78. లాహోరునుండి, సర్కారుసాహబ్‌వారు రావల్పిండి వెళ్ళిరి. అచ్చట సేఠ్ దివాన్‌చందుసరణాగారును, (శ్రీ) సుఖదయాల్ గారును ముర్రీరోడ్డులో సరిక్రొత్తగ గట్టించిన సేఠ్ మానిక్‌జీ గారి మహావిశాలభవనమును దీసికొని దానిని సకలసౌఖ్యోపకరణములతో దివ్యముగనమర్చి యేర్పాట్లుచేసిరి. రావల్పిండి వాస్తవ్యులైన సర్దార్‌బహాదుర్ బూటాసింగుగారి సహాయముతో నా భవనమునకు దగ్గఱగనే సత్సంగు లుండుటకు గుడారములను సత్సంగము చేయుటకొఱకును పాకశాలవద్దెరాల కొఱకును శామియానాను వేయించిరి. వసతులు విషయములోగాని భోజనముల యేర్పాట్లు విషయములోగాని యెవ

రికి నేయిబ్బందియు గలుగలేదు. ప్రతిదినము నుదయసాయంకాలములందు రెండుసార్లు సత్సంగము జరిగెను. పగలు, వారిని కలిసికొనుటకై ప్రేమికులు వచ్చిరి. సర్కార్ సాహెబ్ వారికి దుర్బలత హెచ్చిపోవు సూచనలు కనిపించుటచే నంతకుపూర్వ మేర్పాటు చేసిన శ్రీనగర ప్రయాణపత్రిక రద్దుచేసిరి.

79. సర్కార్ సాహెబ్ వారు రావల్పిండిలో నుండగ నచ్చటనే స్వామీజీ మహారాజువారి భండారా జరిపించిరి. ఆ సమయమున కబీరుసాహెబ్ వారి "పాగన" శబ్దమును సత్సంగములో చిట్టచివర పాడవలసిన దని సర్కార్ వారు త్తరువిచ్చిరి.

80. ఇవ్విధముగ రావల్పిండిలో మూడువారము లుండిన తరువాత సర్కారుసాహెబ్ వారు తమ పరివారము సుమారు 100 మందితోను "రూర్కీ" వెడలిరి. రైలు 24-6-1911 తేదీ తెల్లవారు జామున రూర్కీ చేరెను. సర్కారుసాహెబ్ వారును వారి కుటుంబము నుండిన రైలుపెట్టెను మిగత రైలుబండినుండి విడదీయించి తెల్లవారు వరకును వారాబండిలోనే యుండిరి. సర్కారుసాహెబ్ వారికిని, వారి కుటుంబమునకును, థామ్సన్ కాలేజీ రోడ్డున గంగానది కాల్వకు దగ్గరగ నొక రాజభవనము నేర్పాటు చేసిరి. అందులో 15 గదులును, దానిచుట్టు నొక పెద్దయావరణయు నున్నవి. ఆభవనమునకు సర్కార్ సాహెబ్ వారును వారికుటుంబమును జక నాల్గుచక్రముల గుఱ్ఱపుబండిలోను, వారి పూజనీయమాతాజీగారొక పల్లకిలోను ఎక్కి వెళ్ళిరి. పరివారమందఱకును ఆ రాజభవనములో నొక భాగములోను, దాని యుపభవనములలోను బసల నేర్పాటు చేసిరి. దాని యావరణములో నొక మంచినీటి బావి యుండెను. సర్కార్ సాహెబ్ వారి గదికి సరిగ మునుముందే సత్సంగమునకై యొక పెద్ద శామియానాను వేయించిరి.

81. సాయంకాలము సర్కార్ సాహెబ్ వారు గుఱ్ఱపుబండిలో కాల్వయొడ్డున వెళ్ళిరి వారు తిరిగివచ్చునరికి వారిని కలిసికొనుటకై ఆ యూరిలోని కాయసులు చాలమంది వచ్చి కనిపెట్టుకొని యుండిరి. వారలతో సంభాషించుటలో కొంతసేపయినది. వారు వెళ్ళినతరువాత సత్సంగము ప్రారంభించిరి. సత్సంగ మయినతరువాత సార్ బచన్ ప్రేమ వాణుల నుండి శబ్దముల నఖండపారము చేయుమని సర్కారుసాహెబ్ వా రాజ్ఞ నిచ్చిరి. అట్లు సర్కార్ సాహెబ్ వారి గదికి సరిగ ముందుగనే, మూడహోరాత్రిములు పారము

జరిగెను. వారు ప్రతిరోజు నుదయమున నా భవనమునకు వెనుకవైపున తమ ప్రక్కలోనే రొయితిగి యుండెడివారు. ప్రతిదినము వారు సత్సంగుల సందఱను పిలిపించి దర్శనమిచ్చి, కులాసగా కబుర్లు జెప్పుచు కాలక్షేపము జేసెడివారు. ఇవ్విధముగ రూర్కీ సత్సంగులకు సర్కార్ సాహబ్ వారి పరమపావన సంయోగము పదునైదురోజులు లభించెను. ఆయూరివా రా మహానందపవిత్ర పావ కాశము నెన్నటికిని మఱువజాలరు.

## మసూరీ

82. అచ్చటనుండి సర్కార్ సాహబ్ వారికి మసూరీ యరణ్య ప్రదేశములో నొక భవనము నేర్పాటు జేయుటకై కొందఱు సత్సంగులను మసూరీ పంపించిరి. భవనము నేర్పాటు చేసినతర్వాత, సర్కారు సాహ వారు, హరిద్వారము మీదుగా మసూరీ వెళిరి.

83. "పర్వతరాజ"మని పేరుపడసిన మసూరీయొక్క శీతోష్ణస్థితియు, నచ్చటి ప్రశాంత గంభీర ప్రకృతిదృశ్యములును, సర్కారుసాహబ్ వారి కనుకూలముగ నున్నట్లు, వా రాతరువాతి రెండుసంవత్సరములలోగూడ, వేసవికాలములో, నీ పర్వతశిఖరముననే వచ్చుట కేర్పాట్లుచేసికొనుటనుబట్టి, తేటపడు చున్నది.

84. 1911, 1912, 1913, సంIIరములలో సర్కారుసాహబ్ వారి మసూరీ ప్రయాణసందర్భములోని కొన్నిసంఘటనలు సత్సంగులు తెలిసికొని యానందించవలసినవై యున్నవి.

85. సర్కార్ సాహబ్ వారు పటణముయొక్క గజిబిజి సమ్మర్దములనుండి దూరముగనున్న కొండలలో కులాసగ నడచుటకు వెళ్ళెడివారు. ఒకానొక రోజున సర్కార్ సాహబ్ వారు సుమారు నూఱుమంది సత్సంగిస్త్రీపురుషులతో గలిసి నడచి వెళ్లుచు పటణమునుండి చాల దూరముగ నున్న స్థలమునకుఁ జేరుకొనిరి. అచ్చట కొన్నిగంటలసేపు శబ్దపారములోను వారి మహాదయావిలాసములలోను గడచిపోగా, మధ్యాహ్నము రెండు గంటలాయెను. అప్పు డందఱకు నాకలిగ నుండెను గాని తినుటకు భక్ష్యము లెవ్వియు చుట్టుపక్కల దొరకవాయె. చాల శ్రమపడి ప్రయత్నము చేయగ కొద్ది బిస్కట్లు ప్యాకట్లు మాత్రమే దొరకెను. సర్కారుసాహబ్ వా రందుండి ఒక్కొక్కరి కొక్కొక్క బిస్కట్టు తమ పవిత్రహస్తములతో ప్రసాదముగ నిచ్చిరి. అందఱకును పూర్తిగ నాకలిదీరిపోయి సంతృప్తి గలిగెను.

86 మఱొకసారి సర్కారుసాహెబ్ వారు పరివారముతో గలిసి తమ బసకు తిరిగి వచ్చుచుండగ, నొకగ్రామము ప్రక్కనుండి వచ్చుట తటస్థించెను. ఆపల్లెలో చాల గజిబిజి గందరగోళముగ చప్పుడగుచుండెను. రోడ్డుప్రక్క నొక ఛాయా వృక్షముల తోఁపు యుండెను సర్కారుసాహెబ్ వారా తోఁపులో విశ్రాంతికొఱకు నొక దేవదారు వృక్షము క్రింద తమకుర్చీని వేయించుకొని కూర్చుండిరి. ఉల్లాసముగ నాటలు పాటలు సేయుచున్న ఆ యూరివారు, సర్కారుసాహెబ్ వారిని జూచి యెవరో మహారాజావారు తమ పరివారముతో వచ్చుటకు వచ్చి రని యనుకొని మద్దెలలు మొదలగు సంగీత వాద్యములతో వీరి యొద్దకు వచ్చి యనుమతి నొంది నాట్యములు గానములును చేసి యందఱకును వినోదము గలుగజేసిరి వారియాట పాటలు మహాభక్తిప్రేమరసపూరితములై యుండెను. వారలను ప్రశ్నించగ, నా యూరిలో నొక బాలికకు వివాహమగుచున్నట్లు తెలిసెను. పెండ్లికుమార్తెగూడ వచ్చుటకి వచ్చి సర్కారుసాహెబ్ వారికి నమస్కరించెను. సర్కారుసాహెబ్ వారు తమ పైనున్న శాలువను దీసి యా పెండ్లికూతురునకు బహుమానముగ నిచ్చిరి. పరివారములోని స్త్రీ పురుషులందఱును తాముగూడ శక్తికొలఁది విరాళముల నిచ్చుటకది యొక సూచనగ భావించి పవిత్రచరణములవద్ద దుస్తులను విరివిగ నర్పింపఁ దొడఁగిరి సర్కారుసాహెబ్ వా రచ్చుటకు వచ్చియున్న యా యూరివా రందఱకు నాదుస్తులను విరివిగ పంచిపెటిరి. చిట్టచివరకు సంత్ సహేలీ తనవిలువైన పట్టుశాలువ నిచ్చివేసినపుడు సర్కార్ సాహెబ్ వారు కార్యక్రమమును ముగించిరి. ఆ పల్లెటూరివా రందఱు నొక మహారాజాయని యనుకొన్న మహాపురుషులు నిజముగ నొక చక్రవర్తులపై మహాచక్రవర్తియని వారలకు దెలియదు గదా !

87. ఒక రోజున సర్కారుసాహెబ్ వారు పరివారసమేతముగ కులాసగ నడచుటకై బయలుదేఱిరి అపుడు కొంతవేడిగ నుండెను. కొండపైనుండి ప్రవహించుచున్న యొక సెలయేఱు త్రోవలో కనిపించెను. సర్కారుసాహెబ్ వా రా యేఱువచ్చుచున్న కొండపైకి వెళ్ళి సత్సంగులపై నీరు జల్ల నారంభించిరి. సంగతదాస్ అనెడి సాధువు వారి కొక బాల్చీ నందించెను. సత్సంగులొక్కొక్కరే వారివద్దకు వెళ్ళగా వా రొక్కొక్క బాల్చీ నీరొక్కొక్కరి మీఁద నే పోయుచుండిరి. తరువాత సత్సంగిస్త్రీలవంతు వచ్చెను. వారి నందఱను వెనుకకు వెళ్ళి దూరముగ నిలువబడుడని యాజ్ఞాపించిరి. వారప్పుడు వారను గూడ తృప్తిదీర తడిపివేసిరి.

88. సర్కార్ సాహబ్ వారొకనాడొక ప్రకృతిసిద్ధమయిన బహురమణీయముగ నున్న యొక యుపవనమునకు వెళ్ళిరి. అదియొక బహుసుందర ప్రకృతివనములో నుండెను. లాహోరు వాస్తవ్యులైన లాలాచిరంజీలాలుగారును, లూధియానా వాస్తవ్యులైన నిర్మలసింగుగారును కలిసి సార్‌బచన్‌లో నుండి శబ్దములను పాఠము జేయుట మొదలుపెట్టిరి.

"మోహి మిలా సుహాగ గురూ కా"

అను శబ్దమును పాఠముచేయ మొదలుపెట్టినపుడు వారి ఫాలభాగము మహాప్రకాశమానముగనయ్యెను. ఆశబ్దమందలి చరణములను మఱల మఱల రెట్టించి పాడిరి. వారపుడు పూర్తిగ నాంతర్యమున కాకర్షింపబడిన ట్లయిపోయి, వారి నేత్రకమలములనుండి కన్నీరు ధారలుగ బ్రవహింపసాగెను. సత్సంగులందఱు గూడ పరవశులైపోయి, యించుమించుగ నందఱి నేత్రముల నుండియు నానందాశ్రువులు ద్రవింపసాగెను. సర్కార్ సాహబ్ వారు మహాదయతో నందఱకును వారి చరణముల స్పృశించు నావకాశ మొసంగిరి. కొండపైనుండి క్రిందికి దిగి వచ్చుచుండగ వారిట్లనిరి, "దయాకటాక్షమేఘము లాకసమున గ్రమ్మియున్నవి. దయావర్ష మందఱిపై కురియనై యున్నది". అప్పుడే సర్కార్ సాహబ్ వారివ్విధముగ ననిరి.

"సబర్ తలఖ్ అస్త వాలేకిన్ బర్ షీరీన్ దారద్"

అర్థము:- ఓరిమి వహించుట కడు చేదే గాని దానిఫల మతిమధురము.

89. మసూరీలో సత్సంగమున కొక విద్వాంసుడైన జిజ్ఞాసువు వచ్చెను. ఆయన సంతృప్తికొఱకు సర్కార్ సాహబ్ వారు 'సృష్టి'ని గుఱించి యొక దీర్ఘోపన్యాసమును సెలవిచ్చిరి. వచ్చిన సజ్జనున కావిషయ మవగాహనయయినదో లేదో దెలసికొను నుద్దేశ్యముతో సర్కార్ సాహబ్ వారు, అన్యాపదేశముగ హాకీమ్ శంకర్‌లాల్ గారిని తాముచెప్పిన వచనమాయన కర్థమయినదాయని యడిగిరి. హాకీంగారు "సర్కార్, నాకు సృష్టి చేయవలయునని యాతురతగాని, యాసక్తిగాని లేదు! అందుచే నాకర్థమైనను కాకపోయినను, ఏమియుచింతలేదు"అనిరి అంతట నందఱు పొట్టవిచ్చునట్లునవ్విరి ఇవ్విధముగ నన్యాపదేశముచే నావిద్వాంసున కొక యథార్థ విషయము నొప్పి గలుగకుండ తెలియజెప్పుటాయెను.

90. సర్కార్ సాహబ్ వారి కృపాకటాక్షముచే నెందఱో సత్సంగుల రుగ్మతలు కుదిరి పోవుచుండినను వారి రుగ్మతయు శరీరములోని బాధయు నెంత

మాత్రము నుపశాంతి లేకుండ నల్లే యుండెను. తమ భక్తులను గాపాడు సర్వరక్షకులు తమజబ్బు నేల కుదుర్చుకొనరో యని చాల యాశ్చర్యముగ నుండును. ఈ ప్రశ్నకు సాహబ్జీమహారాజువారు తమ నిర్యాణమునకు ముందు 20-6-1937 తేదిన, విస్పష్టమగు సమాధానమును జెప్పిరి. కుర్తాలము బ్రాంచిసత్సంగ కార్యదర్శి, వారిని తమరుగ్ణతను విసర్జించి వేయుడని ప్రార్థించగా, సాహబ్జీమహారాజువా రిట్లు సెలవిచ్చిరి. "హుజూర్ రాధాస్వామీ దయాళుని దివ్యేచ్ఛకు మనము సంపూర్ణముగ, నిబంధనా రహితముగ నధీనులమై యుండవలెను. నేను స్వయముగ నీజబ్బును కోరగూడదు. హుజూర్ రాధాస్వామీ దయాళుదు మన కేమిదయచేసిన నద్దానిని మనము సంతోష పూర్వకముగ స్వీకరించ వలయును". కావుననే సర్కార్ సాహబ్ వారు గూడ వ్రణరూపమైన యగ్నిపరీక్షను ఆదర్శప్రాయమైన ప్రశాంతి గాంభీర్యములతో సహించుకొనిరి. సాహబ్జీమహారాజువారుగూడ నల్లే, హృద్రోగముతోను రక్తపుపోటుతోను, వరుసగ కొన్ని యేండ్లు బాధపడిరి. అయిన నామహాపురుషు లిరువురు నెన్నడు నీమణ్మాత్రము నశాంత్యసంతృప్తులనుగాని, చిత్తవైకల్యమునుగాని, కనుపఱచలేదు.

91. సర్కారుసాహబ్వా రొక గ్రంధరూపమున నేమియు వ్రాయలేదు కాని, వారు తమయుత్తరములలోను, 1913సం॥రములో ప్రకటించిన 'ప్రేమ సమాచార్' అను పత్రికాపూలమునను ఎన్నియో విస్పష్టనిశ్చితవిధమున వివరణ గావలసియున్న వివాదాంశములను గుఱించి చర్చించిరి. మహారాజ సాహబ్వారు గుప్తమైన పిదప నుత్పన్నమైన వివాదాంశము లన్నిటిలో మహా ప్రధానమైనది రాధాస్వామీమతముచే నుద్దిష్టమైన మహాకార్యమును గుఱించినయంశమే. రాధాస్వామీదయాళు రీపృథ్వీమండలమునుండి తమ నిజధారను వెనుక కాకర్షింపకపూర్వము, సకల సృష్ట్యుద్ధారమును సంపూర్ణముగ నెఱవేర్చుట వారుద్దేశించిన మహాకార్యమగునా, కాదా? అట్లైనచో, మహారాజ సాహబ్వారి తరువాత వారిస్థానే మఱొక సద్గురువుండి తీరవలసినదే. అప్పుడు "సద్గురువులేని మధ్యకాలము" (Interregnum)అను సిద్ధాంతమునకును తావు లేదు, కేంద్రీయ సమితి సభ్యులలో పెద్దలు "ఇంటెరిగ్నం" అను పదమునకు దీయుచున్నట్లు ప్రతీతిగల యర్థమునకుగూడ సావకాశముండదు. సర్కారు సాహబ్వారు సత్సంగులకు వ్రాసిన యనేక లేఖలలో రాధాస్వామీదయాళుని పరమ చేతనధార, వారుద్దేశించిన మహాకార్యమును పూర్తిగ సాధించు

వఱకు వెనుకకు పోఁజాలదని సంపూర్ణముగ స్పష్టపఱచిరి. ప్రేమసమాచార పత్రికలో ప్రచురించిన "పరమగురు" అను వ్యాసములో, వారిందువిషయము లో సమస్తశంకలను. సందేహములను మఱెన్నటికి తలలెత్త కుండునట్లుఖండించిరి. సద్గురువుయొక్క యద్భుత గతినిగుఱించి సత్సంగ సారస్వతములోనింత వఱకీ పై వ్యాసములోకన్న నెక్కువ బలవత్తరపరిస్ఫుటవివరణముగాన రాదు.

92. ఇంతియగాక, సత్సంగుల యుత్తరములకు సమాధానములుఁగ సర్కారుసాహెబ్‌వారు మహోదయతో వ్రాయించిన దీర్ఘలేఖలలో, వారింక నెన్నియో యితరప్రశ్నలను గూడ విమర్శించిరి. ఆ యద్భుతలేఖలలో నాల్గింటిని "నాలుగులేఖలు" (Four letters) అను శీర్షికతో నొకపుస్తకరూపమున రాధాస్వామీసత్సంగసభవారు ప్రకటించిరి. ఈ యుత్తరములు చదువునపు డెవరైన నందలి మధుర మనోహర భాషాసరళిచేనేమి. అందుగల, రాధాస్వామీదయాళుఁరు తమభక్తులకు (వారు ప్రస్తుతమెట్టిప్రాపంచిక కష్టక్లేశములలో నుండుగాక )దయజేసిన యఖండ శాశ్వత మహోదయావాగ్దానమును గుఱించిన మనోహరవివరణముచేనేమి, యానందపరవశులు గాకుండుట యసంభవము

93. సర్కార్‌సాహెబ్‌వారీ లేఖలనేగాక కొద్దిగ శబ్దములనుగూడ రచించిరి. వారి "ప్రార్థన"యనెడి సుప్రసిద్ధశబ్దమునుగుఱించి యింతకు బూర్వమే జెప్పియుంటిమి. అదిగాక వారు మఱియాఱునొక్క శబ్దములను గూడరచించిరి. అవి గూడ మహాలలితమనోహరరీతి నుండి, చదువునపుడు భక్తులహృదయముల నానందప్రేమభావములతో జలదరించి తన్మయమగునట్లుజేయును.

94. రాధాస్వామీదయాళురీ పృథ్వియం దవతరించినపుడు వారు దయచేసిన మహాసందేశము మహానందసంతోషదాయకము. ఏలనన, నాపరమ పురుషులు యావ జ్జీవకోటికి నుద్ధారము నిచ్చునిమిత్తము స్వయముగ తామే యవతరించి వచ్చితిమని యందు ప్రకటించిచెప్పిరి. సర్కార్‌సాహెబ్ వారీ మహాసందేశములోని సంపూర్ణగంభీరాంతరార్థమును మనకు విశదమగునట్లు జెప్పిరి. ఏలనన. యానిజాధార వెనుకకు మఱలిపోనేరదనియు సద్గురుపరంపరలో విచ్ఛిత్తి యుండనేరదనియు, యావత్సృష్టి యుద్ధారము నెఱవేఱునంతవఱకు నీ యేర్పాటు అట్లె యుండిపోవుననియు మన కసందిగ్ధరూపమున రూఢిగఁ దెలియఁ జెప్పినది వారే. సర్కారుసాహెబ్‌వా రొనరించిన మహాకార్యముయొక్క యద్భుతగంభీరాంతర మిదియే.

95. సర్కారుసాహబ్ వారి యద్భుత స్వభావములో మఱొక లక్షణమును గూడ నిచ్చట చెప్పవలసి యున్నది. అ దెద్దియన, వా రేపని చేసినను, తమ కన్న నితరుల కష్టసుఖములనే చాలయెక్కువగ నిదానించి చేసెడివారు. అందుచే వారికి తఱచుగ నిబ్బందులు గలుగుచుండెడివి. అయినను గూడ నట్లు చేయుటకు వారు జీవితములో నెన్నడు వెనుదీయలేదు. ఈలక్షణము వారి గృహకార్యముల విషయములోను కేంద్రీయపాలకసమితిసభ్యులతో జరిగించిన వ్యవహారములలోను స్పష్టముగ గానవచ్చును. బహుశా వారి స్వభావములో నీ యుత్తమలక్షణమే కాబోలు కొందఱుసమితిసభ్యులను నిస్సంకోచముగ రాధాస్వామీసత్సంగమునకు విశేషహానికరముగ బ్రవర్తించునటు ప్రోత్సహించినది. అయినను, సర్కారుసాహబ్ వారు మాత్రము, సమితి సభ్యుల యుదత స్వభావము మూలమున నేర్పడిన నీ పరస్పరభేదము వాస్తవముగ హానికలుగజేయునదనిగాని చిరస్థాయిగనుండునదనిగాని యెన్నడును నమ్మలేదు వారు శ్రీరామశంకరమిశ్రాగారికిని, శ్రీబాలేశ్వర ప్రసాదు గారికిని వ్రాసిన లేఖలు రెంటును సంపూర్ణముగ నీక్రింద పొందు పఱచబడినవి.

*శ్రీరామశంకర మిశ్రాగారికి వ్రాసినలేఖ*

**R. S.**

ఘాజిపురము
30–3–1910

వ్యక్తిగత ప్రభుత్వేతర విషయము.

అస్మత్పూజ్య ప్రియమహాశయా,

నేనొక యసామాన్య విషయమును గుఱించి తమకు మనవి చేసికొని శ్రమ గలుగజేయవలసి వచ్చినందుకు కించపడు చున్నాను. అందుచే మీయమూల్య సమయమును కొంత నష్టము చేయుచున్నాను. తమ మహోన్నత కుటుంబమునకు నమ్ర దాసుడ నగుటచే నట్టి యే విషయమునైనను నిస్సంకోచముగ తమ యెదుట బెట్టుటకు నాకొక యమూల్య స్వాతంత్ర్యము గలదని నేఁ భావించుచున్నాను. నాకిదొక్కటే సాకు.

ఇచ్చట రెండు సంవత్సరముల పై కాలమునుండియు సత్సంగము జరుగుచున్నది. 12–10–1907 తేదీ నాటి మహాభీకర సంఘటన మొదలుకొని యించుమించు నిరాశాప్రాయమైన మహాగాఢ చిత్తవైకల్యము గలుగుచుండెను. కాని బాహ్యముగ నామహాప్రభువు మమ్ములను విడనాడిన ట్లగుపించినను, నిస్సంశయముగ వారు మాపైనుండి తమ రక్షణహస్తము నెంతమాత్రము దీసి

వేయలేదు. ఏలనన నొక్క క్షణకాలములోనే తిరిగి వారు మా కథము నొక తాత్కాలిక విశ్రాంతిస్థానమును జూపి దేశముయొక్క వివిధ ప్రాంతములలోని సత్సంగులకును, క్రమక్రమముగ నిష్పత్తికి చాలమందికి ఘాజీపురమునకు తోవ జూపి యచట వారలకు తమ యాధ్యాత్మిక కార్యమును కొనసాగించుకొనుట కవసరమయిన మానసిక శాంతిని నూతనశక్తిని మనస్థైర్యమును ప్రసాదించిరి. ఈ సమయమున నీసేవకులకందరిలో బహుశా దీనాతి దీనుడైన వ్యక్తిని వారే యెన్నుకొనినట్లు తేటపడుచున్నది. ఏది యెట్లున్నను, వారవిరోధముగ విధించిన నా దండనకెవ్వరు నాటంకము జేయజాల రనువిషయము సత్యము. సత్సంగప్రపంచమునం దంతట నిండుచే గల్గిన మహా శాంతిదాయక గంభీర ప్రభావము వలన నిదంతయు నిట్లు జరిగించుటకు నిస్సందేహముగ వారి సర్వసమర్థదయాహస్తమే కారణభూతమని సహజముగ నందరికిని దృఢవిశ్వాస మేర్పడెను. అట్లుండగ నవిరోధమగు పరిస్థితిని గల్పించుటకు నా బోటి యొక మహాదీన వ్యక్తియందు గాని, అంతయేల, నే మానవమాత్రుని యందుగాని యొక్క క్షణకాలమైనను కర్తృత్వము నారోపించుట కిసుమంతయు నావకాశములేదు. అటులనే పరమార్థియని పేర్కొనదగువా రెవరును కేవలము మానవమాత్రుని యపకృత్యములచే నిట్టి యద్భుత సత్సంగము యొక్క వృద్ధి వికాసలను నిరోధించుటకు శక్యమగునని యొక్క క్షణకాలమైనను పొరబడ గూడదు. ఐనను, ఈ పరిస్థితిలో నట్టి పొరబాటు భావములు చెలరేగు దశగూడ నతికాలముననే సంభవించెనని జెప్పుట విచారకరముగ నున్నది.

సత్సంగులలో నధిక సంఖ్యాకులు తమకు పరమపిత ప్రసాదించిన యీ విశ్రాంతిస్థానమున హృద్గతముగ నానంద సంతోషముల నొందుచుండగ, గొందఱు ఏకారణము చేతనో, యిందు కాగ్రహ పడుచు నీ సత్సంగమునకు తమ శక్తికొలది చెఱుపు గలుగజేయుటయే వాస్తవముగ తమ కర్తవ్యమని యెంచుకొను చున్నారు. వారు మాపై నిందారోపణలను, దూషణలను, బెదరింపులను, ఇంకను, జెప్పుటకే బాధగలుగునట్టి యితర కుతంత్రములను ప్రయోగించుచుండిరి ఐన నాపరమపిత మాకిదంతయు భరించుటకు దగిన సహన శక్తిని బ్రసాదించుటయేగాక, నట్టి తలోక యపకృత్యమును, సత్సంగాభివృద్ధికి మార్గసూచకమగు తలోక క్రొత్త చిహ్నముగ నుండి యీ సత్సంగమునకు వృద్ధి వికాసలు గల్గించుటలో నిజముగ తోడ్పడుచున్నట్లే

గ్రహించు నర్హతా సౌభాగ్యమునుగూడ ననుగ్రహించిరి. కావున మేమీ కుతంత్రములను ప్రతిఘటించకపోవుటయేగాక గుర్తింపకుండ గూడ నుండుటకు మఱింత దృఢనిశ్చయుల మైతిమి. మాపరమపూజ్య మాతాజీ యొక్కయు నామహాకుటుంబములోని యితర పూజ్య వ్యక్తులయొక్కయు ననుగ్రహము నుండి మమ్ము వంచితుల జేయుటకు ప్రయత్నములు జరిగించిరి. కాని మా నైజ నమ్రతచేను, తమ యందఱకును మాయెడలగల యాదర దయాభావములచేను, ఈ కుత్సితయత్నములు విఫలములై, సద్గురు కృపచే మీకందఱకును మాయం దెప్పటియట్లే దయాభావ ముండుట సాగెను. ఈ విషయము లన్నిటిని మేము ప్రవర్ధమాన సత్సంగమున కుండునట్టి యనివార్య సహచరులుగ నెంచి యందువిషయమై యుపేక్షాభావముతో నూరకుంటిమి. కాని వారు మాకెవ్విధమునను విశ్రాంతి లేకుండజేయ నిశ్చయించుకొనినట్లు తోచుచున్నది. ఇతర యత్నము లన్నియు విఫల మైనందున మ మ్మిక సత్సంగ పాలనవిధాన విషయములో వేధించినచో నెక్కువ సాఫల్యము సేకూరునని యోచించుచున్నట్లు తోచును. అట్టియోచన కొనసాగించుకొనుటకై మాకు గౌరవనీయ ప్రియ సోదరుడైన బాబూప్రేమప్రసాదుగారు వగైరాలను గూడ, వారికిని మాకును అదివఱలో నమిత పరస్పర సౌహార్ద భావ ముండియున్నను, విడువక లోబఱచుకొని వారలకు మాయెడ నున్న ప్రేమానుకంపభావములనుగూడ నశింప జేసి రని జెప్పుటకు చాల విచార మగుచున్నది. ఇదంతయును, మొట్టమొదట సత్సంగ కార్య నిర్వాహ విషయములో, సామాన్య మర్యాద సహానుభూతి శూన్యమైన యధికారపు టుత్తరువుల రూపమునను, తరువాత నిర్నిమిత్తమైన యధికారపు గద్దింపులు నాక్షేపణలరూపమునను. చివరకు బాహాటమగు నక్రమ దూషణావమాన రూపమునను ప్రకటమాయెను. ఇవ్విధముగ చివరకు ప్రేమప్రసాదసోదరుడు, నా ద్వితీయహస్తాక్షరితో పంపిన ప్రత్యుత్తరమును, తన 7-3-1910 తేదీగల యుత్తరములో "నచ్ఛమైన పొగరుబోతు వ్రాత" వగైరా పరుష వాక్యములతో కేవల మకారణముగ దూషించినపుడు పరిస్థితులు హెచ్చుగ ముదిరి పోయెను. సహజ స్వాభావికముగ నిందువలన పరిస్థితులు మానవ సహనశక్తి కతీతము లాయెను ఈ సత్సంగమందు సత్సంగుల కమితాదర గౌరవములు గలవు. ఈ సత్సంగము కేవలము మర్యాద కొఱకు కేంద్రీయ పాలకసమితివారి యధికారము నంగీకరించుటయే గాక వారికి వ్యావహారిక విషయములలో సహాయముగూడ జేయుచు, గత

సంవత్సరము రు. 11000/-లు విరాళమునిచ్చి, తన వ్యయమునకై రు. 4000/-ల స్వల్ప మొత్తమును మాత్రమే యుంచుకొనెను. సత్సంగు లందఱిపైనను సత్సంగముయొక్క ప్రవర్తన వలన గాఢ ప్రభావము గలిగెను. అట్టి పరిస్థితులలో నీసత్సంగముచే ధర్మప్రధానమైన లక్ష్యముతో గౌరవ మర్యాద పూర్వక మైన ప్రవర్తనయే యాదర్శముగ జేసి యనుసరింపబడు చున్నను, దీని నంతయవమానము జేయుటచే సత్సంగులకు సహజముగ నధికాగ్రహ దుఃఖములు గలిగెను. క్రితము సెలవుదినములలో దేశములోని పంజాబు, సింధు, రాజపుత్రస్థానము, ఉత్తరప్రదేశము, బీహారు, బెంగాలు. వగైరా వివిధ ప్రాంతముల నుండియు చాలమంది సత్సంగులిచ్చటకు వచ్చి 26-3-1910 తేదీన నొక సమావేశము చేసిరి. ఆసమావేశములో నీ యక్రమప్రవర్తనను గుఱించి సర్వసమ్మతముగ గాఢాసమ్మతిని దెల్పుచు నొక తీర్మానము చేసి, ఇకముందు పరస్పర వైషమ్యములకు సావకాశము లేకుండ జేయు నిమిత్తమై ఈ సత్సంగముయొక్కయు దాని బ్రాంచిల యొక్కయు వ్యవహారములను, సమితితో పాలనవిధానపు సంబంధ మొద్దియు లేకుండ విడతీసికొనుటయే వివేకవంతమైన యావశ్యకకార్యమనిగూడ తీర్మానించిరి ఆపరిస్థితులలో బహుశః అదియే సర్వోత్తమబుద్ధిమత్వము తోగూడినతీర్మానము. అయిన నీపక్షము వైపు సోదరులు సమితియెడల యథాప్రకారము సోదర సౌహార్ద్ర భావమును జూపుచు సమితికి ఆర్థిక సహాయము జేయు నుద్దేశ్యముతో వారాణసి కిదివరలోవలెనే కొన్ని విరివియైన నిశ్చిత మొత్తములను విరాళములుగ పంపుచుండవలయుననిగూడ తీర్మానించిరి. ఈ శోచనీయ పరిస్థితిలో నింతకన్న నెక్కువ న్యాయముగను శాంతియుతముగను ప్రవర్తించుట కవకాశము లేకుండెనని వేఱుగ మనవిజేసికొన నక్కఱలేదు మన ప్రియ సోదరు లీతీర్మానములను వెంటనే ఆచరణలో బెట్టుదు రనినాకెట్టిసందియమును లేదు, ఏలనన, వారట్లు చేయనిచో, సహజముగ కేంద్రీయసమితిని రద్దుచేయవలసిన శోచనీయతర పరిస్థితి యేర్పడి, క్రొత్తయెన్నికలు జేసి సత్సంగ వ్యవహారవిషయములో నొక నూతన వ్యవస్థ నేర్పాటు చేయుటయనివార్యమై, యిందుమూలముగ బహుశా నిరర్థకసంకటములు గలుగవచ్చును

ఇవ్విధముగ నొక యనిష్టపరిస్థితి యేర్పడెను. మేము తొలుదొల్త నుండియు నైకమత్యముతో నుండవలయునను దృఢనిశ్చయముతో నుంటిమి. కాలక్రమేణ పరిస్థితులు మాఱిపోవచ్చునని యాశించుచు, మాయెడల జూపు

చుండిన సోదరానర్థప్రవర్తనను ధర్మప్రధానమైనబుద్ధితో నుదాసీనముగ సహించుచుంటిమి. ప్రస్తుతమున్నట్టి పాలనవిధానమును పరస్పరసంబంధము లను చెఱుపకుండ నక్షేమియుంచవలెనని మేము హృదయపూర్వకముగ గోరితిమి. కాని యీ విషయములలో నొకసంస్కరణమును మార్పును ఇపుడత్యావశ్యక మైనట్లు సత్సంగులు అవాంఛితముగనే గుర్తించకతప్పనిపరిస్థితి యేర్పడెనని చెప్పుటకు నాకు కొంతమనఃక్లేశముగనే యున్నది. అందునిమిత్తమై సత్సంగు లోకయుక్తమపద్ధతి నాలోచించిరి. ఈపరమోత్కృష్టపరమార్థపంథకు మును ముందు అద్భుతమయిన యాధ్యాత్మికాభ్యుదయము రానైయున్నది. సత్సంగ ముయొక్క పరిపూర్ణైక్యమునకు భంగముగాని నాశముగాని గలిగించుటకు మాలోనెవరు నీషణ్మాత్రముగూడ కారణభూతులము కాగూడదని మేమెం తయు వ్యాకులపడుచున్నాము. మా మతమువంటి యథార్థసజీవమతములో నిర్వ్యాజమయిన భిన్నాభిప్రాయములు కొన్ని ముఖ్యవిషయములలో నప్పుడ ప్పుడు తప్పక గలుగుచుండును. వివిధాభిప్రాయభేదములుగల సత్సంగులును ధర్మప్రధానమైన బుద్ధితో ప్రవర్తించుచు కేవలమందుమూలమున నొండొరు లను నిరాదరణచేయకూడదు. సరసప్రవర్తన కిదియే ముఖ్యసూత్రము గావున నిందునుండి వాచా కర్మణా కించిన్మాత్రముగూడ తప్పిపోవుట కెవరు నొల్ల గూడదు. కేవలము యథార్థ పరిశీలనాశయముతో జేయునట్టి నిష్పక్షపాత న్యాయవిమర్శలు మాత్రము నిజముగ నెల్లప్పుడును సంపూర్ణసమ్మతములే. అయిన నట్టివిమర్శకును తదితర విషయములకు నెట్టి సారూప్యము నుండ జాలదు. సత్సంగములోని ప్రధానవ్యక్తులందఱు నిపుడేకమై యనుచితవిషయ ముల నణంచివైచి సత్సంగులందఱకును సమావేశస్థానములైన ఆగ్రా, వారా ణసీలలోని సమాధులను గంభీరప్రశాంతివాతావరణముగల కేవల పూజా స్థలములు నుపాసనాస్థలములుగ నుంచవలసి యున్నది. వ్యవహారవిషయములను గూడ అటులనే పరస్పరస్పర్ధలకు తావులేకుండునట్లును సంఘముయొక్క సం పూర్ణైక్యమునకు భంగములేకుండులాగునను, సామరస్యముతో నిర్వాహమై పోవు పద్ధతిని వ్యవస్థాపన జేసికొనుటకూడ మనకందఱకు నందులో సమాన ముగ పవిత్రమైన కర్తవ్యమే. ఈ యుద్దేశ్యప్రాప్తికొఱకే పైప్రతిపాదనల నన్నింటిని జేసినది.

సత్సంగులందఱకును (ఇచ్చటి వారుగాని, మఱెచ్చటివారుగాని) నాకును గూడ పూజనీయమైన మహోన్నతకుటుంబమునకు తాము యజమానులగుటచే

నిట్టి ప్రధానవిషయమును తమకు తెలియజేయుట నా పరమ ధర్మమని యెంచి తమవద్ద కేతెంచితిని.

తమ రీవిషయసాకల్యము యొక్క నిష్కపటయథార్థకథనములో నెచ్చటనైన యవినయాహంభావములు గోచరించినచో నందుకు నన్ను మన్నించెదరని నమ్ముచున్నాను.

సెలవులలో తమదర్శనము చేసికొనవలయునని చాలయాశించితిని గాని వేఱు పనితొందరలలో వ్యవధి లభించలేదు. వీలైనంత త్వరలోనే బహుశా రాబోవు ఆదివారమునాడే యట్లుజేసెదను.

ఇట్లు,
పరమ విధేయతాపూర్వకముగ
కాంతప్రసాదసిన్హా.

పునర్లిఖితము :

సమావేశముయొక్క కార్యక్రమవివరములును తీర్మానములును ప్రకటితమైన వెంటనే తమ కంపుట కనుజ్ఞ వేడుచున్నాను.

కాంతప్రసాదసిన్హా.

*మళంకరమిశ్రాగారికి.*

*శ్రీ బాలేశ్వర ప్రసాదుగారికి వ్రాసినలేఖ*

R. S.

ఘాజీపురము
11-6-1910

ప్రియసోదర మహాశయా,

మీరు వ్రాసిన 1910 సం॥రము జూన్ నెల యుత్తరమును దానికి జేర్చి పంపిన యనుబంధముగూడ నందినవి ఈ యుత్తరప్రత్యుత్తరము లన్నియు (24-4-1910 తేది యుత్తరముతో నాఖరు అయినవని మీ యుత్తరములో నుదహరించినవి) మీకును ఘాజిపుర సభకును మధ్యన జరుగుచుండుటచే నీ యుత్తరముగూడ వారికే జేరవలసినదిగావునను, మీప్రతిపాదనలకు అంగీకారమునుగాని యసమ్మతినిగాని తెలుపవలసినదిగూడ సభవారేగావునను, దాని యనుబంధముతోగూడ నాయుత్తరమును సభవారికి పంపించితిని. ఈపాటికి వారివద్దనుండి మీకు సమాధాన మందియుండు ననుకొనెదను.

11-5-1910 తేదీ రాత్రి మహాశ్రమపడి బహుశ్రద్ధగ నాలోచించి స్థిర పఱచుకొన్న యంశముల నన్నిఁటిని సమితివారు పూర్తిగ మార్చివేసి యందుకు భిన్నముగ నిపుడు క్రొత్తప్రతిపాదనలను చేయుచున్నందున సభవారు తా మందు కంగీకరింపజాలమని పద్ధతి ప్రకారము సమాధానమునంపిరని నాకు తెలిసినది. అందువలన 26-3-1910 తేదిన సమితివారితో ఘాజీపురసత్సంగ మును దాసి యనుయాయులును జేసికొనిన యెడఁబాటు మార్పులేక నట్లే యుండిపోయెను. ఇట్లు జరుగు టెంత శోచనీయము. మీరును నేనును సత్సం గముయొక్క మఱికొందఱు వాస్తవ శ్రేయోభిలాషులును సత్సంగపాలన విధా నమును దిట్టపఱచుటకై పట్టుదలతోను ఆతురతతోను వ్యయపఱచిన కాల మును. పడిన బుద్ధిశ్రమయును. పూర్తిగ విఫలమైపోయెనుగదా! కానిండు, నిజ ముగ, నాదివ్యేచ్ఛ యెరికిని దురవగాహ్యము. అయినను భగవంతుడట్లే విధిం చినయెడల నందుకు సంబంధించిన వారందఱకు నదియ యుత్తమశ్రేయస్కర మని మనము భావించవలసినదే. ఇప్పుడైనను, నే నీ యెడఁబాటు చివర కేకోదరసోదరుల విభజనములాగున నామమాత్రముగనే యుండినట్లు పరిణ మించి, యెప్పటికైన నీయుభయపక్షములవారును. ప్రస్తుత పరస్పర భేదము లను మఱచి, ప్రతిసత్సంగికిని జన్మహక్కైన వాస్తవప్రేమతో తిరిగి యొండొ రులను-బహుశా అనతికాలములోనే-కౌగలించుకొనవలయునని హృదయపూ ర్వకముగ నత్యాతురతతో నాశించుచుంటినని తెలుపగోరెదను ఏలనన, మన యందఱపైన నాపరమపితయొక్క పథప్రదర్శక రక్షణహస్త మున్నంతకాల మా హార్దికప్రేమ కెద్దియును శాశ్వతహాని గలిగింపజాలదని యీ దీనుని యభి ప్రాయము. ఈ యెడఁబాటుచే నిరుపక్షములలో నొండొరులయెడల శత్రుభా వమునుగాని పరభావమునుగాని జనింపనీయగూడదు. నా యీ దీనప్రార్థనలను ఆపరమపిత వినిపించుకొనకపోరనియు, మన సోదరు లీ యెడఁబాటుపరిస్థితిని ప్రాపంచిక వైషమ్యముల రూపమును దాల్చనీయకుండునట్లు ప్రవర్తించెదరనియు నాకెట్టి సందియమునులేదు. సమిష్టికుటుంబములో పరస్పర ప్రేమానుబంధములు చెడిపోయినపుడు వారిలో వారికి బాహ్యసంబంధములలోగూడ సమ్మతితో విభ జన మగుట చాలతఱచుగ నందుకు ముందుగ పనిజేసి మఱల వారలలో వాస్త వమైన యన్యోన్యప్రేమను పూర్వముకంటెగూడ గాఢమగునట్లు చేయుచుం డును. అటులుండగ మనబోఁటి యుత్తమ పారమార్థిక కుటుంబములో మఱొక లాగున నుండ నేల? నే నిదంతయు హృద్గత గాఢాతిగాఢ భావముతో చెప్పుచుం

టిని. మఱియు నేను నాచేతనైనంతవఱకు ఈ బాహ్య వియోగముయొక్క దుష్ప్రభావము నణంచివేయుటకు దీనత్వముతో ప్రయత్నము చేయుదుననియు నిదియొక యెడబాటువలెగూడ బాహ్యముగ కనబడకుండునట్లు చేయుటకు నేనునిరతము నతిజాగరూకతతో గనిపెట్టుచుందుననియు, మనసున దాపఱికము లేకుండ నేఁజెప్పవలసియున్నది. మనయితరసోదరులుగూడ నట్లే ప్రవర్తించుచు తమ సత్ప్రవర్తన మూలమునవీ యరోచకమైన యుపాఖ్యానమును-పరమపిత యట్లు కరుణించి విధించిన నాడు-మనమందఱము మఱచిపోయి ప్రేమభావముతో పరస్పర మాలింగనముజేసికొనుటకు సంపూర్ణ సావకాశము నట్టేయుంచెదరని నమ్ముచున్నాను. పరిస్థితుల ప్రభావముచే తాత్కాలికముగనైనను నాతో విడిపోయినట్లెంచవలసివచ్చిన సోదరుల విషయములో, నా హృదయమున ప్రేమభావ మెట్లు పొంగిపొరలుచున్నదో చెప్పుటకు నాకు భాషచాలకున్నదని మీరు నమ్మెదరు. ఆ పరమపిత తమ యపారదయాప్రభావమున నీ యుపకథను పరిసమాప్తిజేసి మనలో మన కింతకు పూర్వముకన్నగూడ నెక్కువ గాఢగంభీరప్రేమభావము నొనగూర్చి మనలను తిరిగి కలుపుగాత. మనలో నివ్విధముగ పరిస్థితులప్రభావముచే,-నే నటులనే యనవలయును- ప్రస్తుతము భిన్నత్వము బలాత్కారముగ నాపాదింపబడినందున మన వ్యవహారములను, దీని దుష్ప్రభావమును శూన్యప్రాయముగజేయు విధమున, నీ పరిస్థితి కనుకూలమైన పద్ధతిని, సరిజేసికొనుట నేను నాపరమ ధర్మముగ నెంచితిని. అందుచే నిచ్చటి సత్సంగకోశాధ్యక్షునిని గణకునిని 26-10-1910 తేది నాటికి లెక్కల ప్రకారము నిలువయున్న పూర్తిమొత్తము పది నూర్ల ఆఱు రూప్యముల ఒక యణా తొమ్మిది పైసలను (రు 1006-1-9) యిచ్చటి ఖర్చుల కేమియు నట్టే యుంచకుండగనే పూర్తిగ తమ కంపివేయుమని చెప్పితిని. కేంద్రీయ సమితియొక్కయు రాధాస్వామీ సత్సంగసభ యొక్కయు తీర్మానములలో సూచితమైనట్లు, ఆ తేదీ మొదలుకొని సభవారు యథాశక్తిముగ సమితికి విరాళముల నంపుచుండవలసినదని గూడ నేను సభకు సలహానివ్వగా సభవా రందు కంగీకరించిరి. ఆ తేదీ మొదలు 31-5-1910 తేదీ నాటివఱకు జమయైన మొత్తము ఆఱునూర్ల పందొమ్మిది రూప్యముల ఐదణాల యాఱుపైసలు (619-5-6) అయినట్లును ఆమొత్తమును మీకు పంపివేసినట్లు గూడ నాకు తెలిసెను. ఈ రెండుపద్దుల మొత్తములు కలిసి రు 1600/-లకు పైన కొద్దిగ నుండును, ఎడఁబాటు గలిగిన పిమ్మటగూడ, నిరువురిమధ్య

నంతకుపూర్వ మొప్పన్నమైన పద్ధతి ప్రకారము ముడుపుల నంపు చుండుటచే ప్రకటితమైన సభయొక్క భ్రాతృసౌహార్దమును సమితివారు సరిగ నర్థము జేసికొన లేకపోవుదు రేమోయని నాకు సందియము లేదు. మన యిరువురి మధ్య తాత్కాలికముగ గలిగిన బాహ్య భిన్నత్వాభాసను తగ్గించుకొను నేర్పును మనకా పరమపిత తమ సహజమహోదయాభావముచే ననుగ్రహించి, యట్లు తగ్గించుకొన గల్గులాగున సాయ మొనరించగలరని విశ్వసించుచున్నాను.

మీ కందఱకును హృదయపూర్వక రాధాస్వామీ అభివందనములతో

ఇట్లు,
ప్రేమపూర్వకముగ
కాంతప్రసాదసిన్హా

*శ్రీ జాలేశ్వర ప్రసాదుగారికి, కార్యదర్శి*
*రాధాస్వామీ కేంద్రీయపాలకసమితి, అలహాబాదు*

96. సర్కారుసాహెబ్ వారికిని పవిత్రకుటుంబములలోనివారలకును మధ్య గల యన్యోన్యప్రేమాదరభావములను ప్రకటించునట్టి మఱికొన్ని యుత్తరములుగూడ, చదువరులకు చాల యభిరుచిగనుండునవి, గలవు.

*సేర్ సుదర్శనసింగుగారు వ్రాసిన యుత్తరము*

షోలాపురము.
19-12-1910

నా ప్రియసోదరా,

తమకు శరీరములో నస్వాస్థతగనున్నట్లు తెలిసి నాకేమియుం దోచుట లేదు. ఇప్పుడు కొంతసులువుగ నున్న విషయమును తమ రుదార దయా భావములతో నాకు దెలియజేయగోరుదును. నా కింతవఱకు తమరుగ్ణతనుగుఱించి తెలియనేలేదు గావున నా విషయమును గుఱించి నా యాందోళన ముపశాంతి గల్గునిమిత్త మెవరిచేనైన నొకటి రెండు పంక్తులు ప్రత్యేక దయయుంచి వ్రాయించగోరెదను. నే నిచ్చట కొకపరిశీలనార్థమైన పనిమీద వచ్చితిని. ఇచ్చటినుండి నేను గ్వాలియరు వెళ్ళెదను. సమాధానమును దయయుంచి హోషంగాబాదునకు పంపగోరుచున్నాను. నే నీమధ్య, విషమశీతజ్వరముతో గొంతకాలమును, పిమ్మట ఉొమ్ముపడిశెముతోఁ గొంతకాలమును బాధపడితిని. కాని తమ మహాకటాక్షమువలన నిపుడు నాకు బాగుగనేయున్నది.

జ్వాలాప్రసాదుగారికిని తమ తాలూకు సత్సంగులు సత్సంగినులందఱకును నా హృదయపూర్వక రాధాస్వామీ యభివందనములు. తమ చరణ కమలములకు విధేయతతో.

ఇట్లు
ప్రేమపూర్వకముగ
సుదర్శనసింగుసేఠ్

*మాతాజీ (నెయ్యంజీ) సాహిబాగారి 15-9-1911 తేదీ లేఖకు సర్దార్ సాహబ్ వారు 19-9-1911 తేదీన వ్రాసిన సమాధానమునకు తర్జుమా.*

మసూ్సరీ,
19-9-1911

పూజనీయ మాతాజీసాహిబావారి పాదపద్మములకు తమ దీనాతిదీన దాసుడు కాంతప్రసాదసిన్హా దండప్రణామములను రాధాస్వామీ అభివందనములను నర్పించుచున్నాడు. మాతాజీసాహిబావారు మహోదయతో 15-9-1911 తేదీన వ్రాయించినలేఖ అందినది. తమ క్షేమసమాచారములు దెలిసి చాల సంతసించితిని. సర్వసమర్థ పరమపిత హుజూర్ మహారాజసాహబ్ వారి దయాకటాక్షములచే నాకు వంట్లో పూర్వముకన్న నిపుడు చాల బాగుగ నేయున్నది. ఇచ్చటనుండి వెడలిపోవులోపున నాకు పరమపితదయవలన రుగ్మత పూర్తిగ తొలగిపోయి తిరిగి యథాప్రకారమైన యారోగ్యము చేకూరగలదనియే నేనాశించుచున్నాను. కాని డాక్టర్లు నన్నిచట నక్టోబరునెల చివరవఱకు ననగా నవంబరునెల ప్రారంభమువఱకు నుండవలసినదని సలహా చెప్పుచున్నారు. కలెక్టరుగారు మహోదయతో వ్రాసినయుత్తరములో వారుకూడ నక్లే నవంబరు నెలకుముందు పర్వతప్రదేశమునుండి దిగి క్రిందికి రాకూడదని సెలవిచ్చిరి. కావున నా యారోగ్యార్థమై నేనింకొక నెల, నెలపదునైదు రోజు లిచ్చటనే యుండిపోవలసియున్నది. ఇట్టి పరిస్థితులలో నీ దీనదానునికీ సంవత్సరము మాతాజీసాహిబావారి యనుగ్రహపూరితాజ్ఞలను పాలింప శక్యము గాకుండెనని విచారమగుచున్నది. అయినను మహోదయామయియగు మాతాజీసాహిబావారి కటాక్షము మాపైనుండినపుడు, మునుముం దిట్టిశుభసమయములందు జరిపించెడి పవిత్రోత్సవములలో మేము తప్పక పాల్గొని మా యాధ్యాత్మిక క్షేమమును భద్రపఱచుకొనగల సావకాశములు గలుగుచుండుననుట విస్పష్టమే. మాతాజీ సాహిబావారు నామీద చూపిన యనుగ్రహమునకు బహుదీనత్వ

ముతో నా కృతజ్ఞతను దెల్పుకొనుచుంటిని. మాతాజీసాహిబావారి పాదపద్మ ములందు భేంటుగ రు. 500/-ల నర్పించుచున్నాను. సర్వసమర్థ పరమపురుషు లగు మహారాజసాహబ్‌వారి భండారాసందర్భములో నీ మొత్తమును మాతాజీ సాహిబావారి యిష్టానుసారము ఖర్చుపఱచవచ్చునని నేను సవిన యముగ వేడుకొనుచున్నాను. ఈ మొత్తమును నేను నాకుటుంబము వితర సత్సంగులును గలిసి పవిత్రపాదపద్మములవద్ద భేంటుగ నర్పణ జేసికొనుచు న్నాము. పవిత్రపాదపద్మములవద్ద నేనును నాకుటుంబములో నందఱునుగూడ రాధాస్వామీస్మరణ పూర్వకప్రణామముల నర్పించుచున్నాము. అచ్చటి సత్సంగి సోదరీ సోదరుల కందఱకును రాధాస్వామీ.

ఇట్లు,
మీ అధమదాసుడు
కాంతప్రసాదసిన్హా

---

సేఠ్ సుదర్శనసింగుగారు వ్రాసినలేఖ

హోషంగాబాదు
24-2-1913

పూజ్యప్రియసోదరా,

మీ 10వ తేదీ యుత్తరములో జూపిన యనుగ్రహమునకు చాల ధన్యవాదములు, మఱిమఱి ధన్యవాదములు. మీరు మనియార్డరుచేసిన రు10/- లకు నంతకన్న నెక్కువ ధన్యవాదములు. తమ రా మొత్తమును పంపించుట వాస్తవముగ, తమకు మాయెడలగల మహానుగ్రహమును సూచించుచున్నది. ఈ మొత్తమును రాబోవు మార్చినెల 25వ తేదీన నాగాలో జరిగించగల స్వామీజీమహారాజువారి "పక్కా" హోలీభండారాఖర్చుల నిమిత్తమై వెచ్చించదల్చుకొన్నాను (మార్చి 23 తేదీ "[1] ధులేండీ" యైనది.) మీ రందుకు దయతో సమ్మతించెద రనుకొందును. తమకును తమ పూజనీయార్ధాంగికిని, జ్వాలాప్రసాదుగారికిని, పిల్లలకును, మీతాలూకు సత్సంగినీ సత్సంగు లందఱకును నాయొక్కయు నాభార్యయొక్కయు హృదయపూర్వక మహాగౌరవోపేత రాధాస్వామీ అభివందనములు.

ఇట్లు
అతి ప్రేమ పూర్వకముగ
సుదర్శన సింగుసేఠ్

---

"ధులేండీ" యనగా బుక్కాపసైరాలు జల్లుకొను రోజు.

సర్కార్ సాహబ్,
కాంతప్రసాద్ సిన్హాగారు యల్. యల్. బి.
వకీలు, మురార్ (పోస్టు), షాహాబాద్ జిల్లా, బీహార్ రాష్ట్రము,

97. కేంద్రీయపాలకసమితికార్యదర్శిగారి యుత్తరమునుండి కొంతభాగము గూడ నిచ్చట పొందుపఱచదగియున్నది.

పూజనీయ ప్రియ సర్కార్ సాహబ్ వారికి,

* * * *

IV. ఇటీవ తృణప్రాయమైన యున్ని శాలువ (ఆల్వాన్) విషయములో, తమకు "అధికమనఃక్లేశము" గలిగించినందుకు నిజముగ నాకు చాల విచారముగ నున్నది.

దాని నొక మైత్రిసూచకబహుమానముగ తమ కిచ్చెదమనియేగాని నాకు మఱొకయుద్దేశ్య మెంతమాత్రమును లేదని తమకు నేను దృఢముగ జెప్పుచున్నాను. తమకు సత్సంగములోగల హోదాతో నీవిషయమున కెంతమాత్రమును సంబంధములేదు. నా యార్థిక శక్తికి మించనివస్తువును దేనినైనను, నా మిత్రు లెవరైన నిష్టపడినపుడు, అట్టిమిత్రుని కిచ్చుట నాకొక వాడుక. క్రితము డిశంబరు నెలలో తమరు నా శాలువను జూచి యిష్టపడితిరని నే ననుకొంటిని. అది సరియో కాదో నేను చెప్పలేను. అంతకుముందు నే నా శాలువను ధరించి యుండనిచో తమరు దానిని స్వీకరించవలసినదిగ నే నప్పుడే పట్టుపట్టియుందును. అప్పటినుండియు నే నట్టి మఱొక శాలువకొఱకై వెదకుచుండగ నిప్పటి కొకటి దొఱికినందున, తమ కది బహుమానముగ నీయవలయునని నాకు మహాభిలాషగ నుండెను. కాని మీకు "మనఃక్లేశము" గలిగించుటకన్న నీ యల్పబహుమానమును నేను వెనుకకుతీసికొనుట యేయుక్తము ఈ సందర్భములో నే నీక్రిందివిషయములను తమకు చెప్పగోరుదును:

(1) ఈ శాలువను కాశ్మీర్ మహారాజావారి ప్రయివేటు సెక్రిటరీ (Private Secretary) గారు మహారాజావారి కార్ఖానానుండి పంపినందున, దీనిమీద నెగుమతిపన్ను వర్తకపన్ను లెవ్వియు పడకపోవుటచే (ఆపన్నులు నూటికి రమారమి రు. 40/-లుండును) నేను దీనికొఱకై ఖర్చుపఱచినది తమ యంచనాకన్న చాలతక్కువ. మన యిరువురి యార్థికపరిస్థితుల వంటి పరిస్థితు

లలోనున్న స్నేహితులమధ్య నిట్టిబహుమాన మేమియు నంతయధికమూల్య మైనదిగ పరిగణింపబడదు.

(2) "నాతరఫున" సత్సంగమునకు భేంటు అనగా, మీరు దాని మూల్యమును చెల్లించినట్లే యగును. కావున, నందుకు నేను సమ్మతించుట సబబుకాదని నా యభిప్రాయము.

(3) నా జీవితములో నేను నాస్నేహితులకింతకన్న నధికమూల్యముగల వస్తువులను బహుమానములుగ నిచ్చితిని గాని వారందఱును నాతో సమాన స్థితిలోనివారే. తమవిషయములో నేనాలోచించుకొనగా, నా ప్రస్తుతపరిస్థితి, పతితము, నీచము, గర్హ్యము, పాపిష్ఠము, లజ్జాకరమునై యుండి తమ యుత్తమాధ్యాత్మికగాంభీర్యౌన్నత్యములతో పోల్చిచూచుకొనినపుడు మఱింత కనిష్ఠముగ నాకే గోచరమగుచున్నది. కావున నా నైజస్వభావమునుగాని, నా చలచిత్తమునుగాని తృప్తిపఱచుకొనునిమిత్తము తమ దుస్తులగదిని, నా రోఁత బహుమానముచే నపవిత్రముజేయగోరుట న్యాయముకాదని నేను దెలిసికొంటిని.

రాధాస్వామిదయాళురు న న్నీ లేఖలో తనపై కోపము చూపకుండ గను, నాకు వాస్తవమనోగతభావముగానివిషయ మొక్కమాటనుగూడ వ్రాయకుండగను నిరోధించుగాత. కావున,

(a) తమ రావస్తువును నాకు తిరిగి యిచ్చివేసినను, లేక,

(b) ఈ బహుమానమునకు పరిహారముగ నేదైన ప్రాయశ్చిత్తమును (ఈ పదము సరిగలేదు గాని, యింతకుమించి నాకు పదములు తోచుటలేదు) తమకు యుక్తమనియు మన యుభయులకు లాభకరమనియు తోచిన విధమున చేయించినను, లేక, (యిది చెప్పుటకు నాకు గుండె జారిపోవుచున్నది)

(c) దాని ధర నా కిచ్చినను, నే నెంతమాత్రము బాధపడకుండ నుండవలసినవాడనే.

ఈ దీర్ఘప్రలాపమును వ్రాసినందుకు క్షమింపవేఁడెదను.

నేను వాస్తవముగ నా మనోగతభావములను సమగ్రముగ నిచ్చుట పొందుపఱచితినిగాని వాని ప్రకటనమునకై యుపయోగించిన భాషనుగుఱించి కొంచెముగూడ నాలోచనసేయలేదు.

మఱిమఱి కృతజ్ఞతార్పణల వేడుకొనుచు సగౌరవహృదయపూర్వక రాధాస్వామీఅభివందనములతో

తమ పతిత పాపిష్ఠ భూతపూర్వ సోదరుడు.
ప్రేమ శూన్యుడైన ప్రేమప్రసాదు.

---

98. సర్కార్‌సాహబ్‌వారు "ప్రార్థనా" శబ్దమును వారి జీవితములో చాలముందుగనే వ్రాసిరి. దానికి తరువాత కొన్ని సమయోచితమైనమార్పులు చేసి క్రొత్తభాగములనుగూడ జేర్చినపిమ్మట తమ తదేకసారస్వతపత్రికటన మైన "ప్రేమసమాచార్" లో దానిని ప్రచురించిరి. ఈ సంచికలో రాధా స్వామీ మతముయొక్క తత్వబోధయును సిద్ధాంతములును సంగ్రహముగ వివరించబడినవి. ఆ సంచికలోని "పరమగురు" అనెడి మహావ్యాసములో సర్కార్‌సాహబ్‌వారు నిజధారయొక్క నిజధర్మములనుగుఱించి స్పష్టముగ సంక్షిప్తరూపమున విశదీకరించిరి. ఆ నిజధార జీవులనందఱ నుద్ధరించునిమి త్తమే ఆ పరమచైతన్యభండారమునుండి బయల్వెడలి వచ్చినందున, నది జీవో ద్ధారకార్యమును సంపూర్ణముగ నెఱవేర్చువఱకును తిరిగి తనభండారమునకు మఱలిపోనేరదని గూడ వారు ప్రస్ఫుటముగ నసందిగ్ధరూపమున వక్కాణించి చెప్పిరి. కావున "సద్గురువు లేని మధ్యకాలము" (Interregnum) అను ప్రశ్నకు సావకాశమే లేదు. సర్కార్‌సాహబ్‌వారికి శరీరప్రకృతి దుర్బలమగుటచేత ను, దీర్ఘవ్యాధిమూలముననుు, ఆరోగ్యములేమి చేతను, గ్రంథరచన సేయుట కెక్కువవ్యవధి చిక్కలేదు. అయినను వారి లేఖలును, సత్సంగములో వారు సెలవిచ్చిన ప్రవచనములును, అందుకు హస్తలిఖితసంగ్రహములను జాగ్రత్త పెట్టుకొన్న సత్సంగులకు సజీవస్మారకచిహ్నములుగను పథప్రదర్శక దివ్య జ్యోతిగను ఉన్నవి.

99. ఆ మహానిష్టదినమయిన 23-3-1913 తేదీ, నిర్యాణమునకు దారి దీ సెను. ఆరోజున హోలీపండుగ యగుటచే మురారులో సత్సంగము మహానం దముగ సమితశోభతో జరిపించబడెను చాలసేపటివఱకును పవిత్రశబ్దపారము చేయుచుండిరి. ఆ మహోత్సవము తెల్లవాఱుజామున రెండుగంటలవఱకును సాగుచుండెను. తెల్లవాఱుసరికి సర్కార్‌సాహబ్‌వారికి తీవ్రమగు జ్వరము వచ్చెను. ఆ జ్వరము మధ్యమధ్య హెచ్చుతగ్గులతో నించుమించు 8 మాస ములవఱకు నల్లేయుండెను. వేసవికాలములో సర్కార్‌సాహబ్‌వారు విశ్రాం

తికై మసూ్సరీ వెళ్ళదలచిరి. కాని వారి నా యనారోగ్యస్థితిలో పర్వత ప్రాంతములకు వెళ్ళవలదని వారి తండ్రిగారు చాలనిర్బంధము చేసిరి. కట్టిన సామానులను ముమ్మాఱు విప్పి ప్రయాణమును రద్దు చేసికొనిరి. ఎట్టకేలకు వారు తమతండ్రిగారిని తమరు మసూ్సరీలో వేసవిగడపుట కంగీకరించులాగున యొప్పించగలిగిరి. సర్కార్‌సాహబ్‌వారు "మురారును మించిన పల్లెగాని, లక్నోకన్న నుత్తమపట్టణముగాని, మసూ్సరీకన్న నెక్కువ రమణీయదృశ్యములతో నొప్పారు పర్వతముగాని లే" దనియనుచుండెడివారు. వారు జ్వరముతోను వ్రణముతోను బాధపడుచుండియుగూడ, మసూ్సరీలో నున్నంతకాలము నుదయము సత్సంగమునకు వచ్చుట యెన్నడును మానలేదు. మసూ్సరీలో నుండుటచే వారి యారోగ్యమేమియు బాగుపడలేదు. వారు తిరిగి 1913 సంవత్సరము అక్టోబరునెల చివరకు చాలయుద్ధతమైన జబ్బుస్థితిలో మురారునకు వచ్చివేసిరి.

100. మురారులో సర్కార్‌సాహబ్‌వారి పడకగదికి సరిగ ముందుగ నున్న విశాలగృహాంగణములో సత్సంగమున కేర్పాటుచేసిరి. వారు వచ్చిన కొన్నాళ్ళకు పవిత్రగ్రంథములనుండి యఖండశబ్దపాఠము చేయుట మొదలు పెట్టి 1913 డిసెంబరు 6వ తేదీవఱకు నట్లే విరామములేకుండ జరిగించిరి. సర్కార్‌సాహబ్‌వారికి చాల బలహీనముగ నుండుటచే వారు శబ్దపారమును తమ ప్రక్కమీాదనేయుండి శ్రవణము జేసెడివారు. డిసెంబరు 6వ తేదీరాత్రి సర్కార్‌సాహబ్‌వారు సాహబ్జీమహారాజవారికొఱకును, సేఠ్‌నిహాల్‌చంద్‌గారి కొఱకును కబురుపెట్టిరి. కాని సాహబ్జీమహారాజవారా రాత్రియంతయు తెల్లవాఱుజామున 4 గంటలవఱకు నా గదిగుమ్మమున కవతలనే యుండియున్నను, వారికా కబురు-యెవరైనను దాని నందకుండజేసిరో, లేక నందజేయుటలో నాలస్యముజేసిరో, మరేమి జరిగెనో గాని-అందనేలేదు. సర్కార్‌సాహబ్‌వారు 7-12-1913 ఉదయము సుమారు 6గంటలకు తమ భౌతికదేహమును విసర్జించిరి.

101. సర్కార్‌సాహబ్‌వారి ప్రధానోద్దేశ్యము సత్సంగమునంతను ఏకముఖముచేసి దృఢపఱచుటయే. స్వామిజీమహారాజవారు సత్సంగమును స్థాపించిరి హుజూర్‌మహారాజవారు దానికి భావికాలములో నిరర్గళముగ వృద్ధివికాసలు పెంపొందునట్లు పోషణజేసిరి. మహారాజసాహబ్‌వారు దాని

వ్యవస్థాపనను గుఱించియు పరిపాలనా విధానమును గుఱించియు శ్రద్ధవహించిరి. కాని యీవ్యవస్థయంతయు తమ ప్రాముఖ్య ప్రాధాన్యముల విషయమై యధికచింతగల వ్యక్తులచే నావరింపబడిపోయెను. సర్కార్‌సాహబ్‌వారుచేసిన యుక్తియుపాయములచే నట్టి వ్యక్తులనుండి రాధాస్వామీసత్సంగము విమోచితమై సత్సంగసంస్థల నేర్పాటుచేయు శక్తిగల యొకమహావ్యవస్థ నేర్పడెను. ఈ విషయములో మహారాజసాహబ్, సర్కార్‌సాహబ్‌వార్ల యుభయుల కాలములలోని పరిపాలనావిధానముల యుద్దేశ్య మించుమించుగనొకటే.



V—సాహబ్జీమహారాజువారు

దయాల్బాగు స్థాపకులు

(1881—1937)

*1913 లో సంత్ సద్గురువుగ ప్రకటమయిరి.*

## V

# పరమ పురుష పూరన్ధనీ హుజూర్ సాహబ్జీ మహారాజువారు

పరమగురు హుజూర్ సాహబ్జీమహారాజువారు అను నామముతో ప్రఖ్యాతిగాంచిన సర్ ఆనందసరూప్, (నైట్) వారు రాధాస్వామీ మతమున నైదవ సంత్ సద్గురువుగ విరాజిల్లిరి. వారు 1881వ సం॥రము ఆగస్టు 6వ తేదీ శుక్రవారమునాడు సూర్యోదయ సమయమున అంబాలా పట్టణమున కలాల్మాజరీలో, మధ్యశ్రేణికి జెందిన అహలువాలియా కుటుంబమున జన్మించిరి. ఆచుట్టుప్రక్కల నీ కుటుంబమువారు, అధిక పారమార్థిక చింతయు శ్రద్ధాభక్తులును గలవారుగ నెంచబడుచుండిరి. వారి పితామహులగు శ్రీ మాణిక్చంద్ గారు ప్రభుత్వోద్యోగము జేసిరి. వారి తండ్రిగారు శ్రీ లాలా కిషన్చంద్ గారు లోహపు సరకుల వ్యాపారము చేసెడివారు. వారు సహజధారీ [1] శిఖ్కులును గురునానక్ వారి భక్తులును.

2. సాహబ్జీమహారాజ్ వారి కిద్దఱన్నగార్లు, నిద్దఱు తమ్ములు నొకసోదరియును గలరు. వారి జ్యేష్ఠసోదరులు శ్రీ బ్రిజబాసీలాల్ గారు బి. యే. యల్. యల్. బి. అంబాలా పట్టణములో న్యాయవాదిగ పనిజేసి, పిదప సభయొక్క కార్యనిర్వాహక వర్గములో న్యాయశాఖాసభ్యులుగ పనిచేసిరి వారి రెండవ యన్నగారు శ్రీ ద్వారకాబాసీగారు, టెలిగ్రాఫు సూపరింటెండెంటుగ (Telegraph Superintendent)బనిజేసి చాలించుకొన్న పిమ్మట, దయాల్బాగ్లో డైరెక్టరు ఆఫ్ ఇండస్ట్రీస్ గా(వస్తూత్పాదకపరిశ్రమల కధినియంతగ) పనిజేసిరి. వారితమ్ములలో, జ్యోతిస్వరూప్ గారు మధ్యప్రదేశములో పి.డబ్ల్యూ డి.లో నుద్యోగము చేసిన పిమ్మట కంట్రాక్టరుగ పనిచేసిరి. శ్రీ హంసకుమారుగారు మధ్యప్రదేశములో పి డబ్ల్యూ. డి.లో అసిస్టెంటు ఇంజనీరుగ పనిజేసి, పిమ్మట కొంతకాలము రాజబరారీలో సభవారి యరణ్యములకు మేనే

---

(1) సహజధారీ శిఖ్కులనగా శిఖ్కు మతగురువులందు విశ్వాసము గలిగి గురుగోవిందసింగుగారి కాలమున నేర్పాటు చేసిన 5 శిఖ్కుచిహ్నములు, అనగా, (1) కేశ (పొడుగు జుట్టు) (2) కడా (మురుగులు) (3) కచ్ఛా (లంగిబట్ట) (4) కంఘా (దువ్వెన) (5) కృపాణ (ఖడ్గము) ముల నవలంబించకుండినట్టి శిఖ్కులు

జరుగ పనిచేసి, ప్రస్తుతము కంట్రాక్టరుగ నున్నారు. వారి సోదరిగారి నామధేయము శ్రీమతి గోవిందకుఁవర్. ఆమెను సామాన్యముగ నందఱును 'బుఆజీ' యని పిలుచుచుందురు.

3. సాహబ్జీమహారాజువారు చిన్నతనమునుండియు గంభీరప్రశాంత స్వభావము గలిగి యాలోచనాపరులయి యుండెడివారు వారు సాధారణముగ జనసామాన్యమునుండి వేఱుగనుండుట కిష్టపడువారును, స్థిరచిత్తులును, పట్టుదల గలవారునై, బహిరంగమైన యాటలలో చాలతక్కువగ పాల్గొనువారు. వారిని 1886 సం॥రములో 5 సంవత్సరముల ప్రాయమున ప్రాథమిక పాఠశాలలోఁజేర్చిరి. వారు తమ దినచర్యలో(Diary)పాఠశాలలోని తమ ప్రథమానుభవమును గుఱించి వ్రాసిరి.

4. చిన్నతనమునుండియు సాహబ్జీమహారాజువారికి ఏకాంతముగనుండుట యిష్టము. వారికి యీడువచ్చుచున్నకొలఁది యీ యేకాంతాసక్తి విపరీతముగ హెచ్చిపోవుచుండెను. వారు తమ కొప్పజెప్పిన గృహకృత్యములను చక్కగఁ జేసినపిమ్మట నొంటరిగ నుండగోరెడువారు. కుటుంబములో నందఱును వారిని ప్రేమతో జూచుచు, వారి యభిప్రాయములను, ఉద్దేశ్యములను ఆదరముతో మన్నించెడివారు. వారు దయార్ద్రహృదయులగుటచే, బీదసాదలయెడల దయతోను ఔదార్యముతోను ప్రవర్తించుచు, వారలబాధలలోను,దుఃఖములలోను హృదయపూర్వకముగ పాల్గొనుచు తమ శక్తికొలఁది వారికి సహాయము చేసెడివారు వారు అంబాలా పట్టణపు మిషనుహైస్కూలు (Mission High School) నుండి 1897వ సం॥రములో మెట్రిక్యులేషన్ పరీక్షలో నుత్తీర్ణులైరి, తరువాత వారు లాహోరునకు వెళ్ళి యచట డి. ఏ. వి. కాలేజీలో నింటర్మీడియటు క్లాసులో ప్రవేశించి, 1899 సం॥రములో నింటర్మీడియటు పరీక్షలో నుత్తీర్ణులైరి,

5. సాహబ్జీమహారాజువారు డి. ఏ. వి. కాలేజీలో నున్నపుడు, ఆర్యసమాజముయొక్క ప్రభావములోనికి వచ్చిరి. డాక్టరు సర్ గోకులచందునారంగ్ గారును, గురుకులపాలకుడగు (Governor of gurukul) ప్రొఫెసర్ రామదేవుగారును వారికి సన్నిహిత సహచరులుగ నుండెడివారు. సాహబ్జీమహారాజువారు సంస్కృతము చదువుటకై యెక్కువసమయమును వినియోగించుచు నాభాషలో ప్రవీణతనొందినపిదప, భగవత్సాక్షాత్కారము నొంద

వలయునను గోరికతో వేదములను ఉపనిషత్తులను పూర్ణశ్రద్ధతో నభ్యసింప దొడఁగిరి. క్రమక్రమముగ వారి మనోబుద్ధులశక్తులు బాగుగవికసించి వారికి ప్రాపంచికవ్యవహారములనుండి విరక్తియు నాధ్యాత్మికాభివృద్ధికొఱకు నాసక్తియు వృద్ధిజెంది, నిరంతరము వా రంతరంగమున లీనమై యుండెడువారు.

6. వారు మెట్రిక్యులేషన్ పరీక్షంలో నుత్తీర్ణులుగాకమునుపే, వారికి పంజాబులో పోలీసుఇనస్పెక్టరుగారైన సర్దారుబిషన్‌సింగుగారి కొమార్తె శ్రీమతి సోహన్‌దేయీగారి నిచ్చి వివాహముజేసిరి. వారికి ప్రథమపుత్రుడు గలుగుసరికి వారింకను కళాశాలలో విద్యార్థిగనేయుండిరి. సాహబ్జీమహారాజువారికి 1901 సం॥రములో నుపదేశమైనపిమ్మట నీ పుత్రుడు చనిపోయెను.

7 వారు బి ఏ. క్లాసు ప్రథమసంవత్సరములో చదువుకొనుచున్నప్పుడు తమస్నేహితులగు శ్రీ బాలముకుందుగారితో గలిసి వేదములను జదువుకొనుటకై తమపెద్దల యనుమతి బడయకుండగను, వారికి తెలియకుండగను తమ కళాశాలనువిడచి వెళ్ళిరి. వారిరువురును దక్షిణహిందూదేశస్థులకు ప్రసిద్ధయాత్రాస్థలమగు 'నాసిక్' కు వెళ్ళి యచ్చట నార్యసమాజమందిరములో విద్యార్థులకు వేదాధ్యయనము నేర్పుచుండిన యొకసుప్రసిద్ధపండితునివద్ద ప్రవేశించిరి.

8. వీరిరువురు నిట్లాకస్మికముగ నదృశ్యమగుటచే వీరల బంధుమిత్రులు గొంతకలవరపడిరి. కాని వీరు తరుణవయస్కులగుటచే నేదేని వినోదార్థమైన ప్రయాణముపై వెళ్ళియుండవచ్చునసియనుకొని, వారువీరలకొఱకై కొంతకాలమన్వేషణచేయలేదు కాని వారలవృత్తాంత మేమియు దెలియకుండ కొన్ని నెలలు గడచిన పిమ్మట నాబంధుమిత్రులు సహజముగ నత్యాతురులై వారలకొఱకు వార్తాపత్రికలలో ప్రకటనలుచేసి, యనేకవిధముల నన్వేషణచేసిరి. కాని ప్రయోజనము లేకపోయెను. ఆఱు మాసము లయినపిదప నాహబ్జీమహారాజువారివద్దనుండి వారి యింటికొకయుత్తరము వచ్చెను. వారాయుత్తరములో తాము బొంబాయిలోనున్నట్లు దెలియజేసి, యచ్చట తామిరువురును జేయుచున్న యుద్యమమును గుఱించియు, తమ క్రియాకలాపమును గుఱించియు, వివరములువ్రాసి, మఱికొంతకాల మచ్చటనేయుండిపోవుట కనుమతిని కోరిరి ఈ వార్త తెలిసి యింటిలోనందఱును సంతసించిరిగాని, వారి మామగారైన సర్దార్‌బిషన్‌సింగుగారి కంతసులువుగ తృప్తిగలుగలేదు. అం

దుచే నాయన శ్రీ బ్రిజబాసీలాలుగారితో గలిసి బొంబాయి వెళ్ళి సాహెబ్జీ మహారాజు వారి నింటికితీసికొనివచ్చిరి. అందఱును సంతసించిరి. సాహెబ్జీమహారాజువారి నట్లుచేసితిరేమని యెవ్వరు నడుగలేదు. వాస్తవముగ నందఱకును వేదాధ్యయనము నాధ్యాత్మికవిషయవిమర్శయును ప్రశంసనీయకృత్యముల నియే యనిపించుటచే నా విషయములో నెక్కువజోక్యము కలుగజేసికొనిన యెడల వారు బొత్తిగ వ్యతిరేకమైపోవుదురని భయపడి వారందఱు నూరకుండిరి.

9. ఆఱుమాసములు కాలేజీకి వెళ్ళకపోవుటచే వారికి కళాశాలలో చదువు వెనుకబడిపోయెను. మఱల చదువుటకుగూడ వారికిష్టములేకుండెను. కుటుంబములోని యాచారపరిశారము వారికి పనిపాటలులేకుండ నూరకకూర్చుండుటకు నిష్టములేదు. అందుచే వారు లాహోరులో నుత్తరాపర (N. W Railway) రైల్వేలో, ఎగ్జామినర్ ఆఫ్ అక్కవుంట్సు ఆఫీసు (Examiner of. Accounts Office)లో, నప్పట్లో నుద్యోగముచేయుచున్న తమ పెద్దన్నగారు శ్రీ బ్రిజబాసీలాలుగారి సహాయముతో అప్రెంటిస్ (Apprentice)గా పనిలోజేరిరి. కొంతకాలమైనపిదప వారాపనినిమాని వేసి లాహోరులో పోస్టుమాస్టరుజనరల్ గారిఆఫీసులో ప్రవేశించిరి. కొన్నిమాసములు ట్రెయినింగైన పిదప టెలిగ్రిఫీలో ప్రారంభికపరీక్షలో నుత్తీర్ణులై, వారి రెండవయన్నగారు ద్వారకాబాసీగారిసహాయముతో టెలిగ్రాఫ్ డిపార్టుమెంటులో నుద్యోగమును సంపాదించిరి.

10. వారా కాలములో తమయుద్యోగకృత్యములనన్నిఁటిని నిర్వర్తించిన పిదప మిగిలినసమయమంతయు పరమార్థగ్రంథములను శ్రద్ధగాచదువుచుండిరి. వారుపనిషత్తులను భగవద్గీతను, శాస్త్రములను క్షుణ్ణముగ చదివిరిగాని జీవితాదర్శమును సాధించలేకపోయితిమనుచింత వారికట్టేయుండిపోయెను. కేవలము మతగ్రంథములను చదివినమాత్రమున భగవద్దర్శనము చేకూరజాలదని వారికి త్వరలోనే బోధపడినందున వారు పరిపూర్ణసద్గురువుకొఱకై యన్వేషింపదొడఁగిరి. మహాత్ములు, ఫకీరులు మొదలగువారెవరైనను వచ్చినట్లు తెలియగనే వారట్టివారిని వెళ్ళికలిసికొనుచుండిరిగాని తమకోరిక చరితార్థముగాకుండెను.

11 1931 సం॥రములో బ్రిటిష్ వార్తాపత్రికాసంపాదకుడైన పాల్ బ్రంటన్ దొరగారు దయాల్‌బాగు వచ్చినపుడు, ఆయనతో సాహబ్జీమహారాజువారు చేసిన సంభాషణ, యీసందర్భమున చాలరుచికరముగ నుండగలదుగావున, నీక్రింద పొందుపఱచుటయైనది:-

సాహబ్జీమహారాజ్‌వారు:- సద్గురువు తప్పనిసరిగ నవసరము. ఆధ్యాత్మికప్రపంచములో కేవలస్వశక్తిచే సాధించుటయనునది యసంభవము.

పాల్‌బ్రింటన్:- మీ కట్టిపురుషుని యవసరము గలిగెనా?

సాహబ్జీమహారాజ్:- నిస్సందేహముగ. వాస్తవమైన సద్గురువుకొఱకై నేను 14 సంవత్సరములు అన్వేషణజేసినపిదపనే వారు నాకు లభించిరి.

పాల్ బ్రింటన్: పదునాలుగుసంవత్సరములే! మీయాయువులో నైదవ భాగము! అంత యవసరమున్నదా?

సాహబ్‌జీమహారాజ్: సద్గురువు నన్వేషించుటలో నిరువదియేండ్లు గడచిపోయినను అది వ్యర్థకాలక్షేపమన్నటికిని గాదేరదు నాకు విశ్వాసము కుదిరినవఱకును నేనుగూడ మీయంత సంశయాత్మకుడనే. ఆధ్యాత్మికప్రకాశమునకు త్రోవజూపగల సద్గురువుకొఱకై నేను చాలయన్వేషణప్రయత్నములు జేసి విఫలుడనై చివరకు నిరాశజెందితిని. అపుడు నేను చిన్నవాడనే గాని సత్యవస్తువును దెలిసికొనితీరవలయు నను నభిలాషచే పూర్తిగపిచ్చియెత్తినట్లయిపోయితిని సత్యవస్తువున్నయెడల నాకు జూపవలయునని చెట్లను పచ్చికలేగసపును, ఆకాశమునుగూడ ప్రార్థించితిని. నే నాధ్యాత్మికప్రకాశముకొఱకై తలవంచుకొని చంటిబిడ్డవలె వెక్కివెక్కియేడ్చితిని. చివరకొకనాడా బాధ నెంతమాత్రము సహించలేక, నా కాదివ్యశక్తి కొంతప్రకాశము నీయనిచో నే నభోజనముచేసి మరణించవలయునని నిశ్చయించుకొంటిని. అప్పుడు నేను మఱేపనియుగూడ జేయలేకుంటిని. మఱునాడు రాత్రి నే నొకచక్కనికల గంటిని. నాకొకమహాపురుషుడు ఆస్వప్నములో స్పష్టముగ నగుపించి తామే సద్గురువునని తెలియజెప్పిరి. నేను వారి చిరునామా నడిగితిని. వారు "అలహాబాద్! నాపూర్తిచిరునామా నీ కిఁకపై తెలియగల" దని సమాధానమిచ్చిరి.

12. సాహబ్జీమహారాజువారి రెండవయన్నగారైన ద్వారకాప్రసాదుగా రంతకుముందే రాధాస్వామీమతమున జేరిరి. కానికుటుంబమందెవరికిని వారు సత్సంగి యనిదెలియదు. సాహబ్జీమహారాజువారు తమ స్వప్నమును గుఱించి

ఆయనకు ప్రాసంగికముగ జెప్పి, సలహానుకోరగా, శ్రీద్వారకాబాసీగారు లోనికిపోయి తమపెట్టిలోనుండి యొకసాంఘికఛాయాచిత్రమును (Group Photo graph) తీసికొనివచ్చి వారికి చూపించి అందులో తమస్వప్నములో దర్శనమిచ్చిన మహాపురుషుని గుర్తించగలరాయని వారి నడిగిరి. వెంటనే సాహబ్జీమహారాజువారు ఆఫోటోలో మధ్యనున్న మహాపురుషుని చూపించి వారే తమకు స్వప్నములో దర్శనమిచ్చిరని సెలవిచ్చిరి. అప్పుడు ద్వారకాబాసీగారు, ఆఫోటో తమసద్గురువైన మహారాజ్‌సాహబ్‌వారి దనిచెప్పి వారు అలహాబాదులోనే యుండుచుండిరని తెలియజేసిరి. సాహబ్జీమహారాజువా రుపదేశముకొరకు మహారాజసాహబ్ వారికి దరఖాస్తుపెట్టుచు నందులో తమ స్వప్నమునుగురించి యుదహరించిరి. మహారాజ్‌సాహబ్‌వారు లాహోరు వాస్తవ్యులైన లాల్‌చంద్‌సూరిగారిని సాహబ్జీమహారాజువారికి స్మరణ ధ్యాన యుక్తుల నుపదేశమిమ్మని యాజ్ఞాపించిరి. సాహబ్జీమహారాజువా రీవిధముగ 1901 సం॥రములో నుపదేశమునొంది యాధ్యాత్మికసాధనల నభ్యసింపఁ దొడఁగిరి.

13. సాహబ్జీమహారాజువారు రచించిన యీక్రింది రెండుశబ్దములలో వా రుపదేశమునొందకపూర్వము తమస్థితినిగురించియు నుపదేశమునొందినపిదప తమస్థితినిగురించియు వర్ణించిరి.

(a) సతగురు మేరే పియారే ధుర్ ఘుర్ సే చల్ కే ఆయే

(ప్రేమవిలాస్-6వ శబ్దము)

అర్థము: నా ప్రియతములైన సద్గురువు తమ మూలధామమును వీడి పృథ్వీలోనికి దిగి వచ్చిరి.

(b) మిలే మోహిఁ రాధాస్వామీ ప్యారే, సరాహూఁ భాగ క్యా అపనా

(ప్రేమవిలాస్ 47వ శబ్దము)

అర్థము:- ప్రియతములైన రాధాస్వామిదయాళుని సంయోగము నాకు లభించినది. నా మహాభాగ్యమును నే నేమని కొనియాడుకొందును!

14. ఉపదేశము తీసికొనినపిదప సాహబ్జీమహారాజువారు లాహోరులో నుండిరి. అప్పుడే వారి మొదటికుమారుడు చనిపోయెను ఆ పిల్లవానిస్థితి చాలప్రమాదావస్థలోనున్నపుడు సాహబ్జీమహారాజువారు, వారి కుటుంబము వా రందఱితోపాటూ పిల్లవాడున్నగదిలో కూర్చుండియుండిరి. ఒక భీకరా

కారముగల స్త్రీ ఆ పిల్లవానివద్దకు వచ్చి చేతులు చాచినట్లు సార్వభౌమమహా రాజువారి కగుపడెను. కాని, వెంటనే మహారాజ్ సాహెబ్ వారు వచ్చినట్లును ఆయాఁడుమనిషి మాయమైపోయినట్లును గనిపించినందున సార్వభౌమమహారాజు వా రాశ్చర్యముతో బిగ్గఱగ నఱచిరి. ఆపిల్లవాడుగూడ నప్పుడే ప్రాణము లను విడిచినందున కుటుంబములో వారందఱును సార్వభౌమమహారాజువారు పిల్ల వానిమరణము మూలమున విచారించిరని పొరబడిరి.

## మహారాజసాహెబ్ వారి కాలమున

15. సార్వభౌమమహారాజువారికి, మహారాజసాహెబ్ వారి మానవస్వరూప దర్శనము నొందుసౌభాగ్యము మొట్టమొదట 1903 సం॥రములో నాగ్రాలో లభించెను. అది యొక భండారాసమయము. అప్పుడు సార్వభౌమమహారాజు వారు 3, 4 దినములచ్చట సత్సంగము చేసికొనుచు నుండిరి 1904 సంవత్సరము లో నెలరోజులు సెలవుపెట్టి అలహాబాదులో 25 దినములు మహారాజసాహెబ్ వారితో సత్సంగము చేసికొని తిరిగి ఆ సంవత్సరము క్రిస్మస్ సెలవులలో నాగ్రా లో వారిసత్సంగమును జేసికొనిరి. అటుతరువాత 6 మాసములవఱకును వారికి మహారాజ్ సాహెబ్ వారిదర్శనములభించలేదు. అప్పుడుసార్వభౌమమహారాజువారు అలహాబాదు టెలిగ్రాఫ్ ఆఫీసునకు బదిలీ చేయుమనిగోరుచు నొకదరఖాస్తు పెట్టు కొనిరి. కాని వారిని పాట్నా ఆఫీసునకు మార్పుచేసిరి. వా రచ్చట ప్రవేశిం చిరి గాని యాంతర్యమున చాల బాధపడిరి. మహారాజ్ సాహెబ్ వా రప్పుడు సార్వభౌమమహారాజువారికి స్వప్నములో దర్శనమిచ్చి వారిని అలహాబాదు మార్చుట కేర్పాట్లయినవని సెలవిచ్చిరి. ఆ స్వప్నమువచ్చిన మూడవరోజు ననే సార్వభౌమమహారాజువారికి అలహాబాదు బదిలీ చేసిన ల్లుత్తరువువచ్చెను. ఇవ్విధముగ సార్వభౌమమహారాజువారికి సత్సంగములో నుండుటకు సావకాశము లభించెను. అలహాబాదులో నున్నపుడు, వారు నియమముగ సత్సంగమునకు వెళ్ళుచు ఆఫీసునకు నిర్ణీతమయినకాలముగాక మిగిలిన సమయమునంతను సద్గురుసాన్నిధ్యముననే గడిపెడివారు. వారి కాంతర్యమున వెవ్వేఱూర్ధ్వలో కములకు సంబంధించిన బ్రహ్మానందదాయకమగు ననుభవములు గలుగుచు మహారాజసాహెబ్ వారి పవిత్రచరణకమలములందు భక్తిప్రేమలు దినదినాభి వృద్ధి నొందుచుండెను. తరువాత 1906 సంవత్సరములో మహారాజసాహెబ్ వారికి జబ్బుచేసి వారు అక్టోబరు 12 వ తేదిని సింధుదేశపర్యటనమునకై

బయులుదేఱిరి. సాహబ్జీమహారాజువారు వారితో నా పర్యటనములో వెళ్ళ లేకపోయిరి. సింధుదేశమునుండి తిరిగి వచ్చినతరువాత మహారాజసాహబ్ వారు సెలవుపెట్టి 1907 సం॥రము ప్రారంభములో తమనివాసమును వారాణసికి మార్చిరి సాహబ్జీమహారాజువారు అలహాబాదులోనే యుండిపోయిరి గాని సాధ్యమైనంత తఱచుగ వారాణసికి వెళ్ళుచుండెడివారు. "డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీ ఫేత్" అనుగ్రంథమును చెప్పివ్రాయించుచున్నరోజులలో మహారాజసాహబ్వా రొకనాడు సాహబ్జీమహారాజువారిని తమగదిలోనికి తీసికొనివెళ్లి ప్రత్యేకప్రసాదము నిచ్చిరి. ఈవిశేషప్రసాదమును గుఱించియే సాహబ్జీమహారాజువారు పై 13 వ పేరాగ్రాఫ్‌లో (a) గుర్తుగ నుదహరించిన శబ్దములో సూచనజేసిరి. అందుకుసంబంధించిన చరణములీక్రింద పొందుపఱచబడినవి –

> ఫిర్ ఐసీ మౌజ ధారీ, గహరీ దయా బిచారీ
> యోఁహీ బహానా కర కే ఖుద్ ఘర్ పై అపనే లాయే

అర్థము:– అప్పుడు వారు నాయందు మహానుగ్రహము జూపిరి. ఏదో మిషపై నన్ను వారి సొంతగదిలోనికి పిలుచుకొని వెళ్ళిరి."

సాహబ్జీమహారాజువారు 1907 సం॥రము సెప్టెంబరునెల నాల్గవవారములో సెలవుపెట్టి వారాణసి వెళ్ళినపుడు వారికి మహారాజసాహబ్‌వారి దర్శనము కడపటిసారి లభించెను.

## సాహబ్జీమహారాజువారు వారాణసిలో నున్నకాలము

16. ఇంతలో వారాణసికి మార్పుచేయించుకొనుటకై సాహబ్జీమహారాజువారు చేసినయత్నములు సఫలమైనందున వారు 1907 సం॥రము అక్టోబరు 3వ తేదీన అలహాబాదులో నుద్యోగమునుండి విడుదలనొంది, వారాణసికి వెళ్ళిరి. సాహబ్జీమహారాజువారు వారాణసికి వెళ్ళుసరికి, మహారాజసాహబ్ వారు సత్సంగమునకు వచ్చుట మానివేసిరి. కాబట్టి సాహబ్జీమహారాజువారికి తిరిగి వారి దర్శనము జేసికొనుసావకాశము లభించనేలేదు. మహారాజసాహబ్ వారు 1907 సం॥రము అక్టోబరు 12వ తేదిన గుప్తమైరి.

17. తర్వాత నతిత్వరితముగనే, సాహబ్జీమహారాజువారికి ఘాజీపురము వెళ్ళుమని యాంతర్యమున విస్పష్టాదేశములు లభించెను. వారాణసిలో నున్న

పుడు సాహబ్జీమహారాజువారికి అచ్చటి చిన్నచిన్న వీధులు సందులు గూడ చిరపరిచితమైనట్లు జ్ఞాపకము వచ్చుచుండెను. తా మదివఱలో కబీరువారి రూపమున వారాణసిలో నుంటిమని, సాహబ్జీమహారాజువారు 1913 సం॥ర ములో సద్గురువుగ ప్రకటమైనపిదప, నొకసారి సెలవిచ్చిరి.

18. పరమగురు మహారాజసాహబ్ వారు గుప్తమైనపిదప సత్సంగ కేంద్ర స్థానము రాధాస్వామీమతములో నాల్గవ సంతసద్గురువైన సర్కార్ సాహబ్ వారి నివాసస్థానమగు ఘాజిపురమునకు మారెను. సాహబ్జీమహారాజువారు ప్రతిశనివారము ఘాజిపురము వెళ్ళి, ఆదివార మచట సత్సంగముకొఱకై యాఁగి సోమవారము తమ యుద్యోగము చేసికొనుటకు తిరిగి వారాణసికి వచ్చుచుండెడివారు. అటులనే సెలవుదినము లన్నియు వారు ఘాజిపురముననే గడిపెడివారు. ఆదిగాక వారు వింగతసమయములలోగూడ వీలైనపుడెల్ల సెలవుపెట్టి ఘాజిపురమునకు వెళ్ళి యచ్చటనే యుండెడివారు. సద్గురువునెడ వారిభక్తివిశ్వాసములును నిస్స్వార్థసేవాభావమును, ఆధ్యాత్మికసాధనల నభ్య సించుటలో నిరంతరమగ్నతయు నాదర్శప్రాయములుగ నుండెడివి.

19. సాహబ్జీమహారాజువారు వారాణసిలో నున్నపుడు సర్కార్ సాహబ్ వా రొకసారి యెచ్చటికో వారాణసిమీఁదుగ ప్రయాణము చేసిరి. సాహబ్జీమ హారాజువారు సర్కార్ సాహబ్ వారికొఱకు మంచిపాలు తీసికొని స్టేషనుకు వెళ్ళిరి. కాని శ్రీ జ్వాలాప్రసాద్ గారు పాలను సర్కార్ సాహబ్ వారి నిమి త్తమై తీసికొనుటకు నిరాకరించిరి. పిమ్మట సర్కార్ సాహబ్ వారు తేనీరు కావలెనని యడుగగా పనివాడు తేనీరు సిద్ధముచేయుట కాయత్తపడెను గాని యదివఱలో దెచ్చియుంచినపాలు తోడుకొనిపోయి స్టేషనులో వేఱే పాలు దొఱకనందున, సాహబ్జీమహారాజువారు తెచ్చినపాలనే తీసికొని సర్కా ర్ సాహబ్ వారికి తేనీరును సిద్ధముచేయుట జరిగెను. సర్కార్ సాహబ్ వారికి తేనీరు నిచ్చుటకు పాత్రగూడ నేకారణముచేతనో లభ్యముకాలేదు. ఒక క్రొత్త తేనీటిపాత్రలగణమును (Tea Set) గూడ సాహబ్జీమహారాజువారు తీసికొనివచ్చినందున, నాసెట్టు (Set)తో సర్కార్ సాహబ్ వారికి తేనీరు నిచ్చిరి. సర్కార్ సాహబ్ వా రపుడు చాలసంతసించిరి.

20. సర్కార్ సాహబ్ వా రొకవేసవిలో మురారులో తమ యెలఁదోటలో సత్సంగము జరుపుచుండెడివారు. ఒకనెలలో సాహబ్జీమహారాజువారి కెక్కు

వగ నాఫీసుపని యుండుటచే, వారు వరుసగ మూడాదివారములు సత్సంగమునకు వెళ్ళలేకపోయిరి. పూర్తిగ నొకమాసము గతించినపిదప వారు సత్సంగమునకు వెళ్ళగా సర్కారుసాహబ్‌వారు సెలవెన్నాళ్ళున్నదని సాహబ్జీమహారాజువారిని ప్రశ్నించి, ఒక్కరోజుమాత్రమే యున్నదని వారు సమాధానము జెప్పినమీదట నా యొకదినము సత్సంగ మొకనెలకు సమానమని సెలవిచ్చిరి. సత్సంగులు సత్సంగము ప్రారంభించకముందు ఆరోజులలో సర్కార్ సాహబ్ వారి సమక్షమున నొకయరగంటసే పాధ్యాత్మికసాధన జేయుట మామూలుగ నుండెను. కాని యారోజున నాధ్యాత్మికసాధనలకు వ్యవధి నీయకనే సర్కార్ సాహబ్ వారు వెంటనే సత్సంగమును ప్రారంభించు మని యానతినిచ్చిరి.

21. మఱొకసారి, 1901 సంవత్సరములో సాహబ్జీమహారాజువారి కుపదేశ మిచ్చిన శ్రీ లాల్చంద్ సూరిగారు "డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీ ఫేత్" (Discourses on Radhasoami Faith) అను గ్రంధములో కొన్నిచోట్ల సత్సంగుల కవగాహన యగుటలేదని సర్కార్ సాహబ్ వారితో చెప్పగా సర్కార్ సాహబ్ వారు సాహబ్జీమహారాజువా రా భాగములకు బాగుగ నర్థము జెప్పగలరని చెప్పి, వారి నడిగి తెలిసికొనుమని యాయన కానతినిచ్చిరి.

22. సాహబ్జీమహారాజువారు వచ్చువఱకు, ముఖ్యమైన కాగితముల నుత్తరువులకొఱకై తమవద్ద నుంచవలదనియు, సాహబ్జీమహారాజువారు వచ్చినతరువాత నా కాగితములను వారికిచూపించి, వారికి తోచిన మార్పుల నందు జేసిన తర్వాతనే, తమవద్దకు తీసికొని రావలసినదనియు సర్కార్ సాహబ్ వా రీరోజులలోనే యాజ్ఞాపించిరి. ఆ యాజ్ఞానుసారము ఆఫీసులో పనిచేయువారు, ప్రతి వారమును సాహబ్జీమహారాజువారు వారాణసినుండి వచ్చువఱకు, సర్కార్ సాహబ్ వారియెదుట కాగితముల నుత్తరువులకొఱకై పెట్టకుండ కనిపెట్టుకొని యుండెడివారు.

23. 1912 సం॥రములో సాహబ్జీమహారాజువారికి వారాణసినుండి యాగ్రాకు బదిలీయైనది. వారి కాగ్రాలో నుద్యోగములో జేరుటకు పది దినములు గడువున్నందున, నా గడువుకాలములో వారు మురారునకు వెళ్ళిరి. వారు మహా ఖిన్నులై యున్నందున తమఖేదమును సర్కార్ సాహబ్ వారికి విన్నవించుకొని కటాక్షమునకై ప్రార్థింపఁదలఁచిరి. కాని యారోజులలో సర్కార్ సాహబ్ వారి

కారోగ్యము బాగుండనందున సాహబ్జీమహారాజువారు తమస్వవిషయమును వారి కా సమయములో విన్నవించుకొనుట యుక్తముకాదని భావించి యూర కుండిరి. అయినను రెండుదినముల తరువాత వారి కా సావకాశ మీయబ డెను. అప్పుడు సాహబ్జీమహారాజువారు ఖిన్నమనస్కులైయుండి, సర్కార్ సాహబ్ వారితో మాట్లాడుటకు యోచించుచుండగనే, సర్కార్ సాహబ్ వారు, "అయితే మీ కాగ్రా బదిలీమైనదా?" యని యుత్సాహసంతోష ములతోఁ బలికిరి. కంటనీరు పెట్టి సాహబ్జీమహారాజువారు, "చిత్తము, హుజూర్, నా కాగ్రా బదిలీమైన"దని సమాధానముజెప్పిరి. సర్కార్ సాహబ్ వారు, "మీ రేల కంట తడిఁబెట్టెదరు?" అని ప్రశ్నించి, మఱల, "ముందు మీరు వెళ్ళుడు. నేను మీ వెనువెంటనే వచ్చెద"నని నుడివిరి. సాహబ్జీమహా రాజువారు, "హుజూరువా రేసందర్భమున నాగ్రా దయచేయఁదలఁచిరి?" అని యానందభరితులై ప్రశ్నించిరి. "ఆగ్రావద్ద సత్సంగకేంద్ర మేర్పాటు చేయవలసియున్నది. మిమ్ము నందులకే ముందుగ నచ్చటకుఁ బంపుచుంటి" మని వారు సమాధానముజెప్పిరి. సాహబ్జీమహారాజువారు మహాఘుర్మత ప్త మైనపిదప సేదదీర్పు చన్నీటిస్నానము జేసిన ట్లానందభరితులైరి. సాహబ్జీమహా రాజువారి కింకనువివరముల నడిగి తెలిసికొనవలెనని కుతూహలముగ నుండెను. ఇంతలో సర్కార్ సాహబ్ వారే, "ఇప్పుడిఁక మే మాగ్రాలోనే స్థాయిగ నుం డెదము. సత్సంగసంఘము ముందంజ వేయవలసిన తరుణ మాసన్నమైనది. సత్సంగులపిల్లలకై యచ్చట నొక కళాశాలను స్థాపించెదము. 'ప్రేమసమా చార్'ను ఒకవారపత్రికగ ప్రచురింపఁదలఁచితిమి. దానికి మీరు సహాయ సంపాదకులుగనుండి పనిచేయవలసియుండును. మీ రుద్యోగమును వదలి యీ పనిని నిర్వహించగలరా?" యని ప్రశ్నించిరి. సాహబ్జీమహారాజువారు, "ఎప్పుడు కావలెనన్న నప్పుడే నిస్సంశయముగ నుద్యోగమును వదలివేసెద" నని సమాధానము నిచ్చిరి. సర్కార్ సాహబ్ వా రపుడు తమచరణము నివ్వగ సాహబ్జీమహారాజువా రాచరణమును తమసిరమునఁ బెట్టుకొనిరి.

24. అప్పుడు సాహబ్జీమహారాజువారు ఆగ్రా వెళ్ళి యచ్చట కొంతకాల మున్నతరువాత సర్కార్ సాహబ్ వారివద్దనుండి సత్సంగమునకు తగిన స్థలమొ కటి ఆగ్రాలో చూడవలసినదని వారికి కబురువచ్చెను. సాహబ్జీమహారాజువా రచ్చట సత్సంగి సోదరుల సహాయముతో, తగినస్థలమునకై యన్వేషణజేసిరి.

25. సాహబ్జీమహారాజువారు వారాణసిలో నున్నకాలములో, ఒకహోలీకి వారు 8 రోజులు సెలవుపెట్టి సత్సంగమునకై వెళ్ళదలచిరి. కాని వారి పై యధికారి అందునిమిత్తమై సెలవిచ్చుట కియ్యకొనలేదు. సాహబ్జీమహారాజు వారు ఆయనతో నొకటి రెండుసార్లు చెప్పుకొనిరిగాని ఆయన పట్టువిడువలేదు. అందుచే సాహబ్జీమహారాజువారికి చాలబాధగలిగెను. ఆ పైయధికారి యింటికిపోవుసరికి తన యేకైకసంతతి చాలజబ్బుస్థితిలో నుండుటచే తనభార్య యేడ్చుచుండెను. అప్పుడాయనకు తనతప్పిద మవగాహనకు వచ్చి, సాహబ్జీ మహారాజువారిని పిలిచి వారికి సెలవిచ్చి, రైలుకు పోవుటకు వ్యవధి తక్కువగనుండుటచే తన బంట్రౌతును బంపి, టాంగా తెప్పించి సాహబ్జీమహారాజు వారిని సకాలములో స్టేషనుకు జేరుకొనునట్లు చేసిరి.

26. ఒకసారి సాహబ్జీమహారాజువారాధ్యాత్మికసాధన నభ్యసించుచు పూర్తిగ తన్మయులై యుండినపుడు, ధగధగాయమానముగ ప్రకాశించుచున్న నీలిరంగు కిరణపుంజము హఠాత్తుగ క్రిందికిప్రసరించి వెంటనే పిడుగువలె నొక పెద్దధ్వనిగూడనయి శ్రీకృష్ణుడు ఖడ్గహస్తుడై యాకాంతికిరణపుంజమునుబట్టి దిగివచ్చి సాహబ్జీమహారాజువారియెదుట నిలచెను. శ్రీకృష్ణుడు తానెవరో ముందుగజెప్పి, సాహబ్జీమహారాజువారిని పైకితనవైపుకుచూడుమని, వారేమి కోరిన నద్దానినిచ్చుటకై సిద్ధముగనుంటినని చెప్పెను. కాని సాహబ్జీమహా రాజువారు పైకి చూచుటకు నిరాకరించి తమకేమియు నక్కఱలేదని చెప్పి, సర్కారుసాహబ్ వారు తమప్రభువనియు వారినితప్పించి మఱొకరివైపునకు తాము కన్నెత్తిచూడమనియు సెలవిచ్చిరి. సర్కార్ సాహబ్ వారి నామము చెవినిపడినంతనే శ్రీకృష్ణుడు మాయమైపోయెను.

27. 1913 సం॥రములో వేసవికాలముతరువాత సర్కార్ సాహబ్ వారు మసూరీనుండి తిరిగివచ్చినపుడు వారు వారాణసిలోదిగి. మహారాజసాహబ్ వారి పవిత్రసమాధివద్ద సత్సంగముఁజేసిరి. అప్పటికి సాహబ్జీమహారాజువారికి మఱల వారాణసి బదిలీయైపోయియుండుటచే, వారప్పుడచ్చటనే యుండిరి. సత్సంగానంతరము సత్సంగులందఱకును బూందీలడ్డుండలను ప్రసాదముగ నిచ్చిరి. సాహబ్జీమహారాజువారు ప్రసాదము తీసికొనుటకు వెళ్ళగా సర్కార్ సాహబ్ వారు,

దేఖో శీరాజే కో బిఖర్ నే న దేనా

అర్థము: "బూందీ విడిపోకుండ జూడుమునుమీ" యనిచెప్పిరి. అప్పు

డెవ్వరికి నా మాటలోని గూఢార్థము బోధపడలేదు. సర్కార్ సాహబ్‌వారు గుప్తమైనపిదప నందఱకును జ్ఞానోదయమై సత్సంగము చీలికలై పోకుండగ జాగ్రత్తగ కనిపెట్టుచుండుమని యీ వాక్యముచే సర్కార్ సాహబ్ వారు సాహబ్జీమహారాజువారి కానతినిచ్చిరని యవగాహనయయ్యెను. సాహబ్జీమహా రాజువారు సద్గురువుగ ప్రకటమగుటలో మిగతసద్గురువులవలెగాక వేఱుపద్ధతి నవలంబించినది బహుశా యిందువలననే గాబోలు.

## సంత్‌సద్గురువుగనున్న కాలము

28 సర్కార్ సాహబ్ వారు గుప్తమగుటకు కొన్నిదినములుముందు, సాహబ్జీమహారాజువారు రమారమి రెండుమాసములు సెలవుపెట్టి ఘాజీపూరులో వచ్చియుండిరి. అందుచే సాహబ్జీమహారాజువారికి సర్కార్ సాహబ్ వారి చివర రోజులలో కొన్నాళ్ళు నిరంతరము వారిదగ్గఱ నుండు సావకాశము చిక్కెను. ఆరోజులలో సర్కార్ సాహబ్ వారి యుత్తరప్రత్యుత్తరముల నన్నిటిని సాహబ్జీమహారాజువారే వ్రాయుచు, మిగిలిన ఆఫీసుపనులన్నిటినిగూడ చూచుచుండెడివారు. నిర్యాణమునకు ముందురాత్రి, సర్కార్ సాహబ్‌వారు వారికొఱకై కబురుపెట్టిరి. కాని యీకబురు సాహబ్జీమహారాజువారి కంద లేదు. అయినను సేఠ్ నిహాల్ చందుగారితోగూడ సాహబ్జీమహారాజువారు వెళ్ళి యీరాత్రియంతయు సర్కార్ సాహబ్ వారి పడకగది కావలనే యుం డిరి. తెల్లవాఱుజామున నించుమించు నాలుగుగంటలకు వారిరువురును తిరిగి వెళ్ళిపోయిరి సేఠ్ నిహాల్ చందుగారు తెల్లవాఱువఱకు నచ్చటనే యుండిపో వుదమని జెప్పగా సాహబ్జీమహారాజువారు తానుచ్చటకువచ్చినపని నెఱవేరిన దని సెలవిచ్చిరి. 7-12-1913వ తేదీ యుదయము 6 గంటలకు సర్కార్ సా హబ్ వారీప్రపంచమును వీడి వెడలిపోయిరి.

29. సర్కార్ సాహబ్ వారి నిర్యాణవార్త వ్యాపించగనే వాతావరణమం తయు మహావిచారగ్రస్తమై నలువైపులనుండియు సత్సంగులు వెక్కివెక్కి యేడ్చుచున్నట్లు స్తంభితరోదనధ్వనులు వినవచ్చెను. ఘాజీపూరునుండి 20 మైళ్ళ దూరములోనున్న బక్సార్‌వద్ద గంగానదీతీరమున సర్కార్ సాహబ్ వారి దహనసంస్కారము జరుపుటకు నిశ్చయించిరి. వారి బంధువులును, సత్సంగు లును చాలమంది రైలుమీదనే బక్సార్ వెళ్ళిరి. వారి పవిత్రశరీరము

సౌభాగ్యవారి కాంపులలో బలిష్టులును ఆజానుబాహుఫ్రులునగు వాహకులు దహనసంస్కారము చేయుటకు తీవ్రునకు గొనిపోయిరి. క్రితము మూడుదినములనుండియు జ్వరముతో బాధపడుచుండియుకూడ సాహబ్జీమహారాజువారు కాలినడకనే యా పవిత్రశరీరమును వెంబడించి చనిరి. సర్కార్ సాహబ్ వారి శరీరము అగ్నిజ్వాలలలో గ్రస్తమైనపుడు, ఛాలమంది సత్సంగులకు సాహబ్జీమహారాజు వారి రూపము మాటి సర్కార్ సాహబ్ వారి రూపమువలెనే కనఁబడెను. దహనసంస్కారానంతరముగూడ సాహబ్జీమహారాజువారు కాలినడకనే తిరిగి మురారునకు వచ్చిరి. మురారునకు వచ్చునరికి సాహబ్జీమహారాజువారు చాల యలసిపోయిరి.

30 సాహబ్జీమహారాజువారు కాలినడకను వచ్చుటచే వారు మురారునకు 8-12-1913 నాటికి జేరుకొనిరి. ఆరోజుననే రాధాస్వామీసత్సంగసభ కార్యనిర్వాహకవర్గ మొకసమావేశమును జరిగించెను. ఆవర్గసభ్యులు తొమ్మండ్రులోను శ్రీజ్వాలాప్రసాదుగారితో కలిపి యేడుగురు సభ్యులు ఆసమావేశములో పాల్గొనిరి. ఆసమావేశములో నొక ప్రకటనపత్రమును సత్సంగులందఱకును పంపుట కామోదించిరి. సర్కార్ సాహబ్ వారి భండారాను డిసెంబరు 26వ తేదీనను, హుజూర్ మహారాజువారి భండారాను డిసెంబరు 28వ తేదీనను జరిపించుటకు నిశ్చయించిరి. రెండుభండారాలుగూడ మురారులోనే చేయుటకు నిశ్చయించిరి. రాధాస్వామీసత్సంగ సమావేశము డిసెంబరు 27వ తేదీని మురారులోనే జరుపుటకు నిశ్చయించిరి. రెండుభండారాలకును భేంటును రాధాస్వామీ సత్సంగసభ కార్యదర్శిగారికి పంపవలసినదని యందఱకును దెలియజేసిరి. ఆసాయంకాలము సత్సంగము చేసిరి. అందులో 'హే సంతన సిరతాజ కృపాలా' యనుప్రార్థనను పఠించవలసినదని హుజూర్ సాహబ్జీమహారాజువారానతినిచ్చిరి. ఆపాఠము జరుగుచున్నపుడు హుజూర్ సాహబ్జీమహారాజువారి కండ్లనుండి కన్నీరు ధారలుగ కారిపోయెను. కాని ప్రార్థన చదువుటపూర్తియయినతోడనే వారు సంతోషముగనున్నట్లు కన్పించిరి.

31. పిమ్మట సాహబ్జీమహారాజువారి నెవ్వరైనను కలిసికొని సర్కార్ సాహబ్ వారి వియోగదుఃఖమును చెప్పుకొనినపుడెల్ల వారు, సర్కార్ సాహబ్ వారం దఱను రక్షించుచు పథప్రదర్శనము చేయుచున్నారని ధైర్యము చెప్పుచుండెడివారు. ఆమఱునాడు, అనగా, 1913సం॥ డిశంబరు 9వ తేదీని, శ్రీఅలబేలీసరను

గారును, శ్రీమున్నాలాలుగారును సాహబ్జీమహారాజువారి వసతిగృహమునకు వెళ్ళి వారితో మాట్లాడుచుండగ మఱికొందఱుసత్సంగులుగూడ నచ్చటకు జేరిరి. కొంత తడవైనపిదప సాహబ్జీమహారాజువారు మున్నాలాలుగారిని తమ వైపు చూడుమని యాజ్ఞాపించుచు, "స్వామీజీమహారాజువా రేతెంచిరి. కావున వారిదర్శనము జేసికొ"మ్మని జెప్పిరి. అంతట నందఱకు, నతివిచిత్రముగు నట్లు, సాహబ్జీమహారాజువారి స్థానే స్వామీజీమహారాజువారే కనిపించిరి. అప్పుడు సాహబ్జీమహారాజువారు, "హుజూరుమహారాజువారుగూడ వచ్చి"రని సెలవియ్యగా. వెంటనే స్వామీజీ మహారాజువారిరూపము మాఱి యందఱి కును హుజూర్ మహారాజువారి రూపము కన్పించెను. అటులనే యచటనున్న వారందఱకును, మహారాజసాహబ్ వారి స్వరూపమును, ఆతరువాత సర్కార్ షాహబ్ వారి రూపమునుగూడ దర్శనమయ్యెను. ఆదర్శనములవలన వారందఱి మనస్సులలో నారూపముల యాకారము లంకితమయిపోయి, దీర్ఘకాలానంత రముగూడ నాయాకారములు జ్ఞాపకముండునంత గాఢపరిభావము గలిగెను.

32. పిమ్మట సాహబ్జీమహారాజువా రిట్లనిరి, "అపరమచైతన్యధార తన సహజమైనసంపూర్ణమహారాజవైభవముతో, మహావేగముగ ప్రవహించుచున్నది. మీ రందఱును దండప్రణామము లాచరింపుడు". అప్పుడు వారు అందఱి సత్సంగులకును దండప్రణామములుచేయుట కనుమతినిచ్చిరి ఒకరితరువాత నింకొకరిచొప్పున వరుసగ నందఱును వారికి దండప్రణామములు చేసిరి. ఈవార్త దావానలమువలె వ్యాపించిపోయినందున నెవరికివారు ముందుగపోయి యా యద్భుతకటాక్షలాభము నొందవలెనను గోరికతో నచటకు పరుగులిడుచు వచ్చిరి.

33. అప్పు డచ్చటనున్న కొంతమందితో సాహబ్జీమహారాజువా రాజ్ఞాపన స్వరముతో మాటలాడిరి. ఎట్లన, లాలామురళీధరుగారి భార్యయయిన గురు ఆధారిగారితో, "బీబీసుగ్గియొక్క బట్టలను నీవు దొంగిలించితివి. స్వామీజీ మహారాజువారిని క్షమార్పణము వేడుకొను" మని యనిరి. తమ మామ గారయిన సరదార్ బిషన్ సింగుగారితో, "ప్రసాదపులడ్డుల గొన్నింటిని నీవు తస్కరించితివి. క్షమార్పణ వేడుకొను" మనిరి వారి పెద్దకుమారుడైన శ్రీ ప్రేమసరూప్, అప్పటికిపసిపిల్లవాడైయుండి, వారిని "బాబూజీ" అనిపిలువగా వారు "బాబూజీ యని పిలువకుము స్వామీజీ యని పిలువుము," అని యాజ్ఞాపించిరి. ఈవిషయములన్నియు జరుగుచుండుటచే నచ్చట కొంత సందడి

గలిగినందున, వారి ధర్మపత్నిగారుగూడ నచ్చటకు వచ్చిరి. అప్పుడు సాహబ్జీ మహారాజువారు ఆమెవైపునకు దిరిగి, అందఱును తమవైపు జూచుచుండిరి గాని, ఆమెవైపెవరును జూచుటలేదని చెప్పి యామెను తనపై ముసుఁగుతీసివే యుమని యాజ్ఞాపించిరి. పిమ్మట వారు తమపై వస్త్రములను సొంతవస్తువులను చుట్టునున్నవారికి బహుమానములుగ గిరాటువేసిరి. సాహబ్జీమహారాజువారు చరణామృతము నివ్వగ, బాబా అచింతదాస చరణామృతము నొక బావిలో పోయుటకై వెళ్ళుచుండెను. అప్పుడు సర్కార్ సాహబ్ వారి తండ్రిగారు వారి నట్లుచేయకుండ నాఁపుజేసెను. ఈమాట సాహబ్జీమహారాజువారికి తెలియుగనే, సాహబ్జీమహారాజువారు లేచి రోడ్డునపోవుచుండగా, సర్కార్ సాహబ్ వారి తండ్రిగా రెదురుగ నదేరోడ్డున వచ్చుట తటస్థించెను. సాహబ్జీమహారాజువారు ఆయనను 'నాయనగారూ' అని పిలిచిగౌరవించగా సర్కార్సాహబ్ వారి తండ్రిగారు "పొండు దయచేసి దూరముగపొండు," అని కొంతవిసుగుదలతో ననిరి. సాహబ్జీమహారాజువా రప్పుడు, తండ్రిగారు తమ్ము నచ్చటినుండి వెళ్ళిపొమ్మనిరిగాబట్టి తాము వెంటనే వెళ్ళిపోయెదమని చెప్పి, దుమరావూఁ గ్రామమునకుచనిరి. శ్రీఇకబల్ బహదుర్గా రొకబండిని మాట్లాడుకొని, అప్పుడే రోడ్డుమీదనుండినందున, నాయన సాహబ్జీమహారాజువారి నాబండిలో నెక్కుడని ప్రార్థించి యెక్కించుకొనెను. సత్సంగులుగూడ సాహబ్జీమహారాజు వారి వెంటఁబడిరి. కాని సాహబ్జీమహారాజువారు వారినందఱను, భండారా వఱకు నచ్చటనే యుండిపొండని చెప్పి, వారల కంతకుముందుగ వెళ్ళిపోవలెనని యున్నచో శ్రీజ్వాలాప్రసాదుగారి యనుమతిని దీసికొనినపిమ్మట వెళ్ళిపోవలసినదని సలహానిచ్చిరి.

34. సాహబ్జీమహారాజువారివ్విధముగ నప్పటిపరిస్థితులనుబట్టి బలాత్కారముగ మురారును విడిచివెళ్ళిపోవలసివచ్చెను. వారు మొదట దుమరావూఁ గ్రామము వెళ్ళి తిరిగియచ్చటనుండి వారాణసి కేగి తమ యింటివద్దనుండిరి

35. ఇంతలో మురారులో గొందఱు అల్లరిచేయుతలంపుతో, సాహబ్జీమహారాజ్ వారియందు విశ్వాసమేర్పడిన సత్సంగులకు, వా రున్నవసతిగృహములను వెంటనేఖాళీచేయవలసినదని ఆయిండ్లయజమానులచే తొందరగలుగజేయించిరి. అట్టివిశ్వాసముగల సత్సంగులలో గొందఱను కొట్టించెదరనిగూడ పుకార్లుబయలుదేరెను. అందుచే నచ్చటినుండి శ్రీమున్నాలాలుగారు డిసెం

బరు 10వ తేదీ రాత్రియు, సేఠ్ నిహాల్ చంద్ గారు 12 వ తేదీనను బయల్దేఱి మఱికొందరితోగూడ కలిసి వారాణసిలో సాహబ్జీమహారాజ్ వారివద్ద కేగిరి.

36. డిసెంబరు 14 వ తేదీన మురారులోచేయుటకునిర్ణయింపబడిన కార్యనిర్వాహకవర్గముయొక్క సమావేశ మప్పుడు వారాణసిలోచేయబడినది. ఆ సమావేశములో సాహబ్జీమహారాజ్ వారితో కలిపి నలుగురుసభ్యులుమాత్రమే పాల్గొనిరి. ఆసమావేశములో సభ కేంద్రస్థానము సాహబ్జీమహారాజువారి స్వస్థానమయిన అంబాలాపట్టణమునకు మార్చివేయబడినదనియు, నాతరువాత జరగవలసిన కార్యనిర్వాహకవర్గసమావేశము డిసెంబరు 26 వ తేదీన అంబాలాలో జరుపబడుననియు, సభాసమావేశము అదివఱలో మురారులోనిశ్చయింపబడిన డిసెంబరు 27వ తేదీనగాక 28వ తేదీన జరుపబడుననియు తీర్మానించిరి. 1913 సం॥రము డిసెంబరు 15వ తేదీన సాహబ్జీమహారాజువారు వారాణసినుండి అంబాలాకు పయనమై వెడలిరి.

37. అంబాలాలో వసతులువగైరా యేర్పాట్లన్నియు జరిగినపిమ్మట సాహబ్జీమహారాజువారు మురారులోనున్న పూజనీయమాతాజీసాహిబాగారికి, వారు సత్సంగులందఱును తామును మురారువిడిచి వెడలిపోవలసివచ్చిన పరిస్థితులను వివరించుచు నొక లేఖను వ్రాసిరి. అందుకు తర్జుమా నీక్రింద పొందుపఱచితిమి.

అంబాలాపట్టణము,
18-12-1913.

గౌరవనీయ పూజనీయ మాతాజీసాహిబాగారికి,

తమకు చేతులుమోడ్చి రాధాస్వామీఅభివందనము లర్పించుచున్నాము. తమ యధమదాసులమగు మేము అనివార్యపరిస్థితులమూలమున సత్సంగపాలనావిధానక్రమములో నీమధ్య కొద్దిరోజులక్రితము జరిగించిన మార్పులను గుఱించిన యథార్థస్థితిని తమకు సవినయముగ తెలియజేయుట కనుజ్ఞనువేడుచున్నాము. ఏలనన, నావిషయమై తమకు యథార్థము తెలిసిన యెడల,

(i) సర్కార్ సాహబ్ వారి పవిత్రచరణానుగ్రహముచే మీమామధ్య మా భక్తిగౌరవభావములను పురస్కరించుకొని యేర్పడినట్టియు నింకముందు

చిరస్థాయిగ నుండవలసినట్టియు నన్యోన్యభావము, తమ చెవినిబడియుండునని మేము భయపడుచున్నట్టి కల్పితగాథలమూలమున చెడిపోవుటగాని పరస్పర వైషమ్యములచే కలుషితమగుటగాని జరుగకుండుననియు

(ii) తమ దయారక్షణహస్తము మాసిరములపై నెల్లప్పుడునుండున నియు, నాశించుచున్నాము.

మేము శరీరమనోధనముల నర్పించి మాయావచ్ఛక్తితో తమసేవను జేయుటకు మొదటినుండియు నుద్యుక్తులమైయుంటిమి. మున్షీజీగారివద్ద ప్రిస్తుతము నిల్వలోనున్న గ్రంథములనిర్ధారితమూల్యమును, సర్కార్ సాహబ్ వారి ఫోటోలమూల్యమును కలిపి మొత్తము రు. 800/-లును, ప్రేమసమాచార్ పత్రిక అమ్మకమువలన జమవచ్చిన రు. 1500/-లును సోదరులందఱును నేనును గూడ, తమయధీనము జేయవలయునని, యిదివఱలోనే తీర్మానించుకొనియుంటిమి. నిదిగాక ఇంకొకపది. పండ్రెండువేలరూప్యములను పెట్టుబడిపెట్టి నెలకు అధమము రు. 50/-లయినను తమచరణములవద్ద నర్పించుచుండుటకుతగిన యాదాయము తప్పకుండ వచ్చునట్లేర్పాటుచేయవలెననిగూడ మేము నిశ్చయించుకొనియుంటిమి. కాని మాదురదృష్టముచే మధ్యస్థు లీవిషయములను తాఱుమాఱుజేసి తమకు కల్పితగాధలజెప్పి, తమవద్దనుండి వారల దురుద్దేశ్యములకు ప్రోద్బలమగులాగున యాజ్ఞలను సంపాదించిరి. అట్టియాజ్ఞలను చేకూర్చుకొని యథార్థవిషయములను మఱుగుపఱచుటచే వారు మాకు సర్వవిధముల నిందావమానములు గలిగించుపరిస్థితిని గల్పించిరి.

ఈక్లిష్టపరిస్థితిలో మేము తమ చరణములవద్దకు వచ్చి మాయథార్థస్థితిని స్వయముగ మనవిచేసికొనవలయునని దలంచితిమి మా కట్టిసావకాశ మనుగ్రహింపుడని సాహబ్ ప్యారీద్వారా తమవద్దకు మావిన్నపమును పంపుకొనగోరియుంటిమి కాని యింతలో, ఆనందసరూప్ 'బడేసర్కార్' వారిని కలిసికొనుట తటస్థించగా వారు "పొండు, దయచేసి దూరముగపొండు." అని నిరసనగ చెయ్యినాడించి పొమ్మనిరి. అందుపై నానందసరూప్ డుమరావ్ఁ స్టేషనుకు వెళ్లిపోయిరి. చాలమంది సత్సంగులును. సత్సంగినులునుగూడ వారితోకలిసివెళ్ళిపోవుటకై పట్టుపట్టిరిగాని వారు (శ్రీ)జ్వాలాప్రసాదుసిన్హాగారి యనుమతిని ముందుగ పొందకుండ తమతోరావలదని సవినయముగచెప్పి వారందఱిని నివారించిరి. కావున నాయన తమసామానులన్నిటిని నట్టేపెట్టి,

సత్సంగులను, సత్సంగములోని యధికారులనుగూడ వెంటఁదీసికొనిపోకుండ గనే, యొంటరిగ వచ్చుటనుండి వచ్చివేసిరి. వెను వెంటనే, మమ్ములను కొట్టించుటకై కుటుంబమువారు కొందఱు మనుష్యులను లారీకఱ్ఱలతో నేర్పాటుచేసిరనియు, మేమున్న యింటియజమానిని మమ్ముల నాయింటినుండి వెంటనే వెడలగొట్టవలసినదని ప్రోత్సహించిరనియు మాకు తెలిసినది. కావున మా కా సున్నిత సమయములో కల్పించబడిన యరోచకపుస్థితినుండి దప్పించుకొనుటకు ముం రారును విడిచి వెళ్ళిపోవుటదప్ప గత్యంతరము లేకపోయెను.

మేము (ఏ) మా హార్దికభావములనుగాని (బి) మాకు హుజూర్‌సర్కార్ సాహబ్ వారి పవిత్రసమాధినిర్మాణవిషయములోను, తమవిషయములోను గల సేవాభావమునుగాని, వ్యక్తపఱచుకొనుట కిసుమంతేనియు సావకాశము చిక్కనందుకు చాలచింతించుచుంటిమి. ఇదంతయు జూడగ, నిజముగ నొకవిధమున మా యాశలన్నిఁటికిని ప్రియస్థానమగు మందిరమున మమ్ముచొరనీయకుండ తలుపులు మూసివేసి, మమ్మటనుండి నిర్దయగ తఱిమివేయుచున్నట్లేయున్నది. మేము తమయెదుట చెప్పుకొనుచున్న యీయథార్థకథనమునకు రాధాస్వామిదయాళు రేసాక్షి. కావున తమఱు మావిచారకరపరిస్థితిజూచి జాలిగొని మాకు తమ యెడలగల హార్దికమాతృప్రేమభావమును ప్రదర్శించుట కవకాశమును దయజేయుగలందులకు కతిదీనత్వముతోఁ బ్రార్థించుచున్నాము మా యీవిన్నపము తమకందినట్లు దయతో తెలియపఱచుడని సవినయముగ వేడుచుంటిమి”.

సేఠ్ నిహాల్‌చందుగారును సర్దార్ బిషన్‌సింగుగారును సాహబ్జీమహారాజువారు నీయుత్తరములో సంతకములుచేసిరి.

38. మాతాజీసాహిబాగారు 27-12-1913 తేదీని సమాధానమునంపిరి అందులో నామె, తనకప్పుడు మహాదుఃఖములోనుండుటచే నేమిచేయవలయునో తోచకుండెననియు, వారు తనతో మాట్లాడుటకవకాశమును గోరగ నాచెప్పదల్చుకొన్న విషయములను లిఖితముగ పంపుడని తాను చెప్పితిననియు, తన కటుపిమ్మట నేవార్తయును జేరలేదనియు వ్రాసిరి

39. గౌరవనీయులు ననుభవశాలియునగు సత్సంగియు, సభాసభ్యులుగూడనైనట్టి రాయ్‌సాహబ్‌శంకరలాల్‌గారు సర్కార్‌సాహబ్‌వారు గుప్తమయినందునఖిన్నులయి వారి వాస్తవోత్తరాధికారిని కనుగొను నుద్దేశ్యముతో,

తన్నిమిత్తమై యొకయెత్తుగడక్రింద ప్రధాన సత్సంగి సోదరులందఱకును 17-12-1913 తేదీన నొకప్రకటన (సర్క్యులరు) పత్రమునంపుచు దానిని సాహబ్జీమహరాజువారికడకుగూడ నంపిరి. ఆపత్రములో శ్రీశంకరలాలుగారు సర్కార్ సాహబ్ వారి పవిత్రసమాధినిర్మాణముకొఱకును, వారివియోగ దుఃఖపీడితులైయున్న వారిధర్మపత్ని పసిపిల్లలయొక్క పోషణకై యేర్పాటు చేయుటకొఱకును, సత్సంగులందఱి సహాయసహానుభూతులనుగోరిరి. మఱియు వారా పత్రములో స్వామీజీమహారాజువారి సమాధిభేంటు మొత్తమునుండి సర్కార్ సాహబ్ వారి సమాధినిర్మాణమునకై కొంత మొత్తమును వేఱు జేయవలయుననియు, సర్కార్ సాహబ్ వారి కుటుంబముయొక్క పోషణనిమిత్తమును, వారిపిల్లల విద్యాభ్యాసము నిమిత్తమును తగినంత మొత్తమును ప్రోఁగు చేయవలయుననియు ప్రతిపాదించి రాబోవుభండారా సమయమున నీప్రతిపాదనను విమర్శించి అప్పుడు కలిసికొన్నసత్సంగులందఱి యొద్దనుండియు నన్ని బ్రాంచిసత్సంగముల యొద్దనుండియు దీని కంగీకారమును లిఖితరూపముగ నొందవలసియున్నదనిగూడ వ్రాసిరి.

40 ఈపత్రమును జోధపుర్ సత్సంగబ్రాంచివారిపేరన ప్రచురించి యుత్తరాధికారి పదవి నపేక్షించిన ట్లనుమానమున్న వారందఱకునుగూడ నంపిరి. ఈపత్రమునకు సమాధానమిచ్చుటలోఁ గొందఱు సంశయపూరితులయ్యును, గొందఱు దీర్ఘాలోచనాపరులయ్యును ఆలస్యముఁ జేసిరిగాని, సాహబ్జీ మహారాజువారు 20-12-1913 తేదీన తంతివార్తమూలమున నిర్విధముగ సమాధానమునంపిరి, "సర్క్యులరందినది. ఉదారాశయము హార్దికామోదము. ఇందువెంట నుత్తరము వ్రాయుచున్నాను." శ్రీ జ్వాలాప్రసాద్ సిన్హాగారు తమతరఫున శ్రీసద్గురునాథజీగారిని ఆప్రకటనపత్రము తమకందినట్లు సమాధానమును వ్రాయుమని నియోగించిరి. సాగర్ వాస్తవ్యులైన శ్రీపరమానందుగారాపత్రమును మాతాజీగారికి తెలియగలందులకై మురార్ గ్రామమున కంపితిననియు, నందలిప్రతిపాదనలు సఫలములు కావలెనని యాశించుచున్నామనియు 10-2-1914 తేదీని సమాధానమిచ్చిరి.

41. సాహబీమహారాజువారు తాము వ్రాయుచుంటిమని తంతిద్వారా తెల్పిన సమాధానమును 20-12-1913 తేదీననే వ్రాసిపంపిరి. అందులో (1) తాము స్వయముగను, (2) సేఠ్ నిహాల్ చంద్ గారును (3) శ్రీహుకుమ్ చంద్ గారును, (4) శ్రీజ్ఞానచంద్రబాసక్ గారును, (5) శ్రీఅలబేలీసరణుగారును,

(6) శ్రీకన్హయ్యాలాల్ గారును (7) శ్రీసర్దార్ బిషన్ సింగుగారును, (8)శ్రీభోలానాథ్ గారును, (9) పండితచండీశ్వరమిశ్రాగారును, ఆరోజున నంబాలాలోనున్న సభాసభ్యులందఱును, మఱికొంతమంది సత్సంగులును, సాధువులునుగూడ నా ప్రతిపాదనను సమగ్రముగ హృదయపూర్వకముగ నామోదించితిమని తెలియజేసిరి. ఇంతియగాక సాహబ్జీమహారాజువారాసమాధానములో 28-12-1913వ తేదీని అంబాలాపట్టణములో సభాసమావేశము జరుగగలదని రాయ్ సాహబ్ శంకరలాల్ గారికి తెలియబఱచి, వారాసమావేశమునకు రాగలరని యూహించుచుంటిమనిగూడ వ్రాసిరి.

42. లూధియానాలో శ్రీగురుదాసుగారును, సాగర్ లో శ్రీ పరమానంద్ గారును తామే సర్వసమ్మతముగ నుత్తరాధికారులు కాగలమని యూహించుచుండిరి. బాబూజ్వాలాప్రసాదసిన్హాగారుగూడ నాయుచ్చపదవిని కాంక్షించుచున్నట్లనుమానము గలదు. ఏదియెట్లున్నను ఆయన సాగర్ వాస్తవ్యులయిన శ్రీపరమానందుగారి యుచ్చాభిలాషలకు ప్రోద్బలముచేయుచుండిరి. అట్లు ప్రోద్బలముచేయుటలో నాయన కొకస్వలాభాపేక్షయుగలదు. ఆయనయు లాలా రాజనారాయణగారును శ్రీప్యారేలాలుగారును కలిసి సభద్రవ్యము పెద్దపెద్దమొత్తములను సత్సంగుల 'డిపాజిట్లు' ద్రవ్యమును వ్యాపారములో పెచ్చించుకొనిరి. ఆవ్యాపారము దివాలాయెత్తినందున సభకును, ప్రత్యేక సత్సంగులకునుగూడ వారిమూలమున చాలనష్టము గలిగెను. శ్రీప్యారేలాల్ గారు శ్రీపరమానందుగారికి సహోదరులు. వీరు ముగ్గురును సభతాలూకుద్రవ్యము రు. 55,000/-లను సత్సంగులడిపాజిట్లమొత్తములు రు.25,000/- లను వ్యాపారములో పెట్టుబడిపెట్టిరి.

43. సాహబ్జీమహారాజువారంబాలా జేరుకొనుసరికి వారార్థికముగ చాల క్లిష్టపరిస్థితిలో నుండిరి. వారివద్ద ద్రవ్యము చాలతక్కువగనుండుటచే వారికి బజారునుండి పప్పుబియ్యములను మాత్రమే కొనగలశక్తిగలదు. అందుచే వారింటిలోనివారందఱును సామాన్యముగ కిచడీ (పులగము) మాత్రమే తిని యుండెడివారు. అయినను సత్సంగకేంద్రస్థాపనమునకై వారియాంతర్యమున పథకము స్పష్టరూపమున నేర్పడియుండి, తామందునిమిత్తమై చేయవలసిన యఖండపరిశ్రమగూడ వారికిముందే యవగాహనయై యుండెను. అందువలననే వారు ఆర్థికముగ నట్టి క్లిష్టపరిసితిలోనుండియుగూడ తమయుద్యోగమును విడిచిపెట్టిరి. తమ కుటుంబపోషణార్థమై వారు గ్రంథములను వ్రాయుట ప్రారంభించిరి.

1913వ సం॥రము డిసెంబరు మాసమధ్యమునుండి 1914వ సం॥రము సెప్టెంబరు నెలలోపున 'ప్రేమసందేశ్', 'ప్రేమబిలాస్' మొదటిభాగము, 'రాధాస్వామీ మతదర్శనము', 'ప్రేమబిలాస్' రెండవభాగము అను నాలుగుగ్రంథములను వ్రాసిరి. నిజమునకు వారొక్కవారములోనే 'ప్రేమసందేశము'యొక్క వ్రాత ప్రతిని పూర్తిగవ్రాసివేసి సుమారు రెండునెలలలోనే దానిని కాన్పూరులో నచ్చొత్తించిరి. అందుచేతనే అది 1914 సం॥రము మార్చినెలలో నందఱకును లభ్యమాయెను. ఆగ్రంథములో సాహబ్జీమహారాజువారు భండారాలకును. సమాధులకును, పవిత్రకుటుంబమునకును కేవలపారమార్థికదృష్టితో నెంచినపు డుండువాస్తవమహిమను విశదపఱచిరి. సత్సంగులందఱు నీగ్రంథమునుచూచి మెచ్చుకొనిరి. దీనిలో సత్సంగములో భిన్నభిన్నశాఖలేర్పడుటకు కారణము లనుగుఱించియు, వాస్తవమైన మనోనిగ్రహమునుగూర్చియు, నిజధార యొక మానవరూపమువదలి రెండవమానవరూపమున నెట్లుప్రవేశించు నను విష యమునుగుఱించియు, సద్గురు వెట్లుప్రకటమగుచురను విషయమునుగుఱించియు స్పష్టముగ వివరించిరి. ఈగ్రంథముల నన్నిటిని వారు చాలతక్కువధరల కమ్మించిరి. గ్రంథముల ప్రచురణవలన సాహబ్జీమహారాజువారి కార్థికసమస్య తొలఁగిపోయెను మిగిలినగ్రంథములు తర్వాత నొక్కొక్కటిగ ప్రచురింప బడెను.

44. 1913 సం॥రము డిసెంబరునెలలో హుజూర్‌మహారాజువారి భండారా అంబాలాలో మహాభక్త్యుత్సాహములతో జరుపబడెను. దేశమంతటనుండియు సత్సంగు లధికసంఖ్యాకులుగ నంబాలాకు వచ్చిరి. సత్సంగమును శబ్దపార మును రేయింబవళ్ళెడతెఱపిలేకుండ జరుగుచుండెడివి రమారమి యొకనెల రోజులు ప్రతిదినమును తెల్లవాఱుజామున 3 గంటలు మొదలు 4 గంటల వఱకు నొకగంటసేపు మాత్రమే కాలకృత్యములకువిడిచి, మిగిలిన సమయ మంతయు సత్సంగముచేయుచుండిరి. అప్పుడు అంబాలాపట్టణమునకు వచ్చిన సత్సంగులకు సులభముగనే రాధాస్వామీదయాళుని నూతనస్వరూపమునందు భక్తివిశ్వాసములు పెంపొందెను.

## రెండు క్లిష్టసమస్యలు

45. ఆకాలములో సత్సంగమునకు రెండుప్రధానసమస్యలు గలవు. అం దులో మొదటిది సర్కార్‌సాహబ్‌వారికి ఉత్తరాధికారులైనట్లుగ నటించు

చున్న లూధియానావాస్తవ్యులైన గురుదాసుగారియొక్కయు సాగర్ వాస్తవ్యులైన శ్రీపరమానందుగారియొక్కయు ఇంకనటువంటి మఱికొందఱియొక్కయు ప్రవర్తనప్రవృత్తులవలన ప్రేరేపితమగుచున్న సత్సంగములోని యంతర్భేదములను నిర్మూలించుట ఉదాహరణార్థము: శ్రీకన్హయ్యాలాల్ శ్రీ బీర్ బల్ గారలు కంగాల్ కంపెనీ (అనగా నిరుపేదలసంఘము అని అర్థము) అని పేరు పెట్టుకొని, కొన్నియపోహాలను గలుగజేయు ప్రకటనపత్రములను- అందుచే గలుగుమహాహానిని తెలిసికొనకయే-ప్రచురించిరి. నిజమునకు అట్టివారికి చాలమందికి శ్రీజ్వాలాప్రసాద్ సిన్హాగారి సహాయసహానుభూతులుండెను. రెండవ సమస్య యేమనగా సభ యార్థికపరిసితిని పునర్నిర్మాణముచేయుట.

46. 28-12-1913 తేదీన జరిగిన సభాసమావేశములో నీ రెండుసమస్యలును చర్చింపబడినవి. ఆసమావేశమునకు సభాసభ్యులు 41లో 17మందిసభ్యులు వచ్చిరి సభయొక్క కేంద్రస్థానమును అంబాలా పట్టణమునకు మార్పుచేయు విషయమా సమావేశములో ధ్రువపఱచబడెను. తప్పుడు ప్రచారమును జరిగించుచున్న సత్సంగులను తమప్రవర్తననుగుఱించి సమాధానము చెప్పుమని యడుగవలసినదనికూడ నీసమావేశములో తీర్మానించిరి. మెహతాజీసాహబ్ వారి నీసమావేశములో కార్యనిర్వాహకవర్గసభ్యులుగ నెన్నుకొని సర్కారుసాహబ్ వారి పవిత్రసమాధినిర్మాణమునకు సభవారు రు. 20,000/-ల నిచ్చుటకుకూడ నామోదించి, అందులకు తగినస్థలమును నిర్ణయించి నివేదికను పంపుటకై ఒక 'కమిటీ' నేర్పాటుచేసిరి. 1914వ సంవత్సరము మార్చినెలలో మెహతాజీసాహబ్ వారా 'కమిటీ' నివేదికను తయారుజేసి సభకిచ్చిరి.

47. భండారా అయిపోయినపిమ్మట సాహబ్జీమహారాజువారు మొదట పంజాబ్ లోను, తరువాత బీహార్, ఉత్తరప్రదేశములలోను, పర్యటనముజేసిరి. సాహబ్జీమహారాజువారు పట్టణములకు దూరముగనుండు పల్లెటూళ్ళకుగూడ వెళ్ళి అమాయికశ్రద్ధాళులగు సత్సంగిసోదరులకు దర్శనమిచ్చిరి, వారిని దర్శించి వారి సాంగత్యభాగ్యముగల్గిన సత్సంగులందఱకును వారే సర్కారుసాహబ్ వారి నిజమైన స్థానాపన్నులని సంపూర్ణవిశ్వాసము గలిగెను.

48. పంజాబుపర్యటనములో నొకసంఘటనను సాహబ్జీమహారాజువారే స్వయముగ సెలవిచ్చిరి. సాహబ్జీమహారాజువారు సెలవిచ్చిన వృత్తాంతమునకు తర్జుమా నీక్రింద పొందుపఱచితిమి.

"1914 సంవత్సరము ఫిబ్రవరినెలలో సత్సంగముయొక్క భావ్యాభివృద్ధినిగుఱించి కొంతయాందోళనగను సందేహముగను ఉన్నరోజులలో ఫిరోజపూరుజిల్లాలో "అయితియానా" యను గ్రామమునకు వెళ్ళితిమి. చుట్టుప్రక్కలయూళ్ళనుండి వందలాదిసత్సంగు లచ్చటసమావేశమై, నిజధార ప్రకటనమునుగుఱించి పరిశీలింప నుత్సుకులై యుండిరి. సర్కారుసాహెబ్ వారి కుత్తరాధికారులమని చెప్పుకొనుచున్నట్టి లూధియానాప్లీడరుగారు, గురుబాన్ అను శ్రీహరిరాముగారును, శుఘులవాస్తవ్యులైన సర్దార్ ఇంద్రసింగుగారును సత్సంగులమనస్సుల నెక్కువకలవరపఱచిరి. ఈయువాయికజీవు లపభ్రమలపాలయిరనియు, వారలకు సకాలమున తగుసహాయమును మార్గప్రదర్శనమును జేయనిచో వారు సత్సంగమునుండి పూర్తిగ పతితులయిపోవుదురనియు నేనుగుర్తించితిని. అందుచే వారలకు సహాయముచేయవలయునని నిశ్చయించుకొని, వారలతో, "నిస్సంశయముగ మీరు చాలబుద్ధిమంతులును తెలివిగలవారే కాని మీరు సాధించదల్చుకున్నమహాకార్యము మిగులకష్టమయిన"దని నేను చెప్పితిని. అందులో కొందఱు నన్ను పరీక్షచేయుట యేమియు కష్టములేదని ప్రత్యాఖ్యానముచేసిరి. అంతట వారలకు నన్ను పరీక్షించుటకు తగిన సమర్థత కలదో లేదో నేనే ముందు వారలను పరీక్షించి చూచెదననియంటిని. అందుకు వారందఱు నంగీకరించిరి. వాతావరణమంతయు నావేశపూరితమై బిఱ్ఱుగనుండెను. నేను నా చొక్కాచేతిని పైకిలాగి, వారలకు నా నగ్నబాహువును చూపి, నా శారీరికబలమునుగుఱించి వారల యభిప్రాయము నడిగితిని అందఱు నేకగ్రీవముగ నాశరీరము చాలదుర్బలమయినదని యనిరి. అప్పుడు నేను మీయందఱలో నుత్తమబలశాలిని చూపుడని వారి నడిగితిని. అంతట నొకమల్లుడు ముందుకు వచ్చి, తా నొకమణుఁగున్నరయెత్తు బరువు నొక్కచేతితో నెత్తివేయగలనని వాక్రుచ్చెను. అప్పుడు నే నతనిని తనకు తోడుగ నచ్చటనున్నవారిలో మఱొకబలశాలి నెన్నుకొనుమని చెప్పగా నతడింకొకరిని తెచ్చుకొనెను. వారిద్దఱకును పోటీ నేనొక్కడనే యనియు, వారి నాల్గుహస్తములకు నా కాలొక్కదానితో పోటీ యనియుచెప్పి, వారిని చేతనైతే నాకాలును (మోకాలి క్రిందిభాగమును) విఱిచివేయుటకు ప్రయత్నించవలసినదని పోటీకఁపిలచితిని. వారు, నాకాలొక కఱ్ఱపుల్లవలె నున్నదనియు, దాని నొంటిచేతితోనే ముక్కలు చేయవచ్చుననియు ననిరి. వా రందునుగుఱించి చింతింపబనిలేదనియు, నిప్పుడు వారలశక్తి పరీక్షింపబడుచుండుటచే తమబలమునంతను చూపవలసినదనియు

నేఁ జెప్పితిని. ప్రేక్షకులందఱు నిశ్చేష్టులై చూచుచుండిరి వారిపుడపును నా పిక్కయెముటియెముకను అతికఠోరముగ నొక్కివేయుచు నాలుగునిముషము లసేపు దానినివిఱుచుటకు ప్రయత్నములు సాగించిరి. నే నపుడు కన్నులు తెఱచి చూచి వారలతో చేతనైనచో కాలువిఱిచి వేయుడనియు, లేనియెడల మఱొకరిని చేతనైనవానిని పిలువుడనియు నంటిని. వా రందుచే మహోద్రేకపూరితులై తమశక్తినంతను వినియోగించి ప్రయత్నించగా వారిముఖములనుండి ముచ్చెమటలు కాఱఁజొచ్చెను నాపిక్కయెముకపైన రెండీగలు వ్రాలినట్లు మాత్రమే నాకనుపించుచున్నదని నేనప్పుడు వారలతోనంటిని. సభాసదులందఱు పకాలున నవ్వసాగిరి. అందుచే, పాపమా మల్లులకు మహోద్రేకముగలిగి వారు నిలువబడి తమశక్తికి మించునంతగ ప్రయత్నము చేసి చేతకాక వణఁకి పోవుచు నేలపైబడిరి. నన్ను పూర్తిగ పరీక్షించుటయైనదని యచ్చటనున్న వారందఱు నొప్పుకొనిరి. మిన్నంతయు రాధాస్వామీధ్వానములతో మాఱుమ్రోగెను. అందఱును నిర్వ్యాజభక్తితో చేతులుమోడ్చి క్షమాపణ వేడుకొనిరి. వారలను సహేతుకవాదముచే నే నొప్పించదొడఁగినచో వారల కర్థమయ్యెడిదికాదు.”

49. పంజాబుపర్యటన మద్భుతముగ సఫలమయి ప్రతికూలపక్షమరితయు నించుమించు నశించిపోయెను. సర్కార్‌సాహెబ్‌వారి యుత్తరాధికారి లభించిరనువిశ్వాసము సత్సంగులకు పూర్తిగ దృఢపడెను. పిమ్మట సాహబ్జీ మహారాజువారు బీహారు ఉత్తరప్రదేశముల పర్యటనము చేసిరి.

50. వా రుత్తరప్రదేశములో మొట్టమొదట వారాణసికి వేంచేసిరి. సర్కార్‌సాహెబ్‌వారి భండారాను ఈస్టరుసెలవులలో మురారులో జరుపవలయునని మొదటలో యోచించిరి. కాని వారాణసిజేరగనె మురారులో ప్లేగు జాడ్యము వ్యాపించినట్లు వార్తవచ్చినందున కార్యనిర్వాహకవర్గము వారాణసిలో 31-3-1914 తేదీన సమావేశమై, సర్కార్‌సాహెబ్‌వారి భండారాను సభాసమావేశమును రెండునుగూడ వారాణసిలోనే జరుపవలసినదని నిశ్చయించిరి

51. సాహబ్జీమహారాజువా రప్పుడు మురారువెళ్ళి మాతాజీగారిని సందర్శించిరి. 7-4-1914న మురారులో కార్యనిర్వాహకవర్గముయొక్క సమావేశమునుగూడ జరిపించిరి. అచ్చటినుండి సాహబ్జీమహారాజువారు తిరిగి వా

రాణసివచ్చినపిమ్మట భండారాను సభాసమావేశమును వారాణసిలో జరిపించిరి. పిమ్మట సాహబ్జీమహారాజువారు అలహాబాదు, బహరేచ్, కాన్పూరు ఇటావాలు పర్యటనముచేసి తిరిగి అంబాలాపట్టణము చేరుకొనిరి. వివిధప్రాంతములనుండియు సత్సంగులు వారు వెళ్ళినపు డీయూళ్లలో సమావేశమయిరి. అందుమూలమున నంతర్భేదకారకులచే ప్రచారము చేయఁబడిన యపోహలన్నియు సత్సంగులమనములనుండి తొలఁగిపోయెను.

52. తాను సర్కార్‌సాహబ్‌వారికి స్థానాపన్నుడనని చెప్పుకొనుచుండినట్లు ప్రతీతిగల సాగర్‌వాస్తవ్యులైన శ్రీపరమానందుగారివద్దనుండి యొకయుత్తరము పంజాబుపర్యటనము చేయుచుండగ సాహబ్జీమహారాజువారి కందెను. ఆయనకు మురారువారియొక్కయు నింకను చాలమందియితరసత్సంగులయొక్కయు ప్రోద్బలముండెను. ఈక్రిందిపుటలలో నాయుత్తరమును సంపూర్ణముగ నెత్తివ్రాసియుంటిమి గావున నదిచదివినచో వేఱుగ విషయవివరణమావశ్యకముండదు.

సాగర్
15-1-1914

పూజనీయప్రియసోదరా,

మాతాజీగారు చేసిన కృత్యములకన్నిఁటికి నామెను లిఖితరూపముగ క్షమాపణమును వేఁడుకొనుమనిగోరుచు నామెకొక లేఖను వ్రాసినట్లు నాకు గొందఱు సత్సంగిసోదరులవలన తెలిసినది. మీరును, బి. విహోల్చందుగారును, సర్దారీగారు నందులో సంతకములు చేసిరట అనగా నా యల్పబుద్ధికి మీరు మువ్వురును ఆక్షమాపణమును గోరుచున్న ట్లర్థమగుచున్నది. నే నిదంతయు నిజమని నమ్మజాలకున్నాను. తమ విధిప్రకార మామె నతిగౌరవముతో జూచుచుండిన సేర్‌జీ, సర్దార్‌జీల వంటి యుత్తమ సత్సంగులు ఆమెవలన క్షమాపణమును గోరు సాహస మేలచేయగలరు? నాకు యధార్థము తెలియకున్నది. కావున నిజస్థితి తెలిసికొనుటకై తమ కీయుత్తరమును వ్రాయస్వతంత్రించితిని. మీరు నా కాశాభంగము చేయరని యాశించుచున్నాను.

హుజూర్ సర్కార్‌సాహబ్‌వారి పవిత్రసమాధినిర్మాణమునకై సభవారు రు 20,000/- లను వెచ్చించుటకు తీర్మానించిరని వినుచుంటిని. సభవారావని నెప్పుడు ప్రారంభింతురో తెలిసికొనగోరుదును.

మా తాజీవారి విషయములో, మీరా రామెనో దార్చిరనియు, నా మెకు భాయీసాహెబ్[1]గారి ఋణబాధ్యతలనుగుఱించి తెలియజేసితిరనియు విన్నాను. భాయీసాహెబ్ గారి వాస్తవస్థితియు తమసొంతస్థితియు నామెకు తెలియుట నిజముగ చాలమంచిది. ఆమెకు మనశ్శాంతి గల్గించుటకు మఱేమిజెప్పిరో నాకు తెలియజేయవీలగునా? నాకుగూడ నామెకును వారిపిల్లలకును సేవజేయవలెనని కోరిక మెండుగనే యున్నదిగాని పరమపిత నన్ను నిరాధారస్థితిలో నుంచుటచే నేనే ప్రస్తుతము నాసోదరులపై నాధారపడవలసియున్నాను.

తమ పవిత్రస్వరూపము నెడల నే నీలేఖలో భక్తిభావము ప్రకటించనందుకు నన్ను క్షమింపవేడుదును. రాధాస్వామీదయాళుదు నాకు భక్తివిశ్వాసముల (బ్రి)దానముచేసి, వారి పవిత్రమానవరూపమందు నాకు హృదయపూర్వకమైన భక్తి నుత్పన్నముజేయుటకై తమరిని నాకొఱకై రాధాస్వామీదయాళుని ప్రార్థనచేయ వేడెదను.

శ్రమ గలుగజేసినందుకు క్షమింపగోరుచున్నాను. ఇందుకు త్వరలో సమాధానమునకై యెదురుచూచుచున్నాను.

హృదయపూర్వకరాధాస్వామీ అభివందనములు.

ఇట్లు,
ప్రేమతో, మీసోదరుడు
పరమానంద్.

---

సాహబ్జీమహారాజువారిందుకు వెంటనే పంపిన సమాధానమునీ క్రింద పొందుపఱచితిమి. దానినిబట్టి వారు జీవులహృదయముల నెట్లు వశీకరణముజేసికొనుచుండిరో బోధపడగలదు.

"దయాశీలప్రియసోదరా!

మీ 15వ తేదీ యుత్తరమందినది. మీరు ఆపైపునగల యితరసోదరులవలె కేవలకింవదంతులను విశ్వసించకుండ వాస్తవవిషయమును దెలిసికొనుటకు నాకు వ్రాసినందుకు మేమెంతయు సంతసించుచుంటిమి. మాముప్పురు మిత్రులమేగాక, ఈషత్పరిజ్ఞానముగల సత్సంగిసోదరులెవరునుగూడ, ముఖ్యముగ

---

(1) "భాయిసాహెబ్‌గారు" అనగా సర్కార్‌సాహబ్ వారి జ్యేష్ఠ సోదరుని పుత్రుడు.

మనపరమపితయొక్క పూజ్యసహభాగినివిషయములో మర్యాదౌచిత్యముల యతిసామాన్యసూత్రములనుగూడ గమనించకుండునంత మూర్ఖత్వముతో ప్రవర్తించనేరరని తమకు నేను దృఢముగ జెప్పగలను. మీ చెవినిబడిన వదంతిమాట కేవలమసత్యము. మనమతమునకు మహావిరోధియయ్యు, బాహ్యముగ మనమిత్రునివలె నటించి మనసంఘీయులకండ్లలో దుమ్ము వోయయత్నించుచున్నట్టి యెవరో దుర్మార్గుని యసంఖ్యాకదుశ్చేష్టలలో నిది యొకటి. మా కందఱకు పరమపూజ్యవర మాతాజీవారియెడలను వారికుటుంబములో నితరులయెడలనుగల హార్దికభక్తిగౌరవములను విశదపఱచుటకై, మేము ఆమెకు వ్రాసిన యుత్తరమునకు నకలు నిందుతో జతపఱచుచున్నాను.

ఇఁక పవిత్రసమాధినిర్మాణవిషయములో నేను ప్రస్తుతములో చెప్పగలిగినది, భాయిసాహెబ్ గా రవలంబించిన భీకరమౌనము మమ్ములఁ గలవరపఱచుచున్నదని మాత్రమే. ఈవిషయమును విమర్శించుటకు హోలీసెలవు రోజులలో సభయొక్క విశేషసమావేశ మొకటి జరుపవలయునని యోచించుచున్నాము. కావున మీ రాసమావేశమునకు దయచేసి మీ యమూల్యసంప్రతింపులచే మమ్ముల లాభాన్వితుల గావించుటకై యొక నిర్వ్యాజసత్సంగి యొక్క హార్దికభావముతో నాచేతనైనంతగట్టిగ మిమ్ములనుగోరుచున్నాను. అట్లు చేసినయెడల మనము దీర్ఘలేఖలతో వృథాకాలక్షేపము చేయనక్కఱ లేకుండ త్వరలో నేదేనియొక యుపయోగకరమయిన పర్యవసానమునకు రాగలము. మీ రిందువిషయమై మీలేఖలో ప్రకటించిన శ్రద్ధోత్సాహములనుబట్టి తప్పక నాయుపపాదననంగీకరించెదరని పూర్తిగనాశించుచున్నాను.

మీరు మీయుత్తరములో చివర వ్రాసినక్షమాపణమునుగుఱించి నేఁ జెప్పవలసిన దేమియులేదు. మీరు మీలేఖాంతమున వ్రాసిన "ప్రేమతో, మీసోదరు" డను పదగుచ్ఛముచే మీకు నాయందుసంపూర్ణమయిన ప్రేమాభిమానములున్నట్లు, కావలసినకన్నునధికముగ, ద్యోతనచేయబడుచున్నదనిమీరు దలంచరా? అయినను, మీయుత్తరములో "తమపవిత్రస్వరూప"మని నన్ను గుఱించి మీరెందులకై వ్రాసిరో దయచేసి నాకు తేటపఱచగోరుదును. మనల నిరువురను లోకులు సిజధారను పొందినవారిగ ననుమానపడుచున్నట్లు మీకు తెలుసునుగదా. నిన్ననే సాగర్ నుండి ఠుల్లాసింగును మఱికొందఱు నిచటకు వచ్చి, రేపోమాపో మేమందఱమునుగూడ మీపాదములవద్ద మ్రొక్క వలసి

యుండునని మాతో దృఢముగ జెప్పిరి. మీలో నిజధారప్రవేశించినట్లు మీకు నిజముగ నమ్మకమున్న యెడల, నన్నుగుఱించి "తమపవిత్రస్వరూపము" మొదలగు పదగుచ్ఛములను ప్రయోగించి, దానినెందులకు న్యూనతపఱచు చుండిరో నాకవగాహనయగుట లేదు. అట్లుకానిచో మీరు 8, 10 వ్యక్తులను మిమ్ముల నవతారస్వరూపులుగ భావించనిచ్చుటలోను, వారు మిమ్ములను "పరమపిత, పరమపురుషపూరన్ ధనీ" వగైరాపదములతో సంబోధించినపుడు వారిని వారించకుండనుండుటలోను, మీయుద్దేశ్యమేమోకూడ నాకవగాహన గాకున్నది.

ఈనిష్కపటవాక్యములకు క్షమింపవేడుచు నిందుకు దయతో త్వరిత ముగ సమాధానము నంపెదరని యాశించుచున్నాను. ప్రేమసహితాభివందన ములు. హృదయపూర్వక రాధాస్వామీ.

ఇట్లు,
ప్రేమపూర్వకముగ,
ఆనందసరూప్

పునర్లిఖితము: ఇంకొక విషయమేమనగా (శ్రీ)నిహాల్చందుగారీయుత్తర మునకు మీవద్దనుండి సమాధానమువచ్చువఱకు అనోఖచందుగారి యుపదేశ మునకై వ్రాసికొన్నపత్రమునంపుచు మీరు 10-1-1914 న వ్రాసినయుత్తర ముపై నెట్టిచర్యను తీసికొనుటకు నిరాకరించుచున్నారని మీకు తెలియజేయు చున్నాను."

53. ఇవ్విధమున (శ్రీ)పరమానందుగారితో నుత్తరప్రత్యుత్తరము లింకను చాలవఱకు జరిపినపిమ్మట (శ్రీ)పరమానందుగారికి తమతప్పవగాహనయయ్యెను. ఇటులనే వివిధస్థలములలోని చాలమంది యితరసత్సంగులతోగూడ నధికముగ నుత్తరప్రత్యుత్తరములుజరిగినవి. కాని, వివిధవిషయములలో నితరులతో ప్రవ ర్తించుటలో సాహబ్జీమహారాజువారికిగల యద్భుతచాతుర్యముచే నతి శీఘ్ర కాలములోనే సత్సంగవాతావరణమంతయు నిర్మలమయి, సత్సంగులందఱును తమకును సత్సంగమునకుగూడ ప్రతిభ పెంపొందునట్లుగ, వారిశరణ్యములోనికి వచ్చిరి. ఆసమయమునాటి యుత్తరప్రత్యుత్తరములు చదువుటకు రుచికరము గనే యుండునుగాని స్థలముచాలనందున నిచ్చట వానిని పొందుపఱుచలే కుంటిమి.

**54.** సాహబ్జీమహారాజువారు 7-4-1914 తేదీని మురారులోనుండగ, సభ తరఫున సర్కార్‌సాహెబ్‌వారి తండ్రిగారితో, సర్కార్‌సాహెబ్‌వారి పవిత్ర సమాధినిర్మాణమువిషయమై వివరముగ చర్చించిరి. అప్పుడు సాహబ్జీమహారాజువారు సభవారికి జ్వాలాప్రసాదుసిన్హాగారివలన రావలసినబాకీని రాబట్టుకొనుట కెట్టిసావకాశమును లేదన్నవిషయమును సర్కార్‌సాహెబ్‌వారితండ్రిగారికి విశదపఱచిరి. కాబట్టి శ్రీజ్వాలాప్రసాదుసిన్హాగారి బాకీ రు 55 000/- లకుగాను, వారికుటుంబముతాలూకు తోట సర్కార్‌సాహెబ్‌వారి కెక్కువ ప్రియముగనుండెడిదిగావున (అందులో నొకభవనము అదివఱకే కట్టించబడియుండెను) పవిత్రకుటుంబమువా రాతోటను దానిలోనున్నభవనమును, సభవారికి అమ్మివేసినయెడల సభవారు సమాధినిర్మాణమును త్వరలో ప్రారంభించుటకు వీలగునని సాహబ్జీమహారాజువారు సెలవిచ్చిరి. అవ్విధముగ సభవారి బాకీగూడ పూర్తిగ తీరిపోవును కాని సర్కార్ సాహెబ్‌వారి తండ్రిగారు కుటుంబాస్తి నమ్మటచే కుటుంబగౌరవమునకు భంగకరముగనుండునని చెప్పి యీ ప్రతిపాదనను నిరాకరించిరి. అంతట సాహబ్జీమహారాజువారు, తోటవగైరాలను సభకు దానముగ నిచ్చినట్లు వ్రాసినయెడల సభకు రావలసినబాకీని సభవారు పూర్తిగరద్దుజేసెదరని మఱొకప్రతిపాదనను జేసిరి ఈప్రతిపాదన సర్కార్‌సాహెబ్‌వారితండ్రిగారికి నచ్చినట్లుకనిపించి, వా రందువిషయమై యాలోచించుటకు 15 దినములుగడువును గోరిరి

**55,** 14-4-1914 తేదీన మురారులోనున్న మాతాజీవారివద్దనుండి యొక తంతివార్త యివ్విధముగవచ్చెను.

"మీరు నోటిమాటగ వాగ్దానముచేసిన ప్రకారము సమాధినిర్మాణము నెప్పుడు మొదలుపెట్టెదరు? ఇంక నాలస్యము చేయుట నాకిష్టములేదు. మీరు అంబాలాకు తిరిగివెళ్ళిపోకముందే ప్రారంభించవలయునని గోరుచున్నాను."

అందుకు సమాధాన మారోజుననే తంతిమూలముగ నిట్లువ్రాసిపంపిరి:—

"బడేసర్కార్‌సాహెబ్‌వారు కోరినప్రకారము వారి నిశ్చయాత్మకమయిన సమాధానము అందినతర్వాత"

ఏప్రిల్ 15వ తేదీన సర్కార్‌సాహెబ్‌వారి తండ్రిగారివద్దనుండి యివ్విధముగ తంతివచ్చెను :—

"సర్కార్ సాహెబ్ వారి సమాధికి స్థలము లభ్యముగనున్నది. దుల హిన్‌జీ కోరికప్రకారము వెంటనే నిర్మాణమును ప్రారంభించవచ్చును. తోటలో సమాధి నొప్పుకొనుటకు వీలులేదు"

అందుకు సభా కార్యదర్శి యీక్రిందివిధమున సమాధానమునంపెను:— "సాహబ్జీమహారాజువారిపేర నంపిన టెలిగ్రాము అందినది. భాయిసాహెబ్ సభవారు కోరినప్రకారము, కనీసము వెయ్యిరూప్యముల నెప్పుడివ్వగలరో వెంటనే తంతినంపుడు. సమాధినిర్మాణమునుగురించియే ఆలోచించుచు న్నాము."

ఏప్రిల్ 16వ తేదీన మురారులో మాతాజీవారివద్దనుండి యీక్రింది విధమున తంతివచ్చెను:—

"సర్కారుకు నిహాల్చందిచ్చినతంతిలో నాకు సమాధానము లేదు. సమాధినిర్మాణమునకు బాకీనసూలుతో సంబంధము లేదు. దయచేసి వాగ్దాన ప్రకారము నాతంతికి సమాధానమునిండు."

ఇంతలో సాహబ్జీమహారాజువారు వారాణసినుండి వెళ్ళిపోయినందున వారికి పైతంతి తపాలాద్వారా బహరేచ్‌లో 19-4-1914 తేదీన అందినది. దానికి సమాధానమును 20-4-1914 తేదీన ఈక్రిందివిధముగ మాతాజీగారికి పంపించిరి :—

"తంతి నిన్ననే అందినది. భాయిసాహెబు సభయొక్క అధికారమును బుద్ధిపూర్వకముగ నిరసించుచున్నారు. అందుచే గోరబడిన కనీసపుమొత్తమును నిర్మాణము ప్రారంభించుటకు ముందుగనే చెల్లించుట, నమ్మకము గల్గించుటకు ముఖ్యావసరము."

56. వారాణసిలో 12-3-1914 తేదీన జరుపబడిన సభయొక్క ఆఱవ సమావేశములో, సభను తృప్తిపఱచుటకై భాయిసాహెబ్‌గారిని ప్రస్తుతము రూ. 1,000/-లు చెల్లించమని గోరవలసినదనియు, మిగిలిన బాకీని ఉభయ పక్షములకు ననుకూలముగను, అంగీకారముగనున్న ప్రకారము వాయిదాల మీద తరువాత చెల్లించవచ్చుననియు తీర్మానించబడిన దనువిషయము నిచ్చట చెప్పవలసియున్నది. ఈతీర్మానమున కొక నకలును భాయిసాహెబ్‌గారికి 20-3-14 తేదీన రిజిస్ట్రీపోస్టుద్వారా పంపించి సర్కార్ సాహెబ్ వారి తండ్రిగా

రికి వాచా తెలియజేసిరి. కాని భాయిసాహెబ్‌గారి వద్దనుండి యీతీర్మాన మందినట్లైనను తిరిగి కబురు రాలేదు.

57. కావున, నీపవిత్రసేవలో పాల్గొనుటకు హృదయపూర్వకాభిలాష యుండిననుగూడ, సభయొక్క పాలనవిధానమును నాశనముచేసి, కేంద్రసత్సం గమునుగుఱించి యసత్యతుచ్ఛవదంతులను బుట్టించి ప్రాపకము చేయుచుూను కొన్నవారి హస్తములలో నంధప్రాయముగ ద్రవ్యమును పోయుట కెవ్వరు నియ్యకొనరని, 115-1914 తేదీగల ప్రకటనపత్రముద్వారా, సభకు సంబం ధించిన సత్సంగులందఱకును బాహ్యసత్సంగములకును తెలియజేయుట యావ శ్యకమని యెంచిరి. సత్సంగులను సమాధినిమిత్తమైగాని, భండారానిమిత్తమై గాని భేంటును మురారు పంపగాదనిగూడ నా పత్రములో నిషేధించిరి. సభ వారు భండారాఖర్చులకుగాను 1913 సం॥రము డిసెంబరునెలలో భాయిసా హెబ్‌గారి కిచ్చిన రు. 1000/-లకును, అప్పుడు భేంటుక్రింద వసూలయిన మఱొక రు. 1000/-లకునుగూడ నాయన లెక్కచెప్పలేదనిగూడ నందఱకు దెలియవఱచిరి కావున నాయనతో నిఁక లెక్కలు తేల్చుకొనునాశ లేనట్లు స్పష్టమాయెను.

58. ఇంతకు ముందుదహరింపబడినవారును మురారువారునుగాక నింకను చాలమంది యితరులుగూడ సాహబ్జీమహారాజువారికి వ్యతిరేకముగ, నుత్తర ములు ముద్రితపత్రములు ముద్రితసంచికలు మొదలగువానిద్వారా, తీవ్రప్ర చారము చేయుచుండిరి. "కంగాల్ కంపెనీ" అనుపేరుతో గొందఱువ్యక్తు లేకమయి యెన్నోకరపత్రములను పంచిపెట్టిరి, శ్రీబ్రహ్మదేవనారాయణగారు ఒకయెజ్జుసంచికను ప్రకటించిరి, జహనాబాదు సత్సంగబాహ్యంచివా రొకకరపత్ర మును పంచిపెట్టిరి, వగైరావగైరా. వీరందఱును మురారుసంఘటనలకును, సాహబ్జీమహారాజువారు సర్కార్‌సాహబ్ వారి నిర్యాణానంతరము తొందరగ మురారునుండి వెడలిపోయినందుకును సాహబ్జీమహారాజువారిమీద నెపముల నెన్నుచుండిరి తాము మురారునుండి యాకస్మికముగ వెడలిపోవుటకు కారణ ములను సాహబ్జీమహారాజువారే యొకయుత్తరములో నిట్లువిశదపఱచిరి "మే మందఱము నచ్చటనే యుండిపోయినచో సత్సంగులందఱును గురుదేవప్రసాదు గురుముఖశరణులవద్దనుంచిన ఫిక్సెడ్‌డిపాజిట్ల (Fixed Deposits) మొత్తము రు 25000/-లను తిరిగి తమకిచ్చివేయుమని నిర్బంధించియుందురు. అప్పుడు జ్వాలాప్రసాదుసిన్హాగారి కెట్టిక్లిష్టపరిస్థితి యేర్పడియుండునో సులువుగ నూహిం

చుకొనవచ్చును. ఇంతియుగాక చాలమందిసత్సంగులు తాము సభవద్ద కరెంటు ఎక్కౌంటు (Current Account)లో నుంచిన మొత్తములను వెనుకకుత్రీసికొన గోరిరి. అట్టిమొత్తములు రు. 6000/-ల వఱకు నున్నవి. కాని సభఖజానాలో నప్పుడు రు. 4,000/-లు మాత్రమే యుండెను. కావున నాపరిస్థితులలో మేము అపవాదునంతను మామీదనే వేసికొని మురారునుండి వెడలిపోయి శ్రీబ్రహ్మాలా ప్రసాదుసిన్హాగారికి మనఃక్లేశమును అపఖ్యాతియు గలుగకుండ తప్పించితిమి. అప్పటిలో నింతకన్న చేయుతగ్గది మఱేమియు లేదు."

59.- కేంద్రీయపాలకసమితి (Central Administrative Council) కూడ సత్సంగమున కిక్కట్లు గలిగించుతలంపుతోనే యుండి, సాహబ్జీమహారాజవారి యొక్కయు సభయొక్కయు కార్యకలాపములను దూషించుచు నుత్తరములను వ్రాసెడివారనువిషయ మిచ్చట నుదహరింపవచ్చును. సాహబ్జీమహారాజవారి సింధుదేశపర్యటనమునుగుఱించి శ్రీప్రేమప్రసాదుగారు, "ఆయన శృంగభంగ మొంది తిరిగివచ్చె"రని వ్రాసిరి. సాహబ్జీమహారాజవా రట్లుగాక 6-1-1914 తేదీ అంతముందుగనే, కేంద్రీయపాలకసమితికార్యదర్శిగారికి, సత్సంగులంద ఱును సత్సంగవ్యవహారములను సామరస్యముతో నెఱవేర్చుకొనుచు కొన్ని ప్రధానసమయములం దందఱును కలిసిమెలిసియుండుటెట్లువీలగు ననువిషయ మునుగుఱించి యుభయపక్షములవారును కలిసికొని పర్యాలోచనచేయవలసి యున్నదని వ్రాసిరి కొన్నియుత్తరప్రత్యుత్తరములు జరిగినపిదప నెట్లయినను, కేంద్రీయపాలకసమితి (Central Administrative Council) కట్టియుద్యమ మునం దభిరుచిలేనట్లు స్పష్టపడెను. కాని సావకాశము లభించినపుడెల్ల సభవా రందువిషయమై యత్నములను సాగించుచునేయుండిరి.

60 ఈపర్యటనము లయినపిదప, సాహబ్జీమహారాజవారు అంబాలాపట్ట ణము వెళ్ళి అచ్చట కొద్దిరోజులుండి, వేసవిలో సోలన్ వెళ్ళి వేసవికాలమం తయు నచ్చటనే గడిపిరి. ఆసమయములో, సిర్మూరుయెస్టేటునుండియు, చుట్టు ప్రక్కలకొండప్రదేశములనుండియు, పంజాబుప్రాంతములనుండియు సత్సం గులు చాలమంది యచ్చట సత్సంగమునకు వచ్చిరి.

## దయాల్బాగు స్థాపనము

61. ఒకభయంకరఝంఝామారుతమువలె చెలరేగిన ప్రతిపక్షప్రచార మంతయు 1914వ సం॥రము మేనెలనాటి కించుమించు పూర్తిగ చల్లారి కొద్ది

దురదృష్టవంతులుదక్క తక్కినసత్సంగులందఱును సాహబ్జీమహారాజువారిని సద్గురువుగ స్వీకరించిరి. అందుచే సాహబ్జీమహారాజువారును సభయును క్రొత్త కార్యకలాపములను చేయబూనుకొనిరి తగువిమర్శలు సల్పినపిదప సభ కార్యదర్శిగారు అందఱసత్సంగులకును, ఆగ్రాలో సత్సంగ కేంద్ర మేర్పాటు చేయవలసిన యావశ్యకతనుగూర్చి వివరించుచు 1-6-1914 తేదీన నొక ప్రక టనకరపత్రమును పంపించిరి. ఆకరపత్రము నీక్రింద పొందుపఱచితిమి:-

మకాము, సోలన్
1, జూన్ 1914

ప్రియసోదరా!

ఆగ్రాపట్టణమున సత్సంగ కేంద్రమును స్థాపించవలెనని హుజూర్ సాహబ్జీమహారాజువారి యభిప్రాయము. హుజూర్ సర్కార్ సాహబ్ వారు చాలసార్లివ్విధముగ సూచనజేసిరి. ఈవిషయములో హుజూర్ స్వామీజీమహా రాజువారికిని హుజూర్ మహారాజువారికిని మహారాజసాహబ్ వారికిని గల యుద్దేశ్యములు వార్ల ప్రవచనములనుబట్టి విస్పష్టమే. కావున, పరమపురుష పూరన్ ధనీ స్వామీజీమహారాజువారి రాబోవు భండారాసమయములో నిందు కొఱకు ప్రత్యేకముగ భేంటునిచ్చువారలజాబితాను తయారుచేయఁదలఁచితిమి. పిమ్మట, స్వామీబాగునకు ప్రక్కనో యెదురుగనో తగినస్థలమునుకొని యం దులో భవనములను కట్టించవలయుననియు లేదా లభ్యమైనచో కట్టించినభవన మునే కొనవలయుననియు నుద్దేశ్యముగలదు.

ఈవిషయములో సత్సంగిసోదరులెవరును తమశక్తినిమించి భేంటునీయ వలదనియు, సునాయాసముగ ద్రవ్యసహాయము చేయగల్గినసోదరులుమాత్రమే భేంటు నీయవలసినదనియు, హుజూర్ సాహబ్జీమహారాజువారి యుద్దేశ్యము. ఈ యుద్దేశ్యము నొనగూర్చుటకై యీక్రింది సలహా లీయబడుచున్నవి:-

1 ఏ సోదరుడును రు. 50/-లకు మించి భేంటు నీయరాదు.

2. 7-9-1914వ తేదీనాటికి ద్రవ్యమును చెల్లించగల్గిన సోదరులు మాత్రమే తమపేర్ల నీయవలెను.

3. స్వల్పాదాయవర్గమునకు జెందిన సోదరులెంతమాత్రము భేంటు నీయనక్కఱలేదు. రు. 5/-ల కన్న తక్కువభేంటు నీయఁదలఁచిన సోదరులు,

మణిఆర్డరిద్దతితో గలిసి, మొత్తము రు 5/-లు గాని అంతకన్న నెక్కువగాని యగునట్లు జమచేసి పంపిన బాగుండును.

4 బ్రాంచిసత్సంగములకు జెందిన సోదరులు తమ భేంటు నాయా బ్రాంచిల కరెస్పాండెంట్లద్వారా పంపించుట ప్రశస్తముగ నుండును.

హృదయపూర్వక రాధాస్వామీ,

ఇట్లు
ప్రేమపురస్సరముగ భవదీయుడు
స్వామీచరణ్
సహాయ కార్యదర్శి
రాధాస్వామీ సత్సంగ సభ
అంబాలా పట్టణము.

62. 7-6-1914 తేదీన పరమగురు స్వామీజీమహారాజువారి భండారా సోలనులో జరుపబడెను. ఆ పవిత్రసమయమందు సత్సంగమున కొక శాశ్వత కేంద్రస్థానమును స్థాపించుటకై ప్రత్యేకభేంట్ల పట్టీ యొకటి తయారుచేయ ప్రారంభించిరి. వేసవికాలము గతించినపిదప సాహబ్జీమహారాజువారు, 1914 సం॥రము సెప్టెంబరు నెల రెండవవారము దరిదాపులో పరివారసమేతముగ నంబాలాపట్టణమునకు వచ్చిరి. పరమగురు మహారాజసాహబ్ వారి భండారాను 1914 సం॥రము సెప్టెంబరు 27వ తేదీన అంబాలాలో జరిపించిరి. అటుపైన నందఱు నాగ్రా వెడలిరి. వచ్చిన పరివారమందఱకును ప్రే. భా. మధురాప్రసాదుగారు "నాలాపీపల్మండీ"లో వసతి నేర్పాటుచేసిరి. కాని ఆ యేర్పాటు సరిపోనందున కొంతకాల మయినతర్వాత వారందఱును మహాత్మా గాంధీరోడ్డునసున్న డాక్టరు నారాయణప్రసాద ఆస్థానాగారి భవనమునకు మారిరి. ఆరోజులలోనే రాధాస్వామీ విద్యాసంస్థ (Radhasoami Educational Institute) ప్రస్తుతమున్న స్థలమును కొనిరి. హుజూర్ మహారాజువారి భండారా డిసెంబరు 27వ తేదీన జరిపించిరి. రాధాస్వామీ సత్సంగసభ వార్షికసమావేశమును డిసెంబరు 29వ తేదీన జరిపించిరి. సత్సంగ కేంద్రస్థానము నాగ్రావద్ద స్థాపించవలయుననియు, నొక సంవత్సరములోపున ఏబదివేల రూపాయలు జమఅయినచో వారశాలకొఱకొక భవనమును నిర్మించుట ప్రారంభించవలయుననియు సభవారీసమావేశములో తీర్మానించిరి.

63. 1932 సం॥రము జూబిలీ యుత్సవసమయమున సాహెబ్జీమహారాజా వారు సెలవిచ్చిన యుపన్యాసములో, దయాల్బాగు స్థాపించు సందర్భములో వారికి గల్గిన యాటంకములను గుఱించి యీక్రిందివిధముగ వర్ణించిరి:-

"పరమపిత కటాక్షముచే మూడుమాసములలోపలనే రు. 5000/-లు జమవచ్చినవి. మే మీదరిద్ర్యముతో ధనాఢ్యులవలె నాగ్రా యేతెంచితిమి. మమ్ము కేంద్రస్థానమును స్థాపించుటకు పూర్తిగ నిశ్చయము చేసికొనియుంటిరా యని కొందఱు ప్రశ్నించిరి. మే మట్లే నిశ్చితచిత్తులమై యుంటి మని చెప్పి, యందుకు తార్కాణముగ మావద్ద రు. 5,000/-లు గూడ నున్న వని సమాధానము చెప్పితిమి. అంతట లాలా రాజనారాయణగారు, "మీ రాగ్రాలో కేంద్రస్థానమును రు.5,000/-లతో స్థాపించదలఁచితిరా?"యని హేళనగ ననిరి. ఈ మహాత్కార్యమునకు రు. 5,000/-లు చాల తక్కువమొత్త మని మా కప్పుడే మొట్టమొదట యవగాహన యయ్యెను. ఏమయిననేగాక, మేము స్థలమున కన్వేషణ ప్రారంభించితిమి. ఇప్పుడు దయాల్బాగు నిర్మాణశాఖా కార్యాలయము (Construction Department) ఉన్న భవనమును బేర మాడగా, దాని యజమాని రు. 5,000/-ల మూల్యమును గోరెను. అందుకు మే మంగీకరించితిమి. కాని యా మఱునాడతడు తిరిగివచ్చి రు. 6,000/-లను కోరెను. మేమందుకుగూడ నంగీకరించి బేరమును స్థిరపఱచితిమి. కాని యతడు తిరిగి రూ. 6,500/-ల మూల్యమును గోరెను. అందుచే మాకు నిరుత్సాహము గలిగి నిరాశచే వెనుకకు పోఁదలఁచితిమి. ఇంతలో మావద్ద కొక సాధువు వచ్చి "హుజూరువారు వచ్చియుండిరి గావున కనీస మొక గజ మెత్తుగల గోడనైన కట్టించినపిమ్మటనే యిచ్చటనుండి వెళ్ళవలయును. లేనిచో లోకులు సత్సంగమును బూటకసంఘమని యనెదర"ని చెప్పెను. అందుచే మే మాగ్రా నుండి మఱలిపోవు తలంపును గట్టిపెట్టి మఱల నింకొకసారి యాస్థలమును వెళ్ళి చూచితిమి. అచ్చట బాబా కేసరిదాసు మాకగుపించి యాయనగూడ మేమట్లు వెనుకంజవేయుట యుక్తముకా దనెను. మాకు ఆయన ప్రస్తుతము రాధాస్వామీవిద్యాసంస్థయు (Radhasoami Educational Institute) పవిత్రమైన బావియు నున్నట్టి స్థలమును చూపించిరి. అప్పటిలో నాస్థలమంతయు నతికఠ్మలముగ నుండి పెద్దపెద్దగోతులతోను యిసుకతిన్నెలతోను నిండియుండెను. కాని బాబా కేసరదాసు మే మడుగిడినచో నెల్ల నెలఁదోఁటగ మాఱిపోవునని చెప్పెను. ఎట్టకేల కాస్థలమును కొనుటకు మేము నిశ్చయించుకొని,

చివరకు రు. 1975/-లకు బేరముతేల్చుకొని, క్రియమునకు తీసికొంటిమి. అప్పుడు ఖచడీతో నొక రాజార్హమయిన విందుచేసి యుత్సవప్రియముగ నానందించితిమి. అందుకు రు. 10/- 8అణాలు ఖర్చుపఱచితిమి.''

64 1915 సం॥రము జనవరి నెల 20వ తేదీ వసంతపంచమీ సుదినమున సాహబ్జీమహారాజవారొకకంబళి (పట్టుపురుగు) చేయును నాటి దయాల్బాగు నకు శంకుస్థాపనముజేసిరి. పరమపురుష పూరన్ ధనీ హుజూర్ స్వామీజీమహా రాజువారు హుజూర్ రాధాస్వామీ దయాళుని మహాశుభసందేశమును ప్రక టించి చెప్పినది వసంతపంచమీ శుభదినమున. దయాల్బాగు స్థాపించినదికూడ తిరిగి వసంతపంచమీ శుభదినముననే.

65. మఱొకప్పుడు సాహబ్జీమహారాజువారిట్లు సెలవిచ్చిరి, ''పాఠశాల భవనమును నిర్మించుటకై ఇటావాలో నొక గుత్తెదారుడు (Contractor) గ నున్న సత్సంగిసోదరుడు సేవ చేసెదనని సిద్ధమాయెను. అటులనే ముకుందు డనెడి మఱొక సత్సంగికూడ సేవకు సిద్ధముగ నుండెను అనగా. గుత్తదారుని చీఫ్యింజనీయరుగాను, ముకుందుని నాయనక్రింద పనిచేయునట్టి ఇంజనీయరు గాను నియమించి, వారిని మఱునాంటినుండియు పని మొదలుపెట్టి దీక్షగ పని చేయుమని చెప్పితిని. భవననిర్మాణమనగ నెంతకష్టమో నా కప్పుడేమియు తెలియదు. నేను తగిన భవనమును నిర్మించవలసిదని మాత్రమే వారితో చెప్పి తిని. అప్పుడు నేనాపరమపిత నిట్లు ప్రార్థించితిని, ''ప్రభో, మేము పూర్తిగ నజ్ఞులము! మాకు పేరుప్రతిష్ఠలు లేవు. అర్థబలము లేదు. మే ముత్తదిక్కు లేని నిరుపేదలము. తాము నన్ను ముందు వెళ్ళుమని యుత్తరువిచ్చి నా వెంట తాము వత్తుమని గూడ సెలవిచ్చిరి. దయచేసి తమరువచ్చి మామర్యాదను గాపాడుడు!'' హుజూర్సర్కార్ సాహబ్ వారు వెంటనే నాకు దర్శనమిచ్చి ఆభవనమునకు నమూనాను విశదపఱచిరి. ఆగుత్తదారునకు నేనానమూనాను వివరించి యందుకుపయోగించవలసిన సామానునుగుఱించి గూడ జెప్పితిని. అతడు బజారునకువెళ్ళి సెంటుజాన్స్కాలేజీ (St. John's college) వారివద్ద నుండి రు. 900/-లు విలువగల సిద్ధముగనున్న సున్నమును కొనితెచ్చెను. అతడొక యిటికల ఆవమునకుపోయి రు. 500/-లు బజానాయిచ్చి యిటికలను బేరముచేసికొనివచ్చెను. ఆమఱునాపునాడే పునాదులుత్రవ్వి గోడనులేపిరి.

## ఉద్దేశ్యాదర్శములు

66. 1918 సం॥రములో ప్రకాశితమయిన "ప్రేమసందేశ్" అను మాస పత్రికలో "సూతేండ్లకిత్రము" అను శీర్షికతో వ్రాసిన వ్యాసములో దయాల్బాగుస్థాపనయొక్క యుద్దేశ్యాదర్శములును అందు విషయమై రాధాస్వామీ మతముయొక్క వెనుకటి సద్గురువుల యుత్తరువులును సవిస్తరముగ వర్ణించబడినవి. ఆవ్యాసములో నిందుగుఱించిన విషయవివరణము సంపూర్ణముగను, బహురుచికరముగను వ్రాయబడియుండినందున నందుండి కొంతభాగము నీ క్రిందనెత్తి వ్రాయుటయైనది:-

"దయామయులయిన స్వామీజీమహారాజువారు ఆగ్రాపట్టణమున కావల నొకసత్సంగులవలన కొంతకాలమయినపిమ్మట నేర్పడగలదని తెలుచు సెలవిచ్చుచుండెడివారు......హుజూరుమహారాజువారు సత్సంగముయొక్క దినదినాభివృద్ధినిగాంచి, సత్సంగకార్యములనిర్వాహము దీర్ఘకాల మొకరిద్దఱు సత్సంగులచే గానేరదనియు గొంతకాలమైనపిదప, సత్సంగవ్యవహారములను తృప్తికరముగ చక్కబెట్టుటకు సత్సంగమున కొకపాలకసమితిని స్థాపించవలసియుండుననియు సెలవిచ్చెడివారు. అందువలననే మహారాజసాహబ్ వారికాలములో 1902వ సంవత్సరములో నొకపాలకసమితియు 1904వ సంవత్సరములో నొక ధర్మకర్తృవర్గము నేర్పాటుకాబడినవి. సత్సంగులు అధికసంఖ్యాకులు సత్సంగకేంద్రస్థానమునకువచ్చి నివసించెదరనియు, వారల సౌకర్యములనిమిత్తము సత్సంగమున కొకబ్యాంకు, నొకకళాశాలయు, నొకయంత్రశాలయు (Factory) నొక ఆసుపత్రియు (Hospital) మున్ముందుండగలవనియు మహారాజసాహబ్ వారు వివిధసమయములందు సెలవిచ్చుచుండెడివారు... ..మహారాజసాహబ్ వారి యాదేశములప్రకారము ఆగ్రాలో సత్సంగకేంద్రమును స్థాపించి, యచ్చట సత్సంగులు నివాసముండి జీవికోపార్జన చేసికొనుట కేర్పాట్లు చేయవలయునని సర్కార్ సాహబ్ వారుగూడ తమ కాలములో సెలవిచ్చుచుండెడివారు."

67. అమెరికాదేశపు క్రైస్తవమతప్రచారకసంఘమువారి విచారణసమితి (American Christian Missionary Commission) యైన లిండ్సేకమీషను (Lindsay Commission) 1931 సం॥రములో దయాల్బాగునచ్చి సాహబ్జీమహారాజువారిని సందర్శించినపుడు, దయాల్బాగును స్థాపించుటలో నుద్దేశ్యాదర్శములను గుఱించి సాహబ్జీమహారాజువా రిట్లుస్పష్టీకరించిరి:-

1. ఈ వలసయు నిందలి సంస్థలును మా పరమపూజ్యసద్గురువుల యాదేశములప్రకారము స్థాపించబడినవి.

2 ఆధ్యాత్మికసాధనలను జయప్రదముగ నభ్యాసముజేయుటకై యభ్యాసి స్వకాయకష్టముచే న్యాయముగ సంపాదించిన ద్రవ్యముతోనే జీవించవలయునని మామతములో నొకముఖ్యసిద్ధాంతము. అందుచే సత్సంగులకు న్యాయసమ్మతమైన పరిశ్రమజేసి జీవికోపార్జన గావించుకొను సావకాశములను కల్పించునిమిత్త మీవ్యాపారపరిశ్రమసంస్థల నేర్పాటుచేసితిమి.

3. తమ యాధ్యాత్మికాభివృద్ధి నిమిత్తము చాలమందిసత్సంగులు సత్సంగకేంద్రస్థానమునం దుండగోరుదురు. వారు నిర్వ్యాపారముగ కూర్చుండ గూడదుగావున వారలకు పనులు కల్పించుట యావశ్యకమాయెను.

4 కొండఉపరిజ లోకస్థలమున నివసించుచుండినపుడు విద్యాభ్యాసమున కేర్పాట్లుజేయుట యవసరము. అందుచే నీవిద్యాసంస్థలయేర్పాటు జరిగినది

5. సాంకేతికార్హతలు (Technical Qualifications) గలవారు హిందూదేశముయొక్క యభివృద్ధికవసరము. అందుచే టెక్నికల్ కాలేజీ వగైరా లేర్పాటుచేయబడినవి.

68. అజ్మీరువాస్తవ్యులు దివాన్ హరబిలాసశారదాగారు 1932 సెప్టెంబరునెలలో దయాల్బాగువచ్చినపుడు సాహబ్జీమహారాజువారు దయాల్బాగు స్థాపనయొక్క యుద్దేశ్యమునుగురించి యీ క్రిందివిధముగ సెలవిచ్చిరి:

"జాతులకభ్యుదయము వారలలో నద్భుతప్రజ్ఞాసంపన్నులగు నాత్మలుండుటవలననే గలుగుననియు, నట్టియాత్మలయభావముచేతనే జాతులపతనము సంభవించుచుండుననియు, నట్టియాత్మలు తమకార్యములను సాధించుటకు సావకాశమున్నజాతులలోను, దేశములలోనే జన్మించుచుందురనియు మానమ్మకము. అందుచేతనే మేము దయాల్బాగులో హిందూదేశమునకు సహజమైన నిర్మలాధ్యాత్మికవాతావరణమును స్థాపించి, అందుతోబాటే పాశ్చాత్యదేశములలో లభ్యమగునట్టి వ్యక్తిస్వాతంత్ర్యమును పరిశ్రమసావకాశములనుగూడ నిచ్చుట గల్పించుటకు ప్రయత్నముచేయుచున్నాము"

## "దయాల్బాగు" నామకరణము

69. తాము విహారార్థమై నడకకుపోవుచుండిన స్థల మొకానొకరోజున సత్సంగుల వలసపట్టణము కాగలదని స్వామీజీమహారాజువా రెట్లుభవిష్య వాణిని చెప్పిరను ప్రతీతిగలదో, సరిగనట్లే హుజూర్ మహారాజువారు తమకుమారుడు లాలాఅయోధ్యాప్రసాదుగారి పుత్రుడైన దయాళ్ ప్రసాదు అనుపిల్లవాడు చనిపోయినపుడు ఆచనిపోయినపిల్లవానిపేరుతో నొకపెద్దవలస, ప్రస్తుతముదయాల్బాగున్న స్థలమునుజూపి, యచ్చట బయల్వెడలునని చెప్పి యయోధ్యాప్రసాదుగారి నోదార్చిరనిగూడ ప్రతీతిగలదు. అందుచే సాహబ్జీమహారాజువా రీవలసకు 'దయాల్బాగు' అని నామకరణముసేయుట యొకవింతగాదు. అదియునుగాక, 1915 సం॥రములో సాహబ్జీమహారాజువా రీవిషయము నింకొక విధమున విశదపఱచిరి. సత్సంగులు ఆపరమపురుషుని సర్వసాధారణముగ "హుజూర్ రాధాస్వామీదయాళ్" అనిసంబోధించుదురు. హుజూరీబాగు, రాధాబాగు, స్వామీబాగు అను మూడుతోటలు ఇంతవఱకు సత్సంగమునకు గలవు. కావున "హుజూర్ రాధాస్వామీదయాళ్" అనునామమునకు సంపూరణార్థమై యిప్పుడు స్థాపించిన ఈవలసకు 'దయాల్బాగు' అని నామకరణము చేసితిమనిరి.

## ఈవలసయభివృద్ధి

70. ఇవ్విధమున స్థాపితమయిన దయాల్బాగువలస నెమ్మదిగ నిరంతరాభివృద్ధి నొందుచుండెను. 15-11-1916 సం॥రము తేదీనుండి సత్సంగకేంద్రము దయాల్బాగులో స్థాపితమగుననియు హుజూర్ మహారాజ్ వారి భండారా డిసెంబరు 27వ తేదీన నచ్చటనే జరుపబడుననియు నందఱకు నొకప్రకటనపత్రమును 5-11-1916 తేదీన పంపించిరి. ఆప్రకటనపత్రములో 1-1-1917 తేదీన రాధాస్వామీవిద్యాసంస్థ (Radhasoami Educational Institute) తెఱువబడుననిగూడ తెలిపిరి.

71. ఆప్రకారము రాధాస్వామీవిద్యాసంస్థ 1-1-1917 తేదీన తెఱువబడి ఆసంవత్సరాంతమున కందులో 4 మొదలు 8వ తరగతివఱకు నైదుతరగతులలో 169 విద్యార్థులు చదువుకొనుచుండిరి. వారిలో 43 మంది పాఠశాలలో

పగటిపూటచదువుకొనువారు (Day Scholars). ఈసంస్థయొక్క మొట్టమొదటి విద్యార్థిబృందము పదునెనుమందు్రను 1919 సంవత్సరములో హైస్కూలు పరీక్షలకు వెళ్ళగ నందులో పదునేడుగురుత్తీర్ణులయిరి.

72. అటులనే 1917 సం॥రము అక్టోబరునెలలో నొకపురుషుని నొకబాలుని మాత్రిమే పనివాండు్రగబెట్టి ఆదర్శపారిశ్రామికసంస్థల కర్మాగారమును (Model Industries workshop) స్థాపించి, 1917 సం॥రము డిసెంబరునెలలో నందులో రు. 16000/-లను పెట్టుబడిపెట్టుటకు సభవా రేర్పాటుజేసిరి. ఆదర్శపారిశ్రామికసంస్థలు (Model Industries) మొట్టమొదట తోలుబొత్తాములను, పిమ్మట కత్తులు మొదలగు నితరవస్తువులను, అటుపిమ్మట భౌతికశాస్త్రపుతాిసులను తయారుజేయుచు క్రిమాభివృద్ధినొందు చుండెను. దాదాపు రెండుసంవత్సరములతర్వాత జోళ్ళువగైరాలనుగూడ తయారుజేయుట మొదలుపెట్టిరి.

## రాజబరారీవిచ్చేయుట

73. మధ్యప్రిదేశములో హోశంగాబాదుజిల్లాలో నున్న రాజబరారీయనెడి జమీందారీయరణ్యమును సాహబ్జీమహారాజువారు 1919 సం॥రములో శ్రీ॥శే॥ యస్. ఆర్. ము రే్రిదారగారి భార్యవద్దనుండి కొనిరి. ఆజమీందారీ దాదాపు 800 యకరముల విస్తీర్ణముగలదై, చాలమట్టుకు కొండలతో నిండి యుండెను. అందు పెక్కుయేర్లును, సెలయేర్లును ప్రివహించుచున్నవి. అచ్చటనుండువారందఱు గోండ్లు, కోర్కు లనెడి యాదిమజాతులవారు. 1919 సం॥రములో నీజమీందారీని సంపాదించినప్పుడు అది చాల నాగరికతాశూన్యమయిన హీనస్థితిలో నుండెను.

74. 1920 డిసెంబరునెల పా్రిరంభములో సాహబ్జీమహారాజువారీ జమీందారీని చూచుటకై వేంచేసిరి. దోమలు మెండుగనుండుటచే నచ్చట చలిజర్వము అధికముగ వ్యాపించియుండెను. సాహబ్జీమహారాజ్ వారితో గలిసి వారికుటుంబమువారును గొందఱుసత్సంగులనుగూడ వెళ్ళిరి. సాహబ్జీమహారాజువారికిని, వారిపరివారములో చాలమందికినిగూడ మన్నెపుజ్వరమువచ్చెను. సాహబ్జీమహారాజువారు జ్వరముతగ్గిన మొదటిరోజునవేదయాల్బాగునకు తిరిగి

వెడలిపోవలెనని నిశ్చయించుకొనిరి. 3, 4 మైళ్ళు ప్రయాణముచేసినతర్వాత గోరఖల్లు అనెడి మజిలీస్థానమునకు వచ్చిరి. సామానుతోనున్న నాటుబళ్ళు కొంతదూరములో వెనుకనుండి వెంబడించుచుండెను ఆకస్మికముగ సాహబ్జీమహారాజువారు తీవ్రమయినచలితో వణకుటప్రారంభించిరి. వారు అచ్చటి విశ్రాంతిగృహములో నేయాచ్ఛాదనములేకుండిన వట్టిమంచముమీద పరుండిరి సామానులన్నియు నింకను త్రోవలోనున్నందున వారికి పక్కవేయుట కేమియు లేకపోయెను. ఆ రాత్రికి సాహబ్జీమహారాజ్ వారును, వారి కుటుంబమువారును ఆవిశ్రాంతిగృహములోనున్న యొకేగదిలోనుండిరి. కుటుంబమువారు గూడ జ్వరముతో బాధపడుచుండిరి గాని, వేఱేమంచములు లేనందున వారందఱు నేలమీదనే పక్కలుపఱచుకొనిరి. మిగిలిన పరివారమందఱు నారాత్రి విశ్రాంతిగృహముయొక్క వరండాలో నుండిరి

75. జ్వరము మఱునాడుదయమునకు తగ్గిపోయినందున నందఱు నేడుమైళ్లదూరములోనున్న బర్వానీకి ప్రయాణమయిరి. బర్వానీలో ఖచడీ చేసిరి. కాని వడ్డించుటకును, తినుటకును గరిటెలు, కంచములును లేవు. అందుచే చెట్లయాకులతో కుట్టినవిస్తళ్లను వెదురురెమ్మలతో జేసినగరిటెలను ఉపయోగించిరి. సాహబ్జీమహారాజువారికి తిరిగి యెక్కువ జ్వరమువచ్చుటచే రాత్రియంతయు నచ్చటనే యాగిపోయిరి.

76. మఱునాడు పరివారమందఱును రహటగాఁవ్ అనుయూరు వెళ్ళిరి. అచ్చట సాహబ్జీమహారాజువారి కొకడేరాను వేసిరి. ఆరోజు సుఖముగనే గడచిపోయెను. మన్నెపుజ్వరమునకు కలకత్తాలో తయారుచేయబడిన "ఆంటీతాప్" అనెడి సిద్ధౌషధ మొకటి హోర్దాపట్టణములో దొరకునని యచ్చటివారు కొందఱు చెప్పిరి. సర్దార్ పురాణ్‌సింగు గుఱ్ఱపుస్వారీపై హోర్దావెళ్లి మందుపటుకొనివచ్చెను. సాహబ్జీమహారాజ్ వారామందునొక మోతాదును దీసికొనిరి. మఱునాడుదయము సాహబ్జీమహారాజువారు డాక్టరు బ్రిజలాల్‌గారిని పిలిచి తమకు క్రితమురాత్రియంతయు చాలబాధగ నుండెననియు తమకొకగుడిసెను బస కేర్పాటుజేయవలెననియు, లేనిచో తాము బ్రతుకమనియు సెలవిచ్చిరి. ప్రిన్సిపాలుగారైన నారాయణదాసుగా రప్పుడొకగుడిసెను ఖాళీచేయించి, సాహబ్జీమహారాజువారిమంచము నందులోనికి మార్పించిరి మధ్యాహ్నసమయమున సాహబ్జీమహారాజువారికి చాలవేడిగ నున్న ట్లనిపించినందున

వారిపక్కను నేలపై పఱిపించుకొనిరి. వారికి చాలయెక్కువ జ్వరము వచ్చి శరీరమంతయు చాల నొప్పులుగనుండెను. వారు చాలతఱచుగ మంచినీరు త్రాగవలసివచ్చుచుండెను. అడిగినపుడెల్ల మంచినీరు నందించుటకును, వారి శరీరములో నొప్పులున్నచోట్ల పట్టుటకును ఇద్దఱుమనుష్యులు వారిని కనిపెట్టుకొని యుండిరి. మూడవరోజున వారికి సగ్గుజావ నిచ్చిరి.

77. ఆరాత్రియంతయును సాహబ్జీమహారాజువారికి చాలబాధగను అశాంతిగను ఉండుటచే వారు మఱునాడు తమపక్కను మంచముమీదికి మార్పించుకొనిరి. పండిత హరిహరదత్తశాస్త్రిగారికిగూడ చాలజబ్బుగనుండుటచే సాహబ్జీమహారాజువారిని కనిపెట్టుచున్న వైద్యులే తఱచుగ వెళ్ళి వారినిగూడ చూచుచు వారికి మందిచ్చుచుండెడివారు. ఇంతజాగరూకతతో జూచినను శాస్త్రిగారు సాయంకాలమునకు చనిపోయిరి. సాహబ్జీమహారాజువారీసంగతి తెలియగనే శాస్త్రిగారి దహనసంస్కారమున కేర్పాట్లవిషయమై వివరముగ సలహానిచ్చి, శాస్త్రిగారి పుత్త్రులు తరువాత వచ్చినపుడు, వారికి దహనస్థలము సులువుగ తెలియు నిమిత్తమై దానిచుట్టు నొక దడివలెకట్టి, దానిలో నొకగుర్తుపెట్టి యుంచుమని సెలవిచ్చిరి.

78. సాహబ్జీమహారాజువారి యనుమతినొంది "చరణఆధారును, మందులతో డాక్టరుజానకీప్రసాదును పంపుము" అని యొకతంతిని దయాల్బాగు పంపించిరి సాహబ్జీమహారాజువారు తమపరిస్థితి యెట్లున్నను మఱునాడు రహటగాఁవ్ నుండి వెళ్ళిపోయెదమని సెలవిచ్చిరి. వారి కొకడోలిక నేర్పాటుజేసిరి. ముందనుకొనినప్రకారము మఱునాడుదయమే పరివారమందఱును బయల్దేఱి సాయంకాలము 4 గంటలకు 'పాంతలే' యను నూరుజేరుకొనిరి. అచ్చట సాహబ్జీయమహారాజువారొక పాఠశాలగదిలో క్యాంపుకాటుమీద పరుండిరి. వారికుటుంబమందఱును క్రిందనే పరుండిరి. హోషంగాబాదులో నింజనీయరుగా పనిచేయుచున్న వారియనుజులు జ్యోతిస్వరూప్గారుగూడ నచ్చటకు వచ్చిరి. ఉదయము 10 గంటలకు దయాల్బాగునుండి డాక్టరుజానకీప్రసాదుగారుగూడ వచ్చిరి.

79. ఇచ్చట నొకవిషయము చెప్పదగియున్నది. డాక్టరు జానకీప్రసాదుగారు సాహబ్జీమహారాజువారియింట చికిత్సచేయుచుండెడి వైద్యులు. ఆయన కొకసారి ప్రాణముమీదికి వచ్చినపుడు సాహబ్జీమహారాజువారాయన కొక

దానిమ్మపండు నిచ్చినందున నాయనకు రోగనివారణ మయ్యెను. ఆయన రాగనే, సాహబ్జీమహారాజువారావిషయము నాయనకు జ్ఞాపకముచేసి ఆ ప్రాణాపాయస్థితిలో నాయనకెట్లుండెనో తమకు ప్రస్తుతము సరిగనట్లేయున్న దని సెలవిచ్చిరి. వారు అప్పు డెక్కువజ్వరముతోను, విరోచనబద్ధముతోను, కడుపుబ్బరముతోను బాధపడుచుండిరి. వారికీయవలసిన మందిచ్చి డాక్టరు గారు విశ్రాంతితీసికొనుటకు వెళ్ళిరి. ఆరాత్రియంతయుసాహబ్జీమహారాజ వారు నిద్దురలేకుండ చాలబాధపడిరి. డాక్టర్ బ్రిజిలాలుగారు వారిప్రక్కనే కనిపెట్టుకొనియుండిరి.

80. ఉదయముననే వరండాలోనున్న డాక్టరు బ్రిజిలాలుగారికిని ప్రిన్సిపాలు నారాయణదాసుగారికిని, లోనుండి రోదనధ్వనులు వినవచ్చెను. సాహబ్జీమహారాజువారేదో చెప్పుచున్నట్లును, ఇంటిలోనివారేడ్చుచున్నట్లును వారిరువురికిని వినబడెను. అప్పుడు వారు తలుపు త్రోసిరి. సాహబ్జీమహారాజ వారు వారిని లోనికిబిలిచి, "నే నిప్పుడు వెళ్ళిపోవుచున్నాను. నా తరువాత సత్సంగమును గురుచరణదాసు నడిపించెదరు" అని చెప్పిరి. ప్రిన్సిపాలుగారు నిర్ఘాంతపోయి చేతులుమోడ్చి వారికేసి తేఱబాఱజూచుచుండిరి. "హుజూరువారి యభిప్రాయము యింజనీరుగా రనియేనా?" యని డాక్టరు బ్రిజిలాలుగారడిగిరి. హుజూరువారు ఔననియర్థమగునట్లు తలనాడించిరి. ఈవార్త దావానలమువలె చటుక్కున వ్యాపించిపోయినందున, మిగిలినవారందఱు నా గదిలోనికి పరుగు పరుగున వచ్చిరి. మహాదుఃఖముతో నేడ్చుచు నందఱు భయభక్తులతో నిలబడియుండిరి. జ్ఞానబాబుగా రేడ్చుచు, "హుజూర్, మేము పాపాత్ములము. మమ్ములను క్షమింపు"డని ప్రార్థించెను. హుజూర్ వారు, "పాపాత్ము లనుప్రశంస లేదిపు"డని యనిరి. సుబేదారుప్రేమసింగుగా రీమహాజునకు తిర్గులేనిచో, హుజూర్ వా రీప్రపంచమును వీడుటకుముం దందఱును దయాల్బాగు జేరుకొనునట్లు విధింపుడని ప్రార్థించెను. అయినను సాహబ్జీమహారాజువారు వారినందఱును ధైర్యముగనుండుమని సెలవిచ్చిరి.

81. ఇంతలో డాక్టరు జానకీప్రసాదుగారు వచ్చి సాహబ్జీమహారాజువారికి చాలనీరసముగనుండుటచే నొకయింజక్షను నివ్వవలయుననిరి. సాహబ్జీమహారాజువారు తమ కింజక్షను అవసరములేదని చెప్పి నిరాకరించిరి. కాని ఆయింజక్షను (Injection) వారికి ప్రయాణముచేయగలశక్తిని గలుగజేయుటకు

ముఖ్యావసరమని డాక్టరుగారు పట్టుపట్టిరి. డాక్టరుగారు ఇంజక్షను నిచ్చి నపిమ్మట నందఱును హోర్డాబయలు దేఱిరి. సాహబ్జీమహారాజువారు చాలకృశించి యమితనీరసముగ నుండిరి. ప్రయాణపు బడలికచే వారికి నీరసము మఱింతయెక్కువ యయ్యెను. సాయంకాలమునకు వారు హోర్డాచేరుకొనిరి. హోర్డా చేరుకొనుసరికి సాహబ్జీమహారాజువారికి చాలనీరసముగ నుండుటచే వారు ప్రక్కలో కదలకుండ నట్లే పరుండియుండిరి. రాత్రి యెంతసేపటికిని వారు కండ్లు తెఱవనేలేదు, కించిత్తుగూడ కదలలేదు. మహానిష్టము సంభవించు నేమో యనుభయముతో నందఱు వ్యాకులపడుచుండిరి. అందఱును నిరాశచేసి కొనిరి. డాక్టరు జానకీప్రసాదుగారుకూడ సాహబ్జీమహారాజువారింకకొన్ని గంటలసేపు మాత్రమే జీవించెదరను నభిప్రాయములో నుండిరి మఱునాడు తెల్లవాఱుజామున సాహబ్జీమహారాజువారు కండ్లు తెఱచుసరి కందఱును కన్నీరు కార్చుచుండిరి సాహబ్జీమహారాజువారు వారినందఱను ధైర్యముగ నుండుడని చెప్పి యిట్లనిరి, "సంతుని యాత్మ తనశరీరములో ప్రత్యేకపునుం డియు సులువుగ ముడుచుకొనిపోయి తనస్వధామమున కెట్లుపోవునో చూచు నట్టి సావకాశము మీకందఱకును గలుగుచున్నది. సామాన్యజీవుని యాత్మ సులువుగ లోనికిముడుచుకొని పోలేదు." అక్కడనున్నవారందఱును మహా వ్యాకులచిత్తులయి దిగ్భ్రమజెంది మాటలేకుండ నిలబడిపోయిరి.

82. ఈమాటలు వినగనే శ్రీజ్యోతిస్వరూప్‌గారు శ్రీద్వారకాబాసీగారి కివ్విధముగ తంతినిచ్చిరి. "హుజూరువారి పరిస్థితి ప్రమాదావహముగనున్నది. తప్పకుండ మొదటి మెయిలులోరండు. అక్కడనున్న యెడల భాయీసాహెబ్ గారిని తీసికొనిరండు." కొద్దిసేపట్లో సాహబ్జీమహారాజువారు తిరిగి యిట్లనిరి. "ఆత్మ యూర్ధ్వలోకములను, వరుసగ నొక్కొక్కటిగ నారోహించుచున్నది. చైతన్యశబ్దము స్పష్టముగ వినబడుచున్నది. వగైరా వగైరా." ఈపరిస్థితి చాల సేపట్లేయుండెను. వారిమోకాళ్ళు, కాళ్ళు, అఱచేతులు బాహువులును కంపించుచుండుటచే వారియాత్మ శరీరమునుండి లోనికి ఆకర్షింపబడిపోవుచున్నట్లు స్పష్టమగుచుండెను. వారిశరీర మించుకేని కదలికలేకుండ నట్లే పడియుండెను. కానివారిముఖము చుట్టు నొకయపూర్వతేజోవలయ మావరించియుండెను. వారి ప్రశాంతస్థితి నెవరును చెఱుపసాహసింపలేకుండుటచే చాలగంట లట్లే గడచి పోయెను.

83. సూర్యోదయానంతరము సాహబ్జీమహారాజువా రేదో యనిరి గాని యెవరికి నామాటలు తెలియలేదు. వారి పెదవులు కదలినవి కాని మాటవినరా లేదు. కొద్దినిమిసములతర్వాత సాహబ్జీమహారాజువా రీ క్రిందిపద్యము నుచ్ఛ రింపసాగిరి.

చాదర ఝీనీ మోహిఁ దీనీ కి న దీనీ ॥

హే నాథ్! చాదర ఝీనీ మోహిఁ దీనీ కి న దీనీ ॥

అర్థము:- "హేనాథా! నా కీ సూక్ష్మము, దురవగాహ్యామునగు శరీ రము నిచ్చితివా లేదా?"

84. సాహబ్జీమహారాజువారీ పద్యము నొకగంటసేపునకుపైగా పెద్దగొం తుకపెట్టి వేలువేలు రాగములతో పాడుచుండిరి ఉచ్చైస్స్వరములో పాడుచుం డుటచే చుట్టుప్రక్కలవారందఱు నాయింటిముందర ప్రోగయిరి. సాహబ్జీ మహారాజువారు తమ యాంతర్యమున పూర్తిగ మగ్నులయి సమాధ్యవస్థలో నుండిరి చాలసేపట్లు గడచినపిమ్మట వారు తమ యెడమప్రక్క కొత్తిగిలి గాఢనిద్రలో నున్నట్లుండిరి. వా రివ్విధముగ నుదయము 10గంటలుమొదలు 15 గంటలసేపు నిదురవోయి, రాత్రి 1 గంటకు కండ్లు తెఱచిరి.

85. సాహబ్జీమహారాజువారు కొంచెము నీళ్ళు చప్పరించినట్లు త్రాగి స్పష్ట స్వరముతో నిట్లనిరి, "మౌజ్ మాఱిపోయినది. స్వామీజీమహారాజువారు వేం చేసిరి. నేను ప్రస్తుతము వెళ్ళుటలేదు." అప్పు డందఱు భేంటునిచ్చిరి. కొం తసే పూరకుండిన పిదప, సాహబ్జీమహారాజువారు జ్యోతిస్స్వరూపుగారిని తాం బూలము పట్టుకొనిరమ్మని చెప్పిరి. అయిదు నిమసములలో తాంబూలము తీసికొనిరాగా, సాహబ్జీమహారాజువా రది వేసికొని తెల్లవాఱుజామున 3 గం టలకు నిదురవోయి తిరిగి ఉదయము 6 గం. 30 ని॥లకు మేల్కొనిరి. ఈలో పున అనగా తెల్లవాఱుజామున నాల్గుగంటలకు శ్రీ బ్రిజబాసీలాల్ గారును శ్రీ ద్వారకాబాసీగారును, సేఠ్ నిహాల్ చందుగారును ఆగ్రానుండి యే తెంచిరి మౌజు మాఱిపోయినదని తెలియగనే వారికి దుఃఖమంతయు నొక్కసారిగ పోయి మహాసంతోషము గల్గెను.

86. ఉదయమున సాహబ్జీమహారాజువా రానాడే దయాల్బాగు బయ లుదేఱవలయునని యానతినిచ్చిరి. వారు ఆయుష్కర్మ చేసికొని దుస్తులమార్చు

కొనిరి. వారి ప్రక్కను దులిపితిరిగి వేయునపుడు దుప్పటిమీద, హుజూరువారు తమ బాహువులును కాళ్ళును పెట్టుకొనిన స్థలములలో, నిసుక రేణువులును బూడిదనలుసులును కన్పించెను. ఆదుమ్మును దులిపి వేయుచుండగ, సాహబ్జీ మహారాజువారు, "అదంతయు నేలపాలు జేసెదరు? అది నా శరీరధూళి" యని చమత్కారముగ ననిరి.

87. ఉదయము 10 గంటలకు పరివారమందఱును ముందుగనే హోర్డాస్టేషనుకు వెళ్ళి టిక్కట్లుకొనుక్కొనిరి. రైలుబండి వచ్చినతర్వాత సాహబ్జీమహారాజువారి కొఱకై దాని నైదునిముసములసేపు ఆఁపుచేసిరి. అప్పటికిని వారు రానందున, సామానులు రైలుబండినుండి దింపి వేసిరి. బండి వెడలిపోయెను. పరివారమందఱును తిరిగి బసలకుజేరినపిమ్మట సాహబ్జీమహారాజువారు విశ్రాంతితీసికొనగోరి ప్రయాణ మారోజున కాఁపుచేసిరని తెలిపినది అందుచే వారందఱును మఱునాడుదయము పదకొండుగంటలకు ఆగ్రా బయలుదేఱి వెడలిరి. ఆ తరువాతి స్టేషనులో రైలు ఆగినపుడు సాహబ్జీమహారాజువారెక్కిన పెట్టె ఝాన్సీస్టేషనులో రాత్రివేళ విడదీయబడునని తెలియవచ్చెను. అందుచే పట్ట పగలు ఇటార్సీస్టేషనులోనే ఆపెట్టెనుండి మఱొక పెట్టెలోనికి మారుట యుక్తమని తలఁచి, సాహబ్జీమహారాజువారిని ఇటార్సీస్టేషనులో మఱొక పెట్టెలోనికి గొనిపోవుటకై రోగులుపయోగించుశయ్యను(Stretcher) తీసికొనిరాగా వారు దానిని నిరాకరించి తమపెట్టెనుండి మార్చినపెట్టెవఱకు నడచి వెళ్ళిరి. సాహబ్జీ మహారాజువారు దిగి నడచుచుండగ వారి లలాట మద్భుతతేజస్సుతో మెఱయుచు, వారి నడకయొక్క చకచక యందఱకునాశ్చర్యము గలుగజేసెను.

88. దయాల్బాగువచ్చినతర్వాత రెండురోజులైనపిదప సాహబ్జీమహారాజువారు తమ యింటినుండి బయటికొక రిక్షాలో పోవుచు, దయాల్బాగులో చిరపరిచితమైన భవనములు వగైరాలను యేవేవో తెలిసికొనుటకై వాకబుచేయుచు నిట్లనిరి, 'నాజ్ఞాపకశక్తి మందగించినది.'

89. తరువాత నొకసారి సత్సంగములో సాహబ్జీమహారాజువారు తమ రుగ్ణతను గూర్చి చెప్పుచు నీక్రిందివిధమున సెలవిచ్చిరి "పాంతలై హోర్డా గ్రామముల మధ్య నేను నాభౌతికశరీరమును విడిచి వేసితిని. అది యించుమించు బూడిదయైపోయెను. కాని రాధాస్వామిదయాళుని దివ్యేచ్ఛకు బద్ధుడనై నేను తిరిగి నాశరీరములోనికి రావలసివచ్చెను. నేను తిరిగివచ్చుసరికి ఆశరీరము

పాడుపడియుండుటచే నాకు యథాస్థితిలోనికి వచ్చుటకు పదునెనిమిదిగంటలు పట్టినది.'' తరువాత మఱొకసారి శ్రీ మత్తూలాలాను నొకసత్సంగిభక్తుడు తిమర్నీ ప్రయాణములో సాహబ్జీమహారాజువా రెందు కీప్రపంచమునుండి వెడలిపో దలంచితిరని వారిని ప్రశ్నించెను, సాహబ్జీమహారాజువా రిట్లు సమాధానమిచ్చిరి, "భగవంతుడు సద్గురువునకు ప్రాకృతికశక్తులమీద నద్భుతాధికారము నిచ్చెను. వారు కావలెనన్నచో ప్రకృతినియమముల నతిక్రమించగలరు. కాని అట్లు చేసినపుడు దానికివారుప్రతిఫలము ననుభవింపవలసియుండును. వారు, అట్టి అతిక్రమణచర్యలకు విహితశిక్షను సంతోషముగనే యనుభవింతురు. భగవంతు డట్టిప్రకృతినియమోల్లంఘనములు సత్సంగులవిషయములో జరిగించినపుడు ఆమోదించునుగాని, సత్సంగేతరులవిషయములో జరిగించినపు డందుకువిధింపబడిన శిక్షానుభవము తప్పదు.'' వారి కుటుంబమువారియొక్కయు సర్దార్ బిషన్ సింగుగారియొక్కయు పట్టుమీద తా మొకసారి డాక్టర్ జానకీ ప్రసాదుగారి జీవితమును రక్షించితిమని సాహబ్జీమహారాజువా రప్పుడు సెలవిచ్చిరి. డాక్టరు జానకీప్రసాదుగారు వీరికుటుంబములో చాలకాలమునుండి వైద్యము సేయుచుండుటచే వారికుటుంబమువారు ఆడాక్టరుగారిప్రాణము నెట్లైనను గాపాడవలెనని బ్రతిమాలుకొని యివ్విధముగ నొకతీరున, సాహబ్జీ మహారాజువారిని బలవంతముచేసిరి. సాహబ్జీమహారాజువా రపుడు డాక్టరుగారింటికి వెళ్ళి వారిప్రాణమును కాపాడిరి. ప్రకృతినియమముల నుల్లఘింపశక్యముకాదుగావున "ప్రాణమునకు ప్రాణము'' అనెడి నియమానుసారము వారుగూడ శిక్ష ననుభవింపకతీరలేదు. వా రందుచేతనే తమ భౌతికశరీరమును విడిచిపెట్టి కొంతిసేపైనతర్వాత తిరిగి వచ్చి అందులో ప్రవేశించవలసి వచ్చెను. ఆయల్పకాలముసేపు వారీ ప్రపంచమును వీడిపోవుట కదియే కారణము,

90. సాహబ్జీమహారాజువారి ప్రభుత్వకాలములో ప్రథమభాగము రాజబరారీప్రయాణముతో ముగిసెను. ఈభాగములోనే సత్సంగకేంద్రస్థానము స్థాయిరూపమున నేర్పడి, బీజరూపమున విద్యాసంస్థలును పారిశ్రామికసంస్థలును నిర్మాణమయినవి. ఇవిగాక నొక వైద్యశాల (Dispensary) గూడ తెఱువబడెను. సర్కార్ సాహబ్ వారి భక్తులలో గొందఱువ్యక్తులచేతను కొన్ని కూటములచేతను ప్రారంభించబడిన ప్రతికూలప్రచారమంతయు పూర్తిగ నశించిపోయెను. 1918సం॥రము జూలై నెలలో మురారులోమాతాజీగారుచనిపోయిరి

తరువాతిభాగములో అనగా 1921 మొదలు 1930 సం॥రమువఱకునుగల సమయములో సత్సంగమునకు సర్వవిధముల వృద్ధివికాసలుగలిగి కార్యకలాపము గూడ పెరిగిపోయెను.

# రాధాస్వామి విద్యాసంస్థ
## (Radhasoami Educational Institute)

91. 1-1-1917 తేదీన ప్రారంభించబడిన విద్యాసంస్థ, అందలివిద్యార్థుల శ్లాఘనీయపరీక్షాఫలితములనుబట్టియు. నందలియుత్తమశిక్షాక్రమము నుత్తమ విద్యాభ్యాసవిధానమునుబట్టియు, సహజముగ నెక్కువ పేరుగాంచుటచే నిందు జేరి చదువుకొనునిమిత్తము విద్యార్థులధికముగ వచ్చుచుండిరి. ఇంతలో ప్రభుత్వమువారు సేడ్లరువిచారణసమితినివేదిక (Sadler commission Report) నామోదించుటచే. నప్పటిపరిస్థితులకనుగుణముగనుండదలచి, యీసంస్థ యొక్క కార్యనిర్వాహకవర్గమువారీసంస్థలో నింటర్మీడియటుతరగతులను తెఱచుటకు, నిశ్చయించిరి. భగవత్కృపచే నందుకుసహాయముగూడ చేకూరెను. అప్పుడుగవర్నరుగానుండిన సర్ హార్కోర్టుబట్లరుగారు 9-11-1920 తేదీన దయాల్బాగువచ్చి సభవారిచ్చుటజరిపించుచున్న కార్యక్రమమంతయుజూచి చాలమెచ్చుకొనుట జరిగెను గవర్నరుగారిట్లుచెప్పిరి:

"మీసంస్థ గర్వింపదగినట్టి నిరుపమానమైనచరిత్రతో నొప్పారుచున్నది. మీసంస్థ వివేకవంతమయినట్టియు జయప్రదమగునట్టియు పద్ధతులమీద వ్యవస్థాపితమయిన ప్రభుత్వేతరోద్యమమున కొక ప్రశంసార్హమైన యుదాహరణము మీ రిచ్చుట సామాన్యవిద్యతోపాటు సాంకేతికశిక్షణనుగూడ (Technical Training) గఱపుచున్నారు. విద్యాభ్యాసవిషయములో మీయాదర్శము లెక్కువపౌఢములును శ్రేష్ఠములు నై యున్నవి. మీకట్టడము లతిశోభాయమానముగ నున్నవి. మీకు విద్యార్థులు భారతదేశమంతటినుండియు వచ్చుచున్నారు. ఇదంతయు కనులార గాంచుటకు నాకుసంతోషమగుచున్నది. మీరింత వఱకుజేసిన మహాత్కార్యమునకు నేను మిమ్ములనభినందించుచున్నాను. ఇచ్చటివాతావరణమంతయు మీపూజ్యనాయకుని యుత్తమాశయములతో నొప్పారుచున్నది. మీరందఱు నొక్కకుటుంబమువలె కలిసిమెలిసియున్నారు. మీకు సంఘసేవాసక్తితోను ఆత్మసమర్పణభావముతోను భారతదేశము

యొక్క వివిధప్రాంతములనుండియు వచ్చిన శ్రద్ధాళురగు నుపాధ్యాయబృంద మున్నది".

ప్రభుత్వమువారు 208 యెకరములభూమిని దయాల్బాగునకు సంపాదించి పెట్టవలయునని సర్ హార్కోర్టుబట్లరుగా రుత్తరువిచ్చిరి. పిమ్మటనాభూమిని పాఠశాలగదులువర్క్ షాపులు కట్టించుటకును పాఠశాలకై హాస్టలునుకట్టించుసనిమిత్తమును సభవారికి స్వాధీనముచేసిరి. సభవారును, సత్సంగసంఘమునుగూడ నందుకుతగిన యౌదార్యముతోనే ప్రవర్తించి, యవసరమైన పూర్వప్రబంధమును జేసి 1922 సం॥రములో ఇంటర్మీడియటుతరగతులను తెఱచిరి.

92. ఈసంస్థ నిరంతరవృద్ధినొందుచు నుత్తరప్రదేశములో నొక యగ్రగణ్యసంస్థగ పేరుపొందెను. దీనిని 1928వ సం॥రములో మూడుశాఖలుగ విభజనచేసిరి:

1. నిమ్నతరప్రాథమికశిక్షణతరగతులు,
2 ఉన్నతప్రాథమికతరగతులును, మాధ్యమికతరగతులును,
3. ఉన్నతపాఠశాలాతరగతులును (High School Classes), ఇంటర్మీడియటుతరగతులును (Intermediate Classes).

నిమ్నతరప్రాథమికతరగతులలో నాఁడపిల్లలకును, మగపిల్లలకును గలిపి చదువుచెప్పుచున్నారు. 1930 సం॥రములో బాలికావిద్యార్థినులకు వేఱుగ నొక యున్నతపాఠశాలను (High School) స్థాపించి దానికొఱకు, కాలనీస్త్రీల విరాళములతోనే ఇంచుమించుపూర్తిగ జమయైన ద్రవ్యము రు. 60,000/-లతో నొక దివ్యభవనమును కట్టించి, యాపాఠశాల నందులోఁబెట్టిరి. దానికి ప్రేమవిద్యాలయమని నామకరణముచేసిరి. ఈకాలనీకంతకునురమణీయతమమైన తోటలో నీవిద్యాలయమునకు దివ్యభవనములును, బహువిశాలమయిన యాటస్థలములును గలవు. ఈసంస్థ, దానిలోని యుచ్చతమశిక్షణవిధానమునకును, విద్యాబోధనేతరకార్యకలాపములకును ప్రఖ్యాతిగాంచెను

## సాంకేతికకళాశాల
(Technical College)

93. దేశమున కుపయోగకరమయిన యాంత్రికులను (Mechanics) సాంకేతికనిపుణులను (Technicians) ఇంజనీర్లను తయారుచేయునిమిత్తము

1927వ సం॥రములో నొకసాంకేతిక పాఠశాలను (Technical School) తెఱచిరి దానిని 1930వ సం॥రమునాటికి ప్రయోగశాలలతో (Laboratories) కర్మాగారములతో (Workshops) విశాలభవనములతో నొప్పారునొక సాంకేతికకళాశాలగ (Technical College) వృద్ధిజేసి యందులో మెకానికల్ ఇంజనీరింగు (Mechanical Engineering) ఎలక్ట్రికల్ ఇంజనీరింగు (Electrical Engineering) ఆటోమోబైల్ ఇంజనీరింగు (Automobile Engineering) శాఖలలో ప్రశిక్షణము నిచ్చుచున్నారు. ఈకళాశాల ఉత్తర ప్రదేశప్రభుత్వమువారిచే నామోదించబడెను. ఈకళాశాలలో మెకానికల్, ఎలక్ట్రికల్ ఇంజనీరింగు శాఖలలో నాల్గుసంవత్సరములపాఠ్యక్రమమును, ఆటోమోబైల్ ఇంజనీరింగులో రెండుసంవత్సరములపాఠ్యక్రమమును, ఏర్పాటుచేసిరి. ఈసంస్థకూడ క్రమాభివృద్ధినొందుచు నీప్రాంతములో నుత్తమప్రఖ్యాతసంస్థలలో నొకటిగ పరిగణింపబడుచున్నది. ఈకళాశాలయొక్క హాస్టలు ఒక రెండంతస్థులదివ్యప్రాసాదభవనములో నున్నది ఈకళాశాలనుస్థాపించి యిప్పటికి 34 యేండ్లు పూర్తియయ్యెను.

## తోలుపనిపాఠశాల
## (Leather Working School)

94. ఈపాఠశాల పూర్వ మాగ్రాలోనుండగ. దీనిని ప్రభుత్వమువారు 1930 సంవత్సరములో, దయాల్బాగు యాజమాన్యమున నిది జయప్రదముగ వర్ధిల్లగలదనుయోచనతో, నాగ్రానుండి దయాల్బాగుమార్చిరి. జోళ్ళు, సూట్ కేసులు, మనీపర్సులు(Purses) హూల్డాలులు(Holdalls) మొదలయిన తోలువస్తువుల యుత్పాదనవిధానముయొక్క సిద్ధాంతబోధయు, ప్రయోగాత్మకశిక్షణమును ఈపాఠశాలలోని పాఠ్యక్రమములో నున్నవి.

## పరిశ్రమసంస్థలుమొదలైనవియు, నితరకార్యకలాపములును

95 ఆదర్శపారిశ్రామికసంస్థలు (Model Industries) 1917 సం॥రము అక్టోబరునెలలోస్థాపించబడినదిమొదలు క్రమాభివృద్ధినొందుచుండెను వీనికర్మాగారములో వివిధప్రక్రియలను జూపించుటకవసరమయిన సమస్తవిధయంత్రములు నమర్చబడెను. వైజ్ఞానికప్రయోగశాలల కుపయోగపడునట్టి యుత్తమవిధమయిన సూక్ష్మతాసులును, శస్త్రచికిత్సాయుధములును, జంతుశరీరభాగ

ప్రతిరూపములును (Biological sets) విద్యుత్కుంపట్లును (Electric Stoves) విద్యుత్తుయిస్త్రీపెట్టెలును, ఇంటికప్పుకు వ్రేలాడఁదీసెడి విద్యుత్పంఖాలును (Ceiling Fans) మేజాబల్ల విద్యుత్పంఖాలును (Table Fans), వెండి బంగారుగొలుసులును, పలురకములగడియలును, కత్తులు కటారులువగైరాసామానులును, సులభవాహ్యగ్రామఫోనులును, (Portable Gramophones), మేజాబల్ల గ్రామఫోనులును, (Table Gramophones) మొదలగుపలురకముల సామాన్లను ఆదర్శపారిశ్రామికసంస్థలలో తయారుజేయనారంభించిరి.

96. పైనజెప్పినసామాగ్రిగాక నిచ్చట జోళ్ళు సూటుకేసులు (Suit cases) హోల్డాలులు (Holdalls) మొదలగు ననేకవిధములయిన తోలుసామాన్లను, నూలుబట్టలను, పట్టుబట్టలను, ఫూలుబట్టలనుగూడ తయారుచేయుట ప్రారంభించిరి. ఈవస్తువులన్నియు వానివిశిష్టతకు నుత్తమసౌష్ఠవమునకు నధిక ప్రఖ్యాతి నొందెను.

97. ఈకాలనీ స్థాపించినతర్వాత నతిశీఘ్రకాలములోనే కోలనీలో దొడ్లనూడ్చుట మొదలగు నారోగ్యరక్షణకృత్యములను సాగించుచుండుటకును, భండారాదినములలోవచ్చునట్టి జనసంఘముల సౌకర్యములను కనిపెట్టుచుండుటకు నొకయెన్నికసభ్యులసమితి (Board of Elected Members) నేర్పాటుచేసిరి. తరువాత కొంతకాలమునకు సభయొక్క కార్యనిర్వాహకవర్గముగూడ నీసమితికి కొందఱుసభ్యులను పేర్కొని నియమించెను.

98. ఈమధ్యసమయములో, సత్సంగులకు దయాల్బాగులో నివాసార్థమై ప్రత్యేకగృహములను కట్టుకొనుట కనుమతియియ్యబడెను. ఈకాలనీలో వసతిగృహములకొఱకేర్పాటయిన మొట్టమొదటి మొహల్లాయగు ప్రేమనగర్‌కు 1921 సం॥రములో నొకస్థాపనశిలనునాటి శంకుస్థాపనజేసిరి. అట్టి మఱికొన్ని మొహల్లాలుగూడ, అనగా, శ్వేతనగరు, స్వామీనగరు, కార్యవీరనగరు నటుపిమ్మట నేర్పడినవి.

99. క్షీరశాలను (Dairy) 1926లో ప్రారంభించిరి. క్రమక్రమముగ దాదాపు 120 పశువులను దానికొఱకు సంపాదించిరి. దానికిజేర్చి యొకవ్యవసాయక్షేత్రముగూడ నున్నది. ప్రభుత్వమువారు ఇందలి నాగుబడిపొలములకు నీరును చేకూర్చుటకై "దయాల్బాగుమైనర్" అనునొక కాల్వను త్రవ్వించుట కుత్తరువిచ్చినందున నాసమస్యయప్పటియవసరములకు తగినట్లు తీరెను.

100. సరణాశ్రమఆసుపత్రిని (Saran Ashram Hospital) 1926 సం॥ర ములో స్థాపించిరి దానికొక యౌషధశాల (Dispensary) గలదు. దాని కొకప్రసూతిశాఖను (Maternity Section) గూడ త్వరితముగనే జేర్చిరి. దానిలోనొక సహాయశస్త్రవైద్యులు (Assistant Surgeon) పైయధికారిగ నుండి వారిక్రింద తగినంతమంది డాక్టర్లు పరిచారికలు (Nurses) ఔషధ యోజకులును (Compounders) పనిచేయుచున్నారు

101. సత్సంగులకు తమద్రవ్యమును సభవారివద్ద కరెంటుఅకౌంటులో (Current Account) నుంచుట కనుమతియున్నది. కాని సంస్థలధికముగ స్థాపితమగుచున్నకొలంది సరియయినబ్యాంకు (Bank) కావలసివచ్చెను. అందుచే 1929 సం॥రములో "ది రాధాస్వామీజనరల్ అండ్ అస్యూరెన్సు బ్యాంకులిమిటెడ్" (The Radhasoami General And Assurance Bank Ltd) అనుపేరుతో నొకబ్యాంకును స్థాపించిరి.

102. కాలనీనివాసులకు నీటిసదుపాయమును, విద్యుచ్ఛక్తిసదుపాయమును గూడ చాలముందుగనే చేసిరి. ఆరంభములో విద్యుచ్ఛక్తి నొకనూనెయంత్ర ముతో (Oil Engine) నుత్పాదనజేయుచుండెడివారు. కాలనీలోని మొగలా యీలకాలమునాటిబావులనుండి నీరుతోడి కాలనీనివాసులందఱకును సరఫరా చేయుచుండిరి. ఉదకమును సమృద్ధిగనిచ్చుటకై యొకగొట్టపుబావిని (Tube-well) గూడత్రవ్వించిరి. 1930 సం॥రము ఫిబ్రవరినెలలో నానూతికి ప్రారం భోత్సవము చేసిరి. హస్తప్రేష్యవిధానముతోగూడిన యొకచిన్నటెలిఫోను వ్యవస్థనుగూడ నేర్పాటుచేసిరి.

103. విద్యాసంస్థలు, రోగచికిత్సాసంస్థలు పరిశ్రమసంస్థలు మొదలగు వివిధ సంస్థలు పెరుగుచున్నందున నర్హతలుగల శ్రద్ధాళుకార్యశూరుల యవసరము గలిగెను. అందుచే నాసంస్థలలో సేవాభావముతోఁబనిచేయు కార్యదక్షులను సభకు లభ్యమగునట్లు చేయునిమిత్తము 1-7-1927 తేదీన సేవాతత్పరబృందము (League of Service) అనుపేరుతో నొకసంఘము నేర్పాటుచేసిరి. ఈబృం దములోనివారు యావజ్జీవమును, లేదా కనీసము 15 యేండ్లైనను యెట్టిమర తులుగోరకుండ, సేవచేయుటకంగీకరించిరి. ప్రారంభములో నిరువదితొమ్మండ్రు మంది యీబృందములోసభ్యులుగజేరిరి.

104. ఇవ్విధముగ నొక క్రమబద్ధసంఘమునకు, నొకప్రవర్ధమానజాతికి నొకయాధునికవర్ధమానపట్టణమునకును ముఖ్యావసరమైన సకలవిధసంస్థలు నొకటొకటిగ నిచట స్థాపించబడెను. పై పేరాలలోని వివరణమంతయు బొత్తిగ నసంపూర్తిగనే యున్నది. ఏలనన, నందులోచాల విభాగములను క్రియాకలాపములను, అవి యప్రధానములుగాకపోయినను పరిమాణమునచిన్నవియగుటచే, నుదహరించనేలేదు. ఉదహరింపబడినవిగూడ కేవలమనుక్రమణికారూపముననే చెప్పబడినవి.

## అంత్యఖండము

105. 1930 సం॥రమునకు పూర్వము స్థాపించబడినసంస్థ లెండ్లుగడచిన కొలఁది యభివృద్ధినొందుచుండెను. ఆదర్శపారిశ్రామికసంస్థలు (Model Industries) పూర్వముకన్న నెక్కువరకముల వస్తువులనుతయారుచేయనారంభించి, వానియుత్పాదనప్రమాణమునుగూడ మహాధికముగ పెంచిరి. మగ్గముల నెక్కువగకొని వస్త్రములయుత్పాదననుగూడ చాలపెంచిరి. అందుచే, వస్త్రోత్పాదకయంత్రాగారమును (Textile Factory) తోలువస్తువులయంత్రాగారమును (Leather Goods Factory) తగినంతపెద్దవిగ పెరిగిపోయి, వేర్వేరుసంస్థలుగ పనిచేయదొడఁగెను. క్రోముతోలును (Chrome Leather) తయారుచేయుట కొకటేనరీని దయాల్బాగులో స్థాపించి, చెట్టుపట్టతో తోలు పదునుజేయు మఱొకటేనరీని తాజ్‌మహాల్ వద్ద సంపాదించిరి.

106. 4 లక్షలరూప్యములు వెచ్చించి క్షీరశాలకు (Dairy) క్రొత్తభవనములను కట్టించి పాలుమఱఁగించిచల్లార్చు క్రొత్తయంత్రము(Pasteurization Machinery) నొకదానిని చేకూర్చుకొని 1932 సం॥రము జనవరినెలలో నుత్తరప్రదేశగవర్నరుగారైన సర్ మాల్కొమ్ హేలీ (Sir Malcolm Hailey) గారిచే వానికి ప్రారంభోత్సవమును చేయించిరి. క్షీరశాలలో (Dairy) తయారైన పదార్థములు, అందులో ముఖ్యముగ వెన్న, ఉత్తరప్రదేశములో ప్రఖ్యాతిగాంచెను ఆగ్రాపట్టణములోని సంసలకు ఈక్షీరశాల (Dairy) నుండియే పాలను సరఫరాచేయుట ప్రారంభించిరి.

107. అయినను కావలసినంత నీటివసతి లేకపోవుటచే చాలయిబ్బందిగనుండెను. అందుచే సభవారు 2లక్షల రూప్యములను వెచ్చించి యమునానదినుండి

యొక కాల్వను పశ్చిమమున త్రవ్వించి, 1936లో శ్రీహృదయనాథకుంజ్రూగారిచే దాని ప్రారంభోత్సవమును జరిపించిరి. ఇవ్విధముగ వ్యవసాయక్షేత్రమునకు నీటివసతిసమస్య తృప్తికరముగ దీరిపోయెను.

108. అటులనే 'సరణాశ్రమ' ఆసుపత్రినిగూడ క్రొత్తయావరణములోనికి మార్చిరి. బయటినుండి వైద్యమునకు వచ్చిపోవువారల కొకశాఖ (Outdoor Ward) పురుషశాఖ, స్త్రీశాఖ, ప్రసూతిశాఖ, సామాన్యరోగులవసతిశాఖ, ప్రత్యేకరోగులవసతిశాఖయనని యయిదు భవనసముదాయముల నాయావరణములో క్రొత్తగ నిర్మించిరి.

109. ఉత్తరప్రదేశప్రభుత్వ ముత్తరప్రదేశపశ్చిమభాగమున జలవిద్యుచ్ఛక్తి (Hydro-electric Power) నుత్పాదనచేయుచున్నందున, సభవారు తమకు విద్యుచ్ఛక్తి నిచ్చుటకై ప్రభుత్వముతో నొకయొడంబడికను జేసికొనిరి. దయాల్బాగులో విద్యుచ్ఛక్తిసరఫరా నిమిత్తమై ప్రభుత్వమువా రొక హైటెన్షన్ తీగను (High tension Line) దయాల్బాగువఱకు పొడిగించి, దయాల్బాగులో నొకజలవిద్యుచ్ఛక్తి సబ్‌స్టేషనును పెట్టిరి. పిమ్మట నందుండి దయాల్బాగులోని పరిశ్రమసంస్థలకును, గృహోపయోగములకును, వ్యవసాయపుపనులకును కావలసినవిద్యుచ్ఛక్తిని పంపించుచుండిరి.

## వస్తుప్రదర్శనములు

110. దయాల్బాగుపారిశ్రామికసంస్థలు వివిధవస్తువులను విరివిగ నుత్పాదనజేయుచుండుటచే, నాయుత్పాదితవస్తువులను చురుకుగ నమ్మివేయవలసిన యవసరము గలిగెను. కావున 1931-35 సంవత్సరములలో, నుత్తరహిందూస్థానముననున్న ప్రధానపట్టణములన్నిటిలో దయాల్బాగువస్తువుల ప్రదర్శనములను జరిపించిరి.

111. మొట్టమొదటివస్తుప్రదర్శనము లాహోరులో జేసిరి ఆప్రదర్శనమునకు, 1931వ సం॥రము నవంబరు 24వ తేదీన, డా॥ గోకులచంద్‌నారంగ్‌గారు ప్రారంభోత్సవముఁజేసిరి. సాహబ్జీమహారాజువారుగూడ నప్పుడచ్చటికి వెళ్ళిరి. ఆసమయమున "[1]జాత్‌పాంత్‌తోడకమండల్" వారు, ఆర్యసమాజమువారు, సనాతనధర్మసభవారు నేర్పాటుచేసిన సమావేశములలో సాహబ్జీమహారాజువారు పారమార్థికవిషయములమీాద నెన్నియో యుపన్యాసములనుగూడ

(1) "జాత్‌పాంత్‌ తోడక్‌మండల్" అనగా జాతిపంక్తి మతభేదములను దొలఁగించు నిమిత్తమేర్పడిన సంఘము.

నిచ్చిరి. అందుచే నప్పుడు లాహోరంతయు నొకతుపాను వచ్చిన ట్లల్లకల్లోల మైపోయెను. సార్ బచన్‌లోని యీక్రిందిచరణ మా పరిస్థితికి తగియున్నట్లని పించెను.

'కాల నగర్ మానో దేహైం ఉజాడీ' ॥

అర్థము:- ఆదతయాళురు కాలునిలోకమును ధ్వంసముజేయదలఁచిరా యని యనిపించుచుండెను.

112. ద్వితీయవస్తుప్రదర్శనము పాట్నాలో జరిగెను. పాట్నాహైకోర్టులో ప్రధానన్యాయాధిపతియైన సర్ కూర్ట్నెటెర్రేలుగారు (Sir Courtney Terrel) ఆప్రదర్శనమునకు 1932, నవంబరు, 12వ తేదీని ప్రారంభోత్సవము జరిపిరి. తరువాతి వస్తుప్రదర్శనము 14-3-1933వ తేదీన అంబాలాలో బ్రిగేడియర్ జనరల్, యఫ్. జి. గిల్లీస్ జి. ఓ. సి. ((Brigadier General F G. Gillies G. O. C ) గారిచే నుద్ఘాటనముచేయబడెను. ఆతరువాత 1933 అక్టోబరు 14వ తేదీన అజ్మీరులో నింకొకవస్తుప్రదర్శనమునకు రాజపుటానా ఏ. జి జి. గారైన సర్. జి డి. ఓగ్లివై (Sir. G D Oglivie A G. G.) గారు ప్రారంభోత్సవమును జరిపించిరి

113. 1934 సం॥రములో సాహబ్జీమహారాజువారు దక్షిణదేశపర్యటనము నకై వెళ్ళిరి. ఆ సమయమున తిరువళ్ళేలీలో నొకవస్తుప్రదర్శనమును జరిపించిరి. శ్రీరామారావుగారు ఐ. సి. యస్. ఆవస్తుప్రదర్శనమును తెఱచిరి. పిమ్మట కొంతకాలమునకు శ్రీరామారావుగారు హేగులో నంతర్జాతీయ న్యాయస్థానమునకు (International Court at the Hague) న్యాయాధిపతిగ నియమింపబడిరి.

114. దీనితరువాత 1935 సం॥రము జనవరి 9వ తేదీన అలహాబాద్ హైకోర్టుకు ప్రధానన్యాయాధిపతియైన సర్ షా. మహమ్మద్ సులేమాన్‌గారు (Sir Shah Muhammad Sulaiman) అలహాబాదులో మఱొక వస్తుప్రదర్శనమునకు ప్రారంభోత్సవమును జరిపించిరి. దానితరువాత రాజప్రతినిధిగారి సమితిలో (Viceroy's Council) పారిశ్రామిక కార్మిక శాఖలసభ్యులైన (Member for Labour and Industries) సర్ ఫ్రాంక్ నోయిస్ గారు (Sir Frank Noyce) న్యూఢిల్లీలో నొకదయాల్బాగ్‌వస్తుప్రదర్శనమును తెఱచిరి. ఈప్రదర్శనములన్నియు చాలజయప్రదముగ జరిగినవి. వీని

మూలమున దేశమునందంతట, నీవస్తుప్రదర్శనముల నేర్పాటుచేయగలసత్సంగు లున్నస్థలములలో నెల్ల, ప్రజలకు దయాల్బాగువస్తువులయెడల నాదరాభిమాన ములు పెంపొంచెను.

115 అజ్మీరులో దయాల్బాగ్‌వస్తుప్రదర్శనము, ఆర్యసామాజికులు స్వామిదయానందుగారి యర్థశతాబ్ద్యుత్సవమునచ్చట జరిపించిన దినముల లోనే జరిగెను. అందుచే సహజముగ చాలమందియార్యసామాజికులకుగూడ సత్సంగమునకువచ్చి సాహబ్జీమహారాజువారు సెలవిచ్చిన మహోపన్యాసము లను వినియానందించుసౌభాగ్యము చేకూరెను.

## అలహాబాదులో నుపన్యాసములు

116. అలహాబాదులోని వస్తుప్రదర్శనసమయములో సాహబ్జీమహారాజు వారు 8-1-1935వ తేదీన కాయస్థపాఠశాలలో "హిందూదేశముయొక్క జాతీయసమస్య" (National Problem of India) యను రాజకీయవిష యముమీద నొకచరిత్రాత్మకమైన మహోపన్యాసము నిచ్చినందున, నాప్రద ర్శనము చిరస్మరణీయ మాయెను. ఆయుపన్యాసము. అందలిభావముల యపూ ర్వతోదారతలచేనేమి, దానిభాషాశైలిమాధుర్యముచేనేమి, వారియుపన్యాస వితరణశోభచేనేమి, యఖండసామర్థ్యోద్యోతకమై యద్భుతముగనుండెను. ఆ భాషణములో సాహబ్జీమహారాజువారు ప్రథమములో, హిందూదేశమును జయించిన యార్యులవృద్ధిపతనములచరిత్రను జెప్పి, పిమ్మట భారతీయుల కైక మత్యములోను పరస్పర సౌభ్రాత్రభావములోను శిక్షణగఱపిన మహమ్మదీయ జాతులచరిత్రను వివరించిరి. సాహబ్జీమహారాజువారు, ఆపరమశక్తి యటుపైన నాంగ్లేయుల నెన్నుకొనినదనియు, నిస్సంశయముగ వారు భారతీయుల యంధ విశ్వాసములను పక్షపాతబుద్ధులను తొలగించిరనియు జెప్పి, అయిన నా పరమ పితయొక్క మహోద్దేశ్యము మానవులలో పరస్పరసౌభ్రాత్రమును భగవం తునియెడల జగత్పితృత్వభావమును పెంపొందించుటయేగావున నాంగ్లేయులు తమప్రస్తుతపదవిని నిల్పుకొనగోరినచో, నా భగవంతుని మహాపథకమును గమనించి యాప్రకారము ప్రవర్తించవలసియుండునని సెలవిచ్చిరి. ఆభాష ణమునుండి యిచ్చట కొద్దిభాగములను మాత్రమే యెత్తివ్రాయుటకు సాధ్య మగును.

"నేను పరమార్థప్రధానమైనవాడనగుటచే నొక పరమదయామయమైన, సర్వజ్ఞమైన పరమచైతన్యశక్తి సమస్తజాతులయొక్కయు, సకల వ్యక్తుల యొక్కయు యదృష్టములను శాసించి నడిపించుచున్నదని నేను నమ్మెదను. ఈవిశ్వసృష్టియంతయు నొకదయాప్రపూర్ణపథకము ననుసరించి నడిపింపబడు చున్నదనియు, మానవజాతి తమకు తెలియకుండగనే యొకదయాభరితమైన యుత్తమగతికి గొంపోవబడుచున్నదనియు నాదృఢవిశ్వాసము.

"పరమచైతన్యశక్తి యొకటున్నదని మీరు నమ్మవచ్చును, నమ్మకపో వచ్చును, కాని యాంగ్లదేశము భారతదేశమును తన యనుంగుచిన్నసోదరిగ భావించి యీరెండుదేశములును తమసంపత్సాధనముల నొకటిగ జేర్చుకొని మానవజాత్యుత్కర్షకై కలిసి పాటుపడినచో, నీయుభయదేశములును గలిసి పృథ్విలో నొకమహత్తమశక్తిగనేర్పడి అందలియావత్ప్రజలకును మహాసుఖ సంపత్తులను జేకూర్చుటయేగాక, నీయావజ్జగత్తునకు శాంతిశ్రేయస్సులను జేకూర్చుమార్గమునుగూడ జూపగలవని మీరు తప్పక నొప్పుకొనవలసియుం డును. ఈనాడు సాయంకాలము ఆంగ్లదేశప్రజాప్రతినిధిసభవారు (British Parliament) యిఁకముందు ఈసామ్రాజ్యములో, భారతదేశ మాంగ్లదేశ ముతో సమానభాగరిగ నెంచబడుననియు, నాంగ్లదేశముతో సమానముగ భారతదేశముయొక్క శ్రేయస్సు గమనింపబడుననియు, నాంగ్లేయులతో సమ ముగ భారతీయు లాదరింపబడుదురనియు చాటింపుచేయించినచో మఱి యిరు వదినాల్గుగంటలలోనే దేశములోని యసంతృప్తియంతయు మటుమాయమై పోగలదు."

తరువాత మతమునుగూర్చి సాహెబ్జీమహారాజువారిట్లు సెలవిచ్చిరి:-

"మతము భగవంతుడు మానవులకు ప్రసాదించిన యుత్తమోత్తమ వరదానమును మానవుని ప్రాచీనతమమిత్రమునుగూడ. భావికాలమున మానవ జాతిని కాపాడునదదియే. మతమనగా మానవహృదయమును ప్రకాశవంతము గను పరిశుద్ధముగనుచేసి, మానవునియాత్మ కున్నతివికాసములను గలిగించి, యందుమూలముగ మానవుని మనస్సున పరస్పరసౌభ్రాత్రమును భగవంతుని యెడల జగత్పితృత్వభావమును విరాజిల్లజేయునట్టి మహాదివ్యజ్యోతి."

కట్టకడకు సాహెబ్జీమహారాజువారిక్రిందివిధమున నొకమహోత్తేజక సందేశమునిచ్చిరి:-

"మతము మానవులలో పరస్పరసౌభ్రాతృత్వమును భగవంతునియొక్క జగత్పితృత్వమును అనెడి మహాసత్యములను ప్రాచీనకాలమునుండియు బోధించు చుండెను. కాని మానవుడు స్వార్థపరుడగుటచే నామహాసత్యములను పెడచెవిని బెట్టెను. అయిన నాదైవపథకమును త్రోసిపుచ్చుట కెవరికిని శక్యముగాదు. మతముయొక్క ఈమహత్తమోపదేశము మృదుమధురశైలిలో బోధింపబడు టచేగాబోలు, మానవులు దానియెడల నుపేక్షాభావమును చూపిరి. సహజ ముగ నందుచేతనే యిప్పుడామహాసత్యములు కొంతవఱకునిష్ఠురమైనట్టియు బొత్తిగదుఃఖదాయకమైనట్టియు నార్థికకలహరూపమగుభాషలో బోధింప బడుచున్నది. మన మీమహాబోధ నిప్పుడుగూడ గ్రహించనియెడల, నేఁజెప్పు నది నమ్ముడు, మున్ముందు మన మా సత్యబోధను మంతుపాకీ (Machine gun) బాంబులయొక్క విపరీతనిష్ఠురభాషలో నేర్చుకొనవలసిన రోజు లెంతో యాలస్యముగాకుండగనే రానైయున్నవి. నేను కొద్దిసేపుముందుగనే జెప్పి నట్లు దైవపథక మేరికిని నిరసింపశక్యముగాదు. మీరు నమ్ముడు, నమ్మకపొండు, ఈప్రపంచములోని జాతులన్నియు నఖండపరస్పరభ్రాతృభావముతో మసలు కోవలసియున్నది. మానవుడు భగవంతుని జగత్పితృత్వము నంగీకరించుటకు సంసిద్ధుడుగావలెను."

మూడురోజులతర్వాత నలహాబాదువిశ్వవిద్యాలయ సంఘములో (Allahabad University Union) సాహబ్జీమహారాజువారు "మతముయొక్క దుఃఖములు" (Sorrows of Religion) అను శీర్షికతో మఱొకయుపన్యా సము నిచ్చిరి. ఈభాషణముగూడ నద్భుతశ్లాఘువడసెను.

## జూబిలీమహోత్సవము

117. సాహబ్జీమహారాజువారి ప్రభుత్వమున కిరువదియవ సంవత్సరము 1932 లో ప్రారంభమగుచున్నందున నాసంవత్సరములో నందఱకును మహా నందముగ నుండెను. కావున దయాల్బాగులోనున్నట్టియు, బాహ్యముననున్న ట్టియు సత్సంగులందఱును 1932 సంవత్సరము డిసెంబరునెలలో సాహబ్జీమహా రాజువారి జూబిలీయుత్సవమును జరిపించుటకు నిశ్చయించిరి. ఆప్రకారము జూబిలీయుత్సవమును దయాల్బాగులో మహావైభవముగ జరిపించుటకు 1932 డిసెంబరునెల చివరివారములో నేర్పాట్లుగావించబడెను.

118. ఆయుత్సవములో 12,500 మంది సత్సంగిసోదరీసోదరులు పాల్గొనిరి. చూడవచ్చినవారికి బసలకొఱకు వివిధసంస్థాభవనములు చాలక ననేకగుడార ములనుగూడ వేయించిరి. మూడురోజులు వరుసగ భండారా జరిగెను. సత్సంగులందఱకును సాహబ్జీమహారాజువారి యమృతవచనముల నాకర్ణించు చు సత్సంగము చేసికొను మహాభాగ్యము గలిగెను ఆయుత్సవమున కప్పు డొకసినీమానుగూడ దీయించిరి.

## బ్యాస్ సత్సంగముతో నొడంబడిక

119. జూబిలీయుత్సవమునకు బ్యాస్ సత్సంగనాయకులగు సర్దార్ సావనసిం గుగారుగూడ వచ్చిరి. బ్యాస్ సత్సంగుల కంతవఱకు పంచనామములను (అనగా నిరంజన, ఓమ్, రారంగ్, సోహంగ్, సత్ నామములు) స్మరణజేయుట నుపదే శించుచుండిరి. దయాల్బాగుసత్సంగులకు అట్లుగాక రాధాస్వామీనామస్మరణ ము నుపదేశించుచుండిరి. సర్దార్ సావనసింగుగారును సాహబ్జీమహారాజు వారు నీవిషయమునుగుఱించి చర్చించి, యుభయనాయకులు నొకయొడంబడి కనువ్రాసికొని సంతకములుచేసిరి. 1932 డిసెంబరు 25వ తేదీన నొకప్రత్యేక సమావేశము చేయబడి అందులో బ్యాస్ సత్సంగకార్యదర్శిగారిచే నా యొడం బడిక చదువబడెను. దయాల్బాగుబ్యాస్ సత్సంగు లంతవఱకును, తమతమ మూలసిద్ధాంతములలో వ్యత్యాసముండుటచే, వేఱుగనుండిరనియు, యిప్పు డాభేదములుతొలఁగిపోయి, యీరెండు సత్సంగములవారును పరమపురుష పూరన్ధనీ స్వామీజీమహారాజువారిని రాధాస్వామీదయాళుని యవతార పురుషులుగను, రాధాస్వామీనామమును పరమపురుషుని నిజనామముగను అంగీకరించి, యిఁకముందునుండి బ్యాస్ సత్సంగులకుగూడ, మొదటినుండియు దయాల్బాగుసత్సంగుల కెల్లపుడునీయబడుచున్నట్లే, యుపదేశసమయమున రాధాస్వామీనామ ముపదేశమీయబడుననియు నాయొడంబడికలో నితరవిష యలముతోఁబా టుదహరింపబడెను.

## విశ్వవిద్యాలయస్నాతకోత్సవమువద్దను బాలభటోత్సవమువద్దను

120. 1935 సం॥రములో సాహబ్జీమహారాజువారి నాగ్రా విశ్వవిద్యాలయ

ముయొక్క యెనిమిదవస్నాతకోత్సవములో నుపన్యాసమిచ్చుటకు ఆహ్వానించిరి. 23-11-1935 తేదీన వారా యుపన్యాసము నిచ్చిరి. ఆభాషణము సకల భారతీయవిశ్వవిద్యాలయములలో నిచ్చిన స్నాతకోత్సవోపన్యాసములన్నిటిలో నుత్తమోత్తమ శ్రేణికిజెందిన యుపన్యాసముగ పరిగణింపబడుచున్నది. వారా యుపన్యాసములో చివర నీక్రిందివిధముగ వక్కాణించిరి:-

"ప్రకృతి మానవునిశరీరములో, నొకప్రత్యేకచైతన్యశక్తి నుంచినది. ఈశక్తిగూడ మన శారీరికమానసికశక్తులవలెనే వికాసనొందినపుడు, మన మీ భౌతికనేత్రములతో నిపుడెట్లు ఈసూర్యుని ప్రత్యక్షముగ చూచుచుంటిమో యటులనే సత్యవస్తువునుగూడ కనుగొని చివర కాపరమసత్యమునుగూడ సాక్షాత్కరించుకొనగల్గుదుము. ఆయనుభవజ్ఞానము గల్గినపుడు వైజ్ఞానికుల లక్ష్యమైన సత్యవస్తువును, వేదాంతశాస్త్రముయొక్క ఆదర్శమైన పరమసత్యమును, మతముయొక్క గమ్యస్థానమయిన భగవంతునినుగూడ నొకేపరమతత్వము యొక్క మూడు వెవ్వేఱుపేర్లని మీరు తెలిసికొని విస్మయమును వినోదమునుగూడ నొందుదురు."

121. సేవాసమితిబాలభటసంఘమువారు 1935 సం॥రము డిసెంబరునెలలో 27వ తేదీ మొదలుకొని 30వ తేదీవఱకు దయాల్బాగులో నఖిలభారతబాలభటోత్సవమును (జంబూరీ) జరిపిరి. సభవారా యుత్సవముయొక్క ఖర్చునంత నితరసహాయము నపేక్షించకుండ తామొక్కరే భరించుటకొప్పుకొనిరి. బాలభటులందఱకును రాధాస్వామీవిద్యాసంస్థయొక్క హాస్టలులోను, మాధ్యమికపాఠశాలాభవనములోనుగాక ననేకగుడారములలోగూడ వసతుల నేర్పాటుచేసిరి.

ఆయుత్సవాధికారులు సాహబ్జీమహారాజువారి నాయుత్సవమునకు పోషకులుగ నుండవలసినదనికోరి దానికి ప్రారంభోత్సవమును జరుపుటకై ఉత్తర ప్రదేశవిద్యాశాఖామంత్రిగారైన శ్రీజ్వాలాప్రసాద్ శ్రీవాస్తవగారి నాహ్వానించిరి. అఖిలభారతబాలభటప్రధానకమీషనరు (Chief Commisioner) గారైన శ్రీహృదయనాథకుంజ్రూగారుగూడ నాశిబిరమునకు వచ్చి మూడు రోజులుండిరి. దయాల్బాగువారా యుత్సవమున కొకటాకీసినీమానుగూడ దీయించిరి. బాలభటోత్సవముయొక్క సమాపకకార్యక్రమమును జరిపించు సందర్భములో సాహబ్జీమహారాజువారు వీడ్కోలుపన్యాసము నిచ్చుచు, నిట్లు బాలభటులకుల సలహానిచ్చిరి -

“మీరుమీనాయకులకు విధేయులుగనుండి, వారిననుసరించుచు వారి దృష్టాంతముల ననుకరింపుడు. వారియడుగుజాడలలో నడచుకొనుడు. మీరిండ్లకు వెడలిపోవునపుడు శూరబాలభటులవలెనే సిరమున భగవంతునిడికొని చిత్తమున స్థైర్యమునిడికొని జీవితసమస్యలనెదుర్కొనుటకై యీరంగమునుండి విశాలప్రపంచమహారంగములోఁ బ్రవేశించుడు.”

122. సాహబ్జీమహారాజువారు విద్యాశాఖపారిశ్రామికశాఖలలో నొనరించిన మహాఘనకృత్యములకు ప్రశంసాసూచకముగ ప్రభుత్వమువారు 1936 సంవత్సరములో సంవత్సరాదిరోజున ‘శూరాగ్రణి’ (Knight ,నైట్) యను బిరుదము నొసంగిరి. దేశములోని వివిధప్రాంతములలో వివిధవృత్తివ్యాపారములలోనున్న యసంఖ్యాకవ్యక్తులు అందుగుఱించి తమయానందమును ప్రకటించుచు వందలాది తంతులను అభినందనపత్రములను పంపిరి ప్రజలందఱకును సాహబ్జీమహారాజువారియం దట్టియద్భుతాదరగౌరవములు గలవు.

## పర్యటనములు

123. రానురాను భక్తులసంఖ్యపెరిగి చాలమందిభక్తులు భారతదేశముయొక్క దూరతమప్రాంతములలోనుండి, అందులో నధికసంఖ్యాకులకు దయాల్బాగువచ్చి సత్సంగమునుజేసికొనుటకు శక్తిలేకుండుటచే నట్టివారికి సత్సంగలాభము గలుగజేయుటకై, సాహబ్జీమహారాజువా రప్పుడప్పుడు దేశములోని వివిధప్రాంతములకు పర్యటనము సేయుచుండెడివారు. వారు సత్సంగు లధిక సంఖ్యాకులుగనుండినప్రాంతములకు అనగా పంజాబుబీ,హారు,మదరాసులకును, మధ్యప్రదేశములో రాజబరారీకిని తఱచుగ వెళ్ళుచుండెడివారు. అరుదుగ నితరస్థలములకును, అనగా బొంబాయి, కరాచీ, క్వెట్టా, అజ్మీరు, కలకత్తా పూరీ వగైరాస్థలములకుగూడ వారు వెళ్ళెడివారు.

124. సాహబ్జీమహారాజువారికి దక్షిణదేశమన్నను ఆప్రాంతపువారన్నను చాలయభిమానము. అంతకుముందుగూడ వారు దక్షిణదేశము వెళ్ళిరిగాని 1932, 1934 మఱియు 1937 సం॥రముల పర్యటనములు ప్రధానముగ చెప్పదగినవి. ఈపర్యటనములలో వారు చాలకాలము కుర్తాలములోనే యుండెడివారు. 1934లో వారు కన్యాకుమారీ అగ్రమునకు వెళ్ళిరి. కుర్తాలము, అచ్చటిజల

పాతములకును, మందమారుతములకును, సమశీతోష్ణస్థితికిని ప్రఖ్యాతిగాంచెను. సాహబ్జీమహారాజువారు 1934 సం॥రములో కూర్తాలములోనుండగా తిరువాన్కూరు రాష్ట్రములో నుద్యోగము చేయుచున్న డాక్టరు ముద్దిలుగారు వారిని ట్రివేండ్రము రమ్మని యాహ్వానించిరి. సాహబ్జీమహారాజవారు త్రివేంద్రము వెళ్ళిరి. ప్రభుత్వమువారు సాహబ్జీమహారాజువారిని తమయాతిథ్యము నంగీకరింపుడని వేడిరి. కాని సాహబ్జీమహారాజువారు తమతో గూడ సత్సంగులపరివారము అధికముగనుండుటచే వారందఱకును ప్రభుత్వమువారి ఖర్చుపై నాతిథ్యము నంగీకరించుట యుక్తముగాదని దలంచి యాయాహ్వానమును నిరాకరించిరి. సత్సంగులందఱకును విశ్రాంతిగృహమున బసలేర్పాటుచేసిరి. సాహబ్జీమహారాజవారు సముద్రతీరమునకు చాలదగ్గఱగనున్న డా॥ ముద్దిలుగారియింటనే బసచేసిరి. సాహబ్జీ హారాజువారు ఆపట్టణమందలి పురశ్రేష్ఠుల సమావేశములో నుపన్యాసమిచ్చుటకుగూడ నంగీకరించిరి. సాహబ్జీమహారాజువారును పరివారమును రోడ్డుమార్గమున కన్యాకుమార్యగ్రమునకు వెళ్ళిరి. కాని సాహబ్జీమహారాజువా రచ్చట సముద్రస్నానము చేయలేదు. సాహబ్జీమహారాజువా రాసముద్రతీరమును అందలి వెన్నెలురంగులుగల యిసుకతిన్నెలను విడచివచ్చునపుడు ఆయగ్రము తిరిగి మఱొకసారివచ్చి చూడదగినదని సెలవిచ్చిరి. తిరిగి 1937 సం॥రములో వారు కూర్తాలము వెళ్ళిరిగాని యాయగ్రమునకు వెళ్ళలేదు. అయినను వారి స్థానాపన్నులు వారిమాటను నెఱవేర్చిరి.

## వారి యద్భుత మహార్తిమత్త్వము

125. సాహబ్జీమహారాజువారు వివిధసంస్థలవృద్ధివికాసలకై తమశక్తినంతను వినియోగించి పాటుపడుచుండినను, వారు జీవులకు సలహాలుచెప్పి పథప్రదర్శనము చేయుట కెల్లప్పుడును సిద్ధముగనే యుండెడివారు. ఆమహాపురుషుని యభిప్రాయములుసంప్రతింపుల విషయములో ప్రభుత్వమువారికిగూడ నధిక గౌరవ ముండెను. ప్రభుత్వమువా రందుచేతనే వారిని ఉత్తరప్రదేశపారిశ్రామికసంస్థలసమితిలోను (Board of Industries), సాప్రూవిచారణసమితిలోను (Sapru committee) సభ్యునిగ నియమించిరి. సమితుల సమాలోచనలలో వారొనరించిన సహాయము నందఱును కొనియాడిరి.

వా రొక వైపున నిట్టి యనేక కార్యకలాపములలోను, మహోద్యమముల వ్యవస్థాపనజేయుటలోను నిమగ్నులైయుండియు బహిరంగసమావేశములలో నద్భుతోపన్యాసముల నిచ్చుటలోను సత్సంగములో నాశ్చర్యకరప్రవచనములను సెలవిచ్చుచుండుటలోను ఎవ్విధమునను కొఱతసేయ లేదు.

126. వారు రచించిన గ్రంథములు నటులనే మహావిశాలరంగము నావరించియున్నవి. వారు కవితలనునాటకములను వ్యాసములనేగాక యథార్థప్రకాశ్ వంటి మహాగ్రంథములనుగూడ రచించిరి. వారు రచించినగ్రంథములు హుజూరు మహారాజువారి గ్రంథములవలెనే యధికసంఖ్యాకములు, నధికపరిమాణముగలవియునగుటయేగాక నంతకన్న నెక్కువవిధములుగగూడ నున్నవి. వారుసత్సంగవారపత్రికలకు తఱచుగ వ్యాసములనుగూడ వ్రాసెడివారు. వారి కవితలు నాటకములలో గొన్ని, హిందీ సారస్వతములో నత్యుత్తమగ్రంథములతో తులతూగును.

127. రాధాస్వామీమతమునుగుఱించి ఆర్యసమాజమువారు పదేపదే చేయుచుండిన దుష్ప్రచారమునకు వారి యథార్థప్రకాశ్ అనెడిగ్రంథములో నద్భుతఖండనముండినందున, నా ప్రచారము పూర్తిగ కట్టువడి, రాధాస్వామీమతముయొక్కయు, నీసంఘముయొక్కయు పరువుప్రతిష్ఠలు పెంపొందెను

## కొన్ని విచిత్రానుభవములు

128. సాహబ్జీమహారాజువారు సత్సంగులమీద వర్షించిన యద్భుతదయాకటాక్షములను గూర్చి సలముచాలమిచే నింతవఱ కేమియు నిందుపొందుపఱచ లేకపోవుట నిజముగ విచారకరమే. ప్రతిసత్సంగికిని స్వవిషయములోను ఇతరుల విషయములోగూడ సాహబ్జీమహారాజువారు వర్షించిన యద్భుతదయానుభవము లెన్నియో జ్ఞాపకముండియేయుండును. అట్టియనుభవములను కొన్నిటిని మాత్రమే యిచ్చట నుదాహరణరూపముగ వ్రాయుచుంటిమి.

129. 1913 సం॥రము డిసెంబరునెలలో సాహబ్జీమహారాజువారి సత్సంగముకొఱకై అంబాలా వెళ్ళిన పెక్కుమందిసత్సంగులకొక యద్భుతానుభవముగలిగెను వారు అంబాలా వెళ్ళి మొదటిసారి సత్సంగములో కూర్చుండినపుడు, అచ్చట సత్సంగములో సర్కారుసాహబ్ వారు స్వయముగ నధ్యక్షు

లుగ విరాజమానమైయున్నట్లు దర్శనమాయెను. వారాశ్చర్యచకితులై, తమ కండ్లను తామేనమ్మలేక, అందులో గొందఱుతమకండ్లనుతుడిచికొనుటప్రారంభించిరి కాని యాదృశ్యమటులనే నిలచిపోయి, కొంతసేపయినపిమ్మట సాహబ్జీ మహారాజువారి రూపముగ మాఱిపోయెను. ఆప్రారంభదినములలో నీయనుభవము మామూలుగనే చాలమంది సత్సంగులకు గలుగుచుండెడిది.

130 శ్రీహరిలాలుగారి కుమార్తెకు మశూచికము వచ్చి కండ్లుపోయెను. డాక్టర్లు ఆమెకు శస్త్రచికిత్సచేయుట యవసరమనియు, నప్పటికైనను దృష్టి తిరిగివచ్చునని ధైర్యముచెప్పలేమనియు చెప్పిరి. శ్రీహరిలాలుగారు సాహబ్జీ మహారాజువారివద్దకు ఆపిల్లను తీసికొనివెళ్ళి ప్రార్థించగా, వారు శస్త్రచికిత్స చేయించవద్దని సలహాయిచ్చి క్రమక్రమముగ దృష్టిదానంతటనదే రాగలదని సెలవిచ్చిరి. వారితో మాటలాడినపిమ్మట శ్రీహరిలాలుగారిభార్య ఆపిల్లనెత్తుకొని తిరిగి యింటికి వచ్చుచుండగా త్రోవలో నాపిల్ల తనను బుజముమీదనుండి దించివేసినయెడల తానేనడచెదనని పట్టుపట్టెను. తల్లి అటులకాదనియు, దిగి నడచినచో నామెపడిపోవుననియు జెప్పగా నాపిల్ల తానుచక్కగ చూడగలనని చెప్పి దిగి, యింటికిచక్కగ నడచివెళ్ళెను. క్రమముగ నామెకు కనుచూపు పూర్తిగ చక్కబడి యిప్పటికి నామెదృష్టి చక్కగనేయున్నది.

131 సాహబ్జీమహారాజువారు కూర్తాలములోనున్న రోజులలో నచ్చటిజను లాకొండలమీద "పున్నమ" యను పుష్పమొకటి పున్నమనాడు రాత్రి పండువెన్నెలలో వికసించునని వారితో చెప్పిరి. పరివారములోని గొందఱు పిన్నపెద్దల కోరికపై, సాహబ్జీమహారాజువారు పౌర్ణమినాడురాత్రి పరివార సహితముగ వెళ్ళి యాపుష్పమును చూచుట కంగీకరించిరి. పరివారమందఱును మధ్యాహ్నము బయలుదేఱి కొండలమీదకు వెళ్ళి రాత్రి చంద్రోదయమయిన పిమ్మట నాపుష్పమును జూచిరి. తిరిగివచ్చుటకు, రాత్రియాలస్యమయినందున సాహబ్జీమహారాజువారు కొండమీదనుండి క్రిందికిపోవుట కేదైన దగ్గఱత్రోవ యున్నదాయని ప్రశ్నించిరి. గుఱ్ఱపుస్వారిత్రోవ యొకటి చాలదగ్గఱత్రోవయున్నదికాని, యందడుగడుగునకు సర్పములుండుటచే నెవరును రాత్రివేళ నాత్రోవను వెళ్ళుటకు సాహసించరని యచ్చటివారు చెప్పిరి అంత భయముగ నచ్చటిజనులుచెప్పినను సాహబ్జీమహారాజువా రాదగ్గఱత్రోవనే వెళ్లుటకు నిశ్చయించి, పిల్లలకు ధైర్యముగనుండుటకై యందఱకును ముందు తామే యుండి త్రోవజూపుదుమని సెలవిచ్చిరి. మొత్తమించుమించు నలువదిమం

దియు నొకరివెనుక నొకరుగ పంక్తికట్టి యందఱికన్న ముందు సాహబ్జీమహా రాజువారుండి యాయడ్డత్రోవను నడువసాగిరి. త్రోవలో పందలాదిసర్ప ములు బుసకొట్టుచు నిటునటుపోవుచుండెనుగాని యవెవ్వియు పరివారములో నొకరినిగూడ కఱవలేదు. అందఱును బసలకు సురక్షితముగజేరుకొని యా యద్భుతసంరక్షణకు చకితులయిరి.

132. సహాయ నిరాకరణోద్యమములో (Non-Co-operation movement) పాల్గొనుచుండిరను ననుమానముచే, ప్రభుత్వమువారు 1925-30 సం॥ర ముల మధ్యకాలములో తణుకుగ్రామవాస్తవ్యులైన శ్రీరామనాథముగారను నొకసత్సంగిని పట్టి కారాగృహ నునుంచిరి. ఆసత్సంగి, తాను నిర్దోషియైనను తనను ఖైదులోపెట్టిరని సాహబ్జీమహారాజువారికి వ్రాసికొనెను. సాహబ్జీ మహారాజువారు ఆగ్రాలో జిల్లామేజిస్ట్రేటుగనున్న యొకఆంగ్లేయుని నిందు విషయమై కలిసికొని. పశ్చిమగోదావరిజిల్లాకలెక్టరుగారికాయన నొకలేఖ వ్రాయుమని యడిగిరి. డిస్ట్రిక్టుమేజిస్ట్రేటుగా రామనుష్యునియందు వారికభిమాన మెందుచేతననియడుగగా సాహబ్జీమహారాజువా రావ్యక్తి నిర్దోషికాబట్టి తమ కాయభిమాన మున్నదనిచెప్పిరి. ఆయన నిర్దోషియని వారికెట్లు తెలియునని యడుగగా, సాహబ్జీమహారాజువా రావ్యక్తి సత్సంగియనియు, తాను నిర్దోషి నని తమకువ్రాసికొనెననియు చెప్పి సత్సంగులు తమకెన్నడు నసత్యము వ్రాయ రని సెలవిచ్చిరి. అయినను ఆగ్రాజిల్లామేజిస్ట్రేటుగారు తానేమియు జేయలేనని చెప్పిరి. కాని సాహబ్జీమహారాజువారు ఆగ్రాజిల్లా మేజిస్ట్రేటుతో మాట్లాడిన రోజుననే సరిగ నదేవేళకు శ్రీరామనాథముగారికి ప్రమాదకరమైనజబ్బు చేసినట్లు యినందున జైలుఅధికారులాయన చనిపోవుదురని భయపడి, పశ్చిమగోదా వరి జిల్లాకలెక్టరువద్దకు వెళ్ళి, శ్రీరామనాథంగారిని వెంటనే విడుదలచేయనిచో నాయన జైలులోనే చనిపోవచ్చుననియు, నట్లైనచో జిల్లాయధికారులకు నిర్ద యులనెడి యపఖ్యాతి గలుగగలదనియు చెప్పుకొనిరి. ఇవ్విధముగ శ్రీరామ నాథముగారు కారాగృహమునుండి వెంటనే విడుదలయైరి.

133. కాకినాడలో శ్రీ వి. వి. రమణమూర్తిగారు 1934 సం॥రములో రాధాస్వామిమతములో నుపదేశమునొందిరి. పిమ్మట కొంతకాలమునకు ఆయన తమమేనమామగారి గ్రామము వెళ్లుటకై బయలుదేఱెను. ఆయన తల్లిగారు రోజులు ప్రమాదముగనున్నవి కావున నొంటరిగ వెళ్ళవలదని,

యీయనను హెచ్చరించిరి. రాధాస్వామిదయాళురు తనను రక్షించుచుందురను నమ్మకముచే శ్రీరమణమూర్తిగారు తనతల్లిగారితో మాత్ర మటులనే చేసెదనని చెప్పి, యొంటిగనే పయనమై వెళ్ళెను. ఒకవారము, పదిరోజులయిన తర్వాత నొకనాయంకాలము రేఁజీకటిసమయమున శ్రీరమణమూర్తిగారు ఆయూరినుండి తిరిగియింటికివచ్చిరి ఆయనతల్లిగా రప్పటికి సత్సంగములో జేరలేదు. తనకుమారుని చూడగనే యామె కొక మహాపురుషుసఫోటోలు తనకుమారుని శరీరమంతటను ఆవరించియుండినట్లు గనబడెను. అంతట నామె యదేమిటని తనకుమారుని నాశ్చర్యముగ నడిగెను రమణమూర్తిగారి కేమియు గనపడనందున నతఁడాప్రశ్నకు జవాబుచెప్పలేక తనజేబునందున్న సాహబ్జీమహారాజువారి ఫోటోను పైకి తీసి చూపించెను. ఆయనతల్లిగా రా మహాస్వరూపమే తన కాతని శరీరమందంతటను కనిపించుచున్నదని చెప్పిరి. అప్పుడు సాహబ్జీమహారాజువారు తమపిల్లలను వారెచ్చటనున్నగూడ నెట్లు కాపాడుచుందురో యని యందఱు నచ్చెరువొందిరి

134. ఒకసారి పంజాబుపర్యటనముచేయుచుండగ సాహబ్జీమహారాజువారు లాయల్పూర నెడిగ్రామము వేంచేయుటకు నిశ్చయించిరి వారికిని వారిపరివారమునకును వసతుల నేర్పాటుచేయుటకై లాయల్పూరుసత్సంగులు చాలప్రయత్నములు చేసిరికాని తగినభవనమెద్దియు లభించలేదు. మఱొకయుపాయమేదియులేక వారొక మహ్మదీయసజ్జనునివద్దకు వెళ్ళి సహాయమునుగోరిరి. కాని యాయన క్రొత్తగ నిల్లుకట్టించుచుంటిననియు, సాహబ్జీమహారాజువారు లాయల్పూరు వేంచేయురోజున కదిపూర్తిగ నిర్మాణముగూడ కానేరదనియు సమాధానమిచ్చిరి. సత్సంగులు పాపము హతాశులగుటచే ఖిన్నమనస్కులై వెడలిపోయిరి ఆరాత్రియే మహమ్మదుప్రవక్త ఆమహమ్మదీయునకు స్వప్నములో దర్శనమిచ్చి, సత్సంగులవసతి కాగృహమునిచ్చుటకు నిరాకరించుట పొరపాటనియు, వచ్చుచున్నమహాపురుషు డొక 'వలీ' [1]యనియు, కావున నాగృహనిర్మాణమును త్వరలో పూర్తిజేసి, యా'వలీ'గారికి బసజేయుటకు తప్పక యివ్వవలసినదనియు నాయనకు జెప్పెను. ఆమఱునాఁడా మహమ్మదీయసజ్జనుడు వెదకికొనుచు నాసత్సంగులవద్దకువచ్చి వెంటనే తా నాగృహనిర్మాణమును పూర్తిచేసి, సాహబ్జీమహారాజువారు వచ్చుసరికి సిద్ధముచేసెదనని చెప్పెను. సాహబ్జీమహారాజువారు లాయల్పూరులో దిగినప్పుడాయిల్లు సిద్ధముగ నుండుటచే, వారందులోనే బసచేసిరి.

(1) వలీ యనగా మహమ్మదీయులలో భగవత్సాన్నిధ్యమునొందిన సిద్ధపురుషుడని యర్థము

135. శ్రీ యమ్. జె. రామమూర్తిగారనునొకమదరాసుసత్సంగి యొకసారి చాలజబ్బుచేయగ, డాక్టర్లు పరీక్షచేసి యాయనకు క్షయ రోగమని నిర్ణయించిరి. పూనాలో నొకయాసుపత్రిలో నాయనను జేర్చిరి. ఒకనా డాయన స్పృహాలేకుండ నుండిపోయెను. ఆయాసుపత్రిలో సివిలుసర్జనుగ (Civil Surgeon) నున్న యొకయాంగ్లేయుడు రాత్రి పదిగంటలవఱకును తానుస్వయముగ నాసుపత్రిలో నుండిపోయి ఆయనకు స్పృహారప్పించుటకై యనేకప్రయత్నములు చేసెను. రాత్రి 10 గంటలకు శ్రీ రామమూర్తిగారు కండ్లు తెఱచిరి వెంటనే సివిలుసర్జనుగా రాయనకు పాలలో కోడిగుడ్డునుకలిపి త్రాగుమని యిచ్చిరి. శ్రీరామమూర్తిగా రిదేమియని ప్రశ్నించి అది కోడిగుడ్డుకలిపిన పాలని తెలియగనే దానిని నిరాకరించిరి అంతవఱకు నాయనకు స్పృహా తెప్పించుటకై సివిలుసర్జనుగారు చాలశ్రమ తీసికొనియున్నందున నీ నిరాకరణముచే చాల కుపితుడై, యీ పానీయమును త్రాగనిచో నీవు చనిపోవుదువని శ్రీ రామమూర్తిగారికి భీతాంగముగల్గునట్లు చెప్పిరి. శ్రీ రామమూర్తిగారు, చనిపోయినను బెంగలేదనిచెప్పి యీపానీయమును నిరాకరించెను. కాని సివిలుసర్జనుగా రాయన నాసుపత్రిలో చనిపోనీయుననిచెప్పి, వెంటనే యాసుపత్రి నుండి విడుదల జేయుటకుత్తరువిచ్చిరి. బయటకు వచ్చినతరువాత శ్రీరామమూర్తిగారు వెంటనే సాహబ్జీవారి కీవిషయమంతయు వ్రాసికొనగా, సాహబ్జీ మహారాజువా రాయనకు బెంగపెట్టుకొన నక్కఱలేదనియు, కోడిగ్రుడ్డునకు ప్రత్యామ్నాయముగ తీసికొనదగిన పదార్థములింక నెన్నియో యున్నవనియు సమాధానము వ్రాయించిరి. శ్రీ రామమూర్తిగారి కట్టిపదార్థము లెవ్వియు తెలియలేదు. కాని ఆయన యారోగ్యము ఆరోజునుండియు నానాటికి చక్కఁబడె. తరువాత నాయన 26 సంవత్సరములు జీవించిరి.

136 కాకినాడవాస్తవ్యులయిన శ్రీ వి గణపతిశాస్త్రిగారు రాధాస్వామీ మతమునుగుఱించి చాలఖండనజేసెడివారు. గృహస్థుడు గురువుకా నేరడనియు, దండకమండలములు, కాషాయవస్త్రములుధరించి ముండితశిరస్కుడైన సన్యాసియే సద్గురుపదవి కర్హులనియు వారియభిప్రాయము. 1934 సం॥రము డిసెంబరు 19వ తేదీన ఆయన సాహబ్జీమహారాజువారినిగుఱించి చాలయెక్కువగ ఛిద్రాన్వేషణజేసిరి. ఆనాడురాత్రి సాహబ్జీమహారాజువా రాయనకు స్వప్నములో పూర్తిగ కేశఖండనమైనశిరస్సుతో దండకమండలములుప్రక్కన నుంచుకొని

కాషాయవస్త్రధారియై పద్మాసనములో నిర్వికల్పసమాధిలో మగ్నమైన సన్యాసిరూపములో దర్శనమిచ్చిరి. శాస్త్రిగారి కప్పుడు తనపొరపాటర్థమై, అశ్రుపూరితనేత్రములతో స్వప్నములో నాదివ్యపవిత్రస్వరూపమునెదుట సాష్టాంగప్రణామము జేసెను. ఆవెంటనే శాస్త్రిగారు సకుటుంబముగ దయాల్బాగు వెళ్ళి యుపదేశమునొందిరి.

137. అయినను శ్రీ శాస్త్రిగారికి బ్రాహ్మణేతరులతో సహపంక్తిభోజనము చేయకూడదని పట్టుదలయుండుటచే, భండారాసమయమున సాంఘిక భోజనములలో పాల్గొనుట కిష్టముండెడిది కాదు. అందుచే నాయనకు గొంత యశాంతిగనుండెడిది. 1935 సం॥రము ఏప్రిలు నెలలో భండారారోజున ఉదయముపూట నీవిషయమై తమయింటిలో మాటలు రాగా శ్రీ శాస్త్రిగారు భగవద్గీతనుండి యీక్రిందిశ్లోకమును చదివి, అందులో శ్రీకృష్ణుడు అర్జునునికి చెప్పినట్లు సాహబ్జీమహారాజువారు స్వయముగ వాకుత్తరువిచ్చినయెడల నేను ఈభండారాలో సహపంక్తిభోజనములో పాల్గొందునని యనిరి.

శ్లోకము · సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥

అర్థము : "నీవు ధర్మములన్నిటిని (ఇంతవఱకుధర్మములనినీ వెంచుచుండినభావములనన్నిటిని) విడిచిపెట్టి, అనన్యభావముతో నా శరణమునొందుము. అట్లుచేసినయెడల నేను నిన్ను సకలపాపములనుండియు గాపాడెదను. నీకేమియు చింత యవసరములేదు"

ఈశ్లోకము చదివి, పైనవ్రాసినట్లింటిలోనివారితోనని శాస్త్రిగారు వెంటనే సత్సంగమునకు వెళ్ళిరి. సత్సంగహాలునకు వెళ్ళగనే సాహబ్జీమహారాజువారాయననుపిలిచి వారి సింహాసనమునకు సమీపమున కూర్చుండుమని సెలవిచ్చి ఆయన యట్లుకూర్చుండినవెంటనే, భగవద్గీతలలోనుండి సరిగనదే శ్లోకమును పఠించి, భండారాభోజనము మహాప్రసాదమని చెప్పి తప్పకనందఱును భండారాలో పాల్గొనవలసినదని సెలవిచ్చిరి. శాస్త్రిగారు తనమనస్సునకు క్లేశము కలిగించుచున్నట్టియు తనధర్మపత్నిగారితో నంతకుకొద్దినిముసములకిత్రమే ప్రసంగించినట్టియు విషయమునుగుఱించియే సాహబ్జీమహారాజువారు తనయభీష్ట శ్లోకమును పఠించి చెప్పుచుండుటవినగా, విస్మయానందచకితులై ఆరోజున భండారాలోసంతోషముతో పాల్గొనిరి.

ఇట్టి విచిత్రానుభవములు ప్రతిసత్సంగిజీవితములో నెన్నియో గలుగుచుండెను.

# అనారోగ్యము

138. సాహబ్జీమహారాజువారికి 1932 సం॥రము మొదలుకొని యప్పటప్పట అనారోగ్యముగనుండుచుండెడిది. కాని వారికి 1935 సం॥రమునుండియు ననారోగ్యము స్థాయిగానుండిపోయినట్లుండెను. అయిననుగూడ వారు కష్టపడి పనిచేయుచుండుటచే నా యనారోగ్య మప్పుడప్పుడు తీవ్రరూపమును దాల్చుచుండెడిది. సాహబ్జీమహారాజువారు 1935 సం॥రము వేసంగులలో శీతలప్రదేశమునకు వెళ్ళియుండుటచే నాసంవత్సరము ద్వితీయార్థములో వారియారోగ్యము చాలబాగుపడెను. కాని 1936 సం॥రములో తిరిగి వారికారోగ్యము చెడిపోయెను ఆసంవత్సరము వారు 'కూలూ' రోడ్డులోనున్న 'కోట్లా' 'పాలంపూరు'లకు విశ్రాంతికై వెళ్ళదలచిరి. వారితో గలిసి వెళ్ళుటకు దాదాపు 20 మంది సత్సంగులకుమాత్రమే యనుమతినొసంగిరి. లాహోరున కావల ప్రయాణమున కేర్పాట్లన్నియును, 'కోట్లా' లోను పిమ్మట 'పాలంపూరు' లోను బసలువగైరా అన్నియేర్పాట్లును మెహతాజీసాహబ్ వారే చేయించిరి. సాహబ్జీమహారాజువారికి కొద్దిరోజు లచ్చటనున్నపిమ్మట నారోగ్యము బాగుపడుచున్నట్లు కనిపించెను. పఠాన్‌కోటనుండి కావలసినంతస్వచ్ఛోదకమును, లాహోరునుండి నవనవలాడుకూరగాయలను విరివిగ తెప్పించుటకు అమోఘమయిన యేర్పాట్లు చేయబడినవి. కాని పవిత్రకుటుంబములో గొందఱకిష్టము లేనందున సాహబ్జీమహారాజువా రచ్చటవిశ్రాంతికాలమును అకస్మాత్తుగ తగించుకొని, మొదటననుకొనిన యవధికంటె చాలముందుగనే దయాల్బాగు తిరిగివచ్చివేసిరి.

139. సాహబ్జీమహారాజువారి యారోగ్య మప్పుడప్పుడు బాగుపడుచున్నట్లగుపించుచుండినను, మొత్తముమీద నసంతృప్తికరముగనే యుండుటచే సత్సంగులందఱకును ఆందోళనగను విచారముగనే యుండెను. 1936 సం॥రములో సాహబ్జీమహారాజువారి 55వ జన్మదినమునాడు సత్సంగులు వారి కొకలిఖితరూపమైన విన్నపమును చేసికొనిరి. ఆవిన్నపములో వారు తమయారోగ్యము బాగుపడునట్లును వా రింకను కొన్నిసంవత్సరములు సత్సంగులందఱకును పథప్రదర్శనముజరిగించుచునుండునట్లును దివ్యేచ్ఛను ధరింపవలయునని ప్రార్థించిరి.

140 1936 సం॥రము డిసెంబరునెలలో, హుజూరుమహారాజువారి భండారాసందర్భములో సత్సంగుల సార్వజనీనసమావేశ మొకటిప్రత్యేకముగ జేయబడెను. 6000 మంది సత్సంగు లందుపాల్గొనిరి. సాహబ్జీమహారాజువా రపుడొకప్రభావోపేతభాషణము నిచ్చుచు నిట్లుసెలవిచ్చిరి.

"దైవము పూర్వకాలమునుండియు మానవజాతికంతకును వృద్ధివికాసలను గలుగజేయునిమిత్త మెల్లపుడు నేదోయొక దేశప్రజను లేక సంఘము నెన్నుకొనుచున్నట్లు మనకు చరిత్ర చెప్పుచున్నది. ఈయుగమున నాయద్భుత సౌభాగ్య మిపుడు రాధాస్వామీసంఘమున కనుగ్రహింపబడినది. దైవ మీసంఘముద్వారా మానవజాతికి వాస్తవపారమార్థికజీవనమును గడుపుచు, సమస్తజాతులును వ్యక్తులును పరస్పరసామ్యభావముతో స్వధర్మపరిజ్ఞానము గలిగి ప్రవర్తించునట్లు బోధించదలంచుచున్నాడు."

## మదరాసున కంతిమపర్యటనము

141. దక్షిణ దేశమునకు సాహబ్జీమహారాజువారిని రమ్మనిప్రార్థించుచు 1937 సం॥రము ప్రారంభములో బలవత్తరాహ్వానములు వచ్చెను. కాని వారి యారోగ్యము బాగులేనందున, మేనెల చివరవఱకును నిశ్చితముగ నేప్రణాళిక నేర్పాటుచేయుటకు వీలుకాలేదు. వా రందుచే 31-5-1937వ తేదీననే మదరాసు బయలుదేఱిరి. వారితోగూడ 60మందికి పైగాసత్సంగులపరివార ముండెను. వారికిని పరివారమునకునుగూడ జి. టి. ఎక్స్ప్రెస్‌లో (G T. Express) ముందుగ స్థలము నట్టేయుంచున ట్లేర్పాటుచేయబడెను. వారు దయాల్బాగునుండి వెడలిపోవుటకుముందు ప్రతికార్యకర్తకు, తామేదో దీర్ఘయాత్రపై వెడలుచున్నట్లే, భావిసూచనాగర్భితముగ, విస్పష్టాదేశముల నిచ్చిరి. పరివారమందఱును సుఖాసీనులైరో లేదో కనిపెట్టుటకై పరివారమున కేర్పాటైన రైలుపెట్టెలవద్దకు వారు స్వయముగ వెళ్ళి చూచిరి. రాత్రి 10గం. 30 ని॥లకు బండి బయలుదేఱునపుడు వారు, తమరిని చూచుటకై స్టేషనువద్దకు వచ్చినవారందఱినుండి, తా మింకతిరిగిరారేమోయని తోచువిధముననే, వీడ్కోలభివందనముల నందుకొనిరి. త్రోవలోని స్టేషనులలో రాత్రిళ్ళు ఎట్టివేళయైననుగూడ సత్సంగులు వారిదర్శనార్థమై వచ్చుచుండెడివారు.

142. పరివారమందఱును 42గంటలు ప్రయాణముచేసి, మదరాసు చేరుకొనిరి. అంతకుముందుపంపిన వార్తప్రకారము సాహబ్జీమహారాజువారిని తీసికొనివెళ్ళుట కొఱకు రోగులకుర్చీ (Invalid chair) యేర్పాటుచేయబడెను. కాని రైలు మదరాసుస్టేషనులోనికి వచ్చుచుండగనే సాహబ్జీమహారాజువారు తమ పెట్టెగుమ్మమువద్ద నిలువబడియుండి సత్సంగులందఱకును దర్శనమిచ్చిరి. వారికిని వారిపరివారమునకును స్వాగతమిచ్చుటకు వచ్చియున్న శ్రీగణేశ్వరరావు, శ్రీ టి. సత్యనారాయణగార్లకు వారివిధముగ నిలువబడియుండుట చూడగనే చాలసంతోషమాయెను. వారు రైలునుండి దిగి శ్రీగణేశ్వరరావుగారి కరచాలనము (Shake hands) చేసినపుడు తమపవిత్రహస్తముతో నాయన చేతిని పట్టిగట్టిగనొక్కగా శ్రీగణేశ్వరరావుగారిచేయి నలిగిపోయి కొంతసేపటివఱకు తిరిగి యధాస్థితికిరాలేదు. వారు శ్రీగణేశ్వరరావుగారిని 'పునర్యౌవనప్రాప్తి గలిగినసత్సంగి(Rejuvenated Sastsaıgı)యనిరి.ఎప్పటివలెనే సాహబ్జీమహారాజువారుత్సాహోల్లాసములతో నుండుటచే వారనారోగ్యముగను బలహీనముగ నున్నట్లు మొదట నేల వార్తనంపిరని యందఱు నచ్చెరువోయిరి. వారి స్వాగతమునకై దెచ్చిన హారమును ధరించినపిదప వారు తమకొఱకేర్పాటుజేసిన సప్తాసనములుగల(Seven Seater)పెద్ద మోటారుకారువద్దకు మహాచక్రవర్తిశోభతో నడచివెళ్ళిరి. దానిని చూచి వారు, "ఇంత మోటారుకారా యీశరీరమునకు?" అని యనిరి. శ్రీగణేశ్వరరావుగారు కారు నడుపుట కనుజ్ఞను ముందుగనే పొందియుండిరి. సాహబ్జీమహారాజువారు శ్రీగణేశ్వరరావుగారిని సముద్రపుటొడ్డున కారును నడుపుమనిరి. సముద్రము కనిపించగనే కారును నెమ్మదిగ నడుపుమని యానతినిచ్చిరి. సాహబ్జీమహారాజువారుల్లాసముగనున్నట్లగుపించిరి. వారి బసకేర్పాటుజేసిన సుందరమహాలు అనుభవనమునకు దగ్గఱగ వచ్చినతోడనే వారుకారును సముద్రపుటొడ్డున మఱికొంతదూరము తీసికొనివెళ్లుమని శ్రీగణేశ్వరరావుగారి కానతిసిచ్చిరి మైసూరురాజభవనమున కెదురుగ వెళ్ళినతోడనే సాహబ్జీమహారాజువారు కారును వెనుకకు త్రిప్పి సుందరమహాలునకు పోనిమ్మని సెలవిచ్చిరి. అప్పుడు సాహబ్జీమహారాజువారు తాము తిరుగుప్రయాణములో సముద్రపుటొడ్డున మైసూరురాజభవనమువంటి చోట బసచేయుదుమని సూచనగజెప్పిరి. సుందరమహాలునకు వచ్చి వారికొఱకై ప్రత్యేకముగ చేయించిన నూకమానుకఱ్ఱ(Rose Wood) మంచమును చూచి 'యిట్టిమంచముకూడనా యీ శరీరమునకు?' అని యనిరి. సాధారణ

వచనములవలె గన్పట్టు నీమాటలగూఢార్థము సత్సంగులకు, సాహజ్జీమహారాజు వారు 22 రోజులతరువాత శరీరమును విడిచినపుడే బోధపడెను.

143. సాహజ్జీమహారాజువా రామంచముమీద 20నిముషములు విశ్రాంతి దీసికొనినతర్వాత వెంటనే సత్సంగము ప్రారంభించిరి. మంగళాచరణ మైపోవ గనే శబ్దములనెవరుపాడెదరని సాహజ్జీమహారాజువారు ప్రశ్నించిరి. శ్రీగణేశ్వ రరావుగారు 'నేనుపాడెదనని'ముందుకురాగా, సాహజ్జీమహారాజువారు'పోలీసు మనిషి శబ్దములను పారము చేయుటా?' అని యనిరి. అందఱు నాపరిహాసము నకు సంతోషముతో నవ్వినమీదట సాహజ్జీమహారాజువారు వెంటనే'కాదులే, పోలీసువాళ్ళలోను తేడాలున్నవి శబ్దములను పఠింపుము' అని సెలవిచ్చిరి. శబ్దపాఠము జరుగుచుండెను. టెంకాశీకి పోవునట్టిరైలుకు 15నిముసములు మాత్రమే కాలవ్యవధియుండినపుడు శ్రీగణేశ్వరరావుగారు సాహజ్జీమహారాజు వారి కుటుంబమును ఎగ్మూరు రైల్వేస్టేషనుకు కారులో పంపివేసి, సాహజ్జీ మహారాజువారితో రైలున కింక 14 నిముసముల వ్యవధిమాత్రమే యున్న దని నెమ్మదిగ మనవిజేసిరి. సాహజ్జీమహారాజువారు చిఱునగవుతో '14నిమి షములా! 14 నిముసములలో 14జగత్తులు పైకెక్కి 14 జగత్తులు క్రిందికి దిగి రాగలవు! పారమును కానిండు' అని సెలవిచ్చిరి. మఱొక్కశబ్దమును చదివిన తరువాత, నీ యేర్పాట్ల పూచీయంతయు శ్రీగణేశ్వరరావుగారిమీదనే యుండు టచే నాయన యాందోళనపడి, తిరిగి సాహజ్జీమహారాజువారికి, రైలు కింకనైదు నిమిషములుమాత్రమే వ్యవధిగలదని జ్ఞాపకముచేసిరి. అప్పుడు వారు వినతి పఠించుమని దయతో నానతినిచ్చిరి. సత్సంగానంతరము సాహజ్జీమహారాజువారు కారులో కూర్చుండగ శ్రీగణేశ్వరరావుగారు దానిని నడిపించిరి. స్టేషనుకువెళ్ళ గనే రైలు ఇంకను అరగంట యాలస్యముగ బయలుదేఱునని తెలిసెను. మఱునాడు, జూన్ 4వ తేదీ మధ్యాహ్నము 2 గం॥ 30 ని॥లకు అందఱును టెంకాశీవెళ్ళిరి అచ్చటదిగి కొంతదూరము రోడ్డుప్రయాణముచేసిన తర్వాత నందఱును కూర్తాలము జేరుకొనిరి. కూర్తాలము సముద్రమట్టమునుండి 2000 అడుగులయెత్తుననున్నది.

144. 1937 సం॥రము జూన్ 20వ తేదీవఱకు సాహజ్జీమహారాజువారు కూర్తాలములోనుండిరి. జూన్ నెల 4వ తేదీ మొదలుకొని 10వ తేదీవఱకును, వారు సత్సంగములో వచనములను ప్రతిదినమును తప్పకుండ సెలవిచ్చుచుం

డిరి, ఆ 6, 7రోజులును వారు రిక్షాపైన కొద్దిదూరము షికారుగ వెళ్లుచుండెడివారు. మొదటి కొద్దిరోజులలో వారియారోగ్యము బాగుపడుచున్నట్లు సూచనలు కనిపించెను. త్రివేంద్రముకూడ వెళ్ళుటకై వారు మొదట నేర్పాటుచేసికొనిరి. కాని దివ్యేచ్ఛ మఱొకలాగుననుండుటచే వారాయుద్దేశ్యమును మానివేసి తిరిగి మదరాసునకు వెంటనే వెళ్ళిపోవలెనని యకస్మాత్తుగ నిశ్చయించిరి. ఈమధ్యకాలములో వారికి మైసూరు రాజభవనములో వసతి కేర్పాటుచేయబడెను. కూర్తాలములోనున్న చివరరోజులలో సాహబ్జీమహారాజువారొకనాడుదయమున కొన్ని క్రొత్తవిషయములను సత్సంగులకు చెప్పవలసియున్నదని చెప్పి, తమవైద్యుల యనుమతిఁదీసికొని, మార్గమధ్యమున నున్న వేర్వేఱు చైతన్యధామములను ఆత్మ దాఁటిపోవుచు రాధాస్వామీధామమువఱకు నెట్లారోహించునో వివరించుచు నొకయద్భుతజ్ఞానదాయకమైన వచనమును సెలవిచ్చిరి. వారివర్ణన మెంతమధురముగను, విస్పష్టముగనుండెననగ, నందఱుసత్సంగులు నానిర్మలచైతన్యధామముల దేదీప్యమాన తేజః ప్రకాశమును కనులార గాంచుచుండినట్లే యానందపరవశులై నిశ్చేష్టులై వినిరి. అయిదేసినిమిషముల కొకసారి వారాయాసపడుచు నాఁగి యూపిరిపీల్చుకొని తిరిగి ప్రారంభించుచుండెడివారు అట్లు 45 నిముసములసేపావచనమును సెలవిచ్చి, వారు తమ గదిలోనికి వెళ్ళిరి. వారు సత్సంగములో మామూలుగ సెలవిచ్చెడి వచనములలో నిదియ చిట్టచివరిది. శ్రీగణేశ్వరరావుగారు దుఃఖస్వరముతో సాహబ్జీమహారాజువారిని "సద్గురువున కిట్టిజబ్బేల"నని సాహసించి యడుగఁగ, సాహబ్జీమహారాజువారు వెంటనే "ఇటుచూడుము, సత్సంగులందఱును పవిత్రజీవితమును గడపుచుండినచో నాకు జబ్బేలగలుగును?" అని సమాధానమిచ్చిరి. ఈహృదయవిదారకవాక్యమును విన్నతోడనే శ్రీగణేశ్వరరావుగారు వెక్కి వెక్కి యేడ్వసాగిరి. హుజూరువారపుడు 'ఏడ్చిన ప్రయోజనములేదు. బయటకు వెళ్ళి సత్సంగులందఱకును నేనిట్లంటినని యెలుఁగెత్తి చెప్పుము' అని సెలవిచ్చిరి. అప్పుడు గణేశ్వరరావుగారు బయటకువెళ్ళి హుజూరువారి సందేశము నందఱకునుతెలియజేసిరి. అందువలన సత్సంగులమీద గలిగినప్రభావము కేవలమూహింపదగినదే. అందఱును ఖిన్నులైరి.

145. ఒకనాడు సాయంకాలము 'మధుర'సత్సంగులు సాహబ్జీమహారాజువారిని మదరాసునకు తిరిగి వెళ్ళునపుడు త్రోవలో కొన్నిగంటలసేపు మధురలో నాఁగవలసినదని ప్రార్థించిరి. సాహబ్జీమహారాజువారు తమ కృశించిన హస్త

ములను చూపి, పరిహాసపూర్వకముగ "నేను బలముగనున్నపుడు మీరు నన్నా హ్వానింపలేదు. ప్రస్తుతము నాయారోగ్య మెట్లున్నదో చూడుడు. ఎటులైనను తిరిగి నేను గణేశ్వరరావువలె దృఢకాయుడనైనపుడు మీయూరు వచ్చెదను" అనిసెలవిచ్చిరి. వారియుత్తరాధికారియొక్క దృఢకాయములో సాహబ్జీమహారాజువారు తరువాత చాలసార్లాయూరు వెళ్ళి తమవాగ్దానమును నిలుపుకొనిరి.

146. కూర్తాలములో సత్సంగకార్యదర్శి 20-6-1937 తేదీన సాహబ్జీమహారాజువారిని తమరుగ్ణతను విసర్జించివేయుడని ప్రార్థించగా, హుజూరువారిట్లు సెలవిచ్చిరి, "మనము హుజూరు రాధాస్వామీదయాళుని దివ్యేచ్ఛకు సంపూర్ణముగను నిబంధనరహితముగను అధీనులమైయుండవలెను నేనుస్వయముగ జబ్బును కోరగూడదు హుజూరు రాధాస్వామీదయాళుడు మనకేమిదయఁజేసిన నద్దానినే మనము సంతోషపూర్వకముగ స్వీకరించవలయును. వారు నన్ను రాజునుచేసినచో నిదివఱలో నేరాజు నెన్నడు నధిష్ఠించలేనంత వైభవముతో నేను సింహాసనము నధిష్ఠించెదను. లేక, వారు నన్ను బూడిదలో దొరలునట్లుచేసినచో నిదివఱలో నేబిచ్చగాడు నెన్నడుదొర్లనిరీతి నదేపనిగ బూడిదలోఁబడి దొర్లుచుందును."

147. మదరాసుబయలుదేఱుదినమున, వారచ్చటనున్న సత్సంగులందఱకును వారి చరణములకు మ్రొక్కు-సావకాశము ననుగ్రహించి ఒక్కొక్క-వ్యక్తినే ప్రత్యేకముగ దీవించిరి. సత్సంగమయినతర్వాత బట్టబయట నొకక్యాంపుకాటుమీద విశ్రాంతిదీసికొనుచు, సేఠ్ నిహాల్ చందుగారితో "పవిత్రమైనహృదయముగలవారు ధన్యులు. ఏలనన, నట్టివారలకు భగవద్దర్శనభాగ్యము సేకూరును" అనియనిరి. (ఇదిబైబిలులో, మేథ్యూ V-8 నుండి ఉద్ధృతము)

148. సాహబ్జీమహారాజువారితో కలిసి ప్రయాణముజేసిన సౌభాగ్యము గలిగినవారికి కూర్తాలమునుండి మదరాసునకుచేసిన ప్రయాణ మెన్నటికిని మఱువశక్యముగాదు. రైలు మదరాసుజేరుటకు కొన్నిగంటలుముందుగనే సాహబ్జీమహారాజువారు బెత్తముపట్టుకొని దిగుటకుసిద్ధమై యుండిరి. వారు శ్రీద్వారకాబాసీగారిని, "మదరా సెప్పటికి జేరుదుము" అని యుండియుండి ప్రశ్నించుచుండెడివారు.

149. ఎట్టకేలకు ప్రయాణము పూర్తియై యందఱును మదరాసుజేరిరి. సాహబ్జీమహారాజువారికి పరివారసమేతముగ మైసూరు రాజభవనములోనే వసతియేర్పాటు చేయబడెను. జూన్ 23వ తేదీ ఉదయము సత్సంగులందఱకు సాహబ్జీమహారాజవారి యారోగ్యమునుగుఱించి చాలయాందోళనగనుండుటచే, నెవరైన నొకనిపుణవైద్యునిచే వారిని పరీక్షింపజేయవలయునని నిశ్చయించిరి. వారివద్దకువెళ్ళి యట్లుప్రార్థించగా వారు "నేనుచనిపోయెదనని మీకుభయమేల? సరే, మీకెట్లు తృప్తిగనుండునో అట్లేచేయుడు" అని నవ్వుచుననిరి. హృదయరోగచికిత్సానిపుణులైన డా॥ గురుస్వామి మొదలియారుగారిని పిలిపించిరి. ప్రారంభమునుండియు ప్రయాణములో సాహబ్జీమహారాజువారి యారోగ్యమును కనిపెట్టుచున్న డాక్టర్ కబూల్ చంద్, డా॥ జయరాజబిహారిగార్లిరువురి సమక్షమందు డా॥ గురుస్వామి మొదలియారు సాహబ్జీమహారాజువారిని సమగ్రముగ పరీక్షించిరి. ఆ పరిశీలనాసమయములో సాహబ్జీమహారాజువారు చిఱునగవునవ్వుచు చాలయుల్లాసముగనుండిరి. డాక్టరు గురుస్వామిగారిని సాహబ్జీమహారాజువారు, "మీసలహా యేమి?" యని ప్రశ్నించిరి. డాక్టరుగారు "మీకు పరిపూర్ణవిశ్రాంతి కావలయు" నని సమాధానము చెప్పిరి. సాహబ్జీమహారాజువారు పకాలున నవ్వుచు "శరీరమనస్సుల రెండిటికిని పరిపూర్ణవిశ్రాంతియా?" యని బదులడిగిరి. డాక్టరుగా రందుకు తలయూడించి సమ్మతినిదెలిపిరి. సాహబ్జీమహారాజువారు, "మనస్సు విశ్రాంతి నొందినచో మరణమే గలుగునుగదా, వైద్యమహాశయులారా!" యనినుడివిరి. అంతట నందఱును పకపకనవ్విరి.

150. సాహబ్జీమహారాజువా రానాడే తమపర్యటనప్రణాళికను తెప్పించుకొని చూచిరి. 24వ తేదీన వారు కాకినాడలో నుండవలసియుండెను. కాకినాడలో వారికి స్వాగతమిచ్చుటకును, సత్సంగముజరుపుటకును సత్సంగులు విరివిగ నేర్పాటుచేసిరి. కాని యనారోగ్యహేతువుచే వారికి కాకినాడ వెళ్ళుటకు వీలుండకపోవచ్చునని కూర్తాలములోనే తేటపడినందున, శ్రీ రామబ్రహ్మముగారిని, శ్రీ సుబ్బారావుగారిని మదరాసునకు రమ్మని కబు రంతకుముందే పంపించియుండిరి. వారిరువురును మదరాసు రాగానే కాకినాడప్రయాణమురద్దు పఱచుటకు వారలయంగీకారమును లిఖితరూపముగ నిమ్మనియడిగిరి. వెంటనే వా రట్లువ్రాసియిచ్చిరి.

151. 23-6-1937 తేదీసాయంకాలము, సార్వభౌమమహారాజువారు సముద్రపుటొడ్డున కూర్చుండిరి. వారిచుట్టు సత్సంగులు, సత్సంగినులునుకూర్చుండిరి. వారపుడు సత్సంగులతో మాట్లాడుచు సెలవిచ్చిన, యొక ముఖ్యవిషయము ఈక్రింద పొందుపఱచబడినది:-

"పిన్నలకు మార్గదర్శకముగనుండుటకై, వృద్ధులు తమయనుభవవిషయములను తెలుపుచుగ చెప్పుచుందురు నే నిపుడు మీకు చెప్పదలచిన ముఖ్యవిషయమేమనగా, నాబాధ్యతలను, కర్తవ్యములను నెఱవేర్చుటలో నేను నాజీవితములో నెన్నడు నెంతమాత్రము వెనుదీయలేదు. నేను నా కర్తవ్యబాధ్యతలను నాకెట్టివ్యయప్రయాసలు గల్గినను సరకుసేయక నెల్లపుడును నిస్సంకోచముగను, నిర్భయముగను నిర్వహించుచుంటిని. అందుకు ఫలితముగ నాప్రయత్నములన్నియు, నాశత్రువులకు నిరాశగలిగించి నామిత్రులకానందముగలిగించులాగున సఫలమగుచుండెను. డాక్టర్లను వారలసలహాల నొకప్రక్కనుంచి, నాకర్తవ్యబాధ్యతలను నేను మఱొకవైపున నుంచితిని. నే నొకపిరికిపందవలె చనిపోవువాడనుకాను. న న్నేపనియు చేయవలదని డాక్టర్లెంతచెప్పినను, నా విహితకర్తవ్యములను జివరవఱకును నేఁజేయుచునే యుందును."

సార్వభౌమమహారాజువారు ఆంధ్రరాధాస్వామీసత్సంగసంఘకార్యదర్శిగారివైపునకు తిరిగి యిట్లనిరి, "కాకినాడప్రణాళికను రద్దుచేయుటలో సత్సంగులు చాలశ్లాఘనీయముగ ప్రవర్తించిరి. అవిధేయత మనస్సునకు ప్రధానలక్షణము. కాని యిచ్చటిసత్సంగులలో నవిధేయత మచ్చునకుగూడ గానరాదు. ఇదిసరికాదా? సద్గురుప్రసన్నత యొక్కటే మనకు ప్రధానముగ గమనింపదగినవిషయము ఈప్రాంతపుసత్సంగు లదియేచేసిరి."

152. జూన్ 24వ తేదీయుదయము సార్వభౌమమహారాజువారి ధర్మపత్నియగు బీబీజీసాహిబాగా రందఱును తక్షణమే దయాల్బాగు వెళ్ళిపోవలయునని పట్టుపట్టిరి. జూన్ 25వ తేదీన తప్పకుండ నందఱును వెడలిపోవుదురని వా రామెకు ధైర్యముచెప్పిరి. నిజముగ నట్లే జరిగెను. కానివారు మాత్రము ప్రాణవిహీనశరీరముతో ప్రయాణముజేసిరి. జూన్ 24వ తేదీనాఁటిసంఘటనలానాఁడు సార్వభౌమమహారాజువారితోనున్న వా రెవరికిని మఱువశక్యముగాదు. వారు మదరాసు తరువాతిప్రణాళికనుగుఱించి తమతో నెంతమాత్రము సంప్రతించవలదనియు, నందుగుఱించి ప్రే। భా। ద్వారకాబాసీగారును, సేఠ్ నిహాల్

చందుగారును మిగతసత్సంగాధికారులునుగలిసి యాలోచించి స్థిరపఱచుకొన
వలసియుండుననియు నంతకురెండురోజులుముందే సెలవిచ్చిరి.

153. జూన్ నెల 24 తేవదీయుదయము సాహబ్జీమహారాజువారికి అమిత
నీరసముగ నుండుటచే, వారు బయటకు రాలేదు. మధ్యాహ్నము రమారమి
3 గం॥ 30 నిమిషములకు వారు బయటకువచ్చిరి. ఆవేళ వేడిగను ఉక్కగను
ఉండెను. కూర్తాలములో వారిప్రత్యేకోపయోగమునకై చేయబడిన రిక్షాను
మదరాను తీసుకొనివచ్చియుండుటచే, నారిక్షాను రప్పించి సాహబ్జీమహారాజు
వారందులో కూర్చుండి సముద్రపుటొడ్డుగోడ్డునకు తీసికొని వెళ్ళుమని యానతి
నిచ్చిరి ఒకమైలుదూరము వెళ్ళినతరువాత సేర్ నిహాల్ చందుగారు సాహబ్జీమహా
రాజువారి నెంతదూరము పోదలంచితిరని యడుగగా, "నే నిటులనే పోదలంచి
తిని" అనివారు సమాధానముచెప్పిరి. సేర్ జీగారు నిశ్శబ్దముగనుండిరి. కొం
చెము సేపైనతర్వాత వారు "నాకు రిక్షాలో వెళ్ళుటకిష్టములేదు. ఏలనన నా
శరీరములో నింకేమియు మిగులలేదు. నే నిపు డుత్తశూన్యముగ నున్నాను"
అని తిరిగియనిరి. మఱికొంత సేపయినపిమ్మట సేర్ నిహాల్ చందుగారు చాల
వేడిగనున్నదికావున వెనుకకువెళ్ళుటబాగుండునని తిరిగివారితోననిరి. సాహబ్జీ
మహారాజువారు "సరే, వెళ్ళుదము. ప్రతివ్యక్తియు వెనుకకుమఱలిపోవలసినదే.
ఎవరైనను మఱలిపోకుండ నుండుటేలగలుగు?" నని సెలవిచ్చిరి. మైసూరు
రాజభవనమునకు పోగనే వారు తమకుర్చీలో కూర్చుండి అచటనుండి 300
గజములదూరములోనున్న సముద్రపుటొడ్డునకు తీసికొని వెళ్ళుమని యానతిని
వ్వగా వారిని కుర్చీలోనుండగనే యెత్తి సముద్రపుటొడ్డునకు తీసికొని వెళ్లిరి.
శ్రీబదరీప్రసాద మాథుర్‌గారపుడు ఆకుజోళ్ళను ధరించియుండిరి. మార్గము
లో నిసుకయుండుటచే తనజోళ్ళు యిసుకను రేపుచున్నవని యాయన ఆజోళ్ళను
విడిచి, వట్టికాళ్ళతోనే నడచిరి. అదిచూచి సాహబ్జీమహారాజువారు చిఱునగ
వుతో "ఏ రీజోళ్ళను విడిచినట్లే యీప్రపంచమునుండి పోవునపు డందఱు నీ
ప్రాపంచికపదార్థములను విడిచివేయవలయును" అనిసెలవిచ్చిరి. కీ॥ శే॥ శ్రీ
చున్నీలాల్‌గుప్తగారుగూడ నాకుర్చీని మోయుచుండిరి. ప్రమాదవశమున
నాయనకాలొక యిసుకగుంటలో పడినందున నాయన తుళ్ళి పడిపోబోయెను.
సాహబ్జీమహారాజువారు పకాలున నవ్వి, "నీ వింతతొందరగ నిప్పుడే గుంట
లో పడిపోవుచున్నావు" అనియనిరి. ఈవాక్యముయొక్క గూఢార్థ మప్పుడెవ్వ
రికి నవగాహన కాలేదుగాని, రెండుసంవత్సరములతర్వాత చున్నీలాలుగారొక

ప్రవాహములోకొట్టుకొనిపోయి మరణించినపుడావాక్యము జనులకు జ్ఞాపకము వచ్చెను. వర్షపుతుంపరలు కొద్దిగ కురియుటచే సముద్రతీరమున చాలసుఖముగ నుండెను. సాహబ్జీమహారాజువారుత్సాహముగనుండుటచే నందఱకును సంతోషముగనుండెను.

154 సాహబ్జీమహారాజువారు తిరిగి మైసూరుభవనమునకు వెళ్లి, విశ్రాంతిదీసికొనుటకై తమమంచముమీద పరుండిరి. చాలయెక్కువ వర్షముకురిసి వాతావరణమంతయు బాగచల్లబడెను. వర్షము ఆగిపోయినతర్వాత, సాహబ్జీమహారాజువారు సత్సంగమునకు రాజభవనములోపలనే యేర్పాటుచేయుమని యానతినిచ్చిరి. సత్సంగులందఱును వచ్చినపిదప మంగళాచరణమును ప్రారంభించిరి. సాహబ్జీమహారాజువారప్పుడు మంచముమీద పరుండియుండిరి. అపుడు రెండు పరిపాటిగానట్టి భావగర్భితవిషయములు జరిగెను

(a) సాధారణముగ నుదయసత్సంగములో పఠించు మంగళాచరణమును వారప్పుడు ప్రారంభించిరి.

(b) మామూలుగ వారు ప్రథమచరణమునుమాత్రమే పఠించి తరువాత మౌనముగ ధ్యానమగ్నులై యుండెడువారు. వారా యాఖరుసారి సత్సంగములో నట్లుగాక, మంగళాచరణమును బినతినిగూడ నామూలాగ్రముగ పఠించిరి. సత్సంగముజరుగుచుండగా సాహబ్జీమహారాజువారు తమ కరములను మాటిమాటికి జోడించుచుండిరి. ఒకసారి తమగుండె నొకచేతితో నొత్తికొనిరి. సత్సంగానంతరము సాహబ్జీమహారాజువారు తమప్రక్కలో లేచి కూర్చుండి సంఘమందఱకును కరములుమోడ్చి 'రాధాస్వామి' చెప్పిరి.

155. సత్సంగ మయినతర్వాత సాహబ్జీమహారాజువారు "సత్సంగము కొన్నాళ్లు చెదిరిపోవుసమయము త్వరలో రాగలదు కాని యొకపూలచెండువలె నందఱును తిరిగి త్వరలోనే గలిసికొనెదరు" అని సెలవిచ్చిరట.

156 సత్సంగమయినతర్వాత సాహబ్జీమహారాజువారు తమప్రక్కలో పరుండి విశ్రాంతిదీసికొనిరి. బయటనున్నవారందఱు నెప్పుడేమగునో యని యాందోళనలో పడియుండిరి. వాతావరణమంతయు మహావిపత్సూచనలతో విచారపూరితమై బీకరముగనుండెను. భక్తులందఱును ఖిన్నహృదయులై నిరాశజెందియుండిరి. రాత్రి 8 గం॥ 30 నిముసములకు భవనాంతర్భాగము

నుండి రోదనధ్వనులు వినవచ్చెను. సాహబ్జీమహారాజువారు నిర్యాణమయిరి. దయాల్బాగుయొక్క మహనీయస్థాపకులు మఱిలేకలేరు!

157. ఇవ్విధముగ సమ్మహాత్ములు ఆ యుత్తమసంఘ సంస్థావ్యవస్థాపకులు, ఆమహర్షి, త్రికాలవేత్తయు పరమసంతులునగు మహాపురుషుడు తమ నశ్వరకోశమునువీడి వెడలిపోయిరి. అయినను, చెల్లాచెదఱుగనున్న సముదాయము నుండి రమణీయమైనసృష్టినిచేసినట్లు, దయాల్బాగును స్వయముగ నిర్మించిన సాహబ్జీమహారాజువారు దయాల్బాగునకు జీవమును బలము నిచ్చుచు నిపుడును సజీవులుగ నేయున్నారు, యెల్లపుడు నట్లే సజీవులుగనుందురు. ఈక్రిందివిచారకరమైన పంక్తులు స్మరణకు వచ్చుచున్నవి

"క్యా హుస్న థా కి ఆంఖనే దేఖా హజార్ బార్ !
ఫిర భీ నజర్ కో హజరతే దీదార్ రహా గఈ"॥
అర్థము:- ఆహా! ఏమి యా సౌందర్యము, ఆరమణీయత, ఆశోభ !

ఈకండ్లు అద్దాని నెన్ని వేలసార్లు చూచినవో!
అయిన నవి యామనోహరదృశ్యమును తిరిగి మఱొకసారి
చూడగోరుచునేయున్నవి !

158. సత్సంగులందఱును మైసూరురాజభవనమునకుబయట గుంపులుగుంపులుగ నిలువబడియుండిరి. నల్దెసలనుండియు స్తంభితరోదనములును, వెక్కివెక్కి యేడ్పులును వినవచ్చుచుండెను. ఒకప్రక్కన నేడ్పులుబొబ్బలు నగుచున్నను మఱొకప్రక్కన నాసమయమున నత్యావశ్యకమైనకృత్యములను కొన్నిటిని జరిగించుచునేయుండిరి. దయాల్బాగులో సాహబ్జీమహారాజువారి కుటుంబస్థులకు, నితరసత్సంగులుచాలమందికిని మెహతాజీసాహబ్ వారికిని తంతివార్తల నంపిరి. పవిత్రశరీరమును దయాల్బాగునకు గొనిపోవలయునని నిశ్చయించినందుచే దానిని పరిమళద్రవ్యములతో సురక్షితముగనుంచుటకును, దయాల్బాగు తీసికొని వెళ్లుట కొఱకస్పెషల్ ట్రెయినును చేకూర్చుకొనుటకు నేర్పాట్లుచేసిరి. పవిత్రశరీరమును సుగంధద్రవ్యములచే సురక్షితముగనుండులాగున చేయుట మఱునాడుదయమున నే సాధ్యమయ్యెను. ఆపవిత్రశరీరము నొకశవపేటికలో బెట్టి పరివారమందఱును జూన్ 25వ తేదిన స్పెషల్ ట్రెయిన్‌లోబయలుదేఱి జూన్ 27వ తేదీ ఉదయము 10గంటలకు ఆగ్రా కేంటోన్మెంటుస్టేషను జేరుకొనిరి.

159. త్రోవలో రైలు ఆగినస్టేషన్లన్నిటిలోను దర్శనార్థమై యాతురపడుచు సత్సంగులు ప్లాటుఫారములమీద ప్రోగైయుండుచుండిరి. శవపేటికను తెఱచి దర్శనముజేయించుటకు వీలులేదని తెలియఁజెప్పగా వారాశవపేటికనైనను చూపుమనియు నొక్కొకప్పుడు శవపేటికయున్న రైలుపెట్టెనైనను చూపుమనియు దీనముగ వేఁడుకొనుచుండిరి.

160. దయాల్బాగునుండియు పైయూళ్ళనుండియు నసంఖ్యాకులుగవచ్చిన సత్సంగులమహాసమూహ మాగ్రా కేంటోన్మెంటుస్టేషనులో కనిపెట్టుకొనియుండెను. ప్లాటుఫారములో ట్రైయిను ఆగినతోడనే రోదనధ్వనులతో నాకసమంతయు నిండిపోయెను. దయాల్బాగునకు శవపేటికను మోటారుకారులో తీసికొని వెళ్ళిరి. సాహబ్జీమహారాజువారి పవిత్రశరీరమునకు ప్రణామములు చేయుటకై ఆగ్రామహమ్మదీయులు త్రోవలో సివిల్ కోర్టుభవనములకు దగ్గఱగనున్న 'మజార్' వద్ద (మజార్ అనగా నొకమహమ్మదీయ సిద్ధపురుషుని గోరీ) కలిసికొని వేచియుండిరి. ఆదినమున దయాల్బాగుప్రవేశించిన ఆమహాజన సమూహ మెంతమహాదుఃఖసముద్రమున బడియుండిరో యేరికిని వర్ణింపదఁరముగాదు. సకలజనులు నశ్రుపూరితనయనములతో, క్రిందికినిగిడ్చిన కళావిహీనదృష్టులతో, వంచుకొన్నతలలతో, స్తంభితకంఠస్వరములతో మాటలాడుకొనుచు, తిరుగులాడుచుండిరి. శవపేటికను "తేజ్‌పుంజ్"లో కొద్దిసేపుమాత్రమేయుంచి, సత్సంగులందఱకు దర్శనమిప్పించుటకొఱకై సత్సంగహాలునకు తీసికొనివచ్చిరి. దహనసంస్కారము నారోజుననేచేసిరి. ఆగ్రాలో నారోజున నొకపూట హరతాళము చేయబడెను.

161. జూన్ నెల 28వ తేదీన సత్సంగులందఱు నుదయసత్సంగమయినపిదప నొకసమావేశముచేసి, పవిత్రకుటుంబమువారికి తమ హార్దికసానుభూతిని ప్రకటించుచు నొకతీర్మానమును చేసిరి.

162. మహాత్మాగాంధీ గారు మొదలయిన దేశనాయకశ్రేష్ఠులును, రాష్ట్రపాలకులు మొదలగు నున్నతాధికారులును, ఇంకనితరులనేకులును పవిత్రకుటుంబమునకును. దయాల్బాగుపాలనవిధానకార్యకర్తలకును, అసంఖ్యాకపరామర్శ సందేశముల నంపిరి. అటులనే, సాహబ్జీమహారాజువారి జీవితచరిత్రను సంక్షిప్తముగ వ్రాసి, వారి సద్వృత్తప్రశంసజేసిన సంపాదకీయవ్యాసములును ప్రత్యే

కవ్యాసములును కొన్ని వారములవఱకును వివిధరాష్ట్రములలో వివిధభాషల వార్తాపత్రికలలో ప్రకటింపబడుచునే యుండినవి. అవన్నియు నసంఖ్యాకములై వివిధప్రకారములుగనుండి, యొకప్రత్యేకసంపుటమునకు పూర్తిగ సరిపోవునన్ని యుండుటచే నిచ్చట వానిని పొందుపఱచలేకపోయితిమని చింతించుచున్నాము.

---



VI—మెహతాజీసాహబ్ వారు

జనవరి 1885

*1937* లో సంత్ సద్గురువుగ ప్రకటమయిరి

# VI

# పందొమ్మిదివందల ముప్పదియేడవ సంవత్సరమును, అటు పిమ్మటను

1. పరమపవిత్రస్వరూపులయిన సాహబ్జీమహారాజువారి యాకస్మికహృదయవిదారకవియోగమువలన దయాల్బాగు కాలనీలోను. సత్సంగమండలి యందంతటను వ్యాపించిన నిరుపమానదుఃఖాంధకారము దహనసంస్కారము యైన వెనువెంటనే మెల్లమెల్లగ తొలఁగిపోవుట మొదలిడెను. దయాల్బాగు లోని సత్సంగులకును బయటిసత్సంగులకునుగూడ, మార్గదర్శకప్రకాశము లభించగలదిక్కును సూచించు విచిత్రాంతర్యనిదర్శనములు కన్పట్టదొడఁగెను. వాస్తవముగ నీ యాంతర్యానుభవము లాయా వ్యక్తులయొక్క యర్హతాధికారముల ననుసరించియే గలుగునవగుటచే, నట్టియనుభవములులేని వారును గొందరుండియుండవచ్చును. కాని యధికాధికసంఖ్యాకులకు తమ యైహికాముష్మికముల నొకరక్షణహస్తము 1937 సం॥రము జూన్ నెల 24 తేదీకిముందెట్లు కనిపెట్టుచుండెనో అదే విధముగ నిప్పుడు కూడ కాపాడుచుండినట్లు అనుభవరూపమున గోచరించెను.

2. ఇంతకుముందే తెలియజేసినట్లు సత్సంగసోదరీసోదరుల సార్వజనీనసమావేశమొకటి 1937 సంవత్సరము జూన్ నెల 28 తేదీన జరిగెను. రాధాస్వామీసత్సంగసభయొక్క కార్యనిర్వాహకవర్గము 1937వ సంవత్సరము జూన్ 29వ తేదీన సమావేశమై మెహతాజీసాహబ్ వారి నావర్గములో నొకసభ్యునిగ నెన్నుకొని పరమగురుసాహబ్జీమహారాజువారి భండారాను 29-8-1937 తేదీన జరుపుటకు నిశ్చయించిరి. మఱియు నాసమావేశములో సభాధ్యక్షులు కేంద్రస్థానమున లేనపుడు, వారియధికారధర్మములను సాగించు హక్కు బాధ్యతలు, సభయొక్క విధానచట్టము నుపనిబంధనలలోని 19 వ యుపనిబంధన ప్రకారము, ఉపాధ్యక్షునికి సంక్రమించునని కార్యనిర్వాహకవర్గమువారు యాల్బాగులోని కార్యకర్తలకు నుద్యోగస్థులందఱకును హెచ్చరిక చేసిరి

3 సభయొక్కయు దానిసంస్థలయొక్కయు క్రియాకలాపమును యధాప్రకారము సాగించు నిమిత్తమై ప్రశాసనికవిధానములో నావశ్యకమైన

యేర్పాట్లు నదివఱకే చేసియుండుటచే నెల్లచోట్లను పనులు సక్రమముగ నిప్పటివలెనే జరిగిపోవుచుండెను. కాని కొందఱువ్యక్తు లల్లకల్లోలములను గలుగజేయనిశ్చయించుకొనినట్లు తెలియనచ్చెను. అందుచే, దయాల్బాగు లోని పాలనవిధానాధికారులు చాలమెలకువగ ముందుజాగ్రత్తతో ప్రవర్తించ వలసిన యావశ్యకత యేర్పడెను. కార్యనిర్వాహకవర్గము 30-6-1937 తేదీన మఱొకసమావేశమునుజరిపి, అల్లరులగల్పించు వ్యక్తుల నెట్టి యాలస్యములే కుండ వెంటనే నిస్సంకోచముగ శిక్షించుటకై తగుచర్య తీసికొనవల యునని తీర్మానము చేసిరి.

4. పాఠకమహాశయులు పైనవ్రాసినదానినిబట్టి, సాహబ్జీమహారాజువారి యుత్తరాధికారినిగుఱించి యేరికైనను సందేహానుమానములు గలవనిగాని, యల్లర్లుకల్పించు దురుద్దేశ్యముగల వ్యక్తులుచాలమందియున్నారనిగాని, యెంత మాత్రము నెంచరాదు. అట్లుండుటకు నావకాశమును లేదు. ఏలనన, మొదటివిష యము, 1920వ సంవత్సరములో సాహబ్జీమహారాజువారికి హోద్దాలో జబ్బుచేసి నపుడు, వారు తమయుత్తరాధికారిగ నెవరిని పేర్కొనిరో యందఱకును తెలియనే దెలుసును. రెండవవిషయమేమన, సాహబ్జీమహారాజువారు సోలనులోమకాము చేసినపుడు, బొత్తాములు తయారుచేయుయంత్రమును కొనఁదలచిరి. అపుడొక సత్సంగి యాయంత్రమును నడిపించిపనిజరిపించగల సత్సంగు లెవరును లేరు గావున, నాకార్ఖానా నెట్లు స్థాపించి పనిజరిపించగలరని, సాహబ్జీమహారాజువా రిని ప్రశ్నించెను. అంతట, సాహబ్జీమహారాజువారు, తాము తాత్కాలిక ముగ నేదోవిధమున నాకార్ఖానాను నడిపించెదమని చెప్పి, తమతరువాత నొక ఇంజనీయరుగారు వచ్చెదరుగావున, నప్పుడేమియు కష్టముండ నేరదని సెలవిచ్చిరి. ఈవిషయము చాలమంది సత్సంగులకు దెలుసును. మెహతాజీసాహబ్వా రాదినములలో ప్రతిశనివారమును సత్సంగముకొఱకై సోలనువచ్చి, ఆదివార మచ్చటనే ఆఁగిపోవుచుండెడివారు. ఒకసారి సాహబ్జీమహారాజవారిని సిమ్లా లో మకాముచేయువలసినదని మెహతాజీసాహబ్వారు ప్రతిపాదనచేయగా, కొందఱు సత్సంగు లందు కాక్షేపణజేసిరి అంతట సాహబ్జీమహారాజువా రా సత్సంగులతో మెహతాజీసాహబ్వారిని "మంజూరేనజర్" (అనగా భగవంతు నికి ప్రియమైనవారు) అని పేర్కొని, వారినాక్షేపించరాదని మందలించిరి. అటులనే, సాహబ్జీమహారాజువా రొకసారి సైకిలుభాగములను గుఱించి చర్చించుచు, తమస్థానే యొక ఇంజనీయ రుండవలసియున్నదని వాకృచ్చిరని గూడ నందఱకు బాగుగఁదెలిసిన విషయమే.

5. అదియునుగాక, నెందఱో సత్సంగుల కాంతర్యానుభవములు గల్గి వారితరులతో తమయనుభవమునులనుగుఱించి చెప్పిరి. శ్రీరామసహాయ్‌నిగమ్ గారు సత్సంగిస్త్రీపురుషు లందఱియెదుటను 1937 సం॥రము, జూన్ నెల 29వ తేదిన సత్సంగములో, తనకు సాహబ్జీమహారాజువారు దర్శనమిచ్చి మెహతాజీ సాహబ్‌వారిలో తాము విరాజిల్లియున్నట్లుచెప్పి, యీవిషయమును సత్సంగములో ఘోషణఁజేసిచెప్పవలయునని యానతినిచ్చిరనియు, నందుచే తా నావిషయమును సాహబ్జీమహారాజువారి యాజ్ఞానుసారము ప్రకటించుచుంటినని యు ఘోషించిచెప్పిరి.

6. అటులనే పండితమునిరామశాస్త్రిగారికి స్వప్నములో సాహబ్జీమహారాజువారు దర్శనమిచ్చి తాము మెహతాజీసాహబ్‌వారి స్వరూపములోనుండి యాయనకు తోడ్పడి సంరక్షణజేయుచుంటిమని తెలియజెప్పి, విచారించబఁని లేదని సెలవిచ్చిరి

7. తిమర్నీ బ్రాంచిసత్సంగములో సత్సంగులు, సాహబ్జీమహారాజువారి ఫోటోను తమ కెదురుగ నొకకుర్చీమీద నుంచి సత్సంగముజేయుచుండగ, నొకనాఁడుదయము సత్సంగములో శబ్దపారముజరుగుచుండగా నచ్చటనున్న సత్సంగీసత్సంగులలో నొక్కరుగూడతప్పిపోకుండ నందఱకు, నాకుర్చీమీద ఫోటోకు బదులుగ నింకొక మహావ్యక్తి, అనగా మెహతాజీసాహబ్‌వారు, కూర్చుండినట్లు దర్శనమాయెను. అట్టివియును, అంతకంటె శ్రేష్ఠతరమైనట్టి వియును నిదర్శనములు దయాల్బాగులోను బయటను ఉన్న చాలమంది సత్సంగులకు గలిగెను.

8. 1937 సంవత్సరము జూన్ నెలతరువాత, మొట్టమొదటిసభాసమావేశము ఆసంవత్సరము ఆగష్టు నెల 28వ తేదిన సాహబ్జీమహారాజువారి భండారాసమయమున జరిగెను. అందు మొట్టమొదటితీర్మానములో సభవారు పవిత్రకుటుంబమువారికి తమసానుభూతిని దెలిపిరి. సభవారు సాహబ్జీమహారాజువారి స్థానే మెహతాజీసాహబ్‌వారిని సభాధ్యక్షులుగ నెన్నుకొనిరి. మెహతాజీ సాహబ్‌వారు తమకన్న నెక్కువ యర్హతగలవ్యక్తి లభ్యమయినతోడనే, తమకా పదవినుండి విడుదలనియ్యవలయు నను షరతుతోనే తామా పదవినపుడు స్వీకరించుచుంటిమని సెలవిచ్చియే యందుకంగీకరించిరి.

# సభవారి పారిశ్రామికప్రణాళిక

9. దేశములో నిరుద్యోగసమస్యను నిర్మూలించునిమిత్తమై, దయాల్బాగు పారిశ్రామికసంస్థల నైదుసంవత్సరములలో వాని వార్షికవస్త్రోత్పాదన మొక కోటిరూప్యములకు పెరిగిపోవులాగున, నభివృద్ధిజేయవలయునని, 1935 సం॥రము డిసెంబరు నెలలో జరిగిన సభాసమావేశములో సాహబ్జీమహారాజువారు సభవారిచే నొకతీర్మానము చేయించిరి. మెహతాజీసాహబ్‌వారు ఆతరువాత 1937 అక్టోబరునెలలో జరిగిన సభాసమావేశములో నధ్యక్షులుగనుండి పైతీర్మానమును ధ్రువపరిపించిరి.

10. 1942 సంవత్సరములో "సాహబ్జీమహారాజువారి పారిశ్రామిక ప్రణాళిక" యను శీర్షికతో ప్రచురించిన సంచికకు మెహతాజీసాహబ్‌వారు వ్రాసిన తొలిపలుకులో నిట్లువ్రాసిరి: "ఇరువదియేండ్ల పైకాలమునుండియు నీ లేఖకుఁడు దేశములోని నవయువకుల యార్థికస్థితినిగుఱించి వాకబు చేయుచుండెను గాని, యించుమించందఱును పరిస్థితులు గడ్డుగ నున్నట్లే చెప్పుచుండుటచే మనసునకు నొప్పి గలుగుచుండెను. ఉద్యోగస్థులకు జేబులును పైకపుసంచులును ప్రతిమాసమున మూడవవారములోనే ఖాళీయైపోయి బ్యాంకులలో గూడ వారికిచెప్పుకోనఁదగిన నిలువ యేమియు నుండుటలేదు. ఈలేఖకుని స్నేహితులొకరు తన స్వవిషయ మేదో విన్నవించుకొనుటకు సాహబ్జీమహారాజువారి యొద్దకు వెళ్ళుచుండగా, నాయనతోగలిసి యీ లేఖకుఁడుగూడ దేశములోని నిరుద్యోగితా దురవస్థా దారిద్ర్యములు నిర్మూలమయ్యెడి పరిస్థితులను కల్పించవలసినదని సాహబ్జీమహారాజువారి చరణకమలములవద్ద ప్రార్థనచేయుటకై వెడలెను. ఆస్నేహితుడు తన స్వవిషయమునుగూర్చి చెప్పుకొనెనుగాని, యీ లేఖకుఁడుమాత్రము సాహబ్జీమహారాజువారిసన్నిధిని నిస్సారసంభాషణకంటె నిశ్శబ్దముగ నుండుటయే మేలుఁగని నమ్మియుండుటచే, మాటాడకూరకుండెను. 1934 సం॥రము పొడుగునను ప్రతిదినము నుదయాస్తమయములు భోజనాత్పూర్వ మీలేఖకుడు హుజూర్‌రాధాస్వామిదయాళుని చరణకమలములందు, ప్రజలకు బ్రతుకుటకు తగినంతధనమును బట్టలను తిండిని యీయవలసినదని నియమముగ ప్రార్థనజేయుచుండెను."

అందువలన 1935 సం॥రము డిసెంబరు నెలలో సభవారుచేసిన తీర్మానము, మెహతాజీసాహబ్‌వారు 1934సం॥రము పొడుగునను జేసినప్రార్థనలకు ఫలిత

మని స్పష్టముగ తేటపడుచున్నది. కావున సాహబ్జీమహారాజువా రా ప్రణాళికా నిర్వాహ కార్యమును మెహతాజీసాహబ్ వారి కొప్పగించుట తదనుగుణము గనే యున్నది.

11. కావున వా రాయాదర్శమును నిర్ణీత కాలములో సాధించుట కవసర మైన ముఖ్యచర్యల నన్నిఁటిని తీసికొనిరి. దయాల్బాగులో పూర్వమునుండియు నుండిన సంస్థలను, అనగా, నాదర్శ పారిశ్రామికసంస్థలను (Model Industries) తోలువస్తూత్పాదనకార్ఖానాను (Leather Good Factory), వస్త్రయంత్రాగారమును (Textile Factory) చేనరీలను (తోళ్ళనుపదును చేయుకార్ఖానాలను) నవీనపద్ధతిని పునర్నిర్మాణముగావించి విపులముజేసి, క్రొత్త ఫ్యాక్టరీలను, అనగా అంగరాగద్రవ్యములు మొదలగువాని నుత్పాదన జేయు పరిశోధనశాలలను (Research Laboratories) హోజియరీఫ్యాక్టరీని ఎవెరిడే ఫుట్ వేర్ ఫ్యాక్టరీఅనుమతొకజోళ్ళయంత్రాగారమును క్రొత్తగ నేర్పాటుచేసి యభివృద్ధిచేసిరి.

12. పైనచెప్పినవిధమున నీ సంస్థలన్నిఁటికిని వృద్ధివికాసములు గలుగ జేసిన పిమ్మటగూడ, నివి యల్పపరిమాణముగనుండుటచే, చేయ దలఁచిన వస్త్రోత్పాదన మంతయు కేవలము వాని మూలముననే కాజాలదని తేటప డెను. అందుచే సభవా రమృతసర్ లో నున్న 22000 కదుర్లు 252 విద్యుచ్ఛక్తి ప్రచలితములగు నేఁతమగ్గములును గల 'నూలువడికి బట్టలు నేయుమిల్లును' (Spinning and Weaving mills) 1938 సం॥రము జనవరి నెలలో కొని దానిలో 29-1-1938 తేదీనుండియు పనిజరిగింపసాగిరి. తరువాత లూధియా నాలో నొక చిన్న హోజియరీ కార్ఖానానుగూడ సంపాదించిరి. 1939వ సం వత్సరములో 'సర్ సాహబ్జీమహారాజ్ మిల్సు' (Sir Sahabji Maharaj Mills) అను పేరుతో నొక పబ్లిక్ లిమిటెడ్ కంపెనీని స్థాపించి, దానికి యమృతసరుమిల్లును విక్రయించి, "దయాల్బాగు స్పిన్నింగు అండ్ వీవింగు మిల్సు, అమృతసర్" అని దానికి పేరుపెట్టిరి.

13. 1938 సం॥రము డిసెంబరు నెలలో మెహతాజీసాహబ్ వారు సభా ధ్యక్షతకు రాజీనామా నిచ్చి నందున, రాయ్ బహాదుర్ గురుసరన్ దాస్ మెహతాగారిని 1-1-1939 తేదినుండి యధ్యక్షులుగ బనిచేయుటకెన్నుకొనిరి.

**14.** సభయొక్క విధానచట్టము నుప నిబంధనలతో ననుకూలించు నిమిత్తము, 1938 సం॥రము డిసెంబరు నెల 28వ తేదీన నొక సత్సంగుల సార్వజనీన సమావేశము నేర్పాటుచేసిరి. అంతకు చాలముందుగనే సత్సంగవార పత్రికలలో నీ సమావేశమును గుఱించి ప్రకటనలను చేసిరి. ఆ సమావేశములో సత్సంగులు తమయాంతర్యానుభవములనుజెప్పి మెహతాజీసాహబ్‌వారియందు తమకుగల దృఢవిశ్వాసమును వెలిబుచ్చిరి. సుమారు 6000 మంది స్త్రీపురుష సత్సంగులా సమావేశమునందు పాల్గొనిరి. చిట్టచివఱకు, ఆ సమావేశములో నందఱు నేకగ్రీవముగ, సాహబ్జీమహారాజువారి యుత్తరాధికారి మెహతాజీ సాహబ్‌వారే యని మిన్నంటునట్లు కేకలిడుచు రెట్టించిన రాధాస్వామీ మహోధ్వానములతో మహానందభరితులై తీర్మానించిరి. తీర్మాన మీక్రిందివిధముగనున్నది:-

(a) 1938 సం॥రము డిసెంబరునెల 12, 19 తేదీల ప్రేమప్రచారక సంచికలలో జేసిన ప్రకటనల ప్రకారము భారతదేశ వివిధప్రాంతములనుండియు 6000 మందికి తక్కువగాకుండవచ్చి యిచ్చట సమావేశమైన స్త్రీపురుష సత్సంగులు పరమగురు సాహబ్జీమహారాజువారు గుప్తమైనది మొదలుకొని సత్సంగపురోభివృద్ధికి మార్గప్రదర్శనబాధ్యతను వహించి, సత్సంగులందఱకు నాధ్యాత్మికాభివృద్ధిని జేకూర్చుటలో బాహ్యముగను ఆంతర్యముగను తోడ్పడుచున్నట్టి పరమగౌరవనీయులును పరమపూజనీయులు నగు *రాయ్‌సాహబ్ గురుచరణదాస్ మెహతాజీ* సాహబ్‌వారి స్వరూపమున సంత్ సద్గురువు తిరిగి మానవరూపమును దాల్చిరని తమ దృఢవిశ్వాసమును లిఖితరూపమున ప్రకటించుచున్నారు;

(b) అందుచే సభయొక్క మూడవ యుపనిబంధన ననుసరించి రాధాస్వామీ సత్సంగసభను రద్దుచేయవలెనను ప్రశంస కెట్టిసావకాశమును లేదు;

(c) తమ దస్తరములలో నుంచుకొనునిమిత్తము మీతీర్మానమున కొక నకలును సభవారికి దాఖలుచేసి మఱికొన్ని నకళ్ళను సకల ప్రాంతీయ సత్సంగ సంఘములకును, వివిధప్రాంతములలోని బ్రాంచి సత్సంగములకునుగూడ తలొకటిగ పంపవలయును.

**15.** 1938వ సంవత్సరము డిసెంబరు నెల 29వ తేదీన జరిగిన సభాసమావేశములో సభవారు పైనుదహరించిన సత్సంగుల సార్వజనీనసమావేశము

రొక్క తీర్మానములో, తమ సంపూర్ణ సహానుభూతిత్వమును ప్రకటించిరి. ఇందు మూలమున సద్బుద్ధిగల సత్సంగులందఱకును సకలసంశయనిర్మూలనమై, చాలకొద్దిమంది దురదృష్టవంతులుదప్ప తక్కిన యావత్సత్సంగసంఘమును సత్సంగ వరదానసౌభాగ్యము ననుభవింపసాగెను.

16. ఈ మధ్యలో, గొందఱు సంఘ విశ్లేషణశీలురగు వ్యక్తులు జనుల నపభ్రమలం బాలుజేసి సంఘమున తికమకలు గలుగజేసిరి తమ తరువాత మెహతాజీ సాహబ్‌వారు సద్గురు వయ్యెదరని సాహబ్జీమహారాజువారు స్వయముగ 1920 సం॥రములో వ్రాసిచ్చి యుండినందునను, అధిక సంఖ్యాకులగు సత్సంగులకు గల్గిన యాంతర్యానుభవముల మూలమునను వాస్తవముగ, సత్సంగు లపభ్రమలకు లోనగుటకు, సావకాశమే లేదు. కాని, బుద్ధిపూర్వకముగ సన్మార్గప్రదర్శక సూచనలనన్నిటిని నిరాకరించి యపమార్గమునబోవ నిశ్చయించుకొనినట్టివారి నెవరు మఱల్పగలరు? సంతసద్గురు వెల్లపుడును, దయాల్బాగులోనేయుందురనియు, నందుచే తమ సందేహములను నివృత్తిజేసికొనదలంచినవారు ప్రశాంతముగ దయాల్బాగులో నుండిపోవలయుననియు, సాహబ్జీమహారాజువా రెన్నియోసార్లు సత్సంగములో వక్కాణించిరి. కాని యాదురదృష్టవంతు లాయుపదేశములోని దివ్యసూచననైన గ్రహింపజాలకుండిరి.

17. 1940 సం॥రము అక్టోబరునెల 10వ, తేదీన జరిగిన సభాసమావేశములో సభవారు మెహతాజీసాహబ్‌వారిని, సభయొక్క ఇంజనీరింగు సంస్థలకును, వస్త్రోత్పాదక, పారిశ్రామిక. వ్యాపారిక సంస్థ లన్నిటికిని అధినియామకత్వ పదవిని (Directorship) స్వీకరింపగోరుచు నొక తీర్మానమును జేసిరి. అందుచే వారిచ్చటి పరిశ్రమల కధినియామకత్వపదవి నలంకరించి, ఇందలి పారిశ్రామికసంస్థలకును యావ్యవస్థకంతకును గూడ పాలన పోషణముల జేయుచుండిరి. 1937 సం॥రము అక్టోబరు నెలలో నొక నిరుద్యోగితాసమితి (Board of unemployment) నేర్పాటుజేసి, "వ్యాపార కార్యదర్శి" (Business Secretary) యను నొక క్రొత్తపదవిని గూడ కల్పించిరి. తరువాత వ్యాపారకార్యదర్శి నాసమితికి సమావేశకర్తగ నేర్పాటుచేసి యాసమితిసభ్యుల సంఖ్యను పెంచి. "నిరుద్యోగితకును పరిశ్రమలకును సంబంధించిన సమితి" (Board of Unemployment and Industies)యని దానిపేరును

మార్చి దాని క్రియాక్షేత్రమునుగూడ విపులముగావించిరి. పారిశ్రామికసంస్థలకు అధికకార్యదక్షత గలుగజేసి, వాని వస్తూత్పాదన నెక్కువ జేయునిమిత్తమై యీసంస్థలను లిమిటెడ్‌కంపెనీల కప్పజెప్పవలెనని మెహతాజీసాహెబ్ వారు అధినియామక హోదాలో 8-4-1941 తేదీన నొక ప్రతిపాదనను జేసిరి.

18. సాహబ్జీమహారాజువారి కాలమునుండియు,

(1) ఆంధ్ర రాధాస్వామీ సత్సంగసంఘము,
(2) పంజాబు రాధాస్వామీ సత్సంగసంఘము,
(3) బీహారు రాధాస్వామీ సత్సంగసంఘము,
(4) తమిళ రాధాస్వామీ సత్సంగ సంఘమును,

అని నాల్గు ప్రాంతీయసత్సంగ సంఘములుండెను. 1937 సం॥రము ద్వితీయార్థములో నటువంటి మఱి నాల్గు సంఘములు, (1) బొంబాయి రాజపుతానాలకును (2) ఉత్తరప్రదేశ మధ్యప్రదేశములకును (3) ఢిల్లీకిని (4) సింధుదేశము బెలూచిస్థానములకును, వేఱు వేఱుగ నేర్పాటుచేయబడెను. దేశమందంతటను జిల్లాసత్సంగసంఘములనుగూడ నేర్పాటుచేసిరి. అప్పటికుండిన 450 బ్రాంచి సత్సంగములును పైనజెప్పిన సంఘముల యధికారీక్షణమార్గ ప్రదర్శనములకులోబడి పనిచేయుచు, పారిశ్రామిక ప్రణాళికలలో తగువిధమున సహకారముచేయుటకు తగియుండునని తలంచిరి. ఈ సంఘములమూలమున నీప్రణాళికానిర్వాహమునకై యావత్సత్సంగసంఘముయొక్క సహయోగ సహకారములు చేకూరెను.

19. ఇందుమూలమున నుద్దిష్టకార్యము సంతృప్తికరముగ సఫలమాయెను. పంచవర్షీయ కాపారిశ్రామికప్రణాళికాసిద్ధికొఱకై యవలంబించిన యీ చర్యల ఫలితముగ చేకూఱిన పారిశ్రామికాభివృద్ధియొక్క వేగతీవ్రతచే సంఘమందఱియొక్క మానసికదృక్పథము మాఱిపోయి, వివిధవృత్తులు, వివిధపథవులలోని స్త్రీపురుషసత్సంగులును వివిధస్థలములలో దయాల్బాగువస్తువుల నమ్మివేయు మహోద్యమములో, విరివిగ పాల్గొనిరి. దయాల్బాగువస్తువుల నమ్ముటకై భారతదేశమందంతటను స్థాపింపబడిన లిమిటెడుకంపెనీలసంఖ్య క్రమక్రమముగ 350 కంటె నధికముగ పెరిగెను.

20. పారిశ్రామిక ప్రణాళిక నైదేండ్లలో నిర్వహించుటకొఱకు సత్సంగ వ్యవస్థ చేసిన మహోద్యమమును, ఆయుద్యమనిర్వాహసిద్ధికొఱకై సత్సంగ

ప్రపంచమున నుదయించిన మహోత్సాహమును, తన్నిమిత్తమైన క్రియాకలాప మును మాత్రమేగాక, సత్సంగవ్యవస్థనుగురించి గమనించదగినవి మఱిరెండు ప్రధాన విషయములుగూడగలవు. అందు మొదటిదేమనగ మెహతాజీసాహబ్‌వారారంభమునుండియు వచనములను సెలవీయకుండుట. అనగా, వారు యుక్తసమయములం దవసరమైన హితోపదేశముల నిచ్చి మార్గప్రదర్శనము చేయుటలేదని యర్థముకాదు. కాని వారు మతవేదాంతవిషయములమీద నుపన్యాసములనిచ్చుటమాత్రము, తమకావిషయములేమియు నెఱుకలేదని యుక్తిగజెప్పి కచ్చితముగ దప్పించుకొనుచుండిరి. తాము వచనములు (బచన్) చెప్పుటకు బదులు, సంఘమునకును సంఘములోని వ్యక్తులకును ముందు రానైయున్న యాపద్దారిద్ర్యములనుండి (బచనా[1]) తప్పించుకొనుట కావశ్యకమైన యుపాయములను పద్ధతులను జెప్పుచుంటిమని వారు తఱుచు సెలవిచ్చెడివారు. సాహబ్జీమహారాజువారు, తామెన్నియో గ్రంథములనువ్రాసి యుండినందున, చాలకాలమువఱకు క్రొత్తగ్రంథములను వ్రాయుటకుగాని, వచనములను జెప్పుటకుగాని యవసర ముండనేరదని, చాలసార్లు సెలవిచ్చిరను విషయము సత్సంగిసోదరులు జ్ఞప్తికి దెచ్చుకొనగలరు. అందుచే మెహతాజీ సాహబ్‌వారు సత్సంగములో వచనములను సెలవియకుండుట యేమియు వింత గాదు.

21. రెండవ ప్రధానవిషయ మేమనగా, వారు మొదటినుండియు సంఘీయుల పరిస్థితులను చక్కజేయుటకు దగుచర్యలను దీసికొనుచునే యుండిరి. ఉదాహరణార్థము, కాలనీలోని విద్యాసంస్థలలో చదువుకొనుచున్న బాలబాలికలందఱకును మెహతాజీసాహబ్‌వారు తమస్వంతఖర్చుపైన నుచితక్షీరపానమున కేర్పాట్లు చేయించిరి.

22. 17-4-1938 తేదిన మెహతాజీసాహబ్‌వారీ క్రింది విధముగ, సత్సంగహాలులో సెలవిచ్చిరి:–

"మనము ప్రస్తుత మేకార్యము చేయదలంచిన నది సఫలమగుచుండుటనుబట్టి జూడగ, రాధాస్వామిదయాళుని దయాకటాక్షముల ప్రవాహము మహావేగముతో మనయందఱిమీదను ప్రవహించుచున్నట్లును, సంఘమందఱి

---

(1) 'బచనా' యనగ హిందీభాషలో 'తప్పించుకొనుట' అని అర్థము. 'బచన్' అనగ వచనములు అని యర్థము. ఇచ్చట ఆపదమును శ్లేషగా ప్రయోగించిరి.

పైననుు వారి దివ్యరక్షణ హస్తముండి గాపాడుచున్నట్లును స్పష్టముగ విశద మగుచున్నందున, సత్సంగసోదరీసోదరులందఱు నీవిషయమును తెలిసికొని సంతసించుదురుగాక. మనము మన పరిశ్రమల నభివృద్ధి చేయదలఁచినచో నచ్చట సఫలత చేకూరుచున్నది. మనము భూమి సంపాదింపదలఁచినచో నం దులో సాఫల్యము సేకూరుచున్నది. కావున సత్సంగసోదరీసోదరు లాత్మస మర్పణభావముతో సేవజేయుటకు కటిబద్ధులై కర్మక్షేత్రమున దిగుటకు సిద్ధ ముగ నుండవలెను.''

23. ఈ మహాసందేశమును, సాహబ్జీమహారాజువారు 8-1-'34 తేదీన సెలవిచ్చిన శుభసందేశముతో గలిపి చదివినచో నీసేవాబలిదానములకై యాహ్వానముయొక్క వాస్తవాంతర్భావ మప్పుడు బోధపడగలదు. సాహబ్జీ మహారాజువా రప్పుడీ క్రిందివిధముగ సెలవిచ్చిరి:—

"హుజూర్ రాధాస్వామీదయాళురు, భావికాలములో త్వరగనే, భారతదేశీయులకు జీవికానిర్వాహణమును వాస్తవమైన యాధ్యాత్మికాభివృద్ధిని జేకూర్పగలందులకై క్రొత్తగ నొక మహాలాభదాయకప్రణాళికను ప్రారం భింపనై యున్నారు. కావున నాదయాళునియొక్క, ఆత్మసమర్పణభావపూరితు లైన మహాశూరయోధు లీప్రణాళికను ప్రచారముచేసి పూర్తిచేయుటకు గాను, ఐహికవిషయములను విడనాడి, తమ బంధుమిత్రులయెడల బాంధవ్య ప్రేమలను దూరమునబెట్టి, రాధాస్వామీదయాళుని చరణకమలములవద్ద నర్పణ గావలసియున్నది. కేవలము క్షీరార్థులగు 'మజ్నూ'లు ముందుగనే మేల్కొంచి యీమార్గమునుండి దూరముగ తప్పుకొనవలెను. ఏలనన, నట్టివా రెప్పటికైనను కర్మక్షేత్రమునుండి పలాయనమగుటయేదప్ప మరే మియు జేయలేరు. తమ రక్తమును బలిదాన మీయగోరు 'మజ్నూ'లు తమ యాత్మసమర్పణార్థమయిన చిరవాంఛిత మీడేరుతరుణ మాసన్నమయినదని తెలిసికొందురుగాక. వారలకు తమ పరమప్రభువునందు గల భక్తివిశ్వాసము లను ప్రకటపఱచుటకు సంపూర్ణసావకాశము త్వరలోనే సేకుఱనై యున్నది. ప్రపంచము, వారల ధైర్యసాహసములను, భగవచ్చరణములందు వారలనిర్మల ప్రేమ గాఢవిశ్వాసముల ప్రదర్శనమును, భగవంతుని పిల్లలవిషయములో వారలకుగ లనిస్స్వార్థసేవాభిలాషయొక్కసంసిద్ధిని కనులారఁగాంచి యానందించ గోరుచున్నది. కావున వా రిప్పటినుండియు సిద్ధముగావలసియుండును."

24. మెహతాజీసాహెబ్‌వారు మొదటి 2½ సంవత్సరములు నుద్యోగము చేయుచునే యుండిరి. వారారోజులలో రావల్పిండినుండి యమృతసరునకు దగ్గఱగనున్న లాహోరునకు బదిలీ అయినందున, నచ్చటినుండి యమృత సర్‌లో నొనియుండిన "నూలువడికి బట్టలునేయుమిల్లు" (Spinning and Weaving mills) ను సక్రమవ్యవస్థలో బెట్టి పనిచేయించుటకై ప్రతివారము నమృతసర్ వెడలుచుండెడివారు. కొంతకాలమైనతరువాత, 1939 సం॥రము మార్చినెలలో వారు పంజాబు పి డబ్ల్యూ. డి. ఆఫీషియేటింగు ఛీఫ్‌ఇంజనీరుగా (P W D Officiating Chief Engineer) నియోగింపబడిరి. వారు తఱుచుగ దయాల్బాగు వచ్చుచు సత్సంగులకు త్తరప్రత్యు త్తరములను విస్తారముగ వ్రాయుచునుండెడివారు. అమృతసరులో పనిపూర్తియయినపిదప, వారు ఉద్యోగవిరామమునకుముందు 28 మాసములు సెలవుదీసికొని, 6-2-40 తేదీన దయాల్బాగు వచ్చి యచ్చటి వివిధవ్యాపారపారిశ్రామికసంస్థలయొక్కయు తదితర సంస్థలయొక్కయు వ్యవస్థను చక్కఁజేసి వాని పాలనపోషణలను గనిపెట్టుచుండిరి.

25. అయినను మెహతాజీసాహెబ్‌వారికి వ్యతిరేకముగ 1937 సం॥రము జూలై నెలనుండియు ప్రారంభమైన ప్రతిపక్షప్రచారము నిరంతరవర్ధమానమగుచుండెను. సాహబ్జీమహారాజువారు తమ యుత్తరాధికారిని సూచించుచు నిచ్చిన యాదేశమిా ప్రతిపక్షప్రచారము సల్పుచున్నవారికి చాలమందికి పూర్తిగ తెలిసియేయున్నను, వారు బుద్ధిపూర్వకముగ నాప్రచారమునకు ప్రోద్బలము చేయుచుండిరి. ఉదాహరణార్థము, సాహబ్జీమహారాజువారి జ్యేష్ఠపుత్రుడు శ్రీ ప్రేమసరూప్‌గారు శ్రీ గురుదాసరాముగారిని సాహబ్జీమహారాజువారి యుత్తరాధికారిగ నిలఁబెట్టి, దయాల్బాగునకు వ్యతిరేకముగ నాయనకు సహాయము చేయుచు 31-12-1937 తేదీన దయాల్బాగును వదిలిపెట్టి వెళ్ళి, ఆయనకు వేఱేసత్సంగము స్థాపించునిమిత్తమై బహిరంగముగ తోడ్పడెను. అటులనే, సాహబ్జీమహారాజువారి ఆఖరుసంవత్సరములలో సభకు కార్యదర్శిగనుండిన శ్రీ నారాయణదాసుగారు, తర్వాత శ్రీగురుదాసరాముగారి సత్సంగమునకు కార్యదర్శియైరి. శ్రీనారాయణదాసుగారు స్వయముగ నాంధ్ర రాధాస్వామీ సత్సంగసంఘ కార్యదర్శియయిన శ్రీరామబ్రహ్మముగారి కీక్రిందనుదహరించిన రీతిని 20-7-1937 తేదీన నొక యుత్తరమును వ్రాసియుండియుగూడ నివ్విధముగఁ బ్రవర్తించుట నిజముగ నాశ్చర్యకరము. ఆయుత్తరమునుండి యుద్ధృతభాగము:-

"........మన యాశలు సిద్ధించుటకు మన మేప్రక్కకు దృష్టిని త్రిప్ప వలయునో తెలియజేయు విస్పష్టసూచన యిందుగలదు. దయాల్బాగులోని వివిధ విభాగముల పాలనావిధానములో నప్పుడే మెహతాజీసాహబ్ వారు దక్షతతో మార్గప్రదర్శనముచేయుచు, సత్సంగులందఱి యుత్తరములకు సమాధానములను, మీకువ్రాసిన తీరుననే, వ్రాయుచున్నారు. వారు రావల్పిండిలోని బ్రాంచిసత్సంగమునకు ఇంకను, ఆదివారములు మాత్రమే వెళ్లుచున్నట్లు తెలియుచున్నది. సత్సంగులు సావకాశమున్నపుడెల్ల దయాల్బాగువచ్చి సత్సంగముచేసికొనవలయునని మీకువ్రాసినదానినిబట్టి, వారు త్వరలోనే స్థాయిరూపమున దయాల్బాగువచ్చి యిచ్చటనే యుందురని తేటపడుచున్నది. ........దయామయులగు హుజూరువారు 17 సం॥రముల క్రితము రాజబరారీదగ్గఱ నొకస్థలములో నిర్యాణోన్ముఖులైయుండినపుడు సత్సంగము తమ యనంతరము మెహతాజీసాహబ్ (వారి పూర్తిపేరునుజెప్పి) వారి యింట జరుగగలదని నాతో స్వయముగ సెలవిచ్చిరని నేనిపుడు మీకుతెలియజేయ గోరుచున్నాను. కావున యథార్థము చాలస్వల్పకాలములోనే బయటపడగలదని నానమ్మకము.'

26. ఎట్లైనను సభవారి ప్రతికూలప్రచారమును దయాల్బాగులో సాగనిచ్చుటకు, విస్పష్టహేతువులచే నంగీకరింపజాలరైరి. అందుచే మఱొక తీవ్ర చర్యయేదేని తీసికొనుటకు ముందు, సభవారికార్యాలయములో (Sabha's Office) హెడ్పిస్టుగ బనిచేయుచున్న శ్రీ గురుదాసురాముగారి నచ్చటనుండి 25-8-1937 తేదీన లెదర్ గుడ్సుఫ్యాక్టరీలోనికి మార్చిరి. కాని యాయన కచ్చటపనిచేయుట యిష్టములేక సెప్టెంబరు నెల ప్రారంభములో దయాల్బాగును విడిచి వెడలిపోయెను. పిమ్మట నేడుమాసములయనంతరము సభవారాయనను దయాల్బాగునుండి బహిష్కరించినట్లు పద్ధతిప్రకారము 14-4-1938 తేదీగల సభాసమావేశముయొక్క 6వ నెంబరు తీర్మానములో నుదహరించిరి. అట్టివారందఱును గలిసి దయాల్బాగునకును, మెహతాజీసాహబ్ వారికిని ప్రతికూలముగ దారుణమైన యసత్యప్రచారమును జేయదొడంగి, ఉర్దూభాషలో "ప్యారా దయాల్బాగు" అను నొకవారపత్రికను, దర్మిలా నాంగ్లభాషలో "దయాల్బాగుగార్డియన్" అను నొకవారపత్రికను ప్రచురింపసాగిరి. దయాల్బాగులోను బయటను ఉండిన సత్సంగులనందఱను తమపక్షముచేసికొని, యందుమూలముగ శ్రీగురుదాసురామ్‌గారికి దయాల్బాగు నాయకత్వమును

సంపాదించిపెట్టుటయే తమతంత్రవిధానమని వారు బహిరంగముగ జెప్పుచుం డెడివారు. కాని యీకుయుక్తి నెగ్గనందున నా విరుద్ధ ప్రచారము తనకుదానే నశించిపోయెను.

27. అయినను మొదటినుండియు సభవారి ప్రవర్తన యెల్లపుడు నొకేతీరున నుండెను. సర్కారుసాహబ్‌వారు తమకాలములో కేంద్రీయపాలకసమితితో మిత్రత్వసహకారభావములతో ప్రవర్తించుచు పేచీలులేకుండ పనిజరుగుతీరున పరస్పరసంబంధమేర్పాటుచేసికొనుటకు సకలవిధముల ప్రయత్నించిరి. అయినను నా ప్రయత్నములు సఫలముకాలేదు. సాహబ్జీమహారాజువారుగూడ నటులనే సమితితో పరస్పరస్నేహసహకారభావములను పెంపొందించుకొనునిమిత్తమై 1914 సం॥రమంత ముందునుంచియు నుత్తరప్రత్యుత్తరములను జరుపుట ప్రారంభించి, యాప్రయత్నములనట్లే సాగించుచుండిరి. దయాల్బాగును స్థాపించిన పిదప వారు 1920 సంవత్సరములో శ్రీ మాధవప్రసాదసిన్హాగారిని దయాల్బాగున కాహ్వానించి, యొక వృద్ధపురాణ సత్సంగికి చేయవలసిన యాదరగౌరవముల నాయనయెడలచూపి మర్యాదజేసిరి. సమితివారు సభపక్షమువారి హక్కులవిషయమై యీమాత్రముగూడ నాలోచించుట కిష్టపడనప్పుడే, జ్ఞానచంద్ర బొసక్‌గారు సమితిపైన దావా దాఖలుచేయుట జరిగెను. అటులనే మెహతాజీ సాహబ్‌వారుగూడ 1938 సం॥రము డిసెంబరునెలలో శ్రీ మాధవప్రసాదసిన్హాగారిని, పీపల్‌మండీలో శ్రీ లాలాజీగారి పుత్రులు శ్రీ కుంవర్‌జీగారిని, దయాల్బాగు పరిశ్రమల పరిదర్శనమున కాహ్వానించిరి. వారిద్దఱు నాపరిదర్శనమునకు రాగా, వారిని తగు గౌరవమర్యాదలతో నాదరించి, పరిదర్శనమంతటను వారితో గలిసి తిరిగి చూపించి. శ్రీ మాధవప్రసాదసిన్హాగారిచే పరిసాదమును గూడ పంచిపెట్టించిరి. ఆ యిరువురు నున్నంతకాలము నిర్విరోధముగ మెహతాజీ సాహబ్‌వారు వారిరువురితో సౌహార్ద్రభావముతోనే పరివర్తించిరి.

28. అట్లే బ్యాస్‌సత్సంగ నాయకులైన సర్దార్‌సావన్‌సింగుగారికి 1938 సం॥రములో నమృతసర్‌లో దయాల్బాగు స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్సు వద్ద స్వాగతమిచ్చి యా మిల్లును వారికి చూపించిరి. అప్పుడు సర్దారుగారు కొన్ని వస్తువులను గూడ కొని, యచ్చట సత్సంగముజేసిరి. అందఱు నుత్సాహములో నా సత్సంగములో పాల్గొనిరి. తరువాతి సంవత్సరములో సర్దారుగారు దయాల్బాగు వచ్చి 21-12-'39 తేదీన దయాల్బాగ్ పరిశ్రమల పరిదర్శ

నమున కుద్ఘాటనోత్సవము జరిపిరి సర్దార్‌సాహెబ్‌గారు ప్రదర్శనమునంతను దిరిగి చూచినపిదప, సత్సంగములోగూడ పాల్గొనిరి.

## సంఘసముత్కర్షణ చర్యలు

29. మెహతాజీసాహెబ్‌వారు పంచవర్షీయ పారిశ్రామికపరిణాళికను కొనసాగించుట కొఱకే ప్రధానముగ పట్టుదల వహించియున్నను, తదితర ముఖ్యవిషయములను గూడ వారు తగువిధమున కనిపెట్టుచునే యుండిరి. చిన్నవయస్సు బాలబాలికల వివాహములను, మితవ్యయముతో సులువుగ జరిపించు విధానమును యోచించుట కొకసమితి నేర్పాటుజేసిరి. ఆప్రారంభికప్రయత్నములఫలితముగనే తరువాత దయాల్బాగువివాహపంచాయతీ (Dayalbagh Marriage Panchayat) యేర్పాటయినది. అదేవిధముగ, మెహతాజీసాహెబ్‌వారిప్రోత్సాహముచే దయాల్బాగునివాసులందఱును 28-4-1940 తేదీయుదయమున సత్సంగహాలులోసమావేశమయి, కాలనీలో నందఱును ప్రతిదినము నుదయసత్సంగానంతరము హైస్కూలుమైదానములో కలిసికొని సాముహికవ్యాయామము చేయుచుండవలెనని తీర్మానించిరి అట్లు మఱునాడు, అనగా 29-4-1940 తేదీ యుదయమునుండియే ప్రారంభించి సుమారు 2 సంగరముల 6 మాసములకాలము శరీరవ్యాయామము నందఱు కలిసి చేయుచుండిరి. పిమ్మట వ్యవసాయక్షేత్రపు (Agricultural Farm) పొలములలో వ్యవసాయపుపనులు ప్రారంభముచేసినందున, నందఱును శరీరవ్యాయామమునకు బదులుగ పొలముపనులు చేయుట మొదలిడిరి

30. అంతకు చాలపూర్వమే యేర్పడియున్న మహిళాసంఘము స్త్రీలకు కుట్టుపనినేర్పుటకును, స్త్రీలకుపయోగార్హమయినట్టి కుట్టినదుస్తులువగైరా వస్తువులను తయారుచేయుట నేర్పుటకును ఏర్పాట్లుగావించెను. ఆసంఘ మొక స్టోరునుకూడ స్థాపించెను.

31. సభవారు ఇన్సురెన్సుపనిని మొదలుపెట్టి, క్రొత్తగ నుద్యోగములో జేరినవారందఱకును, దయాల్బాగులో పెండ్లిచేసికొన్న పెండ్లికొడుకులకును తప్పనిసరిగ భీమాచేయించుకొనవలయునని నిబంధనజేసిరి. ఇంతియగాక, పూర్వమునుండిపనిచేయుచున్నవారలకు సభవారు మొదటికంతుసొమ్ము తామే చెల్లించి, యవ్విధముగ వారలనుగూడ భీమాచేయించుకొనునట్లు ప్రోత్సాహము చేసిరి.

32. పైనజెప్పినచర్యలుమాత్రమేగాక, టైఫాయిడు, పేరాటైఫాయిడు, విషూచిమొదలగు సంటుజాడ్యములు తగులకుండచేయుటకై యందఱకును టీకాలు వేయించునేర్పాట్లను, మలేరియాజ్వరము వచ్చురోజులలో కాలనీ నివాసులందఱకు నుచితముగ క్వినైనును పంచిపెట్టునేర్పాట్లనుగూడ సభవారు చేసిరి.

## పర్యటనములు

33. 1940 సం॥రములో మెహతాజీసాహబ్ వారు దేశములో దాదాపన్ని ప్రాంతములకును పర్యటనములు చేసిరి. ఏప్రిల్ నెలప్రారంభములో మదరాసు ప్రాంతమునకు పర్యటనము చేసిరి. ఏప్రిలు 3వ తేదీన దయాల్బాగులో బయ ల్దేఱి కోయంబత్తూరు, మధుర, పాలంకోట. మదరాసుపట్టణము. భీమవరము, కాకినాడ, విజయనగరము, తిమరనీలు వెళ్ళి, ఏప్రిల్ 19వ తేదీనాటికి తిరిగి దయాల్బాగుజేరుకొనిరి. మెహతాజీసాహబ్ వారు మైసూరురాజభవనమును గూడ నీ పర్యటనములో 9-4-1940 తేదీన జూచిరి సాహబ్జీమహారాజువారు మదరాసున కంతిమపర్యటనములో వెళ్ళినపు డీప్యాలస్ లోనే మకాముచేసి అందులోనే శరీరమునువిసర్జించిరి. మెహతాజీసాహబ్ వారా రాజభవనము నంతను తిరిగి చూచుచుండినపుడు మహాగంభీరవిచారభావపూరితులయిరి. ఈ పర్యటనములోనే మెహతాజీసాహబ్ వారు మధురలో వచనమునుచెప్పుచు, సాహబ్జీమహారాజువారు తమనిర్యాణమునకుముందు మదరాసుసత్సంగులభక్తికి మెచ్చుకొని, వారలకు తగిన బహుమాన మిచ్చెదమని సెలవిచ్చిరని జ్ఞాపకము చేసి, మదరాసుసోదరులు తమయాంతర్యమున పరికించిచూచుకొననిచో నావా గ్దానము పూర్తియై తలొకరికి నట్లు బహుమానము లభించినట్లు బోధపడగలదని జెప్పిరి. అయిన నేపురాణసత్సంగులకైన నట్టియాంతర్యానుభవములు గలిగి యుండనిచో నట్టివారికొఱకు నూతనసత్సంగులు ప్రార్థనచేసినయెడల నట్టి పురాణసత్సంగులనుగూడ నాదయాళుప్రభువు బహూకృతులను జేయుదురని తమకు దృఢవిశ్వాసముగలదనిగూడ వారు సెలవిచ్చిరి. మదరాసులో నివ్విధ ముగ సెలవిచ్చిరి. "ఏదేని యొకప్రత్యేకజాతి లేక యొకప్రత్యేకవర్ణమునకు మాత్రమే లాభముగలిగించునిమిత్తము రాధాస్వామీసత్సంగ ముత్పన్నము గాలేదు. దీనిమహోద్దేశ్య మొకప్రత్యేకదేశప్రజలకు లేక ప్రత్యేకజాతికేగాక యావత్సృష్టికిని మహాశ్రేయస్సు నొనగూర్చుటయే. అటులనేగానిచో దానికట్టి

యుత్తమనామమును ధరించుట కర్తృత్వమే లేకుండును. సత్సంగులపరివర్తన సత్సంగమున కొప్పజెప్పిన యీమహాకార్యభారమును, వారు జయప్రదముగ నిర్వహించగలరను దృఢవిశ్వాసముజనింపజేయులాగున నుండవలెను.

మే నెలలో వా రుత్తరప్రదేశతూర్పుప్రాంతమునకును, బీహారునకును పర్యటనముచేసి కాన్పూరు అలహాబాదు, వారాణసి, పాట్నా, గయా, ధన్‌బాద్, టాటానగరము, ఖర్గపురము, కలకత్తా, దర్భంగా, ముజఫర్‌పురము, లక్నోవద్దరాలకు వెళ్ళిరి. జూన్ నెల చివర ఉత్తరప్రదేశములో పశ్చిమ ప్రాంతమునకును ఢిల్లీకిని వెళ్ళిరి. ఆగస్టునెలలో వారు జోధపురమువద్దరా యూళ్ళను బొంబాయిగూడ వెళ్ళి, మదరాసుమీదుగ తిరిగివచ్చిరి. చివరకు 1940 సం||రము నవంబరునెలలో వారు పంజాబుపర్యటనముచేసిరి.

## జోధపురపర్యటనము

34. మెహతాజీసాహబ్‌వారి జోధపురపర్యటనము చిరస్మరణీయము. అచ్చట ననేకదినములనుండి ప్రతిపక్షకూటమువారు చాలవిరుద్ధప్రచారము జేయుచుండిరి. మెహతాజీసాహబ్‌వారు 1940 సం||రము ఆగస్టునెల 3వ తేదీ సాయంకాలమున నచ్చటకు విచ్చేసి, సాయంతనసత్సంగానంతరము సెలవిచ్చిన వచనములో నిట్లుచెప్పిరి:-

"జోధపురసత్సంగులకు దయాల్బాగుసత్సంగమునుగురించి కొన్నిశంక లున్నవని నాకు తెలియవచ్చినందున నీరోజున నేనా శంకలను తొలగింపగోరు చున్నాను. వారల మొదటియాక్షేపణ దయాల్బాగులోనివారు పరిశ్రమలయభివృద్ధికై చాలశ్రద్ధ చేయుచుంటిమనియు, రెండవయాక్షేపణ సత్సంగములో వచనములను జెప్పుటలేదనియు, మొదటియాక్షేపణ నిప్పుడుజేయువారు, సాహబ్జీమహారాజువారు మొదట 1916-17 సం||రములో నీపరిశ్రమలను స్థాపించిన పుడును, తిరిగివారు దయాల్బాగుసంస్థలవస్తూత్పాదనమును మూడుసంవత్సరము లలో సాలునకు కోటిరూప్యములగునట్లు పెంచవలయునని 1935వ సం||రములో సభలో తీర్మానమును ప్రతిపాదించినపుడునుగూడ, చేసియుండవలసినదే. ఈ యాదర్శసిద్ధికై 7 సం||రములు పనిజేయవలసియుండుననిసభాసభ్యులు గొందఱు విన్నవించుకొనుటచే, సభవారు చిట్టచివర కయిదేండ్లవ్యవధి కంగీకరించిరి.

అప్పు డీయాక్షేపణను జేయకనుండినవా రిపుడు ఆక్షేపణనుజేయుట సబబు లేదు. ఇఁక రెండవయాక్షేపణవిషయములో, పారమార్థికవిషయములను గుఱించి వచనములనుజెప్పుటయు, నాధ్యాత్మికసాధనల నభ్యాసముజేయుటయు శ్రీప్రభుకృత్యములుగావని, యెవరు నెన్నఁడు ననలేదు. మేము చెప్పునదెల్ల నే మనగ, నొకవ్యక్తిని వచనములను జెప్పవలసినదనికోరువారు నిజముగ నుత్త శ్రవణానందమునే కోరుచున్నారుకాని యింతవఱకు సెలవిచ్చినమహావచనములవలన వారెట్టిలాభమునుపొందియుండనట్లు విస్పష్టమగుచున్నదనిమాత్రమే. వచనములను చెప్పవలయునని పట్టుపట్టెడివారు, సాహబ్జీమహారాజువారు పారిశ్రామికప్రణాళికవిషయములోనిచ్చిన యాదేశములనుపాలించనిచో, నట్టి వారికి వచనములవలన నేమిలాభము సేకుఱగలదు? అట్టిజనుల నాప్రభుని సేవజేయకుండ దూరముగనుండి సంతసించనిండు. మనము వారిసేవచేయుచు నానందించుదము.”

౩౫. ఆవచనము చెప్పుటయయినతరువాత, నాసమావేశములోనున్నవారెన్నియో ప్రశ్నలను వేసిరి. నిజముగ కొందఱుతుంటరులు, జనులనందఱనువచ్చి తమయిచ్చవచ్చినప్రశ్నలను వేయవలసినదని జనసామాన్యమును ప్రోత్సహించుచు, నొకకరపత్రమును పంచిపెట్టిరి. అందుచే, సాహబ్జీమహారాజువారి జ్యేష్ఠ పుత్రుని (శ్రీ) ప్రేమసరూపును దయాల్బాగునుండి బయటకేలపంపివేసితిరని యొకరు ప్రశ్నించిరి. (శ్రీ) ప్రేమసరూపును దయాల్బాగునుండి యెవరును బహిష్కరించలేదనిజెప్పి, ప్రేమసరూపు స్వయముగ నెట్లు దయాల్బాగువిడిచి వెడలిపోయెనో మెహతాజీసాహబ్ వారు సవిస్తరముగ నీక్రిందివిధమున సెలవిచ్చిరి:-

“1937 సం॥రములో శ్రీ ప్రేమసరూపు తనపైన నేనెన్నటికిని కోపగించనని నన్ను వాగ్దానమిమ్మని యెన్నియోసార్లడిగెను. సత్సంగమునకు ప్రతికూలముగ నతడు పనిచేయకుండినచో నా కతనిమీద కోపగించవలసినపనియేమియులేదని నేఁజెప్పితిని. అయిననుగూడ వాగ్దానమిమ్మనియాతడు నాతోపట్టుపట్టెను. నూటికితొంబదిపాళ్లు ఆతనిపై కోపగించనని నే వాగ్దానముచేసితిని. అంతకంటెను నిష్కర్షయయిన వాగ్దానము నిమ్మని నన్నతడు కోరెను. అప్పుడు నేను నూటికి 99 పాళ్ళు అతనిమీద కోపగించనని జెప్పితిని. అదికూడ నతనికి తృప్తికరముగ లేనందున నే నతనిమీద 99.9 పాళ్లు కోపగించువాడనుగానని చెప్పితిని. కాని యతని కందుచేగూడ తృప్తికలుగలేదు. అతడేమిచేసినను

గూడ నే నతనిమీద నేనన్నటికిని కోపగించనని మాటనివ్వవలయునని యతని కోరిక. కాని యతడట్లుకోరుట యెంతమాత్రము సమంజసముకాదు. తరువాత క్షీరశాలల లెక్కలపరిశీలన నివేదికను చదివినపుడు శ్రీ ప్రేమసరూపు, తానును క్షీరశాలలో తనక్రింద పనిచేయునుద్యోగస్థులందఱును గతసంవత్సరములో లభించినజీతముపెరుగుదలను వదులుకొని యంతకు పూర్వము తమకు లభించుచుండిన వేతనములను మాత్రమే పుచ్చుకొందుమని చెప్పుచు నొక యుత్తరమునువ్రాసి స్వయముగ సంతకముచేసి నా చేతికిచ్చెను. నే నందులకతనికి కృతజ్ఞతను దెలిపితిని. నేను జరిగిన విషయమును గుఱించి జ్ఞాపకార్థమై యొక లిఖితమునువ్రాసి, దానిని మఱినా డభిప్రాయభేదములకు తావులేకుండ జేయుటకై చదివినపుడు, ఆతడా జ్ఞాపకలిఖితములోవ్రాసినది పొరపాటని ఖండించి, నాకోర్కెపైననే తాను తక్కువవేతనమును దీసికొనుట కంగీకరించితినని చెప్పెను. ఆమాట స్పష్టముగ నసత్యమగుటచే నే నది తప్పని యంటిని. రెండుమూడురోజుల పిమ్మట శ్రీ ప్రేమసరూపు అనారోగ్యహేతువుతో సెలవుదరఖాస్తు పెట్టెను. దాని వెంబడి శ్రీ శాంతిసరూపుగారి సెలవుదరఖాస్తు గూడ నప్పుడే వచ్చెను. ఇరువురకును సెలవిచ్చితిమి. వారిరువురును తిరిగి సెలవును పొడిగింపుమని కోరినందున నట్లేజేసితిమి. అయినను సెలవనంతరమెక్కరుగూడ తిరిగి యుద్యోగములో జేరలేదు. వారిరువురును సెలవులో నున్నసమయములో, దయాల్బాగుపరిపాలకవర్గమునకు ప్రతికూలముగ ననేక వ్యాసములు వివిధవార్తాపత్రికలలో ప్రచురింపబడినవి. అందుచే వారిరువురును 1937 క్రిస్మస్ సెలవులలో దయాల్బాగు వచ్చినపుడు వారితో నా దుష్ప్రచారమును గుఱించి సంప్రతించబడెను. ఆవ్యాసములలోని విషయములసత్యములని వారు నోటిమాటగ నొప్పుకొనిరి. కాని మేము వారు చెప్పినదంతయు నప్పుడేవ్రాయించి వారి నందులో సంతకములుచేసి యిమ్మనికోరగా వారు నిరాకరించిరి. ఆనాడు సాయంకాలము శ్రీ ప్రేమసరూపు నావద్దకు రాగా, మేమిద్దఱమును చాలసేపు మాటలాడుకొంటిమిగాని, చివర కాయన కోపగ్రస్తుడై, తాను తెచ్చిన దస్తరములను విసరివైచి హఠాత్తుగ లేచిపోయెను వా రందఱు నా రాత్రియే దయాల్బాగును విడిచి వెళ్ళిపోయిరని మఱునాడుదయము మాకు తెలిసెను.

"ఇంకొకవిషయముగూడ నిచ్చట చెప్పవలసియున్నది. 1937 సెప్టెంబరు నెలలో శ్రీప్రేమసరూపుగారు, శ్రీ గురుదాసు రామ్‌గారు దయాల్బాగును

విడిచి వెళ్ళిపోవుచుండిరిగాన తానుగూడ నల్లెదయాల్బాగును విడిచిపెట్టి వచ్చి యాయనతో గలిసికొందుననిజెప్పుచు, నొకయుత్తరమును శ్రీ గురుదాసు రాముగారికి వ్రాసెను. ఆయుత్తర మిప్పటికిని నావద్దనున్నది.'' దీనినిబట్టి వారందఱును గలిసి కుట్రజేయుచున్నట్లు స్పష్టపడుచున్నది.

36. ప్రాంతపడి నిరుపయోగముగనున్న అమృతసరులోని మిల్లునుకొని సత్సంగులధనము 25 లక్షల రూప్యములను వృథావ్యయముచేసిరని మఱొక యాక్షేపణనుజేసిరి. సత్సంగులపేర్ల మొత్తముధనమే సుమారు 7 లక్షల రూప్యములును, సభపేర్లధనము 6 లక్షల రూప్యములు నైయుండెను. మొత్తము మూలధనమే యంతతక్కువగ నున్నపుడు, 25 లక్షలు వ్యర్థవ్యయము జేసిరని జెప్పుటకు సావకాశమెద్దియని మెహతాజీసాహబ్ వారు మొదటప్రశ్నించిరి. పిమ్మట నామిల్లుయావరణముయొక్కయు నందలిభవనముల యొక్కయు విలువమాత్రమే వ్యయపరచినధనమునకు సరిపడుననియు, నందుచే కొన్ని బహునూతనయంత్రములతో కూడియున్నట్టి మిల్లులోని యంత్ర సముదాయమంతయు కేవలముచితముగనే లభ్యమయినట్లెంచవలసియుండునని యు వారు తిరిగి వివరముగ తెలియజెప్పిరి

37. ఇవ్విధముగ రమారమి మూడుగంటలసేపు ప్రశ్నోత్తరముల పరంపర జరుగుచుండెను. మాస్టరుసాహబ్ అనునొక పెద్దమనిషి యిందులో చాల ప్రశ్నలను వేసెను. సమావేశము పూర్తియగుసరి కాయన తనకు నూటికి 75 పాళ్ళు సందేహానివృత్తియయినదని యొప్పుకొనిరి.

38. మెహతాజీసాహబ్ వారు మదరాసు వెళ్ళినపుడు ఆవడిలో మకాము చేసిరి. మదరాసు ప్రభుత్వమువారు దయాల్బాగుపద్ధతి నొకకాలనీ స్థాపించు నిమిత్తమై సభవారికి ఆవడిలో 300 యెకరముల భూమి నుచితముగ నింతకు పూర్వమే యిచ్చియుండిరి.

39. ఇవ్విధముగ వారు దేశములో నించుమించన్నిప్రాంతములకును వేంచేసిరి. ప్రయాణములలో వృథాకాలక్షేపముగాకుండుటకై వారు రాత్రిళ్ళు ప్రయాణముజేయుచు పగలు సత్సంగము జేయుచుండెడివారు. ప్రతిస్థలము లోను సత్సంగు లధికముగవచ్చి సత్సంగలాభమునొందుచుండిరి. దూర దూర స్థలములలో నుండిపోవుటచే, 1937 సం॥రము డర్మిలా దయాల్బాగురాలే

యుండిన సత్సంగులు చాలమందిగలరు. అట్టిసత్సంగులందఱకు నివ్విధముగ సత్సంగసావకాశము సంప్రాప్తమయ్యెను.

40. పరిశ్రమసంస్థలు పెరుగుచున్నకొలఁది, పరిష్కరించవలసిన క్రొత్త క్రొత్తసమస్యలుగూడ నుత్పన్నమగుచుండెను. ఈ సంస్థలలో పనిజేయు కార్మికులకు వసతుల నేర్పాటుజేయుటకై సభవారు, పనివాండ్రకునివాసార్హమైన 40 యిండ్లను కార్యవీరనగరములోను, దాదాపు 2 డజన్ల యిండ్లను తాజ్ టేన్నరీ యావరణములోను కట్టించవలసివచ్చెను. లెదర్‌గూడ్సుఫ్యాక్టరీయొక్క వస్తూత్పాదన నభివృద్ధిజేయుటకై, యీసంస్థ కొకనూతన భవనమును 1941 సం॥రము ఆఖరులో కట్టించిరి. ఇంతియగాక నీసంవత్సరములలో సత్సంగులకు ప్రత్యేకవసతిగృహముల నిర్మాణముగూడ యథాప్రకారము జరిగించబడుచుండెను. సరణాశ్రమ ఆసుపత్రిలో శస్త్రచికిత్స కొకగదిని పరిశ్రమల యధినియామకుని (Director) కార్యాలయముకొఱ కొకక్రొత్తభవనమునుగూడ కట్టించిరి. విద్యాసంస్థ వగైరా సంస్థలకు క్రొత్తగ కొన్నిచిన్నభవనములను కట్టించి, అంతకుపూర్వమునుండియున్న భవనములకు కొన్నిక్రొత్తపెంపులును జేసి, కార్యాలయముల వసతిసౌకర్యములను గూడ హెచ్చుచేసిరి.

## ఆదర్శసిద్ధి

41. దయాల్బాగునకుబయట, గిరిడీహాలో నభ్రకపరిశ్రమలును (Mica Industries) మదరాసులో 'దయాల్బాగు ఇంక్ ఫ్యాక్టరీయు' సయాల్కోటులో మోడల్‌స్టోర్సువర్క్సు మొదలయిన క్రొత్తపరిశ్రమల నేర్పాటుచేయుట వలనను, దయాల్బాగులో పూర్వమునుండియున్న సంస్థల నభివృద్ధిచేసి ఎవెరిడే ఫుట్ వేర్ ఫ్యాక్టరీ మొదలగు కొన్ని క్రొత్తసంస్థల నేర్పాటుచేసినందుననను, వస్తూత్పాదనము పెరిగి 1942 సం॥రము మే నెలతో నంతమయినసంవత్సరములో, ననగా సాహబ్జీమహారాజువారి నిర్యాణసమయము మొదలుకొని 5 సం॥రములలోని యంత్యద్వాదశమాసములలో, దయాల్బాగు పరిశ్రమసంస్థలచే నుత్పాదితమయిన వస్తువులమూల్యము ఒక కోటిరూప్యములను మించిపోయెను. వాని మూల్యము కచ్చితముగ రు 1,05,23,898/- లాయెను. ఇవ్విధముగ నాదర్శసిద్ధి గలిగినందున సత్సంగు లాపరీక్షలో అపజయముగలుగకుండినందుకు సంతోషపూరితులయిరి.

42. దయాల్బాగు వ్యాపారకార్యదర్శిగారు (Business Secretary) 31-5-1942 తేదీతో నంత్యమయిన సంవత్సరమునకు వస్త్రోత్పాదనము రు. 1,05,00,000లకు మించినదని 5-6-42 తేదీన, అప్పుడు మెహతాజీసాహబ్ వారు మసూరీలో నుండుచున్నందున, మెహతాజీసాహబ్‌వారికి మసూరీ వ్రాసిరి. మెహతాజీసాహబ్‌వారు 8-6-1942 తేదీన నీక్రిందివిధముగ సమాధానమునిచ్చిరి:-

"దయాల్బాగులోని వివిధవిభాగములవారు ఇంత యుదారముగ నాకోరికను మన్నించుటలో వారినైసర్గికోత్తమత్వౌదార్యములు వ్యక్తమగుచుండెను. ఈప్రణాళికానిర్వాహమునకై పాటుపడినవారందఱియందును దయజూపుడని మీాాపరమపితకు చేసెడి ప్రార్థనలలో నేనుగూడ హృదయపూర్వకముగ పాల్గొందును. నేనింకొకయడుగు ముందుకు వెళ్ళి ఈప్రణాళికతో సహకరించని వారియెడలను, ఇందుకునిజముగ ననేకవిఘాటంకములను గలుగజేసినవారియెడలనుగూడ హుజూర్ రాధాస్వామీదయాళు రిపుడు దయావర్షమును గురిపించుగాతయని ప్రార్థించెదను!!"

43. పారిశ్రామికావ్రణాళిక 1942 మే నెలలో సంపూర్ణముగ సఫలమయినతరువాతగూడ, పరిశ్రమసంస్థలవ్యవస్థయు విక్రయసంస్థలవ్యవస్థయు యథాప్రకారము క్రమాభివృద్ధినొందుచు, 1945 సం॥రము మార్చినెలనాటికి దయాల్బాగులోను బయటను ఈకార్యములనుచక్కబెట్టుటకు 34 లిమిటెడ్ కంపెనీలు పనిచేయుచుండెను.

44 కొంతకాలమైనతర్వాత కొన్నిసంస్థలలోని పనివాండ్రు ఆయాపనులలో నెక్కువయభిమానముగలిగియుండుటచే, సహకారసంఘములుగ నేర్పడి తమంతటతామే కొన్నిపరిశ్రమలను నడిపించుటకును, లేదా వివిధపారిశ్రామికసంస్థల క్రియాకలాపములలో నేదేనియొకవిభాగమును తామేనిర్వహించుటకును ఉద్యుక్తులయిరి. అట్టికార్మికులకు సాధ్యమయినంతగ ప్రోత్సాహప్రోద్బలములు లభించుచుండుటచే, దయాల్బాగులో 1946వ సంవత్సరాంతమునకు 13 సహకారసంఘములు పనిచేయుచుండెను ఈసహకారసంఘములను స్థాపనజేయుటవలన వివిధసంస్థలలోని పనివాండ్రలో ఆయాసంస్థలపనులను చేయుటలో నుత్సాహసహకారభావములు వృద్ధియయ్యెను.

45. ప్రతిదినావసరముగల వస్తువులను తదితరవస్తువులను ఉత్పాదనచేయు సంస్థలసంఖ్య పెరుగుచున్నకొలంది, దానితోపాటు అమ్మకపుకంపెనీలసంఖ్య గూడ పెరుగుచుండుటచే, 1945 సంllరము మార్చినెలాఖరునకు భారతదేశ వివిధప్రాంతములలో 329 లిమిటెడ్ కంపెనీస్టోర్సు ఏర్పడినవి. క్రమముగ రెండుసంవత్సరములలో నేడు ప్రాంతీయపుడిపోలు (Provincial Depots) గూడ నేర్పాటుచేయబడి దయాల్బాగుపరిశ్రమలలో నుత్పత్తి జేయబడినవస్తువులను వివిధస్టోర్లకు వానియవసరముల వెంబడిని సరఫరా జేయుటకు ఉపయోగపడుచుండెను.

## మితవ్యయపథప్రదర్శకులు

46. మెహతాజీసాహబ్‌వారు పంచవర్షీయపారిశ్రామిక ప్రణాళిక పూర్తియైపోవుటచే తమ్ము నధినియామకపదవినుండి వీలయినంతత్వరలో విడుదలచేయవలసినదని కోరిరి. కావున సభవారు 20-12-1942 తేదీ సమావేశములో నందుకంగీకరించి, సాహబ్జీమహారాజావారి రెండవయన్నగారయిన శ్రీద్వారకాబాసీగారిని అధినియామకులుగ నియమించిరి. వారాపదవిని 1952 సంllరములో వారిమరణసమయమువఱకు నలంకరించిరి. సభవారు మెహతాజీసాహబ్‌వారిని మితవ్యయవిషయములలో నింతకుముందువలెనే పథప్రదర్శనముచేయుచుండవలనదిగ గోరగా వారందుకంగీకరించినందున మితవ్యయపథప్రదర్శకులను నొకక్రొత్తపదవినేర్పాటుజేసిరి. అప్పటినుండియు మెహతాజీసాహబ్‌వారు సభకు మితవ్యయపథప్రదర్శకులుగ పనిచేయుచుండిరి.

## కృషికార్యము

47. 1939 సంllరమునుండియు ద్వితీయప్రపంచమహాయుద్ధము చెలరేగుచుండినందున ప్రజలలో దాని మహానిష్టఫలితములు వ్యాపింపదొడఁగెను. ఇంతియగాక, మహాత్మాగాంధీగారినాయకత్వమున జాతీయమహాసభవారిచే నారంభించబడిన "క్విట్ఇండియా" (Quit India) ఆందోళనమూలమున ననేకస్థలములలో ప్రయాణమార్గములకును, వార్తాహరణాదిమార్గములకును విచ్ఛిత్తియు, సామాన్యకార్యక్రమములకు భంగములును గలిగెను. కావున 1942 సంవత్సరము చివరిసగభాగములో, నుపభోగ్యవస్తువులు (Consumer goods)

దుర్లభములయి వానిధరలు పెరిగిపోయినందునను, చాటు క్రియవిక్రియములు (Black Market) అభివృద్ధిచెందినందునను, సామాన్యుల కష్టము లధికమై పోయెను. పై దేశములనుండి సరుకులుదిగుమతియగుట కష్టమైపోయినందునను, అమెరికా దేశపుసైనికదళములు నితరదళములు నధికముగ భారతదేశములో నుండిపోవుటచే వారల కాహారము నేర్పాటుచేయవలసివచ్చినందునను, భోజన పదార్థముల ధర లమితముగ పెరిగిపోయెను. మెహతాజీసాహబ్ వారు దయాల్బాగులో 'నధికాహారద్రవ్యోత్పాదనో' ద్యమమును (Grow more food - campaign) ప్రారంభించిరి. ప్రభుత్వమువారుగూడ నధికాహారద్రవ్యోత్పాదనను సాగించవలసినదిగఁ బ్రోత్సహింపసాగిరి.

48. సభవారికి మొదటిలో 3357 యకరములభూమియుండెడిది. 1937 సం॥ రమునకుపూర్వము దయాల్బాగు కృషివిభాగమువారు సొంతవ్యవసాయము చాలతక్కువగ చేయుచుండినందున, పరిక్కగ్రామములరైతులకు వారుకోరిన భూములను కౌలుకిచ్చుచుండిరి అవ్విధముగ సాగున కుపయోగించవగ్గామైన 1611 యకరముల భూమి రయితులయధీనము చేయబడెను. అందు చే మెహతాజీసాహబ్ వారు 'అధికాహారద్రవ్యోత్పాది' నోద్యమమును 1943 సం॥రములో ప్రారంభించునాటికి సభకుమిగిలియున్న భూములన్నియును దిబ్బలు, లోయలు, ముండ్లపొదలు, రెల్లుదుబ్బులువగైరాలతో నిండినవై సాగుచేయుటకు బొత్తిగనయోగ్యముగనుండెను కావున నప్పుడు ముండ్లపొదలు, రెల్లు డుబ్బులువగైరాలను నిర్మూలనముజేసి, భూములను సమతలముగమార్చి వ్యవసాయార్హముగ జేయుట ప్రథమకర్తవ్యమై యుండెను.

49. కావున కృషికార్యమహాపరిపాలిక 1943 సం॥రములో నివ్విధముగ ప్రారంభమై, యప్పటినుండియు నవిచ్ఛిన్నముగ జరుగుచుండెను దయాల్బాగునివాసులును, పైయూళ్ళనుండి సత్సంగమునకై వచ్చిన యాగంతుకసత్సంగులును, వృద్ధులు, యువకులునుగూడ వేసవికాలములోను శీతాకాలములోను, యెండలలోను వానలలోను పొలములకు, ప్రత్యూదయమును కొంతకాలము సాయంకాలముగూడ, నియమముగ వెళ్ళి పనిచేయుచుండిరి, ఎప్పుడైనను సత్సంగులలో గొందఱు వెళ్ళకుండనుండిపోవచ్చునుగాని, మెహతాజిసాహేబ్ వారు మాత్రము పొలములలో కాయకష్టము చేయువారల కుత్సాహసంతోషములను గలుగజేసి పథప్రదర్శనమిచ్చుటకై, నిరంతరము పొలములకు వెళ్ళుచునే యుండిరి

50. సత్సంగులు పొలములలో పనిచేయుచున్నపుడు వారిరూపులు వేషములును సరిగ సత్సంగపవిత్రగ్రంథములలో భక్తులనుగుఱించి వర్ణించిన విధమున నుండుచుండును. ఆగ్రంథములలో, భక్తులు పవిత్రవసంతసమయమున పసుపు రంగుబట్టలను గట్టుకొనియున్నట్లును, వారు నల్దెసల పచ్చనిపుష్పములను పసిండి వర్ణమునుమాత్రమే గాంచుచున్నట్లును వర్ణించబడెను. సరిగనట్లే పొలములలో పనిజేయుసత్సంగుల యొడళ్ళు ప్రతిదినమును పొలములపసుపురంగుధూళితో పూర్తిగనిండియుండును. భక్తులు హోలీసమయములో కాలకర్మములనగతాళి(ధూల్ ఉడానా[1])సేయుచున్నట్లు పవిత్రగ్రంథములలో వర్ణించిరి. పొలములలో పనిచేయుసత్సంగులు నిజముగ ప్రతిదినమును పొలములలో దుమ్ము నెక్కువగ నెగురఁగొట్టుచునే (ధూల్ ఉడానా[1]) యుందురు. దయావర్షపు జల్లులలో భక్తులు తడిసిపోవుచుందురనియు 'మాయ' మునిఁగిపోవుచున్నదనియు పవిత్రగ్రంథములలో వర్ణనగలదు. సరిగనట్లే పొలములలో కృషిజేయు సత్సంగులు వర్షములలో తడిసిపోవుచు, శ్రావణమాసములో వరిచేలలో తఱచుగ నీళ్ళలో సగము మోకాలిలోతున దిగి పనిచేయుచుందురు. పవిత్రగ్రంథములలో భక్తు లుయ్యెలలో క్రిందికిపైకి నూఁగుచున్నట్లు వర్ణించిరి.

'సురతియా ఝూల రహీ అజ ధరన గగన కే బీచ్'

అర్థము:- 'ఆత్మ భూమ్యాకాశములమధ్య క్రిందికి, పైకి నూఁగుచున్నది.' సరిగ నట్లే సత్సంగులు పొలముపనిచేయునపుడు పాటాలను (పాటాయనగా మంటిని మెరకనుండి పల్లమునకులాగునట్టి బల్ల) పట్టుకొని మెరకపల్లములలో ముందుకువెనుకకును పోవుచుందురు. వివిధరకముల కృషికార్యములు సాగుచుండగా, పనిజేయుచునే గొందఱుసత్సంగులు కలిసి శబ్దగానముచేయ నారంభింతురు.

51. ఈ పనులు చేయుచున్నపుడు సత్సంగు లనుభవించు దయానందవర్షములు వర్ణనాతీతములు. మెహతాజీసాహబ్ వారొక్కొక్కప్పుడు యెత్తైనదిబ్బ మీద కూర్చుండి నలువైపుల జరుగుచున్నపనిని కనిపెట్టుచుందురు. అట్టిసమయమున వారిదర్శనము చేసికొనుచు పనిచేయు సత్సంగులకు 'సారబచన్' లో నీక్రింది చరణము స్మృతికివచ్చుచుండును.

---

1 'ధూల్ఉడానా' అనగా రెండర్థములున్నవి (1) ఎగతాళిచేయుట 2 దుమ్మువెగురగొట్టుట పొలములలో సత్సంగులు చేయు "ధూల్ఉడానా" (దుమ్మువెగురగొట్టుట) కాలకర్మములను భక్తులు చేయు "ధూల్ఉడానా" (ఎగతాళిజేయుట) తో శ్లేషార్థమునపోల్చబడినది.

'ఘూట పర బైఠే దీఖే 'మోహి'

అర్థము:- "వారు నదిగట్టున గూర్చుండి, నాకు దర్శనమిచ్చిరి."

నడచుటకుగూడ శక్తిలేని యనేకవృద్ధసత్సంగులు పొలములకు వెళ్ళి యచ్చట పనిజేసినందున, తిరిగి దృఢకాయులై బాగుగనడచుటయేగాక పాటలు మొదలగు వ్యవసాయపుపనిముట్లతో నెడతెగకుండ పనిజేయగల్గుచున్నారు. పొలములలో పనిజేయు నీయసాధారణసావకాశము కృషికసత్సంగులకు చెప్ప నలవిగాని వరదానములను ప్రసాదించుచున్నదై, మహానందదాయకముగనుంచు చున్నది. ఇదియిక్కాలమున జరుగుచున్నట్టి యొకనిజమైనవిచిత్రము. ఇట్టి యెప వరదానముల మహిమాతిశయము, ఈయపూర్వసావకాశమును జారవిడు కుండనుపయోగించు వివేకమును సౌభాగ్యమునుగలవారికిమాత్రము స్వాను భవముచే నవగాహనకావలసిన దేగాని, దానిని యథాతథముగ వర్ణించుట కేరితరముగాదు

52 1943 సం॥రములో నారంభించిన యీకృషికార్య మివ్విధముగ ప్రతి దినము నిప్పుడుగూడ జరుగుచునేయున్నది. భూములను చదునుజేయుటయేగాక భూములనుదున్నుట, చేలకు గట్లువేయుట, విత్తనములు జల్లుట, భూములకు నీళ్ళుపెట్టుట, కలుపుతీయుట, కోతలుకోయుట, కుప్పలునూర్చుట. మోపుల మోయుట మొదలయిన కృషికార్యములన్నిటిలో సత్సంగులు పాల్గొనుచుం డిరి కొన్ని సంవత్సరములైనతర్వాత అనగా 1955-56 నుండి కాలనీలోని స్త్రీలు గూడ పొలములలో కలుపుతీయుట మొదలయిన తేలికపనులను జేయుట ప్రారంభించి, రాను రాను పాటలతో త్రవ్వుట భూములు చదును చేయుట వగైరా సకలవిధకృషికార్యములలోను పాల్గొనసాగిరి.

53. ఇందుచే చేకూరిన మఱొకమహాలాభమేమనగ, ఉత్తరప్రదేశము లోని జమీందారీలు నిర్మూలము చేయబడిన 1-7-1952 తేదీ నాటికి సభవారి భూములలో, రయితాధీనముకాని భూములన్నియు సభయొక్క సొంతవ్యవ సాయములోనే యున్నందున, నవి సభవారికి నష్టపోకుండ నిలచినవి. కృషికా ర్యమే చేబూనుకొనియుండనిచో 30-6-1952 తేదీనాటికి వ్యవసాయానర్హ మయిన భూములు, ఆయాభూములున్న గ్రామపంచాయతీల యధీనములోనికి పోయియుండును. రయితాధీనములోనున్న భూమియంతయు (రమారమి 147 యెకరములు) నిందువలననే సభవారికి నష్టమైపోయి, అందుకుబదులుగ నిపుడు

రు. 1981/-లు వర్షాశనముమాత్రమే సభవారికి ముట్టుచున్నది. ఇవ్విధముగ సభయొక్క శేషించినభూములు మెహతాజీసాహబ్ వారు 1943 సం॥రములో ప్రారంభించిన కృషికార్యముమూలమున నష్టపోకుండ గాపాడబడినవి.

## బెంగాలులో క్షామము, క్షామపీడితులకు సహాయము

54. ఇన్నిసంవత్సరములును మెహతాజీసాహబ్ వారు ప్రధానముగ భూములను సమతలముజేయుటకును, కృషికార్యమును సాగించుటకును పట్టుదల వహించి పనిచేయుచున్నను, వారు సభకును సత్సంగవ్యవస్థకును, సత్సంగులకు వ్యక్తిగతముగనుగూడ ననేకవిధముల పథప్రదర్శనముజేయుచు, సత్సంగమునకు సర్వతోముఖముగనభివృద్ధిగలుగు సావకాశములను గల్పించుచునేయుండిరి దానితోపాటదేసమయముననే, సత్సంగముయొక్క ప్రధానక్రియాకలాపముతో సంబంధములేకుండ బాహ్యముగ జరుగుచున్న ముఖ్యసంఘటనలు పరిస్థితుల విషయములోగూడ వారు తగు శ్రద్ధవహించుచునేయుండిరి

ఉదాహరణార్థము, 1943వ సం॥రములో బెంగాలుదేశములో ఘోర క్షామము తటస్థించి వందలాదిప్రజలు తిండిలేకను రోగములమూలముననుబాధపడుచు, చనిపోవుచుండినపుడు మెహతాజీసాహబ్ వారి యుత్తేజకనాయకత్వమున సత్సంగవ్యవస్థ, జాతిమతవివక్షలేకుండ నచ్చటిక్షామపీడితుల కుచితముగ తిండి, బట్టలను సరఫరాచేసి మహోఘనకార్య మొనరించెను.

55. అందునిమిత్తము దయాల్బాగునుండి రాధాస్వామీచారిటబుల్ సొసయిటీతరఫున శ్రీమురళీధరముద్గిలుగారి నాయకత్వమున నొకసత్సంగిసేవకదళమును కలకత్తాలో నుచితభోజనసదుపాయము లేర్పాటుజేయుటకై 29-8-1943 తేదీన పంపిరి. ఇంతియగాక, సర్ సాహబ్జీమహారాజ్ చారిటబుల్ ట్రస్టువారు గూడ 5-9-1943 తేదీన సమావేశమై, కలకత్తాలో క్షుధార్తుల కుచితముగ నాహారమును పంచిపెట్టునిమిత్తమై తగినధనమిచ్చి మఱొకకార్యకర్తలదళమును కలకత్తా పంపించుటకు తీర్మానించిరి. రాధాస్వామీసత్సంగ సభ కార్యనిర్వాహకవర్గము 6-9-1943 తేదీన సమావేశమై రు. 3000/-లను క్షామోపశాంతికై వెచ్చించుటకు నిశ్చయించి, మెహతాజీసాహబ్ వారిని క్షామోపశమనవ్యవస్థ నేర్పాటుజేయవలసినదని ప్రార్థించుటకు తీర్మానించిరి. మెహతాజీసాహబ్ వారా ప్రార్థననంగీకరించి, కలకత్తాకు వెంటనే పయనమై

వెళ్ళి సెప్టెంబరు 9వ తేదీన నచ్చటకు జేరిరి. శ్రీ మురళీధరముద్గిలుగారు టాలీగంజ్‌లో నొక పచనశాల నేర్పాటుజేసి, 7-9-1943 తేదీనుండియు నాహార వితరణమును సాగించుచుండిరి. ఈ వంటశాలవద్ద మెహతాజీసాహబ్ వారు స్వయముగ 1000 మందికిపైగా సెప్టెంబరు 12వ తేదీనను ఆ మఱుసటి దినమును ఖిచడీ పంచిపెట్టిరి. "ధాపా" వద్ద మఱొక పచనశాలను, హౌరా వద్ద మూడవ వంటశాలనుగూడ తెఱచిరి. ఇంతియగాక చంటిబిడ్డలకును, పసి పిల్లలకును సోయాబీనుపాల నుచితముగ పంచిపెట్టుట కొక 'కేంటీనును'గూడ ఏర్పాటుచేసిరి. ఇవ్విధముగ పాలను ఆహారమునుగూడ నందఱకు నుచితముగ నిచ్చు సత్కార్యము నొనరించిరి. మెహతాజీసాహబ్‌వారి పథప్రదర్శన మున సత్సంగ సంస్థలు జరిపించినయీధర్మకార్యమును గుఱించి కలకత్తా లోని కొన్ని వార్తాపత్రికలు సంపాదకీయ వ్యాసములలో నెక్కువగ శ్లాఘించిరి.

56. ఈ కార్యమునకై దయాల్బాగులోని సత్సంగులకు చందాలనిచ్చుట కనుమతి యీయబడినందున సత్సంగులు హృదయపూర్వకముగ నిందుకై విరాళములనిచ్చిరి. ఇటులనే దయాల్బాగులో దుస్తులనుగూడ ప్రోగుచేసి కలకత్తాపంపి అచ్చట బట్టలులేక బాధపడుచున్నవారి కిప్పించిరి.

57. శ్రీ మురళీధరముద్గిలుగారీసరఫరాధర్మకార్యమును, పశ్చిమబెంగాలు ప్రభుత్వమువారు కలకత్తాలోని ధార్మికసహాయక కేంద్రముల నన్నిటిని ముగించవలెనని యుత్తరువిచ్చువఱకును జరిగించుచుండిరి. అప్పుడు ప్రభుత్వమువారి యుత్తరువు మూలమున మనవంటశాలలను 'కేంటీనును'గూడ ముగించవలసివచ్చెను. "సండేహిందుస్థాన్‌స్టాండర్డ్" (Sunday Hindustan Standard) పత్రికయొక్క 19-9-1943 తేదీగల సంచికలో నివ్విధముగ వ్రాసిరి:

"దయాల్బాగు నాయకులగు పవిత్రస్వరూపులైన మెహతాజీసాహబ్ వారు క్షామపీడితులైన బెంగాలుప్రజల యార్తనాదములచే కంపితులై వేగిరముగ కలకత్తావచ్చి 'టాలీగంజ్' కేంద్రములో అనాథులై కరువువలన బాధపడుచున్న వేలకొలది స్త్రీలకు, పురుషులకు, బాలురకును తమపవిత్రహస్తములతో ఖిచడీ పంచిపెట్టిరి. ఇదిగాక 'ధాపా' వద్ద మఱొక ధర్మాన్నప్రదాన గృహమునుగూడ వారు పెట్టించి 600 మందికి స్వయముగ ఖిచడీని పంచిపెట్టిరి."

58. మెహతాజీసాహబ్‌వారు తిరుగుప్రయాణములో 'ఆరా' గ్రామములో ఒకరోజు ఆఁగి 21-9-1943 నాటికి దయాల్బాగు చేరుకొనిరి. 1937 సం॥రము జూన్ నెలతరువాత సత్సంగమునకు రానట్టి కొందఱుసత్సంగులు 'ఆరా'గ్రామములో సత్సంగమునకువచ్చి, సభవారివలన సత్సంగులు తాత్కాలికవసతికి అనుమతినొంది నివసించుచున్న దయాల్బాగులోని గృహముల విషయములో సభవారి నైతికవిధానమును గుఱించి ప్రశ్నించిరి. మెహతాజీసాహబ్ వారా ప్రశ్నలకు పూర్తివివరములతో సమాధానము చెప్పిరి. అంతట నాప్రశ్నకర్తలు కనీస మప్పటిమట్టుకైనను మాఱుప్రశ్న లేక నిరుత్తరులై యుండిపోయిరి.

## మఱికొన్ని పర్యటనములు

59. 1942 సం॥రములో పంచవర్షీయపారిశ్రామిక ప్రణాళిక జయప్రదముగ పూర్తియైనపిదప, 1945 సం॥రము ఆఖరువఱకు ప్రతిసంవత్సరమును మెహతాజీసాహబ్ వారు భారతదేశములోని వివిధప్రాంతములకు పర్యటనములను చేయుచుండిరి. 1943 సం॥రములో వారు జోధపురము, హైదరాబాద్ (సింధు) కరాచీ మొదలైన పట్టణములకు వెళ్ళి వచ్చినతర్వాత, దక్షిణప్రాంతమునకు వెళ్ళిరి. విజయవాడలోను కడపలోనుదిగి మోటారు కారుమీద ననేకమైన చిన్న గ్రామములకుగూడ వెళ్ళి పిమ్మట మదరాసు వేంచేసిరి. అచ్చట 'ఆవడి' చూచి మధుర, తిరునల్వేలివగైరా పట్టణములకు వెళ్ళిరి. ఫిబ్రవరి 3వ తేదీన కూర్తాలము వెళ్ళి యచ్చట నొక స్టోరును స్థాపించి ఫిబ్రవరి 4వ తేదీన నచ్చటి నుండి తిరిగిబయలు దేఱిరి. అచ్చటినుండివచ్చుచున్నపుడు త్రోవలో కొందఱు సత్సంగుల ప్రార్థనమీద, వారు శివకాశీ వెళ్ళిరి. సత్సంగులు చాలమంది శివకాశీలో సమావేశమయిరి. అచ్చట కొద్దిమంది సత్సంగులు శ్రీ గురుదాసు రాము గారి ప్రచారమువలన నపభ్రమలపాలై బర్నాలాసత్సంగముతో సంబంధము పెట్టుకొనిరి. అట్టిసోదరులుగూడ శివకాశీలో సత్సంగమునకువచ్చి ప్రశ్నలు వేయగా చాలసేపటివఱకు నాప్రశ్నలకు మెహతాజీసాహబ్ వారు సమాధానములను జెప్పిరి. ఈ ప్రశ్నోత్తరములన్నియు చాలమట్టుకు సాహబ్జీమహారాజ్ వారి యుత్తరాధికారినిర్ధారణను గుఱించియు, సద్గురు నిర్ధారణను గుఱించియే అయియుండెను ఈప్రశ్నల నెక్కువగ వేయుచున్న యొకసత్సంగి సాహబ్జీమహారాజువారు తనలోనే ప్రకటమైయుండిరని ధాటిగ చెప్పసాగెను. అంతట మెహతాజిసాహబ్ వారు "అటులయినచో నీవు సాహబ్జీమహారాజు

వారి యుత్తరాధికారి నన్వేషింపబనియేమున్నది? ఈప్రశ్నావళియంతయు నెందులకు?" అనియడుగగ నతడు నిరుత్తరుడై యూరుకొనెను. అంతటితో నా చర్య ముగిసెను తత్ఫలితముగ శివకాశీలో పథభ్రష్టులైన సత్సంగులు గొందఱు తిరిగి సత్సంగముతో సంబంధము నేర్పఱచుకొనుట జరిగెను.

60. మెహతాజీసాహబ్‌వారు శివకాశీనుండి మదరాసు వెళ్ళి 8-2-1943 నాటికి కాకినాడవిచ్చేసిరి. సాహబ్జీమహారాజవారు 1937 సం॥రములో కాకినాడ పర్యటనమును రుగ్ణతమూలమున రద్దుచేసిరి. అందుకు పరిహారముగ, మెహతాజీసాహబ్‌వారు కాకినాడలో కలిసికొనిన సత్సంగులందఱయెడల నప్పుడు అపారదయావర్షము కురిపించుచున్నట్లనిపించెను. అందుకుతగినట్లే వారు కాకినాడలోనుండిన సమయములోనే ఫిబ్రవరి 8వ తేదీన వసంతపంచమీ సుదినముగూడ వచ్చెను వారు ఆ రోజున వచ్చుటకువచ్చిన 3000 మంది సత్సంగులకును తమ పవిత్రహస్తముతో తిలకమునుబెట్టినందున నందఱు నా యద్భుతదయాకటాక్షమునకు బ్రహ్మానందభరితులయిరి

61. మెహతాజీసాహబ్‌వారీపర్యటనములో విజయనగరము, నాగపూర్ తిరుచ్చి పట్టణములు గూడ వెళ్ళి 16-2-1943 తేదీకి తిరిగి ఆగ్రా విచ్చేసిరి. ఈ పర్యటనములో తమిళదేశములో 12 స్టోరులును, ఆంధ్రదేశములో 26 స్టోరులును, మొత్తము 38 క్రొత్తస్టోరులు తెఱువబడినవి. కొన్నిస్టోరులలో కనీసము 400 షేర్లుగూడ పూర్తిగాకుండ నుండిపోయినందున ఆ షేర్లలోపమును పూర్తిచేయుటకై వివిధస్థలములలో 12,000 షేర్లకు వాగ్దానములను దీసికొనిరి. ఈ12,000 షేర్లలో క్రొత్తగ తెఱువఁదలఁచుకొన్న కంపెనీస్టోరులకు వేసినషేర్లు జేరలేదు. ఇవ్విధముగ నీపర్యటనము సర్వవిధముల మహాజయప్రదముగ జరిగెను.

62. మెహతాజీసాహబ్‌వారాసంవత్సరము వసంతపంచమీసుదినమున కాకినాడలోనుండిపోవుటచే వారు దయాల్బాగు తిరిగివచ్చినతోడనే, వారిని తిలకమిప్పించుడని దయాల్బాగుసత్సంగులు ప్రార్థించిరి. అందుచే వారు 21-2-1943 ఆదివారమునాడు దయాల్బాగులో నందఱకును గూడ తిలకమును ప్రసాదించిరి. ఇవ్విధముగ నారోజున వసంతపంచమీ యుత్సవము దయాల్బాగులో గూడ జరిపించబడెను.

63. దక్షిణప్రాంతమునుండి తిరిగివచ్చిన యొకవారమునాటికే మెహతాజీసాహబ్‌వారు ఉత్తరప్రదేశములో తూర్పుప్రాంతమునకును బీహారు బెంగాలుప్రాంతములకును తిరిగి పయనమయి వెడలిరి. వారు ఉత్తరప్రదేశములో, కాన్పూరు, లక్నో, మిర్జాపురము, వారాణసి వగైరా యూళ్ళకు వెళ్ళిరి. ఉత్తరప్రదేశములోని వివిధస్థలములలో, మొట్టమొదట నీపర్యటనములోనే, కోఆపరేటివు స్టోర్లను స్థాపించిరి. ముజఫరుపురము, కటిహారు, కలకత్తా, పాట్నా వగైరాపట్టణములకుగూడ వారప్పుడు వెళ్ళిరి. ఈ పర్యటనము యిరువదిరోజులేమైనను వారికొద్దివ్యవధిలోనే 21 లిమిటెడ్ కంపెనీలను 17 కోఆపరేటివుస్టోర్లను స్థాపించి, మెహసీ వద్దనున్న సత్సంగపరిశ్రమలను ఇతరవివిధస్థలములలోనున్న పురాతనమైన స్టోర్లనుగూడ పరిశీలించిరి.

64. మెహతాజీసాహబ్‌వారు 1943 సం॥రము మార్చి నెలలో మదరాసునకును మేనెలలో పంజాబునకును, తిరిగి ఆగస్టునెలలో దక్షిణప్రాంతమునకును వెళ్ళిరి. ఈపర్యటనములోవారు విజయవాడలో తలవనితలంపుగ కొన్నిగంటలసేపు ఆఁగిపోవలసివచ్చెను అచ్చట సత్సంగికానట్టి శ్రీ సూర్యనారాయణగారి సతీమణిగారి యింటిలో మెహతాజీసాహబ్‌వారికి బసనేర్పాటుచేసిరి ఆమె సత్సంగికాకపోయిన నదివఱలో నొకసారి మెహతాజీసాహబ్‌వారి సత్సంగమునకు వచ్చియుండెను, అంతక్రితము ఆమె తనపసిపిల్లవాని కుద్ధతముగ జబ్బు చేయగా మెహతాజీసాహబ్‌వారి నాంతర్యమున రోగనివారణకై ప్రార్థించి కొద్దిసేపటిలో నిదురపోయెనట. అప్పుడు మెహతాజీసాహబ్‌వారామెకు స్వప్నములో దర్శనమిచ్చి, తనకుమారుని రోగము కుదిరిపోవునని ధైర్యము చెప్పి, తామే కొద్దిరోజులలో నామె యింటికివచ్చి సత్సంగము జేయుదుమని సెలవిచ్చిరట. మెహతాజీసాహబ్‌వారాకస్మికముగ విజయవాడలోదిగి ఆమె యింటివద్ద బసచేసినపుడు ఆమెవలన నందఱు నామెస్వప్నవృత్తాంతమును, పిమ్మట నామెపిల్లవానిజబ్బు వెంటనే కుదిరిపోయిన విషయమును విని యాశ్చర్యమునొందిరి.

## నల్వాడి యాశ్రమమువద్ద

65. 1944 సం॥రము జనవరినెలలో మెహతాజీసాహబ్‌వారు వార్ధా వెళ్ళి అచ్చటనుండి నల్వాడి యాశ్రమమునుచూచుటకు వెళ్ళిరి. జాతీయమహాసభవా

రింతకుముం దాయాశ్రమములో స్థాపించిన కొన్నిపరిశ్రమలను, జాతీయమహాసభానాయకులు కారాగృహముననున్న సమయములో నడిపించుచుండు నిమిత్తము, ప్రభుత్వమువారు దయాల్బాగున కొప్పజెప్పియుండిరి. మెహతాజీసాహబ్‌వారీపర్యటనములో సేవాగ్రామముగూడ వెళ్ళిరి. దయాల్బాగువారీపరిశ్రమలను ప్రభుత్వమువారికోరికపైన నడిపించుచుండుటకు అంగీకరించినందున సేవాగ్రామములోని కొందఱు జాతీయమహాసభాకార్యకర్తలకు దయాల్బాగు సదుద్దేశ్యమును గుఱించి సందేహముగలిగెను. మెహతాజీసాహబ్‌వారచ్చటనట్టిసంశయాత్మకులను గలిసికొని, దయాల్బాగువారికీకార్యమును చేబూనుకొనుటలో నొకజాతీయసంస్థను ముగించకుండ నడిపించుచు నందలి కార్మికులకు వేతనములనిచ్చి పనిచేయించుటదప్ప మఱొకయుద్దేశ్యము లేదని నచ్చజెప్పి, దయాల్బాగువారీపరిశ్రమలవలనగలుగులాభమునుండి యొక్క కాసునుగూడ తీసికొనరని విశదపఱచిరి.

66. మెహతాజీసాహబ్‌వారు 1944 సం॥రములో పంజాబు పర్యటనము చేసి యచ్చట నించుమించుముఖ్యస్థలములనన్నిటిని చూచిరి. ప్రతిస్థలమందును సత్సంగులు చాలమంది ప్రోగగుటయేగాక, బ్యాస్‌సత్సంగమునకు జెందిన సత్సంగులుగూడ చాలమంది యించుమించన్నిచోట్లకును వచ్చిరి. ఆగస్టు నెలలో వారు ఉత్తరప్రదేశము బీహారుప్రాంతములకు మఱొకపర్యటనమును జేసిరి. ప్రతిస్థలమందును సత్సంగులు చాలయధికముగవచ్చి సత్సంగములో పాల్గొనిరి.

67. దేశములోని వాయవ్యదిక్ప్రాంతమునకు, తూర్పు ప్రాంతమునకు నీపై రెండుపర్యటనములును పూర్తియైనపిమ్మట మెహతాజీసాహబ్‌వారు ఒకనెలరోజులు పూర్తిగ దక్షిణప్రాంతమునకు పర్యటనముసేసిరి. ఇంతవఱకుజేసిన పర్యటనములన్నిటిలో నిదియ దీర్ఘతమపర్యటనమని చెప్పవచ్చును. ఈ పర్యటనములో దక్షిణదేశమున వివిధస్థలములలోని సత్సంగులందఱకును సత్సంగసావకాశము లభించెను. కోయంబత్తూరులో మెహతాజీసాహబ్‌వారు "ఉత్తమవిశ్వవ్యవస్థ" యను విషయముపై బహిరంగసభలో సంభాషించిరి. ఆసభ కచ్చటిపారిశ్రామిక సంస్థానిర్వాహకులగు శ్రీ జి డి. నాయుడుగారధ్యక్షతవహించిరి. సభలో నందఱును మెహతాజీసాహబ్‌వారి భాషణమును చాలమెచ్చుకొనిరి.

మెహతాజీసాహబ్ వారు కన్యాకుమార్యాగ్రమునకు ఈపర్యటనము లోనే మొట్టమొదట వెళ్ళిరి. ఈ పర్యటనములోని కార్యక్రమముయొక్క ప్రణాళిక చాలయొత్తిడిగనుండుటన ల్లేర్పాటుచేయబడుటచే మెహతాజీసాహబ్ వారికి ఈయావత్పర్యటనములోనెంతమాత్రము విశ్రాంతికి సావకాశమే లేకుం డెను. వ్యయప్రయాసపూరితములగు నీదీర్ఘపర్యటనములను దలంచినపుడు సాహబ్జీమహారాజువారు తాము మఱొకసారివచ్చినపు డప్పటికన్న దృఢతర శరీరములో రాగలమని 1937 సం॥రములో సెలవిచ్చిన వాక్య మెవరికైనను స్మృతికివచ్చును. సాహబ్జీమహారాజువారు తాము తిరిగి దృఢతరకాయముతో వచ్చెదమని చేసినప్రతిన, యివ్విధముగ మెహతాజీసాహబ్వారి దక్షిణాది పర్యటనములమూలమున చరితార్థమయ్యెను

68. 1945 సం॥రములో వారు మఱికొన్నిపర్యటనములు చేసి, ఇదివరలో వలెనే, వారువిచ్చేసినచోట్ల సత్సంగులకు సత్సంగసావకాశమిచ్చుచు, వివిధ స్థలములలో నంతకుముందు స్థాపించిన లిమిటెడ్ కంపెనీలను కోఆపరేటివ్ స్టోర్సును బలపఱచు కార్యక్రమమును సాగించిరి అదియునుగాక, నీపర్యటన ముల మూలమున చాలమంది రాధాస్వామీమతమున నుపదేశమునొంది సత్సంగములో జేరుటయు, దయాల్బాగునకు ప్రతికూలముగ ప్రథమములో బయల్దేఱిన విరుద్ధప్రచారము పూర్తిగనశించిపోవుటయును జరిగెను

69. మహాయుద్ధ మకస్మాత్తుగ 1945 సం॥రము సెప్టెంబరు నెలలో ముగిసి పోయెను. అందువలన ప్రజలందఱు నప్పటిమట్టుకు చాలసంతసించిరి. కాని త్వరలోనే ప్రజలకనేకక్లిష్టసమస్య లేర్పడినవి. దయాల్బాగున కిందువలనగల్గిన మొదటిఫలిత మేమనగా, సైనికదళములకు కావలసిన వస్తూత్పాదనమును విరివిగజేయుచున్న పరిశ్రమసంస్థల నొక్కసారిగ పురజనసౌకర్యములకు గావ లసినసామగ్రి నుత్పాదనజేయుటకు మఱల్చవలసివచ్చుటయేగాక ననేకమయిన యితరవస్తువుల యుత్పాదనమునుగూడ పూర్తిగకట్టిపెట్టవలసివచ్చెను. అందు వలన క్రొత్తసమస్య లుత్పన్నమైనందున పరిశ్రమసంస్థలను క్రొత్తపద్ధతిని పునర్వ్యవస్థాపనము చేయుటకు మెహతాజీసాహబ్ వారు బహుప్రశంసనీయవిధ మున పథప్రదర్శనముచేసిరి.

## దేశస్వాతంత్ర్యము, దేశవిభజనము

70. దేశములో, బహుదూరగాములగు పరిణామములుగల మార్పులు మఱి కొన్నిగూడ గలిగెను ఉదాహరణార్థము క్విట్ ఇండియా (Quit India)

యాందోళన దేశములో యుద్ధపురోజులలోనే ప్రారంభింపబడి, మహాత్మా గాంధీగారు, పండితజవహర్‌లాల్ నెహ్రూగారు, సర్దార్‌పటేల్‌గారు మొదల యిన రాజకీయనాయకులందఱును కారాగృహమున నుంచబడిరి యుద్ధము సమాప్తియైనతోడనే యానాయకులనందఱను కారాగృహమునుండి విడుదల జేసిరి. ఇంగ్లాండు దేశములో యుద్ధసమయమున రాజ్యాంగము నడిపించిన "కొయాలిషన్" (Coalition) ప్రభుత్వము వారు తరువాతజరిగిన యెన్నిక లలో నోడిపోయి, కార్మికులపక్షమువారు(Labour Party) అధికారములోనికి వచ్చి భారత దేశమునకు స్వరాజ్యము నిచ్చుటయే వారి రాజనీతి విధానమని ఘోషించి చెప్పిరి. ఈప్రకటన చేసినతోడనే, దేశములోని వేఱ్ఱేఱు రాజకీయపక్ష ములవారును తమతమప్రణాళికలను వేఱ్ఱేఱుగ నేర్పాటుచేసికొనిరి ఎమ్. ఏ. జిన్నాగారి నాయకత్వమున ముస్లింలీగువారు, అల్పసంఖ్యాకులైన మహమ్మ దీయుల హక్కులను సంరక్షించువిధానమును గుఱించిన ప్రశ్నను లేవదీసి, ఆ సమస్యను పరిష్కరించుటకు భారతదేశమును విభజించుటయొక్కటే యుపా యమని పట్టుపట్టిరి. దేశమును రెండుభాగములక్రింద విభజించినచో, మహమ్మ దీయు లధికముగనున్న దేశభాగములో తాము స్వతంత్రముగ రాజ్యము చేసి కొనగల్గుదుమని ముస్లింలీగువారివాదన. కాంగ్రెస్‌వారీప్రతిపాదనకు మొదట ప్రతికూలముగనే యుండిరిగాని, చివరకు దేశవిభజనమున కంగీకరింపవలసివ చ్చెను. అందువలన 15-8-1947 తేదిన దేశమునకు స్వాతంత్ర్యముచేకూరిన పుడు దేశమంతయు 'హిందూస్థాన్' 'పాకిస్తాన్' అను రెండుభాగములుగ విభ జనమయ్యెను.

71. అయిన నింతటితో నంతయు సమాప్తిగాలేదు. ఆస్వాతంత్ర్యదినము ననే పశ్చిమపంజాబుప్రాంతమునను, తూర్పుబెంగాలుప్రాంతమునను హిందువు లను ఘోరంహత్యగావించిరి. అందుకు ప్రతికారముగ తూర్పుపంజాబులో మహమ్మదీయులను ఘోరహత్యజేసిరి. ఇట్లెన్నియో రోజులవఱకును మహా దారుణహత్యలు జరుగుచు, లక్షలాదిప్రజలు మహానిర్దయతో తమయిండ్లనుండి కొట్టితఱిమి వేయబడుచుండుటచే, దెబ్బలుతగిలి గాయపడి పెనగులాడుచు పాఱిపోవుచుండిన జనసమూహములు తూర్పుప్రాంతమునుండి పశ్చిమమునకును పశ్చిమప్రాంతమునుండి తూర్పునకును మహాప్రవాహములుగ బోవుచుండిరి.

## కాందిశీకులైన సత్సంగులు

72. ఈయాపత్తు వచ్చుటకు కొన్నిమాసములుముందునుండియు మెహ తాజీసాహబ్ వారు పాకిస్తానుగ విభజనకానైయున్న ప్రాంతముననుండిన

చాలమంది సత్సంగులకు తమసొత్తులను కుటుంబములను అచ్చటినుండి పంపి వేయవలసినదని యుత్తరముల మూలమున తెలియజేయుచుండిరి. కాని విస్పష్టకారణములచే నట్టిహితోపదేశములను కేవలము బహిరంగముగ ప్రకటన చేయుటకు సాధ్యముకాలేదు. చాలమంది సత్సంగు లా హితోపదేశములను సకాలములో మన్నించనులేదు. తమతమజాతుల కేవోప్రారంభికలాభములను చేకూర్చుకొనునిమిత్తమై జాతిమతపరస్పరద్వేషములను పెంపొందించుట కది యొకయపూర్వావకాశముగ నెంచుకొనినట్టి కొందఱుదుర్మార్గుల దుండగపుచర్యలమూలమున పరిస్థితు లానాఁటికానాఁడు మఱింతయెక్కువగ చెడిపోవుచున్నందున, సత్సంగులను పాకిస్తానునుండి భారతదేశమున నెచ్చోటికైనను మాఱిపోవలసినదనియు, నట్టియేర్పాట్లు చేసికొనలేనివారు దయాల్బాగు వచ్చి కొద్దికాలముండవచ్చుననియు తెలియజేయుచు, దయాల్బాగునుండి రెండు ప్రకటనపత్రములను బ్రాంచిసత్సంగములకును, సత్సంగులకు వ్యక్తిగతముగను పంపించుచు, సత్సంగవారపత్రికలలోఁగూడ ప్రకటించిరి. కాని దుర్మార్గులు స్వాతంత్ర్యదినమునకు పూర్వమే, మానవుని యుత్తమసంస్కృతి సత్ప్రవర్తనల మూలబంధముల, నొక తుపాకిమందుగిడ్డంగిని ప్రేల్చినట్లుగ విధ్వంసము చేయుటలో సాఫల్యమునొందిరి కొంతకాలమునుండియు నొక మహాసందిగ్ధావస్థలోఁ బడియుండిన సత్సంగిసోదరులకు, రాధాస్వామిదయాళుని రక్షకహస్తముయొక్క చేయూఁత లభించినట్లు విశ్వాసముగలిగి దయాల్బాగులో తలదాఁచుకొనగలమను సంపూర్ణధైర్యము పొడమెను. సహజముగ నందుచే వారు, తమతమస్థలములనుండి తప్పించుకొని రాగల్గినప్పుడెల్ల దయాల్బాగునకే పరుగులిడుచు వచ్చుచుండిరి. కాని పంజాబుప్రాంతములో నించుమించు ప్రతిసత్సంగికుటుంబమునకును చరస్థిరాస్తులనష్టము చాలయధికముగ వాటిల్లి, కొందఱకు బంధుమిత్రులుగూడ నష్టపోవుటచే, వారు భారతదేశము జేరుకొనుసరికి, లేదా దయాల్బాగుజేరుకొనుసరికి శారీరికముగను మానసికముగను పూర్తిగ క్రుంగిపోయిరి. అయినను ప్రతిసత్సంగియు, నామహాపత్సమయమున నాదయాళురుజూపిన ప్రత్యేకదయాకటాక్షములను కొనియాడుచునే యుండెను. వా రివ్విధముగ దయాల్బాగు బహుశోచనీయ పరిస్థితులలోనే వచ్చుచుండినను సద్గురువుదయాకటాక్షములందు వారి భక్తివిశ్వాసములు ద్విగుణీకృతము లగుచుండెను. 20-3-1948 తేదీనాటికి దయాల్బాగువచ్చిన

సత్సంగి కాందిశీకు[1]లసంఖ్య మొత్తము 2,316 అటుపిమ్మటగూడ చాలమంది వచ్చిరి.

73 సత్సంగులకు సంభవించిన సొత్తునష్టమునుగుఱించిన వివరములు చాల యసంపూర్ణముగనుండుటయేగాక, చాలమంది కాందిశీకులవిషయములో బహుసందిగ్ధముగగూడ నుండెను ఇందుకు బహుశా ముఖ్యకారణము అట్టివారి కాసమయమున జరిగిన మహాభయంకరసంఘటనలమూలమున గలిగిన శారీరకమానసిక మహావ్యథయే ఆమహావిపత్తుయొక్క ప్రమాణమును గుఱించియు, సత్సంగిస్త్రీపురుషులకు ఆ సమయమున గలిగిన శరీరక్షతులు, మరణములు వగైరాలను గుఱించియు నీక్రింద పొందుపఱచిన యంకెలవివరములను బట్టి కొంతయవగాహన కాగలదు.

మరణములు, శరీరక్షతులు వగైరా –

| | |
|---|---|
| (a) మరణములు | 42 |
| (b) ఆత్మహత్యలు | 5 |
| (c) దారుణక్షతులు | 3 |
| (d) తదితర క్షతులు | 1 |
| (e) స్త్రీపురుషుల బలాత్కారాపహరణములు | 7 |
| (f) బలాత్కార మతాంతర స్వీకారములు | 1 |

## వారి పునరావాసము

74. కాందిశీకసత్సంగులకు, సాధ్యమయినంతవఱకు దయాల్బాగులోని వసతిగృహములలోను, దయాల్బాగుసంస్థాభవనములలోను వసతుల నేర్పాటు చేసిరి. వెనువెంటనే దయాల్బాగులోనుండుటకు, కాందిశీకులుగాని యాగంతుక సత్సంగులకు కాలవ్యవధిని 15 రోజులకు తగ్గించి, కాందిశీకసత్సంగులకు 8, 9 మాసములవఱకు హెచ్చించులాగున కాలనీనిబంధనలనుగూడ మార్చిరి. ఇంతియగాక నట్టి కాందిశీకులలో దయాల్బాగుకోడుమీద కొట్లనుపెట్టుకొనిన వారలకును, ఆగ్రాపట్టణములో నుద్యోగమును సంపాదించుకొనిగాని ఏదైన

[1] కాందిశీకు డనగా తనస్వస్థానమునుండి భయోత్పాతముచే పాఱిపోయివచ్చినవా డనియర్థము ఆ రోజులలో పాకిస్తానులోని హిందువులు, మహమ్మదీయులచే జరిగింపబడుచుండిన దారుణములచే నవిస్థముగభయపడి హిందుస్తానుకు పాఱిపోయివచ్చిరి. కావున వారిని కాందిశీకులని యిచ్చట పేర్కొనుచున్నాము.

వ్యాపారమును పెట్టుకొనిగాని యున్నవారికినిగూడ, కాలనీని విడిచిపెట్ట నక్కఱలేకుండ నిచ్చటనే నివసించుచుండుట కనుమతినిచ్చిరి అందులో చాల మందికి తమ కుటుంబములను దయాల్బాగులోనుంచుకొని తాము పైయూళ్ళ కుద్యోగముల కొఱకును వ్యాపారముకొఱకును పోవుటకుగూడ ననుమతి నొసంగిరి.

75. సత్సంగాధికారులకు కాందిశీకుల కవసరమైన సహాయము చేయవలసిన దని ప్రత్యేకాదేశము లీయబడినవి ఉదాహరణార్థము వసతులయధికారియైన సత్సంగ సూపరింటెండెంటును వారికార్యాలయములోని యుద్యోగస్థులును కాందిశీకులకు వసతులనిచ్చి, మంచములను, బాల్చీలను, ఎలక్ట్రిక్ బల్బులు వగైరాలను ఇచ్చుచుండెడివారు; సౌకర్యాధికారి (Comforts Officer) వీరల సాధారణసౌకర్యములను కనిపెట్టుటయేగాక, వీరలకు గల్గునట్టిరోగ ములు వగైరా ప్రత్యేకబాధలనుగుఱించి, యందుకు సంబంధించిన యధికారు లకు తెలియజేసి, కావలసినసహాయమును జేయుచుండెడివారు. సభ కార్యదర్శి గారి కార్యాలయమువారు వీరలకు గావలసినవిషయముల వివరములను దెలిపి వీరలతరఫున ప్రభుత్వమువారితో నుత్తరప్రత్యుత్తరములను వగైరాలను జరుపుచు నెన్నియోవిధముల వీరలకు తోడ్పడుచుండిరి. దయాల్బాగు పునరా వాసాధికారి (Rehabilitation Officer) ప్రతికాందిశీకునకు నుద్యోగమును సంపాదించుకొని తిరిగినెలకొనుటకై సహాయపడుచుండెను.

76. కాందిశీకుల పునరావాసమునకు కావలసిన యితరచర్యలనుగూడ తీసికొనుచుండిరి. ఉదాహరణార్థము, కాందిశీకులందఱకును నిర్దిష్టసంఖ్యగల కొన్నిదినముల కుచితభోజనము పెట్టుచుండిరి. అవసరమున్నవారి కుచితముగ బట్టలనుగూడ నిచ్చుచుండిరి పిల్లలకు వూలుదుస్తుల నుచితముగ నిచ్చుచుండిరి. మంచములను బాల్చీలను బట్టలను సామకార్థమయిన నగదుజామీను తీసికొని బాడుగకిచ్చుచుండెడివారు. అటులనే, కుట్టువూలును, దుప్పట్లు, కంబళ్ళు, తువ్వాళ్ళు, ఛద్దర్లు, రజాయిగుడ్డలు వగైరాలను చవుకధరలకిచ్చుటకును, చాలమంది కుచితముగగూడ నిచ్చుటకును ఏర్పాట్లుచేసిరి. సభవారి భూముల నుండి వచ్చిన వంటచెఱకును కాందిశీకులకు 6 మాసములవఱకు నుచితముగ నిచ్చుట కేర్పాటుచేసిరి, ఇవ్విధముగ నెలకు సగటున 750రూపాయిల విలువ గల వంటచెఱకు నుచితముగ నిచ్చెడివారు.

77. ఇంతియగాక కాందిశీకుల పిల్లల విద్యాభ్యాసమునకై కొన్ని సౌకర్యములను జేసిరి 105 విద్యార్థులకు స్కూలుజీతములు తీసికొనకుండ నాఁపుజేసిరి. 8 పిల్లలకు విద్యార్థివేతనముల నిచ్చిరి. అటులనే 89 పురుషులకును, 9 స్త్రీలకును ఉపాధ్యాయులుగను చిన్నయుద్యోగస్థులుగను, డాక్టర్లుగను, గుమాస్తాలుగను, విక్రేతలుగను, పనివాండ్రు వగైరాలుగను ఉద్యోగములనిచ్చిరి. ఇంచుమించు ఒక డజనుమందికి అమృతసర్ స్పిన్నింగ్ అండ్ వీవింగు మిల్లులో నుద్యోగములనిచ్చిరి.

78. కాందిశీకులకు కొట్లుపెట్టుకొనుటకును, వ్యాపారము వగైరాలు వేఱుగ చేసికొనుటకును సౌకర్యములను గల్పించిరి అందుకొఱకై 9 కొట్లను కాందిశీకుల నిమిత్తము క్రొత్తగఁగట్టించి కొందఱకు ధనమునుగూడనిచ్చిరి, దయాల్బాగులో వస్త్రాత్పాదనము చేసికొనుటకును, వీధులవెంబడివెళ్ళి సరకులనమ్ముకొనుటకును సౌకర్యములను కలుగజేసిరి

79. కాందిశీకుల పునరావాసకార్యమే యన్నిఁటికన్న నెక్కువ కఠినమైన సమస్యగ నేర్పడెను ఈ సందర్భములో ప్రధానమయినకష్టమేమనగా దయాల్బాగునకువచ్చిన కాందిశీకులలో నెక్కువమంది వర్తకులును, చిన్నచిన్న దుకాణములుగలవారు నయినందున, వీరలందఱకు, నిచ్చట జనాభా తక్కువయగుటచే, వర్తకమునకు సావకాశములను, సౌకర్యములను గలుగజేయుట యసాధ్యముగనుండెను అటులనే యుద్యోగముగోరు కాందిశీకులకందఱకు నిచట నుద్యోగములనిచ్చుటకును సావకాశము లేకుండెను. అయినను గూడ నిచ్చటిపాలకవర్గ మీకాందిశీకులు స్థిరపడుటకవసరమైన సహాయమునంతను జేయుచునేయుండిరి. క్రమక్రమముగ గొందఱు కాందిశీకులు వర్తకముచేసికొనుటకును, కొందఱుద్యోగములను సంపాదించుకొనుటకును కొందఱు తమకు సౌకర్యమెక్కువగనున్న యితరస్థలములలో నివసించుటకును, వేఱ్వేఱు చోట్లకు వెళ్ళిపోయిరి. అయిన నింకను చాలమంది దయాల్బాగులోనే యుండిపోయి, యిప్పటికిగూడ నచ్చటనే యుండుచున్నారు.

80. భారతదేశవిభజనకు పూర్వాపర సంవత్సరములు రెండింటిలోను గలిగిన యంతర్జాతీయకలహముల మూలమున ననేకక్లిష్టసమస్య లేర్పడినందున మెహతాజీసాహబ్ వారందువిషయమై చాలసమయమును ఎక్కువశ్రమను వినియోగించవలసివచ్చెను. అదియునుగాక 1952వ సంవత్సర మాసన్నమగు

చున్నకొలఁది రైతధీనముకాని భూమినంతను సాగులోనికి దెచ్చుటకు మహా బలవత్తరప్రయత్నము చేయ నావశ్యకమయ్యెను. అందుచేతనే వారీ సమయములో పర్యటనములు చేయలేదు.

81 లిమిటెడ్ స్టోర్లను సరఫరాడిపోలను స్థాపించుట పూర్తియైనపిదప మెహతాజీసాహబ్ వారు విద్యాసంస్థలయభివృద్ధివికాసలనుగుఱించి శ్రద్ధవహింప మొదలిడిరి. 1947-1952 సంవత్సరముల మధ్యకాలములో వారు విద్యాసంస్థలను చాలయభివృద్ధిజేసిరి పూర్వమునుండియున్న కళాశాలల నభివృద్ధి చేసియు క్రొత్తతరగతులను క్రొత్త పార్యక్రమములను పెట్టించియు రెండు క్రొత్తడిగ్రీకళాశాలలను అనగా, కళలయందును బోధనాభ్యాసనవిద్యయందును పార్యక్రమములతో నొప్పు మహిళాబోధనాభ్యాసన కళాశాల (Women's Training College) యొకటి స్త్రీలకొఱకును, మెకానికల్ ఇంజనీరింగు ఎలెక్ట్రికల్ ఇంజనీరింగు పార్యక్రమములతో నొప్పు నింజనీరింగు కళాశాల యొకటి మొగపిల్లలకును, స్థాపించిరి 7వ యధ్యాయములో ప్రత్యేకముగ విద్యాసంస్థలను తదితరసంస్థలను గుఱించిన వివరములు వ్రాయబడినవి గావున, నిచ్చట వాని నెక్కువగ వ్రాయుటలేదు.

82. అందుచే 1952 సం॥రము దరిమిలానే మెహతాజీసాహబ్ వారు పర్యటనములను తిరిగిజేయుటకు సాధ్యమాయెను. వారు దేశములోని వివిధప్రాంతములకు అనగా పంజాబు, ఉత్తరప్రదేశము, బీహారు, బెంగాలు, రాజపుతానా మధ్యప్రదేశము, మదరాసులకు పర్యటనముచేసి స్టోర్లను నడిపించుటవిషయములో హితోపదేశములనిచ్చిరి. మెహతాజీసాహబ్ వారు వెళ్ళి వివిధస్టోర్లలో నిల్వయున్నసరకుల నమ్మివేయుటచే నెన్నో చెడిపోయిన స్టోర్లకు చాలసహాయము చేకూరెను.

## ఆంగ్లభాషలో సత్సంగ గ్రంథములు

83. 1954 సం॥రమునుండియు మెహతాజీసాహబ్ వారు సాహబ్జీమహారాజు వారి గ్రంథముల నాంగ్లభాషలోనికి తర్జుమాజేయుచు, నాకార్యమును పట్టుదలతో జరిపించినందున హుజూర్ సాహబ్జీమహారాజువారి గద్యరూపమయిన గ్రంథము లించుమించన్నిఁటికిని31-10-1957నాఁటికనువాదముజేయుట పూర్తియయ్యెను. ఈపనియంతయు నాతేదీనాటికే పూర్తియగుట నిజముగ నొకవిచి

త్రమే. ఏలనన సవరణకాబడిన గ్రంథస్వామ్యచట్టము (Ameuded Copyright Act) 1957వ సం॥రము నవంబరు నెలలో నమలులోనికివచ్చి, యందులో నొకగ్రంథకర్త మరణానంతరము 50సం॥రములు గతించువఱకు నాతని గ్రంథములను అనువాదముగూడ చేయరాదను నిషేధముండెను. అనగా హుజూరుసాహబ్జీమహరాజువారి గ్రంథములలో దేనినిగూడ 1987 సం॥రము వఱకు తర్జుమా చేయుట యీచట్టమునకు విరుద్ధమయిపోయియుండెడిది. 1954 సం॥రములో నొకజర్మనీదేశీయవిద్యార్థి డాక్టరేటుడిగ్రీకొఱకు రాధాస్వామీ మతముమీద నొకవ్యాసమును వ్రాయఁదలఁచి, యీమతవిషయమైన వివరములను గుఱించి తెలిసికొనుట కిచ్చటకువచ్చెను. అప్పు డాంగ్లభాషలో హుజూర్ మహరాజువారి "రాధాస్వామీమతప్రకాశ్" అనుగ్రంథమును మహరాజసాహబ్ వారి "డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీ ఫేత్" (Discourses on Radhasoamı Faith) అను గ్రంథమునుదప్ప మఱొకగ్రంథ మెద్దియులేదు. అందుచే ఆవిద్యార్థికి ప్రతివిషయమును ఆంగ్లభాషలోఁ జెప్పవలసివచ్చెను. సత్సంగగ్రంథము లాంగ్లభాషలోనుండుట యత్యావశ్యకమని యీసంఘటనవలన నప్పుడు తీవ్రముగ గోచరించెను.

84. సాహబ్జీమహరాజువారిగ్రంథములలో "యథార్థప్రకాశ్" అను గ్రంథము మూడవభాగ మాఖరునతర్జుమాయయి ప్రచురింపబడినది. అది పెద్ద గ్రంథమగుటచే, దానిని రెండుసంపుటములుగ ప్రకటించిరి. మెహతాజీసాహబ్ వారు దాని ప్రథమసంపుటమునకు కృతిసమర్పణమును వ్రాసిరి. వారు 24-6-1957 తేదీ సాయంకాలము సత్సంగములో నాగ్రంథానువాదము నావిష్కరణజేయుచు ప్రప్రథమమున నా కృతిసమర్పణమును జదివిరి. అటుపిమ్మట వారు కొన్నిప్రతుల నచ్చటనున్న సత్సంగులకు విక్రయించిరి. (ఆ కృతిసమర్పణమున కాంధ్రీకరణమును ముందుపుటలో చూడుడు.)

# కృతి సమర్పణము

**ఉత్తమోత్తములు, పరమోదారమూర్తియు**
**ఆధ్యాత్మిక మండలములలో**
**ఉత్తమసాధనలజేయించు మహోత్తేజప్రదాతయు**

**1937 జూన్ 24వ తేదీన**
**మదరాసులో నిర్యాణమైన**

## పవిత్రస్వరూపులైన సాహబ్జీమహారాజ్
## సర్. ఆనందసరూప్ Kt. (నైట్)

వారి
చరణకమలములందు
ప్రేమసహిత పావనస్మృతిసూచకముగ

## యథార్థప్రకాశ్

యొక్క యీ ఆంగ్లానువాదము
పూర్ణదీనత్వ కృతజ్ఞతాభావములతో
పూర్ణశ్రద్ధాభక్తులతో
సంకితమీయబడినది!

## వారి దివ్యసందేశము

ఈ దీనోద్యమలేశముచే జగమున నలుదెసల వ్యాపించి
యెల్లయెడల మానవులకు సత్యప్రకాశ సంతోషములను చేకూర్చుగాత !!

85. పిమ్మట వారు హుజూర్ మహారాజువారి గ్రంథముల ఆంగ్లానువాదము మొదలుపెట్టి 'ప్రేమపత్ర' యొక్క ఆరుసంపుటములను, మఱికొన్ని చిన్నపాఠ్యము లను తర్జుమాచేసిరి. ఈపని 1961 సం॥రము సెప్టెంబరు నెలవఱకును జరుగు చునేయుండెను. అధికాహారద్రవ్యోత్పాదనోద్యమమునకును, వ్యవసాయ ప్రణాళికకును సంబంధించిన కార్యములును మామూలు ఆఫీసుపనియునుగాక, నీ యాంగ్లానువాదకార్యముగూడ మెహతాజీసాహబ్‌వారు చేయవలసివచ్చినం దున, వారి నిద్రావిశ్రాంతులకొఱకు ముందునుండిసిర్ణీతమైయున్న యల్పకా లముగూడ మఱింతయెక్కువ సంకుచిత మాయెను.

## దయాల్బాగులో నెహ్రూగారు

86 1956వ సం॥రము జనవరి 2వ తేదీన అఖిలభారతవైజ్ఞానికమహాసభ (All India Science Congress యొక్క ప్రారంభోత్సవము చేయుటకై భారతదేశప్రధానమంత్రియైన పండితజవహర్‌లాల్ నెహ్రూగారు ఆగ్రావచ్చిరి. ఆసందర్భమున నాయన జనవరి 5వ తేదీన దయాల్బాగుకూడ వచ్చి యిచ్చటి సంస్థలనన్నిటిని సందర్శించిరి. ఆఖరున, దయాల్బాగునివాసులందఱును వారికి రాధాస్వామీవిద్యాసంస్థామైదానములో (R. E. I Lawns) స్వాగత మిచ్చిరి.

87 మెహతాజీసాహబ్‌వారాయనకు స్వాగతమిచ్చుచు నీక్రిందివిధమున సెలవిచ్చిరి.

"పూజనీయపండిత్‌జీ, మిత్రులారా !

శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారీనాఁడు, తమప్రియమైన మాతృభూమిలో నొకచిన్నితునుకయగు దయాల్బాగువలసను తమరాకచే గౌరవించిరని మనకం దఱకు నమితానందముగనున్నది. శ్రీమతులు కమలానెహ్రూ, విజయలక్ష్మి పండిత్‌గార్లు ఇంతకుముందు దయాల్బాగువచ్చి యిచ్చటినివాసుల నుత్సాహ పఱచుట దయాల్బాగు గర్వించదగిన విషయము. అనగా, శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారి కుటుంబమువారియెడల దయాల్బాగున కింతకుముందునుండియు ప్రేమాదరభావము లేర్పడియుండెను. దయాల్బాగు, ఆగ్రాపట్టణమునకు కొద్ది దూరమునునుండి యొకపల్లెవలెనే నిశ్శబ్దముగను ప్రశాంతముగనుండియు, పరి శుభ్రతకును ఆరోగ్యసంరక్షణవిధానమునకును పట్టణములోవలెనే సంపూర్ణ

మైనప్రబంధమునుగూడ గలిగియున్నది. ఇచ్చట విద్యార్థులు, వైజ్ఞానికులు, పరమార్థులును తమతమ క్రియాకలాపములను ప్రాపంచికసంక్షోభముచే వ్యథితులుగాకుండ ప్రశాంతముగ సాగించుకొనుచుందురు. నిరుద్యోగులు, కర్షకులు పాటరులును ఇచ్చట జీవికోపార్జన చేసికొనుచు బ్రతుకుట కవకాశములు ఉన్నవి. ఇచ్చట ధనము వెల్లువలుగ ప్రవహించుటయు లేదు, తిండిలేక నెవరును మాడిపోవుటయు లేదు; ఇచ్చట మహాప్రాసాదములు దివ్యభవనములును లేవు, శిథిలమయిపోయిన గుడిసెలుగూడ నేమియు లేవు; ఇచట నొకరు గొప్పవారు లేక యధికులనియు మఱొకరు అల్పులు లేక నీచులనియు వివక్షలేదు; ఇచ్చట నందఱకన్న నెక్కువ పాటుపడి పనిచేయువారలకే యధిక గౌరవ మీయబడును. ఇచట నుండువారందఱును దయాల్బాగు చెందునుగాని, యిచ్చటనెద్దాని యందు నొక ప్రత్యేకనివాసి కెవరికిని ప్రత్యేకస్వామ్యము లేదు. ఇచ్చట బొత్తిగ నక్షరజ్ఞానము లేనివారెవరును ఇంచుమించు లేనట్లే. ఇచ్చట నలసత్వము, సోమరితనముతో జీవితముగడుపువా రెవరును లేరు ఇదియొకపల్లెయుగాదు, పట్టణమునుగాదు. కాని దీనినిపల్లెయనియు పట్టణమనియుగూడ పేర్కొనవచ్చును. అట్టి దయాల్బాగు అనఁబడు నీచిన్నిస్థలమున నీనాఁడు సంతోషానందసందోహములు పొంగిపొరలిపోవుచున్నవి. దయాల్బాగునివాసులందఱును శ్రీనెహ్రూగారికి స్వాగతమిచ్చు నిమిత్తమై యమితోత్సాహపూరితులైయున్నారు. దయాల్బాగునివాసుల యాదర్శమయిన సామాజికవ్యవస్థ యించుమించు శ్రీనెహ్రూజీ స్థాపించదలఁచుచుండిన వ్యవస్థమాదిరి దేయని యిచ్చటినివాసులు ముఖ్యముగ నానందపడుచున్నారు.”

88. శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారీక్రిందివిధముగ సమాధానము చెప్పిరి:
“మెహతాజీసాహబ్, దయాల్బాగునివాసులారా !

దయాల్బాగు చేయుచున్న ఘనకార్యమునుగుఱించి నేనుకొంతకాలము నుండియు వినుచుంటిని. ఈవిషయములనన్నిఁటిని దూరముననుండి కనిపెట్టుచుంటిని. దయాల్బాగులో నుత్పాదనయగుచున్న వస్తువులను నేను చూచితిని. నన్ను కలిసికొనినవారు దయాల్బాగును ప్రశంసించుచు జెప్పిరి. ఇచ్చోటకు స్వయముగవచ్చిచూచిన నామిత్రులు పరిచితులును చాలమందివలనగూడ దయాల్బాగునుగుఱించి నేను తెలిసికొంటిని. ఇవ్విధముగ నిచ్చటజరుగుచున్న ఘనకార్యమునుగుఱించి కొంతవఱకు నా కొకతీరున తెలిసియేయున్నది. కాని యేలనో నాకింతవఱకు నిచ్చోటున కరుదెంచుసావకాశము గలుగలేదు. నే

నింతకాల మిచ్చటికి రాకుండ నేలనుంటినని నాకే కొంతయచ్చెరు వగుచున్నది. అందుచే, నే నీ నాఁడిచటకు వచ్చి యిచ్చట జరిగించుచుండిన మహా కార్యమును కొంత కనులార గాంచుటచే నా కిచ్చటి క్రియాకలాపమునుగుఱించి యితఃపూర్వముకన్న నెక్కుడువాస్తవజ్ఞానము గలిగినదని సంతసించుచుంటిని. నా కింతవఱకును దయాల్బాగునుగుఱించి తెలిసినదంతయు నితరులు చూచిచెప్పినవిషయములు మాత్రమే. కాని నా కీరోజున పసిపిల్లల విద్యావిధానము విషయములోను, బాలబాలికలకు పాఠశాల కళాశాలలలో లభించుచున్న శిక్షాక్రమము విషయములోను, నిచ్చట జరుగుచుండిన కార్యక్రమమునంతను జూచినపిమ్మట నమితానందమైనది. ఏలనన చిట్టచివరకు భారత దేశములో ప్రస్తుతకాలమున నన్నిఁటికన్న నెక్కుడుక్లిష్టతమమయిన సమస్య, మనబాలురకును యువకులకును విద్యాబుద్ధులుగఱపి, వారిని తమ బాధ్యతలను నిర్వహించగల సమర్థులుగ జేయుటయెట్లు, అనగా, వారలకు శరీరదార్ఢ్యము గలుగజేసి, దేశముయొక్క భావిబాధ్యతలను నిర్వహింపగల మానసికబలమునుగూడ జేకూర్చి, తమకర్తవ్యములను సర్వవిధముల నిర్వర్తించుకొనగల సమర్థులుగ వారిని జేయుటెట్లు, అనియేగదా. ఇక్కార్యమును దక్షతతో నేయుత్తమస్థలమునందైననసాగించుచున్నచో సహజముగ నేరికైన నందునుగుఱించి చాలసంతోషముగ నుండును. వాస్తవముగ నే దేశముయొక్క పురోభివృద్ధియైన నా దేశప్రజల జీవితవిధానక్రమముమీఁదను, వారల సౌశీల్యముమీఁదను, వారలకరములగల కార్యనిపుణతమీఁదను, వారలకు కార్యసాధనయందుగల బుద్ధికౌశలముమీఁదనే యాధారపడునుగాని, ఆ దేశముయొక్క విస్తృతివైశాల్యములమీఁద గాదు. భారతదేశ మెప్పటికైన నభివృద్ధినొందుచో నట్టిప్రజలిచ్చోట నివసించుచుండిరి కావుననే గావలయునుగాని, ఈ దేశములో 36 కోట్లప్రజలుండుటచే గానేరదు. నే నిచ్చటికి వచ్చినందుకు నాకిదియే యానందముగలుగజేయుచున్నది. మీరు నాకు ప్రేమాభిమానములతో స్వాగతమిచ్చినందుకు మీకు నేను కృతజ్ఞతతో ధన్యవాదముల నర్పించుచున్నాను. మీ రిచ్చటగావించు కార్యము సర్వతోముఖముగ నభివృద్ధి నొందగలదని నేఁ నమ్ముచున్నాను. జై హింద్ !”

89. మెహతాజీసాహబ్ వారికి 1956 సం॥రము దరిమిలాగూడ నెప్పటియట్ల పనిరొత్తిడి యెక్కువగనే యుండెను. ఒకప్రక్కనుండి పవిత్రగ్రంథముల భాషాంతరీకరణము యథాప్రకారము జరుగుచుండెను. అటులనే వ్యవ

సాయకృత్యములకుగూడ వారధికసమయమును వినియోగింప నావశ్యకమై యుండెను, పైగా వారు విద్యాసంస్థలను ఫ్యాక్టరీలను గూడ నంతకంతకు కెక్కుడుశ్రద్ధతో కనిపెట్టుచుండవలసివచ్చెను. కావున దయాల్బాగులోనున్న యధిక కార్యభారముచే వారికి బయటకు వచ్చుటకైనను బోవుటకు తీరికలేకుండెను. వారేమైనప్రయాణములుచేసిన నవి సామాన్యముగ బహుస్వల్పకాలపరిమితములై యుండెను. పారిశ్రామికాది వివిధసంస్థలయభివృద్ధి వివరములు ఈతరువాతి యధ్యాయములో నా యా విభాగములలో కానవగును.

## స్వామిబాగువారితో నుత్తర ప్రత్యుత్తరములు

90. క్రమక్రమముగ 1961 సం॥ర మాసన్నమయి రాధాస్వామీ సత్సంగమునకు శతవర్షములు పూర్తియయ్యెను. రాధాస్వామీసత్సంగశతాబ్ద్యుత్సవమును రాధాస్వామీమతానుయాయులందఱునుగలిసి జరుపవలయునను తలంపుతో సభవారు కేంద్రీయపాలకసమితివారితో నుత్తరప్రత్యుత్తరములను 1954 సం॥రమునుండియు జరిపించుట ప్రారంభించిరి. కాని మనమెన్ని ప్రయత్నములుచేసినను, కేంద్రీయసమితివారి కీయుత్సవమును మనతో కలిసిచేయుట కిష్టములేనందున, నట్లుచేయుట సాధ్యముగాలేదు.

91. ఆయుత్తరప్రత్యుత్తరముల పరంపర రమారమి 4 సం॥రములపాటు జరిగినపిమ్మట కేంద్రీయపాలకసమితియధ్యక్షునివద్దనుండి 2-6-1958 తేదీన నొక కచ్చితమయిన సమాధానమువచ్చెను. ఆయుత్తరములో వారిట్లు వ్రాసిరి:—

... ... ... ...

"ఆయుత్సవసమయమున పఠించవలసినట్టి రాధాస్వామీమతములోని శబ్దములును వచనములును కేంద్రీయపాలకసమితివారిచే నంగీకరింపబడిన సంత్ సద్గురువులచే లిఖితములుగాని యనూదితములుగాని గావలసియున్నదిగావున, శతాబ్ద్యుత్సవముల వ్యవస్థాపనావిధానము నేర్పాటుచేయునిమిత్తము రాధాస్వామీనామాభిధానముతోఁ బనిచేయు వివిధవర్గముల ప్రతినిధులతోఁగూడిన సమ్మిళితసంఘము నేర్పాటుచేయుటకు వీలుగాదని కమిటీవారు తీర్మానించిరి. ఈకమిటీవారు, కేంద్రీయపాలకసమితివారిచే నిందునిమిత్తమై మఱొకకమిటీ యేర్పాటుచేయబడవలసియున్నదనియు నాయుత్సవములలో పాల్గొనుటకు

రాధాస్వామీసత్సంగసభా ప్రతినిధులును మఱికొద్ది యితరవర్గముల ప్రతినిధులును ప్రేమపూర్వకముగ నాహ్వానించబడవలసియున్న దనియుగూడ తీర్మానించిరి.

... ... ... ...

92. ఆయధ్యక్షులే తమ21-3-1959 తేదీగల యుత్తరములో నిట్లువ్రాసిరి:-

"సకాలములో నాయుత్సవముయొక్క ప్రణాళికయు కాలపరిమితియు స్థిరపఱచబడగలవు. అయినను గురుద్వారమువద్దగాని సమాధివద్దగాని ప్రణామములు చేయుటకును, ఈరెండుపవిత్రస్థలములలో జరిగింపబడబోవునట్టి సత్సంగ సమావేశపరంపరలలో నేదోయొక దానిలో పాల్గొనుటకును అధికసంఖ్యాకులకు పూర్ణ సావకాశ మీయవలయుననియే మాయుద్దేశ్య మైయున్నది. స్వామీజీమహారాజువారి పవిత్రపాదుకలను కండ్లకద్దుకొనగోరువారందఱకు నట్టిసావకాశము చేకుఱగలదని మానమ్మకము."

వా రింక నీక్రిందివిధముగ వ్రాసిరి -

"భిన్నవిశ్వాసములుగల వేర్వేఱుచీలికలుగ సంఘమును విడదీయుట యంతఃకలహముల శోచనీయలక్షణము. భిన్నవిశ్వాసములుగలిగియుండుటచే మతవిషయమైన కార్యక్రమములో నందఱునుగలిసి సహకారముతోఁబనిచేయుట యొక్కొకప్పుడు అసాధ్యమయిపోవును. అయినను, మనతో భిన్నమైన విశ్వాసముగలవారితో మిత్రత్వసహనభావములతో బ్రవర్తించుట, మనకు చేయవలసినట్టియు, చేయగలిగినట్టియు కర్తవ్యము. మే మితరులను మాయుత్సవములలో పాల్గొనుట కాదరసహితముగ నాహ్వానించినపుడు, మాగురువులలో నెవరిపవిత్రగ్రంథమునుండియైనను పాఠముచేసినచో, నితరులు సహనశీలతగల్గి శాంతముగ వినుచుండవలయునేగాని, తమ కాగురువునందు విశ్వాసములేనంత మాత్రమున నాపాఠమున కలిగిపో నవసరములేదు స్వామీబాగుసత్సంగి యెవరైన నితరవర్గములచే జరిపించబడు నుత్సవములకు వెళ్ళినపుడు కూడ నటులనే ప్రవర్తించవలయును-

సద్భావమిత్రభావములను నల్దెసలవ్యాపింపజేయుటకు ఉత్సవము లొకసాధనమే కాని, మనమతమున ప్రధానవిషయములు భక్తియు నాధ్యాత్మికసాధనయును. నే నతిపీనత్వముతో నొత్తి చెప్పునదేమనగా, మాయుత్సవములలో నెవ్వక్తిని పాల్గొనసీయకుండ తప్పించవలయునని మాయుద్దేశ్యముగాదు

గాని, మా గురువులలో నెవ్వారిగ్రంథముసైన నట్టియుత్సవసమయమున పఠించ కుండతప్పించుటకు మేమియ్యకొనము.”

93. మఱికొన్ని యుత్తరప్రత్యుత్తరములు జరిగెనుగాని నిశ్చితరూపమున పరస్పరసమ్మతియేమియు కుదరలేదు. పిమ్మట 28-9-1960 తేదీన దయాల్బాగు రాధాస్వామీసత్సంగ సభాధ్యక్షు లొకయుత్తరము నీక్రిందివిధమున వ్రాసిరి:-

“తా మీక్రింద చేవ్రాలు చేసినవారికి 2-6-1958, 21-3-1959 తేదీలలో వ్రాసినయుత్తరముల నొకసారి దయచేసి గమనింపగోరుదును. అందు మొదటియుత్తరములో ‘నాయుత్సవములో పాల్గొనుటకై రాధాస్వామీ సత్సంగసభాప్రతినిధులును, మఱికొద్ది యితరవర్గముల ప్రతినిధులును ప్రేమపూర్వకముగ నాహ్వానింపబడుదు’ రనియు, రెండవయుత్తరములో ‘మేమితరులను మాయుత్సవములలో పాల్గొనుట కాదరసహితముగ నాహ్వానించినపుడు మాగురువులలో నెవరిపవిత్రగ్రంథములనుండియైనను పారముచేసినచో నితరులు సహనశీలతగలిగి శాంతముగ వినుచుండవలెనేగాని, తమ కాగురువునందు విశ్వాసములేనంతమాత్రమున నా పారమున కిలిగిపోవవసరములే’దనియు తాము తెలియజేసిరి. మీరు సభాప్రతినిధులను ఆదరపూర్వకముగ నాహ్వానించెదరనియు మీయుత్సవముల కితరులనుగూడ నాహ్వానించుదురనియు తెలిసి సంతోషించితిమి. మీయుత్సవముల కితరుల నాహ్వానించినపుడు, మీయిష్టమువచ్చిన పవిత్రగ్రంథములనుండి మీరు పారముచేసినచో వాస్తవముగ నితరు లందుకాక్షేపణ చేయగూడ దనువిషయమును మేమంగీకరింతుము.

“మీ 21-3-1959 తేదీ యుత్తరములో ‘సకాలములో నాయుత్సవముయొక్క ప్రణాళికయు కాలపరిమితియు స్థిరపఱచబడగల’వని మీరు సెలవిచ్చియున్నారు. అప్పటినుండి యిప్పటి కొకటిన్నరసంవత్సరములు గడచినవి. కావున నీపాటికి ఉత్సవకాలావధియు ప్రణాళికయు స్థిరపడియుండునని నమ్ముచున్నాను. ఉత్సవప్రణాళికను ప్రకటించవలసినదని దయాల్బాగుతరపుసత్సంగులు కొంతకాలమునుండి తొందరచేయుచుండిరిగాన, మీరు నిర్ణయించిన యుత్సవకాలావధిప్రణాళికలను నాకు తెలియపఱచగోరుచున్నాను. మీప్రణాళిక మాకందినతోడనే, మేము భారతదేశమందంతటనున్న సత్సంగులకు, స్వామీబాగు దయాల్బాగులలో జరుగునుత్సవములలో వేనివేనిలో వారు

పాల్గొనవచ్చునో తెలియగలందులకై, మీప్రణాళికను మాప్రణాళికతోపాటు ప్రకటించెదము.

"అటులనే మీ 21-3-1959 తేదీగల యుత్తరములో 'అయినను గురుద్వారమువద్దగాని సమాధివద్దగాని ప్రణామములు చేయుట కధికసంఖ్యాకులకు పూర్ణసావకాశ మీయవలయుననియే మాయుద్దేశ్యమై యున్న'దనియు, 'స్వామీజీమహరాజువారి పవిత్రపాదుకలను కండ్లకద్దుకొనగోరువారందఱకు నట్టిసావకాశము చేకుఱగల'దనియు మీరు సెలవిచ్చియుండిరి.దయాల్బాగు తరపుసత్సంగులధికముగ నీయుత్సవములకు రాగలరని తోచుచున్నది కావున సమాధిగురుద్వారములవద్ద మా కందఱకు ప్రణామములాచరించుటకు తగినంత సమయ మేర్పాటుచేసెదరని నమ్ముచున్నాను కావున 21-1-1961 తేదీ వసంతపంచమీసుదినమున దయాల్బాగు తరపుసత్సంగులకు ఈ రెండుపవిత్రస్థలములవద్దను మ్రొక్కుకొనుటకు నిర్ణయించిన సమయము సత్సంగులందఱకు తెలియునట్లు ప్రకటించవలయునుగాన దయయుంచి యీవిషయముగూడ నాకు తెలియజేయగోరుచున్నాను

"ఇంకొకవిషయ మేమనగా నా 30-7-1958 తేదిగల యుత్తరమును మీరొకసారి పరికింపగోరుచున్నాను నే నందులో 'సభాప్రతినిధులు పరమగురుస్వామీజీమహరాజువారిచే రచింపబడిన శబ్దములను వచనములను మాత్రమే చదువవలయునని ప్రతిపాదించుటలో వారల ప్రధానోద్దేశ్య మీయుత్సవములో వివిధవర్గములవారును పాల్గొనుటకు సాధ్యమగునట్లు చేయుటయే'యని వ్రాసితినిగాని మాసభపక్షమునకు జెందినవారికి పూజనీయబాబూజీమహరాజువారి రచనలను పారము చేయుట కాక్షేపణ యున్నదని కాదు.

"శతాబ్దిప్రణాళికను 3-10-1960 తేదీ ప్రేమప్రచారక్‌లో ప్రచురించుటకు వీలగులాగున మీసమాధానమును 5, 6 రోజులలో నా కందజేసిన యెడల సంతోషించెదను.

"హృదయపూర్వక రాధాస్వామీ కృతజ్ఞతాభివందనములతో."

94. కేంద్రీయపాలకసమితియధ్యక్షులు 8-12-1960 తేదీన నీక్రిందివిధముగ సమాధానమునిచ్చిరి:

"మార్చి 21వ తేదీగల నాయుత్తరములో తెలియజేసినప్రకారమును 6-10-1960 తేదిన మీతో స్వామీబాగుప్రతినిధులు సంభాషించినపుడు వారు సూచించియుండినప్రకారమును మేము దయాల్బాగులోని కొందఱుముఖ్యుల కును మఱికొందఱితరముఖ్యులకును మాత్రమే స్వామీజీమహారాజువారి పవిత్రసమాధివద్ద మ్రొక్కుసావకాశ మీయగలందులకై యూహ్యించదలఁ చుకొంటిమి. దయాల్బాగువారిటీవలజరిగించిన కార్యకలాపములవలన దయా ల్బాగుస్వామీబాగులమధ్య మనస్తాపములుగల్గినందున మే మాయభిప్రాయ మును గొంతమార్చుకొనవలసివచ్చినదని చెప్పుటకు చింతించుచున్నాను. దయాల్బాగువారు ప్రీవీకౌన్సిలు తీర్మానము వ్యతిరేకముగనుండినను గూడ స్వామీబాగుమీద వ్యాజ్యెమును జరిపించుచుండిరి. ఇప్పు డొకక్రొత్తమా ర్పును ప్రవేశపెట్టినచో నాసివిలువ్యాజ్యములో దీని నొక పూర్వదృష్టాంతము (Precedent)గ నుదహరించు ప్రమాదమునకు సావకాశమేర్పడగలదని మా కపనమ్మకగలుగుచున్నది. అదియునుగాక, నల్లుచేయుటచే నా మహాగంభీర పావనశతాబ్దిసత్సంగసమయమున నేదేనియనుచితఘటనగూడ జరుగుట కవ కాశముండవచ్చునని మా కనిపించుచున్నది. మీరు నేఁటిగ శతాబ్ద్యుత్సవ మును జరుపుకొనుచుండిరి గావున మాసత్సంగములో మీరు కలియవలెనను ప్రశంసకు సావకాశ మేమాత్రమును లేదు.

"ఇఁక స్వామీజీమహారాజువారి పవిత్రసమాధివద్ద ప్రణామములు చేయు విషయములో బాహ్యులతోపాటు దయాల్బాగువారుగూడ జనవరి 21వ తేదీ సాయంకాలము 4గం॥ 30 ని॥లు మొదలు 8 గం॥లలోపుగ నల్లు చేసికొనుట కనుమతించుదుము. రాదలఁచుకొన్నవారికి కొద్దిమందికిమాత్రమే మాకార్యాలయములో అనుమతి (Permits) చీట్లీయబడును. ప్రేక్షకులు దక్షిణదిశనున్న సింహద్వారముగుండ లోనికివచ్చి తూర్పువైపుననున్న గుమ్మ ముద్వారా బయటకు వెళ్ళవలయును. వారందఱును సమాధిహాలులో ప్రవే శించునపుడు పంక్తిక్రమములోఁబోవుచు, నా మహాసమయమునకు తగినట్లుగ భక్తిపూర్వకగంభీరనిశ్శబ్దత నవలంబించవలసియుండును.

'మీవద్దనుండి కబురందగనే మీసంఘీయులలో మాకు యుక్తమని తోచినంతమంది కనుమతిచీట్లను (Permits) మీవద్దకుపంపుట కేర్పాటుచేసము అయినను దయాల్బాగుప్రేక్షకులు సక్రమముగ నడచుకొనులాగునను తగిన మర్యాదతో ప్రవర్తించులాగునను కనిపెట్టు బాధ్యత వహించగల పెద్దమనిషి

నొకరిని మీరు దయచేసి నియోగించవలయునని నే నొకప్రార్థన చేయవలసి యున్నది.

"మేము భేంట్లను బాహ్యప్రేక్షకులనుండి స్వీకరించుటలేదు గావున మాయనుమతి-చీట్లతో వచ్చునట్టి మాసంఘీయులెవరును సమాధివద్ద భేంట్లు నీయకుండ మీరు నియమించవలయుననిగూడ మఱొక ప్రార్థన నేను జేయవలసియున్నది."

95 అందుకు సభాధ్యక్షులు 31-12-1960 తేదీన నీక్రిందివిధముగ సమాధానమునంపిరి. దీనితో 1954 సం॥రమునుండి జరుగుచున్న యీయుత్తరప్రత్యుత్తరపరంపర ముగిసెను.

"నేను మీ 8-12-1960 తేదీ యుత్తరమును శ్రద్ధతో జదివితిని. దానిని బట్టి స్వామీజీమహారాజువారి పవిత్రసమాధివద్ద జరుగబోవు శతాబ్ద్యుత్సవములో మమ్ములను పాల్గొననిచ్చువిషయములో మీకభిప్రాయభేద మేర్పడినదని తేటపడుచున్నది. మీరు మొదటిలో మమ్ములను సోదరభావముతో నాదరించి సమాధిసన్నిధానమున జరుగబోవుసత్సంగములో పాల్గొననిచ్చుటకు సంసిద్ధులైయుండిరి. కాని, యిప్పుడు మమ్ములను 'బాహ్యుల' వలెనే పరిగణించుటకు నిశ్చయించిరి. దానికితోడు మాసంఘీయులలో కొద్దిమందిని మాత్రమే రానిచ్చెదమనియు, మీ వలన ననుమతిచీట్లు (Permits) పొందిన వారికిమాత్రమే పవిత్రసమాధివద్ద ప్రణామము చేయుట కనుమతినిచ్చెదమనియు గూడ నొకతీర్మానముగావించిరి. సర్వోపరి యేదోయొక 'యనుచితఘటన' సంభవించగలదని మీరుభయపడుచున్నట్లు చెప్పి, అందుచే మే మాసమయమున మాపక్షమువారి సక్రమప్రవర్తనకు పూచీపడవలసియున్నట్లుగూడ కోరుచుండిరి.

"ఇంతియుగాక మీరు మీయభిప్రాయభేదమున కీక్రిందికారణముల నుదహరించితిరి:

(a) మీతోకలిసి మే మీయుత్సవమును జరిపించినచో దీని నా సివిలు వ్యాజ్యేముకొఱ కొకపూర్వదృష్టాంతముగ నర్థము చెప్పగలమని మీరు భయపడుచున్నట్లును,

(b) దయాల్బాగువా రిటీవల జరిగించిన కార్యకలాపములవలన దయాల్బాగు స్వామీబాగులమధ్య మనస్తాపములు గల్గినట్లును.

"ఈ హేతువులు బొత్తిగ నిస్సారములని నేఁజెప్పుచున్నందుకు క్షమింప వేఁడెదను.

"(a) గుర్తుగల హేతువు విషయములో ఆగ్రా, అలహాబాదులలోని న్యాయవాదులు సివిలు వ్యాజ్యములో మీవాదమునకు భంగము లేకుండునట్లు తగినభాషను ప్రయోగించి మీమామధ్య నొకపత్రమును వ్రాయించిగాని, లేదా, మీరు వ్రాయుచుండిన యుత్తరములలో యుక్తభాషాప్రయోగము జేసిగాని, మీహక్కులను భద్రపఱచజాలనంతటి నైపుణ్యహీనులైపోయినట్లే మీరు భావించుచుంటిరా?

"ఇఁక (b) గుర్తుకారణము విషయములో మీయభిప్రాయమేమిటో, మీ రేక్రియాకలాపముల నెవరిక్రియాకలాపములనుగుఱించి సూచించిరో మా కవగాహన గాకున్నది. అయినను మీరు ప్రీవీకౌన్సిలుతీర్పు నుదహరించుటచే, మేము మాపక్షమువారి హక్కులను సంరక్షించుకొనుటకై మావాదమును న్యాయస్థానములో చెప్పుకొనుటకు ప్రయత్నించుటగూడ మీ రొకకజ్జాకోరుదనముగనే భావించుచున్నట్లు స్ఫురించుచున్నది. అట్లయినచో మీ రేమన్నను మేమాక్షేపణ జేయకుండ నంగీకరించుచుండవలసినదనియే మీయుద్దేశ్యమా? దయాల్బాగుపక్షమువారందఱహక్కులను సంరక్షించుబాధ్యత మామీఁదనుండుటచే మేమట్లు జేయుటకు వీలుగాదు. అయిన నీయుత్తరములో దీనినిగుఱించి యధికముగ చర్చజేయుట యుక్తముగాదు.

"పవిత్రసమాధివద్ద ప్రణామములు జేయగోరినందుకు మీ రేదో 'యనుచితఘటన' సంభవించగలదని వ్రాయుట, మేమట్టి కోరికను వదలుకొనునట్లు జేయు భయోత్పాదకసూచనగ నాచరించినది. ఏలనన నట్టితరుణమున నొక యనుచితఘటన, యేరివలన నెవ్విధముగ జరిగిననుగూడ, ననేకనిర్దోషిసత్సంగులకు బాధగలుగజేయు దుస్సహపరిస్థితికి కారణభూతము గావచ్చును. ఈ విషయమునుగుఱించి 27-12-1960 తేదీన జరిగిన రాధాస్వామీసత్సంగసభ సమావేశములోను, దయాల్బాగులో నాసమయముననున్న సత్సంగుల సార్వజనీనసమావేశములోనుగూడ నాలోచించబడెను. మీరు విధించిన నిబంధనల కంగీకరించి మాలో కొద్దిమందిమాత్ర మేమైనను పొందుటకు నావకాశమున్నట్టి

మహానందమును వరదానమును, మీచే సూచించబడిన 'యనుచితఘటన' యేదేని సంభవించునేమో యను భయకారణమున విడిచిపెట్టవలసివచ్చినదని యీ రెండుసమావేశములలో తీర్మానమయినట్లు నేను మీకు గొప్పహృదయ వేదనతో తెలియపఱచుచుంటిని. కావున మీరు మాపక్షమువారి కెవరికి నను మతిచీట్ల నిచ్చుశ్రమ దీసికొనబనిలేదు.

"అయినను, రాధాస్వామీదయాళునిచే నీజగమున ప్రకటింపబడిన యేసందేశముయొక్క స్మారకార్థమయి మనమందఱ మీశతాబ్ద్యుత్సవమును జరుపబోవుచున్నామో యట్టి యీ మహాశుభసందేశము, వారిపవిత్రసమాధిని తమ తత్కాలవశములోనుంచుకొన్నవారినుండి యింతకన్న నెక్కుడు విశాలోదారభావముల నపేక్షించునని నేను సూచించకనుండజాలను. ఆ మహాసందేశము, మా కవగాహనమైనంతవఱకు సకలజగదుద్ధారము నిమిత్తమును ప్రాణిమాత్రులందఱిమీద మహాదయావర్షమును కురిపించునిమిత్తమును ఉద్దేశింపబడినది గావున, వారిపవిత్ర సమాధివద్ద ప్రణామములనర్పింప నుత్సుకులైనవారి కట్టిసావకాశము లేకుండజేయుట వారిదివ్యేచ్ఛకు (మౌజ్) నిస్సంశయముగ ప్రతికూలమేయగును.

"హుజూర్ రాధాస్వామీదయాళు రిందుకుసంబంధించినవారందఱకును పూర్ణసుమతిదానమునిచ్చి, వారలను సరిగ నుద్ధారక్రమమార్గమున నుంచుగాక యని దీనప్రార్థనతో ప్రస్తుత మీయుత్తరమును నేను ముగించవలసియున్నది."

*షరా:- ఈవిషయమునుగుఱించిన యుత్తరప్రత్యుత్తరములన్నియు 1961 సంవత్సరము జనవరి ఫిబ్రవరినెలలోని సత్సంగవారపత్రికలలో ప్రచురింపబడినవి.*

## శతాబ్ద్యుత్సవము

96. కాబట్టి దయాల్బాగురాధాస్వామీసత్సంగసభ వారు ఈయుత్సవమునకు తమప్రణాళికను వేఱుగ నేర్పాటుచేసికొని, దేశమందంతటను, వీలైనన్నిస్థలములలో జరిపించవలయునను నుద్దేశ్యముతో నన్నిబ్రాంచిసత్సంగములకును, జిల్లాసంఘములకును, ప్రాంతీయసంఘములకును తమతమస్థలములలో నీయుత్సవమును దీపప్రకాశముతో సాగించవలయునని వర్తమానములనంపిరి. సత్సంగు లీయుత్సవమును దేశమందు సర్వత్ర జరుపవలయుననెడి వ్యవస్థకు

ప్రాధాన్యమీయుటకై దయాల్బాగునుండి యనుమతిచీట్లు పొందినవారు మాత్రమే దయాల్బాగు రావచ్చుననియు, నితరులు రాకూడదనియు సత్సంగు లందఱకును దెలియజేసిరి.

97. ఆ యుత్సవసమయములో నన్నిరోజులును శబ్దపారమును జరిపించిరి. 21-1-1961 వసంతపంచమీసుదినమునకు పూర్వము పారము చేసిన శబ్దము లన్నియు, రాధాస్వామీదయాళురు మానవరూపమున నవతరించకపూర్వ మీప్రపంచముయొక్క దురవస్థనుసూచించుచు మహాదుఃఖవేదనలతో నిండి యున్నవి. 21-1-1961 తేది వసంతపంచమీసుదినమున పారము చేసినశబ్దములు, రాధాస్వామీదయాళురు హుజూర్ స్వామీజీమహారాజువారిలో మానవరూప మున నవతరించుటను గూర్చి ఘోషణచేసినవి. పిమ్మట జదివినశబ్దములు రాధాస్వామీదయాళు రవతరించినందున ప్రాపంచికజీవుల కద్భుతసౌభా గ్యము మేల్కాంచి నందుకు మహానందసంతోషభావపూరితములై యున్నవి.

98. 1961 సం॥రము జనవరి 21వ తేదీ వసంతపంచమీసుదినమునకు పూ ర్వమును. ఆరోజునను, అటుపిమ్మటను చదివినశబ్దము లీక్రింద నుదహరింప బడినవి:-

1961 జనవరి 19వ తేదీ

*ఉదయ సత్సంగము*

(i) మైం సతగురు సంగ కరూంగీ ఆరతీ।

(సారబచన్, బచన్ 27, శబ్దము 1)

(ii) దరస దే ఆజ బంధావో ధీర,

(ప్రేమబానీ 1వ సంపుటము బచన్ 5, శబ్దము 6)

*సాయంతన సత్సంగము*

(i) కైసీ కరూం కసక ఉఠీ భారీ ॥

(సారబచన్. బచన్ 27, శబ్దము 3)

(ii) బిన దర్శన మన శాంతి న ఆవే॥

(ప్రేమబిలాస్, భాగము 1. శబ్దము 37)

జనవరి 20వ తేదీ

*ఉదయ సత్సంగము*

(i) అబ్ మన ఆతుర దరస పుకారే॥

(సారబచన్, బచన్ 33, శబ్దము 1)

(ii) నా జానూం సాహబ్ కబ్ మిలిహోం రే॥

(ప్రేమబిలాస్, భాగము 2, శబ్దము 79)

*సాయంతన సత్సంగము*

(i) 'సతగురు సే కరూం పుకారీ॥'

(సారబచన్. బచన్ 33, శబ్దము 19)

(ii) ఆజ్ మేరే సతగురు హేం మేరీ జాన్॥

(ప్రేమబానీ, సంపుటము 1, బచన్ 6, శబ్దము 1)

('సతగురు సే కరూం పుకారీ' అను శబ్దముయొక్క సారాంశము ఈ గ్రంథములో 5, 6 పుటలలో వ్రాయంబడినది.)

1961 జనవరి 21వ తేదీ (వసంతపంచమి)

*ఉదయ సత్సంగము*

(i) రాధాస్వామీ ధరా నర రూప జగత మేం॥

(సారబచన్, బచన్ 1, శబ్దము 2)

(ii) ఋతు బసంత ఆయే సతగురు జగ మేం॥

(ప్రేమబానీ, సంపుటము 3, బచన్ 16, భాగ్ 1, శబ్దము 3)

(iii) సందేశము (గద్య), అనగా, ఘోషణము

(సారబచన్, బచన్ 1)

వరా:- ఈ సందేశమునకు పూర్తియైన తెనుంగు తర్జుమా ఈ గ్రంథము 6-8 పుటలలో నున్నది.

*సభాసమావేశములో (మధ్యాహ్నము 12 గంటలకు)*

(i) జీవ చితాయ రహే రాధాస్వామీ॥

(సారబచన్, బచన్ 6. శబ్దము 22)

(ii) ఆజ గురు ఆయే జగతారన్ ॥

(ప్రేమబానీ, సంపుటము 2, బచన్ 2, భాగము 3, శబ్ద 10)

*సాయంకాల సత్సంగము*

(i) చలో రీ సఖీ మిల ఆరత గావేఁ ॥

(సారబచన్, బచన్ 1, శబ్ద 1)

(ii) ఆజ సాహబ్ ఘర మంగలకారీ ।

(ప్రేమబిలాస్, భాగ్ 1, శబ్ద 1)

1961 జనవరి 22వ తేదీ

*ఉదయ సత్సంగము*

(i) జాగరీ ఉఠ ఖేల సుహాగిన్ ॥

(సారబచన్, బచన్ 28, శబ్ద 1)

(ii) ఆజ మేరే ఆనంద బజత బధాఈ ॥

(ప్రేమబానీ, సంపుటము 3, బచన్ 16, భాగ్ 2, శబ్ద 2)

*సత్సంగుల సార్వజనీన సమావేశములో (మధ్యాహ్నము 12 గంటలకు)*

(i) అజ ఘడీ అతి పావన భావన్ ॥

(సారబచన్, బచన్ 28, శబ్ద 4)

(ii) సఖీ రీ మేరే దిన ప్రతి ఆనంద హోయ్ ॥

(ప్రేమబానీ, సంపుటము 1, బచన్ 4, శబ్ద 6)

*సాయంకాల సత్సంగములో*

(i) గురు ప్యారే కరేఁ ఆజ జగత ఉద్ధార్ ।

(ప్రేమబానీ, సంపుటము 3, బచన్ 12, భాగ్ 2, శబ్ద 52)

(ii) బఢత సతసంగ అబ్ దిన దిన్ ॥

(ప్రేమబానీ, సంపుటము 3, బచన్ 2, భాగ్ 3, శబ్దము 15)

*ప్రత్యేకపాఠము*

(i) ధన్య ధన్య సఖీ భాగ హమారే ॥

(ప్రేమబిలాస్, భాగ్ 4, శబ్ద 126)

(ii) స్వామీ తుమ కాజ బనాఏ సబన కే ॥

(ప్రేమబిలాస్, భాగ్ 3, శబ్ద 104)

# శుభసందేశము

99. వసంతపంచమీసుదినమున, నుదయసత్సంగానంతరము, మెహతాజీ సాహబ్ వారీక్రిందపొందుపఱచిన శుభసందేశము నిచ్చిరి:-

(i) "పరమపురుషులును సర్వసమర్థులునగు హుజూర్‌స్వామీజీమహారాజ్ వారు ఆగ్రాలో నొక చాలయిఱుకైన సందులో నొకచిన్నిగృహమున 1818 సం॥రము ఆగస్టు 24వ తేదీన జన్మించిరి. ఆగృహమును నేనీ మధ్య వెళ్ళిచూచితిని. 1861వ సం॥రము ఫిబ్రవరి 15వ తేదీ వసంతపంచమీ సుదినమున వారు మహోదయతో రాధాస్వామీసత్సంగమును ప్రజలందఱకును తెఱచినట్లు ప్రకటించిన దా చిన్నగృహముననే. పిమ్మట 15 వర్షములవఱకు నచ్చటనే సత్సంగము జరిగెను. హుజూరుమహారాజ్ వారికాలములో సత్సంగము పీపల్మండీలో, 60, 70 మంది జనులు కూర్చుండుటకుగూడ నిఱుకైన గృహమధ్యప్రాంగణమున జరుగుచుండెడిది. సత్సంగ మీ నాఁడింత పెద్ద వ్యవస్థగ నేర్పడునని గాని దాని యనుయాయులు లక్షలాదిగ పెరిగి జగత్తులో నన్ని దేశములలో నుందురనిగాని యీమహాపురుషులిరువురునుదప్ప మఱెవ్వారు నప్పు డూహింపగల్గియుండరు.

(ii) "ప్రారంభదశలో సత్సంగోద్యమము చాలచిన్నదేయైనను భావికాలమున దానిశ్రేయోదాయకసావకాశములు చాలయద్భుతమైనవి. నిజముగ నవి యట్లే యుండితీరవలెనుగూడ. ఏలనన నీయుద్యమమునకు స్వయముగ రాధాస్వామిదయాళురే శంకుస్థాపనజేసిరి. అంతియగాక, సర్కార్‌సాహబ్ వారు సెలవిచ్చినప్రకారము, జీవులయుద్ధారార్థమైవచ్చి మానవరూపమును దాల్చిన యాపరమచైతన్యధార, యీసత్సృష్ట్యుద్ధారకార్యమును శాంతముగ నెఱవేర్చకుండ తిరిగి తనస్వధామమునకు మఱలిపోనేరదు. అందువలననే సత్సంగము 1931 సం॥రము జనవరి 21వ తేదీ వసంతపంచమీసుదినమైన యీయోజన సంత్యమైన శతవర్షములలో నిరంతరాభివృద్ధి నొందుచువచ్చెను.

(iii) "నిస్సంశయముగ నీసుదినము సత్సంగమండలికంతకును మహానందసంతోషదాయకమైనదే. ఏలనన, 1861 సం॥రములో చంటిబిడ్డగనున్న సత్సంగ మిన్నిసంవత్సరములును దినదినాభివృద్ధినొందుచు, దాని కీనాఁడు నూఱేండ్లుపూర్తియయ్యెను. కాని సత్సంగవ్యవస్థతో నేహోదాలోనైనను సంబంధముగల్గినట్టి మనబోంట్లందఱిపైన నొకమహాబాధ్యత మోపియున్నది;

ఏలనన, సత్సంగపురోభివృద్ధికి మనకృత్యములవలన నే యవరోధములుగలిగినను గలుగవచ్చును సహాయమైనను చేకూరవచ్చును.

(iv) "కావున నీగంభీరసమయమున, మనపూర్వప్రవర్తనయాచరణలచే మనము సత్సంగక్రమాభివృద్ధికి సహాయమొనరించితిమో లేక యవరోధమును గల్పించితిమో గతవిషయములను సింహావలోకనమొనరించియు నాంతర్యమున పరిశీలించుకొనియు చూచుకొనుటయావశ్యకము. అట్లు పరిశీలించినపిదప మన మెంతసూక్ష్మరూపముననైనను దానియభివృద్ధి కాటంకమునుగలుగజేసినట్లు తేలినచో మనపద్ధతులను మనము వెంటనే దిద్దుకొనవలెను. అట్లుగాక మనము దానియభివృద్ధికి స్వల్పముగనైన కొంతతోడ్పడియుండినచో, నికముందు అంతకన్న నెక్కువగ తోడ్పడుటకు ప్రబలప్రయత్నము చేయవలయును.

(v) "మనలో గొందఱకు, తమస్వవిషయములోను సత్సంగము యెడలను రాధాస్వామిదయాళుని యెడలను తమకర్తవ్యములపరిజ్ఞాన మున్నను, అట్టి జ్ఞానమించుకేనిలేనివారుగూడ మనలో చాలమందిగలరు అట్టికర్తవ్యపాలనము జేయుటకవసరమైన ధైర్యసాహసములు లేనివారునుగూడ నెక్కువగనే యున్నారు. అట్లుచేయుటకు వాస్తవమైన యాసయైనను లేనివారును గొందఱుగలరు.

(vi) "ఎట్లులైనను, మనము సత్సంగోద్యమముయొక్క వృద్ధివికాసములకు తోడ్పడక, మనపూర్వాభిమానములకును పక్షపాతములకును లోనైయుండిపోయినచో, మనము రాధాస్వామిదయాళురిచే మనకుదయచేయబడిన సర్వోత్తమనావకాశమును చేతులారపోగొట్టుకొనుటయేగాక, రాధాస్వామిదయాళురు నూతేండ్లక్రితమీపవిత్రదినమున మహోదయుతో సెలవిచ్చిన దివ్యసందేశముయొక్క వ్యాప్తికి, అంతకంత నవరోధమును-తెలిసికొనలేకుండగనే యాగాక-కలుగజేసితిమని కట్టకడకుబోధపడి విచారించవలసియుండునని మనము జ్ఞాపకముంచుకొనవలయును.

(vii) "అదియునుగాక, మనలను తమశరణ్యములోనికి మొదటస్వీకరించినపుడు వారు మనమీద నెట్టిదయాకటాక్షములనుజూపిరో, యట్టిదయాకటాక్షములనా నాటినుండియు నింతవఱకదేప్రకారము చూపుచుండిరో, లేక నాదయాప్రవాహముకట్టువడినదో మనముసింహావలోకనముజేసి చూచుకొనవలయును. ఆదయాప్రవాహముకట్టువడినచో నెందులకిప్పుడు మనము భాగ్యహీనులమైతిమని తెలిసికొనుటకు జాగరూకులమై నిష్కపటముగను, న్యాయ

ముగను ప్రయత్నించుచు, పాపాత్ములము పథభ్రష్టులమునగు బాలురమైన మనయొక్క లోపములనుతప్పిదములను వా రపారదయాకటాక్షములతో క్షమించి మనలను తిరిగి తమశరణ్యములోనికి దీసికొని గాపాడవలయునని మనము వారి పవిత్రచరణములవద్ద ప్రార్థించవలయును.

(viii) "అట్లుచేసినయెడల వారిదయాక్షములు తిరిగి మనవైపునకు యథాప్రకారము ప్రవహించుటయేగాక, వివేకశూన్యులమైన మనయొక్క మంద మతి యుపేక్షాభావములనుగూడ వారు దయతో క్షమించెదరని నేనునమ్ముచున్నాను.

(ix) "అందఱకును పరమపిత సుమతిదానము నిచ్చుగాత! సత్సంగోద్యమ మితోధికముగ వృద్ధివికాసములనొంది వర్ధిల్లుగాత! రాధాస్వామీ!"

100. ఆరోజుననే రాధాస్వామీదయాళుని పవిత్రచరణకమలములయందు కృతజ్ఞతాపూర్వకధన్యవాదముల నర్పించుటకు మిత్తమై రాధాస్వామీసత్సంగ సభ యొకప్రత్యేకసమావేశమును చేసెను. ఆసమావేశములో జేసిన తీర్మానము ఈక్రింద పొందుపఱచబడినది :

"హేసర్వసమర్థప్రభో, పరమపురుష రాధాస్వామీదయాళో!

"దయాళ్వాగు రాధాస్వామీసత్సంగసభాసభ్యులమగు మేము తమ పవిత్రచరణకమలములయందు సాష్టాంగముచేసి, మహాదీనత్వముతో తిరిగి తిరిగి దండప్రణామములుచేయుచుంటిమి!

"ఓప్రభో! ఇంచుమించు రెండులక్షలయేబదికోట్లమానవజాతియంతటితోను బోల్చిచూడగ రెండులక్షలసంఖ్యగలమాసంఘ మత్యల్పముగదా! ఈమానవజాతినంతటిని భూమియందు గల యితరజీవకోట్ల సంఖ్యతో బోల్చి చూచినయెడల నదిగూడ సూక్ష్మాతిసూక్ష్మమే!

"ఈమాభూమి సూర్యమండలములోనిగోళములలో నొకయల్పతమ గోళము. ఇట్టిసూర్యమండలములు ఈమాపిండదేశములో ననంతముగ నున్నవి. ప్రస్తుతసృష్టిలో పిండదేశములు బ్రహ్మాండదేశములుగూడ ననంతసంఖ్యాకములుగలవు. ఈ యసంఖ్యాకపిండబ్రహ్మాండములు సృష్టిలోని బుణాత్మకధ్రువములో, నాకసమున నొకచిన్న మేఘఖండమువలెనే,యొకచిన్నితునక. హేరాధాస్వామీదయాళో, ఈమహావిశాలసృష్టికంతకును నీవే కర్తవు, ప్రభువవును! ఈ మహావిస్తీర్ణసృష్టియంతయు నీలోననే యిమిడిపోయియున్నది!

"అదియునుగాక, వైజ్ఞానికులనిర్ణయముప్రకారం మీాపృథ్వియందు ప్రాణులు లక్షలాదిసంవత్సరములక్రితమునుండియు నుద్భవించుచు నీమహా దీర్ఘకాలములో నసంఖ్యాకములైన జీవకోట్లు పుట్టినశించిపోయినవి. మానవ జాతియే యథమము 2 లక్షలసంవత్సరములనుండి యుండుచున్నది సాహబ్జీమహా రాజువారు సెలవిచ్చినప్రకారము ఈప్రస్తుతసృష్టితరువాత ననంతకోటిసృష్టులు వరుసగ నుత్పత్తిచేయబడుచు ననంతకాల మట్లేజరిగిపోవుచుండును. మేముపుట్టి కొద్దిసంవత్సరములుగూర్రమే యూయెను మఱికొద్దిసంవత్సరములలోనే మేము గతించిపోవుదుము. ఓప్రభో, మాఅస్తిత్వము అంతబొత్తిగ నణుప్రాయము!

"ఇంతబొత్తిగ నణుప్రాయమైన మామీాద, నోప్రభో! తమ రెంత యద్భుతాపారదయాకటాక్షములు వర్షించిరి! స్వయముగ తమరే యీా మానీచ లోకమునకువచ్చి మానవరూపమును ధరించి మమ్ములనందఱను తమదయా మయరక్షణములోనికి దీసికొని సకలవిధపాపములు రోగములు దోషములతో నిండియున్న దుర్బలనిస్సారజీవులమైన మాకు ఈభూలోకమున తమసన్నిధాన వరదానము ననుగ్రహించుటయేగాక, మమ్ములను తమశాశ్వతతేజోమయధా మమునకు దీసికొనివెళ్ళి యచ్చట నిరంతరశాశ్వతానందమునిచ్చులాగున వాగ్దానమునుగూడ జేసిరి!

"మఱియు సాహబ్జీమహారాజువారి పవిత్రవాణిప్రకారము, మాకీ ప్రపం చమునందున్నంతకాలము నైహికభోగములనేగాక తమతోనాంతర్యసంయోగ మునుగూడ జేకూర్చి మమ్మిచ్చట వేధించుచున్న సమస్తబాధలను రోగములను నిర్మూలించుట కేర్పాట్లుచేసిరి. ఇంతియగాక, సమస్తజీవులును సంపూర్ణోద్ధార మొందువఱకు తామిచ్చటనే మానవరూపమునదుండిపోవుదుమని మహావాగ్దా నమును దయచేసిరి!

"మేము మమ్ముగుఱించియు మాయసంఖ్యాకలోపములనుగుఱించియు దలచుకొనినపుడు మాపరమనీచత్వమునకును దోషభూయిష్ఠతకును లజ్జాభరితు లమై తలలు వంచుకొనుచుంటిమి.

"ఓమహాప్రభో, తమ యద్భుతాపారమహారాజశోభావైభవము లంత టివి! మా పరమనీచత్వ మింతటిది! అయిననుగూడ, మాయందు తా మనం తాపారదయాకటాక్షములను వర్షించుచునేయుండిరి!

"తమకు మాకృతజ్ఞతను ప్రకటించుటకు మాకు భాషలేదు. 1861సంవ త్సరములో సత్సంగముస్థాపించినది మొదలు నూఱేండ్లు పూర్తియైన శుభసమ

యమగు నీవసంతపంచమీనాడుదినమున, మాకృతజ్ఞతాభావములను సంపూర్ణముగ ప్రకటించుటకు మేము వాస్తవముగ నశక్తులము. అందుచే మేము తమ పవిత్రచరణకమలములందు దీనులమై కృతజ్ఞతాపూరితముగ సాష్టాంగదండ ప్రణామములను తిరిగితిరిగిసేయుచు, హుజూర్ సాహబ్జీమహారాజువారు రచించిన యీక్రిందిచరణములలో జెప్పినప్రకారము ప్రార్థనజేయుచున్నాము:

తన మన సేవా మేఁ లగేఁ, ఔర సేవ తుమ్హారీ హోయ్
దయాదృష్టి హమ పర రహే, ఔర న చాహత కోయ్॥

అర్థము :—నాశరీరమనస్సులు రెండును సేవలో నర్పణమైపోవుగాక; ఆసేవ తమసేవయేగావలయును మాకు తమదయయొక్కటే కావలయును. మఱొకకోరికయెద్దియు మాకులేదు.''

101. జనవరి 22వ తేదీన దయాల్బాగులోనున్న సత్సంగిస్త్రీపురుషులందఱు నొకప్రత్యేకసమావేశమును చేసిరి. ఆంధ్రప్రదేశసేల్సుటాక్సు అప్పలేటుట్రిబ్యునలులో నధ్యక్షులుగఁ బనిజేసిన శ్రీ.ప్రే॥భా॥ ఉప్పులూరి సత్యనారాయణగారీసభ కధ్యక్షతవహించిరి. వివిధప్రాంతములకుజెందిన సత్సంగులందఱును నిలబడి హుజూరు రాధాస్వామీదయాళుని పవిత్రచరణకమలములందు కృతజ్ఞతాపూర్వకధన్యవాదముల నర్పించిరి. ఆసమయమున స్త్రీలవైపునుండి యొకప్రతినిధికూడ భాషణచేసెను. ఆభాషణములన్నియు ప్రేమభక్తిరసపూరితములైయుండెను అయినను వాని నిచ్చటపొందుపఱచుటకు సాధ్యముగాదు.

102 ఇవ్విధముగ రాధాస్వామీసత్సంగస్థాపనము మొదలు నూఱేండ్లు పూర్తియైనపుడు ప్రతిసత్సంగియు మహానందసంతోషపూరితుఁడై 1961సం॥రము జనవరి 21, 22 తారీఖులలో రాధాస్వామీదయాళు నిచరణకమలములయందు కృతజ్ఞతాపూర్వకధన్యవాదముల నర్పించుటలో పాల్గొనెను. చాలమందిసత్సంగులాసమయమున నింతియగాక మఱొకయుత్తమకారణముచేగూడ కృతజ్ఞతాపూరితహృదయులైరి. ఏమనగా, 1937సం॥రమునుండియు నప్పటికిగతించిన 24 యేండ్లును సత్సంగసంఘమందఱిమీదను తమమీదను వర్షించిన యద్భుతదయాకటాక్షధారాపాతమును దలఁచుకొనగా వారిహృదయములు ద్రవీభవించెను. ఈచతుర్వింశతిసంవత్సరకాలములో రాధాస్వామీదయాళువు తా మీక్రింది చరణములలో ప్రసాదించినమహావాగ్దానము నెట్లుచరితార్థముగావించిరో ప్రదర్శించిరి :

జో కోఈ సరన తుమ్హారీ ఆయా, దీన గరీబీ పన లే।
సభీ భార ఉసకా తుమ లీనా, దుక్ఖ హారే తన మన కే।
భోగ దియే ఔర జోగ భీ దీనా, రోగ దహే జనమన కే।

అర్థము :—ఎవరు దీనత్వముతోను ఆర్తభావముతోను, దయామయులైన సద్గురుని శరణుఁజొచ్చిరో, యట్టివారి సమస్తభారము నాదయాళువే స్వయముగ భరించి వారి శారీరకమానసిక బాధలనన్నిఁటిని దొలఁగించిరి. అట్టి వారికి సద్గురువు ఐహికభోగములనుఁజేకూర్చి, తమశుభసంయోగమునుగూడ ననుగ్రహించి, వారికి జన్మజన్మాంతరములనుండియున్న రుగ్మతను బాధల నన్నిఁటిని నశింపుజేసిరి.

అందుచే వారందఱును సంపూర్ణదీనత్వముతో నతశిరస్కులై యీమహాదయ నెడ తెఱపిలేకుండ శాశ్వతముగ వర్షింపుచుండుడని ప్రార్థనచేసిరి।



## VII

# సత్సంగసంస్థలు మొదలగునవి

## (A) రాధాస్వామీ సత్సంగసభ

1. రాధాస్వామీసత్సంగముయొక్క కేంద్రీయపాలకసమితి (Central Administrative Council) సభ్యులును రాధాస్వామీధర్మకర్తృవర్గము (Radhasoami Trust) యొక్కధర్మకర్తలును (Trustees) మహారాజ సాహబ్ వారియనంతరము సర్కార్ సాహబ్ వారిని వారియుత్తరాధికారిగ నంగీకరించలేదు. నాల్గవయధ్యాయము 54-62 పేరాలలో, రాధాస్వామీ సత్సంగసభను 1910 సం॥రము మార్చి నెలలో నేర్పాటుచేయవలసివచ్చిన పరిస్థితులనుగురించి, వివరముగ వ్రాసియుంటిమి దయాల్బాగును కేంద్రస్థానముగ నేర్పఱచుకొన్న రాధాస్వామీ సత్సంగముయొక్కస్థిరచరాస్తులనన్నిటిని సభవారప్పటినుండియు తమయధీనమునునుంచుకొని పాలించుచుండిరి. దానికి విధానపుచట్టమును ఉపనిబంధనలను న్యాయశాస్త్రసమ్మతముగ నేర్పఱచుకొనిరి 1913 సం॥రములో సర్కార్ సాహబ్ వారు నిర్యాణముగునఱకు సర్కార్ సాహబ్ వారి పథప్రదర్శనముక్రిందను, దరిమలా, 1937 జూన్ నెలవఱకును సాహబ్జీమహారాజువారిపథప్రదర్శనముక్రిందను, సభ తనకర్తవ్యనిర్వాహమును జరుపుచుండెను.

2. సభయొక్క క్రియాకలాపము బాధ్యతలును పెరుగుచుండుటచే దాని స్థితిని న్యాయశాస్త్రసమ్మతముగజేయుటకై 9-10-1921 తేదీన జరిగిన 19వ సభాసమావేశములో దీనిని సొసైటీస్ రిజిస్ట్రేషనుఆక్టు (Societies Registration Act) 1860 సం॥రపు XXI చట్టప్రకారము రిజిస్టరుచేయించుటకు తీర్మానించిరి. ఆప్రకారము దీనికి దయాల్బాగును(ఆగ్రా) కేంద్రస్థానముగ నేర్పఱచి 17-11-1921 తేదీన దీనిని రిజిస్టరుచేయించిరి. అప్పుడే సాహబ్జీమహారాజువారి నీసభకు అధ్యక్షులుగ నెన్నుకొనిరి.

3. సభయొక్క విధానపుచట్టము నప్పటప్పట పునర్విమర్శచేసి మార్పులుజేసిరి. 26-6-1960 తేదీన జేసిన కడపటిపునర్విమర్శప్రకారము దాని యుద్దేశ్యము లీక్రిందివిధముగ వివరింపబడినవి :

A. రాధాస్వామీమతసిద్ధాంతములను ప్రచారము చేయుట;

B. ఈక్రిందిపనులను జరిపించుటయు, మఱియు/లేదా, అందుకేర్పాట్లు చేయుటయు:

(a) సత్సంగముజేయుట,

(b) రాధాస్వామీమతములో జేరగోరు వ్యక్తుల కుపదేశములనిచ్చుట

(c) రాధాస్వామీమతస్థాపకులగు మహాపురుషునికిని నిర్యాణము నొందిన యితరసంతసద్గురువులకును పవిత్రసమాధులను గట్టించి, వానిని సరియైన స్థితిలో నుంచుట.

(d) ప్రసాదమును పంచిపెట్టుట,

(e) భండారాలను జరిపించుట,

(f) ప్రజలందఱకునుగాని వారిలో నొకవిశిష్టభాగమునకుగాని ఆధ్యాత్మికవికాసను గలుగజేయునట్టి యితరకార్యములను సాగించుట;

C. దయాల్బాగుకాలనీ నీక్రిందియాదర్శములతో నొకయాశ్రమముగ స్థాపించినందున, దాని నా యాదర్శములను సాధించుటకనుకూలముగనుండు నట్లు స్థిరపఱచి నడిపించుట

(a) ఈకాలనీవాతావరణమును పరిసరములను. రాధాస్వామీమతములో నిర్ణయించిన యాధ్యాత్మికసాధనలను జయప్రదముగ నభ్యాసము జేయుట కనువుగ నుండునట్లుంచుట,

(b) ఈ యాశ్రమవాసులను తగిన నిష్ఠురశిక్షాక్రమమున నుంచి వారిని తమమనస్సును నిగ్రహించగల్గునట్లుజేయుట,

(c) ఈయాశ్రమనివాసులకు మానవసేవజేయుటకు సదవకాశములను గల్పించుట;

D. దయాల్బాగుయొక్క యాదర్శములవంటి యాదర్శములతో నీపద్ధతులమీదనే యితరస్థలములలో నిట్టికాలనీలను స్థాపించి, వానినిపోషించుటయు, నడిపించుటయు;

E. ప్రాంతీయ రాధాస్వామీ సత్సంగసంఘములను జిల్లాసత్సంగసంఘములను, బ్రాంచిసత్సంగములను, సత్సంగులకు వ్యక్తిగతముగను సాంఘికముగనుగూడ పథప్రదర్శనముజేయుచు, వారల ప్రవర్తన ప్రవృత్తులను, రాధా

స్వామీమతసిద్ధాంతములను సభయాదర్శములను అనుసరించియుండునట్లు, నియమించుటయు, క్రమబద్ధముజేయుటయు;

F. రాధాస్వామీమతానుయాయుల లాభార్థమై విద్యను -అనగా, మత, నైతిక, మానసిక, సాంఘిక, సాంస్కృతిక, వైజ్ఞానిక, సాంకేతిక, పారిశ్రామిక, వ్యాపారిక, కృషిక, వైద్యశాస్త్ర, న్యాయశాస్త్రములకు సంబంధించినట్టి విద్యలను, సామాన్యవిద్యనుగూడ- అభివృద్ధిచేయు సంస్థలను స్థాపించుటయు పోషించుటయు నడిపించుటయును, మఱియు/లేదా, యట్టిసంస్థలకు ద్రవ్యసహాయముజేయుటయును, మానవోపయోగకరమయిన వృత్తులు పరిశ్రమలువ్యాపారములలో ప్రయోగాత్మకశిక్ష నిచ్చుటకు కావలసిన సంస్థలను, కర్మాగారములను వ్యవసాయక్షేత్రములను మొదలగువానిని స్థాపించి పోషించి, నడపించుటయును;

G రాధాస్వామీమతానుయాయుల లాభార్థమై, మానవులకును మానవజాతికుపయోగకరమయినజంతువులకును వైద్యసహాయముచేయుటయు నట్టి చికిత్సచేయు సంస్థలను స్థాపించి పోషించి నడిపించుటయు, మఱియు/లేక, అట్టిసంస్థలకు ద్రవ్యసహాయముచేయుటయును, జనసామాన్యముయొక్క ఆరోగ్యాభివృద్ధికవసరమయిన పద్ధతులనువిధానములను యోచించి యాచరణలో పెట్టుటయును;

H రాధాస్వామీమతానుయాయుల లాభార్థమై వృద్ధులకును, పేదలకును, రోగులకును, ఆర్తులకును, నిరుపేదలకును, వికలాంగులకును, బాధోపశమనముజేయుటయు, నట్టిబాధోపశామకసంస్థలను స్థాపించి పోషించి నడిపించుటయును, మఱియు/లేక, నట్టిసంస్థలకు ద్రవ్యసహాయముచేయుటయు, నట్టి యనాధులు బీదలు రోగులువగైరాల యార్థికస్థితిని చక్కబఱచుమార్గములను విధానముల నవలంబించుటయును;

వరా:- F. G H. ఆదర్శములలో నుద్దేశింపబడినలాభములను సభవారు తమయిష్టప్రకార మెప్పుడైనను ప్రజాసామాన్యమందఱకుగాని లేక ప్రజలలోనొక ప్రత్యేకవిభాగమునకుగాని చెందజేయుటకును, అట్లు చెందజేసిన లాభములను సభవారు తిరిగి తమయిష్టప్రకార మెప్పుడైనను తీసివేయుటకును లేక వానిలో మార్పులను చేయుటకును పూర్ణస్వాతంత్ర్యముగలిగియుందురు.

I. ప్రజాసామాన్యమునకుగాని, అందులోనొక విశిష్టభాగమునకుగాని, లాభదాయకమైన యితరచర్యలను సాగించుట;

J. వెనుకబడిన జాతుల నుద్ధరించుటకై తగువిధానములను యోచించుటయు నవలంబించుటయును;

K. మూఢవిశ్వాసములను, హానికరమగునాచారములను, సాంఘిక దోషములను నిర్మూలించుటకవసరమైనచర్యలను యోచించుటయు, తీసికొనుటయు;

L. ప్రజలలో నిరుద్యోగము లేకుండజేయుటకు తగిన చర్యలను యోచించుటయు నవలంబించుటయు;

M రాధాస్వామీదయాళునికి ఇంతకుముందు సమర్పితమైనట్టిగాని, ముందుసమర్పింపబడబోవునట్టిగాని చరస్థిరాస్తులను, రాధాస్వామీసత్సంగసభవారు సంపాదించునట్టిగాని, సభవారికర్పితమైనట్టిగాని, చరస్థిరాస్తులను, స్వాధీనము చేసికొని కాపాడి యభివృద్ధిజేయుటయు, మఱియు/లేక, వ్యాపారివిన్యస్తముజేయుటయు, పాలించుటయు, సభవారి యాదర్శముల సాధించుటకై వానిని వినియోగించుటయు;

N ఈపైకార్యములను జేయుటయు, పైయాదర్శముల ప్రాప్తికి సహకారియైనట్టిగాని, యానుషంగికమైనట్టిగాని కృత్యములను లేకవిషయములనన్నిటిని జరిగించుటయు, మతసంబంధమైనట్టియు, నాధ్యాత్మికసంబంధమైనట్టియు విషయములలో సభపక్షమునకు జెందినవారి హక్కులను అధికారములను శ్రేయస్కరవిషయములను గాపాడి, పోషించి పెంపొందించుట కవసరమైన విషయములను, కార్యములను, సాగించుటయు.

4. ప్రస్తుతము సభకు 155 సభ్యులును దానిపాలకవర్గమునకు (Governing Body) 68 సభ్యులును, దానికార్యనిర్వాహకవర్గమునకు 14 సభ్యులును గలరు,

సభయును, దానిపాలకవర్గమును సంవత్సరమునకు రెండుసారులును, అనగా ఏప్రిల్, డిసెంబరు నెలలలోను, దానికార్యనిర్వాహకవర్గము నెలకొకసారియును, కలిసికొనుచుందురు. సత్సంగసంఘీయులకు సంబంధించినట్టియు, సత్సంగాస్తులకు సత్సంగసంస్థలకును సంబంధించినట్టియు, వాని యాదాయవ్యయములకు, లెక్కలకు, లెక్కలపరిశీలనవ్యవహారాలకును సంబంధించినట్టియు,

ముఖ్యవిషయములనన్నిటిని,సభయును దానిపాలక కార్యనిర్వాహకవర్గములును వానియుపనిబంధనల ననుసరించి నిర్ణయించుచుందురు.

5. సత్సంగసంఘము దేశమునందంతట వ్యాపించియున్నది. ఈసంఘము బ్రాంచిసత్సంగములు, జిల్లాసంఘములు, ప్రాంతీయసంఘములనియు వర్గోపవర్గములుగ వ్యవస్థాపనజేయబడినది బ్రాంచిలు 586ను, జిల్లాసంఘములు 54ను, ప్రాంతీయసంఘములు 7ను గలవు.

6. సభ స్థాపించిన విద్యాసంస్థలన్నియు రాధాస్వామీవిద్యాసంస్థయొక్క మేనేజింగుకమిటీవారి యాజమాన్యమున పనిజేయుచున్నవి. దయాల్బాగులోని స్థిరాస్తియంతయు సభకును, రాధాస్వామీవిద్యాసంస్థయొక్క మేనేజింగుకమిటీకిని చెందియున్నది.

కాలనీలోని వసతిగృహములన్నియు సభయొక్క ద్రవ్యముతోగాని సత్సంగు లందుకొఱకై ప్రత్యేకముగనిచ్చిన ఛేంట్లసొమ్ముతోగాని కట్టించబడినవి. ఈరెండురకముల గృహములలోను సంపూర్ణస్వత్వాహక్కులు సభకే జెందియున్నవి. రెండవరకము గృహములలో నివసించుట కనుమతినొందిన సత్సంగులకు, సభకిష్టమున్నంతకాలముమాత్రమే యాయిండ్లలో నివసించుటకు హక్కుగలదు. వారలను 'లైసెన్సీలు' (Licensees) అనగా, అనుమతిగ్రహీతలని యందురు.

7. 'దయాల్‌భండార్' అనుపేరుతో సభవారొకసామాజికపాకశాలను పెట్టించిరి. బాహ్యస్థలములనుండి సత్సంగముకొఱకై దయాల్బాగు వచ్చినవారికి ఇచ్చట 7 రోజులుచితభోజన మీయబడును వారిచ్చట నుండినపుడు వారియుపయోగార్థ మితరవస్తువులను, అనగా మంచములు, బొల్చీలు, వగైరాలనుగూడ వారికి సరఫరాచేయుట కేర్పాట్లుగలవు

8. ఒక్కొక్క మొహల్లాకు కొందఱుపంచాయితీదారులును వారలకొక యధ్యక్షుడును చొప్పునగల మొహల్లాలపౌరవ్యవస్థకు శిఖరమున శిరోమణినగర కమిటీ యనునొక ప్రతినిధిసంఘము మీకాలనీలో కాపలాసంరక్షణల యేర్పాట్లను, రోడ్లు వీధులు మాపులను తుడిచి పరిశుభ్రముగనుంచుకార్యమును కాలనీనివాసులకు కావలసిన యితరసౌకర్యములను, కనిపెట్టుచుండును.

మఱుఁగుదొడ్లువగైరాలను పరిశుభ్రముగ నుంచుబాధ్యత 'శానుప రియాకమిటీ' వారిపై నున్నది. 343వ పుటలో నీకమిటీనిగుఱించి వివరణ మున్నది.

9. ఉత్తరప్రదేశప్రభుత్వమువారి జలవిద్యుచ్ఛక్తివిభాగము (Hydel Department) నుండి విద్యుచ్ఛక్తిని (Electricity) పొంది సభయొక్క 'ఎలక్ట్రిసిటీ అండు వాటరుసప్లైడిపార్టుమెంటు" వారు కాలనీనివాసులకును, సంస్థలకును విద్యుచ్ఛక్తిని సరఫరా చేయుచున్నారు. ఉదకమును బావులనుండి యంత్రములతో తోడి సరఫరా చేయుచున్నారు.

10. దయాల్బాగు మెడికల్ రిలీఫుసొసైటీవారు కాలనీలో రోగచికిత్సకు సంబంధించిన సంస్థలను పోషించుచున్నారు. వారొక 'అల్లోపతిక్' వైద్యశాలను, స్త్రీలకును పిల్లలకును ఒకహోమియోపతీవైద్యశాలను, యునానీవైద్యశాలను, ఒకఆయుర్వేదవైద్యశాలను స్థాపించి నడిపించుచున్నారు.

## ఉపదేశము

11. రాధాస్వామీమతములో జేరదలఁచుకొన్న ప్రతివ్యక్తియు (1) రాధాస్వామీమతసందేశ్ (2) రాధాస్వామీమతఉపదేశ్ (3) నిజఉపదేశ్ (4) సారఉపదేశ్ (5) జిజ్ఞాస (6) రాధాస్వామీమతదర్శన్ మొదలగు కొన్ని ప్రారంభిక గ్రంథములను చదివి యీమతముయొక్క మూలసిద్ధాంతముల నర్థముచేసికొని, యుపదేశనియమములను దెలిసికొనవలయును. మఱియు నతఁడు నియమముగ స్థానికసత్సంగమున కధమము 3 మాసములైనను వెళ్ళి సత్సంగము చేసికొనవలయును పిమ్మట నతని కుపదేశాసక్తి యున్నయెడల నతడొక నిర్ణీతమైన యచ్చుమీఁదిరిపత్రము (Printed Form) మీఁద నుపదేశమునకై యర్జీ పెట్టుకొనవలయును అతడు కొన్ని విహితనియమములను తాను పాటించెదనని వాగ్దానముగూడఁ జేయవలయును. ఆ విహితనియమములలో గొన్ని యీక్రింద పొందుపఱచబడినవి·

(a) తా నెట్టిమత్తుపదార్థముల నుపయోగించ ననియు;

(b) తా నెట్టిమాంసాహారమును (కోడిగ్రుడ్లు వగైరాలనుగూడ) తీసికొనననియు;

(c) తన న్యాయార్జితద్రవ్యముతోనే జీవించెదననియు;

(d) పరమపితయొక్క నిజనామము రాధాస్వామీ యని తాను నమ్ముదుననియు;

(e) పారమార్థికసాధనాపద్ధతులను తన యాంతర్యానుభవములను తానెవరికిని జెప్పకుండ రహస్యముగనుంచుదుననియు.

12 ఈ పైనియమముల కంగీకరించినపిదప సతనికి మొట్టమొదట నింద్రియ మనస్సులను వశము చేసికొని మనశ్శాంతిని, నిశ్చలతను, పొందగల్గుటకు సహాయకరములగు స్మరణధ్యానయుక్తుల నుపదేశము నొందుట కనుజ్ఞ యీయబడును. ఉపదేశార్థమైన ప్రార్థనల నంగీకరించుటలో జాతిమతవివక్షగాని, రూపవర్ణ వివక్షగాని యెంతమాత్రము చేయబడదు. అభ్యాసములో కొంత యభివృద్ధి నొందినపిదప సతసికి భజనాభ్యాసమునకు అనగా శబ్దాభ్యాసమున కర్హతయున్నట్లు తోచినయెడల, నూర్ధ్వలోకముల కాత్మ నారోహింపజేయుటకు సహాయకరమైన భజనాభ్యాసము నుపదేశము నొందుట కనుజ్ఞ నొసంగుదురు.

## సాధువులు, ఆశ్రితులు

13. రాధాస్వామీదయాళునికి తమసర్వస్వము నర్పించినందువలనగాని, తమ ప్రాపంచికబంధువులనందఱను పరిత్యజించినందువలనగాని, సభవారిపోషణలోనున్న సత్సంగులు ముత్త్రివిధములు : (1) సాధువులు (2) ఆశ్రితులు (3) యావజ్జీవభరణదారులు.

14. సభవారి కీ ముత్త్రివిధముల సత్సంగులసంఖ్యను పెరగనిచ్చుట యిష్టము లేదు ఏలనన పనిపాటలు లేకుండినచో నట్టివారు సోమరితనమున కలవడిపోవుదురు. అదియునుగాక దయాల్బాగులో జీతము నిచ్చి పనిచేయించుటకు సామాన్యముగ నేదో పని యెల్లపుడునుండుచునే యుండునుగావున, నట్టివారి కుద్యోగముల నిచ్చుటకు సావకాశమున్నది అంగవైకల్యముచేగాని వృద్ధాప్యముచేగాని పనిచేయుటకుశక్తిలేని నిరుపేదసత్సంగులకు దయాల్బాగునకు బయటనున్న వారికిగూడ, జీవనోపాధికి సహాయము చేయబడుచున్నది.

## సేవాతత్పరబృందము
(League of Service)

15 1927 సంగరము ప్రారంభములో రాధాస్వామీసత్సంగసభయొక్క కార్యనిర్వాహకవర్గము వారు,

(i) సామాన్యముగ మానవజాతికంతకును, అందులో ప్రధానముగ సత్సంగసంఘమునకు సేవార్థమై, యువకులలో నాత్మబలిదానసేవాభావముల నుత్పన్నముజేసి కర్తవ్యతాపరాయణతను వృద్ధిజేయునుద్దేశ్యముతోను,

(ii) రాధాస్వామీసత్సంగసభయొక్క ధార్మికపారమార్థికాదర్శములను సాధించుటలో తోడ్పడసమర్థత గలిగినట్టియు, పారమార్థిక నైతిక, సాంకేతిక, పారిశ్రామిక మానసిక విద్యాసంస్థలను, జంతుమానవుల వైద్యచికిత్సాసంస్థలను, మానవజాతి కారోగ్యసంరక్షక సంస్థలను నిరుద్యోగిసహాయకసంస్థలను స్థాపించి పోషించుటలో తోడ్పడగలిగినట్టియు, యువతీయువకులను కావలసినంతమందిని, రాధాస్వామీసత్సంగసభకును దానిసంస్థలకును లభ్యమగునట్లు చేయునుద్దేశ్యముతోను,

యావజ్జీవముగాని, కొంత నిర్ణీతసంఖ్యగల సంవత్సరముల కాలముగాని నిబంధనారహితముగ సేవజేయుటకు సంసిద్ధులైన సత్సంగిసోదరీసోదరులతో నొక క్రొత్తవ్యవస్థ నేర్పాటుచేయుట యావశ్యకమని గమనించిరి. ఆప్రకారము, 1927 జూలై 1వ తేదీనుండి పనిచేయుటకై దయాల్బాగులో సేవాతత్పరబృందము (League of Service) అను పేరుతో నొకసంఘము నేర్పాటుచేసి దానిలో సత్సంగిసోదరులను చాలమందిని బృందసభ్యులుగ జేర్చుకొనిరి.

16. ఈబృందముయొక్క క్రియాకలాపమును, కార్యక్షేత్రమును పెరిగిపోవుచుండుటచే దీనిని సొసైటీస్ రిజిస్ట్రేషనుఆక్టు (Societies Registration Act) అను 1860 సం॥రపు 21వ చట్టప్రకారము 11-11-1946 తేదీన రిజిష్టరు చేయించిరి.

17. ఈ సంఘనిబంధనలప్రకార మీసంఘములో జేరగోరు ప్రతివ్యక్తియు నట్లుజేర్చుకొనబడుటకుముందు క్రిందిశపథములను దీసికొనవలసియున్నది:

(a) తాను తన యావజ్జీవము హృదయపూర్వకముగను న్యాయముగను రాధాస్వామీమతసిద్ధాంతములప్రకార మాచరించుచుందుననియు;

(b) తనశక్తివంచన లేకుండ శరీరమనోధనముల నర్పించి ప్రతిఫలమును గోరకుండ నేషరతులును లేకుండ రాధాస్వామీసత్సంగసభకు సేవ చేయుదుననియు;

(c) తా నీ సంఘములో సభ్యుడుగ నున్నంతకాలము తన కొప్పజెప్పిన కర్తవ్యములకు సంబంధించినంతవఱకు, తన పైయధికారుల యాజ్ఞలను నిరాక్షేపణగ మన్నించుచుందుననియు;

(d) తా నథమము 15 యేండ్లైన నీసంఘసభ్యుడుగనుండి యీసంఘ నిబంధనలకుబద్ధుడై ప్రవర్తించుదుననియు;

(e) తన కిచ్చెడు భరణము చాలదనిగాని, తన కుటుంబావసరముల కొఱకనిగాని, తనకు శ్రమగల్గుచున్నదనిగాని జెప్పి తానీసంఘసభ్యతనుండి నిర్ణీతావధికిముందు విరమించుకొనననియు,

(f) తానీ సేవజేయుటకు తగినట్లు తన శరీరమనముల నారోగ్యముగను, పరిశుభ్రముగను ఉంచుకొందుననియు;

(g) తాను స్వయముగ దయాల్బాగువస్తువుల నుపయోగించుచు తన యాచరణచే నితరులనుగూడ నట్లుజేయుటకు యథాశక్తిగ ప్రోత్సహించుచుందుననియు;

(h) సత్సంగి సేవకు తా నుపయోగపడగలందులకై, విద్యా, కళా, పరిశ్రమ, వృత్తివ్యాపారశాఖలలో నెద్దానిలోనైన ప్రవీణతనొందుటకు తన శక్తికొలది ప్రయత్నము చేయుదుననియు;

(i) తా నొక యాదర్శసత్సంగిజీవితము గడుపుచు నన్నివిషయములలో సత్యమును బల్కుదుననియు.

18. సభాధ్యక్షులే యీసంఘమునకుగూడ నధ్యక్షులు. అయిదుగు రెన్నిక సభ్యులుగల కార్యనిర్వాహకసమితి యొకటి (Managing committee) దీని సామాన్య కార్యములను నిర్వహించుచుండును. ఈ సమితిసభ్యు లయిదుగురిలో నొకరు కార్యదర్శిగను, ఒకరు సహాయకార్యదర్శిగను పనిచేయుదురు. ఈబృందములో జేర్చుకొనుట, ప్రమోషనులనిచ్చుట యిందుండి తొలగించుట, ఇందుండి విరమించుకొనుట మొదలగుప్రధానవిషయముల నాచరణలో బెట్టుటకు ముందు ఈబృందముయొక్క యుత్తరవును, దీనియధ్యక్షునియామోదమును పొందవలసియుండును.

19. సభవారిచే నీబృందసభ్యులను సంతుష్టులుగను సంతృప్తులుగను ఉంచుటకు తగిన యేర్పాట్లు చేయబడినవి.

20. ఈసంఘమునకు ప్రస్తుతము 18 సభ్యులుగలరు. అందులో 15 సాధారణసభ్యులును, ముగ్గురుగౌరవసభ్యులు నైయున్నారు. వీరిలో నొకరు బయట పనిజేయుచున్నారు, 17 మంది దయాలాల్బాగులో నున్నారు.

## (B) విద్యావిధానము

## రాధాస్వామీ విద్యాసంస్థ

## (Radhhasoami Educational Institute)

21. రాధాస్వామీ మతముయొక్క పూజనీయపూర్వసద్గురువుల యుద్దేశముల ననుసరించి, రాధాస్వామీసత్సంగసభవారిచే రాధాస్వామీ విద్యాసంస్థ స్థాపించబడెను. బాలబాలికలయొక్క నైతిక, మానసిక, పారమార్థికవిద్యాభ్యాసమును ఉత్తమపద్ధతి నేర్పాటుచేసి భగవంతునియెడల భయభక్తులుగలిగి న్యాయసమ్మతముగ ప్రవర్తించునట్టియు, పాటుపడి పనిచేయునట్టియు కార్యదక్షులయిన పురుషులను తయారుచేయుటయే సభవారి యుద్దేశ్యము.

22 అందుచే 1915 సం॥రము ప్రారంభములో కొద్ది వసతిగృహము లను కట్టించిపిమ్మట నొకపాఠశాలాభవనమును నిర్మించుట ప్రారంభించి, 1-1-1917 తేదీన రాధాస్వామీవిద్యాసంస్థను మధ్యమతరగతివఱకును తరగతులనుబెట్టి తెఱచిరి. ఈసంస్థలో పనిచేయఁ గోరినవారినుండి బహు విచక్షణజేసి యుత్తమ యోగ్యతలు గలవారినెన్నుకొనిరి. ఈసంస్థయొక్క కార్యభారమంతయు విద్యాపరిజ్ఞానసంపన్నులైన సప్తసభ్యులుగల యొక కార్యనిర్వాహకవర్గమునకు (Managing Committee) ఒప్పజెప్పబడెను. ఈవర్గము 1917 సం॥రము అక్టోబరునెలలో, 1860 సం॥రపు 21వ చట్టప్రకారము రిజిష్టరు కాబడి, అప్పటినుండియు పూర్ణదీక్షతో తన కార్యక్రమమును సాగించుకొనుచుండెను

23. ప్రస్తుత మీసంస్థకార్యనిర్వాహకవర్గమునకు సభ్యులు మొత్తము 14. అందులో నొకరు అధ్యక్షులును, ఒకరు కార్యదర్శియు నైయున్నారు.

24 ఈసంస్థ నామోదించవలసినదిగ దీని కార్యనిర్వాహకవర్గమువారు పెట్టినదరఖాస్తుపైన దీనిని చూచుటకువచ్చిన స్కూళ్ళయిన్ స్పెక్టరు మాన్ దొర

గారు (Mr. Moss) 24-7-1917 తేదీన 'లాగ్'బుక్కులో నీక్రిందివిధముగ తమయభిప్రాయమును వ్రాసిరి-

"ప్రభుత్వమువారి యామోదమునకై దరఖాస్తుపెట్టుటకుపూర్వము 'అడుగుటకుపూర్వ మర్హుడవు గమ్ము'ను నాంగ్లలోకోక్తిసిద్ధాంతము నీపాఠశాలకన్న నెక్కువకచ్చితముగ నాచరించినపాఠశాల మఱొకటిలేదని నాయభిప్రాయము."

25. ప్రభుత్వవిద్యావిభాగమువా రందుచే నీసంస్థను త్వరలోనే యామోదించి, మఱుసటిసంవత్సరమునుండియే యున్నతపాఠశాలతరగతులను గూడ నీసంస్థలో తెఱచుట కంగీకరించిరి. ఈసంస్థలో చదివిన మొట్టమొదటి విద్యార్థిగణము పదునెనమండ్రును 1919 సం॥రము మార్చి నెలలో హైస్కూలు పరీక్షకు వెళ్ళి, అందులో 17 ఉత్తీర్ణులైరి ఈవార్త తెలిసి యీసంస్థలో పని జేయునుపాధ్యాయబృందమును, సంఘమందఱునుగూడ నానందభరితులైరి. ఈసంస్థ యెట్టియుత్తమబుద్ధిమత్త్వముతోగూడిన పద్ధతులపై స్థాపించబడెనో యందఱుకునపుడు తేటపడెను. ఈసంస్థ అప్పటినుండియు నొకేతీరున దానియుత్తమత్వప్రఖ్యాతిని నిలుపుకొనుచుండుట యొక గొప్పసంతృప్తికరమైన విషయము. ఈసంస్థలోని విద్యార్థుల ప్రభుత్వపరీక్షాఫలితము లెల్లపుడును ప్రశంసనీయమగు నధికశాతములలోనే యుండుచున్నవి.

26. అప్పటినుండియు నీసంస్థ యెట్లభివృద్ధిచెందుచుండెనో, దీని కెన్నడు నాశించని వైపులనుండి సకాలమున సహాయమెట్లు గలుగుచుండెనో, యీవిషయములన్నియు పై 215-216 పుటలలో నిదివఱకే వివరించితిమి. ప్రభుత్వము రు 16000/-లను వెచ్చించి యీసంస్థకొఱకు 208 యకరముల భూమిని సంపాదించిపెట్టిరి. దయాల్బాగునకు వచ్చెడి రోడ్డును ప్రాంతీయప్రభుత్వపురోడ్లలో గలిపి పక్కారోడ్డుగా చేయుటకుగూడ ప్రభుత్వమువా రేర్పాటుచేసిరి. ఇంతియగాక, ప్రభుత్వమువారు మన క్రొత్తప్రయోగశాలలుమొదలైనవాని కవసరమైన సామగ్రిని కొనుగోలుచేసికొనునిమిత్తము రు 53000/-లను అనావర్తిప్రదానముగ (Non-recurring Grant) నిచ్చిరి సభయును సత్సంగసంఘమునుగూడ నందుకుతగినయౌదార్యముతోఁ బ్రవర్తించి, యీసంస్థకొఱ కొక లక్షరూప్యములను శాశ్వతనిధిగ ప్రోఁగుజేసి, రమారమి రు. 400,000/- లను వెచ్చించి యీసంస్థాభవనమునకు రెండవయంతస్తును ఉపాధ్యాయుల వసతి గృహములను హాస్టళ్ళను (Hostels) కట్టించిరి.

27. 1940వ సం॥రములో శిశువిద్యాబోధనపద్ధతుల (Kindergarteu methods) ననుసరించి చిన్నపిల్లలకు విద్యాభ్యాసమున కేర్పాట్లుచేసి యొక బాలవిహారకేంద్రమునుగూడ స్థాపించిరి. 1958 సం॥రములో నొకశిశువిహార పాఠశాలను (Nursery school) గూడ స్థాపించిరి. సామాన్యపాఠశాలలకు పోదగ్గవయస్సులేని చిన్నపిల్లల క్రీడుచోట్లను మనస్సునాకర్షించు నాటల మూలముగ విద్యాభ్యాసము గఱుపుచుందురు.

28. 1922 సం॥రమునాటికి రాధాస్వామీవిద్యాసంస్థ (Radhasoamı Educatıonal Instıtute) మగపిల్లల యింటర్మీడియట్ కళాశాలగ పెరిగి, 1947వ సం॥రములో డిగ్రీకళాశాలగజేయబడి బి.కామ్. (B. Com ) డిగ్రీనిమిత్త మాగ్రావిశ్వవిద్యాలయమునకు జేర్చబడెను. 1957 సం॥రములో మగవిద్యార్థులకు బి.టి. తరగతులను (B T Classes) గూడ నందులోబెట్టిరి 1952 సం॥రము జూలైనెలలో యల్ యల్.బి. డిగ్రీ (L. L B. Degree) తరగతులను తెఱచిరిగాని. 1958వ సం॥రముజూలైనెలనుండి వానిని తాత్కాలికముగ నాపుజేసిరి. 1953వ సం॥రముజూలైనెలలో విజ్ఞానశాస్త్రములో బి.యస్ సి. డిగ్రీ (B Sc Degree) తరగతులను బెట్టి వ్యవసాయశాస్త్రములో, నింటర్మీడియట్తరగతివఱకు విద్యజెప్పుట ప్రారంభించి బి.యస్.సి. క్లాసులనుగూడ తెఱచుటకు విశ్వవిద్యాలయము వారి యనుమతినిబొందిరి.

## బాలికా విద్యాసంస్థలు

29 ప్రేమవిద్యాలయమనుపేరుతో బాలికల కొరక ప్రత్యేకపాఠశాలను 1930 సం॥రములోస్థాపించి రని యిదివఱలో 216వ పుటలో చెప్పుటయైనది. దీనిని 1939వసం॥రములో నింటర్మీడియట్కళాశాలగమార్చి, 1941వసం॥రములో నిందులో బి ఏ. తరగతులను తెఱచిరి

30 1947 సం॥రములో నాగ్రావిశ్వవిద్యాలయమువారి బి టి, డిగ్రీపరీక్షకు స్త్రీవిద్యార్థినులకును చదువుజెప్పి సిద్ధముజేయుటకై యొక స్త్రీలబోధనాభ్యాసన కళాశాలను (Women's Traınıng College) స్థాపించి, ప్రేమవిద్యాలయము నుండి బి ఏ.తరగతులను తీసి యిందులోనికి మార్చిరి. పిమ్మట 1951 సం॥రములో నీకళాశాలను బి ఏ డిగ్రీనిమిత్తముగూడ నాగ్రావిశ్వవిద్యాలయమునకు జేర్చిరి 1958 సం॥రముజూలైనెలలో నాగ్రావిశ్వవిద్యాలయమువారి ఎమ్.ఎడ్

(M. Ed. Degree) డిగ్రీ తరగతులను గూడ నీకళాశాలలో ప్రారంభించిరి. ఉత్తరప్రదేశపశ్చిమప్రాంతమున ప్రత్యేకముగ స్త్రీవిద్యార్థినులకు బోధన విద్యలో నుత్తమపార్యక్రమములను నెర్పించుకళాశాల యిదియొక్కటే.

## సాంకేతిక సంస్థలు
(Technical Institutions)

31. పైన 216-217 పుటలలో జెప్పినట్లు, ఎలట్రికల్ ఇంజనీరింగు, మెకానికల్ ఇంజనీరింగుశాఖలలో స్టేట్ బోర్డ్ ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషను వారి డిప్లొమాపరీక్షలకును, ఆటోమొబైలుఇంజనీరింగులో ఇండస్ట్రీస్ డిపార్టుమెంటు వారి సర్టిఫికేటుపరీక్షకును, టెక్నికల్ కళాశాలలో (Technical College) పిల్లలకు శిక్షణగఅపుదురు.

తోలుపనిపారశాల (Leather Working School) యొకరెండంతస్తులమేడలోనుండి, చర్మకళాశాస్త్రములోను (Leather Technology) జోళ్ళుతయారుచేయుటలోను శిక్షనిచ్చునట్టి రెండుసంవత్సరముల పార్యక్రమమును గల్గియున్నది.

32. 1948 సం॥రములో భారతదేశపు ప్రభుత్వమువారు ఇంజనీరింగు కాలేజీ స్థాపించుటకు ఒకపథకము నామోదించిరి. దానిప్రకారము ఇంజనీరింగు కళాశాల 1950 సం॥రముజూలైనెలలో స్థాపించబడినది. ఈకళాశాల, మెకానికల్, ఎలక్ట్రికల్ ఇంజనీరింగుశాఖలలో బి యస్.సి. డిగ్రీనిమిత్తము ఆగ్రావిశ్వవిద్యాలయమునకు జేర్చబడినది. 1952 సం॥రము జూలైనెలలో నీ కళాశాలను ప్రత్యేకముగ దానినిమిత్తమై కట్టించబడిన నొకక్రొత్తభవనములోనికి మార్చిరి ఈకళాశాలకు జేరియున్న హాస్టలులో నందరివిద్యార్థులందఱు నుండుటకు కావలసినన్ని గదులున్నవి. ఈకళాశాలయొక్క కర్మాగారములును, ప్రయోగశాలలును ప్రశస్తమైన ప్రయోగాత్మకశిక్షను గఱపుటకవసరమైన సంపూర్ణసాధనసామగ్రితో నమర్చబడియున్నవి. ఈకళాశాలలో పరీక్షాఫలితములు చాలయుత్తమముగ నుండుచున్నవి ఇందులో నేర్పబడుచున్నట్టి సమర్థప్రయోగాత్మకశిక్షకును ఉత్తమవిద్యాభ్యాసమునకును ఈకళాశాల గొప్ప ప్రఖ్యాతిగాంచెను,

33. కావున దయాల్బాగులో సాంకేతిక, విజ్ఞాన, వాణిజ్యశాస్త్రములలోను, బోధనాభ్యసనములోను, ఇంజనీరింగులోను, డిగ్రీతరహావఱకును, బోధనాభ్యసనములో పోస్టుగ్రాడ్యుయేట్ తరహావఱకును ఉన్నతతరగతివిద్యను గఱపుట కేర్పాట్లును, మెకానికల్ ఎలక్ట్రికల్ ఇంజనీరింగుశాఖలలోను, తోలుపని

లోను, డిప్లొమాపాఠ్యక్రమమువఱకును, ఆటోమొబైల్ ఇంజనీరింగులో సర్టిఫికేట్ పాఠ్యక్రమమువఱకును తగుశిక్ష నిచ్చునేర్పాట్లును గలవు. ఈకోజువఱకీసంస్థలలో ప్రతిసంవత్సరముజేరు విద్యార్థులసంఖ్యయొక్కయు ఈసంస్థల సాలుసరి ఖర్చులయొక్కయు వివరము లీక్రిందిపట్టీలో కనబడును :—

| సంవత్సరము | విద్యార్థులు | మొత్తము వ్యయము |
|---|---|---|
| 1947—48 | 1286 | రు. 2,18.210 |
| 1948—49 | 1343 | రు. 2,73,950 |
| 1949—50 | 1346 | 2 94,887 |
| 1950—51 | 1405 | 3,75.750 |
| 1951—52 | 1524 | 4 30,870 |
| 1952—53 | 1670 | 4 66,029 |
| 1953—54 | 1804 | 4,93,751 |
| 1954—55 | 1968 | 5,32,939 |
| 1955—56 | 2099 | 5,43,024 |
| 1956—57 | 2066 | 5,67,136 |
| 1957—58 | 1995 | 5.87,430 |
| 1958—59 | 2213 | 6,03 065 |
| 1959—60 | 2306 | 6,26,413 |
| 1960—61 | 2261 | 6 96,641 |
| 1961—62 | 2312 | 7 33,778 |

## దయాల్బాగునకు బాహ్యముననున్న సంస్థలు

34 దయాల్బాగులోనున్న యీపైసంస్థలుగాక, నీసంఘమునకు కొన్ని యితరసంస్థలు దేశములో వివిధప్రాంతములలోగూడ నున్నవి. మధ్యప్రదేశములో హోషంగాబాద్ జిల్లాలో తిమర్నీవద్దనున్న హైయర్ సెకడంరీస్కూలు (Higher Secondary School) సంతృప్తికరముగనే యభివృద్ధినొందుచున్నది. ఆపాఠశాలలోని పిల్లలు తిన్నగ బి.ఏ.తరగతిలోజేరి చదువుకొనుట కవకాశము గలుగజేయుటకై దీనిలో ప్రీయూనివర్సిటీ (Pre-University) పరీక్ష కొక క్రొత్తతరగతినిగూడ ప్రారంభించిరి. మధ్యప్రదేశములోని యాదిమనివాసుల సంతతికి విద్యగఱపుటకై రాజబరారీయెస్టేటులో నాలుగు ప్రాథమికపాఠశాలలుగూడ గలవు. ప్రాంతీయరాధాస్వామీసత్సంగసంఘములనుగూడ తమ తమప్రాంతములలో విద్యాసంస్థలను ప్రారంభింపవలయునని ప్రోత్సహించిరి. అందుకుఫలితముగ, దక్షిణదేశములో పాలంకోట, కాకినాడ, విజయవాడ

లలోను, బీహారుప్రాంతమున మెహసీ, జమాల్‌పూరు, దర్భంగాలలోను ప్రాథమికపాఠశాలలను ప్రారంభించిరి.

35 రాధాస్వామీసంఘ మెల్లపుడును నియమముగ స్వప్రయత్నము మీదను స్వశక్తిమీదనే యాధారపడి తనకార్యములను నెఱవేర్చుకొనుచున్నది. అందుచే నీసంఘము తనసంస్థలప్రాపునకుగాని మఱెందులకుగాని సత్సంగేతరులవద్ద నెన్నడు నొక్కపైసకూడ చందాక్రిందగాని, ధర్మముక్రిందగాని పుచ్చుకొనలేదు. అయినను, సత్సంగసంఘములో బాలబాలికలకు దయాల్బాగ్ విద్యాసంస్థలలో, నితరులకులేని ప్రత్యేకహక్కులుగాని. ప్రత్యేకసదుపాయములుగాని యేమియులేవు. దయాల్బాగులోగాని బయటగాని యీసంఘముచే నడిపించబడు విద్యాసంస్థలలో జేరిచదువుకొనుటకు జాతి, మత, వర్ణవివక్షలేకుండ నందఱకును సమానమయిన సావకాశములే గలవు. ఈవిషయము మావిద్యాసంస్థలనుగుఱించిన ఈక్రిందివివరణమునుబట్టి ధ్రువపడగలదు.

| | 1959—60 | | | 1960—61 | | | 1961—62 | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| కళాశాల | విద్యార్థుల సంఖ్య | సత్సంగి విద్యార్థులు | సత్సంగేతర విద్యార్థుల శాతము | విద్యార్థుల సంఖ్య | సత్సంగి విద్యార్థులు | సత్సంగేతర విద్యార్థుల శాతము | విద్యార్థుల సంఖ్య | సత్సంగి విద్యార్థులు | సత్సంగేతర విద్యార్థుల శాతము |
| W. T. College స్త్రీ బోధనాభ్యసన కళాశాల | 177 | 36 | 79 60 | 209 | 59 | 71 77 | 203 | 36 | 82·26 |
| R.E I College రాధాస్వామీ విద్యా సంస్థకళాశాల | 584 | 89 | 84 42 | 530 | 84 | 84 74 | 620 | 102 | 83 55 |
| Engg. College ఇంజినీరింగు కళాశాల | 230 | 30 | 86 96 | 201 | 26 | 87·06 | 214 | 23 | 88·79 |
| Technical College సాంకేతిక కళాశాల | 295 | 62 | 78 98 | 289 | 27 | 90 65 | 233 | 26 | 88 84 |
| మొత్తము | 1286 | 217 | 82 49% | 1229 | 189 | 83 55% | 1270 | 187 | 85 36% |

36 రాధాస్వామీవిద్యా సంస్థయొక్క కార్యనిర్వాహకవర్గమువారికి దయాల్బాగులో 241 యకరముల భూమి యున్నది. అదిగాక వివిధకళాశాలల నిమిత్తమైన హాస్టలులును (Hostels) ఉపాధ్యాయులనిమిత్తము 8 వసతి గృహములును విద్యార్థులకొఱకును వారిసంరక్షకులకొఱకును చాలయిండ్లును గూడ, మేనేజింగుకమిటీవారికి గలవు. మిగతయుపాధ్యాయులకు రాధాస్వామీ సత్సంగసభవారుకూడ వసతుల నేర్పాటు చేయుచుందురు.

## (C) పారిశ్రామికప్రణాళిక

37. పరమపురుషపూరన్‌ధనీ స్వామీజీమహారాజువారు 1861వ సం॥ రము వసంతపంచమీనాడుదినమున రాధాస్వామీసత్సంగమును స్థాపించినందు వలన నొకక్రొత్తమతమేగాకుండ నొకక్రొత్తజీవనవిధానముగూడ నుత్పన్న మాయెను. కఠినతపస్సావైరాగ్యములుగల జీవితమును గడపవలసినదిగ నాదేశించునట్టిమతములవారు యాచనచే పొట్టపోసికొనుచు తఱచుగ సోమరి తనములోనికి దిగిపోవుచుండిరి. వీలనన నింతకన్న నుత్తమజీవనవిధానమును ప్రోత్సహించునట్టి యాదర్శములు ఆమతములలోలేవు. అందుచే మొదటినుం డియు రాధాస్వామీమతపూజనీయసద్గురువు లాధ్యాత్మికాభివృద్ధికి న్యాయార్జి తనుచే జీవించుట యత్యావశ్యకమనియు, నీపృథ్వీజీవితములో కేవలవిషయ లంపటత్వమునుగాక, కేవలకర్మపరిత్యాగమునుగాక, మధ్యమతరగతికిజెందిన "యుత్తమరీతిప్రాపంచిక జీవనము" (Better Worldliness) మానవునికి జీవి తాదర్శమై యుండవలెననెడి యీరెండు నీతిసూత్రముల నెక్కువగనొక్కి చెప్పుచుండిరి

38. ఈ యుత్తమనియమముల నాచరణలోఁబెట్టునిమిత్తమును, వివేక వంతమైనజీవితవిధానమునకు సాంఘికజీవన మొకప్రధానాంగము కావునను, మహారాజ్‌సాహబ్‌వారికాలములో నప్పుడుసత్సంగకేంద్రముగనున్న అలహా బాదులో నొకస్టోరును బెట్టించిరి. ఒకబట్టలనేఁతమిల్లును స్థాపించునిమిత్తమై పరిమితబాధ్యతతో నొకజాయింటుస్టాకుకంపెనీని (Joint Stock Company) ప్రారంభించువిషయమునుగుఱించి గొంతచర్చగూడ చేసి, దానికపేరుపట్టీని గూడ నప్పటిలో తయారుచేసిరి. మహారాజసాహబ్‌వారి యారోగ్యము క్షీణించియుండుటచేతను, పిమ్మట వారు త్వరలోనే నిర్యాణమైనందు నను ఆప్రయత్నములు అప్పుడు కొనసాగలేదు

39. సర్కార్ సాహబ్ వారి దీర్ఘానారోగ్యహేతువుచే వారికాలములో గూడ పైనజెప్పినపథకము లెవ్వియు ఫలించలేదు. కాని 1913 డిశంబరునెలలో సాహబ్జీమహారాజువారు సద్గురుపదవి నలంకరించినతోడనే వారీకార్యమువిషయములో పూర్ణశ్రద్ధవహించిరి. 1914 సంllరములో నిందుకు పథకముల నేర్పాటుజేసి వానియుపక్రమవిధానమునునిశ్చయించిరి. అందుచే 1915 సంllరము జనవరి 20వ తేదీ వసంతపంచమీనాడుదినమున రాధాస్వామీసత్సంగ కేంద్రస్థానముగ దయాల్బాగుకాలనీని స్థాపించుట సాధ్యమాయెను.

## పారిశ్రామిక సంస్థలను స్థాపించుట

40. కాలనీయొక్క స్థూలజీవనము, విద్యాభ్యాసము పరిశ్రమలుననెడి జంటపలకలమీద నాధారపడియున్నది. 206-207 పుటలలో నిదివఱలోనే జెప్పినట్లు, రాధాస్వామీ విద్యాసంస్థయు, నాదర్శపారిశ్రామికసంస్థలును (Model Industries)1917వ సంllరములోనే స్థాపించబడినవి.

**1917-19.** దీని కర్మాగారములో మొట్టమొదట నుత్పాదితమయిన వస్తువు, తోలుబొత్తాములు. 1914-18 సంllరములనాటి మహాయుద్ధములో రక్షకదళములకు తోలుబొత్తాములు చాలయెక్కువగ కావలసిరాగా, ఆదర్శ పారిశ్రామికసంస్థ లాబొత్తాములను సరఫరాచేసి అందుమూలమున కొంతలాభమును సంపాదించెను. 1919వ సంllరములో, రిలీఫ్నిబ్బులు, భౌతికశాస్త్రసంబంధమయిన తక్కెడలు, త్రాసులు మొదలగు లోహపు సరుకులను తయారుచేయుటకు తగిన యెన్నియో యంత్రములను ఖరీదుచేసిరి బూట్లను, జోళ్ళను తయారుచేయుట కరడజను కార్మికులతో నొక యంత్రాగారము గూడ (Factory నదేసంవత్సరములో ప్రారంభించిరి.

**1919 22** పలురకములగడియలను. చేతిసంకెళ్ళను, హేండ్ బ్యాగులకును సూట్ కేసులకును తాళపుకప్పలను, గుడిదెలను (Hinges) చేయుట మొదలుపెట్టిరి.

**1923-25** ఈ సంవత్సరములలో చాలపాటుపడి ప్రయత్నములు చేయగా, చివరకు ఇత్తడిలాంతర్లు, శస్త్రచికిత్సాసాధనములు, కత్తులు, కటారులు మొదలగువస్తువులను జయప్రదముగ తయారుచేయగల్గిరి, మొదటలో

ఎలక్ట్రిక్ టేబిలుపంఖాలను సీలింగ్ పంఖాలను తయారుచేయుట మొదలుపెట్టిరి. ఆతరువాత ఎలక్ట్రిక్ పచనపాత్రములను, కుంపట్లను, హీటర్లను (Heaters) టేబిల్ లేంపులను, పెనములను, నైటుసార్ దీపములను (Night Star Lamps) కూడ తయారుచేయనారంభించిరి

**1926.** ఆదర్శపారిశ్రామిక సంస్థలలో (Model Industries) మరొక విభాగమును అనగా బట్టలనేతయంత్రాగారమును (Textile Factory) 6 చేతిమగ్గములతో ప్రారంభించిరి. కాలక్రమేణ, చేమగ్గములను మరికొన్నింటిని, పవర్ మగ్గములనుకొన్నింటిని యింకనుచేర్చిరి. 1944 సంవత్సరములో నీ విభాగమునకు 89 పవర్ మగ్గములును, 40 చేమగ్గములును, కొత్తలప్రకారము బట్టలను పూర్తిచేయు యంత్ర మొకటియు, నొకచిన్న పూలుపనిచేయు యంత్రమును ఉండెను ఈవిభాగములో సంవత్సరమునకు 3½లక్షలరూప్యములు విలువగల వస్త్రోత్పాదన చేయబడుచుండెను.

1928సం॥రములో నల్పపరిమాణములో నొకక్షీరశాలను (Dairy) ప్రారంభించి, తరువాత 1931-'32 సం॥రములో దాని నాధునికనవీనయంత్రములతో నమర్చి యభివృద్ధిజేసి మరొక పెద్దశోభాయమానభవనమునకు మార్చిరి.

**1927-1932.** ఇంతవఱకును తోలుపనియంత్రాగారములో (Leather Goods Factory) పనినంతను కార్మికులు చేతులతోనే చేయుచుండిరి కాని యిపుడందులో ప్రప్రథమముగ ననేకయంత్రములను దెప్పించి యమర్చిరి.

ఈకాలములోనే వెండిగొలుసులను, ఫౌంటెన్ పెన్ కలములను, (Fountain Pens) గ్రామఫోనులను (Gramophnes) కూడ తయారుచేయుట మొదలిడిరి.

దయాల్బాగులోని సంస్థలకును వ్యక్తులకునుగూడ డబ్బులావాదేవీలు జరుపుకొనుటలో సౌకర్యము గలుగజేయునిమిత్తమై 1929 సం॥రములో 'రాధాస్వామీజనరల్ అండ్ అస్యూరెన్సుబ్యాంకు, లిమిటెడ్' అనునొకబ్యాంకును పబ్లిక్ లిమిటెడ్ కంపెనీగా (Public Limited Company) ప్రారంభించిరి 1937 సం॥రములో 'రాధాస్వామీ బ్యాంకు, లిమిటెడ్' (Radhasoami Bank Limited) అని దానిపేరును మార్చిరి.

**1933-1935.** జోళ్ళఫ్యాక్టరీలో సకలవిధములయిన జోళ్ళను తయారుచేయుట మొదలుపెట్టినందున తోలుఅవసరము క్రమక్రమముగ చాలపెరిగి

పోవుచుండుటచే, ఆయవసరము నెదుర్కొనుటకై చిన్నపరిమాణముగల ప్రయోగార్థమైన యంత్రసముదాయముతో క్రోము లెదరును తయారుచేయుట మొదలిడిరి. పరీక్షార్థమైన ప్రారంభిక ప్రయోగములు జయప్రదముగ సాగుటచే సభవారు క్రోము టేనరీ నభివృద్ధిచేయుటయేగాక 1935 సం॥రములో జగత్ప్రఖ్యాతమైన తాజ్‌మహల్‌కు దగ్గఱగనున్న, చెట్లపట్టతో తోలును పదును చేయునటి మఱొక టేన్నరీనిగూడ క్రయమునకు దీసికొనిరి. క్రోము టేనరీ కింతవఱకు 3 లక్షల రూప్యములను పెట్టుబడిపెట్టి, అందులో రోజునకు 200 చర్మములను పదునుచేయుట కేర్పాట్లుచేసిరి. తాజ్ టేన్నరీ కింతవఱకు 4 లక్షలరూప్యములు పెట్టుబడిపెట్టిరి. అందులోగూడ రోజునకు 200 చర్మములను నానవేయుట కేర్పాట్లున్నవి.

**1936-1937.** తలనూనెలు, అంగరాగద్రవ్యములు, బట్టలసబ్బులుగూడ చేయుట ప్రారంభించిరి.

ఈకాలములో నాదర్శపారిశ్రామికసంస్థలవారు (Model Industries) ఇనుపసామానుపరిశ్రమల నభివృద్ధిజేసి పవర్‌మగ్గములు, తూనికయంత్రములు, బంగారాదుంపలకు తొక్కల నొలుచునట్టి యంత్రములు, దూలును శుభ్రము చేయుయంత్రములు జోడుత్రాళ్ళుచేయు యంత్రములు మొదలగు చిన్నచిన్న యంత్రములను చేయుట మొదలుపెట్టిరి.

విజ్ఞానశాస్త్రసాధనముల శాఖవారు (The Scientific Instruments Branch) కూడ చాలనున్నితమయిన త్రాసులను (రసాయనశాస్త్రప్రయోగముల కుపయోగించెడిరకమును, పరిశోధనార్థమైన ప్రయోగముల కుపయోగించెడిరకమునుగూడ) చేయుట మొదలుపెట్టి యెన్నియోరోగచికిత్సోపకరణములను, ఎలక్ట్రిక్ గడియారములను, పాఠశాలలకును కళాశాలలకు నుపకరించు జంతుశరీరప్రతిరూపములను, వివరణపటములను తయారుచేసిరి. ఇంతియగాక నీశాఖవారు రెండవప్రపంచమహాయుద్ధములో స్టెరిలయిజర్లను, (Sterilizers) స్పిరిటులాంపులను, బ్లోపైపులను (Blow Pipes) స్టోవులను, (ఎలక్ట్రిక్ కుంపట్లను) గవర్నమెంటువారికి సరఫరా చేసిరి. మఱియు నీశాఖవారు శస్త్రచికిత్సాసాధనముల నింకనితరసూక్ష్మసాధనములను మరమ్మతు చేయుటలో ప్రత్యేకనిపుణతనుగూడ సంపాదించిరి.

# దయాల్బాగు పారిశ్రామిక సంస్థల వస్తుప్రదర్శనములు

41. దయాల్బాగు పారిశ్రామికసంస్థ లభివృద్ధినొందుచున్నకొలంది మన ఫ్యాక్టరీలలో తయారగుచున్న వివిధవస్తుసామగ్రినిగురించి బహిరంగప్రకటనముచేసి, యందుమూలముగ రాధాస్వామీసత్సంగముయొక్క సంరక్షణ క్రింద దయాల్బాగులో జరిగింపబడుచున్న నిర్మాణాత్మకశ్రేష్ఠకార్యమునకు గూడ బహిరంగప్రకటనముచేయుట యవసరమని తోచినది. అందుచే 221 మొదలు 225 పుటలలో నిదివఱలోనే చెప్పియుండినట్లు, 1931 సం॥రము మొదలుకొని వివిధస్థలములలో వస్తుప్రదర్శనములను జేయుచుండిరి.

# 1937 ధర్మాలయాభివృద్ధి

42. 1937 సం॥రమువఱకు సాహబ్జీమహారాజువారికాలములో పారిశ్రామికసంస్థ లెట్లుస్థాపింపబడి వికాసనొందినవో పైపేరాలలో సంక్షిప్తముగ వివరించితిమి. ఇంతకుముందుగనే చెప్పినట్లు 1935 సం॥రము డిసెంబరునెలలో సభవారు, అయిదుసంవత్సరములగడువులో సాలున కొక కోటిరూప్యముల విలువగల సరుకులను తయారుచేయగల్గునంతహెచ్చుగ దయాల్బాగుపరిశ్రమల వస్తూత్పాదనను వృద్ధిచేయవలయునని తీర్మానించిరి. ఈతీర్మానమును క్రియారూపమునఁబెట్టుటకు దయాల్బాగుస్థాపకులైన మహాపురుషులు నిర్యాణమైన 1937 సం॥రము జూన్ నెలవఱకును సాధ్యముకాలేదు. సాహబ్జీమహారాజువారిప్రేరేపణపై 1935సం॥రము డిసెంబరునెలలో సభవారు చేసిన యీ పైతీర్మానమునుగుఱించి, మెహతాజీసాహబ్ వారిని సభాధ్యక్షులుగ నెన్నుకొనిన పిదప, వారు 1937 సం॥రము అక్టోబరునెలలో సత్సంగులకు జ్ఞాపకముచేసిరి అప్పుడు 1937 అక్టోబరునెలలో సభవారు తమ 1935 సం॥రము తీర్మానమును తిరిగి ధ్రువపఱచి, అప్పటినుండియు నన్నిపరిశ్రమలకును మహాప్రోద్బలమునిచ్చి యెన్నియో క్రొత్తసరుకులను తయారుచేయించుట ప్రారంభించిరి.

**1937-1940.** 1937 సం॥రములో అమృతసర్‌లోనున్న 22,000 కదురులును 252 పవరుమగ్గములునుగల 'దూదివడికి బట్టలునేయుమిల్లు'ను (Cotton Spinning & Weaving Mill) కొనుగోలుజేసిరి. లూధియానాలోనొక హోజియరీసంస్థనుగూడ సంపాదించిరి. ఈస్పిన్నింగు అండు వీవింగు మిల్లున కెక్కువ ధనసహాయము చేకూర్చి, దానిచే నంతకన్న నెక్కువబాగుగ పనిజరిగించు నిమిత్తమై 1939 సం॥రము ఆగస్టునెలలో దీని నొక పబ్లిక్ లిమి

టెడ్ కంపెనీకి విక్రయముచేసిరి. ఆకంపెనీకి దయాల్బాగుయొక్క పరమపూజ్య స్థాపకులపేరుమీద "సర్ సాహబ్జీమహరాజ్ మిల్సు, లిమిటెడ్" అని నామకరణముచేసిరి. దానిమూలధనమును 50 లక్షలరూప్యములవఱకు పెంచుటకు ప్రభుత్వమువారి సమ్మతినొందిరి.

1939 సం॥రము సెప్టెంబరునెలలో మహాయుద్ధమారంభమగుటచే దయాల్బాగుపరిశ్రమలకు మఱింత ప్రోద్బలముగల్గి, ఇచ్చట ప్రతి యంత్రాగారములోను రక్షకదళముల కావశ్యకమయిన సరుకుల నుత్పాదనజేయుట యొకప్రధానకృత్య మాయెను నూలుహోజియరీసరుకులను వూలుహోజియరీసరుకులను దయాల్బాగులో నధికపరిమాణమున తయారుజేయుట ప్రారంభించిరి. టేనరీలను,జోళ్ళఫ్యాక్టరీలను అధికముగవృద్ధిజేసిరి. రాసాయనికవస్తూత్పాదనవిభాగమువారు గూడ తమయుత్పాదనను పెంచుటయేగాక, వస్తువుల రకములనుగూడ చాలపెంచిరి

ఇవ్విధముగ 1940 సం॥రము చివరకు, వివిధపరిశ్రమల విభాగములు నొక్కొక్కటే వశములో నుంచుటకు శక్యముకానంత హెచ్చుగ పెరిగిపోయి నందున, వీనిని యుద్ధావశ్యకతలకు సరిపోవునట్లుగ నింకను వృద్ధిచేయుట యించుమించు అసాధ్యమైపోయెను 1940 సం॥రములో మెహతాజీసాహబ్ వారు సభాధ్యక్షతనుండి తొలఁగికొని, దయాల్బాగుపరిశ్రమలకు అధినియామకులుగ (Director)నెన్నుకొనబడినపిమ్మట వారిసలహాపైన సభవారు తమ పరిశ్రమ సంస్థలనన్నిటిని సులువుగసంబాళించుటకు వీలయిన చిన్నచిన్న సంస్థలుగజేసి వానిని ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీలకు ఒప్పజెప్పుటకు సంతోషముగ నంగీకరించిరి.

**1941-43.** ఇవ్విధముగ సభవారు, యుద్ధమున కవసరమైన వస్తువుల యావశ్యకత పెరుగుచున్నకొలఁది, తమసంస్థలనన్నిటిని సత్సంగులచే నేర్పాటుచేయబడిన లిమిటెడ్ కంపెనీలకే యొప్పజెప్పివేసిరి.

పూర్వమునుండియునున్నట్టి సంస్థలనన్నిటి నివ్విధముగ క్రొత్తకంపెనీల కొప్పజెప్పుటమాత్రమేగాకుండ, క్రొత్తపనులుజేయుటకుగూడ, దయాల్బాగులోను, లుధియానాలోను, అమృతసరములోను, కాకినాడలోను, కాన్పూరులోను, ఢిల్లీలోను ఉన్నసత్సంగులు మఱికొన్ని క్రొత్తకంపెనీలను ప్రారంభించిరి

ఈకంపెనీలచే నుత్పాదితములైన వస్తువుల నమ్ముటకై 1941 సం॥రములో 'దయాల్బాగుమేన్యుఫాక్చరర్సుట్రేడింగుకంపెనీలిమిటెడ్' అనుపేరుతో దయాల్బాగులో మఱొకకంపెనీని స్థాపించిరి. ఈకంపెనీయును మఱి యీరెండు కంపెనీలునుగలిసి, దేశమందంతటను ప్రైవేటుకంపెనీలక్రింద రిజిస్టరుకాబడి యున్న 230 దయాల్బాగులిమిటెడ్ స్టోరులకును, సరుకులనుసరఫరా చేయుసంస్థలుగ పనిజరుపుచుండెను. ఈకంపెనీలన్నియుగలిసి దయాల్బాగువస్తువుల కొరకు విక్రయవ్యవస్థగ నేర్పడినవి.

ఈపారిశ్రామికవ్యవస్థయొక్క ఆర్థికావసరములు పెరిగిపోవుచుండుటచే, నాయావసరములను దీర్చునిమిత్తము ముజఫర్పూర్ (బీహారు)లోను, అమృతసర్ (పంజాబు)లోను కాకినాడ(ఆంధ్రప్రదేశము)లోను తలొకబ్యాంకుచొప్పున మూడు రాధాస్వామీబ్యాంకులను జాయింటుస్టాక్కుకంపునీలుగ నేర్పాటు చేసిరి. ఈబ్యాంకులనుగుఱించిన సంక్షిప్తవివరణము నీగ్రంథమున మఱొకచోట నిచ్చితిమి.

**1944–49.** ఈకాలములో యుద్ధము సమాప్తమయినందున పటాలములకై సామగ్రిని తయారుచేయుట కట్టడిపోవుటచే, దయాల్బాగుపరిశ్రమసంస్థల నాయకులకు వ్యాకులముగలిగించుపరిస్థితి యేర్పడెను. వస్త్రోత్పాదనవ్యవస్థయంతయు పురజనసౌకర్యముల యుత్పాదన కార్యమునకు తగినట్లు మార్చివేయవలసిన యవసరము గలిగెను. కాని దేశమున నుత్పాదితవస్తుసామగ్రి యధికముగ లభ్యమగుచుండుటచే ధరలు పడిపోయి, అందుచే వస్త్రోత్పాదనసంస్థలకు పనిజేయుట కాటంకము గలిగెను. ప్రభుత్వమువారుగూడ ముడిసరుకుల సరఫరావిషయములో ననేకనియంత్రణచర్యల నాచరణలోఁబెట్టుచుండినందున విరివిగవస్త్రోత్పాదనచేయుటకు చాలయాటంకములు గలిగెను.

అందుచే నీసమయములో ప్రశీతనగృహము (Cold Storage) అను నొక్కసంస్థనుమాత్రమే క్రొత్తగ నేర్పాటు చేయగలిగిరి. ప్రశీతనగృహము బంగాళాదుంపలను, ఇంకను మనభూములలోపండిన యితరపదార్థములను నిల్వయుంచుట కుపయోగపడుచుండెను.

మన పారిశ్రామికసంస్థలలో చర్మములను పదునుచేయుట, జోళ్ళను తయారుచేయుట చేమగ్గములమీద బట్టలునేయుట, అచ్చొత్తుట, ఆయుర్వేదౌషధములను తయారుచేయుట మొదలగుపనులను జరిగించువిధానములను కార్మికులుతీసికొని, సహకారసంఘములుగ నేర్పడి పనిచేయనారంభించిరి.

ఈసహకారసంఘములకు ద్రవ్యసహాయము చేయునిమిత్తము 1947 సం॥రములో నొక సహకారపుబ్యాంకును (Co-operative Bank) గూడ నేర్పాటుచేసి పనిజరిపింప నారంభించిరి.

1950-60 ఈపదిసంవత్సరములలో కేంద్రప్రభుత్వ రాష్ట్రప్రభుత్వములు రెండును పన్నుల నదేపనిగ హెచ్చించి ముఖ్యమైనముడిసరుకులపై నధికముగ నియంత్రణము చేయుచుండిరి. పనులుజరిగించుటకు కూలిఖర్చులుగూడ పెరిగి పోయెను. అదియునుగాక, సర్వత్ర ధరలు అధికముగ పెరిగిపోవుటచే ప్రాంత గిలిపోయిన యంత్రములస్థానే క్రొత్తయంత్రములను ఖరీదుచేసికొనుట సాధ్యముగాకుండెను.

43. అన్నిధరలు నొక్కవరుసన పెరిగిపోవుచుండుటచే ప్రజలకు వస్తువులను కొనగలశక్తి క్షీణించిపోయెను. అందుచే మన ముత్పన్నముచేయు వస్తువుల యమ్మకము చాలపడిపోయెను. సత్సంగులు కష్టనష్టములకోర్చి యేర్పాటు చేసిన వస్తువిక్రయమహావ్యవస్థయు, దయాల్బాగుస్టోరులును, బహుక్లిష్టపరిస్థితులలో చిక్కుకొనిపోయెను. పైన జెప్పినకారణములచే వస్త్రోత్పాదకవ్యవస్థలో నవసరమైన మార్పులు చేయజాలకుండుటచే పరిశ్రమసంస్థలు, వస్తువులను పోటాపోటీధరల కుత్పాదనచేసి, స్టోరులకందజేయలేకుండుటచే కొన్నిస్టోరులు కట్టివేయవలసివచ్చెను అయినను ప్రాచీనయంత్రములతో పురాతనవిధములగు వస్తువులనే యుత్పాదనచేయుచు వానిని చాలమట్టుకు సత్సంగులకే యమ్ముచుండిరి ఎట్లైనను జోళ్ళకును తోలుకునుమాత్రము మార్కెట్టులో మామూలమ్మకములు తగ్గిపోలేదు

44 అమృతసరమిల్లులోని యంత్రసముదాయము ప్రాచీనమై ప్రస్తుత కాలోచితముగ లేకపోవుటచే, దానితో పనిచేయుటలో వస్త్రోత్పాదనవ్యయ మెక్కువయయి, ఆవస్తువులు బజారుధరలతో పోటీ చేయలేకపోవుచుండెను. అందుచే నామిల్లులో కొంతభాగమును రెండుసార్లు మూసివేయవలసివచ్చెను. చివరకందులోని కొన్నియంత్రముల నమ్మివేయుట తప్పనిసరియయి, దానిని పూర్తిగ కాకపోయినను కొంతభాగమయినను పనిజేయించుచునుండగలందులకై, 10 లక్షలరూప్యములను వెచ్చించి నూలువడకునట్టి క్రొత్తయంత్రములను కొనిపెట్టవసిలవచ్చెను

45. ఈచిక్కులలోనుండి తప్పించుకొనుటకై ప్రజలకు దయాల్బాగువస్తువులయం దభిమానముగలుగజేసి మనవస్తువిక్రయము నభివృద్ధిచేసికొనగోరి 1959 నవంబరునెలలో దేశమునందంతటను వస్త్రప్రదర్శనములను జరుపవలయునని తీర్మానించిరి. మితవ్యయపథప్రదర్శకులువారి హితోపదేశముపైన వివిధ స్థలములలోనిసత్సంగులు నా యా స్థలములలో వస్తుప్రదర్శనములను జరుపుటకు పథకముల నేర్పాటుచేసిరి. అందుచే 1960 సం॥రములో విశాఖపట్టణములో రెండుసార్లును, రాజమండ్రి. తణుకు, భటిండా, లక్నో. ఏలూరు, కలకత్తా, ముజఫర్పురము. ఇటావా, పాట్నా, విజయనగరము, కర్నూలు, అనకాపల్లి, లూధియానా, బొంబాయి, భీమవరము, వారాణసి, జలంధరు, అంబాలా, మదరాసు. అమలాపురము, అల్లహాబాదు, విజయవాడ, దర్భంగా, మధుర, మసౌఢీ, కర్నాల్, మిర్జాపురము, బాటాలలలో నొక్కొక్కసారియును, ఢిల్లీలో రెండుసార్లును, మొత్తము 32 వస్తుప్రదర్శనములను జరిపించిరి. అటులనే 1961 సంవత్సరములో వివిధస్థలములలో 31 వస్తుప్రదర్శనములు జరిగినవి.

ఈప్రదర్శనములలో 1960 సం॥రములో 5,30,000 రూప్యములును, 1961 సం॥రములో 4,92,400 రూప్యములును వస్తువిక్రయము జరిగెను. ఇకముందు సత్సంగుల క్రియాకలాపములో నీవస్తుప్రదర్శనము లొక యావశ్యకాంగముగనుండగలవని యాశించుచున్నాము. ఈప్రదర్శనములు దయాల్బాగు వస్తువులను జనసమ్మతముగావించి మనపరిశ్రమసంస్థలకు ప్రోద్బలముచేయగలవనియు, నీప్రదర్శనములద్వారా హుజూర్ రాధాస్వామిదయాళుని సకలమానవోద్ధారవిషయమైన మహాగంభీరసందేశముగూడ దేశమందంతటను వ్యాపించగలదనియు నాశించుచున్నాము.

## (D) వ్యవసాయము

46. 1915 సం॥రములో సాహబ్జీమహారాజువారీ కాలనీని స్థాపించినపుడును, అటుపిమ్మట 10 సం॥రములకాలమువఱకునుగూడ దయాల్బాగుఆవరణమంతయు నొకయిసుకపఱ్ఱగ నుండెను. ఇచ్చటినుండి ఆగ్రాపట్టణమునకు పోవుటకు రెండురోడుమాత్రము గలవు. ఆరెండిటిలో కంకరవేయనిప్రాంత మొగలాయిరోడు ఒకటియును, పొయ్యాఘాట్రోడ్డు రెండవదియును. పొయ్యా

ఘూట్ రోడ్డుఅంతయు పెద్దపెద్దగోతులతో నిండియుండెను. మొగలాయీల కాలములో ప్రజలు త్రవ్వించి ఇటికలతో కట్టించిననూతులుగూడ నీయావరణములో నచ్చటచ్చట కన్పించును.

47. 1950 సం॥రమునాటికి రాధాస్వామీసత్సంగసభకును, రాధాస్వామీ విద్యాసంస్థయొక్క కార్యనిర్వాహకవర్గము వారికిని గలిపి, మొత్తము 3357 యెకరములనేలగలదు. 1952 సం।రములో జమీందారీలరద్దుచట్టము వచ్చుటచే, సభవారు రైతధీనములోనుండిన 1611 యెకరములభూమిని కోల్పోయిరి. ప్రస్తుతము సభవారి స్వాధీనములోనున్న భూమి 1497 యెకరములును విద్యాసంస్థకార్యనిర్వాహకవర్గమువారి స్వాధినములోనున్న భూమి 249 యెకరములును మొత్తము 1746 యెకరములభూమిమాత్రమే మిగిలియున్నది. ఈ భూమి వివరము లీక్రిందిపట్టీలో తెలుపబడినవి:–

| | రాధాస్వామీ సత్సంగసభ | | | ఆర్.ఇ.ఐ. మేనేజింగ్ కమిటీ | | |
|---|---|---|---|---|---|---|
| గ్రామము పేరు | సాగు భూమి | నివేశన స్థలము | ఏహత్ మాలీ[1] | సాగు భూమి | నివేశన స్థలము | ఏహత్ మాలీ[1] |
| జగన్‌పూర్ | 474 | 70 | 7 | 101 | 112 | — |
| ఖాన్‌పూర్ | 435 | 5 | 87 | — | — | — |
| సికిందర్‌పూర్ | 397 | 6 | — | — | — | 8 |
| ఘటవాసన్ | 2 | — | — | 8 | 20 | — |
| నగలాపద్ది | — | 3 | — | — | — | — |
| మావ్ | 11 | — | — | — | — | — |
| | 1319 | 84 | 94 | 109 | 132 | 8 |

48. ఈకాలనీస్థాపించినదిమొదలు రాధాస్వామీసత్సంగసభవారు మత విషయకమైన తమవిహితకార్యకలాపముతోపాటు ముఖ్యముగ విద్యాభివృద్ధి

1 ఏహత్‌మాలీ, అనగా నిరంతరము సాగునకు లాయఖుగాకుండ, నప్పుడప్పుడుమాత్రమే సాగు చేయుటకు వీలున్నభూమి

కొఱకును, పరిశ్రమలయభివృద్ధికొఱకునుమాత్రమే, తమయావచ్ఛక్తిని విని యోగించుచుండిరి. అందుచే నొకప్రత్యేకకృషివిభాగమేదియు నిచ్చట నేర్పాటుచేయబడలేదు. దాదాపు 15 సం॥రములు అనగా 1930 సం॥రము వఱకు సామాన్యవ్యవసాయపుపనులుమాత్రమే జరుగుచుండెను. క్షీరశాల (Dairy) దగ్గఱనున్న కొన్నిపొలములలోను, శ్వేతనగర్, స్వామీనగరులకు దగ్గఱగనున్న కొన్నిభూములలోను దూడలకు పచ్చమేఁతను పెంచుచు, కొద్ది పరిమాణములో గోధుమ జొన్నపైరులను వేయుచుండెడివారు. చిన్నచిన్న ఆవరణములలో శలజముదుంపలను, గోబిపువ్వులను, ఒకటిరెండుసార్లు చెఱకు తోటలనుగూడ వేసిరి.

49. రాధాస్వామీవిద్యాసంస్థయొక్క, క్షీరశాల(R.E I Dairy)పూర్తిగ నభివృద్ధిలోనికి వచ్చినపుడు, 'డెయిరీ' ఆవరణమంతయు 'నేపియరు'గడ్డి, 'బెర్సీము'గడ్డి, 'సేంజీ', 'రిజ్కా', 'ఓటు' ధాన్యము మొదలగు పశువులమేఁతపైర్లతో నిండియుండెడిది. ఇచ్చటి వ్యవసాయపుపనులన్నియు 'డెయిరీ' సూపరింటెండెంటుగారి యాజమాన్యముక్రింద జరుగుచుండెడివి. 'డెయిరీ' సూపరింటెండెంటుగారు తమయావచ్ఛక్తిని వినియోగించి పనిచేసిననుగూడ తనపశువులకు కావలసినమేఁత నుత్పన్నము చేయలేకుండుటచే, రోహతక్‌నుండియు, పంజాబులో హిస్సార్‌నుండియు పశువులమేఁతను తెప్పించుచుండెడివారు.

50. ఒకనాఁడు సాహబ్జీమహారాజువారు రాధాస్వామీసత్సంగసభకు, వ్యవసాయము పట్టుదలగ చేయనారంభించవలసినదని, చెప్పిరి కాని యప్పటి వ్యవసాయవిభాగసదస్యుఁడు నిరుత్సాహముగనుండెను. అందుచే నప్పటిలో సభయొక్క సాగుభూములలో మంచివన్నియు చాలమట్టుకు రయితుల కమర్చబడుచుండెను 1941వ సం॥రము వఱకును వ్యవసాయ మొకముఖ్యమయిన కార్యముగ నెంచబడనేలేదు. 1941వ సం॥రములో మెహతాజీసాహబ్‌వారు వ్యవసాయపుపనులను చేయించుట కుద్యుక్తులయినపుడు, సభవారి కప్పటికి మిగిలియున్న భూమియంతయు నిసుకతిన్నెలతోను, చాలపొడుగుగను లోతుగను ఉన్నగోతులతోను, నిండియుండెను. క్షీరశాల(Dairy)వద్దనున్న కొద్దియెకరములభూమిమాత్రమే అట్లుగాకుండ సమతలముగ నుండెను. కావున మెహతాజీసాహబ్‌వారి, కాభూములన్నిఁటిని సమతలము చేయించుటకు. ముఖ్యముగ నాఁడోజులలో యుద్ధము జరుగుచుండుటచే, పనివాండ్రకొఱత చాల యెక్కువగనున్నందున, నొకబహుక్లిష్టసమస్య యేర్పడెను అందువలన పొల

ములలో పనిచేయుటకై, వారు సత్సంగులను తమతోగూడ పొలములకు తీసికొనివెళ్ళుటకు నిశ్చయించిరి. మొదటిలో నీకార్యమును దయాల్బాగు మైనర్ కాలువను, క్షీరశాలయావరణ (Dairy)లోని సాగునీటిబోదెలను, బాగుచేయుటతో మొదలుపెట్టిరి. పిమ్మట సత్సంగిసోదరులు, కలుపుతీయుట, కోతకోయుట మొదలగుపనులను సాగించుట మొదలుపెట్టి తరువాత క్రొత్తభూములను సాగుకు పనికివచ్చునట్లు చేయుటవిషయములో శ్రద్ధవహించిరి. అడవిమొక్కలను, దుబ్బులను, రెల్లుదుబ్బులను నిర్మూలించినపిదప 'పాటా'[1]లను లాగి భూములను సమతలముచేయుట ప్రారంభించిరి. ఆపని యింతవఱకు నట్లే జరుగుచున్నది.

51. ఈ చేబూనినకార్యము మహాపరిమాణముగలదగుటచే దీనిని యంత్ర సహాయములేకుండ కేవలము చేతులతోపనిచేసి పూర్తిచేయుట యసాధ్యము. అందుచే మానవులచేతిపనిని సంపూర్తిచేయుటకుగాను 1947 సం॥రములో మూడు T. D 14 మార్కు (Second hand) ప్రాతట్రాక్టర్లను కొనిరి. రెండుగ్రేడర్లనుగూడ కొని వీనితోను, ట్రాక్టర్లతోను ఇంకనితరసాధనములతోను వ్యవసాయకృత్యములను యంత్రప్రేరితము చేసిరి. మొత్తముమీద వ్యవసాయమున కీక్రిందియంత్రములను కొనిరి:-

| | |
|---|---|
| (1) అంతర్జాతీయ 'T. D 14' మార్కు ట్రాక్టర్లు | 3 |
| (2) ఫార్మాల్ (యమ్. డి.) ట్రాక్టరు (లాగుడుయంత్రము) చక్రములుగలది | 1 |
| (3) ఫెర్గుసన్ ట్రాక్టరు (లాగుడుయంత్రము) | 1 |
| (4) గ్రేడర్లు | 2 |
| (5) 'T D. 14' ట్రాక్టర్లకొఱకై 32 బింబముల గుంటకము (32 Disc Harrow) (విత్తులు జల్లినపిదప భూమిని చదునుచేయు యంత్రము) | 1 |
| (6) ఇనుపహార్సు ట్రాక్టరు (Iron Horse tractor) | 1 |
| (7) కలుపుతీయు యంత్రము (Weeder) | 1 |

---

1 పాటా యనగా మట్టిపోగులను యీడ్చుకొనిపోవునట్టి కొయ్యబల్ల ఆబల్లను లాగుటకు రెండు తీగెలుగాని గొలుసులుగాని దానికిని దానిముందొకకాడివంటి అడ్డకఱ్ఱనుకూడ తగిల్చియుందురు. వెనుక నొకరు ఆబల్లను పట్టుకొనియుందురు ముందు యిరువురుమనుష్యులు ఆయడ్డకఱ్ఱను పట్టుకొని లాగుచుందురు.

( 8) ఫెర్గుసన్ ట్రాక్టరుకు తగుల్చుటకు దున్నదుసాధనము (Tiller) తొమ్మిది గోళ్ళతో నున్నది. 1

( 9) గోధుమలను నూర్చుటకు థ్రేషర్లు (Threshers) 2

(10) జాన్ డీర్ మోల్డు నాగలి (John deer Mould Plough) 1

(11) ఫార్మాల్ (యమ్ డి.)తో పనిచేయుటకు గుంటకలు (అనగా భూమిని దున్నినపిదప చదునుచేయు యంత్రములు) 2

(12) సీడుడ్రిల్లులు 2

(13) కోతయంత్రము (Harvester) 1

(14) (Byelarus) బైలారస్ అనే రష్యాట్రాక్టరు 1

(15) ఫార్మాల్ (యమ్. డి) 1

(16) (దయాల్బాగులో తయారుచేసిన) స్క్రేపరు 1

(17) లేవలింగుప్రెస్సులు 2

52. ట్రేక్కు టైపుట్రాక్టర్లు (Track type tractors) భూములను చదును చేయుటకు చాలయుపయోగించినవి. వానితో దాదాపు 5 సంవత్సరములు పనిజరిగించినపిదప వానిని పనికిరాని యినుపముక్కలక్రింద (Serap) నమ్మి వేసిరి

53. థ్రేషర్లు ఉపయోగకరముగ నున్నవి. సీడ్‌డ్రిల్లులు మునుముం దుప యోగకరముగ నుండుటకు వీలున్నది. స్త్రీపురుషసత్సంగులే కోతపనుల న్నియు జరిపించుచున్నారు.

## పశువులు

54. 30 ఎద్దులును, 10 చిన్నదూడలును గలవు అవియన్నియు నీదేశ ములో పుట్టిపెరిగినవే,

55. సభవారికోరికపైన 1960 సం॥రము మార్చినెలలో, కేంద్రప్రభుత్వము యొక్క ఆహారవ్యవసాయవిభాగపుమంత్రివర్గమువారు, సికిందరపురములో దాదాపు 180 ఎకరముల పొలములో మెట్టవ్యవసాయము ఆదర్శప్రదర్శన ముగ చేయనారంభించిరి ఇంతవఱకును 60 ఎకరములభూమికి గట్లువేయిం చిరి. అందులో మానవాహారమునకు పనికివచ్చెడి తృణధాన్యములను జల్లిరి.

పంట చాలయుత్సాహవర్ధకముగనే యున్న ట్లగుపించుచున్నది. వాగులగండ్లను పూడ్చుటకు గట్లువేయించుటయును, కొంతయిటికపనియును, 25 ఎకరముల నేలలో నడివినికొట్టివేయించుపనులును మాత్రమే మిగిలియున్నవి. కేంద్ర ప్రభుత్వమువారి కీచర్యలను కొనసాగించుటకు మూడుసంవత్సరములు అనగా 1-4-60 మొదలు 31-3-63వఱకు పట్టును.

## విత్తనములు నాటుట

56. వగామూలుగ 'ఖరీఫ్'[1], 'రబీ'[2], ఈరెండుపంటలవిత్తనములను యెడ్లు నాగళ్ళతోనే జల్లుచుందురు. కూలిపనివాండ్రు దొరకుట కష్టమగుటచే పంజాబు, బీహారుప్రాంతములనుండియు ఉత్తరప్రదేశములో పిలిభిత్ నుండియు సత్సంగులు విత్తనములుజల్లుటలోను, కోతలుకోయుటలోను సాయముజేయుట్కై వచ్చుచుందురు.

57. సామాన్యముగ ప్రభుత్వమువారి విత్తనములశిపోనుండియే విత్తనములను చేకొనుచుందురు. గోధుమలు, యవలు, శనగలు, తారామీరాలు, వరిధాన్యము, ప్రత్తి, వేరుశనగలు, ఖరీఫ్‌పంటలుగ పండించుచుందురు. సామాన్యముగ నిచ్చటిపొలములలో గోధుమలు, యవలు, తారామీరా, చెఱకు, నేరుశనగలు యెక్కువప్రచురముగ వేయుచుందురు.

## పొలములకు ఎరువులు, నీటిపాఱుదల సదుపాయము

58. గోశాలలోని గోమయమును, యెడ్లదొడ్డిలోని గోమయమును, ఆగ్రాపట్టణమునుండి తెచ్చిన 'కంపోస్టు'ను, దయాల్బాగులో చేసిన కంపోస్టును, పొలములకు సత్తువచేయు పెంటక్రింద వాడుచుందురు. ఇంతియగాక రాసాయనికద్రవ్యములను, అనగా అమ్మోనియమ్‌సల్ఫేటు, సూపర్‌ఫోస్ఫేటు, కాల్షియం అమ్‌సల్ఫేటు నైట్రా, యూరియా, గానుగపిండినిగూడ పొలములకు సత్తువ చేయుటకు వేయుచుందురు.

---

1 "ఖరీఫ్" అనగా ఆషాఢము మొదలు మార్గశిరమాసమువఱకు నున్న మధ్యకాలములో కోతకు వచ్చు పంట.

2 "రబీ" అనగా వసంతఋతువులో కోతకువచ్చు పంట.

59. ఇచ్చట పొలములకు నీరుపాఱించుటకు ముఖ్యాధారములు రెండు పిల్లకాల్వలు. మొట్టమొదట 1928 సం॥రములో ఉత్తరప్రదేశప్రభుత్వము వారు 'దయాల్బాగుసైనర్' అనునొక పిల్లకాల్వను త్రవ్వించిరి. కాని యది కావలసినంతనీరును పాఱించలేకుండెనని కొద్దికాలములోనే తేటపడెను. 1936 సం॥రములో 'యమునకాల్వ' యను మఱొకపిల్లకాల్వను సభవారు తమసొంత ఖర్చుపైన త్రవ్వించిరని యింతకుముందు 5వ యధ్యాయము 107వ పేరాలో చెప్పటయైనది. సికందరపురములో యమునానదినుండి 12″ వ్యాసముగల రెండు కేంద్రోద్గామిఘటీయంత్రపు నీటిగొట్టముల (Centrifugal Pumps) ద్వారా నీరునుతోడి యీపిల్లకాల్వకు పంపుచున్నారు. ఈకాల్వ ఖాన్‌పురము, జగన్పురము అనుయూళ్ళలోనిభూములను తడుపుచు క్షీరశాల (Dairv) వఱకు వెళ్ళి అచ్చటనున్నపొలములనుగూడ తడుపుచున్నది. ఈ "యమునకాల్వ" నీటితో క్షీరశాలయావరణము (Dairy) లోని పశ్చిమభాగపుపొలములకు నీరుపెట్టుట, యీమధ్య కొంత కష్టముగనుండెను. యమునాప్రవాహమార్గము 1957 సం॥రమునుండియు యెడమప్రక్కయొడ్డువైపునకు జరిగిపోవుచుండుటచే నంతకంతకు దూరమైపోవుచుండెను. అందుచే నీళ్ళస్వీకరణనాళికలనూతినుండి నదీప్రవాహము దూరమైపోయినందున దానినుండి నీరును నూతిలోనికి తోడిపెట్టుటకు తాత్కాలికముగ మఱిరెండు ఘటీయంత్రపుగొట్టములను అధికముగ వేయవలసివచ్చెను.

## వ్యవసాయశాఖలోని యుద్యోగస్థులును పనివాండ్రును

60. వ్యవసాయపుపనులన్నియు సరిగ సకాలములో జరుగునట్లు కనిపెట్టి చూచుచుండుటకు తగినంతమంది యుద్యోగస్థులనుగూడ నియమించిరి సంవత్సరముపొడుగునను పనిచేయుటకు 40 మంది పనివాండ్రను జీతములిచ్చి నియమించిరి. కాని వ్యవసాయకృత్యములన్నియు ప్రధానముగ, స్త్రీపురుషసత్సంగులు సంవత్సరముపొడుగునను సంతోషముతో జేయు స్వచ్ఛందసేవతోనే సాగిపోవుచున్నవి. ప్రత్యుదయమునను సగటున 150 మందికి పైగానే యీసేవలో పాల్గొనుచుందురు. భండారారోజులలో నీ సంఖ్య 300 పైవఱకును పెరిగిపోవుచుండును.

61. 1956 సం॥రమునుండియు స్త్రీలుగూడ నీ సేవలో పాల్గొనగోరినందున, నప్పటినుండియు స్త్రీపురుషసత్సంగులిరువురునుగూడ పొలములలో పని

చేయుచుండిరి. వేర్వేఱుజీవితపరిస్థితులు హోదాలలోనుండిన భిన్నభిన్నవయస్సులుగల స్త్రీపురుషులును, బాలురు, బాలికలునుగూడ పొలములలో మెహతాజీసాహెబ్ వారి యాజ్ఞానుసారము శ్రమదానముచేయుచు తిన్నగ వారియధినిరీక్షణక్రిందనే పనిచేయుచు శారీరికముగను, ఆధ్యాత్మికముగనుగూడ మహాలాభమునొందుచుండగజూచుట నిశ్చయముగ నొక హృదయములను జలదరింపజేయునట్టి మహాదృశ్యమే. స్వయముగ దయాల్బాగువచ్చి యిదంతయు కనులారగాంచిన పెద్దమనుష్యులందఱు నీ నిరాడంబరయథార్థ "సమాజవికాసప్రణాళిక" (Community project) యొక్క మహనీయాదర్శమును మహోత్కృష్టముగ శ్లాఘించుచుండిరి.

## (E) రాధాస్వామీ విద్యాసంస్థయొక్క క్షీరశాల
### (R E. I Dairy)

62. రాధాస్వామీవిద్యాసంస్థయొక్క క్షీరశాలను (R. E. I. Dairy) 1926 సం॥రములో స్వల్పపరిమాణముమీదనే ప్రారంభించిరిగాని, 1931 సం॥రములో దాని నాధునికసాధనసామగ్రితో నమర్చి యాధునికరీతిని వ్యవస్థాపనముజేసిరి. రాధాస్వామీసత్సంగసభవారు, దీనికట్టడములకును, దీనికవసరమైనసాధనసామగ్రినమర్చుటకును 4 లక్షలరూప్యములను వెచ్చించిరి.

63. దీనిని దేశములోని శ్రేష్ఠతమక్షీరశాలలలో నొకటిగ నందఱును మెచ్చుకొనుచుండి రనువిషయము న్యాయమే. భారతదేశమునకు రాష్ట్రపాలకప్రధానియు (Governor General) రాజ ప్రతినిధియు (Viceroy) నగు లార్డు వెలింగ్టన్ దొరగారు 1935 మార్చి 22వ తేదీన దయాల్బాగు సందర్శించుటకు వచ్చినపు డీక్షీరశాలను (Dairy) తాను కొన్నిసంవత్సరములనుండియు చూచుచుండిన క్షీరశాలలన్నిటిలోను శ్రేష్ఠతమమైనదని కొనియాడిరి.

64. భారతదేశప్రభుత్వమువారి క్షీరక్రయవిక్రయహితోపదేశకులైన (Milk Marketing Adviser) ఆర్.ఏ. పెప్పరాల్ (R.A. Pepperal) గారు 1945 జనవరినెలలో వచ్చి యీక్షీరశాలనుచూచినపుడు ఆయన దీనిని గుఱించి యీక్రిందివిధముగ ప్రశంసించిరి :-

"నిజముగ భారతదేశ మాశ్చర్యములకు పుట్టినిల్లు. ప్రపంచములోని క్షీరశాలలలో దేనితోనైనను పోటీచేయ సమర్థతగలిగినట్టియు, సకలసాధన

సామగ్రిసమన్వితమైనట్టియు, పరిసరవాతావరణములలోగూడ నావృత్తిరీత్యా నేను ఇంగ్లాండు, ఆస్ట్రేలియా దేశములలోనంతట తిరిగిచూచిన క్షీరశాలలన్నిం టిని మించిన పరిశుద్ధతగలిగినట్టియు, నీ యద్భుతసుందరగవ్యశాల నిపుడిచ్చట గాంచుటయే బహుశా నాస్వానుభవములో నన్నింటినిమించిన యత్యాశ్చర్య మని చెప్పవచ్చును

"ఇట్టి యాదర్శముండగ, దీనిననుకరణజేసి క్షీరశాలపరిశ్రమకు సంబంధించి నంతమట్టుకు, భారతదేశము ప్రస్తుతము తాను దిగబడియున్న 'నిరాశాకూ పము'నుండి యుత్తీర్ణమగుట, దానికి నిస్సంశయముగ శక్యమైన విషయమే."

65 1943–45 సం॥రములలో నాగ్రాలోనున్న అమెరికాదేశపు సైనికదళ ములు తమకు కావలసిన క్షీరమును ఆగ్రామిలిటరీడెయిరీకి బదులుగ నీడెయిరీలో నుండియే తెప్పించుకొనుటకు నిశ్చయించిరను విషయము దయాల్బాగ్ క్షీర శాలయొక్క శ్రేష్ఠతను నిరూపించుటకు మఱొకదృష్టాంతము.

66. అయినను దురదృష్టముచే నాగ్రాప్రజలు క్షీరపానవిషయములో తమ బహుకాలాగతమయిన యలవాట్లను వదలిపెట్టలేక క్షీరశాలలోని "పాస్చ రైజ్డు" పాలకు (Pasteurized Milk) ప్రాపకమునివ్వజాలరైరి క్షీరశా లను ఆర్థికముగ నొకస్వతంత్రసంస్థగ నడిపించుట కట్టిప్రాపకము ముఖ్యావ సరము కొన్నిసంవత్సరములవఱకును ఈపట్టణపరిసరములలోని యానువత్రు లట్టిప్రాపకము నిచ్చిరి. కాని రానురాను స్వార్థపరులవలన యాటంకములు గలుగగా, మనక్షీరశాల వాని నెదుర్కొనజాలకుండెను. అందుచే 1954 సం॥ రములో నీక్షీరశాలలోని పాలను పాస్చరైజుచేయువిభాగమును కట్టివేసిరి. కాని వెన్నవిభాగముమాత్ర మెప్పటియట్లు పనిచేయుచు తనయభిమానులకు దేశమంతటిలోనుసర్వోత్కృష్టమైన నవనీతఘృతములను అందిచ్చుచునే యున్నది.

## (F) సామాజిక వికాససంఘములు

## I. పురాణ విద్యార్థి సంఘము

67. రాధాస్వామీవిద్యాసంస్థ (Radhasoami Educational Institute) యొక్క భూతపూర్వవిద్యార్థులు తమకళాశాలలోను, సత్సంగములోను యథా

ప్రకార మభిమానమును గలిగియుంచుచు వానికి సంబంధించినవిషయములలో నుత్సాహముతో పాల్గొనవలయునని కోరుచుండుటచే, నా కోరిక తీర్చగలందు లకై 1926 సం॥రము డిసెంబరు నెలలో దయాల్బాగుపురాణవిద్యార్థిసంఘము (Dayalbagh Old Boys' Association) మొట్టమొదట ప్రారంభించబడెను. సాహబ్జీమహారాజువారు 1928 సం॥రము డిసెంబరునెలలో జరిగిన పురాణ విద్యార్థిసంఘసమావేశములో నొకసందేశము నిచ్చిరి. ఆసందేశములో నీ సంఘముయొక్క యథార్థమైన యాదర్శమును తెలియజేయుచు వారిట్లు సెలవిచ్చిరి :-

"మాకు మాసంస్థలను నిర్మించుటకు నడిపించుటకును సహాయముచేయ గల యువకులు కావలెను. గృహనిర్మాణమునకు తాపీపనిచేయు మిస్త్రీలెట్లవ సరమో మా కీ యువకులు నట్లే యవసరము పురాణవిద్యార్థులు మాసంస్థల నిర్మాణకార్యమునకు తాపీమిస్త్రీపని చేయుటకు సంసిద్ధులయి ముందుకువచ్చిన యెడల నాకొక్కనికేగాక దయాల్బాగులో నివసించుచున్నవారందఱకును గూడ నిశ్చయముగ మహానందముగనుండును"

68. ఈసంఘము పవిత్రస్వరూపులయిన సాహబ్జీమహారాజువారి మహోత్తే జకపోషణక్రింద మాతృసంస్థ కనేకవిధముల ముఖ్యాంగముగ పనిజేయుచున్నది.

69 1929 సంవత్సరమునుండియు నీసంఘము మొదట టెక్నికల్ కళా శాలపురాణవిద్యార్థులను, పిమ్మట ఇంజనీరింగుకళాశాలపురాణవిద్యార్థులను గూడ, తనలో సభ్యులుగ జేర్చుకొనుట ప్రారంభించెను.

70 1930 సంవత్సరాంతమునకు, ఈసంఘము ప్రేమసరోవరమునకుజేర్చి యొకపురాణవిద్యార్థిసంఘభవనమును (Old Boys' Hall) నిర్మించుటకు రు 2500/-లను ప్రోగుచేసెను.

71. ఈసంఘము సత్సంగముయొక్క క్రియాకలాపము లన్నిటిలో నుత్సా హముతో పాల్గొనుచుండెను. ఈసంఘము దయాల్బాగులోని వివిధసంస్థలకు కావలసిన అన్నిరకముల కార్మికులను సరఫరాచేయు సుక్షేత్రముగనున్నది. ప్రస్తుతము మధ్యప్రదేశమని పేర్కొనబడుచున్న సెంట్రల్ప్రోవిన్సెస్‌లో నీసం ఘము 14 లిమిటెడ్ కంపెనీల నేర్పాటుచేసి, వానిద్వారా 1940 సం॥రమునకు ముందువెనుక కొన్నిసంవత్సరములు దయాల్బాగువస్తువుల విక్రయము

నకు సహాయము చేసినది సభవారి వ్యవసాయకార్యప్రణాళికలో గూడ నితర దయాల్బాగునివాసులతో సమానముగ నీసంఘసభ్యులు వ్యక్తిగతముగ పాల్గొనిరి.

72. 1960 సం॥రములో నీసంఘముయొక్క పట్టికప్రకారము దీని సభ్యుల సంఖ్య 253. అందులో 195 యావజ్జీవసభ్యులు.

## II-దయాల్బాగు వివాహపంచాయతి

73. 1942 సం॥రము ఆగస్టు 9వ తేదీన వివాహపంచాయతి ఏర్పాటుచేయ బడినది. దీని జ్ఞాపనపత్రికయును ఉపనిబంధనలును రాధాస్వామీసభయొక్క కార్యనిర్వాహకవర్గముచే 30-9-1942 తేదీగల 15వ నెంబరు తీర్మానములో నామోదింపబడినవి. ఈపంచాయతి 1946వ సం॥రములో సొసయిటీస్ రిజిస్ట్రేషన్ ఆక్టు అనఁబడు 1860 సం॥రము ఠాలూకు 21వ చట్టముక్రింద రిజిష్టరుకాబ డినది. దీనికి తొమ్మండ్రుసభ్యులు గలరు.

74. ఈవివాహపంచాయతియొక్క యుద్దేశ్యాదర్శములు ఈ క్రిందవివరింప బడినవి:—

(a) సామాన్యముగ సత్సంగులందఱకును అందులో ముఖ్యముగ దయాల్బాగునివాసులగు సత్సంగులకు, తమవివాహోద్వయస్సుగల సంతానమునకు పెండ్లిసంబంధములను నిశ్చయించుకొనుటలో సౌకర్యము గలుగజేయుట,

(b) వివాహసంబంధములను నిశ్చయించుకొనుటలో గలుగునట్టి యనవసరాటంకములను తొలగించునిమిత్త మవసరమైన సలహాల నిచ్చుచుండుట,

(c) వివాహకార్యములను చేయుటలో ఖర్చు కనీసమగునట్లును ఆడంబరములను తొలగించుటకును తగిననియమములను, రాధాస్వామీసత్సంగసభయొక్క కార్యనిర్వాహకవర్గమువారి ఆమోదమునకులోఁబడి, యేర్పాటు చేయుట,

(d) కార్యనిర్వాహకవర్గమువారి యామోదమునకు లోబడి, వివాహపద్ధతులలో నెప్పటికప్పు డవసరమయిన మార్పులను చేయుచుండుట.

(e) సత్సంగులలో నంతరాతీయ వివాహములను ప్రోత్సహించుట.

75. వివాహపంచాయతీవారు వివాహార్హమయిన వయస్సుగల ఆడ మొగ పిల్లలపట్టీని తయారుచేసి యుంచుచుందురు. తమపిల్లలకు సంబంధముల నెంచు కొనుటకు పిల్లల తల్లిదండ్రులు ఈపట్టీని చూచుకొనుచుందురు.

76 పెండ్లినిశ్చయములకు పెండ్లికార్యములకును వ్యయము కనీసముగ నుండవలయునని వివాహపంచాయితీవారు తమసమావేశములలో నొక్కి చెప్పు చుండిరి. ఎవరైనను ఇందువిషయమై రు 2000/-లకన్న నెక్కువవ్యయమును కాని రు 100/-ల కన్న తక్కువవ్యయమునుకాని చేయకూడదు.

77. విద్యాసంబంధమైన యోగ్యతాతిశయము గలిగినట్టియు, వయస్సుముదిరి నట్టియు ఆడపిల్లలకు పెండ్లిండ్లేర్పాటుచేయుట చాలకష్టముగనుండుటచే నాడ పిల్లలకు 18 మొ॥ 21 సం॥రములవయస్సు దాటకుండగనే వివాహము నిశ్చ యముచేసికొనవలయునని వివాహపంచాయతీవా రెల్లప్పుడును హితోపదే శము చేయుచున్నారు.

విగతపత్నీకులకును. విగతభర్తృకలకును పునర్వివాహములను, అంత ర్జాతీయవివాహములను, అతఃప్రాంతీయవివాహములను, పంచాయతీవారు ప్రోత్సహించుచుందురు

## III-దయాల్బాగు మహిళాసహకారసంఘము సీమితదాయకము
## (Dayalbagh Mahila Association Ltd.)

78 దయాల్బాగుస్త్రీలలో వికాసాభ్యుదయములను గలుగజేయుటకై దయాల్బాగుమహిళాసహకారసంఘమును సీమితదాయకముగ 1938 సం॥ర ము లోస్థాపించిరి.

79. 1943 సం॥రములో నీసంఘము 100మంది సభ్యులతో 1912 సం॥రపు సహకారసంఘముల చట్టప్రకారము రిజిష్టరుకాబడెను. ఈసంఘముయొక్క యాదర్శము ఈక్రింద వివరింపబడినవి:-

(1) ఈసంఘుసభ్యుల యార్థికక్షేమమును సహకారసిద్ధాంతానుసారము అభివృద్ధిసేయుట,

(ii) హానికరమగు సంఘాచారములను, అంధవిశ్వాసములను నిర్మూలించుటయు, వివాహకార్యములు, పండుగలు వగైరా సమయములలో వృథావ్యయమును, వృథాకాలక్షేపమును గాకుండ చేయుటయు,

(iii) కుటీరపరిశ్రమల నభివృద్ధిచేయుట,

(iv) ఈసంఘసభ్యులయొక్కయు, వారి పిల్లలయొక్కయు విద్యాభ్యాసకళాప్రశిక్షణములకు ఉచితప్రబంధముచేయుట,

(v) పుస్తకభాండాగారములను, చిత్రవస్తుప్రదర్శనశాలలనుస్థాపించుట,

(vi) సభ్యుల జీవనవిధానమును, వారల దృక్పథమును, ఉత్సాహయుతముగను, విశాలోదారభావోపేతముగను జేయుట,

(vii) సంఘసభ్యులను, తమయారోగ్యాభివృద్ధికొఱకు శరీరవ్యాయామముచేయుటకు ప్రోత్సహించుట,

(viii) సంఘసభ్యుల యార్జనశక్తి నభివృద్ధిజేయు చర్యలను తీసికొనుట

(ix) సంఘసభ్యులకు జీవితావశ్యకపదార్థములను న్యాయమయినధరలకు చేకూర్పనేర్పాటుచేయుట,

(x) సంఘసభ్యులలో సహకారభావమును, స్వయంకృషిని, మితవ్యయమును ప్రోత్సహించుట.

(xi) చేతిపరిశ్రమలను, లఘుపరిశ్రమలను అభివృద్ధి చేయుటకును, సంఘసభ్యులకు ఆర్థిక, నైతిక, సాంఘిక, పారమార్థికవిషయములలోను, సామాన్యముగనుగూడ శ్రేయోభివృద్ధిగలిగించుటకును అవసరమయినట్టియు, ఆనుషంగికమైనట్టియు కార్యములను చేయుటయును.

80 ఈసంఘముయొక్క కార్యములను దీనికార్యనిర్వాహకవర్గము జరిగించుచుండును. ఈవర్గమున నొక యధ్యక్షురాలు, నొకయుపాధ్యక్షురాలు, నొక కార్యదర్శియు, నొక సంయుక్తకార్యదర్శియునుగాక నీసంఘముయొక్క వివిధభాగములను గనిపెట్టిచూచుచుండు మఱి అయిదుగురుసభ్యులుగలరు.

81. ఈసంఘ మీాక్రిందిసంస్థల నేర్పాటుచేసెను :

(i) దయాల్బాగుమహిళలకు కుట్టుపనిసహకారపారశాలను. ఇందులో రెండేండ్ల పాఠ్యక్రమముతో కుట్టుపనిని, పూలకుట్టును, అల్లికపనిని, చింపులు చింపుటను, ఆటబొమ్మలు తయారుచేయుటను, యంత్రముతోచేయు పూలకుట్టుపనిలో ప్రత్యేకనైపుణ్యమును, నేర్పించుటకేర్పాట్లున్నవి.

(ii) బీదలు, అసహాయులు, నిరుపేదలునగు స్త్రీలను కనిపెట్టునట్టి 'దయాల్బాగుసేవాసంఘ' మను నొక ప్రధానమైన సంఘమును,

(iii) మంచిపుస్తకములతోనున్న మూడు పిల్లలగ్రంథాలయములను మూడు వేర్వేఱు మొహల్లాలలోను,

(iv) దయాల్బాగువస్తువులను, యితరగృహపరికరములను అమ్మకమునకొక మహిళాస్టోరును.

82 ఈ సంఘసభ్యులు ఆయుర్వేదౌషధాలయములో గూడ పనిచేయుదురు. ఈసంఘసభ్యులు మహిళాస్టోరునకు మసాలాద్రవ్యములను ఆదర్శపారిశ్రామిక సంస్థలకొఱకు కూజాగలీబులు మొదలగువానిని తయారుచేయుదురు. ఫూలుశాలువలమీద పూలకుట్టుపనినిగూడ జేయుదురు. స్త్రీసామాన్యమువలెగాక వీరలలో చాలమంది పొలములలోగూడ పనిచేయుదురు.

83. ఏప్రియల్, డిసెంబరు నెలలలో భండారాసమయములలో నీసంఘమొక యల్పాహారవిక్రయశాలను తెఱచుచుందురు. వార్షికవస్తుప్రదర్శనములలో నీసంఘసభ్యులుగొందఱు ఆఁడవారికైనపుస్తవిక్రయమునుగూడ చేయుచుందురు.

## (G) దయాల్బాగు టౌన్ఏరియా
### (Dayalbagh Town Area)

84. దయాల్బాగుకాలనీ మొదటినుండియు పౌరజీవనవిధానముయొక్క ప్రధానాంగములతో నొప్పారునట్లే వ్యవస్థాపితమై, గడచిన 46 యేండ్లు నటులనే నడిపించబడుచున్నది. ఈ కాలనీలో నున్న వివిధసంస్థలయొక్క స్థాపనపోషణలనిమిత్తమై పెద్దపెద్దమొత్తములను వెచ్చించిరి. యిచ్చట నీటిసరఫరాయేర్పాట్లకును, విద్యుచ్ఛక్తినందజేయు వ్యవస్థకును, ఆరోగ్యరక్షణశాఖకును, రోడ్లు వేయించి బాగుచేయించు ఖర్చులకును, కాపలాగస్తీవ్యవస్థవగైరాల క్రిందనుగూడ పెద్దపెద్దమొత్తములను వెచ్చించిరి. మనదేశములోని గొప్పగొప్పనాయకులును, పరదేశములలోని ప్రసిద్ధవ్యక్తులునుగూడ నీ కోలనీపౌరుల జీవనవిధానమును. ఈకోలనీయొక్కయు దీనిసంస్థలయొక్కయు సిరుపమానవ్యవస్థను జూచి చాలమెచ్చుకొనిరి. అయినను దీని ఆరోగ్యసంరక్షణవ్యవస్థవగైరాలను నడిపించుచున్న శిరోమణి నగరకమిటీకి న్యాయశాస్త్ర

సమ్మతమైన హోదా లేనందున నిచ్చట నొక టౌన్ ఏరియా కమిటీ (Town Area Committee) నేర్పాటు చేయవలసివచ్చెను.

85. 1957 సం॥రము సెప్టెంబరు 11వ తేదీన నుత్తరప్రదేశ రాష్ట్రపాలకు నిచే దయాల్బాగుకోలనీ యొక 'టౌనుఏరియా' యని ఘోషణచేయబడి, క్రియారూపమున 'దయాల్బాగ్ టౌనుఏరియాకమిటీ' 1957 సం॥రము అక్టోబరునెలలో నేర్పాటు ఆయెను. ఈకమిటీ కొక యధ్యక్షుడును, తొమ్మండ్రు సభ్యులును గలరు. ప్రేమనగర్, స్వామీనగర్ విద్యుత్‌నగర్, స్వేతనగర్, కార్యవీరనగర్, శరణాశ్రమనగర్ అను నాలు మొహల్లాలును దీని యధీనములో నున్నవి టౌనుఏరియాలోని జనాభా అయిదు వేలు.

86. టౌన్ ఏరియాకమిటీవారు తమకమిటీ నిబంధనలను నిర్ణయించుకొనిరి. వాని యాదర్శములలో గొన్నిటి నీక్రింద వ్రాయుచున్నాము –

(a) దాని యధికారములోనున్న యావరణలోని పరిస్థితులను ఆరోగ్య సూత్రముల ననుసరించి యుంచుట,

(b) ప్రజాసామాన్యముయొక్క ఆరోగ్యసంరక్షణ జేయుట,

(c) రోడ్లమీద బండ్లు రాకపోకలను కట్టుబాటులో నుంచుట,

(d) దాని యావరణములో శాంతివాతావరణ ముండునట్లు ఏర్పాటు జేయుట జననమరణములను రిజిష్టరు చేయుటకును దీని యావరణములో తిరుగునట్టి వాహనముల కనుమతి యుత్తరువుల నిచ్చుటకునుగూడ నేర్పాట్లు చేయబడినవి

87. టౌన్ఏరియాఆవరణములోనున్న రోడ్లలో మూడు రోడ్లు రాజవీధులును. మిగిలిన వన్నియు రాధాస్వామీసత్సంగసభకు జెందిన సొంత రోడ్లును. ఆ మూడింటిలో నొకటియగు పొయ్యాఘాటురోడ్డు పి.డబ్లియూ డి. వారి పోషణలోనున్నది మిగిలిన రెండురోడ్లలో నొకటి జగన్‌పూరునకు పోవునదియును, రెండవది నగలాహావేలీ యను కుగ్రామమునకు పోవునదియును. ఈరెండురోడ్లును రాధాస్వామీసత్సంగసభవారే వేయించిరి. కాని ప్రస్తుతము టౌన్ఏరియాకమిటీయే వానిని సంరక్షణజేయుచున్నది ఈ మూడు రోడ్లలోను దీపములు వెలిగించుబాధ్యత టౌన్ఏరియాకమిటీవారిదే. ఆకమిటీ వారు తమ ద్రవ్యనిధినుండియే యందులఖర్చును భరించుచున్నారు.

88, కమిటీవారు పొయ్యాఘాటురోడ్డులో యాతాయాతముల రద్దీయొక్క వగనున్న భాగములో పాదచారుల సౌకర్యముకొఱకై యీక్రింది నిర్మాణములను జేసిరి:

(i) 750 అడుగుల పొడవుగల నడకత్రోవ,

(ii) 534 అడుగుల పొడుగైన యొక మురికికాల్వ,

(iii) ప్రజాసామాన్యముపయోగించుకొనుటకై రెండు మూత్రపు దొడ్లు.

ఇవిగాక, నగలాహ వేలీరోడ్డులో 370 అడుగుల దూరము కంకరను వేయించిరి. మఱియు విద్యుత్ నగర మొహల్లానుండి కొంచెము దూరములో నీ మధ్యన సంపాదించిన భూమికి విద్యుత్ నగరపు మురికినీరును గొనిపోవుటకు 855 అడుగుల పొడుగున నొక మురికికాల్వనుగూడ నీకమిటీవారు త్రవ్వించిరి.

పొయ్యాఘాటురోడ్డున బోవుమోటారుబండ్ల వేగమును కట్టుబాటులో నుంచుటకై, వాహనవేగనియామక ఫలకములు నారోడ్డులో పెట్టెలుచోట్ల నుంచిరి. అదియునుగాక పొయ్యాఘాటురోడ్డు పొడుగునను గోల్డుమొహర్ (Gold mohar) అనుపేరుగల మొక్కలనుగూడ నాటించిరి.

## (H) ధార్మిక సంఘములు

## I–సర్ సాహబ్జీమహారాజ్ చారిటబిల్ ట్రస్టు

(Sir Sahabji Maharaj Charitable Trust)

89. దేశముయొక్క వివిధప్రాంతములలోని సత్సంగులలో గొందఱుజేరి, ద్వితీయప్రపంచమహాయుద్ధము వలన ప్రజలకుగలిగిన మహాదుఃఖములచే కంపితులై దయాల్బాగుయొక్క పరమపూజ్యప్రఖ్యాతస్థాపకుల బేరున "సర్ సాహబ్జీమహారాజ్ చారిటబిల్ ట్రస్టు" అనునొక ధర్మసంస్థ నీక్రిందియుద్దేశములతో స్థాపించి, దానికొఱకై సత్సంగులనుండి విరాళములను గైకొనుటకు నిశ్చయించిరి. ఆయుద్దేశ్యము లెవ్వియనగా:–

(i) రోగగ్రస్తులకు వైద్యచికిత్స చేయించుట,

(ii) విద్యాభ్యాసమునకు సౌకర్యములను గల్పించుట,

(iii) దుఃఖములను దారిద్ర్యమును తొలగించుట, ముఖ్యముగ వనాథులు, విధవలు, వృద్ధులు, వికలాంగులు, అశక్తులు, నిరుపేదలు నైనవారి దుఃఖ దారిద్ర్యములఁ దొలగించుటయును.

90. వారి ప్రయత్నములు ఫలించి, యొకలక్షరూపాయల ధనము ప్రోగుకాగనే, ఆగ్రా రిజిష్ట్రారువారి ఆఫీసులో 28-12-49 తేదీన నొకట్రస్టు దస్తావేజును రిజిష్టరుచేయించి, దానిప్రకార మిద్దఱు ధర్మకర్తల నేర్పాటుజేసి, యాధనమును వారికొప్పగించిరి.

91. ఈధర్మార్థనిధికి మొదటిలో దయాల్బాగునే కేంద్రముగ జేసిరి కాని దీనికై విరాళముల నెక్కువగ నిచ్చిన ఢిల్లీసత్సంగులకోరికపై దీని కేంద్రమును ఢిల్లీకి మార్చిరి.

92. ఈట్రస్టుపేరుతో స్థిరచరాస్థుల నుంచుటకు సావకాశము కలుగజేయుటకై 1950 సంవత్సరాంతమున ధర్మకర్త లీట్రస్టును 1860 సంవత్సరపు 21 నెంబరు చట్టము అయిన సొసైటీస్ రిజిష్ట్రేషన్ ఆక్టు క్రింద రిజిష్టరుచేయించిరి

93. ఈ ట్రస్టున కొక యధ్యక్షుడు, నొక యుపాధ్యక్షుడు, నొక కార్యదర్శియు, నొక సంయుక్తకార్యదర్శియును గలరు. పై నలుగురితోగలిపి దీనికి మొత్తము తొమ్మండ్రు సభ్యులుగలరు.

దయాల్బాగులోను, ఇతర స్థలములలోను పనిచేయుచున్న ధర్మసంస్థలకు ద్రవ్యసహాయము చేయుచుండుటయే యాట్రస్టుయొక్క ముఖ్యకార్యము.

## II-రాధాస్వామీ ధార్మిక సంఘము
## (Radhasoami Charitable Society)

94. మహాయుద్ధానంతరమందు రాబోవు నూతన ప్రపంచవ్యవస్థయొక్క భావ్యవసరములను గుర్తించి, పంజాబుదేశసత్సంగులు వెంటనే సామాజిక సంరక్షణార్థమై పథకముల నేర్పాటుచేసికొని, దేశములోని విద్యావిహీనులకు రోగార్తులకు, నిరుపేదలకును దానధర్మకార్యములను విరివిగ చేయుట యత్యావశ్యకమైయున్నదని గ్రహించి రాధాస్వామీధార్మిక సంఘము అను నొక ధర్మప్రధానమైన సంఘమును స్థాపించఁదలచిరి. ఆయుదేశ్యములో, విద్యాభ్యాససౌకర్యములను గల్పించుట, రోగచికిత్సాసహాయముజేయుట,

విద్యార్థి వేతనములనిచ్చియు మఱొకవిధముగ ద్రవ్యసహాయముచేసియు, విద్యాభివృద్ధికి దోడ్పడుటయు, మొదలగు ధర్మకార్యములకొఱకు విరాళము లను బ్రోగుచేయనారంభించిరి.

95. ఈసంఘమును 1860 సం॥రపు 21 చట్టమైన సొసైటీస్ రిజిస్ట్రేషన్ ఆక్టుక్రింద 3–2–1942 తేదిన రిజిస్టరుచేయించిరి. దీనికి మొదట దయాల్బాగునే కేంద్రముగ జేసిరి. కాని 1942 సం॥రము జూన్ నెలలో పంజాబుసత్సంగుల కోరికపై దీనికేంద్రమును అమృతిసరునకు మార్చిరి. కాని పంజాబు విభజనమ యినతరువాత దీనికేంద్రమును తిరిగి దయాల్బాగునకు మార్చివేసిరి.

96 ఈసంఘమున కొక యధ్యక్షుడు నొక యుపాధ్యక్షుడు, నొక కార్య దర్శియు, నొక యార్థికవిషయవిమర్శకులును గలిసి మొత్తము 129 సభ్యులు. ఈసంఘకార్యములనన్నిటిని 14 సభ్యులుగల యొక కార్యనిర్వాహకవర్గము సాగించుచుండును. దయాల్బాగులోను, బాహ్యమునను పనిచేయుచున్న కొన్ని ధార్మికసంస్థలకు ద్రవ్యసహాయము చేయుటయే యీసంఘముయొక్క ముఖ్య కార్యము.

## III–దయాల్బాగు రోగచికిత్సా సహాయకసంఘము
### (Dayalbhagh Medical Relief Society)

97. దయాల్బాగు సత్సంగులకు సంఘసంరక్షణసంఘవికాసల నిమిత్తమైన ప్రణాళిక నేదేని యేర్పాటుచేసికొనవలసిన యావశ్యకతాపరిజ్ఞానముండు టచే, వారు వెంటనే యుత్తమవైద్య చికిత్సాప్రబంధము నేర్పాటుచేయుట ముఖ్యావసరమైనట్లు గ్రహించిరి. కావున వారందఱును 29–3–1942 తేదీన సమావేశమై యీక్రిందియాదర్శములతో నొక ధార్మికసంఘము నేర్పాటు చేయవలయునని నిశ్చయించిరి:

(i) సకలవిధవైద్యసహాయమును జేకూర్చుట,

(ii) వైద్యశాలలను ఔషధాలయములను స్థాపించుటయు పోషించు టయు,

(iii) ప్రజల యారోగ్యాభివృద్ధికై తగుచర్యలను దీసికొనుటయు,

(iv) అర్హతగల విద్యార్థులకు రోగచికిత్సాశాస్త్రము నభ్యసించుటకు, విద్యార్థివేతనముల నిచ్చి సౌకర్యములను గలుగజేయుటయును.

98. ఈసంఘమును 1860 సం॥రపు 21వ చట్టమయిన సొసైటీస్ రిజిస్ట్రేషన్ ఆక్టు (Societies Registration Act) క్రింద 1942 సం॥రము జూన్ నెలలో "దయాల్బాగు మెడికల్ రిలీఫ్ సొసైటీ" యను పేరుతో రిజస్టరుచేయించిరి. ఈ సంఘమునకొక యధ్యక్షుడు, నొకయుపాధ్యక్షుడు, నొకకార్యదర్శియు, నొకసంయుక్తకార్యదర్శియు నొక యార్థికవిషయవిమర్శకుడునుగాక, 14 సభ్యులు గలరు. ఈసంఘము సంవత్సరమున కొకసారి సమావేశమగును.

99. ప్రస్తుత మీసంఘముయొక్క సామాన్యకార్యములన్నియు, నొక పాలకవర్గము (Governing body) నెఱవేర్చుచున్నది పాలకవర్గమునకు, ఈ సంఘములోని కార్యకర్తలైదుగురును తదితరసభ్యులయిదుగురును గలిసి మొత్తము పదిమంది సభ్యులు.

100. ఈసంఘ మీక్రిందిసంసలను పోషణ చేయుచున్నది :

## A దయాల్బాగులో

(i) 'శరణాశ్రమ' రోగచికిత్సాలయము (Saran Asram Hospital) ఈచికిత్సాలయములో నాంగ్లపద్ధతిని చికిత్సచేయుదురు. ఇందులో నీక్రింది విభాగములు పూర్తియయిన సాధనసామగ్రితో సమర్చబడియున్నవి :

(a) బయటనుండి వచ్చిపోవునట్టి రోగులకును, ఆస్పత్రిలోనే యుండి వైద్యముచేయించుకొను రోగులకును ప్రత్యేకవిభాగములు

(b) శస్త్రచికిత్సాశాల.

(c) ఎక్స్‌రేయంత్రము.

(d) రేడియాలజీ విభాగము.

(e) దంతవైద్యవిభాగము.

(f) ప్రసూతి విభాగము.

(g) సామాన్యరోగులలో స్త్రీలకును, పురుషులకును వేఱువేఱు గదులు.

ఈ యాస్పత్రిలో జాతిమతవివక్షలేకుండ దయాల్బాగులోనివారికిని, ఇరుగుపొరుగు గ్రామములలోనివారికినిగూడ వైద్యముచేయబడును.

(ii) ఆయుర్వేదౌషధాలయము

(iii) హోమియోపతీ ఔషధాలయము.

(iv) యునానీ ఔషధాలయము.

ఇంతియగారి నీసంఘము కాలనీలోని హోమియోపతీ వైద్యుల కుచితవై ద్యముజేయునిమిత్తము తగిన ధనసహాయమునుగూడ జేయును.

## B. ఇతరస్థలములలో

పంజాబులో నొకహోమియోపతీ చికిత్సాలయము, ఉత్తరప్రదేశములో రెండు, ఆంధ్రప్రదేశములో నైదును హోమియోపతీ చికిత్సాలయములు ఉన్నవి.

101. ఈసంస్థలన్నియు, తగినవిద్యాప్రాప్తులు గలిగి, తమబాధ్యతలను తెలిసి కొని, శ్రద్ధాభక్తులతోను, ఉత్సాహముతోను పనిచేయునట్టివారిచే నడిపింప బడుచున్నవి.

# (I) బ్యాంకులు (Banks)

## A రాధాస్వామీ బ్యాంకు, లిమిటెడ్

102. దయాల్బాగు, విద్యాభ్యాసమునకును, పరిశ్రమలకును, ఒక ముఖ్య కేంద్రముగ వృద్ధినొందుచున్నకాలమది, యిచ్చటి వ్యాపారిక, పారిశ్రామిక విద్యాసంస్థలకును, సత్సంగులకును, ధనవిషయమైన లావాదేవీయవసరములను గడపుటకై యొక బ్యాంకును స్థాపించుట యత్యావశ్యకమయ్యెను. అందుచే 1929సం॥రములో 20లక్షలరూప్యములయధికృతమూలధనములో(Authorised) Capital) "రాధాస్వామీ జనరల్ అండ్ అస్యూరెన్సు బ్యాంకులిమిటెడ్ రి" అనుపేరున నొక బ్యాంకును రిజస్టరు చేయించిరి. 4 లక్షలరూప్యముల విలువ గల షేర్లను మాత్రమే మొట్టమొదట జారీచేయగా, నవన్నియు పూర్తిగ నమ్ముడెపోయినవి. వానిమీద నభికాంక్షితమూలధనము (Calledup Capital రు 120,000 రూప్యములును పూర్తిగ వసూలయ్యెను. దాని డైరెక్టర్లవర్గము నకు (Board of Directors) ప్రధమాధ్యక్షులు పరమపవిత్ర స్వరూపులైన సాహబ్జీమహారాజ్ సర్ఆనందసరూప్ Kt (నైట్)వారే. ఇండియన్ కంపె నీస్ అక్టు 277 శెక్షన్ క్రొత్తగవచ్చుటచే 1937 సం॥రము డిశెంబరు నెలలో దాని నామధేయమును "రాధాస్వామీ బ్యాంకులిమిటెడ్" అనిమార్చి

1941 సం॥రములో మెహతాజీసాహెబ్‌వారు డైరెక్టర్లవర్గమునకు (Board of Directors) అధ్యక్షపదవి నలంకరించి, 1946 సం॥రములో తిరిగి ఆర్. బి. గురుసరన్‌దాస్ మెహతా ఐ.ఏ ఏ.యస్. (రిటైర్డు)గారికి ఆయధ్యక్షపదవి నిచ్చి వేసిరి

103. ఈక్రిందిపట్టీనిబట్టి 1929 సం॥రము మొదలుకొని 1960 సంవత్సరము వఱకు నీబ్యాంకుయొక్క వృద్ధివికాసలు విశదముకాగలవు.

| | | 31-12-29 | 31-12-37 | 31-12-53 | 31-12-60 |
|---|---|---|---|---|---|
| 1 | సంచితమూలధనము (Paidup Capital) | 12,0,000 | 1,30,000 | 1,38,000 | 1,39,855 |
| 2. | క్షేమనిధి (Reserves) | — | 86,000 | 1,45,000 | 1,50,500 |
| 3. | నిక్షేపములు వగైరాలు Deposits etc. | 5,48 000 | 15,29,000 | 37,55,000 | 43,53,800 |
| 4. | కార్యకరమూలధనము (Working Capital) | 6,82,000 | 19,63 000 | 40,82,000 | 49,84,500 |
| 5. | వ్యాపారవిన్యస్తద్రవ్యములు (Investments) | 2,16,000 | 3,70,000 | 27,51,000 | 35,79,100 |
| 6. | ఖాతాబాకీలు (Bookdebts) | 2,76,000 | 14,01,000 | 8,72,000 | 10,07,500 |
| 7. | నగదునిల్వ, బ్యాంకునిల్వ (Cash and Bank Balances) | 1,66,000 | 2,02,000 | 2,19,000 | 2,36,021 |
| 8. | లాభము ( Profit ) | 3,000 | 32,000 | 28,500 | 48,220 |

104. 1947 సం॥రములో దేశవిభజనమైనతోడనే పాకిస్తాన్‌లోని చాల బ్యాంకులు దివాలాతీసినవి. రాధాస్వామీబ్యాంకునకుగూడ నందుమూలమున నధికనష్టము సంభవించెను ఇంతనష్టము గలిగినను, 31-12-59 నాటికి దీనినష్టములన్నియు నష్టములఖాతాను వ్రాసివేయగా దీనిక్షేమనిధి మొత్తము దీని షేర్లమూలధనము రు 1,40,000/-లకన్న (1952 సం॥రములో, మఱికొన్ని రు 20,000/-లు విలువగల షేర్లను జారీచేయుటచే షేర్లమూలధన మింత మొత్తమువఱకు పెరిగినది.) హెచ్చుగనేయుండి, 1959 సం॥రములో దీని నికర లాభము రు 49,800/-లు అగుటచే నూటికి రు 13-2-0లు చొప్పున వాటాదారులకు లాభమును పంచిపెట్టిరి. ఈబ్యాంకు ద్రవ్యమునుప్రభుత్వపు ఋణ

పత్రములలోను (Govt. Securities) ఉత్తమశ్రేణి కంపెనీల ఋణపత్రముల లోను (Debentures) గొప్పయార్థికస్థిరత్వముగల బ్యాంకులలోను పెట్టుబడి పెటిరి. ఈ బ్యాంకువారు, సర్కారు ఋణపత్రములను, డిబెంచర్లను (Debentures) బ్యాంకుల ఫిక్సెడ్ డిపాజిట్లను తాకట్టుతీసికొని అప్పులనిచ్చు చుందురు. కావున నీ బ్యాంకుయొక్క స్థితి నిరపాయమైనది.

## B. అమృతసర్ రాధాస్వామీ బ్యాంకు, ప్రైవేటు లిమిటెడ్

105. అమృతసర్ రాధాస్వామీబ్యాంకును 4-5-1943 తేదీన నొక ప్రైవేటు లిమిటెడు కంపెనీగా రిజిస్టరు చేయించిరి. దానియధికృత మూల ధనము (Authorised Capital) రు 500,000/-ల రూప్యములను, ప్రిఫరెన్సు షేరు 1కి రు 100/-లు చొప్పున 2000 ప్రిఫరెన్సు షేర్లుగను, సాధారణషేరు 1కి రు 50/-ల చొప్పున 6000 సాధారణషేర్లుగను విభజించిరి. అందుండి రు 2,00,000/-లు విలువగల షేర్లను జారీచేయగా నవియున్నియు పూర్తిగ అమ్ముడైపోయెను. వానిక్రింద రు. 50,000 మూలధనము వసూలాయెను. ఆబ్యాంకు దాని మేనేజింగు డైరెక్టర్ శ్రీ బోధరాజుగారి యాజమాన్యమున 7-6-1943 తేదినుండియు, నమృతసరులో పనిచేయప్రారంభించెను. 9-8-'43వ తేదిన దాని కొకశాఖను దయాల్బాగులోగూడ తెఱచిరి.

106. ఇండియన్ కంపెనీస్ సవరణచట్టమయిన 1944 సంllరపు నాల్గవ చట్టముప్రకారము 1946 సంllరములో దానియధికృత మూలధనమును రు 500,000/-ల నుండి, రు 400,000/-లకు తగ్గించి, సంచితమూలధనమును రు 50,000/-ల నుండి రు 1,00,400/-లకు పెంచిరి. 1-9-1948 సంllరము నుండియు దీని హెడ్డాఫీసును దయాల్బాగునకు మార్చివేసి, దయాల్బాగులో నున్న దీనిబ్రాంచి ఆఫీసును కట్టివేసిరి 1949 సంllరపు బ్యాంకింగు కంపెనీల చట్టము యొక్క 11వ సెక్షన్ప్రకార మీకంపెనీయొక్క సంచితమూలధన మును తిరిగి రు 1,50,000/-లకు హెచ్చించిరి.

107 ఈ బ్యాంకు సత్సంగసంఘమునకు 15 సంవత్సరములు సేవజేసెను ఈక్రింద పొందుపఱచిన వివరములనుబట్టి, యీ బ్యాంకుయొక్క యంత్యసమ యమునాటికి దీని యార్థికస్థితి యెట్లుండినది తెలియగలదు.

| | 1953 | 1955 | 1957 |
|---|---|---|---|
| 1. సంచితమూలధనము (Paidup Capital) | 1,49,830 | 1,49,920 | 1,49,920 |

| | | | |
|---|---|---|---|
| 2. క్షేమనిధి (Reserves) | 13.100 | 13,100 | 13.100 |
| 3. నిక్షేపములు వగైరా (Deposits etc) | 10,35,790 | 9,35,036 | 10,78.453 |
| 4. కార్యకరమూలధనము (Working Capital) | 11,85,372 | 11,36.755 | 12.81,114 |
| 5. వ్యాపారవిన్యస్తద్రవ్యములు (Investments) | 6.88,200 | 7,93,000 | 8,31.270 |
| 6. ఖాతాబాకీలు (Book debts) | 3,64,764 | 1,33,227 | 85,796 |
| 7. నగదునిల్వ, బ్యాంకునిల్వ (Cash and Bank Balancens) | 1,23,270 | 1,10,628 | 82,623 |
| 8 లాభము (Profit) | 18.214 | 22,102 | 26,580 |

108. 1957 సం॥రము అక్టోబరు నెలలో రిజర్వు బ్యాంక్ అఫ్ ఇండియా వారు ఈబ్యాంకు చిన్నసంస్థయగుటచే దీనిని రాధాస్వామీబ్యాంకులో కలిపి వేసినచో లాభకరముగనుండునని సలహానిచ్చిరి. కాని షేరు హోల్డర్లందఱును 5-9-1958 తేదిన జరిగిన సమావేశములో నీవిషయమై యాలోచించి, యీ బ్యాంకును స్వచ్ఛందముగ నెత్తివేయుటయే శ్రేష్ఠతరమని నిశ్చయించిరి.

109. ఋణదాత లందఱికిని బాకీలు పూర్తిగ తీర్చివేసిన పిమ్మట భాగస్వాములకు నూటికి రు 91/-లు చొప్పున వారి మూలధనమును తిరిగి యిచ్చివేసిరి. సర్కారుఋణపత్రములమీద (Govt. Securities) వసూలయినవృద్ధిని వ్యావహారికాదాయముగనెంచి, నిల్వయున్ననష్టమును దానిలో ముదరాచూచుటకు ఇన్కంటాక్సు ఆఫీసరు (Incometax Officer) అంగీకరించకుండ, నావృద్ధియాదాయము అంతటిమీదను ఆదాయపుపన్నును (Incometax) విధింపనిశ్చయించినందున నావిషయమును గుఱించి అలహాబాదు హైకోర్టులో చర్యలు జరుగుచున్నవి. ఆచర్యలపర్యవసానముతేలువఱకు నీబ్యాంకు యొక్క అంతిమపరిసమాపన మాఁగిపోయియున్నది.

## C. ముజఫర్‌పూరు రాధాస్వామీ బ్యాంకు, ప్రయివేటు, లిమిటెడ్

110. ముజఫర్‌పూర్ రాధాస్వామీబ్యాంకు 26-5-1943 తేదీన నొక ప్రయివేటులిమిటెడుకంపెనీగా రిజిష్టరయి, భారతదేశప్రభుత్వమువారు మూల

ధనమును వసూలుచేయుటకు త్తరువీయగనే. శ్రీ. ఛా. రామనవమీప్రసాద్ అడ్వకేటుగారు దానికి మేనేజింగుడైరెక్టరుగనుండి ముజఫర్‌పూరులో 3-4-1944 తేదినుండియు పనిజరిపించుట ప్రారంభించిరి. తరువాత 11-4-1944 తేదీన దానికొక శాఖను దయాల్బాగులో పెట్టిరి. దాని యధికృతమూలధనము(Authorised Capital) 5 లక్షలరూప్యములు. 2 లక్షలరూప్యముల విలువగల ప్రిఫరెన్సు షేర్లను జారీచేయగా నవిపూర్తిగ అమ్ముడు అయి, వానిమీద రు 50,000/-లు మూలధనము వసూలాయెను. ఇండియన్ కంపెనీస్ సవరణ చట్టమగు 1944 సం॥రపు. 4వ చట్టము 7-3-1944 తేదీన ప్రచారములోనికి వచ్చినందున, దాని నియమములతో ననుకూలించు నిమిత్తమై, యీ బ్యాంకుయొక్క యధికృతమూలధనమును 5లక్షలనుండి 4 లక్షల రూప్యములకు తగ్గించిరి. దీని యభిదత్తమూలధనము (Subscribed capital) 2 లక్షలరూప్యముల నటులనేయుంచిరి. దీని సంచితమూలధనమును రు 50,000/-లనుండి లక్ష రూప్యములవఱకు పెంచిరి.

111, పాట్నా హైకోర్టువారి యనుమతిపై నీబ్యాంకు కేంద్రస్థానమును బీహారులోని ముజఫర్‌పూరునుండి ఉత్తరప్రదేశములోని దయాల్బాగునకు 12-5-1948 తేదినుండి మార్చిరి. ఆ తేదీనుండి దయాల్బాగులోని దీనిశాఖ మూసివేయబడినది.

112. ఈబ్యాంకు సత్సంగసంఘమునకు' 15 సంవత్సరముల కాలము సేవ చేసినది దీని యంత్యదశలో దీనిఆర్థికపరిస్థితి యీక్రిందిపట్టికనుబట్టి తేటపడగలదు

| | 1953 | 1955 | 1957 |
|---|---|---|---|
| 1. సంచిత మూలధనము (Paid up Capital) | 1,00,000 | 1 00 000 | 1 00,000 |
| 2. క్షేమనిధి (Reserves) | 5,800 | 8,200 | 13,000 |
| 3 నిక్షేపములు వగైరా (Deposits etc ) | 10,22,920 | 8,80,334 | 8,25,984 |
| 4. కార్యకర మూలధనము (Working Capital) | 11,33,224 | 9,93,147 | 9.45,271 |
| 5. వ్యాపారవిన్యస్తద్రవ్యము (Investments) | 4,90,347 | 4,95,192 | 4 95,192 |

| | | | | |
|---|---|---|---|---|
| 6 | ఖాతాబాకీలు (Book debts) | 4,51,705 | 2,13,069 | 4,05,100 |
| 7. | నగదునిల్వ. బ్యాంకునిల్వ (Cash and Bank balances) | 1,86,682 | 2,81,181 | 1,44,978 |
| 8. | లాభము (Profit) | 10,455 | 4,644 | 6,287 |

113. రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా వారు ఇట్టి చిన్న బ్యాంకుల పరిస్థితిని గుఱించి విమర్శించినమీదట నీ బ్యాంకును రాధాస్వామీబ్యాంకుతో కలిపి వేయవలసినదని యుత్తరువిచ్చిరి. కాని యీబ్యాంకు భాగస్వాముల సార్వజనీనసమావేశములో 23-7-1958 తేదీన నీవిషయమ్ముపై విమర్శించి, దీనిని స్వచ్ఛందముగ పరిసమాపనముజేయుటయే మంచిదని తీర్మానించిరి.

114. ఋణదాతలకు బాకీలు పూర్తిగ దీర్చివేసినపిదప భాగస్వాములకు 102% చొప్పున వారిమూలధనమును తిరిగి యిచ్చివేసిరి. సర్కారు ఋణపత్రములమీద (Govt. Securities) జమవచ్చిన వడ్డీలాభమును వ్యావహారిక లాభముగనెంచి, నిల్వయున్న నష్టములకు దానిని ముజరాచూచుకొనుటకు ఇన్‌కంటాక్సు ఆఫీసరు (Incometax Officer) ఒప్పుకొనకపోవుటచే నావిషయమై అలహాబాదుహైకోర్టులో చేసిన అప్పీళ్ళ పర్యవసానము నిశ్చితమగు వఱకు దీని యంతిమపరిసమాపనము నాఁపుజేసిరి.

## D. కాకినాడ రాధాస్వామీ బ్యాంకు, ప్రైవేటు, లిమిటెడ్

115. కాకినాడ రాధాస్వామీబ్యాంకును 3-5-1943 తేదీన నొక ప్రయివేటు లిమిటెడ్ కంపెనీగా 5 లక్షల రూప్యముల యధికృతమూలధనముతో రిజిష్టరు చేయించిరి. ఈ 5 లక్షలను, షేరు 1కి రు 100/- రూపాయిలు చొప్పున 2000 ప్రిఫరెన్సు (అధిమాన) షేర్లుగను, షేరు 1కి రు 50/-లు చొప్పున 6000 సాధారణ షేర్లుగను యేర్పాటుచేసిరి. 2 లక్షల రూప్యములు విలువచేయు షేర్లను జారీచేయించగా, నవి యన్నియు పూర్తిగ నమ్ముడు అయి, రు 50,000/-లు సంచితమూలధనము వసూలు అయ్యెను. 1943 జూన్ నెల 8వ తేదినుండియు నీ బ్యాంకు కాకినాడలో పనిచేయుట ప్రారంభించినది. 21-2-1944 తేదీన దయాల్బాగులో దీని యొక శాఖను పెట్టిరి. 1944 సం॥రపు 4వ చట్టమైన ఇండియన్ కంపెనీల సవరణచట్టమునిబంధనలతో ననుకూలించుటకుగాను దీని యధికృత మూలధనమును 5 లక్షలనుండి 4 లక్షల రూప్యము

లకు తగ్గించి, సంచిత మూలధనమును (Paid up Capital) రు 50,000/-ల నుండి, రు 1,00,400/-లకు పెంచిరి.

116. 1942 సం॥రపు బ్యాంకింగ్ కంపెనీలచట్టము, 15వ సెక్షనులోని నిబంధ నానుసారము ఈ బ్యాంకుయొక్క సంచితమూలధనమును రు 1,00,400/-ల నుండి తిర్గి రు 1,75,000/-ల వఱకును హెచ్చించిరి. 1949 సం॥రము ఆగస్టు 21వ తేదినుండి యీ బ్యాంకుశాఖను దయాల్బాగులో మూసి వేసిరి.

117. ఈ క్రింది పట్టీనిబట్టి యీబ్యాంకుయొక్క యార్థికపరిస్థితి గోచరము కాగలదు.

| | | 1953 | 1956 | 1960 |
|---|---|---|---|---|
| 1 | సంచితమూలధనము (Paid up Capital) | 1,75,000 | 1,75,000 | 1,75,000 |
| 2. | క్షేమనిధి (Reserves) | — | — | 21,450 |
| 3. | నిక్షేపములు వగైరా (Deposits etc.) | 7,50,340 | 9,64,568 | 8,56,700 |
| 4. | కార్యకరమూలధనము (Working Capital) | 9,43,872[1] | 11,79 718[2] | 10,92,000[3] |
| 5. | వ్యాపారవిన్యస్త ద్రవ్యములు (Investments) | 8.06,726 | 10.10,766 | 6,57,000 |
| 6. | ఖాతాబాకీలు (Book delets) | 64,266 | 51,503 | 1,06,200 |
| 7. | నగదునిల్వ, బ్యాంకునిల్వ (Cash and Bank Balance) | 23,333 | 35,712 | 2,56,628 |
| 8. | లాభము (Profit) | 7,687 | 6,393 | 25,744 |

118. దీనివ్యాపారము నభివృద్ధిచేయుటకు తగినచర్యలను తీసికొనవలయు ననియు దీనిలాభమును దీనిక్షేమనిధిని హెచ్చించవలయుననియు రిజర్వుబ్యాంకు ఆఫ్ ఇండియా వారు 1960 సం॥రము అక్టోబరునెలలో నీబ్యాంకుడైరెక్టర్లకు సలహానిచ్చిరి. ఈబ్యాంకు ప్రజాసామాన్యముతో వ్యవహరించుటలేదు గావున నీబ్యాంకుసభ్యులందఱును దీని నొక బ్యాంకువ్యాపారములేనట్టి కంపె

1. ఓవర్‌డ్రాఫ్టు వగైరా రు 18,532/-లు ఇందులో జేరియున్నవి 2 ఓవర్‌డ్రాఫ్టు వగైరా రు 40,150/-లు యిందులో జేరినవి. 3. ఈ మొత్తములో చెల్లించకుండ నుండిపోయిన ఖర్చులు వగైరా లును లాభమును మొత్తము రు 38 850/-లు జేరియున్నవి.

సీగా (Non-banking concern) మార్చి దీనిసభ్యుల నుండిమాత్రమే డిపాజిట్లను తీసికొనుచుండవలెనని దీని డైరెక్టర్లను హెచ్చరించుచు తీర్మానించిరి.

## E. రాధాస్వామీ సెంట్రల్ కోఆపరేటివ్ బ్యాంకు లిమిటెడ్

119. రాధాస్వామీ సెంట్రల్ కోఆపరేటివు బ్యాంకు మొదట 1947 సం॥రములో 'దయాల్బాగు సెంట్రల్ కోఆపరేటివు బ్యాంకు లిమిటెడ్' అను పేరుతో, కోఆపరేటివు సొసైటీస్ చట్టముక్రింద రిజిష్టరయి, ఆసంవత్సరము వసంతపంచమీ సుదినమునుండియు పనిచేయుట ప్రారంభించెను. దీనిని ముఖ్యముగ దయాల్బాగు పారిశ్రామిక సహకారసంఘములకు ద్రవ్యసహాయముచేయు నుద్దేశ్యముతో ప్రారంభించిరి.

120. ఈ బ్యాంకులో సహకారసంఘములేగాక ప్రత్యేకవ్యక్తులుగూడ భాగస్వాములుగ జేరిరి. వ్యక్తిగతషేర్లు షేరు 1కి రు 100/-లు విలువగల 5000 షేర్లును, షేరు 1కి రు 100/-లు విలువగల యనిర్దిష్టసంఖ్యాకములయిన సహకారసంఘముల షేర్లును దీనికి యంశీయమూలధనమై యున్నవి.

121 ప్రభుత్వమువారివద్దనుండిగాని, మరెవరివద్దనుండిగాని యీబ్యాంకు బదులు తీసికొనదు. దీని కార్యకలాపమంతయు దీనిసభ్యులయిన సంఘముల కప్పులనిచ్చుటయు నాసంఘములపేర లెక్కపు జమలుచేయుటయు, డిపాజిట్లను తీసికొనుటయు మాత్రమే.

122. ఈ బ్యాంకునందు దీని భాగస్వాముల సార్వజనీనసంఘమునకే సంపూర్ణాధికారమున్నది. ఆసంఘముయొక్క యధికారమునకులోబడి యొకడైరెక్టర్లబోర్డును ఒక కార్యనిర్వాహకవర్గమును, ఒక మేనేజరును దీనిలో పనిచేయుచున్నారు. ఈబ్యాంకు మేనేజరు ఒక్కరే దీనిప్రధానకార్యనిర్వాహణాధికారి. ఉత్తరప్రదేశసహకారసంఘముల రిజిస్ట్రారువారి యనుమతిని ముందుగ పొందినతరువాతనే దీనికి మేనేజరును నియమించిరి.

123 ఈబ్యాంకున కింతవఱకు నెన్నడును నష్టములు గలుగలేదుసరిగదా, నష్టపోయిన బాకీలుగూడ నేమియు దీనికి లేవు. ఈబ్యాంకులో ద్రవ్యాపహరణముగూడ నెన్నడును జరుగలేదు. మొదట 8 సంవత్సరములు నీబ్యాంకు బాగుగనే వృద్ధిపొందెనుగాని, యాతరువాత దీనికి సభ్యసంఘముల మూలముగ

వ్యాపారము తక్కువవచ్చుచుండుటచే దీనియభివృద్ధికి కొంతయాటంకము గలిగెను. సుమారు రెండుసంవత్సరములుమాత్రమే యివ్విధముగనుండెను. పిదప నాకష్టములన్నియు దొలఁగిపోయినందున నిది క్రమాభివృద్ధి నొందుచునే యుండెను.

124. 1959 సం॥రము డిసెంబరునెలలో నాగ్రాఅడిషనల్ డిస్ట్రిక్టు కోఆపరేటివ్ ఆఫీసరుగా రీబ్యాంకును పరిశీలించి, దీనినిగురించి యీక్రిందిపర్యవసానములను తేల్చిరి'–

(a) ఈబ్యాంకు ఒక చాల పెద్ద వర్థమానసంస్థయనియు,

(b) దీనియార్థికపరిస్థితి సుస్థిరమైనదనియు, తనభద్రతకొఱకై యిది స్టాండర్డు బ్యాంకులతో మాత్రమే వ్యవహారములు చేయుచున్నదనియు,

(c) ఈబ్యాంకు, సహకార చట్టనియమనిబంధనలప్రకారం ముంచవలసిన రొక్కపునిల్వకన్న, చాలయెక్కువ నిల్వలనే దాఁచియుంచుచున్నదనియు,

(d) దానిబుక్కులలో దానివ్యాపార విన్యస్తధనముల విలువలు మార్కెట్టుధరలకంటె చాలతక్కువగనే వ్రాయబడినవనియు,

(e) రిజర్వుబ్యాంకువారి సహాయమునుగాని, ప్రభుత్వమువారి నిందులో పాల్గొనుమనిగాని యెన్నడు నీబ్యాంకు కోరలేదనియు.

125 దీనియార్థికస్థితి యీక్రిందివివరములనుబట్టి తేటపడగలదు :–

| | 1947 | 1955 | 1960 |
|---|---|---|---|
| 1. సంచితమూలధనము (Paidup Capital) | 1,22,200 | 80 000 | 2,50,750 |
| 2. క్షేమనిధి (Reserves) | — | 38,915 | 47,166 |
| 3. నిక్షేపములు వగైరా (Deposits etc) | 1,43.262 | 13 | 16,33,003 |
| 4. కార్యకరమూలధనము (Working Capital) | 2,65,452 | 1,18,928 | 19 32,008* |
| 5. వ్యాపారవిన్యస్తద్రవ్యములు (Investments) | 90,350 | 1,02,934 | 17,27,679 |
| 6. ఖాతాబాకీలు (Book debts) | 1,54.250 | 1,808 | 1,80,596 |
| 7. నగదునిల్వ, బ్యాంకునిల్వ (Cash and Bank Balances) | 21,421 | 13,688 | 34 974 |
| 8. లాభము (Profit) | 331 | 4.333 | 16,708 |

ఇందులో రాధాస్వామీ బ్యాంకు లిమిటెడ్‌వారిపై ఓవర్‌డ్రాఫ్టు రు 1089/-లు చేరియున్నవి.*

## (J) రాధాస్వామీ సత్సంగసభవారి ఆదాయముపై పన్ను విధించుట

126 సాహబ్జీమహారాజువారి దయామయపథప్రదర్శనముక్రింద, సభవారు సత్సంగులిచ్చిన భేంట్లను సద్వినియోగము చేసి, యనేకధార్మికసంస్థలను, పారమార్థిక సంస్థలను, వివిధవిద్యా సంస్థలనేగాక, ఆదర్శపారిశ్రామిక సంస్థలు (Model Industries) రాధాస్వామీవిద్యాసంస్థక్షీరశాల (R E. I Dairy బట్టలనేతయంత్రాగారము (Textile Factory) వగైరాలనుగూడ స్థాపించిరి. 1935 సం॥రమునఁ బరకు సభవారికి భేంట్లయాదాయ మొక్కటేగాక దాని యాస్తులవలన వచ్చిన రాబడిగూడ పన్నువిధించఁదగినదిగాదని తీర్మానించబడెను. 'ఛోటాభాయీ, యెదురు, జ్ఞానచంద్రబానర్' అనువ్యాజ్యెములో ప్రీవీకౌన్సిలువారితీర్మానము 1935 సం॥రము మార్చినెలలో వచ్చెను. అప్పుడున్న ఇన్కంటాక్సు ఆఫీసరు ఆ తీర్మానమునకు తప్పుటర్థముఁ దీసి, సాహబ్జీమహారాజువారిపైన నాదాయపుపన్ను విధించుటకు చర్యలను సాగించెను. ఆయిన్కంటాక్సు ఆఫీసరు, సభ యొక యథార్థమైన సంఘము గాదనియు, నది కేవలము సాహబ్జీమహారాజువారిచేతిలోని కీలుబొమ్మయనియు నభిప్రాయపడి, దానిని 1860 సం॥రపు 21వ చట్టముప్రకారము రిజిస్టరుచేయుటయే చట్టవిరుద్ధమని దృఢముగ వక్కాణించునంతదూరము వెడలెను. ఇన్కంటాక్సువిభాగము వారు, సత్సంగులిచ్చిన భేంటుద్రవ్యమును ఆద్రవ్యముతో సంపాదింపబడినయితరాస్తులను, వాని యాదాయమునుగూడ, సాహబ్జీమహారాజువారి సొంత యాస్తిగ పరిగణించి యాప్రకారము 1934-1935 పన్నునిర్ధారణసంవత్సరమునకు 20-1-1936 తేదీన సాహబ్జీమహారాజువారిమీద నాదాయపుపన్నును విధించెను. అప్పీలులో నాతీర్మానము, సాహబ్జీమహారాజువారిమీద నోటీసులు సరిగ నమలుజరుపబడలేదను 'టెక్నికలు' కారణముమీద రద్దుచేయబడెను. అయినను ఆగ్రా ఇన్కంటేక్సు ఆఫీసరు 1935-1936 పన్నునిర్ధారణసంవత్సరమునకు తిరిగి సాహబ్జీమహారాజ్ వారిమీద పన్నువిధించుటకు చర్యలను సాగింపఁదొడఁగెను.

127. సభపేరుతోనున్నట్టి యావదాస్తులును, భేంట్లుమొత్తములును, ఈ రెండువిధములసొత్తులమూలమున గలిగిన యాదాయమంతయును, సభవారికొక్కరికే సొంతహక్కుగ చెందుననియు, సాహబ్జీమహారాజువారికిగాని వారి

భార్యాపిల్లలకుగాని యందులో నెట్టిదైన హక్కు బాధ్యతలును లేవనియు తీర్మానముచేయవలసినదని గోరుచు సభవారు 1937 సం॥రములో సెక్రటరీ ఆఫ్ స్టేటు ఫర్ ఇండియా ఇన్ కౌన్సిల్ (Secretary of State for India In Council) వారిపైనను, సాహబ్జీమహారాజువారిపైనను ఒక వ్యాజ్యెమును దాఖలుచేసిరి. అదావామధ్యన, సాహబ్జీమహారాజువారు 1937 సం॥రము జూన్ నెల 24వ తేదిన నిర్యాణమైరి. వారియనంతరము వారిధర్మపత్నియు నిద్దఱుకుమారులును (అనగా శ్రీ ప్రేమసరూపు శాంతిసరూపులును) సభవారి ప్రత్యేకపుహక్కులను వప్పుకొనిరిగాని ఇన్కంటాక్సు విభాగమువారుమాత్ర మట్లుకాదని వాదించుచునేయుండిరి. 1938 ఆగస్టు 29వ తేదిని ఆగ్రాఅడిషనల్ సివిల్ జడ్జిగారు సభవారి హక్కులను సమర్థించుచు తీర్మానమునిచ్చిరి. అయినను ఇన్కంటాక్సువిభాగమువారు అలహాబాదుహైకోర్టులో నప్పీలు దాఖలుచేసిరి. హైకోర్టువారు 1943 ఆగస్టు 13వ తేదీన అప్పీలును తీర్మానము చేసిరి. అందులో హైకోర్టువారు,

(i) సభ యథార్థమయిన సంఘమనియు, 1860 సంవత్సరము నాలుగవ సొసైటీసు రిజిస్ట్రేషన్ చట్టముక్రింద నొకధార్మికసంఘముగ నది రిజిస్టరగుట న్యాయసమ్మతమనియు,

(ii) భేంటుసొమ్ములును, వానితో సంపాదించినయాస్తులును, వాని యాదాయమంతయును సత్సంగుల లాభార్థమయి సభవారిలో విన్యస్తమయి యున్నవనియు, సాహబ్జీమహారాజువారి కందులో నెట్టిసొంతహక్కును లేద నియు, వానివలన సాహబ్జీమహారాజువారికి స్వలాభ మేమియు నేకూరలేదనియు, తీర్మానముచేసి డిపార్టుమెంటువారి అప్పీలును కొట్టివేసిరి.

128. అడిషనల్ సివిల్ జడ్జిగారు 1938 సం॥రములో తీర్మానమునిచ్చిన పిదప, ఇన్కంటాక్సు విభాగమువారు రాధాస్వామీసత్సంగసభమీద నాదాయపుపన్ను విధించుటకు చర్యలను ప్రారంభించి, సభవారు, తామొక ధార్మికపారమార్థిక సంఘముగుటచే, తమయాదాయముపైన పన్నువిధించుట న్యాయసమ్మతముకాదని, చేయుచున్నవాదమును నిరాకరించిరి. అడిషనల్ సివిలుజడ్జిగారి తీర్మానముపైన ఇన్కంటాక్సువిభాగమువారు అప్పీలుదాఖలు చేయుచు, వందులతోపాటు ఆ విభాగమువారు తమక్రిందియధికారులకు, రాధా స్వామీసత్సంగసభలో విన్యస్తమయియున్నట్టి యాస్తులుఆదాయములవిష

యములో, సాహబ్జీమహారాజువారి యుత్తరాధికారిగ మెహతాజీసాహబ్ వారిని పరిగణించి, కాపుదలకొఱకును జాగ్రత్తకొఱకును, వారిపైన పన్నువిధించుటకుచర్యతీసికొనవలయుననిప్రోత్సాహముచేసిరి. కాని పైనుదహరించిన యలహాబాదుహైకోర్టుతీర్పు దర్శిలా 31-12-1943వ. తేదీన ఇన్కంటాక్సువిభాగము వారు ఈచర్యలను కట్టిపెట్టుకొనిరి అయినను రాధాస్వామీసత్సంగసభమీద మొదలుపెట్టిన పన్నువిధించుచర్యలనుమాత్రము నడిపించుచునేయుండిరి. క్రమప్రకార మీవిషయము అప్పీలులో ఇన్కంటాక్సు అప్పెలేటుట్రిబ్యునలువద్దకు రాగా, నాట్రిబ్యునలుయొక్క అలహాబాదుబెంచి 1948 ఫిబ్రవరి నెల 29 తేదీన సభ యొకధార్మికపారమార్థికసంఘమనియు నందుచే దాని యాదాయమంతయు పన్నువిధింపసర్హముగాదనియు తీర్మానించిరి. ఇన్కంటాక్సుడిపార్టుమెంటువా రీతీర్మానముపైనకూడ నలహాబాదుహైకోర్టులో నప్పీలు దాఖలుచేసిరి కాని 1953 సెప్టెంబరునెల 28వ తేదిన నాయప్పీలు త్రోసివేయబడెను. ఇన్కంటాక్సుడిపార్టుమెంటువా రందుమీద సుప్రీముకోర్టుకుకూడ అప్పీలుచేయ దలచిరిగాని, న్యాయశాఖామంత్రివర్గమువా రందుకంగీకరించనట్లు వినికిడివలన దెలియుచున్నది. ఇవ్విధముగ నిన్కంటాక్సువిభాగమువారితో 1935 సం॥ర ములో ప్రారంభమైన సుదీర్ఘవివాదను 1954 సం॥రము మార్చినెల ప్రాంతమునాటికి పూర్తిగ సమాప్తమయ్యెను.

129. 1937 సం॥రము తరువాత సభవారు తమ ఆదాయపుపన్ను విషయమై తమ లీగల్ అడ్వైజర్లద్వారా దేశములోని వివిధప్రసిద్ధన్యాయశాస్త్రప్రామాణికులతో సంప్రతించగా వారు భేంట్లుసొమ్మమీదను ఆస్తులయాదాయముమీదను ఆదాయపుపన్నును విధించకుండజేసికొనుటకు న్యాయసమ్మతమయిన సావకాశమున్నదనియు, కాని దాని వ్యాపారలాభములకు పన్నులేకుండజేసికొనుట కష్టసాధ్యమనియు సర్వసాధారణముగ జెప్పిరి అయినను. అంతకుమునుపే, సభవారు, తమపరిశ్రమలను వ్యాపారములను లిమిటెడ్ కంపెనీల కిచ్చివేసి తమస్థితిని పదిలపఱచుకొనవలయునని నిశ్చయించుకొనిరి. అందుకు కావలసిన మూలధనమును సత్సంగు లుదారబుద్ధితో జమచేసి లిమిటెడ్ కంపెనీలను స్థాపించినందున. సభవారి సమస్తవ్యాపారము పరిశ్రమలును ఆకంపెనీలచే తీసికొనబడెను. దానిఫలితముగ సభవారి కటుపిమ్మట పన్ను ఇంచుమించేమియు చెల్లించనవసరములేకుండ నిశ్చింతగనుండిపోయెను. భారతదేశపుప్రభుత్వమువారు ధార్మికసంఘములయొక్క వ్యాపారిక పారిశ్రామికా

దాయములపైన పన్నువిధించునిమిత్తమై యున్కంటాక్సుచట్టములో సీమధ్య ప్రవేశపెట్టిన సవరణాలను జూడగ, పైచర్యలనన్నింటిని సభవారు ముందుగనే తీసికొనుటలోగల దూరదర్శిత్వాపరిజ్ఞానములు తేటపడుచున్నవి. ఈ విషయములో రాధాస్వామిదయాళులు సత్సంగముపైన జూపిన యపారదయాసంరక్షణల కందఱమును వారిచరణకమలముల కతివినయగౌరవపూర్వకముగ మ్రొక్కుచుంటిమి.

## (K) దయాల్బాగు స్వామిబాగులమధ్య వ్యవహారములు

130. 1902 సం॥రమునకు పూర్వము, స్వామీజీమహారాజావారి పవిత్ర సమాధి. వారికనిష్ఠసోదరులైన సేఠ్ ప్రతాపసింగుగారి యధీనములోను, హుజూర్ మహారాజవారిసమాధి వారికుమారులైన లాలాజీగారి యధీనములోను, ఉన్నట్లు చదువరుల కిదివఱకే తెలియును మహారాజసాహబ్ వారు, పవిత్ర సమాధులొకప్రత్యేకవ్యక్తియొక్క సొంతయాస్తులుగ నుండగూడదనియు, నవి రాధాస్వామిమతముయొక్క యనుయాయులందఱకును పారమార్థిక లాభము గలుగజేయు నిమిత్తము సాముదాయికస్వామ్యములో నుంచుకొన దగినవనియును మొదటినుండియు దూరదృష్టితో గమనించిరి. పవిత్రసమాధులతో సహితముగ సత్సంగాస్తులనన్నింటిని వశములోనుంచుకొనిపాలించుటకై వారు 1902వ. సం॥రములో నెన్నికలుజరిపించి కేంద్రీయపాలకసమితిని ఏర్పాటు చేసిరి. కాని వెంటనే యాసమితి చాలపెద్దసంఘము మైపోయినట్లుతోచి, వారొక ధర్మకర్తృవర్గమునుస్థాపించి యాయాస్తులనన్నింటి నావర్గమునకు హక్కుగ చెందజేసిరి. మహారాజసాహబ్ వారి అనంతరము, కేంద్రీయపాలకసమితిసభ్యులును ధర్మకర్తృవర్గమువారును పరమగురు సర్కార్ సాహబ్ వారిని సంతుసద్గురువుగ నంగీకరించక, సమాధులను తమప్రత్యేకసంపూర్ణస్వాధీనములో నుంచుకొనినయెడల సర్కార్ సాహబ్ వారికిని వారి స్థానాపన్నులకును అనుయాయులు తగ్గిపోవుదురను నుద్దేశ్యముతో దయాల్బాగుపక్షముసత్సంగులకు సమాధులవద్ద ప్రణామములు చేయుటకును సత్సంగముచేసికొనుటకును హక్కు లేకుండజేయునిమిత్తమై నాటినాటికి చర్యలను దీసికొనుచుండిరి.

131. సర్కార్ సాహబ్ వారు సత్సంగముయొక్క యైక్యమునిలబెట్టుటకై చేసిన సకలప్రయత్నములను కేంద్రీయపాలకసమితి యొల్లవిఫలముజేసి సర్కా-

రుసాహెబ్ వారియనుయాయులకు వేఱుగ రాధాస్వామీ సత్సంగసభయను నొకప్రత్యేకప్రతినిధిసంఘము నేర్పాటుచేసికొనవలసిన యగత్యమును గల్పించిరో, యింతకుముందే 4వ యధ్యాయము 43 మొదలు 62 పేరగ్రాఫులలో 126-137 పుటలలో, చెప్పియుంటిమి. అటులనే 5వ. యధ్యాయము 59వ. పేరాగ్రాఫులో 199 పుటలో. సాహబ్జీమహారాజువారు కేంద్రీయపాలకసమితితో మిత్రభావముతోనుండదలంచిరని గూడఁ జెప్పటయైనది. 1914 సం॥రములో నొకసారియు. 1920 సంవత్సరములో మఱొకసారియు సాహబ్జీమహారాజువారు సమితివారితో రాజీచేసికొనుటకు ప్రయత్నముచేసిరి కావుననే, సాహబ్జీమహారాజువారు శ్రీమాధవప్రసాదసిన్హాగారిని దయాల్బాగ్ ఆహ్వానించగా 1920, మేనెల 29 తేదిన నాయన దయాల్బాగునచ్చిరి. తిరిగి సాహబ్జీమహారాజువారు 1920 జూన్ నెల 5వ, తేదీన స్వామీజీమహారాజువారి భండారాకు ఆయన నాహ్వానించిరి గాని యాయన యాయాహ్వానము నంగీకరించలేదు. అయినను సాహబ్జీమహారాజువా రందుకు సరకుసేయక. శ్రీమాధవప్రసాద్‌సిన్హాగారిని మఱొకసారి, 13-12-1922 తేదీన తమపెద్దకుమారుని వివాహమును చేయించవలసినదిగగోరుచు నాహ్వానించిరి. కాని అప్పుడుగూడ నాయన యాయాహ్వానమును నిరాకరించిరి అప్పటికిని సాహబ్జీమహారాజువారు విడువకుండ, మఱొకసావకాశమునకై కనిపెట్టికొనిచూచుచుండిరి. అందుచే శ్రీమాధవప్రసాదసిన్హాగారు 1923 సం॥రము జూన్ నెలలో నాగ్రావచ్చినపుడు తిరిగి సాహబ్జీమహారాజువారే వారినిగలిసికొనుటకై స్వయముగ వెళ్ళిరి ఈ యుభయపక్షములును గలిసిపోవునిమిత్తమై మాటలుజరుగుచున్నప్పుడు24-6-23 తేదీన శ్రీమాధవప్రసాదసిన్హాగారు సత్సంగాస్తులన్నిఁటిని పాలనజేయునధికారమును సభవారి కిచ్చివేయుట కంగీకరించిరి. కాని ఆ యాస్తుల నెప్పుడు స్వాధీనపఱచెదరని సభవా రడుగగా చాలయుత్తరప్రత్యుత్తరములు జరిపినపిమ్మట 11-9-1923 తేదీన కేంద్రీయపాలకసమితికార్యదర్శి, మాధవప్రసాదసిన్హాగారితోడిసభ్యులయభిప్రాయములో సభవారిపాలనమున కేయాస్తులను అప్పజెప్ప ప్రశంసకే తావులేదని సమాధానమునువ్రాసిరి, ఈమధ్యలో సమితిపక్షము వారు సాహబ్జీమహారాజువారిని, సభను, సభయొక్క అనుయాయులను నెప్పటివలె దూషణజేయుచునే యుండిరి

132. ధర్మకర్తలపేర్లను తెలియజేయుమని సభకార్యదర్శి కోరగా, సమితి వారి కాగ్రహముగలిగి, ఆపేర్లను తెలుపుటకు నిరాకరించిరి కాని 1920 సం॥

రపు 14 నెంబరుచట్టము ప్రకార మట్టివివరముల నడిగినపుడు ధర్మకర్తలకు తెలుపవలసిన బాధ్యత యుండుటచే, 5-9-1923 తేదిన జ్ఞానచంద్రబాసక్ అను నొకసత్సంగి, ధర్మకర్తలపేర్లను దెలియజేయించుమని గోరుచు నొక దరఖాస్తును ఆగ్రాకోర్టులో దాఖలుచేసెను. కాని 17-3-1924 తేదీన సమితివారు ఆదరఖాస్తును విచారణచేయకుండ నాఁపుజేయుమని గోరుచును, ధర్మకర్తల స్వాధీనసంరక్షణలలో నున్నయాస్తులపైన రాధాస్వామీసత్సంగసభవారికిని, ఆసభ పక్షమువారికిని ఎట్టిహక్కు-బాధ్యతలును లేనట్లు తీర్మానము చేయుమని గోరుచును, సాహబ్జీమహారాజువారినిగూడ ప్రతికక్షులుగజేర్చి, వారాణసి కోర్టులో 50/1924 నెంబరున నొక వ్యాజ్యమును దాఖలుచేసిరి. వారాణసి సబుకోర్టువారు 1926 సం॥రములో నీదావాను త్రోసిపుచ్చుచు సభవారి పక్షము తీర్పు చెప్పిరి. కౌన్సిలువా రందుమీద నప్పీలుచేయుగా, హైకోర్టు వారు 1929 సంవత్సరములో క్రిందికోర్టుతీర్పును ఖాయపఱచి యాట్రస్టు పబ్లికుట్రస్టు అనియు, నీట్రస్టుపాలనలోనున్న యాస్తులన్నిఁటిలో రాధాస్వామీసత్సంగసభకును, దానిపక్షమువారికిని హక్కులుగలవనియుఁ దీర్మానించిరి. అందుమీద సమితి ప్రీవీకౌన్సిలుకు అప్పీలుచేసిరి సాహబ్జీమహారాజువారి కాయప్పీలులో వాదించుటకై వేలకొలఁదిరూప్యములను వెచ్చించుట కిష్టములేనందున సభవా రాయప్పీలులో వాదముచేయకుండనుండిపోయిరి. ప్రీవీకౌన్సిలువా రొక్కవైపువాదమునుమాత్రమే విని 1935 సంవత్సరములో సమితివారిప్రార్థనలను గొన్నిటినిమాత్రమే యంగీకరించుచు నాయప్పీలును సమితిపక్షముజేసిరి. కాని ప్రీవీకౌన్సిలువారు దయాల్బాగు సంఘమువారి కాయాస్తులలో నెట్టిహక్కులును లేనట్లు తీర్మానించుమని కోరినపరిహారము నంగీకరింపనందున 1943 సం॥రములో సభవారు తమయనుయాయులకు న్యాయసమ్మతమైన హక్కు లను స్థిరపఱచుకొనుటకై ధర్మకర్తలమీద (శ్రీ మాధవప్రసాదసిన్హాగా రందులోనొకధర్మకర్త) మఱొకవ్యాజ్యమును దాఖలు చేసిరి.

133 స్వామీబాగువారే 50/1924 నెంబరు దావాను దాఖలుచేసినట్లు చదువరులకు విదితమే అందులో వారు మూడువిధ్యములు పరిహారములను గోరిరి. స్వామీబాగువారు గోరిన A B. గుర్తులపరిహారములలో, నీయాస్తులను తమ యధీనములోనుంచినట్రస్టు పారమార్థికమైనట్టిగాని, ధార్మికమైనట్టిగాని, పబ్లికుట్రస్టుకాదనియు, 1920 సం॥రపు 14వ చటము దానికి వర్తించ

నేరదనియు రెండుకోర్కెలను గోరిరి. C.గుర్తుపరిహారములో ధర్మకర్తల స్వాధీనములోనున్న యాస్తులలో దయాల్బాగువారి కెట్టిహక్కును లేనట్లు స్థిరపడినట్లు వక్కాణింపవలసినదిగ గోరిరి. ప్రివీకౌన్సిలువారు మొదటి రెండువిన్నపములనుమాత్రమే విచారించి యాట్రస్టు, 1920 సం॥రపు 14వ. చట్టము వర్తించగల ధార్మికమైనట్టి గాని, పారమార్థికమైనట్టిగాని పబ్లికు ట్రస్టు కాజాలదని తీర్మానించి, C. గుర్తు విన్నపముమీద నెట్టియుత్తరువును ఈయ లేదు.

134 అప్పటినుండియు, స్వామీబాగువారు, తమ గురువు రాధాస్వామీ దయాళుని యవతారస్వరూపులుగావున, వారి కాయాస్తులయందు సంపూర్ణ స్వామ్యము గలదనియు, నందుచే నీమతానుయాయులకు సమాధులవద్ద ప్రణామములుచేయుటకు నావకాశములభించుట, తమగురువుగారి యిష్టానిష్టములమీద నే పూర్తిగనాధారపడియున్నదనియు, నంతకుపూర్వముకన్న నెక్కువఝుంకారముతో వక్కాణించుచుండిరి. ప్రివీకౌన్సిలువారు, సమాధులవద్ద ప్రణామములుచేయుహక్కును సత్సంగముచేసికొనుహక్కునుగూడకలుపుకొని,సత్సంగిసంఘుమందఱకు నీయాస్తులలోగల సమస్తహక్కులను నశింపుజేసి తాత్కాలిక సద్గురువొక్కరికే ఈయాస్తులలో సంపూర్ణస్వామ్యమున్నట్లు తీర్మానించలేదని దయాల్బాగువారివాదమైయుండెను అదియునుగాక బాబూజీమహారాజు (శ్రీమాధవప్రసాదుసిన్హా)గారిని దయాల్బాగువారు నిజమయిన సద్గురువుగ నంగీకరింపరుగావున, నావిషయములోగూడ స్వామీబాగువారివాదమును ప్రతిఘటించవలసియుండెను.

135 దయాల్బాగువారివాదము నింక నెక్కువ కచ్చితముగ జెప్పవలయునన్నచో నీక్రిందిరీతిని జెప్పవచ్చును:-

(a) ఈయాస్తులు ధర్మాదాయపుటాస్తులుగావనిగాని, స్వామీబాగువారికీయాస్తు లెట్టిధర్మకర్తృత్వబాధ్యతయులేకుండగనే చెందియున్నవనిగాని ప్రివీకౌన్సిలువారు తీర్మానించలేదనియు;

(b) ప్రివీకౌన్సిలువారు, C. గుర్తు పరిహారమును స్పష్టరూపమున నీయకుండుటచే, నది నిరాకరింపబడినట్లే యెంచబడవలసియున్నదనియు, నందుచే, నాయాస్తులలో దయాల్బాగువారికి వాస్తవముగ హక్కులున్నట్లే, న్యాయశాస్త్రప్రకార మెంచవలసియున్నదనియు;

(c) ప్రీవీకౌన్సిలువారి తీర్పులోని మిగతతీర్మానము లీవాదమును దృఢ పఱచుచున్నవనియు;

(d) సమాధులు, గౌరవనీయపూజార్హస్థానములగుటచే, నేవ్యక్తికిని, (ఆవ్యక్తి యెంతటిగొప్పవారైన నౌగాక)వానియందు సంపూర్ణప్రత్యేకస్వామ్యమున్నదనుట యసంభావ్యమనియును.

136. స్వామీబాగువారు హైకోర్టులో తిరిగి తిరిగి పునర్నిరీక్షణ (Reference) పునర్విమర్శల (Revision) కొఱకు దరఖాస్తులుదాఖలుచేయుచు నీవ్యాజ్యమువిచారణగాకుండ 17 సంవత్సరములు, కాలయాపనజేసిరి. కాని యీ వ్యాజ్యము చాలపురాతనమైనదగుటచేతను హైకోర్టువారుగూడ కాలయాపనపుటెత్తుగడలకు తావీయవలదని చాలసార్లు ఉత్తరువులిచ్చినందునను, 1960 సం॥రము ఆగస్టునెల 1వ. తేదీన దీనివిచారణను ప్రారంభించిరి.

137. బుఆజీ సాహీబాగారును, బాబూజీమహారాజుగారును, సంత్ సద్గురువులా యనియు, నందుచే వారికీయాస్తులయందు అనన్యస్వామ్యపుహక్కులున్నవా యనియు, ధర్మకర్తలయిష్టమునకు వ్యతిరేకముగ దయాల్బాగుసత్సంగులకు పవిత్రసమాధులవద్ద ప్రణామములుచేయుటయు సత్సంగముచేసికొనుటయు వగైరాహక్కు లీయాస్తులలోనున్నవా యనియు నీవ్యాజ్యములో ప్రధాన సారాంశములు. అందుచే రాధాస్వామీసత్సంగసభవారీక్రింది పరిహారములను గోరిరి:

(1, ఈసభపక్షమువారికి, సమాధులవద్ద పూజసేయుట కెట్టియాటంకములు లేకుండ జేయవలెనని యు,

(11) ప్రస్తుతధర్మకర్తలవర్గమును తొలగించి, కోర్టువారియుత్తరవుప్రకారమేర్పాటుచేయబడు మఱొకకమిటీ కీయాస్తులపైన పెత్తనము నొప్పజెప్పవలయుననియు,

(111) ఈ ధర్మకర్తలుచేసిన వసూళ్ళకును ఖర్చులకును జమాఖర్చు చెప్పించవలయుననియును

138. స్వామీబాగువారిచే నెన్నిరోయాటంకములు గలుగజేయబడినను ఈవ్యాజ్యములో విచారణ 1960 ఆగస్టునెల 2వ తేదీన యథాక్రమముగ ప్రారంభమై, 1961 సం॥రము జూన్ 1 తేదీ నాటికి ఉభయపక్షముల సాక్షుల

విచారణయు, సహేతుక వాదప్రతివాదములను వినుటయు పూర్తియయ్యెను. కోర్టువారు 5-7-1961 తేదీన తీర్మానమును చెప్పిరి రాధాస్వామీసత్సంగసభ వారికి (i), (ii) గుర్తుల పరిహారములనిచ్చి, (iii) గుర్తు పరిహారమును నిరాకరించి యీయాస్తులన్నింటికి నొక రిసీవరును నియమించి, ధర్మకర్తలను, ధర్మాదాయపు స్థిరాచరాస్తులకును, నగదునకును జమాఖర్చు లెక్కలు తెల్పినవద్దను రిసీవరునకిమ్మని యుత్తరువువిచ్చిరి.

139. స్వామీబాగుట్రస్టీలు 1961 జూలై 5వ తేదీననే యీడిక్రీని అమలు జరుపకుండ నాపుజేయుడని గోరుచు నొకదరఖాస్తును పెట్టగా హైకోర్టునుండి నిరోధకపుటుత్తరవును దెచ్చుకొనునిమిత్తము వారికి కోర్టువారు రెండుమాసములుగడువు నిచ్చుచు, నీలోపున దయాల్బాగుసత్సంగులకు స్వామీజీమహారాజువారిసమాధివద్ద సత్సంగము జేసికొనుహక్కునకు భంగములేకుండునట్లుత్తరువిచ్చిరి. అందుచే దయాల్బాగుసత్సంగులామఱుసటిరోజునుండియు, నగా 6-7-1961 నుండియు పవిత్రసమాధినద సత్సంగముచేయుట ప్రారంభించిరి. అంతియగాక, నీరెండుమాసములుగడువిచ్చినయుత్తరువును సవరణజేయుడనిగోరుచు, సభవారు దరఖాస్తుపెట్టగా స్వామీబాగులో నగదురూపమైన సొత్తును కదపకుండనట్లేయుంచవలసినదనియు, రిసీవరుని ధర్మాదాయపుసొత్తుల జాబితాను తయారుచేయవలసినదనియు కోర్టువారుత్తరువుచేసిరి.

140 అంతట కేంద్రీయపాలకసమితి, ఆగ్రాఅడిషనల్ సివిలుజడ్జిగారి తీర్మానముపైన సుప్రీముకోర్టులో నొక 'రిట్టు' పిటిషన్ దాఖలుచేసిరి. ఆపిటిషను 14-8-1961 తేదీన త్రోసివేయబడెను. అప్పుడు ధర్మకర్తలు, 24-8-61 తేదీన ఆగ్రాకోర్టుడిక్రీపైన నొకఅప్పీలును దాఖలుచేసి డిక్రీఅమలునిరోధమునుగోరుచు నొకపిటీషను దాఖలుచేసిరి. ఆనిరోధకపుపిటీషనులో, సభవారికి నోటీసులు అమలుజరిగి విచారణపూర్తియగువఱకును, హైకోర్టువారు ఎక్సుపార్టీగా సావధికనిరోధము నుత్తరువుచేసిరి. అందువలన దయాల్బాగువారు 24-8-'61 తేదీనుండియు సమాధివద్ద సత్సంగముజరుపుట నాపుచేసిరి.

141. హైకోర్టువారు 10-10-61 తేదీన డిక్రీఅమలునిరోధకపుదరఖాస్తును విమర్శించి. దయాల్బాగుసత్సంగులకు స్వామీబాగులోని సమాధివద్ద సత్సంగముజేసికొనుహక్కును అంగీకరించుచు, నుభయపక్షములవారికిని సమాధివద్దసత్సంగము చేసికొనుటకు వేర్వేఱుకాలములను నిర్ణయించి కోర్టుక్రింది జడ్జి

మెంటులోని యుత్తరువుప్రకారము మీయాస్తులపైన పెత్తనము చేయుటకు క్రొత్తధర్మకర్తృవర్గము నెన్నుకొనుటకై యొకపథకమును తయారుచేయుచుండవలసినదనియు, సభవారు క్రిందికోర్టులో ట్రస్టీల అక్కౌంట్లను పరిశీలించవలసినదని పెట్టినదరఖాస్తువిచారణను పూర్తిచేయవలసినదనియు నుత్తరువుచేసిరి. హైకోర్టువారి యుత్తరువు లట్లున్నను గూడ స్వామీబాగువారు దయాల్బాగు సత్సంగులను సమాధివద్ద సత్సంగముచేసికొననీయలేదు. అందుచే సభవారు న్యాయస్థానధిక్కారమునకు స్వామీబాగువారిపై శిక్షవిధించుమనిగోరుచు నాగ్రాకోర్టులో 21-10-61 తేదీన నొకయవమలుదరఖాస్తును, స్వామీబాగువారు 10-10-61 తేదిగల హైకోర్టుఉత్తరువు నాచరణలో బెట్టనీయకుండినందున, హైకోర్టువారిచ్చిన 10-10-61 తేదీ నిరోధకపు టుత్తరువును పూర్తిగ రద్దుచేయవలసినదనిగోరుచు హైకోర్టులో 15-12-61 తేదీన మఱొకదరఖాస్తును, దాఖలుచేసిరి.

142. హైకోర్టువారి 10-10-61 తేదీ యుత్తరువు మీద ట్రస్టీలు సుప్రీంకోర్టులో నప్పీలుకూడ దాఖలుచేసిరిగాని, యది 30-10-61 తేదిన త్రోసివేయబడెను 10-10-61 తేదీగల హైకోర్టుఉత్తరువును రద్దుచేయవలసినదని గోరుచు సభవారిచే దాఖలుచేయబడిన దరఖాస్తు హైకోర్టులో 3-5-62 తేదీన విచారణకు వచ్చెను. హైకోర్టు క్రిందికోర్టులిరువురిచేతను జారీచేయించబడిన యుత్తరువులు కేంద్రీయపాలకసమితిహక్కులను బాధించనేరవని స్థిరపఱచవలసినదిగ గోరుచు నాసమితియొక్క సంయుక్తకార్యదర్శియగు శ్రీ సి. ఏ. టాండన్ గారు 1962 సం॥రము జనవరినెలలో హైకోర్టులో దాఖలుచేసిన దరఖాస్తు కూడ 3-5-62 తేదీననే విచారణకు వచ్చెను హైకోర్టువారీరెండుదరఖాస్తులను గలిపి విచారించి, 10-10-61 తేదీగల నిరోధకపుటుత్తరువును రద్దుచేసి, 1962 సం॥రము జనవరినెలలో సమితియొక్క సంయుక్తకార్యదర్శిగారు దాఖలు చేసిన దరఖాస్తును, సమితియొక్కన్యాయవాదియే స్వయముగ దానిని వెనుకకు తీసికొనుటచే, త్రోసివేసిరి.

143. 3-5-'62 తేదిగల యీ యుత్తరువును రద్దుచేయించు నిమిత్తము కేంద్రీయపాలకసమితివారు హైకోర్టులో నొక 'రిట్టు' పిటీషనును, ట్రస్టీలు సుప్రీముకోర్టులో నొక 'రిట్టు' పిటీషనును దాఖలుచేసిరి. అందులో మొదటిది హైకోర్టువారిచే 4-5-62 తేదినను రెండవ 'రిట్టు' పిటీషను సుప్రీంకోర్టువారిచే 24-5-62 తేదినను త్రోసివేయబడినవి. కేంద్రీయపాలకసమితివారు, అప్పుడు క్రిందికోర్టులో

రిసీవరును ఆస్తులను స్వాధీనముచేసికొనకుండ నాపుజేయుమని గోరుచు నొక దరఖాస్తు పెట్టిరి. ఆదరఖాస్తు 21-7-62 తేదిన విచారణకు వచ్చెను.

144. ట్రస్టుతాలూకు జమాఖర్చులెక్కలను పరిశీలించవలయునని సభవా రొకదరఖాస్తును పెట్టగా, 19-12-'61సం॥ తేదీన క్రిందికోర్టువా రందుకంగీకరించుచు నుత్తరువుచేసిరి. ఈయుత్తరువును పునర్విమర్శ (Review) చేయవలసిన దని గోరుచు ట్రస్టీ లొకదరఖాస్తు పెట్టిరిగాని దానిని కోర్టువారు త్రోసిపుచ్చిరి. ఈయుత్తరువుమీద ట్రస్టీలు హైకోర్టులో నప్పీలుదాఖలుచేసిరి, గాని ఆది యింకను విచారణకాలేదు. ఈయప్పీలు పర్యవసానము తేలువఱకు క్రిందికోర్టు యుత్తరువును అమలుజరుపకుండ నాపుజేయుమనిగోరుచు వారు పెట్టిన విరోధకపు దరఖాస్తును హైకోర్టువారు కొట్టివేసిరి. అక్కౌంట్లను పరిశీలించకుండ నాపుజేయుమనిగోరుచు వారు 2-6-'62 తేదిన క్రిందికోర్టులో మఱొకపిటీషను దాఖలుచేసిరిగాని యదిగూడ త్రోసివేయబడెను అంతట ట్రస్టీలు సభవారు పొందిన డిక్రీ శూన్యప్రాయమని స్థిరపఱచవలయునని గోరుచు, సభవారి డిక్రీ అమలుదరఖాస్తుకు ప్రతిగ, నొకదరఖాస్తు దాఖలుచేసిరి. 28-7-'62 తేదిన నాపిటీషను విచారణకువచ్చి, తిరిగి 25-8-62 తేదికి వాయిదాపడెను.

146. కావున, స్వామీబాగువారు అనేకవిధములుగ, నొకప్పుడు కేంద్రీయ సమితివారిపేరునను మఱొకప్పుడు ధర్మకర్తలపేరునను, క్రిందికోర్టు హైకోర్టులు రెండింటితీర్మానములనుండి తప్పించుకొని, కోర్టువారియుత్తరువుప్రకారమేర్పడ వలసియున్న క్రొత్తకమిటీవారు ధర్మాదాయపుటాస్తులను స్వాధీనముచేసికొని పాలించకుండచేయుటకును, దయాల్బాగుసత్సంగులను తమన్యాయసమ్మతమైన హక్కుల ననుభవించకుండజేయుటకును, మహాతీవ్రముగ ప్రయత్నములు జరిపించుచుండిరని పైవిషయములనుబట్టి విశదముకాగలదు. ఈయెత్తుగడలమూలమున నిరువురిమధ్య నీకోర్టువ్యాజ్యెములు నిస్సంశయముగ మఱికొంతకాల మీడ్చుకొనిపోవచ్చును గాని, యీయయోగ్యకాండ కవసానదశ ప్రారంభమైనదనియు, నిదియల్పకాలములోనే తప్పకముగిసిపోనైయున్నదనియు దృఢముగ నాశింపవచ్చును.

---

# VIII

# సత్సంగనాయకత్వము, భావికాలము.

ఇవ్విధముగ 1961సం॥రము జనవరి నెలలో రాధాస్వామీసత్సంగమునకు నూటేండ్లు పూర్తియైనవి. సత్సంగోద్యమముయొక్క యభివృద్ధిక్రమమును జాగరూకతతోఁ బరిశీలించినయెడఁ, సత్సంగముయొక్క క్రియాకలాపమంతయు దానంతటనదియే ప్రకృతిసిద్ధముగను అప్రయత్నముగను సాగిపోవుచున్నట్లు కనిపించగలదు. సత్సంగనాయకులు, వరుసగ నందఱును, సత్సంగోద్యమముయొక్క వృద్ధివికాసలనిమిత్తమును, తమ యుదారమహోద్దేశ్యమును సాధించు నిమిత్తమును శారీరికమానసికశక్తులను యావత్తుధారవోయుచు కేవలము సత్సంగముకొఱకై యాత్మబలిదానజీవితములను గడపుచుండిరి అయిననెవరికి నెన్నడు, నెట్టిశ్రమ, క్లేశానుభవమును గలుగలేదుసరిగదా, పైగా నందఱు నన్నివిధముల సురక్షితముగను క్షేమముగనే యున్నట్లనుభవము నొందుచుండిరి.

2. ఇవ్విధముగ సత్సంగోద్యమము మెల్లమెల్లగ నేమైనను, అవిచ్ఛిన్నముగ వృద్ధివికాసలనొందుచున్నకొలఁది క్రొత్తక్రొత్తభావసంచయములు ఒక్కొకటిగ నుత్పన్నమై, సత్సంగసిద్ధాంతములు కాలక్రమేణ ప్రఫుల్లమగుచుండెను. స్వామీజీమహారాజువారికాలములో "సత్సంగము" "సత్సంగి" యనుపదములు మొట్టమొదట నిరార్భాటముగ నుపయోగింపబడుచుండెను. కాని యిటీవల నాపదములకు ఒకప్రత్యేకభావ మేర్పడెను. సంత్ సద్గురువుయొక్క మహోన్నతపదవినిగుఱించి హుజూర్ మహారాజువారు విశదీకరించినపిమ్మటనే, రాధాస్వామీదయాళుని యవతారస్వరూపముయొక్క మహిమాతిశయము సత్సంగుల కవగాహనయయ్యెను. మహారాజసాహెబ్ వారు సత్సంగసిద్ధాంతములను విజ్ఞానశాస్త్రపద్ధతిని విశదపఱచుటయేగాక సత్సంగముయొక్క భావిలౌకికకార్యకలాపమునుగుఱించిగూడ సూచనచేసిరి స్వామీజీమహారాజువారి స్వరూపమున నవతరించిన నిజధార సృష్టియంతయు నుద్ధారమగువఱకు వెనుకకు మఱలిపోనేరదని మొట్టమొదట సర్కార్ సాహెబ్ వారు సంపూర్ణవిస్పష్టరూపమున దెలియజెప్పి, యీనిజధారయే వాస్తవముగ సద్గురువనియు. నింతియగాక నాపరమపురుష రాధాస్వామీదయాళురొక్కరే సద్గురుపదవాచ్యులనియు దృఢముగ వక్కాణించిచెప్పిరి. సాహబ్జీమహారాజువారు దయాల్బాగులో

సత్సంగ కేంద్రమును స్థాపించినపిదప, సత్సంగులకు ఒకేస్థలమున నొకకుటుంబములోనివారివలె సామాజికజీవనమును గడపుట నేర్పిరి. వారు వివిధమతముల మూలసిద్ధాంతములన్నియు నొకేతీరున నున్నవనియు, ప్రజలందఱును వారివారిమతముల మూలసిద్ధాంతములను పూర్తిగ మఱచిపోయిరనియు, వారలలో వారికి మతమునుగుఱించియు, పారమార్థికక్రియాకలాపమునుగుఱించియు భిన్నాభిప్రాయము లేర్పడుటకు వాస్తవమైనసద్గురువు లేకపోవుటయే ప్రధానకారణమనియు, నొక్కి-వక్కాణించిరి. వారు "ఉత్తమరీతిప్రాపంచికజీవనము", "అధిమానవులు" ననెడి యపూర్వభావనలను సత్సంగులందఱకు నాదర్శములుగ ప్రవేశపెట్టిరి సత్సంగులు 'ఉత్తమకులీనప్రజాస్వామ్యము' అను నాదర్శప్రకారము, అనగా "ప్రజాస్వామ్యవాదులైన యుత్తమకులీనసంఘము" అని చెప్పఁదగినట్లుగ, ప్రవర్తించవలయునని సాహబ్జీమహారాజువారి యభిప్రాయము. ఇచ్చట "నుత్తమకులీను"లనగా ప్రాపంచికసంపత్తిచేగాక, నాధ్యాత్మికసంపత్తిచే, నట్లుపేర్కొ-నదగినవారని యర్థము. మెహతాజీసాహబ్ వారు "పరిశ్రమ" "సేవ"లకు సర్వోత్తమప్రాశస్త్యము నిచ్చిరి. వారు 1943 సం॥రములో "పరిశ్రమయేభగవత్పూజ"యని మదరాసులో సెలవిచ్చిన యుత్తమదీక్షావాక్యముప్రకారము, సుఖవిశ్రాంతులను విసర్జించి, నిరుపమనిస్స్వార్థతానిరాడంబరత్వములతో, నిరంతరకఠోరపరిశ్రమజేయుచు గొంచెముగూడ దీరికలేకుండ జీవితమును గడపుచుండిరి. వారు సంఘమున కాదర్శప్రాయముగ బెట్టిన జీవనవిధానమున కివియే ప్రధానలక్షణములు.

3. సత్సంగద్రవ్యము నొక్క-కాసయినను ముట్టకుండగ, పైగా సత్సంగభాండాగారమునకే తమద్రవ్యము నధికముగ నర్పించుచు, స్వయముగ ఘోరతపస్యతోగూడిన సరళజీవితములను గడపుచుండిన మహాపురుషులు, నాయకులుగలభించుట సత్సంగసంఘముయొక్క- యద్భుతమహాభాగ్యము. వారు సత్సంగసంఘమనెడి మహాకుటుంబముతో నేకీభవించియుండుచుండిరి. వారి బందుగులకును, చుట్టములకును, సత్సంగములో నెట్టిప్రాధాన్యప్రాముఖ్యములును లేవు. ప్రతిసత్సంగియు, తనతరహాతోనిమిత్తములేకుండ, వారిదయాకటాక్షములపై పూర్తిగనాధారపడి, వారు తనకిహపరములలో శ్రేయస్సు గలిగించులాగున యభిమానమును తనపై నెల్లపుడును జూపుచునేయుందురని దృఢముగ నమ్మఁకొనవచ్చును.

4. సాహబ్జీమహారాజువారు సత్సంగములో తాముపచనములను సెలవిచ్చు విషయమునుగుఱించి వివరించుచు, తమకు సత్సంగమునకు వెళ్ళుటకుముందు, తాము సత్సంగములో నెందునుగుఱించి మాట్లాడవలయునో యనువిషయము గాని, నిజముగ మాట్లాడవలసియున్నదో లేదో యనువిషయముగాని, యెంత మాత్రము దెలియదనియు, సత్సంగములో నుండగ తమయాంతర్యమున నప్ప టికప్పు డప్రయత్నముగ భావము లుత్పన్నమగుచుండుననియు సెలవిచ్చిరి. మ ఱొకసారి, ప్రతిదినము నెవరెవరు తమతో మాట్లాడుటకువత్తురో, యేమేమి మాట్లాడుటకు వత్తురో, యీవిషయములన్నియు తమకారోజు ప్రాతఃకాలము ననే ముందుఁగ దెలిసిపోవునని సాహబ్జీమహారాజువారు సెలవిచ్చిరి. మఱొకసారి, వారు తమ మెదడులో జూచుకొనగ సందేహభిప్రాయములుగాని యాలోచ నలుగాని యున్నట్లు గనబడుటలేదనియు, గాని దేదీప్యమానముగ ప్రకాశించు చున్న నక్షత్రములతో నది నిండియున్నట్లున్నదనియు సెలవిచ్చిరి సంతుమహా త్ముల కాంతర్యమున భావములెట్లుదయించునో 'యధార్థప్రకాశ్' అను గ్రం థములో వారీ క్రిందిరీతిని వివరించిరి:-

''సంతుమహాత్ముల కుండునట్టి లేక. యుండగల్గునట్టి హార్దికవాంఛ, తమప్రియతిముపరమపితయొక్క దివ్యేచ్ఛను లేక యాజ్ఞలను పాలించుట యొక్కటే, కావున నాపరమపితకు ఈప్రపంచములోనిజీవుల కేదేని సందేశము నంపననుగ్రహము గల్గినపుడు, సంతుమహాత్ములు తమదృష్టిని నలువైపులనుండి లోనికి మఱలించుకొని, యామహాసందేశమును లేక పరమాదేశములను అందు కొనునిమిత్తె మత్యాతురులై యేకాగ్రచిత్తముతో నిరీక్షించుచుందురు. యుక్తక్షణమున వారిదృష్టి మఱింతలోనికాకర్షింపబడి, వారిమెదడులో నొక ప్రత్యేక కేంద్రమునద్ద నొక మహాతేజస్సు వెలుగొందును. అప్రకాశముతో బా టదేసమయమున వారిమెదడులో నొక్కొకసారి యొకేయుదారభావము యొక్క యాకృతిరూపమును, మఱొకసారి యతిమనోహరముగ పేర్పుచేయబ డిన భావపరంపరయును ప్రకటమగును. కొద్దినిముసములలో నాభావములు తమమనసున నిమిడిపోయినపిమ్మట వా రాభావములను వాగ్రూపముననో, లిఖితరూపముననో, వ్యాకరణసూత్రములతో నిమిత్తములేకుండ ప్రకటించు దురు. వా రిట్లు వాగ్రూపమునగాని లిఖితరూపమునగాని ప్రకటించునపుడు తమయాలోచనావివేచనాదిశక్తుల నెంతమాత్రము నుపయోగములో బెట్టరు, తమ కందజేయబడిన మహాసందేశము నున్నదున్నట్లు పూర్తిగ బ్రకటించుటదప్ప

మజ్ఞానకోరికయే వారికుండదు. ఆమహాసందేశము యదాతథముగనే ప్రకటించబడినదో లేదో తెలిసికొనుటకు, వారొక నకలువ్రాయువానివలె తమ నోట వచ్చిన పదములనుగాని వాని యర్థమునుగాని తమ మొదటియాంతర్యప్రేరణతో సరిపోల్చిచూచుకొన నవసరముండదు. ఆ యాంతర్యప్రేరణ వారికి మొదటగలిగినపుడే, వారిలో నొక ప్రత్యేకప్రజ్ఞ మేల్కాంచి యాయాంతర్యప్రేరణ యథాతథముగ ప్రకటితమగువఱకు, నది సంరంభశీలమైయుండి, వారిలో నొకవిధమగు నశాంతిని గలుగజేయుచుండును. ఆమహాసందేశము యథార్థరూపమున ప్రకటముకాగనే, యాప్రత్యేకప్రజ్ఞ వారిమనస్సున నొక మహోల్లాసముతోఁగూడిన మహానందమును గలుగజేయును. వారి కట్టియాంతర్యానుభవము గలుగగనే, తమ యాంతర్యప్రేరణ లేక సందేశము యథార్థరూపమున ప్రకటితమయినట్లు తృప్తిగల్గును."

5. ఇంతియుగాక 28-12-1936 తేదీన హుజూర్ సాహబ్జీమహారాజు వారు సత్సంగుల ప్రత్యేకసమావేశ మొకటిచేయించి యొకముఖ్యమైన శుభసందేశము నిచ్చిరి. దాని నీక్రింద పొందుపఱచితిమి:-

"ప్రపంచచరిత్రను శ్రద్ధగఁజదివినయెడల పూర్వకాలమునుండియు నెల్లపుడును మానవజాతికి వృద్ధివికాసలను గల్గించునిమిత్తమై యప్పటప్పట నేదో యొక దేశప్రజగాని సంఘముగాని యెన్నుకొనబడుచుండినట్లు మనకు విశదము కాగలదు. ఈనియమానుసార మిపు డాసమ్మానము సత్సంగసంఘమునకు జేకుఱినట్లగుపించును. పరమపురుష రాధాస్వామీదయాళుడు ఆధ్యాత్మికజీవనము, సామాజికసర్వసమత్వము, కర్తవ్యతాపరాయణతయునను నుత్తమావశ్యక విషయముల నీప్రపంచములోని సకలదేశప్రజలకును హృదయంగమమగునట్లుజేయు మహాసేవను, మహాదయతో సత్సంగమున కొప్పజెప్పిరి. కావున మన సంఘీయు లీమహాసమ్మానమును స్వీకరించి యీమహాసేవఁజేసి తమయాధ్యాత్మికశ్రేయస్సును పెంపొందించుకొనగోరినయెడల, మన మందఱము నీక్రింది యాదేశములప్రకార మిప్పటినుండియు నాచరించుటకు దృఢనిశ్చయము జేసికొనవలెను:

(a) సత్సంగులందఱును, తమ్ముదాము హుజూర్ రాధాస్వామీదయాళునిచే నెన్నుకొనబడితిమనియు, సత్సంగవ్యవస్థయొక్క ప్రధానాంగముల మనియు భావించుకొనవలయును.

(b) సత్సంగులందఱును, హుజూర్ రాధాస్వామీదయాళుని చరణకమలములతో తమయాంతర్యసంబంధ మెడతెగకుండ నుంచుకొనునిమిత్తము పారమార్థికసాధనలను రోజున కధమమొకనారియైనను కొంతసేపభ్యాసము తప్పక చేయుచుండవలెను.

(c) సత్సంగులందఱును, సామాజికస్థితిజాతిభేదములను పాటింపక, నొండొరులను సోదరసౌహార్దముతో నాదరించుకొనుచు, కలిసిమెలిసి నివసించుచు, నన్యోన్యము సహాయముచేసికొనుచుండుట తమ పవిత్రకర్తవ్యముగ నెంచుకొనవలెను.

(d) సత్సంగులందఱును ప్రతిమతపూజ్యాచార్యులయెడలను తగినగౌరవమర్యాదలను జూపవలెను.

(e) సత్సంగులందఱును తమ మతముయొక్కయు,తమ పూజ్యసద్గురువులయొక్కయు గౌరవఘనతలను గాపాడవలసిన బాధ్యత నెఱింగి, వారలయెడల నెన్నడు నెట్టియనాదరణనుగూడ సహింపరాదు.

(f)సత్సంగులందఱును దయాల్బాగును తమప్రియస్వగృహముగ భావించుకొని అందలిసంస్థలను పోషించి యభివృద్ధిజేయుటకు హృదయపూర్వకముగ పాటుపడవలయును.

(g) సత్సంగులందఱును ప్రతిమాసమును తమయాదాయమునుండి తమయార్థికస్థితికితగినట్లుగ కొంతభాగమునుదీసి హుజూర్ రాధాస్వామీదయాళుని పవిత్రచరణకమలములందు భేంటుగ నర్పించుచుండవలయును.

(h) సత్సంగులందఱును దయాల్బాగులో నుత్పాదితమైన వస్తువులను శ్రద్ధాభక్తులతో నుపయోగించుట తమవిహితధర్మముగ నెంచుకొనవలయును. అవసరమైనప్పుడు వారు తమ సహాయసంరక్షణలకై దయాల్బాగుసంస్థలపై నాధారపడవలయును.

(i) సత్సంగులందఱును తమసంతానమును, భౌతికముగను, ఆధ్యాత్మికముగనుగూడ తమకంటె శ్రేష్ఠులుగ జేయుటకు తమశక్తికొలది ప్రయత్నించవలయును."

6. ఈసంఘమున కంతటి యద్భుతప్రజ్ఞాసంపన్నులైనట్టియు, సాక్షాత్పరమపురుషుని నిజప్రేరణతో నపౌరుషేయముగ కార్యములను నెఱవేర్చునట్టియు మహాపురుషులు నాయకులుగనుండగా, సత్సంగి స్త్రీపురుషులందఱును పైశుభ

సందేశములోని ఉత్తమహితోపదేశములప్రకారమే ప్రవర్తించుచు, తమ సద్గురువునాజ్ఞలను పూర్ణభక్తిశ్రద్ధలతో శక్తివంచనలేకుండ పాలించుట తమ పరమధర్మమని మఱువకుండనుండినచో, నీసంఘము తనయాదర్శప్రాప్తిలో తడబడుటగాని, యసఫలతనొందుటగాని, దానియభివృద్ధికి నిరోధముగలుగుట గాని యసంభావ్యము. అట్టిమహాపురుషుల నిరుపమసత్సంగసావకాశము మనకు మహాదృష్టముచే లభించినది. అట్టిమహామహనీయపురుషులు వరుసగ నధ్యక్షులుగనుండి యడుగడుగునకు పథప్రదర్శనముజేయుచుండిన యుత్తమసంఘమున మనము సభ్యులమగుటగూడ మహాదృష్టముచేతనే మనకు చేకూరెను. కావున, మనమందఱమును, మన పరమతుచ్ఛస్థితిని గ్రహించుకొని, మహాదీనత్వముతో, నామహాప్రభువునకును, వారధ్యక్షులుగనుండిన యీమహాసంఘమునకును, వారీపృథ్వియందు మానవరూపమున నవతరించి యుద్ధరింపబూనిన మానవజాతికంతకునుగూడ, మనచేతనైనంత సేవను- అదితృణప్రాయమేయైనను- జేసితీరవలయునని దృఢనిశ్చయముజేసికొందముగాక. రాధాస్వామిదయాళురు మనకు సహాయముజేయుదురుగాక! వారు దలపెట్టిన మహోదారఘనకార్యము. వారియఖండశాశ్వతప్రతిభ వెలుగొందునట్లు శీఘ్రాతిశీఘ్రముగ నెఱవేరుగాక !!

---

సమాప్తి.

---

# అనుబంధములు

## I

స్వామీదయానందసరస్వతులవారు స్వామీజీమహారాజువారి సత్సంగము నకువచ్చి, రాధాస్వామీమతములో నుపదేశమునొందిన ట్లీగ్రంథములో 17వ పుటలో 36వ పేరాలో జెప్పబడినది. 1961 సం॥రము ఆగష్టునెలలో నీస్మృతి చిహ్నము ఆంగ్లభాషలో ప్రథమముద్రణ మైనపుడు న్యూఢిల్లీవాస్తవ్యులు, సార్వదేశిక ఆర్యప్రతినిధి సభ కార్యదర్శియైన శ్రీకాళీచరన్ ఆర్యగారు, స్వామీ దయానందసరస్వతులవారు స్వామీజీమహారాజువారివలన నుపదేశము నొందినట్లు నిదర్శనమునుజూపవలయుననికోరుచు 26-10-1961 తేదిన మాకువ్రాసిరి అప్పటి కాలమునాటి సత్సంగుల వాగ్రూపసాక్ష్యమే యీవిషయమునకు ప్రామాణ్యమనియు, స్వామీజీమహారాజువారిసోదరపుత్రులైన సేఠ్ సుదర్శన్ సింగుగారివలనగూడ నీవిషయము ప్రమాణీకృతమైనదనియు, మేము వారికి అప్పట్లో సమాధానమును వ్రాసితిమి. సేఠ్ సుదర్శన్ సింగుగారు పంపిన చీటి యప్పట్లో మావద్దలేకపోయెను. కాని దానియునికినిగురించియు నందలివిషయములనుగురించియు మాకప్పటికి తెలిసియేయుండెను. తరువాత నాచీటి మాకు లభించినది. దానిప్రతిరూపమును ప్రక్కపుటలో ముద్రించితిమి. దాని నాంధ్ర లిపిలోవ్రాసి, దాని యాంధ్రానువాదమునుగూడ నీక్రింద పొందుపఱచితిమి.

### చీటి

బాబా బన్వారీదాస్‌జీ కో మాలూమ్ హో కి ఆప్‌నే జో దరియాఫ్త్ కియా హై సో బిల్‌కుల్ దురుస్త హై కి శ్రీమాన్ పండిత్ దయానంద సరస్వతీజీ మహారాజ్ మేరీ మౌజూదగీమేం ముకద్దస్ వ ముఅల్లా స్వామీజీ మహారాజ్ కే పాస్ తశరీఫ్ లాయే థే, ఔర్ హమారే మకాన్ పర్ పన్నీగల్లీమేం రహా రే థే, ఔర్ ఏక్ హఫ్తే తక్ బహస్ ముబాహిసా హుఆ థా, ఉస్కే బాద్ ఉన్హోంనే ఉపదేశ్ లియా థా. యహ హాల్ మేరా చశమ్‌దీద్ హై. యహ కరీబ్ సన్ 1872 కా హాల్ హై

అనువాదము—

చీ టీ

బాబూ బన్వారీదాసుగారడిగినవిషయము పూర్తిగ నిజమని వారికి తెలియబఱచుచున్నాను. ఏలనన, శ్రీమాన్ పండిత దయానందజీసరస్వతుల వారు నాసమక్షమునసే పరమపూజ్య స్వామీజీమహారాజువారివద్దకు వచ్చి, పన్నీగల్లీలో మాయింటనే బసచేసిరి. ఒకవారము చాలచర్చజరిగినపిదప వారు (స్వామీదయానందసరస్వతులవారు) రాధాస్వామీమతములో నుపదేశము నొందిరి. ఇదంతయు నేను కనులారచూచిన విషయము. ఈవిషయము క్రీ॥ శ॥ 1872 సం॥రము ఆప్రాంతములో జరిగినది.

సుదర్శన్ సింగ్ సేర్
**15-5-34**

ఇందువలన నీవిషయము పూర్తిగ సంశయరహితమయినదని యాశించు చున్నాము.

## II

సాహబ్జీమహారాజువారి యారోగ్యము బాగులేనందున 1937 సం॥రము జూన్ నెలలో వారు కాకినాడప్రయాణమును నిలుపుజేయుటకు శ్రీ రామబ్రహ్మము గారును, శ్రీసుబ్బారావుగారును అంగీకరించిరని 242 పుటలో 150వ పేరాలో వ్రాసియుంటిమి. వీరిరువురితో సమేతముగ నాంధ్రరాధాస్వామీ సత్సంగసంఘ కార్యకర్తలు 23-6-37 తేదీన సాహబ్జీమహారాజ్ వారికి వ్రాసికొనిన విన్నపము నకును దానిప్రక్కన సాహబ్జీమహారాజువారు వ్రాసిన యుత్తరువునకును ప్రతి రూపములు పాఠకు లెదుటిపుటలోఁజూచి సంతసించెదరుగాక. ఇదియే సాహబ్జీ మహారాజువారి స్వహస్తలిఖితమైన కడపటియుత్తరువుగ దోచును. (ఆవిన్నప మునకును, దానిమీద సాహబ్జీమహారాజువారు వ్రాసిన యుత్తరువునకును ఆంధ్రానువాదము ఈక్రింద పొందుపఱచబడినది.)

# సాహబ్జీమహారాజువారి ఆఖరు ఉత్తరువు

అనువాదము-

**R. S.**

దయామయులగు హుజూర్ వారికి,

కోటి కోటి ప్రణామములు. హుజూరువారి ప్రస్తుత అనారోగ్యస్థితిని జూడగ మాకు చాలవిచారముగ నున్నది. కావున హుజూరువారు కాకినాడ ప్రణాళికను నెఱవేర్చుటకై శ్రమతీసికొనుట మాకెంతమాత్రము నిష్టములేదు. మేమందుచే కాకినాడ ప్రణాళికను రద్దుచేయుట కేర్పాటుచేయుచుంటిమి. హుజూరువారికి మదరాసులో విశ్రాంతిదీసికొనుటచే సౌకర్యముగలిగినచో మాకింతకన్న నెక్కువ సంతోషకర మెద్దియు లేదు.

ఇదియొక నిస్సహాయ పరిస్థితియని మీకందరకును దెలిసియే యున్నది. ఈ క్లిష్టపరిస్థితిని దాటుటలో హృదయపూర్వక సహకారము చేసినందుకు మీకు ధన్యవాదములు.

అ. స.

సత్సంగముకొఱకు మదరాసు రావలసినదని మేము తెలుగు సత్సంగులకు తెలియజేసెదము.

కోటి కోటి ప్రణామములు.

ఆంధ్ర రాధాస్వామీ సత్సంగ సంఘము

మదరాసు
23-6-1937

ఇట్లు,
తమ విధేయ బాలురము

(సంతకము) వి. వి. యస్. యన్. శర..
అధ్యక్షులు.

(సంతకము) టి. సత్యనారాయణ.
సహాయాధ్యక్షులు.

(సంతకము) వి. రామబ్రహ్మము.
కార్యదర్శి.

(సంతకము) డి. సుబ్బారావు.
సహాయకార్యదర్శి

ఉత్తరువు కొఱకు దాఖలు చేసినది.
మిస్రీలాల్
23-6-37

# III

పవిత్రస్వరూపులైన సాహబ్జీమహారాజువారి నిర్యాణానంతరము, వారిని గుఱించి వచ్చిన సహానుభూతి పత్రములు ప్రశంసాపత్రములవిషయమై ఈగ్రంథము 247వ పుటలో 5వ అధ్యాయము చివరి పేరగ్రాఫులో నుదహరించియున్నాము. వారి యత్యద్భుతమూర్తిమత్త్వముచే మోహితులయి వారిజీవితకాలముననే ప్రజలందఱును వారిని గుఱించి యఖండశ్లాఘ చేయుచుండెడివారు. ఉదాహరణార్థము, 1926లో (అప్పటికి దయాల్బాగుస్థాపించి 11 సం॥రములు మాత్రమే అయినది) హెన్రీఫోర్డెంథూగారు దయాల్బాగువచ్చినపుడు, సంతోషపరవశుడై, దయాల్బాగుసంస్థలసహాయార్థమై సాహబ్జీమహారాజువారికొక ఖాళీబ్యాంకుబరాతము[1] నిచ్చిరి. సత్సంగేతరులనుండి సత్సంగములో నెన్నడును విరాళములను స్వీకరించు నానువాయి లేనందున సాహబ్జీమహారాజువారానియమప్రకారము ఆబరాతమును సగౌరవముగ నిరాకరించిరి. అటులనే ఆంగ్లదేశప్రఖ్యాతగ్రంథకర్తలగు పాల్ బ్రంటన్, యీట్స్‌బ్రౌన్ దొరగార్లు "భారతగుప్తరహస్యముల యన్వేషణము" (Search In Secret India) "లాన్సర్ ఎట్ లార్జ్" అనుగ్రంథములలో నీక్రిందివిధముగ వ్రాసిరి:-

"సాహబ్జీమహారాజు వారిమూర్తిమత్త్వమున నద్భుతాకర్షణశక్తిగలదు. వారిలో అమెరికాదేశీయులచుఱుకుదనమును వ్యవహారజ్ఞానమును, ఆంగ్లేయుల సత్ప్రవర్తనశీలతయు. భారతీయుల ధ్యానమగ్నతయు భక్తిశీలతయును గలిసి యొకవిచిత్రసమ్మేళన మేర్పడెను. ఆధునికప్రపంచమున నీమాదిరిమహాపురుషులు దుర్లభము."

"ఈప్రపంచమున ప్రాచీనతమవిద్యయగు యోగసాధనకును, ఐరోపా, అమెరికాదేశములలోని యాధునికపట్టణములలోనుండు అద్భుతనోదనవేగప్రచలితయంత్రముల నవీననాగరికతకును ఈవిచిత్రసమ్మేళనము నొక్క సాహబ్జీమహారాజువారి సూక్ష్మబుద్ధియే చేకూర్పగలిగెనుగాని మఱియేబుద్ధిశాలికి సాధ్యమగును?

---

1. 'ఖాళీబ్యాంకు బరాతము' అనగా, మొత్తమును వ్రాయ నిమిత్తమై యా బరాతములో నుంచబడిన స్థలమును తాను నింపకుండ, సాహబ్జీమహారాజువారి కిష్టము వచ్చినంత మొత్తమును ఆస్థలములో నింపుకొనుటకు స్వతంత్రముండునట్లుగా, నిచ్చిన చెక్కు.

"వారీశ్వరప్రేరితస్వప్నములను గను నుత్సాహముగలవారయ్యును, గంభీరప్రశాంతచిత్తులగు యోగిపుంగవులు; ప్రాపంచికవిషయములలోనారి తేఱిన వ్యవహర్తయు య్యును, నుత్తమసభ్యతతో గూడినసజ్జనులును."

"సెర్చ్ ఇన్ సీక్రెట్ ఇండియా"
('భారతగుప్తరహస్యముల యన్వేషణము')

"వారు ఆజానుబాహువులును సున్నితమైన శరీరప్రకృతిగలవారును. వారినేత్రములు గోధుమవర్ణముగ ప్రకాశించుచు నొకప్పుడు తీక్ష్ణతతో గన్పట్టుచు వెనువెంటనేమహానిర్లిప్తతతో నా యనంతమునందు లీనమైపోయిన ట్లుండును"

"వారి శాపరమాత్మయే యీలోకమునగల నామరూపముల నన్నిటిని మించిన పరమసత్యము. నేనొక యుత్తమసజ్జనుని నుదారపురుషుని నెన్నడైన జూచియుండినచో, వీరినే."

"నూఱుగురు సర్ ఆనందసరూపుల నిచ్చినచో, భారతవర్షమొకనిర్మలము, వికసమానము, ధూళిరహితము, నభ్యుదయవంతమును, పరిసరదేశములతో శాంతియుతము నుల్లాసపూరితమునైన దేశముగ నతిత్వరలోనే మాఱిపోగలదు."

"లాన్సర్ ఎట్ లార్జ్"

## IV

1949 సం॥రములో రూర్కీకళాశాలకు జరిగించిన శతాబ్ద్యుత్సవమును గుఱించి ఆఱవయధ్యాయములో వ్రాయుట పొరపాటున మఱచిపోయితిమి. హుజూర్ మెహతాజీసాహబ్‌వారాకళాశాలలో పురాణవిద్యార్థులై యుండుటచే వారి నాయుత్సవమున కాహ్వానించిరి. మెహతాజీసాహబ్‌వారీశుభావసరస్మారకార్థమై ప్రతిసంవత్సరము నాకళాశాలలోని యుత్తమసత్సంగివిద్యార్థికొకబంగారుపతకము నివ్వదలంచి యందుకొఱకొకయాధారనిధి నేర్పాటుచేయు నిమిత్తమవసరమైన మొత్తము నాకళాశాలాధికారులవశమున బెట్టిరి.

ఆశతాబ్ద్యుత్సవమునాంటిరాత్రి ఆకళాశాలలోని విద్యార్థులు ఒక కర దీపికారూపమున విద్యను తరతరములుగ నొకతరమువారినుండి అతరువాతి

తరమువా రందుకొనుచుండినట్లు ఒక సంకేతరూపమైన కార్యక్రమము నేర్పాటుచేసిరి. ఆకార్యక్రమము జరిపించుటలో నాకళాశాలాపురాతనవిద్యార్థులొకవరుసగ వచ్చి, యందఱిలో పురాణతమవిద్యార్థియగు నొకఓవర్సీయర్ (Overseer) గారి చేతినున్నకరదీపికను, మిగత పురాణవిద్యార్థులచేతులలో నున్న క్రొవ్వువత్తిదీపములను అప్పటివిద్యార్థుల కందించిరి. ఆసమయమున, నాకరదీపిక మెహతాజీసాహబ్‌వారిచే నాకళాశాలలో నుత్తమవిద్యార్థికందింప జేయవలెనని అప్పటికప్పుడొక యుత్సాహ మందఱకు నుదయించెను. ఈయవసరమున దీసిన ఛాయాచిత్రముయొక్క ముద్రణమును ప్రక్కపుటలో చూడనగును.

---

# తప్పు ఒప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 1 | కొంతకొంతకాల | కొంతకాల |
| 5 | 26 | మతకేజే | మతకీజే |
| 7 | 18 | నిజధామందు | నిజధామమందు |
| 10 | 2 | దాని యరము | దాని యర్థము |
| 13 | 11 | సదురుని | సద్గురుని |
| 23 | 24 | ఏకై పుత్రు | ఏకైకపుత్రు |
| 32 | 27 | యుపయోగారమై | యుపయోగార్థమై |
| 50 | 21 | హ_్తము | హస్తము |
| 55 | 15 | వారికిష | వారికిష్ట |
| 57 | 6 | కూర్వుండి | కూర్చుండి |
| 58 | 8 | స్వ సాధారణ | సర్వసాధారణ |
| 64 | 25 | పూ_్తగ | పూర్తిగ |
| 69 | 6 | 1897 | 1898 |
| 74 | 10 | ముట్టగూడని | ముట్టగూడదని |
| 84 | 9 | పరిశీలనారమై | పరిశీలనార్థమై |
| 95 | 4 | జావే | జాకే |
| 95 | 5 | కాబానదైరో | కాబావదైరో |
| 98 | 9 | ప్రారనను | ప్రార్థనను |
| 100 | 14 | డాకరు | డాక్టరు |
| 110 | 7 | సరార్ | సర్కార్ |
| 115 | 21 | వృ_్తలో | వృత్తిలో |
| 125 | 22 | సితి | స్థితి |
| 136 | 30 | ముమూలుగనే | మామూలుగనే |
| 145 | 7 | ప్రారన | ప్రార్థన |
| ,, | 10 | సరారు | సర్కారు |
| 145 | 25 | కాయసులు | కాయస్థులు |
| 149 | 23 | స్వాష్ట్యధార్థము | స్వాష్ట్యద్ధారము |
| 151 | ,, | యుదతస్వభావ | యుద్ధతస్వభావ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 162 | ౨ | పీడరు | ప్లీడరు |
| 164 | 99వ పేరాపైన శీర్షిక లోపించినది | | నిర్యాణము |
| 170 | 27 | చరితారము | చరితార్థము |
| 186 | 18 | దీరాలోచనా | దీర్ఘాలోచనా |
| 189 | 9 | పరిసితిని | పరిస్థితిని |
| 207 | 23 | జర్వము | జ్వరము |
| 217 | 18 | హూల్డాలు | హోల్డాలు |
| 285 | 28 | శ్రద | శ్రద్ధ |
| 296 | 13 | కపనమ్మకమి | కపనమ్మిక |
| 307 | 28 | చరితారము | చరితార్థము |
| 326 | 13 | 1928 | 1926 |
| 342 | 25 | సంతరాతీయ | సంతర్జాతీయ |
| 354 | 8 | 22, 102, | 22, 210 |
| 365 | 30 | పబికుట్రస్టు | పబ్లికుట్రస్టు |
| 360 | 29 | కోర్టుక్రింది | క్రిందికోర్టు |

# రాధాస్వామీ సత్సంగసభవారు ప్రచురించిన గ్రంథములు.

## పరమగురు స్వామీజీ మహారాజ్ వారి గ్రంథములు.

| | | | పుటలు. | వెల రు.పై |
|---|---|---|---|---|
| 1 | సారబచన్ (శబ్దములు) | హిందీ | 938 | 7-00 |
| 2 | సారబచన్ (వచనము) | ,, | 197 | 3-50 |

## పరమగురు హుజూర్ మహారాజ్ వారి గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 3 | Radhasoami Mat Prakash | ఇంగ్లీషు | 106 | 1-50 |
| 4 | Pilgrim's Path | ,, | 80 | 1-50 |
| 5 | రాధాస్వామీ మత్ సందేశ్ | హిందీ | 80 | 1-00 |
| 6 | రాధాస్వామీ మత్ ఉపదేశ్ | ,, | 68 | 1-00 |
| 7 | నిజఉపదేశ్ | ,, | 70 | 1-00 |
| 8 | ప్రేమఉపదేశ్ | ,, | 80 | 1-00 |
| 9 | సార్ ఉపదేశ్ | ,, | 125 | 1-25 |
| 10 | ప్రశ్నోత్తర్ | ,, | 54 | 1-00 |
| 11 | జగత్ ప్రకాశ్ | ,, | 122 | 2-00 |
| 12 | ప్రేమబానీ (శబ్దములు) మొదటి భాగము | ,, | 454 | 5-00 |
| 13 | ప్రేమబానీ ,, రెండవ భాగము | ,, | 429 | 5-00 |
| 14 | ప్రేమబానీ ,, మూడవ భాగము | ,, | 420 | 5-00 |
| 15 | ప్రేమబానీ ,, నాల్గవ భాగము | ,, | 180 | 3-00 |
| 16 | ప్రేమపత్ర (వచనము) మొదటి భాగము | ,, | 455 | 4-00 |
| 17 | ప్రేమపత్ర ,, రెండవ భాగము | ,, | 441 | 4-00 |

## పరమగురు మహారాజ్ సాహెబ్ వారి గ్రంథము.

| | | | | |
|---|---|---|---|---|
| 18 | Discourses on Radhasoami Faith | ఇంగ్లీషు | 190 | 5-00 |

## పరమగురు సర్కార్ సాహెబ్ వారి గ్రంథము.

| | | | | |
|---|---|---|---|---|
| 19 | ప్రేమ సమాచార్ | హిందీ | 66 | 1-25 |

## రాధాస్వామీ సత్సంగ సభవారి అనుజ్ఞపై భాషాంతరీకరించిన గ్రంథములు.

### బంగాళీభాషలో అనువాదములు.

| | | | |
|---|---|---|---|
| 20 | రాధాస్వామీ మతప్రకాశ్ | 100 | 1-25 |
| 21 | అమృతబచన్ (పరమగురుమహరాజ్ సాహబ్‌వారు రచించిన Discourses on Radhasoami Faith అనుగ్రంథమునకు తర్జుమా) | 212 | 3-00 |

### ఆంగ్లభాషలో అనువాదములు.

### పరమగురు స్వామీజీ మహరాజ్ వారి గ్రంథమునకు అనువాదము.

| | | | |
|---|---|---|---|
| 22 | సారబచన్ (వచనము) | 175 | 3-25 |

### పరమగురు హుజూర్ మహరాజ్‌వారి గ్రంథముల అనువాదములు.

| | | | |
|---|---|---|---|
| 23 | ప్రేమపత్ర మొదటి భాగము | 377 | 6-00 |
| 24 | ప్రేమపత్ర రెండవ భాగము | 381 | 6-00 |
| 25 | ప్రేమపత్ర మూడవ భాగము | 370 | 6-00 |
| 26 | ప్రేమపత్ర నాలుగవ భాగము | 326 | 6-00 |
| 27 | ప్రేమపత్ర ఐదవ భాగము | 336 | 6-00 |
| 28 | ప్రేమపత్ర ఆరవ భాగము | 140 | 2-00 |
| 29 | రాధాస్వామీ మత్ ఉపదేశ్ | 60 | 1-00 |
| 30 | రాధాస్వామీ మత్ సందేశ్ | 73 | 1-00 |
| 31 | ప్రేమ్‌ఉపదేశ్ | 88 | 1-00 |

### పరమగురు హుజూర్‌సాహబ్జీ మహరాజ్ వారి గ్రంథముల అనువాదములు.

| | | | |
|---|---|---|---|
| 32 | యథార్థప్రకాశ్ మొదటి భాగము (Special Edition) | 186 | 6-00 |
| 33 | యథార్థప్రకాశ్ మొదటి భాగము (Ordinary Edition) | 186 | 3-50 |
| 34 | యథార్థప్రకాశ్ రెండవ భాగము | 315 | 5-50 |
| 35 | యథార్థప్రకాశ్ మూడవ భాగము (Vol I) | 341 | 5-50 |
| 36 | యథార్థప్రకాశ్ మూడవ భాగము (Vol.II) | 273 | 5-00 |

| | | | | |
|---|---|---|---|---|
| 37 | జిజ్ఞాస | | 42 | 1-00 |
| 38 | రాధాస్వామీ మతదర్శన్ | | 62 | 1-00 |
| 39 | ప్రేమ్ సందేశ్ | | 64 | 1-00 |
| 40 | సత్సంగ్ కే ఉపదేశ్ మొదటి భాగము | | 182 | 4-00 |
| 41 | సత్సంగ్ కే ఉపదేశ్ రెండవ భాగము | | 242 | 4-50 |
| 42 | సత్సంగ్ కే ఉపదేశ్ మూడవ భాగము | | 152 | 3-25 |
| 43 | జతన్ ప్రకాశ్ | | 45 | 1-00 |
| 44 | Selections from Prem Sandesa | | 65 | 1-00 |

## తెలుగుభాషలో అనువాదములు.

| | | | | |
|---|---|---|---|---|
| 45 | రాధాస్వామీ మతప్రకాశ్ | | 64 | 1-00 |
| 46 | రత్నావళి (శబ్దములు, తెనుగు తాత్పర్యముతో సహా) | | 194 | 1-00 |
| 47 | స్మృతిచిహ్నము ('సోవేనీరు'కు అనువాదము.) | | | |

## రాధాస్వామీసత్సంగసభవారి అనుజ్ఞపై వ్రాయబడినవి. లేక ప్రకాశితమైనవి.

| | | | | |
|---|---|---|---|---|
| 48 | Four Letters (పరమగురు సర్కార్ సాహబ్ వారివి) | ఇంగ్లీషు | 42 | 1-00 |
| 49 | శబ్దసంగ్రహ (శబ్దములు) మొదటి భాగము | హిందీ | 301 | 3-50 |
| 50 | శబ్దసంగ్రహ ,, రెండవ భాగము | ,, | 460 | 4-00 |
| 51 | సంత్ బానీసంగ్రహ ,, మొదటి భాగము | ,, | 82 | 1-00 |
| 52 | సంత్ బానీసంగ్రహ ,, రెండవ భాగము | ,, | 116 | 1-25 |
| 53 | రత్నావళి ,, | ,, | 86 | 1-00 |
| 54 | Dayalbagh Pamphlet (Small) | ఇంగ్లీషు | 40 | 1-00 |
| 55 | Souvenir | ,, | 367 | 5-50 |
| 56 | Judgement in Suit (Dayalbagh Vs Soamibagh) | ,, | 200 | 1-37 |
| 57 | Huzur Sahabji Maharaj As others saw Him | ,, | 280 | 2-00 |